# భారత
# స్వాతంత్ర్యోద్యమ చరిత్ర

మూడవ భాగము

**1919 - 1947**

(గాంధీ యుగము)

ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

సికింద్రాబాదు

1977

ప్రథమ ముద్రణము : సెప్టంబర్ 1977
ప్రతులు 1500
ప్రతి వెల రూ. 25 లు

ప్రతులకు :
మామిడిపూడి వెంకటరంగయ్య
80, నెహ్రూ నగర్
-సికింద్రాబాదు-500026 కు
వ్రాయండి.

ముద్రణ
శ్రీ కళా ప్రింటర్స్
33, లేక్‌వ్యూరోడ్, మద్రాస్-600033

# ఉపోద్ఘాతము

పరాయి వారైన బ్రిటిష్‌వారి పరిపాలనను నిర్మూలించి, సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించుటకు భారతీయులు సాగించిన ఉద్యమ చరిత్రను ఆంధ్ర ప్రజలకు వారి మాతృ భాషలో తెలియపరిచే ఉద్దేశంతో నేను వ్రాయసంకల్పించిన గ్రంథంలో ఇది మూడవ భాగము. ఇదే ఆఖరు భాగము.

ఇందులో 1919 మొదలు 1947 ఆగస్టు 15 వరకు స్వాతంత్ర్య సంపాదన దృష్ట్యా ప్రాధాన్యం వహించిన పరిణామాలను విపులంగా వివరించాను. ఈ కాలంలో స్వాతంత్ర్యో ద్యమానికి గాంధీ నాయకుడు కావడం అతి ప్రధానమైన విషయం. ఆయన నాయకత్వంలో ఇది ప్రపంచానికే అపూర్వమైన సత్యాగ్రహ సాధనాన సాగింది. అందుచేత ఈ కాలానికి గాంధీ యుగమనే పేరు సర్వవిధాలా తగినట్టిది.

ఆయన ఆశయాలకు, ఆయన అనుసరించిన విధానానికి ఆయన దక్షిణ ఆఫ్రికాలో గడించిన 20 సంవత్సరాల అనుభవం ఆధారం. అందుచేత మొదటి అధ్యాయంలో ఆ అనుభ వాన్ని, అది ఆయనపై వహించిన ప్రభావాన్ని వివరించాను.

సమాజంలోని అన్యాయాలను తొలగించుటకు సత్యాహింసలు ఆధారమైన సత్యా గ్రహ సాధనమనేది ఆయన కార్యక్రమాలకు ప్రధాన లక్షణం. దీనిని దక్షిణ ఆఫ్రికాలో వినియోగించి అక్కడి శ్వేతజాతి ప్రభుత్వం మూలంగా ఆ దేశంలో జీవనాన్ని సాగిస్తున్న భారతీయులకు కలిగిన అన్యాయాలలో అనేకాన్ని తొలగించ గలిగాడు. భారత దేశానికి స్వరా జ్యాన్ని సంపాదించుటకు కూడా ఇదే పటిష్ట సాధనమనే విశ్వాసంతో ఆయన 1915 లో స్వదే శానికి వచ్చి, దీనిని దశల వారీగా వినియోగించి తుదకు విజయాన్ని సంపాదించాడు.

ఇదిగాక సామాన్య ప్రజల సహకారంలేక స్వరాజ్యాన్ని సంపాదించడం సాధ్యం కాదనేది కూడా ఆయన దృఢ విశ్వాసం. ఆలాగు సంపాదింపబడిన స్వరాజ్యమే వాస్తవమైన స్వరాజ్యమనేది ఆయన భావం. ఆయన నిరాడంబర జీవితము, త్రికరణ శుద్ధి, ఆయన ఋషి తుల్యుడనే భావం ప్రజలను ఆకర్షించాయి. దేశానికి రాజకీయ విముక్తిని సాధించుటకు ఆయన అవతరించాడనే భావం వారిలో నాటుకొన్నది. అందుచేత వారు అత్యధిక సంఖ్యలో స్వాతంత్ర్యోద్యమంలో చేరి, దానిని ప్రజల ఉద్యమంగా మార్చారు. ఉద్యమం విజయవంతంగా ముగిసిన తర్వాత మన దేశంలో ప్రజాస్వామిక పరిపాలన విధానం ఏర్పడుటకు ఇదే ప్రధాన కారణం.

1919 లో ఆయన రౌలెట్టు సత్యాగ్రహంతో అఖిల భారత సత్యాగ్రహాలను ప్రారం భించాడు. ఖిలాఫత్ సమస్యను పరిష్కరించుటకు, పంజాబు దురంతాలకు ప్రతి క్రియను రాబట్టుటకు, స్వరాజ్యాన్ని సంపాదించుటకు 1921-22 లో సహాయ నిరాకరణోద్యమాన్ని

సాగించారు. 1930-31 లో ఉప్పు సత్యాగ్రహాన్ని, 1932-34 శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించారు. వీటిని అణచుటకు ప్రభుత్వం దారుణ రూపంలో దమన విధానాన్ని అనుసరించినా, ప్రజలు వారి పట్టుదలను విడనాడలేదు. స్వరాజ్య సంపాదనార్థం సమస్త త్యాగాలు చేయుటకు వారు మరింత సంసిద్ధతను ప్రదర్శించి పశు బలాన్ని ఆధారం చేసుకొన్న ప్రభుశక్తి కంటె ప్రజాశక్తి బలవత్తరమైనదని ఋజువు చేశారు.

ఇదే కాలంలో చంద్రశేఖర అజాదు, భగత్‌సింగ్ మొదలైన విప్లవ నాయకులు విప్లవ ఉద్యమాన్ని పునరుద్ధరించి, అధికారులను భీతావహుల గావించినారు. తమ లక్ష్యం పరాయి పరిపాలనను తొలగించడం మాత్రమే కాదని, దేశంలో సోషలిష్టు సమాజాన్ని నిర్మాణం చేయడమని ప్రచారం చేశారు. ఇదికూడా స్వాతంత్ర్యోద్యమంపై గొప్ప ప్రభావాన్ని వహించింది.

బ్రిటిష్ ప్రభుత్వం దమన విధానంతోపాటు భేదోపాయాన్ని వినియోగించి ముస్లింలను హిందువులనుండి వేరుపరచి, జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగు లేవదీసిన దేశవిభజన ఉద్యమానికి బలం చేకూర్చింది. కాని దీని మూలంగా స్వాతంత్ర్యోద్యమం ఏ విధంగా కూడా బలహీనత గాంచలేదు.

1939-45 లో బ్రిటన్ రెండవ ప్రపంచ సంగ్రామంలో చిక్కుకొన్నప్పుడు ఇది స్పష్టమైంది. 1942-44 లో గాంధీ అంకురార్పణ చేసిన క్విట్ ఇండియా ఉద్యమాన్ని హింసావాదులు అహింసావాదులు కలిసి సాగించారు. సింగపూరు, మలయా ప్రాంతాలలో జపాన్ వారికి ఖైదీలుగా వశపడిన సిపాయీలను వామపక్ష నాయకుడైన సుభాష్‌చంద్రబోసు సమీకరించి, తన ఆధిపత్యాన భారత జాతీయ సైన్యాన్ని నిర్మాణం చేసి, జపాన్‌వారి సహాయంతో బర్మా మీదుగ ప్రయాణం చేసి, సైన్యంతో ఈశాన్య భారత దేశాన్ని ప్రవేశించి కొన్ని రంగాలలో బ్రిటిష్ సైన్యాలను ఓడించాడు. కాని పసిఫిక్ మహా సముద్ర ప్రాంతాలలో జపాన్ వారికి అమెరికా మూలంగా పరాజయం సంభవించడం చేత వారు బర్మా మొదలైన ఆగ్నేయ ఏషియాలోని దేశాలను ఖాళీ చేసి స్వదేశాన్ని రక్షించుకొనే నిమిత్తం వెళ్ళిపోయినారు. ఇది కారణంగా బోసు తలపెట్టిన సాయుధ పోరాటం విఫలమైంది. కాని ఆయన నిర్మాణం చేసిన భారత జాతీయ సైన్యం బ్రిటిష్‌వారికి ఒక గుణపాఠాన్ని నేర్పి వారు అధికారాన్ని వదలుకొనే నిర్ణయానికి రావడంలో గొప్ప ప్రభావాన్ని వహించింది.

1740 తర్వాత సిపాయీల సహాయంతోనే బ్రిటిష్‌వారు దేశాన్ని జయించి పాలించగలిగారు. సిపాయీలలో దేశాభిమానం లేకపోవడమే దీనికి కారణం. కాని బోసు నిర్మాణం చేసిన సైన్యం సిపాయీల మనోవైఖరి మారినదని, వారుకూడా దేశాభిమాన పూరితులై స్వరాజ్యాన్ని కాంక్షించే వారని స్పష్టం చేసింది. భవిష్యత్తులో వారి సహాయంతో భారత దేశాన్ని పాలించడం సాధ్యం కాదని బ్రిటిష్‌వారు గ్రహించారు. ఈ కారణం చేత బోసు నిర్మాణం చేసిన సైన్యం స్వాతంత్ర్యోద్యమ విజయానికి తోడ్పడినదని చెప్పక తప్పదు.

రెండవ ప్రపంచ యుద్ధం, పై పరిణామాలకు దారి తీయడమే గాక, బ్రిటిష్‌వారి అంగ బలానికి అర్థ బలానికి అపార నష్టం కలిగించింది. యుద్ధానికి పూర్వం బ్రిటన్ ప్రపంచంలో ఒక అగ్రరాజ్యంగా ఉండేది. యుద్ధం మూలంగా అది ఈ స్థానాన్ని కోల్పోయి

అమెరికాకు ఒక ఉపగ్రహంగా తయారైంది. ఈలాటి పరిస్థితులలో ప్రజాశక్తిని ఎదుర్కొనాలి, భారత దేశాన్ని పాలించడం తమ శక్తికి మించిన పని అనే నిర్ణయానికి వారు వచ్చారు.

ఈ విధంగా గాంధీ నాయకత్వంలో సాగిన ఉద్యమాలు, విప్లవ వాదుల చర్యలు, క్విట్ ఇండియా ఉద్యమం, బోసు నిర్మాణం చేసిన జాతీయ సైన్యం—ఇవి అన్నీ స్వాతంత్ర్యోద్యమంపై గొప్ప ప్రభావాన్ని వహించినవని గుర్తించడం అవసరం. వీటికి తోడు రెండవ ప్రపంచ యుద్ధం మూలంగా బ్రిటిష్‌వారికి కలిగిన అపార నష్టం కూడా ఉద్యమం విజయవంతంగా ముగియడంలో గొప్ప ప్రభావాన్ని వహించింది. చరిత్ర గతిలో జయాపజయాలు ఏదో ఒక కారణం మూలాన మాత్రమే సంభవించవు. వాటికి అనేక కారణాలు ఉంటవి అనే సత్యం పై పరిణామాలు మూలంగా స్పష్టం అవుతుంది.

వీటి ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం 1944 నుండి కాంగ్రెసుతోను ముస్లిం లీగుతోను సంప్రతింపులు జరిపి, దేశాన్ని భారత రాజ్యం పాకిస్థాన్ అనే రెండు స్వతంత్ర రాజ్యాలుగా విభజించి, 1947 ఆగస్టు 15న తమ అధికారాన్ని ఆ రెండు రాజ్యాలకు పరివర్తన చేసి వెళ్ళిపోయ్యారు. వీటి అన్నిటి ఫలితంగా 1905 తర్వాత భారతీయులు సాగించిన స్వాతంత్ర్యోద్యమం సంపూర్ణ విజయాన్ని సంపాదించింది.

40 సంవత్సరాల కాలం స్వాతంత్ర్య యోధులు చేసిన త్యాగాలు మూలంగా మనకు స్వాతంత్ర్యం లభించింది. వారు మనకు చిరస్మరణీయులు. వారు సంపాదించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టడం మన ప్రథమ కర్తవ్యం. గతంలో మనలో జాతీయ భావమూ, సమైక్యతా లేని కారణంగా స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొని, అష్ట కష్టాలను అనుభవించాము. భవిష్యత్తులో మనకూ మన దేశానికీ అలాటి ప్రమాదం లభించకుండా ఉండేటట్లు మనమూ, భావి తరముల వారూ ప్రవర్తించడం అవసరం. నా గ్రంథం మూలంగా మనం నేర్చుకొనవలసిన గుణపాఠం ఇదియే. ఇందుకుగానే నేను ఈ గ్రంథాన్ని వ్రాశాను.

## కృతజ్ఞతలు

ఈ గ్రంథాన్ని వ్రాయడంలో ప్రఖ్యాత చరిత్ర రచయితలైన డాక్టరు ముజుందార్, డాక్టరు తారాచంద్ మొదలైన వారి గ్రంథాలను ఆధారంగా స్వీకరించాను. ప్రతి అధ్యాయం చివర వాటిలో ప్రధానమైన వాటిని పేర్కొన్నాను. ఆ రచయిత లందరికీ నా కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను.

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు మొదటి రెండు భాగాల ముద్రణ విషయంలో నాకు ఎంతగానో ఆర్థిక సహాయం చేశారు. అదే విధంగా మూడవభాగ ముద్రణ విషయంలో సహాయం చేయవలసిందిగా నేను అర్థించిన వెంటనే వారికి సహజమైన ఔదార్యంతో నాకు సహాయాన్ని అందజేశారు. వారికి నేను కృతజ్ఞుడను. ఇందులో విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు వారితో సహకరించారు. వారికి కూడా నేను కృతజ్ఞుడను.

కొన్ని కారణాల మూలంగా మూడవ భాగాన్ని మద్రాసులో ముద్రించవలసి వచ్చింది. ఈ సందర్భంలో నా మిత్రులు, యం. శేషాచలం కంపెనీ కార్యదర్శి శ్రీ యం. యన్. రావుగారు నాకు ఎంతగానో సహాయం చేశారు. వారికి నా కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను.

గ్రంథ రచనలోను, వ్రాత ప్రతిని ముద్రణకు సిద్ధ పరచడంలోను, ఉస్మానియా విశ్వ విద్యాలయ శాఖలో రీడర్‌గా ఉన్న నా కుమార్తె డాక్టరు అల్లాడి వైదేహి చాలా సహాయం చేసింది. ఆమెకు నా ఆశీస్సులు.

ముఖ పత్రాన్ని ఆకర్షణీయంగా తయారు చేసిన నా తమ్ముని కుమారుడు, ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడమీ కార్యదర్శి చిరంజీవి మామిడిపూడి కృష్ణమూర్తికి నా ఆశీస్సులు.

గ్రంథమును అనాలస్యముగ ముద్రించి నాకు సహాయ పడిన శ్రీ కళా ప్రింటర్స్‌వారికి, ప్రూఫులుదిద్దడంలో నాకు సహాయంచేసిన శ్రీ పద్మపాణి గారికి నా కృతజ్ఞతలు. గ్రంథంలోని లోపాలకు వీరెవరు బాధ్యులు కారు. వాటికి నేనే బాధ్యుడను.

సికింద్రాబాదు
సెప్టెంబరు 12. 1977

మామిడిపూడి వెంకటరంగయ్య

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | గాంధీ మహాత్ముని రంగ ప్రవేశం | 1-17 |
| 2. | గాంధీ తొలి సత్యాగ్రహాలు | 18-34 |
| 3. | రౌలెట్టు సత్యాగ్రహము | 35-50 |
| 4. | పంజాబు విషాద గాథ-1919 | 51-63 |
| 5. | సహాయ నిరాకరణోద్యమ జననము | 64-82 |
| 6. | సహాయ నిరాకరణోద్యమము | 83-104 |
| 7. | 1921-28 మధ్య రాజకీయాలు | 105-128 |
| 8. | శాసనోల్లంఘన ఉద్యమ జననము | 129-146 |
| 9. | శాసనోల్లంఘన ఉద్యమము-ప్రథమ దశ | 147-167 |
| 10. | శాసనోల్లంఘన ఉద్యమము-ద్వితీయ దశ | 168-187 |
| 11. | విప్లవ ఉద్యమ పునరుద్ధరణము | 188-198 |
| 12. | 1929-39 లోని పరిణామాలు | 199-223 |
| 13. | యుద్ధకాలంలోని పరిణామాలు | 224-251 |
| 14. | నిష్క్రమణ ఉద్యమము | 252-268 |
| 15. | క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో ఇతర పరిణామాలు | 269-281 |
| 16. | సంప్రతింపుల కాండ-యుద్ధకాలంలో సంప్రతింపులు | 282-291 |
| 17. | సంప్రతింపుల కాండ-యుద్ధానంతర సంప్రతింపులు | 292-310 |
| 18. | స్వాతంత్ర్యోద్యమ విజయము-దేశ విభజన | 311-322 |

# అధ్యాయము-1

## గాంధీ మహాత్ముని రంగ ప్రవేశం

## 1

పరాయివారైన బ్రిటిష్‌వారి పరిపాలనను నిర్మూలించుటకున్నూ స్వాతంత్ర్యమును సంపాదించుటకున్నూ భారతీయులు సాగించిన ఉద్యమచరిత్రను వివరించుటకు సంకల్పించి ఈ గ్రంథాన్ని ప్రారంభించాను. ఇందులోని మొదటి భాగంలో ఏ పరిస్థితులలో భారతీయులు స్వాతంత్ర్యాన్ని కోల్పోయినదీ, తూర్పు ఇండియా వర్తక సంఘంగా ఏర్పడి దేశానికి వచ్చిన బ్రిటిష్‌వారు రాజకీయరంగంలో 1740 ప్రాంతాన ప్రవేశించి ఏ విధంగా దేశాన్ని జయించి వశపరచుకొన్నదీ, కంపెనీ హయాంలో వారు దేశపరిపాలకులై ఏలాటి వ్యవస్థను నిర్మాణం చేసిందీ దానిమూలంగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక రంగాలలో ఏలాటి మార్పులు సంభవించినదీ, రైతులు, పారిశ్రామికులు, వర్తకులు మొదలైనవారు ఏలాగు నష్టపడినదీ, భూస్వామికవర్గం, సాహుకారీవర్గం, ఇంగ్లీషు విద్యాధికులవర్గం, వ్యవసాయ కూలీలవర్గం ఏలాగు ఏర్పడినదీ, 1857-58 లో సిపాయిలు తదితరులు కొందరు లేవదీసిన మహత్తరమైన తిరుగుబాటు ఎందుకు విఫలమైనదీ. తిరుగుబాటు అనంతరం కంపెనీ పరిపాలన తొలగి బ్రిటిష్ సార్వభౌముని ప్రత్యక్ష పరిపాలన ఏ విధంగా ఏర్పడినదీ వివరించాను.

రెండవ భాగంలో 1858 మొదలు 1918 ఆఖరువరకు సంభవించిన పరిణామాలు వివరించాను. ఈ పరిణామాలన్నిటికీ ఇంగ్లీషు విద్య దేశంలో వ్యాప్తిగాంచి, విద్యాధికులకు పాశ్చాత్య సంస్కృతితోను చరిత్రతోను పరిచయం కలగడం ప్రధాన కారణం. దీని ఫలితంగా వారిలో జాతీయత అంకురించి వృద్ధిగాంచింది. ప్రజాస్వామికంపట్ల వారు అభిమానం కలవారయ్యారు. దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించడం తమ కర్తవ్యమనే భావం వారిలో ఉదయించింది. తక్కిన జాతులవలెనే భారతజాతి కూడ విద్య, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంఘిక రంగాలలో వృద్ధిగాంచడం అవసరమనే భావంతో వారు అన్ని రంగాలలో సంస్కరణలు ప్రవేశపెట్టారు. పరిపాలనలోకూడా తమకు భాగస్వామ్యం ఉండడం అవసరమనేభావంతో దానిని తీర్చుటకు ప్రథమంలో రాష్ట్రాలకు పరిమితములైన రాజకీయ సంఘములను, తర్వాత 1885 లో అఖిల భారత జాతీయ కాంగ్రెసును స్థాపించి వాటి సాధనాన క్రమబద్ధమైన ఆందోళనను సాగించారు. వారిలో కొందరు—తిలక్, అరవిందుడు, పాల్, లజపతిరాయ్—మొదలైనవారు. జాతీయవాదులై, సంపూర్ణ స్వరాజ్య సంపాదనము ప్రజలలక్ష్యంగా ఉండవలెనని ప్రచారం చేశారు. దీని ఫలితంగా దేశంలో వందేమాతర ఉద్యమం, హోంరూల్ ఉద్యమం, విప్లవ ఉద్యమాలు బయలుదేరాయి. ఈ ఉద్యమాల మూలంగా స్వరాజ్యం లభించకపోయినా ప్రజలలో స్వరాజ్యకాంక్ష అంకురించింది. యుగయుగాలుగా గాఢనిద్రలో ఉండినవారు మేల్కొనడం జరిగింది. దీని ప్రభావంచేత బ్రిటిష్ పాలకులు తమ వైఖరిని కొద్దిగా మార్చుకొని

1909 లో మార్లేమింటో సంస్కరణలను. 1919 లో మాంటెగుచెమ్స్ ఫర్డు సంస్కరణలను ప్రవేశపెట్టారు. ఈ పరిమాణా లన్నిటినీ రెండవ భాగంలో వివరించాను.

ఈ మూడవ భాగంలో స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తుదిఘట్టాన్ని వివరిస్తున్నాను. ఇది 1919 లో ప్రారంభమై 1947 ఆగస్టు 15 న దేశం సంపూర్ణ స్వతంత్ర రాజ్యంగా రూపొందడంతో ముగిసింది. ఈ ఘట్టానికి గాంధీయుగం అనేపేరు వ్యవహారంలోకి వచ్చింది. అది సర్వవిధాలా సార్థకమైన పేరు. 1919 లో ప్రారంభమైన స్వాతంత్ర్య సమరానికి ఆయన ఏకైక నాయకుడయ్యాడు. దానిని సాగించుటకు సత్యాగ్రహం అనే ఒక అపూర్వమైన విధానాన్ని ఆయన వినియోగించాడు. ఈ సమరం దశలవారీగా సాగింది; ఇందులో సామాన్య ప్రజలు విశేషంగా పాల్గొన్నారు. దానికి గాంధీ నాయకత్వము ప్రధాన కారణం. స్వాతంత్ర్య సమరాన్ని ఆయన ప్రజా సమరంగా మార్చాడు. అందుచేతనే అది విజయాన్ని సాధించగలిగింది.

1919 నాటికి గాంధీ దేశానికి ఏలాగు నాయకుడయ్యాడో, ఆయన సృష్టించిన సత్యాగ్రహ సాధనంయొక్క స్వరూపం ఏలాటిదో మనం ఇప్పుడు తెలుసుకోవలసిఉన్నది.

## 2

మోహన్‌దాస్ కరంచంద్ గాంధి 1869 అక్టోబరు 2న కాతియవారు(ఇది గుజరాత్‌లో ఒక భాగం)లోని పోర్బందర్ నగరంలో ఒక సంపన్న వైశ్యకుటుంబంలో జన్మించాడు. కాతియవారులో అనేక చిన్న చిన్న స్వదేశీ సంస్థానాలు ఉండేవి. పోర్బంబరు, రాజకోటలు అలాంటివి. గాంధీ తండ్రి, తాతలు ఈ సంస్థానాలలో దివానులుగా ఉండేవారు.

గాంధీ కుటుంబం వైష్ణవమతాన్ని అనుసరించే కుటుంబం; పౌరాణికులు ఇంటికివచ్చి తులసీదాసు రామాయణం మొదలైన గ్రంథాలను చదివి వినిపిస్తూ ఉండడం పరిపాటి. బాల్యంలో గాంధీ వీటిని వింటూఉండేవాడు. తల్లి పుతలీభాయి తరుచూ దేవాలయాలకు వెళ్ళుతూ ఉండేది. దైవభక్తి, చాతుర్మాస్యాది వ్రతాలు, ఉపవాస వ్రతాలు ఆమె జీవితంలో ఎక్కువ ప్రాధాన్యం వహించాయి. ఇదిగాక ఆనాడు కాతియవారు అహింసను పరమ ధర్మంగా విశ్వసించిన జైనులకు కేంద్రంగా ఉండినది. ఈ పరిస్థితులన్నీ బాల్యంలోనే గాంధిపై ప్రభావం వహించి, సత్యానికి, అహింసకు, దైవభక్తికి, సనాతన హిందూ ధర్మానికి యావజ్జీవం ఆయన చూపిన గౌరవాభిమానాలకు కారణములైనాయి.

బాల్యంలోనే ఆయనలోని తిరుగుబాటు ధోరణికూడా కొంతవరకు వ్యక్తమైంది. తల్లి అస్పృశ్యులను ముట్టుకొనరాదని చెప్పినా ఆమెను ప్రతిఘటించి వారిని ముట్టుకొనేవాడు. భారతీయులు శాఖాహారులు కావడంచేత శరీరబలం కోల్పోయారని, అందుచేతనే పరాయివారైన బ్రిటిష్‌వారు వారిని జయించగలిగారని, మాంసాహారానికి అలవాటుపడినయెడల వారు శరీరబలం కలవారై పరాయి పరిపాలనను తొలగించుట సాధ్యం కాగలదని ఒక ముస్లిం స్నేహితుని మాటలకు లొంగి అయిదారు పర్యాయాలు గాంధీ మాంసభక్షణను చేశాడు. కాని ఈ అలవాటు చాలాకాలం నిలువలేదు. ఇవి తల్లి తండ్రులను మోసగించడమేనని ఆయన భావించాడు. బాల్యస్నేహితుని బోధల మూలంగా సిగరెట్లు త్రాగుటకు అలవాటుపడి, దానికి కావలసిన డబ్బును దొంగిలించవలసి వచ్చింది. ఈలాగు చేయడం పాపకార్యమని గ్రహించి

తాను చేసిన తప్పును తండ్రికి తెలియపరచాడు. తండ్రి ఆతనిపై ఆగ్రహాన్ని చెందక క్షమించాడు. తాను చేసిన తప్పును ఒప్పుకొనడం, దాని ఫలితంగా శిక్షను అనుభవించవలసిన పక్షాన దానిని హృదయపూర్వకంగా అనుభవించుటకు సిద్ధపడడం మానవతకు ప్రధాన లక్షణ మనే భావం ఆయనలో ఏర్పడింది. సత్యాగ్రహం హింసకు దారితీయడము మూలాన దానిని ప్రారంభించడంలో తాను గొప్ప పొరబాటును చేసినట్లుగా తోచినప్పుడు 1919 లోను, 1922 లోను దానిని ఉపసంహరించుకోవడం, దాని ఫలితంగా అనేకుల ఆదరణను కోల్పోవడ మునకు సిద్ధపడడం దీనికి తార్కాణం.

ఆ నాటి ఆచారానుసారం తల్లి దండ్రులు ఆయనకు 13 వ ఏటనే కస్తూరిబాయితో వివాహం చేశారు. అతి బాల్యంలో వివాహం కావడంచేత ఇంద్రియలోలుడై జీవితాన్ని సాగించాడు. కాని ఇది చదువుకు ప్రతిబంధకమైంది. వ్యాధిగ్రస్తుడైన తండ్రికి శుశ్రూష చేయడంలో భక్తి, శ్రద్ధలు కలవాడైనా ఆయన మరణకాలంలో ఇంద్రియ లోలత్వకారణాన దగ్గిర లేకపోయాడు. ఇది యావజ్జీవం విచారకారణమైంది. బాల్యంలో వివాహం జరగరాదని, వివాహం చేసుకొన్నవారు కూడ సంతానవంతులైన తర్వాత బ్రహ్మచర్య వ్రతాన్ని చేపట్టడం కర్తవ్యమనీ, కుటుంబ నియంత్రణకు ఇదియే ఉత్తమ సాధనమనీ ఆయన ప్రచారం చేయుటకు బాల్యంలోని ఈ అనుభవాలే ప్రధాన కారణం.

1888 లో గాంధీ ఉన్నత విద్యకై ఇంగ్లండు వెళ్ళాడు. వెళ్ళుటకు పూర్వం తల్లి మాంసాహారాన్నిగాని, మద్యాన్నిగాని, పరస్త్రీని గాని ముట్టుకొనకుండునట్లు ఆయనచేత ప్రతిజ్ఞ చేయించింది. ఆ ప్రతిజ్ఞను ఆయన పూర్తిగా చెల్లించాడు. శాకాహార తత్వాన్ని అర్థం చేసు కొనుటకు అక్కడ ఆ నాడు ప్రచారంలో ఉండిన కొన్ని గ్రంథాలను కూడా చదివాడు. ఆ రోజుల లోనే ఆయనకు మతంపట్ల వాస్తవమైన ఆసక్తి కలిగింది. ఎడ్విన్ ఆర్నాల్డు అనే కవి ఇంగ్లీషు లోకి తర్జుమా చేసిన భగవద్గీతను (The Song Celestial), బుద్ధ చరిత్రను, (The Light of Asia) బైబిల్ మొదలైన గ్రంథాలను చదివాడు. దివ్యజ్ఞాన సమాజంతో కూడా కొంత సంబంధం ఏర్పడింది. ఆయన ఆధ్యాత్మిక జీవితాన్ని తీర్చిదిద్దడంలో ఇవి శాశ్వత ప్రభావం వహించాయి. బాల్యంలో కలిగిన అనుభవాల ప్రభావం మరింత బలపడింది.

బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణుడై న్యాయవాది వృత్తిని అనుసరించుటకు అర్హతను సంపాదించి 1891 లో స్వదేశానికి తిరిగీ వచ్చాడు.

## 3

1891 నుండి 1893 వరకు రెండు సంవత్సరాల కాలం రాజకోటలోను బొంబాయి లోను న్యాయవాది వృత్తిని సాగించాడు; కాని అది ఫలప్రదం కాలేదు. గడించగలిగిన ఆదాయం చాలా స్వల్పంగా ఉంటూవచ్చింది. ఈ పరిస్థితులలో దక్షిణ ఆఫ్రికాలోని నెటాలు రాష్ట్రంలో వర్తకంచేస్తూ ఉండిన ఒక గుజరాతీ ముస్లిం ఒక కేసులో తనకు సహాయం చేయ వలసిందిగా గాంధీని కోరాడు. దానిని పురస్కరించుకొని గాంధీ 1893 లో దక్షిణ ఆఫ్రికాకు వెళ్ళి 20 సంవత్సరాల కాలం అక్కడ గడిపాడు. ఆ వెళ్ళడంతో ఆయన జీవితంలోను, దాని ఫలితంగా భారతదేశ చరిత్రలోను విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. దక్షిణ ఆఫ్రికా లోని జీవితం ఆయన ఆధ్యాత్మిక రాజకీయ తత్వాలకు కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దింది.

ఒక సంవత్సర కాలంలో ఆయన పట్టిన ముస్లిం వర్తకుని కేసు పరిష్కారమైనది. వెంటనే స్వదేశానికి రాదలచాడు; కాని ఆ నాడు అక్కడి భారతీయులు అనుభవించు చుండిన ఇబ్బందులు ఆయనదృష్టిని ఆకర్షించాయి.వాటిని తొలగించడం తన కర్తవ్యంగా భావించాడు. అక్కడి భారతీయులుకూడా తమ ఇబ్బందులు తొలగేవరకూ అక్కడ ఉండవలసినదిగా ఆయనను కోరారు. అందుచేత అక్కడే న్యాయవాది వృత్తిని సాగిస్తూ, భారతీయుల సమస్యల పరిష్కారంలో నిమగ్నుడయ్యాడు.

బ్రిటిషు పరిపాలన మూలంగా భారతదేశంలో ఆర్థిక పరిస్థితులు దిగజారినవని, అనేకులు వారి వంశానుగతములైన వృత్తులు కోల్పోయి నిరాధారులైనారని ఇదివరకే తెలుసుకొన్నాము. ఇదేకాలంలో బ్రిటిష్ పరిపాలనలో ఉండిన దక్షిణ ఆఫ్రికా, మొరిషస్, ఫిజీ, గయానా మొదలైన వలసరాష్ట్రాలలో బానిసత్వాన్ని నిషేధించడం మూలాన కూలీల కొరత ఏర్పడింది. ఆ రాష్ట్రాలలో తెల్లజాతికి చెందినవారికి చెరకు కాఫీ తేయాకు తోటలు ఉండేవి. వ్యవసాయానికి కావలసిన పెట్టుబడి ధనంకూడా ఉండేది. కాని కూలీల కొరత ఏర్పడింది. ఆ పరిస్థితులలో వారు భారతదేశాననుండి కంట్రాక్టు పద్ధతి ననుసరించి కూలి జనాన్ని తెప్పించు కొనుటకు సిద్ధపడ్డారు. భారతదేశానికి బ్రిటిష్‌వారే పరిపాలకులు కావడంచేతను, నిరాధారులైన ప్రజానీకానికి జీవనాధారాన్ని కల్పించడంలో ఆసక్తిలేనివారు కావడంచేతను వలస రాష్ట్రాలలోని తోట యజమానుల కోరికలను మన్నించుటకు సిద్ధపడి అక్కడికి కంట్రాక్టు పద్ధతిని కూలీలను ఎగుమతి చేయుటకు వారు అంగీకరించారు.

1860 నుండి దక్షిణ ఆఫ్రికాలోని నెటాలు రాష్ట్రానికి ఈలాటి కంట్రాక్టు కూలీలు (Indentured Labourers)వెళ్ళసాగారు. వీరి కంట్రాక్టు కాలం అయిదు సంవత్సరాలు. అటు తర్వాత వీరు తిరిగి కంట్రాక్టు కూలీలుగా పనిచేయవచ్చు. లేదా స్వతంత్రులై అక్కడ జీవితాన్ని సాగించవచ్చు; లేదా తిరిగి స్వదేశానికి వెళ్ళిపోవచ్చు. కంట్రాక్టు కాలంలో వీరిస్థితి బానిసల స్థితికంటె హీనంగా ఉండేది. యజమానుల చెప్పుచేతలకు లోబడి విశ్రాంతి అనేది లేక, వారి ఆదేశానుసారం పనిచేయడం తప్పేదికాదు. వారు ఎన్ని బాధలను పెట్టినా వాటిని సహించవలసిందే; పరిపాలనాధికారులు తెల్లవారు కావడంచేత వారిని రక్షించే వా రెవ్వరూ లేకపోయినారు. పరిస్థితులు ఈలాటివి అని తెలియని కారణంచేతను, భారతదేశంలో జీవితానికి ఆధారాంతరం లేని కారణంచేతను కంట్రాక్టు పద్ధతికి లోబడిన కూలీలు అధిక సంఖ్యలో ఏటేట వెళ్ళసాగారు.

గాంధీ దక్షిణ ఆఫ్రికాకు వెళ్ళేనాటికి వీరుగాక స్వతంత్రులైన భారతీయులు కూడా అనేకులు ఉండేవారు. వీరిలో కొందరు కంట్రాక్టు ముగిసిన తర్వాత అక్కడే నివసించుటకు నిర్ణయించుకొన్నవారు; మరికొందరు స్వతంత్రులుగా భారతదేశాననుండి వలస వెళ్ళినవారు.

స్వతంత్రులుగా ఉండినవారు తోటలలోను గనులలోను కార్మికులుగా పనిచేసి జీవితాన్ని సాగిస్తూ ఉండినారు. కొందరు చిల్లర దుకాణాలను పెట్టుకొని స్వల్పంగా వర్తకం చేస్తూ ఉండినారు. కొందరు వీధులవెంట వస్తువులను తీసుకొనిపోయి వ్యాపారం చేసేవారు (Hawkers). కొందరు కొంచెం భారీఎత్తున వ్యాపారంచేసి, ధన సేకరణ చేసుకొని స్వదేశానికి తిరిగి వెళ్ళిపొయ్యేవారు. వీరిలో అధికసంఖ్యాకులు గుజరాతుకు చెందిన ముస్లింలు.

వీరికి వ్యవహారంలో "అరబ్బు"లని (Arabs) పేరు ఉండేది. వీరిలో ఒకరి ఆహ్వానాన్ని పురస్కరించుకొనే గాంధి 1893 లో దక్షిణ ఆఫ్రికాకు వెళ్ళాడు.

స్వతంత్రులందరు నిరాడంబర జీవితానికి అలవాటు పడినవారు. తెల్లవారికంటె పొదుపుగా జీవితాన్ని సాగించేవారు. తెల్ల కూలీలకంటె తక్కువ వేతనాలతో తృప్తి పడిన వారు. చిల్లర వ్యాపారంచేసే వారుకూడా తెల్లవర్తకులకంటె సరసంగా వస్తువులను అమ్మే వారు కావడంచేత అనేకులు (తెల్లవారితోసహా) వారి దుకాణాలలోనే వస్తువులు కొనుగోలు చేయడం పరిపాటి అయింది. ఆడంబర జీవితానికి అలవాటుపడిన తెల్లవారికి వారితో పోటీ చేయడం కష్టసాధ్యమైంది.

ఇది కారణంగా తెల్లవారందరు భారతీయులపట్ల అసూయగలవారై వారిని ద్వేషించ సాగారు. వారికి కావలసింది కంట్రాక్టు కూలీలేగాని స్వతంత్రంగా జీవించే భారతీయులు కాదు. ఎలాగైనా స్వతంత్రులను దేశాననుండి వెళ్ళిపోయేటట్లు చేయుటకు నిర్ణయించుకొని వారిపై అనేక నిర్బంధాలను విధించుటకు సిద్ధపడ్డారు.

ఆనాడు దక్షిణ ఆఫ్రికాలోని నాలుగు రాష్ట్రాలు బ్రిటిష్‌వారి పరిపాలనలో ఉండేవి. అక్కడి తెల్లవారికి అంతరంగిక స్వపరిపాలన హక్కు 1906 కు పూర్వం లభించలేదు. అందు చేత 1906 వరకూ బ్రిటన్‌లోని అధికారుల అనుమతి లేకుండా భారతీయులపై నిర్బంధాలను విధించడం కష్టసాధ్యంగా ఉండేది. 1906 తర్వాత కూడా అలాటి అనుమతి అవసరమైనా తెల్ల వారి పట్ల పక్షపాతం వహించినవారు కావడంచేత న్యాయా న్యాయాలను గుర్తించక నిర్బం ధాలకు అనుమతి ఇయ్యడం బ్రిటన్‌లోని అధికారులకు పరిపాటి అయింది.

ఈ నిర్బంధాలు ట్రాన్స్‌వాల్ రాష్ట్రంలో నివసించే 10,000 భారతీయులపై విధించడం జరిగింది. అక్కడ నివాసార్హతను పొందుటకు వారు ఏటేట మూడుపౌండ్ల ప్రత్యేక పన్నును చెల్లించవలసి వచ్చింది. వారు తెల్లవారు నివసించే ప్రదేశాలలో నివసించరాదు. ప్రత్యేకంగా వారికిగాను ఏర్పరచిన వాడలలోనే నివసించవలసి వచ్చింది. వారి దుకాణాలు, వర్తక వ్యాపా రాలు ఆ వాడలలోనే సాగించవలసిన వారయ్యారు. వారు స్థిరాస్థిని అక్కడమాత్రమే కొనదగిన వారయ్యారు. ఈ వాడలు మురికివాడలుగా తయారయ్యాయి. మునిసిపల్ అధికారులు వాటి ఆరోగ్య విషయమై ఏలాటి శ్రద్ధనూ వహించలేదు.

ఈలాటి నిర్బంధాలతోపాటు భారతీయులందరిని అగౌరవపరచే ఉద్దేశంతో వారు నేరం చేసిన వారివలె రిజిస్టరులో వేలుముద్ర వేయవలసిందిగాను, దానికి దాఖలాగా ప్రతి భారతీయుడు ఒక ప్యాసును (Pass) పొందవలసిందిగాను, ఆ ప్యాసును సర్వదా తన వద్ద ఉంచుకొని సంచారం చేయవలసిందిగాను, దానిని పోలీసు అధికారులకు అడిగినప్పుడు చూపించవలసిందిగాను ఒక శాసనం చేయబడింది. సాయంకాలం అయిదు గంటలు తర్వాత ఏ భారతీయుడు వీధులవెంట స్వేచ్ఛగా తిరగరాదు. వారందరు దొంగలుగాను, దోపిడీ చేసే వారుగాను భావింపబడినారు.

భారతీయులు ఎంతటివారైనా రైళ్ళలో మొదటి రెండు తరగతులలో ప్రయాణం చేయరాదు. కోచిబండ్లలో తెల్లవారి పక్కన కూర్చుండరాదు. తెల్లవారి హోటళ్ళలో భోజనం చేయరాదు. వారిని అస్పృశ్యుల కంటె హీనంగా పరిగణించడం పరిపాటి అయింది.

నెటాలులోని ప్రభుత్వం కూడా ఈలాటి ఆంక్షలనే క్రమ క్రమంగా విధించింది. 1896 వరకూ శాసనసభ ఎన్నికలలో స్వతంత్ర భారతీయులకు వోటు చేసే హక్కు ఉండేది. 1896 లో దానిని తొలగించడం జరిగింది. 1903 లో భారతీయుల రాకను పూర్తిగా నిషేధిస్తూ శాసనం చేయబడింది.

గోరుచుట్టుమీద రోకటిపోటు అన్నట్లు దక్షిణ ఆఫ్రికా ఉన్నత న్యాయస్థానంవారు క్రైస్తవేతర మతాల ననుసరించి జరిగిన వివాహాలు చెల్లవని తీర్పు చెప్పారు. ఇది భారతీయుల కుటుంబ జీవితానికి ఒక గొడ్డలి దెబ్బగా పరిణమించింది.

1893 లో గాంధీ బారిష్టరు హోదాలో నెటాలులో అడుగు పెట్టాడో లేదో మొదటి క్లాసులో రైలుబండిని ఎక్కినందుకు, కోచిబండిలో ఒక తెల్లవాడు గౌరవ హీనంగా ప్రవర్తించడంపట్ల విరసన తెలిపినందుకూ దౌర్జన్యానికి గురి అయ్యాడు. భారతీయుల దుర్గతి ఏలాటిదో అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నాడు.

ఈ విధంగా వెలివేసిన వారివలె జాతి విచక్షణకు లోబడి భారతీయులు జీవితాన్ని సాగించవలసిందేనా? దీనికి ప్రతిక్రియ ఏదైనా ఉన్నదా? జరుగుచున్నది అన్యాయమైనప్పుడు దానిని చేతులు ముడుచుకొని సహించడమేనా? దానిని తొలగించుటకు ప్రయత్నం చేయడం కర్తవ్యం కాదా? అనే ప్రశ్నలు గాంధీలో ఉదయించాయి, వాటికి సమాధానాలను అన్వేషించ సాగాడు.

ప్రథమ దశలో—అనగా 1905 వరకు—గాంధీ వైఖరి ఆనాటి భారత దేశంలోని కాంగ్రెసు మితవాదుల వైఖరి వంటిదే. బ్రిటిష్ రాజ్యాంగం ప్రపంచంలోని రాజ్యాంగా లన్నిటిలో ఉత్కృష్టమైనదని, బ్రిటిష్‌వారు ధర్మస్వరూపులని, న్యాయానికి కట్టుబడినవారని, ఒకే సామ్రాజ్యంలో పౌరులుగాఉన్న వారి మధ్య రంగునుబట్టి విచక్షణ చేయడం బ్రిటిష్ న్యాయ సూత్రాలకు పరమ విరుద్ధమని, ఆలాటి విచక్షణకు వారు ఎన్నడూ అంగీకరించరని ఈ సూత్రాన్ని విక్టోరియా మహారాణి 1858 లో చేసిన ప్రకటన పూర్తిగా సమర్థిస్తున్నదనీ మిత వాదులవలె ఆయనకూడా విశ్వసించాడు. ప్రభుభక్తిని ప్రదర్శించడం సామ్రాజ్యంలోని ప్రజ లందరి కర్తవ్యమని, దానిని ప్రదర్శించిన పక్షంలో జాతినిబట్టి జరిగే అన్యాయాన్ని తొలగించ డానికి బ్రిటిష్‌వారు సిద్ధపడగలవారని విశ్వసించి 1899 లో బోయరు యుద్ధకాలంలోను, 1905 లో జూలూ తెగల తిరుగుబాటు కాలంలోను భారతీయులతో కూడిన ఒక అంబులాన్సు (Ambulance Corps) దళాన్ని సమకూర్చి బ్రిటిష్ వారికి సహాయం చేశాడు. బ్రిటిష్ పరి పాలన మూలంగా భారతదేశంలో శాంతి భద్రతలు నెలకొన్నవనీ, భారతీయులలోని లోపాల కారణంగానే బ్రిటిష్‌వారు దేశాన్ని వశపరచుకొనగలిగారని, ఆ లోపాలు తొలగేవరకూ వారి పరి పాలన ఉండడమే శ్రేయస్కరమని ఆయన మితవాదులవలెనే విశ్వసించాడు.

ఈలాటి విశ్వాసాలు ఆయనలో దృఢంగా నాటుకొన్న కారణంగా దక్షిణ ఆఫ్రికా లోని భారతీయులు అనుభవించుచున్న అన్యాయాలను తొలగించుటకు చట్టసమ్మతమైన కార్య క్రమాలనే అనుసరించాడు. అందు నిమిత్తం 'నెటాలు భారతీయ కాంగ్రెసు'ను (Natal Indian Congress) స్థాపించి, దాని సమావేశాలను జరిపి, భారతీయులపై విధింపబడిన నిర్బంధాలను తొలగించవలసినదిగా తీర్మానాలు చేసి పై అధికారులకు పంపాడు. "ఇండియన్ ఒపినియన్"

(Indian Opinion) అనే పత్రికను ప్రకటించి, దాని ద్వారా భారతీయుల పరిజ్ఞానాన్ని వృద్ధి చేసి, వారి అభిప్రాయాలకు సక్రమమైన రూపకల్పన చేశాడు. ఈ పత్రికద్వారా భారతీయుల ఇబ్బందుల గురించి తెల్లవారికి పదే పదే తెలియపరచాడు. కరపత్రాలను ప్రకటించి దక్షిణ ఆఫ్రికాలోని అధికారులను, బ్రిటన్‌లోని అధికారులను, భారతదేశంలోని రాజ ప్రతినిధిని స్వయంగా కలుసుకొని ఇబ్బందులను తొలగించుటలో వారు శ్రద్ధను వహించవలసిందిగా అర్థించాడు. ఈ విషయాన్ని గురించి భారత జాతీయ కాంగ్రెసుచేత కొన్ని తీర్మానాలు చేయించాడు. అన్యాయాలను తొలగించుటకు చట్టబద్ధమైన కార్యక్రమాలన్నిటిని వినియోగించాడు. వినతి పత్రాలను సమర్పించాడు. కాని వీటి మూలంగా ఏలాటి ఫలితము లభించలేదు; అధికారుల వైఖరిలో ఏలాటి మార్పు రాలేదు.

ఈ పరిస్థితులలో చేతులు ముడుచుకొని అన్యాయాన్ని భరించడమా లేక దాని నిర్మూలనకు సాధనాంతరాన్ని కనిపెట్టి దానిని వినియోగించడమా అనే ప్రశ్నను ఆయన ఎదుర్కొని తుదకు సత్యాగ్రహ సాధనాన్ని కనిపెట్టి 1907 నుండి 1914 వరకూ—ఏడు సంవత్సరాల కాలం—దఫల వారీగా ట్రాన్స్‌వాల్ నెటాలు మొదలైన రాష్ట్రాలలోని భారతీయులచే దానిని వినియోగింపజేశాడు. తానుకూడా దానిని తక్కిన వారితోపాటు వినియోగించాడు.

అన్యాయానికి లొంగిపోవడం పిరికితనం; అది మానవతను కించపరచడమే. దానిని ఎదుర్కొనడమే ఆత్మ గౌరవము. అన్యాయాన్ని ఎదుర్కొనడమంటే దానికి కారణమైన ప్రభుత్వ శాసనాన్ని ఎదుర్కొనుట. శాసనాన్ని ధిక్కరించిన పక్షంలో శిక్షకు పాత్రుడౌతాడు. కాని ఆ శిక్షను అనుభవించుటకు సిద్ధపడడమే గౌరవము. ఆ శిక్ష ఏలాటిదైనా కావచ్చు. జైలు శిక్ష కావచ్చు లేదా ఉరిశిక్ష కావచ్చు. శిక్ష ఏదైనా శాసనానికి లోబడక దానిని ప్రతిఘటించి శిక్షను అనుభవించడమే సత్యాగ్రహంయొక్క స్థూల స్వరూపం. సత్యాగ్రహం చేసేవాడు చట్ట ధిక్కారంచేసి శిక్షను అనుభవించుటకు ప్రతిజ్ఞ చేయవలెను. చేసిన ప్రతిజ్ఞను ఏ పరిస్థితులలో కూడా జవదాటరాదు. దానికి కట్టుబడి ఉండవలెను. ఈలాగు కట్టుబడి ఉండడమే సత్యాగ్రహం (సత్య+ఆగ్రహం—సత్యాన్ని గట్టిగా పట్టుకొనడం). అధిక సంఖ్యలో చట్ట ధిక్కారానికి పూనుకొని శిక్షలను అనుభవించేవారు చట్టాన్ని చేసిన అధికారుల హృదయాన్ని మార్చగలుగుతారు. తాము అన్యాయం చేస్తున్నామనే సత్యం అప్పుడు వారికి గోచరమై అన్యాయాన్ని తొలగిస్తారు. ఈ విధంగా సత్యాగ్రహానికి విజయం లభిస్తుంది.

ఈ తత్వాన్ని ఆధారం చేసుకొని వేలుముద్రల చట్టాన్ని ట్రాన్స్‌వాలులోని భారతీయులు ధిక్కరించి జైళ్ళకు వెళ్ళారు. జైళ్ళకు వెళ్ళినవారిలో గాంధీ కూడా ఉన్నాడు. దాని ఫలితంగా ప్రభుత్వం కొన్ని షరత్తులకు లోబడి ఒక ఒడంబడికను చేసుకొన్నది. కాని షరత్తులను ప్రభుత్వం అతిక్రమించడంచేత భారతీయులు సత్యాగ్రహాన్ని తిరిగి ప్రారంభించి చాలా కాలం సాగించి అత్యధిక సంఖ్యలో జైలు శిక్షను అనుభవించారు.

1907 లో ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం భారతీయుల ప్రవేశాన్ని నిషేధిస్తూ చట్టంచేసింది. దానిని ధిక్కరిస్తూ భారతీయు లనేకులు రాష్ట్రంలో ప్రవేశించసాగారు. ప్రభుత్వం వారిని జైళ్ళలో నిర్బంధించి నానా బాధలకూ గురిచేసింది. గాంధీతో సహా సత్యాగ్రహులందరూ ఆ బాధలను సహించారు.

క్రైస్తవ మతానికి అన్యదాగా జరిగిన వివాహాలు చెల్లవని న్యాయస్థానం తీర్పు చెప్పిన ఫలితంగా స్త్రీలు సత్యాగ్రహులై ట్రాన్స్వాలులోకి ప్రవేశించసాగారు. కస్తూరిబాయితో సహా వారు జైలుశిక్షను అనుభవించారు.

స్త్రీలు శిక్షాపాత్రులు కావడం గనులలో పనిచేసే భారతీయుల అతృప్తికి కారణమైంది. వారు చెల్లించవలసిన మూడుపౌండ్ల పన్నులకు నిరసనగా 6000 కార్మికులు సత్యాగ్రహులై ట్రాన్స్వాలుకు ప్రయాణమయ్యారు. వారిలో స్త్రీలు బిడ్డలుకూడా ఉండినారు. మార్గంలో అనేకబాధలు సహించి తుదకు ట్రాన్స్వాలును చేరారు. అధికారులు వారిని బలవంతంగా రైళ్ళలో ఎక్కించి గనులకు పంపారు. వారు పనిచేయుటకు నిరాకరించగా వారిని యజమానులు కొరడాదెబ్బలకూ ఇతర బాధలకూ గురిచేశారు. వీరిపట్ల సానుభూతిగలవారై ఇతర గనులలో పనిచేసే భారతీయులుకూడా సమ్మె చేశారు.

దీనినంతా గమనించి ప్రభుత్వం గాంధీతో ఒక ఒప్పందం 1914 లో చేసుకొన్నది. దాని ఫలితంగా మూడు పౌండ్ల తలపన్ను రద్దయింది; హిందూ ముస్లిం పార్సీ మతాల ననుసరించి జరిగే వివాహాలు చెల్లునట్లు ప్రభుత్వం అంగీకరించింది. కంట్రాక్టు కూలీల పద్ధతి 1920 నాటికి రద్దయ్యేటట్లు నిర్ణయం జరిగింది. ఇవిగాక మరికొన్ని సదుపాయాలు భారతీయులకు లభించాయి. జాతి వివక్షణ పూర్తిగా తొలగకపోయినా సత్యాగ్రహం మూలంగా అన్యాయాలలో కొన్ని తొలగాయి. సత్యాగ్రహసాధనం ఫలప్రదం కాగలదనే విశ్వాసం గాంధీలో బలపడింది.

సత్యాగ్రహం ద్వారా దక్షిణ ఆఫ్రికాలోని భారతీయుల ఇబ్బందులను తొలగించడంలో కొంత విజయాన్ని సాధించి 1914 లో ఆయన స్వదేశానికి ప్రయాణమై కొన్ని నెలలు లండన్‌లో గడిపి 1915 ప్రారంభాన స్వదేశం చేరాడు.

## 4

అప్పటికి ఆయన వయస్సు 46 సంవత్సరాలు. అంతటి వయస్సు వచ్చిన తర్వాత సాధారణంగా ఎవరూ వారిలో ఏర్పడిన విశ్వాసాలను అభిప్రాయాలను మార్చుకోరు. శేషించిన జీవిత కాలంలో వాటిననుసరించే జీవితాన్ని సాగిస్తారు. గాంధీ ఇలాగే చేశాడు. 1917 నుండి దేశచరిత్రలో ఆయన ప్రధాన పాత్రను వహించాడు. స్వాతంత్ర్యోద్యమానికి ఏకైక నాయకుడై మేధావులని ప్రఖ్యాతిగాంచిన అనేక అనుచరుల సహాయంతో దానిని ఫలప్రదం చేశాడు. ఇందులో ఆయన దక్షిణ ఆఫ్రికాలోని 20 సంవత్సరాల అనుభవాల ఫలితంగా ఆయనలో ఏర్పడిన విశ్వాసాలు ఆయనపై అత్యంత ప్రభావాన్ని వహించాయి. అందుచేత అవి ఏలాటివో తెలుసుకొనడం అవసరం.

(1) వీటిలో సత్యాగ్రహం అత్యంత ప్రాధాన్యం వహించినట్టిది. దీని స్థూల స్వరూపాన్ని ఇదివరలోనే తెలుసుకొన్నాము. దానిని గురించి మరికొన్ని విశేషాలు కూడా తెలుసుకొనవలసి ఉంది.

సత్యాగ్రహానికి సత్యం, అహింస ఆధారాలు. మోక్షాన్ని సాధించదలచినవానికి ఇవి సాధనాలనేది వేలాది సంవత్సరాలుగా భారతీయులపై ప్రభావం వహించింది. భారతీయ

సంప్రదాయాల పట్ల అకుంఠిత శ్రద్ధా భక్తులుగల గాంధీపై ఈ విశ్వాసం ప్రభావం వహించడంలో ఏలాటి విశిష్టతా లేదు. కాని ప్రజా జీవితంలో ఏర్పడిన లోపాలను, సమాజంలోని రాజకీయాది సమస్త రంగాలలో ప్రవేశించిన అన్యాయాలను తొలగించుటకు కూడా ఇవి పటిష్ట సాధనాలనీ, వాటి సాధనననే లోపాలను అన్యాయాలను తొలగించడం ధర్మమని భావించి, ఆ సాధనానికి సత్యాగ్రహం అనే పేరు పెట్టి దానిని దక్షిణ ఆఫ్రికాలో ఫలప్రదంగా వినియోగించాడు. దాని ఫలితంగా ఇదే సాధనాన్ని వినియోగించి స్వరాజ్య సంపాదన ప్రయత్నము, అస్పృశ్యతా నివారణ ప్రయత్నము, ఇతర అన్యాయాలను తొలగించే ప్రయత్నము చేశాడు. వ్యక్తుల మోక్ష సాధనానికే కాక ప్రజల సమష్టి ప్రయోజనాలను సాధించుటకు సత్యాహింసలతో కూడిన సత్యాగ్రహమే తుది సాధనమని భావించడమే ఆయన ఈ విశ్వాసంలోని విశిష్టత. క్రమబద్ధమైన సభలు, సమావేశాలు, తీర్మానాలు, వినతి పత్రాలు నిష్ఫలములైనప్పుడు, యుద్ధ సాధనాలను, ఇతర దౌర్జన్యాల సాధనాలను, సమాజంలో ప్రవేశించిన అన్యాయాలను తొలగించుటకు పూనడం సంప్రదాయ సిద్ధమైన సాధనం. కాని ఇది అహింసతో కూడుకొన్న సాధనమని గాంధీ దానిని పూర్తిగా త్యజించి సమష్టి ప్రయోజనాల సాధించుటకు కూడా సత్యాగ్రహాన్ని వినియోగించాడు. ఇది ఆయన కనిపెట్టిన నూతన సాధనం.

లక్ష్యం ఉన్నతమైనప్పుడు దానిని సాధించుటకు హింసతో కూడిన యుద్ధ సాధనాన్ని వినియోగించవచ్చునని, అలాటి యుద్ధం ధర్మ యుద్ధమని, భగవద్గీతాది మత గ్రంథాలు బోధిస్తున్నవని తిలక్, అరవిందుడు మొదలైన వారి అభిప్రాయాలతో ఆయన ఏకీభవించ లేదు. ఏ పరిస్థితులలో కూడా హింసకు పూనరాదనేదే ఆయన విశ్వాసం. యుద్ధంలో రెండు పక్షాల వారు ఒకరినొకరు హింసించి తమ ఆశయాలను సాధించుటకు సిద్ధ పడతారు. వ్యక్తి లాభానికి మాత్రమే చేయబడిన హత్య నిందార్హమనీ, సమిష్టి లాభానికి చేయబడిన సామూహిక హత్య (Collective murder) ప్రశంసార్హమనీ భావించరాదు. హత్య ఏ ఉద్దేశంతో చేసినా అది హత్యయే.

సమాజంలో అన్యాయాలు జరుగుతున్నప్పుడు, అవి అన్యాయాలని తెలియవచ్చిన తర్వాత, వాటిని నిర్మూలించుటకు ప్రయత్నం చేయడం అందరి కర్తవ్యం. అలాగు ప్రయత్నం చేయక చేతులు ముడుచుకొని కూర్చుండడం పిరికితనం. కాని అన్యాయం చేసేవారిని హింసించి దానిని తొలగించడం ధర్మం కాదు. వారిని హింసించుటకు బదులు అహింసతోను, ప్రేమతోను వారిని ఎదుర్కొని వారు పెట్టే బాధలన్నిటినీ సహించడము, అవసరమైన పక్షంలో ప్రాణాలను కూడా అర్పించడము అన్యాయానికి లోబడినవారు చేయవలసిన పని. దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు ఈలాగు చేశారు. ఇందులో ఒక విశేషం ఉన్నది. ఈ విధంగా స్వీయ బాధను అనుభవించుటకు సిద్ధపడిన వారి బాధలను గుర్తించి వెంటనే కాకపోయినా కాలక్రమాన అన్యాయాలు చేసేవారిలో హృదయ పరివర్తన కలిగి బాధపడే వారిపట్ల వారు సానుభూతిని ప్రదర్శిస్తారు. మానవుని హృదయంలో అవ్యక్తంగా ఉండే దయ కరుణలు ఇతరులు పడే బాధలను సహించవు. ఎప్పటికైనా అవి వ్యక్తం అయినప్పుడు అన్యాయం చేస్తున్నవాడు తన పొరబాటును గ్రహించి, ఎదటి వానితో రాజీ చేసుకొని తాను చేసే అన్యాయాలను తొలగిస్తాడు. అన్యాయాలను తొలగించుటకు స్వీయ బాధానుభవం—ఆత్మ బలిదానం—మార్గం; అన్యాయం చేసే వానిని బాధించడం మార్గం కాదు. సత్యాగ్రహానికి స్వీయ బాధానుభవం (Self Suffering)

ప్రధాన లక్షణం. బాధ పడేవారు కొందరు లేనిదీ ఏ ఉద్యమం కొనసాగదు. యుద్ధంలో రెండు పక్షాలవారూ బాధ పడడంచేత బాధ అధికంగా ఉంటుంది. సత్యాగ్రహ సమరంలో అన్యాయానికి గురి అయినవారు మాత్రమే బాధ పడుతారు. అందుచేత మొత్తపు బాధ తక్కువగా ఉంటుంది. ఇది అందులోని విశిష్టత.

తపస్సుకు స్వీయ బాధానుభవం ప్రధాన లక్షణం. మహనీయులు ఘోర తపస్సు చేసి నానా బాధలను అనుభవించడం చేత కరుణామయుడైన భగవంతుడు వారికి ప్రత్యక్షమై వారు కోరిన వరములన్నిటిని ప్రసాదించినట్లు పురాణాలు ఇతిహాసాలు తెలియ పరుస్తున్నవి. మానవునిలో భగవదంశ ఉండడం చేత ఘోర బాధలను అనుభవించే వారి పట్ల దయ గలవాడై ప్రవర్తిస్తాడు. వారికి తాను చేసే అన్యాయాలను వదలుకొని వారి వాంఛలను తీరుస్తాడు.

ఇంతే కాదు—తాపసుల ఘోర తపస్సు మూలంగా తపోవనాలలో ప్రశాంత వాతావరణం ఏర్పడి తోడేలు గొర్రెపిల్ల, సింహం లేడి, పరస్పర వైరాన్ని మానుకొని శాంతియుతంగా సహజీవనం సాగించడం జరుగుతుందని ప్రాచీన గ్రంథాలు ఘోషిస్తున్నవి. ఇవి అంతా కల్పితకథలని ఈనాటి వారిలో అనేకులు భావించవచ్చు. కాని భారతీయులు వీటిని విశ్వసించారు. మానవ జీవితంపై విశ్వాసాలకు గల ప్రభావం వాస్తవాలకు కూడా లేదు. గాంధీకి అటువంటి విశ్వాసం ఉండడం చేత స్వీయ బాధానుభవం శత్రువుల హృదయాలను పూర్తిగా మార్చగలదని ఆయన సత్యాగ్రహ సాధనాన్ని అన్యాయాల తొలగించుటకు వినియోగించాడు. ఈనాటి అన్యాయాలలో పరాయి పరిపాలన అగ్రస్థానం వహిస్తున్నది. దానిని తొలగించుటకు ఈ సాధనాన్నే వినియోగించాడు.

ఉపవాస వ్రతాలను గూడా ప్రజల హృదయాలను మార్చుటకు ఆయన ఉద్దేశించాడు. హిందూమతానికి ఒక కళంకంగా ఏర్పడిన అస్పృశ్యతను నివారించే ఉద్దేశంతో ఆయన ఆమరణ ఉపవాసం చేపట్టడంచేత స్పృశ్యులైన హిందువులహృదయాలలో పరివర్తనం కలిగి అస్పృశ్యతను పాటించరాదనే నిర్ణయానికి వారు వచ్చారు. అస్పృశ్యుల ఉద్ధరణ కార్యక్రమాలు దీనితో నే ప్రారంభమైనాయి. మహానుభావుల స్వీయ బాధానుభవం ఇతరులను ఏలాగు మార్చగలదో ఇది స్పష్టం చేస్తూ ఉంది.

(2) దక్షిణ ఆఫ్రికాలోని అనుభవాలమూలంగా బ్రిటీష్ సామ్రాజ్యం పట్ల ఆయనకు లోగడ ఉండిన భక్తి సడలింది. ఆయనలో జాతీయత వృద్ధి గాంచింది. భారతదేశ పునరుద్ధరణకు స్వరాజ్యం అవసరమనే భావం ఏర్పడింది. ఈ భావంతో ఆయన 1915 లో స్వదేశానికి వచ్చాడు.

రాజకీయ చైతన్యంగల మేధావులెవ్వరు పరాయి పరిపాలనను హర్షించరు. ఎప్పటికైనా తమ దేశానికి స్వరాజ్యం లభించడమునేవారు ఆశిస్తారు. గాంధీలో ఈ ఆశ బీజ రూపంలో బాల్యమునుండి ఉండినది. కాని మొత్తంమీద 1905 వరకు ఆయన బ్రిటీష్ సామ్రాజ్యం పట్ల పూర్తిగా భక్తిగలవాడుగా ఉండినాడు. బ్రిటీష్ రాజ్యాంగం అన్ని రాజ్యాంగాలకంటె ఉత్కృష్టమైనదని, అది చట్ట సమత్వాన్ని ప్రతిపాదించేదనిన్నీ, సామ్రాజ్యంలో నివసించే వివిధ జాతులమధ్య సమత్వ సహకారాలను కల్పించుటకు అది పటిష్ట సాధనమని ఆ కాలంలో ఆయన

భావించాడు. ప్రభుభక్తి ప్రదర్శించిన గాని దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు అనుభవిస్తూ ఉండిన అన్యాయాలు తొలగవని కూడా ఆయన భావించాడు. ఈ భావాలు బలపడుటకు ఇతర కారణాలు కూడా ఉన్నట్లు ఇదివరలో తెలుసుకొన్నాము. 1906 తర్వాతనే ఆయన సత్యాగ్రహ సాధనాన్ని కనిపెట్టాడు. అంతవరకూ బ్రిటిషు ప్రభుత్వ సహాయం లేక దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులకు విముక్తి లేదనే ఆయన విశ్వసించాడు. సత్యాగ్రహ సాధనాన్ని కనిపెట్టినతర్వాత ఆలాటి సహాయానికంటె భారతీయులు ఆత్మ విశ్వాసం కలవారై, తమ కాళ్ళపైన తాము నిలబడి, స్వీయ బాధానుభవం ద్వారా సత్యాగ్రహాన్ని ప్రయోగించడమే బలవత్తరమైన సాధనంగా ఆయన పరిగణించాడు. ఈ ఆత్మ విశ్వాసం కుదిరినతర్వాత ఆయనలోని తొలి ప్రభుభక్తి సన్నగిల్ల సాగింది.

దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులకు బ్రిటన్‌లోని అధికారులు ఏలాటి సహాయం చేయకపోవడం కూడా ఆయన ప్రభుభక్తి సన్నగిల్లుటకు ఇంకొక కారణం. సిద్ధాంత దృష్ట్యా బ్రిటీష్ రాజ్యాంగం ఉత్కృష్టమైనదైనా బ్రిటిషువారు దానికి కట్టుబడి ప్రవర్తించడం లేదని, ఆచరణలోకి రాని సిద్ధాంతాలు ప్రయోజన రహితాలని ఆయన అభిప్రాయ పడసాగాడు. ఇది కూడా ఆయన ప్రభుభక్తి సన్నగిల్లడంలో ఒక కారణమైంది.

1904 లో చిన్న ప్రాచ్య దేశమైన జపాన్ పెద్ద పాశ్చాత్య దేశమైన రషియాను ఓడించడం ప్రాచ్య దేశాలన్నిటికీ గర్వ కారణమై వాటిలోని ప్రజలలో జాతీయాభిమానాన్ని వృద్ధి చేసింది. గాంధీ కూడా దానిచే ప్రభావితుడైనాడు. అటు తర్వాత కొంత కాలానికి చైనా, పర్షియా, ఈజిప్టు మొదలైన దేశాలలో తిరుగుబాటు ఉద్యమాలు బయలుదేరి జాతీయ భావాన్ని పెంపొందించాయి. వీటిచేత కూడా గాంధీ ప్రభావితుడైనాడు. 1905 లో బెంగాలీ ప్రజల అభిప్రాయాన్ని ఎంత మాత్రం లక్ష్యపెట్టక కర్జన్‌ప్రభువు రాష్ట్రాన్ని విభజించడాన్ని ఆయన పూర్తిగా ఖండించాడు. విభజన రద్దుకై బెంగాలీలు సాగించిన బహిష్కరణ ఉద్యమాన్ని స్వదేశీ ఉద్యమాన్ని సమర్థించాడు. అప్పటికి ఆయన ఒక జాతీయవాదిగా మారినాడు.

భారతదేశంలో బ్రిటీష్ పరిపాలకుల లక్ష్యం స్వార్థమేనని, తమ వర్తక లాభాలను వృద్ధి చేసుకొనుటకై వారు ప్రజలకు అపార నష్టాన్ని కలిగిస్తున్నారని, ప్రజల దారిద్ర్యానికి దేశంలోని క్షామాలకు, ప్లేగు మొదలైన వ్యాధులకు వారి దుష్టపరిపాలనే కారణమని 1906 తరువాత పదే పదే ఆయన ఉద్ఘాటించాడు. వారనుసరించిన చాణక్య నీతి మూలంగానే హిందువులు ముస్లింలు వేరుపడి పోతున్నారని ఆయన భావించాడు. వారు ప్రవేశ పెట్టిన విద్యావిధానం నిష్ప్రయోజనమనీ, ఇంగ్లీషు విద్యాధికులందరు ఆంగ్ల మానసపుత్రులై తమ నాగరికత పట్ల సంస్కృతి పట్ల ఆదరాభిమానములు లేనివారైనారనే భావం ఆయనలో నాటుకొన్నది. ఒకప్పుడు ఆయన బ్రిటిష్ పరిపాలన మూలంగానే భారతదేశం తరించగలదని విశ్వసించాడు. 1906 తర్వాత ఈ విశ్వాసం సన్నగిల్లింది. భారతదేశానికి స్వరాజ్యం లభించడమే తరుణోపాయమనే నిర్ణయానికి 1909 నాటికి ఆయన వచ్చాడు. ఆయన ఆనాడు వ్రాసిన "హింద్ స్వరాజ్యం (Hind Swaraj) అనే గ్రంథం ఈ అభిప్రాయాలకు ప్రతిబింబంగా ఉన్నది. ప్రభుత్వం 1919 లో రౌలెట్టు చట్టం చేసిన తర్వాతనే ఆయన వైఖరి మారిందని అనుకొనడం పొరబాటు.

కాని ఏనాడుకూడా బ్రిటిష్ సామ్రాజ్యం పట్ల ఆయనకు గల భక్తి పూర్తిగా తొలగలేదు. ఈ విషయంలో ఆయనకు ఒక ద్వంద్వభావం కలిగినట్లు చెప్పవచ్చు. 1899 బోయరు

యుద్ధకాలంలోను 1905 జూలూ తెగల తిరుగుబాటు కాలంలోను ఆయన దక్షిణ ఆఫ్రికాలో ఒక భారతీయ అంబులాన్సు దళాన్ని (Ambulance corps) తయారుచేసి ప్రభుత్వానికి సహాయం చేసినట్లే 1914 లో ప్రథమ ప్రపంచ సంగ్రామం సంభవించిన కాలంలో లండన్‌లోని భారతీయ విద్యార్థులతో కూడిన ఒక అంబులాన్సు దళాన్ని నిర్మాణం చేశాడు. యుద్ధం మూలంగా బ్రిటీష్‌వారు కష్టదశలో ఉన్నప్పుడు హోంరూల్ గురించి ఆందోళన చేయడం ధర్మం కాదని తిలక్ అనిబిసెంటులను ఖండించి ఆ ఆందోళనలో పాల్గొనుటకు నిరాకరించాడు. ఆనాటి నాయకుల అభిప్రాయాలను ప్రజల అభిప్రాయాలను లెక్కచేయక 1918లో భారతీయులు అధిక సంఖ్యలో సైన్యంలో చేరి బ్రిటీష్‌వారికి సహాయం చేయవలసిందిగా ప్రచారం చేశాడు. ఈలాగు సైన్యంలో చేరడం మూలాన భారతీయులు సుశిక్షితులై ధైర్య సాహసాలను పెంపొందించుకొని, స్వరాజ్యాన్ని రక్షించుకొన గలుగుతారని తన ప్రచారాన్ని సమర్థించాడు. యావజ్జీవం ఈలాటి ద్వంద్వభావం ఆయన మానసిక ప్రపంచంలో రూపొందిన స్వరాజ్య స్వరూపమని చెప్పవచ్చు.

(3) గాంధీ, జీవితానికి సంబంధించిన ప్రతి విషయాన్ని ఆధ్యాత్మిక నైతిక దృక్పథాలను ఆధారం చేసుకొని పరిశీలించేవాడు. స్వరాజ్యం అనే పరిపాలన విధానాన్ని కూడా ఇదే విధంగా పరిశీలించాడు.

స్వరాజ్యం అంటే ప్రతివ్యక్తి తన్ను తాను పరిపాలించుకొనడం, ఇతరుల పరిపాలనకు లోబడకుండా ఉండడం, దేశంలోని వారందరు ఈలాటి వారైనప్పుడు దేశానికికూడా స్వరాజ్యం లభిస్తుంది. వ్యక్తులతో కూడిన సమూహమే దేశం. వ్యక్తులకు స్వపరిపాలన లభిస్తే దేశానికి స్వపరిపాలన లభించినట్లే.

స్వపరిపాలన అంటే సత్యాహింసలకు లోబడి జీవితాన్ని సాగించడం. ఆలాటి వానిని సత్యాహింసలు పరిపాలిస్తవి. పరులెవ్వరు అతనిని పరిపాలించరు. వారు అతనిని పరిపాలించదలచినా సత్యాహింసల (సత్యాగ్రహం) ద్వారా అతడు వారిని ప్రతిఘటించి విజయాన్ని సాధిస్తాడు. భారతీయులు కోరదగిన స్వరాజ్యం ఈలాటిది. భారతీయులే కాదు. మానవకోటి అంతా కోరదగిన స్వరాజ్యం ఇదే.

ఈలాటి స్వరాజ్యం లభించని నాడు దేశానుండి బ్రిటీష్‌వారు తొలగిపోయినా వాస్తవమైన స్వరాజ్యం లభించదు. వారి స్థానే వారివంటి భారతీయులు అధికారంలోకి వస్తారు. అధికారుల రంగు మారుతుందే గాని అధికార స్వభావం మారదు. బ్రిటీష్‌వారి పద్ధతులను అనుసరించి వారు దేశాన్ని పాలిస్తారు. పాశ్చాత్య నాగరికత వారికి మార్గదర్శక మౌతుంది. ఇది వాస్తవమైన స్వరాజ్యం కాదు.

బ్రిటిష్‌వారు జాత్యహంకారాన్ని స్వార్థాన్ని వదలి, భారతీయులు తమకు సమానులు అనే విశ్వాసంతో వారి హితాన్ని లక్ష్యంగా పెట్టుకొని పరిపాలనను సాగించిన పక్షాన వారు దేశానుండి తొలగిపోవలసినది లేదు. ఆలాటి పరిపాలన వాస్తవమైన స్వరాజ్యమే కాగలదు. ఆలాగు వారు పరిపాలించినప్పుడు వారితో తెగతెంపులు చేసుకొనవలసినది లేదు. స్వరాజ్యం అంటే ఒంటరి జీవితం కాదు. ఇతర దేశాలతోను, జాతులతోను సంబంధం పెట్టుకొనడం శ్రేయస్కరం. ఆ సంబంధానికి సామ్రాజ్య తత్వం ఆధారంకాక సమానత్వం ఆధారమైనప్పుడు

అనేక దేశాలు కలిపి ఒక కామన్‌వెల్తుగా(Commonwealth) రూపొందడమే వాంఛనీయం. సత్యాగ్రహం, సహాయ నిరాకరణం బ్రిటిష్‌వారిలో హృదయ పరివర్తనను కలిగించుటకు ఉద్దేశింపబడినవే గాని వారితో తెగతెంపులు చేసుకొనుటకు ఉద్దేశింపబడినవి కావని స్వాతంత్ర్య సమరంలో కూడా ఆయన పదే పదే ఉద్ఘాటించాడు. ఆయన వాంఛించిన స్వరాజ్యం ఈలాటిదే. 1947 లో దేశానికి స్వరాజ్యం లభించిన తర్వాత కూడా నెహ్రూ మొదలైన నాయకులు దేశం కామన్‌వెల్తులో సభ్యత్వానికి అంగీకరించడం గాంధీ ఆశయానికి అనుగుణమైనట్టిది. ఇప్పటి వరకు దేశం కామన్‌వెల్తులో సభ్యత్వం వహించిఉన్నది. 1905 తర్వాత బ్రిటిష్ సామ్రాజ్యంపట్ల ఆయన వైఖరి మారినా దానిపట్ల ఆయనకు గల అభిమానం పూర్తిగా మారలేదు. ఇది గుర్తించదగిన విశేషం. మానవులందరు సత్యాహింసలను ఆధారం చేసుకొని పరస్పర స్నేహ భావంతో మెలగడమే సాధించదగిన ఆశయం అనేది ఆయన విశ్వాసం. ఆయన వాంఛించిన స్వరాజ్యం దానికి అనుగుణమైనట్టిది.

(4) దక్షిణ ఆఫ్రికాలో జీవించిన కాలంలో గాంధీలో పాశ్చాత్య నాగరికతపట్ల పూర్తి విముఖత్వం కలిగింది. ఆయన 1909లో ఇంగ్లండుకు వెళ్ళి అక్కడి పరిస్థితులను స్వయంగా చూచిన ఫలితంగా ఈ భావం ఏర్పడింది. యంత్రసహాయంతో, విపరీతంగా వస్తువులను ఉత్పత్తిచేసి, వాటిని శరీర సౌఖ్యానికి వినియోగించుకొనడంలోనే పాశ్చాత్యులు నిమగ్నులయ్యారు. వారి లక్ష్యం ఐహిక సౌఖ్యం మాత్రమే. భౌతిక వాంఛలను మితిమేరలు లేక పెంచుకొని వాటిని సఫలం చేసుకొనడం తప్ప వారు సాధించ కోరే పురుషార్థం ఇంకొకటిలేదు. వారిలో ఆధ్యాత్మిక చింత పూర్తిగా నశించింది. దైవభక్తి శూన్యమైంది. ఉత్పత్తి చేసిన వస్తువులకు గిరాకీ కలిగించే ఉద్దేశంతోను కూడబెట్టిన ధనాన్ని లాభాలను చేకూర్చే పరిశ్రమలలో వినియోగించే ఉద్దేశంతోను వారు విదేశాలను జయించి వశపరచుకొని వారి పరిపాలనను స్వార్థానికై ఉపయోగించుకొనడం పరిపాటి అయింది. విదేశాలను జయించడంలో పాశ్చాత్య దేశాలు పోటీ పడి పరస్పర యుద్ధాలలోకి దిగడంచేత ప్రపంచంలో యుద్ధ భీతి ప్రబలింది. పాశ్చాత్యుల యుద్ధాల మూలంగా మానవకోటి ఎన్నో బాధలకు గురి అయింది. వారి విజ్ఞాన వేత్తలు కోట్లకొలది మానవులను వినాశం చేయగల ఆయుధాలను తయారు చేయడంలో అత్యంత శ్రద్ధను వహిస్తున్నారు. ఈలాటి నాగరికత నశించినగాని మానవకోటికి తరుణోపాయం లేదు. గాంధీ చిత్రించిన పాశ్చాత్య నాగరికత ఈలాటిది.

దీని ప్రభావం మూలంగానే బ్రిటిష్‌వారు భారతదేశాన్ని జయించి వశపరచుకొనడం జరిగింది. వారి పరిపాలన ప్రభావంచేత భారతీయులుకూడా ఈ నాగరికతను అనుసరించే వారవుతున్నారు. బ్రిటిష్ పరిపాలన తొలగడం అవసరమని గాంధీ భావించడానికి పాశ్చాత్య నాగరికత పట్ల ఆయనకు కలిగిన అభిప్రాయాలే కారణం. భారతీయులకు హాని కలిగించేది బ్రిటిష్‌వారి పరిపాలన కాదు. దానిని కలిగించేది పాశ్చాత్య నాగరికత అనే అభిప్రాయంతో 1915 లో ఆయన స్వదేశానికి వచ్చాడు.

ఈ విముఖత్వమే భారతీయ నాగరికతపట్ల, భారతీయుల ప్రాచీన జీవిత విధానంపట్ల ఆయనకు గల గౌరవాన్ని పెంపొందించింది. భారతీయుల జీవితం నిరాడంబరమైనది. వారికి గల భౌతిక వాంఛలు చాలా తక్కువ. వారిది ఆధ్యాత్మిక దృష్టి, వారి పురుషార్థాలలో ధర్మం మొదటిది. అర్థకామాలు కూడా పురుషార్థాలలో చేర్చబడినా వీటికి ధర్మం ఆధారమని, మోక్షం

లక్ష్యమని వారు భావించారు. అందుచేతనే పాశ్చాత్య నాగరికత కంటె ఇది ఉత్కృష్ట మైనది.

ఈలాటి భావం కలవాడు కావడంచేతనే ఆయన స్వదేశీపట్ల అత్యంత శ్రద్ధ వహించాడు. స్వదేశీ అంటే గ్రామంలోను, రాష్ట్రంలోను. దేశంలోను తయారైన వస్తువులను మాత్రమే వాడడం; భారీ పరిశ్రమలకు బదులు కుటీర పరిశ్రమలను సాగించడం: అవినీతికి అనారోగ్యానికి ఆలయమైన నగర జీవితానికి బదులు గ్రామాలలో జీవించడం; పరాయి మతాలను స్వీకరించుటకు బదులు మన మతాలనే అనుసరించడం; సంప్రదాయ సిద్ధమైన మన పంచాయితీల ద్వారా పరిపాలన కార్యక్రమాలను సాగించడం.

ఈలాటి స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారంచేసి, దేశంలో దానిని ప్రవేశ పెట్టడం అవసరమనే అభిప్రాయంతో 1915లో ఆయన స్వదేశానికి వచ్చాడు. అటు తర్వాత ఆయన కృషికంతకూ ఇది మూలాధారంగా రూపొందింది. ఇంగ్లీషు విద్యాధికులలో ఒక శతాబ్దంగా ఏర్పడిన పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని తొలగించుటకు ఆయన సర్వ ప్రయత్నాలు చేశాడు.

(5) దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు సామాన్య ప్రజలు. వారిలో అనేకులు కూలీలు. కొందరు చిల్లర వర్తకులు. వారిలో అస్పృశ్యులు కూడా అనేకులు ఉండినారు. వీరిలో అనేకులు అక్షరజ్ఞానం లేనివారు. ఈలాంటి సామాన్యులను సుసంఘటితపరిచి, వారిలో జాత్యాభిమానాన్ని ఆత్మ గౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి, సత్యాగ్రహ సమరంలో పాల్గొనేటట్లు గాంధీవారిని మార్చాడు. ఈ సమరంయొక్క ఆఖరు దశలో పురుషులతోపాటు స్త్రీలు కూడా పాల్గొన్నారు. ఇది అంతా గాంధీపై గొప్ప ప్రభావాన్ని వహించింది.

భారతదేశానికి విముక్తి సామాన్యప్రజలు సమరంలో పాల్గొన్నప్పుడే లభించగలదనే విశ్వాసం ఆయనలో ఏర్పడింది. దానిని సాగించుటకు వారికి శక్తి సామర్థ్యాలు ఉండడం ఆయన గ్రహించాడు. స్త్రీలు కూడా అందులో పాల్గొనడం అవసరమనే నిర్ణయానికి ఆయన రావడానికి కూడా దక్షిణ ఆఫ్రికాలోని అనుభవాలే ప్రధాన కారణం. అంతకు పూర్వం రాజకీయ రంగంలో కృషి చేసినవారు సామాన్య ప్రజల సహాయాన్ని అపేక్షించలేదు. తిలక్ కొంత వరకూ ఆలాటి ప్రయత్నం చేశాడుగాని అది భారీ ఎత్తున చేయబడినట్టిది కాదు. అది మహారాష్ట్రానికి మాత్రమే పరిమితమైనట్టిది. సామాన్యంగా రాజకీయాలలో నాయకత్వం వహించిన వారందరు గాంధీకి పూర్వం సామాన్య ప్రజలతో సంబంధం లేనివారు. రాజకీయ ఉద్యమాలలోకి వారిని ఆకర్షించడం ప్రమాదకరమని కూడా భావించారు. వారి సమస్యలను వీరు ఎక్కువగా పట్టించుకొనలేదు. కాని గాంధీ వైఖరి వీరి వైఖరికి పూర్తిగా భిన్నమైనట్టినది. భారతదేశానికి వచ్చిన తర్వాత ఆయన ప్రారంభించిన మూడు సత్యాగ్రహాలు వారి సమస్యల పరిష్కారానికి ఉద్దేశింపబడినవి. సామాన్య రైతుల సహకారంతో ఆయన సహాయ నిరాకరణాది ఉద్యమాలను సాగించాడు. ఆయన నాయకత్వంలో నగరవాసుల కంటె గ్రామీణులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. దాని ఫలితంగా స్వాతంత్ర్యోద్యమం ప్రజల ఉద్యమంగా రూపొందింది.

ఆయనకు పూర్వం కాంగ్రెసు ముస్లిం లీగులు ఎక్కువగా ప్రవేశించనట్టిన్నీ వెనుకబడినవిగా పరిగణింపబడి నట్టిన్నీ బీహారు, గుజరాత్, ఉత్తర ప్రదేశ్‌లలోనే ఆయన

ఎక్కువగా కృషిచేశాడు. ఈ వెనుకబడిన ప్రాంతాలే ఆయన ఉద్యమాలలో ఎక్కువగా సహకరించాయి. ఆయన అనుచర వర్గంలో అదివరకు ప్రసిద్ధిగాంచని రాజేంద్రప్రసాద్, కృపలాని, శంకరలాల్ బ్యాంకర్ మొదలైన యువక తరంవారు ప్రధాన పాత్ర వహించారు. దక్షిణ ఆఫ్రికాలో సామాన్య ప్రజలతో ఆయనకు ఏర్పడిన సన్నిహిత సంబంధమే పై పరిణామాలకంతకూ ప్రధాన కారణం.

(6) దక్షిణ ఆఫ్రికాలో ఆయనకు ముస్లింలతో కూడా దగ్గర సంబంధం ఏర్పడింది. ఒక ముస్లింవర్తకుని ఆహ్వానంమీదనే ఆయన దక్షిణ ఆఫ్రికాకు వెళ్ళినట్లు ఇదివరకే తెలుసుకొన్నాము. ప్రథమ దశలో ఆయన వారి సమస్యలపట్లనే ఎక్కువ శ్రద్ధవహించాడు. వర్తకలై సెన్సులు వారికి సులభంగా లభించేవికావు. అందుకై ఆయన ప్రత్యేక కృషి చేయవలసి వచ్చింది. న్యాయవాది వృత్తిలో వారే ఎక్కువగా ఆయనకు సహాయపడినారు. వారి మసీదుల విషయమైకూడ ఆయన అధికారులతో రాయబారాలు జరపవలసి వచ్చింది. ఈలాటి పరిస్థితుల మూలంగా ముస్లింలకూ ఆయనకూ మధ్య సన్నిహిత సంబంధం ఏర్పడి, ఆయనను వారు నాయకునిగా గ్రహించారు. హిందువులు ముస్లింలు కలసి ఒక జాతివారనే భావం ఆయనలో బలపడింది. వారుకూడ అలాటి భావంతోనే ప్రవర్తించి హిందువులతోపాటు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. ఈలాటి వాతావరణంలో హిందువులు ఒక జాతివారని ముస్లింలు వేరొక జాతివారుఅని అనుకొనుటకు కూడ అవకాశం లేకపోయింది.

దక్షిణ ఆఫ్రికాలో రెండు మతాలవారు ఒక జాతివారనే భావంతోనే కలిసి కృషిచేసినట్లే భారతదేశంలోకూడా వారు కలిసి ఒకేజాతివారుగా కృషిచేయడం సాధ్యమనే భావంతో ఆయన స్వదేశానికి వచ్చాడు. ఈలాగు కృషిచేయడం వాంఛనీయమని, దానికి చారిత్రకములైన అవరోధాలు ఎన్ని ఉండినా వాటిని అధిగమించుటకు సమస్త ప్రయత్నాలు చేయడం కర్తవ్యమని, దాని నిర్వహణకు కంకణం కట్టుకున్నాడు. అందుచేతనే ఆలీసోదరులను నిర్బంధాన నుండి విడుదల చేయించుటకు 1916 నుండి పట్టుదలతో కృషిచేశాడు. ఖిలాఫత్ ఉద్యమంలో హిందువులు ముస్లింలతో కలిసి ప్రభుత్వాన్ని ఎదుర్కొనవలసిందిగా ప్రచారం చేయడమేగాక దానికిగాను ఉభయ మతాలవారు కలిసి సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించే విషయంలో హిందువులలో అనేకుల అంగీకారాన్ని సంపాదించాడు. ఆయన సాగించిన మొదటి సహాయ నిరాకరణోద్యమం ఇందుకుగానే ఆయన ప్రారంభించాడు. ప్రారంభించిన తర్వాతనే పంజాబు దురంతాలకు ప్రతిక్రియ, స్వరాజ్య సంపాదనము ఖిలాఫతుతో జోడింపబడినాయి.

ఆయన జీవితాంతం వరకు హిందూ మహమ్మదీయ ఐక్యత ఆయన సాధించదలచిన ఆశయాలలో అగ్రస్థానం వహించింది. దీనికంతకూ ఆయనకు దక్షిణ ఆఫ్రికాలో కలిగిన అనుభవాలు ప్రధాన కారణం.

(7) దేశ పురోభివృద్ధికిగాను ప్రారంభింపబడిన ఉద్యమాలు ఫలప్రదమగుటకు సామాన్యప్రజల సహకారం అవసరమైనా వారిపై నాయకత్వం వహించదగినవారు సుశిక్షితులైన సత్యాగ్రహులని గాంధీ భావించాడు. ప్రాచీన కాలంలో ఋషులు ఆశ్రమాలను స్థాపించి అలాటి శిక్షణను గరపారు. గాంధి వారి ఆశ్రమ విధానంచేత ప్రభావితుడయ్యాడు. దాని ఫలితంగా దక్షిణ ఆఫ్రికాలో ఫీనిక్సుక్షేత్రం (Phoenix Farm) టాల్స్టాయి క్షేత్రం

(Tolstoy Farm) అనే క్షేత్రాలను స్థాపించాడు. వాటిలో అన్ని కులాలవారు, స్త్రీలు, పురుషులు పిల్లలు కలిసి ఒక సమిష్టికుటుంబంలోని వారివలె ఆయన ఆధ్వర్యంలో జీవితాన్ని సాగించుటకు అలవాటు పడినారు. సత్యాగ్రహ ఉద్యమంలో వారు ప్రధాన పాత్ర వహించారు.

ఈ అనుభవాన్ని ఆధారంచేసుకొని స్వదేశానికి వచ్చినవెంటనే ఆయన అహమ్మదాబాదు నగర సమీపాన సబర్మతీ నదీతీరాన ఒక ఆశ్రమాన్ని స్థాపించాడు. దానికి సత్యాగ్రహ ఆశ్రమం అని పేరుపెట్టాడు. 1915 నుండి భారతదేశంలో ఆయన తలపెట్టిన కార్యక్రమాలలో ఇదే మొదటిది. ఆనాటి ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా అస్పృశ్యులను కూడా ఇందులో చేర్చుకొన్నాడు. దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులలో అస్పృశ్యులు ఎందరో ఉండినారు. వారు కూడా తక్కినవారితో కలిసి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వారిని అంటరాని వారుగా తక్కిన వారు భావించలేదు. హిందూ మతానికి ఒక కళంకంగా ఏర్పడిన అస్పృశ్యతను తొలగించడం తన కర్తవ్యమని ఆయన భావించుటకు ఇది ప్రధాన కారణం. దీనికి మొదటి మెట్టుగా ఆయన వారిని తన ఆశ్రమంలో చేర్చుకొన్నాడు. ఆశ్రమానికి ఆర్థిక సహాయం చేసేవారు దీనిని నిరసించినా వారి నిరసనను ఆయన లక్ష్యపెట్టలేదు.

ఆశ్రమంలోని వారందరు బ్రహ్మచర్యము; జిహ్వాచాపల్యం లేని నిరాడంబర జీవితము, అస్తేయము, అస్వామ్యము, కాయకష్ట జీవితము. ఖద్దరుధారణము మొదలైన నియమాలకు కట్టుడినవారు. వైవాహిక దాంపత్యం పరిమిత సంతానానికి సాధనము మాత్రమేనని ఇంద్రియ లోలత్వమునకు దారితీయరాదని వారు విశ్వసించారు. అట్టివారే ప్రజాసేవకు అర్హులు. ప్రజాసేవలో పురుషులతోపాటు స్త్రీలుకూడా పాల్గొనడం అవసరమని ఆయన భావించాడు. ఆలాటి స్త్రీలు పురుషులు బ్రహ్మచర్యానికి కట్టుబడినప్పుడే స్త్రీలు నిర్భయంగా ప్రజాసేవలో పాల్గొనడం సాధ్యమౌతుంది. అధిక భౌతికవాంఛలు కలవారు ఆడంబర జీవితానికి అలవాటు పడినవారు కష్టపడి ప్రజాసేవ చేయలేరు. అందుచేతనే ఆశ్రమవాసులు నిరాడంబరంగా జీవించ వలసినవారయ్యారు. అస్తేయమనగా దొంగిలించకుండా ఉండడంమాత్రమే కాదు. తన అవసరాలకు మించి ఆదాయాన్ని సంపాదించి కూడబెట్టుకొనడంకూడా దొంగిలించడమే. సమాజంలో కొందరు ఈలాగు చేయడంచేతనే తక్కినవారికి కనీస అవసరాలుకూడా లభ్యం కావడంలేదు. వీరికి చెందవలసిన ధనాన్ని ధనికులు అపహరిస్తున్నారు. అలాగు చేయడం దొంగతనమే. అస్వామ్యం అంటే దేనినీ తనదిగా భావించకుండా ఉండడం. దానిని అనుభవించే హక్కు ఇతరులకు కూడా ఉన్నట్లు గ్రహించడం. ఏలాటి కాయకష్టం చేయక భోగ భాగ్యాలను అనుభవించరాదు అనేది కాయకష్ట నియమానికి ఆధారం. ఖద్దరుధారణం నిరాడంబర జీవితానికి చిహ్నం కావడమేకాక, వృత్తిలేనివారికి వృత్తిని కల్పించే సాధనం. ఈలాటి నియమాలకు లోబడి ఆశ్రమవాసులు జీవించడంచేత వారు ప్రజాసేవ చేయుటకు సత్యాగ్రహంలో నాయకత్వం వహించుటకు అర్హులైనారు. హింసతో కూడిన యుద్ధంలో పాల్గొనే సైనికులకు శిక్షణ అవసరమైనట్లే అహింసతో కూడిన యుద్ధంలో పాల్గొనేవారికి దానికి తగిన శిక్షణ అవసరం అనేది దీనికంతకు ఆధారం.

ఆశ్రమ శిక్షణను పొందకపోయినా కొల్లాయిగుడ్డ కట్టుకొని నిరుపేదవలె దేశ సంచారం చేసిన గాంధియొక్క ప్రభావంచేత లక్షలు సంపాదించుచుండిన మోతీలాల్ నెహ్రూ,

చిత్తరంజనదాసు, టంగుటూరి ప్రకాశం, చక్రవర్తుల రాజగోపాలాచారి మొదలైనవారు వారి వృత్తులను మానుకొని ఖద్దరుదారులై సత్యాగ్రహ సమరంలో పాల్గొన్నారు. కోట్లకొలది ప్రజలు నిరుపేదలై జీవించే దేశంలో కొద్దిమంది సమస్త భోగభాగ్యాలను అనుభవించడం సిగ్గుచేటు అనే భావం వ్యాపించింది. గాంధీ మూలంగా దేశంలో కలిగిన విప్లవాత్మకములగు మార్పులలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది.

ఈ విధంగా 1915 నాటికి సమాజంలో రాజకీయ రంగంతో సహా అన్ని రంగాలలో అన్యాయాలను తొలగించి మార్పులను ప్రవేశపెట్టుటకు సత్యాగ్రహం ఒక్కటే పటిష్ట సాధన మనీ, బ్రిటీష్ సామ్రాజ్య తత్వం తొలగి భారత దేశానికి స్వరాజ్యం లభించవలసి వున్నదనీ, స్వరాజ్యం అంటే ప్రతి వ్యక్తి సత్యాహింసలకు లోబడి తన్ను తాను పరిపాలించుకొనడమనీ, పాశ్చాత్య నాగరికత ప్రపంచానికి ముప్పు తెచ్చేది కావడంచేత అది పూర్తిగా నిర్మూలం కావలసి ఉన్నదనీ, భారతీయులు స్వదేశీపట్ల పూర్తి అభిమానం కలవారై పాశ్చాత్య నాగరికతకు దూరంగా ఉండడమే శ్రేయస్కరమనీ, నాయకత్వం వహించే వారందరు సామాన్య ప్రజల సహకారంతో అలాటి ప్రజల సమస్యల నన్నిటిని పరిష్కరించ పూనుకొనవలెననీ, భారతదేశ విముక్తికి హిందూ ముస్లిం ఐక్యత సాధనమనీ, ఆశ్రమాలలో సుశిక్షితులైనవారే ప్రజలకు నాయకు లగు టకూ సత్యాగ్రహ సమరంలో పాల్గొనుటకూ అర్హులనీ గాంధీ విశ్వసించాడు. ఆయనది ఆధ్యాత్మిక, నైతిక దృక్పథం. లౌకిక సమస్యల పరిష్కారంలో ఆయనకు కలిగిన అనక్తి కంతకూ ఈ దృక్పథమే ఆధారం. ఇందులోనే ఆయనకూ ఇంతకు పూర్వం ఒక శతాబ్దంగా రాజకీయ రంగంలో కృషి చేసినవారికీ గొప్ప భేదం. ఇంత మాత్రంచేత వారి కృషిని తూలనాడవలసింది లేదు. రాజకీయాలు శైశవ స్థితిలో ఉన్నప్పుడు అధికారులకు వినతి పత్రాలను సమర్పించి వారి సహాయాన ప్రజల వాంఛలను సఫలీకృతం చేసుకోవడం ఒకటే పురోగమన సాధనం. గాంధీ సేవారంగాన్ని ప్రవేశించే నాటికి శైశవ దశను దాటి ప్రజలు యవ్వన దశలోకి రాగలిగారు. వారిలో ఆత్మ విశ్వాసం, ఆత్మ గౌరవం వృద్ధి గాంచాయి. అధికారుల సహాయానికై ప్రయత్నించుటకు బదులు స్వయం సహాయంపై ఆధారపడి పురోగమనాన్ని సాధించడం తమ కర్తవ్యంగా వారు భావించారు. గాంధీలో ఈ భావం ఘనీభవించింది. సత్యాగ్రహం దాని ఫలితమే.

తాను కొత్తగా కనిపెట్టి దక్షిణ ఆఫ్రికాలో వినియోగించిన ఈ సాధనాన్ని భారత దేశంలో ఆయన ఏ విధంగా వినియోగించి ఫలితాలను పొందగలిగాడో మనం ఇప్పుడు తెలుసు కొనవలసి ఉంది.

చదువదగిన గ్రంథాలు :

Gandhi: Auto biography, Navajivan.
R. Kumar (Ed): Essays on Gandhian Politics—Essays i, ii and iii, oxford.
Judith M. Brown: Gnadhi's Rise to power., Cambridge.
Erikson: Gandhi's Truth, Faber.
M. Venkatarangaiya, Gandhi's- Gospel of Satyagraha—Bharatiya Vidya Bhavan Bombay.
కొడాలి ఆంజనేయులుగారి తెలుగు అనువాదం :
Vidya Bhavan: History and Culture of the Indian People, Vol. xi.

# అధ్యాయము-2

## గాంధీ తొలి సత్యాగ్రహాలు

### 1

గాంధీ రంగంలో ప్రవేశించునాటికి దేశంలోని రంగాలన్నిటిలో మార్పులు ప్రవేశించ సాగాయి. యుగ యుగాలుగా ఆచార బద్ధమైన సమాజం సంచలనం కలదై మార్పు యుగంలో ప్రవేశించింది. దీనికి తమ పరిపాలనను స్థాపించుకొనుటకు బ్రిటిష్‌వారు ప్రారంభించిన నాటి నుండి వారు స్వప్రయోజనములకై మార్పులు ప్రవేశ పెట్టారు. వీటి ఫలితంగా ప్రజలలోని వివిధ వర్గాల జీవిత విధానంలో మార్పులు రాసాగినాయి. (చూడు గ్రంథం ప్రథమ భాగం).

19వ శతాబ్దంలో భారతీయులు కూడా ప్రభుత్వానికంటె మార్పుల పట్ల ఎక్కువ ఆసక్తిని ప్రదర్శించారు. దీనికి వారు నేర్చిన ఇంగ్లీషువిద్య ప్రధాన కారణం. వారికి పాశ్చాత్య సంస్కృతితోను, చరిత్రతోను, హేతువాదా ధారమైన విజ్ఞాన శాస్త్రంతోనూ పరిచయం లభించింది. ఆ నాటి పాశ్చాత్య చరిత్రలో ప్రాధాన్యం వహించిన జాతీయోద్యమం చేతను, ప్రజాస్వామిక ఉద్యమం చేతను, విప్లవ భావం చేతను వారు ప్రభావితులైనారు. పాశ్చాత్యులవలెనే భారతీయులు కూడా వివిధ రంగాలలో పురోగమించవలెననే ఆశయం వారికి కలిగింది. దీని ఫలితంగా వారు విద్య, మతం, సాంఘిక జీవితం, వార్తా పత్రికలు, వాఙ్మయం, చిత్రకళలు మొదలైన రంగాలలో మార్పులు ప్రవేశపెట్టి వాటి సాధనాన ప్రజల వైఖరిలోను, జీవిత విధానంలోను మార్పులు తేగలిగారు. అంతకు పూర్వం జమీందార్లు, సంపన్నులైన భూస్వాములు. ఉన్నత కులాలకు చెందినవారు సమాజంలో ప్రముఖ వర్గాలుగా ఉండినారు. ఇంగ్లీషు విద్యావ్యాప్తి గాంచడం చేత విద్యాధిక వర్గం ఇంకొక ప్రముఖ వర్గంగా ఏర్పడింది. ఇతర వర్గాలవారు సామాన్యంగా సంప్రదాయ బద్ధులు. వారిది వెనుకచూపు. విద్యాధిక వర్గంవారు ఈలాగుకాక మార్పులను వాంఛించే వారయ్యారు. వారిది ముందుచూపు. (వివరాలకు గ్రంథంలోని రెండవ భాగం చూడవచ్చు).

విద్యాధికులు తలపెట్టిన మార్పు లన్నిటిలో రాజకీయ రంగంలో వారు చేయవలచిన మార్పులు అత్యంత ప్రాధాన్యం వహించాయి. బ్రిటన్‌లోని రాజకీయాలచే ప్రభావితులై వారి వలెనే వీరుకూడా రాజకీయ సంఘాలను స్థాపించారు. ఇవి దేశానికి కొత్త. ప్రథమంలో ఇవి రాష్ట్రాలకు మాత్రమే పరిమితమై ఉండేవి. 1885లో దేశానికంతా వీరు ఒక కేంద్రసంఘాన్ని స్థాపించి దానికి అఖిల భారత జాతీయ కాంగ్రెసు అనే పేరుపెట్టి, తమ కార్యకలాపాలన్నిటినీ దాని ఆధ్వర్యాన సాగించారు. వీరు పరిపాలన విధానంలో అనేక మార్పులు వాంఛించి అందుకై ఆందోళనలను లేవదీశారు. వీరి కార్యక్రమాలన్నీ చట్టబద్ధములయినా వీరి వాంఛలు అధికారులకు రుచించినవి కావు. అందుచేత ప్రభుత్వం ఒక పక్షంగాను, కాంగ్రెసు వంటి

రాజకీయ సంఘాలలో పాల్గొన్నవారు దీనికి ప్రతిపక్షంగాను ఏర్పడినారు. ఈ రెండు పక్షాల మధ్య సంఘర్షణలు తప్పినవి కావు. గాంధీ రంగంలో ప్రవేశించే వరకూ రాజకీయ చరిత్ర ఈ సంఘర్షణ చరిత్రయే.

కాని ఆనాటి విద్యాధికుల రాజకీయాలు అన్ని విధాలా పరిమితములైన రాజకీయాలు. ఇంగ్లీషు విద్యాధికులే వీటిని సాగించేవారు కావడంచేత ఇంగ్లీషు విద్య ఎక్కువగా వ్యాపించిన బెంగాలు, మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలోనే (ఇవి కోస్తా రాష్ట్రాలు) వీటికి ప్రాధాన్యం లభించింది. బ్రిటిష్ పరిపాలనకు పూర్వం మొగలాయీల వంటి వారికి ప్రధాన కేంద్రాలుగా ఉండిన బీహారు, ఉత్తర ప్రదేశ్, పంజాబు మొదలైనవి కాంగ్రెసు రాజకీయాలచే ఎక్కువగా ప్రభావితం కాలేదు. ఈ రాష్ట్రాలలో ఇంగ్లీషువిద్య ఎక్కువగా వ్యాపించక పోవడమే దీనికి కారణం. గుజరాతు, మధ్య పరగణాలు, అస్సాంలు కూడా ఇదే కారణంచేత రాజకీయంగా వెనుకబడి ఉండినవి. 1892 నుండి 1909 వరకూ 19,605 ప్రతినిధులు కాంగ్రెసు సమావేశాలలో పాల్గొన్నారు. వారిలో 3,905 బెంగాలుకు, 4,062 మద్రాసుకు, 4,857 బొంబాయికి చెందినవారు. తక్కిన 6,781 ఇతర రాష్ట్రాలన్నిటి నుండి హాజరైన వారు. దీనిని బట్టి కోస్తా రాష్ట్రాలు రాజకీయంగా పురోగమించి ఉండడం, తక్కిన రాష్ట్రాలు వెనుకబడి ఉండడం స్పష్టమవుతున్నది. ఆ నాటి రాజకీయాలు పరిమితములని భావించుటకు ఇది ఒక కారణం.

ఇంతేగాక ఇంగ్లీషు విద్యాధికులు మాత్రమే అధిక సంఖ్యలో కాంగ్రెసు రాజకీయాలలో పాల్గొంటూ వచ్చారు. వీరు బ్రాహ్మణ, కాయస్థ మొదలైన ఉన్నత కులాలకు చెందినవారు. విద్యలో వెనుకబడిన బ్రాహ్మణేతరులు, క్రింది కులాలవారు, ముస్లింలు, జమీందార్లు (కొన్ని మినహాయింపులకు లోబడి) వర్తకులు మొదలైనవారు కాంగ్రెసు రాజకీయాలకు దూరంగా ఉండడం తప్పింది కాదు. ఇది కూడా ఆనాటి రాజకీయాలకు ఒక పరిమితత్వాన్ని కల్పించింది.

1905 లో ముస్లింలు తమ ప్రయోజనాల నిమిత్తం ముస్లింలీగు అనే ప్రత్యేక సంస్థను స్థాపించారు. కాని ఇందులో భూస్వాములు మాత్రమే ప్రాధాన్యం వహించారు. కాలక్రమాన ఇంగ్లీషు విద్య నభ్యసించిన లాయర్లు వార్తాపత్రికా సంపాదకులు (జిన్నా, అలీ సోదరుల వంటివారు) అందులో ప్రవేశించారుకాని అందులో కూడా రైతులకూ కార్మికులకూ తదితర సామాన్య ప్రజానీకానికీ స్థానంగాని ఆసక్తిగాని లేకపోయింది. లీగు కూడా కాంగ్రెసు మోస్తరుగానే పరిమిత రాజకీయాలకు కేంద్రంగా కృషి చేసింది.

ఇంకొక విధంగా కూడా ఆనాటి రాజకీయాలు పరిమిత రాజకీయాలుగా ఏర్పడినాయి. కాంగ్రెసులోను లీగులోను చర్చకు వచ్చిన విషయాలన్నీ విద్యాధికుల ప్రయోజనాలకు మాత్రమే ఎక్కువగా సంబంధించి నట్టివి. ఉన్నత ఉద్యోగాలు, శాసన సభలను విస్తృత పరచడం, వాటిలో భారతీయులకు ఎక్కువ సంఖ్యలో ప్రవేశం కల్పించడం, ఇతర రాజకీయ సంస్కరణలు—ఇవి అన్నీ ఈలాటివి. రైతులు, కార్మికులు, దళిత వర్గాలవారి సమస్యల గురించి అప్పుడప్పుడు కొన్ని తీర్మానాలు చేయబడినా వీటిని గురించి రాజకీయ నాయకులు ఎక్కువగా ఆందోళన సాగించినవారు కారు. దేశంలో అధిక సంఖ్యాకులు రైతులు మొదలైన వారే.

వ్యవసాయం, కుటీర పరిశ్రమలు, గ్రామ ప్రాంతాల పునర్నిర్మాణం మొదలైన వాటిలో పురోగమనం జరిగితేగాని వీరి స్థితిగతులు చక్కబడవు. కాని ఆనాటి రాజకీయాలలో వీటిపట్ల శ్రద్ధ చాలా స్వల్పం.

గాంధీకి ఈలాటి పరిమిత రాజకీయాలలో ఆసక్తి లేదు. రైతులు, కార్మికులు, గ్రామీణులు మొదలైన వారి స్థితిగతులను చక్కబరచడమే ఆయన లక్ష్యం. అందుచేత ఆయన దృక్పథం అంతకు పూర్వం రాజకీయ రంగంలో కృషి చేసిన గోఖలే, ఫిరోజ్‌షా మెహతా, మదన్‌మోహన్ మాళవ్యా, సురేంద్రనాద్ బ్యానర్జీ, తిలక్ మొదలైన వారి దృక్పథానికంటె భిన్నమైనట్టిది. ఇంతే కాదు. ఆయన పాశ్చాత్య నాగరికతను ఇంగ్లీషు విద్యా విధానాన్ని పూర్తిగా ఖండించాడు. వారు వీటిని చాలా వరకు సమర్థించే వారు. పాశ్చాత్య నాగరికతలో కొన్ని లోపాలు ఉండినా భారతీయులు పురోగమించుటకు అది ఒక ప్రధాన సాధనమని భావించిన వారు. ఆనాటి విద్యావిధానం పట్లకూడా వారి అభిప్రాయం ఈలాటిదే. గాంధీ ఆలాగు కాక, విద్య మాతృభాషల ద్వారా నేర్చుకొనవలసినదిగాను, విద్యలో ఆధ్యాత్మిక నైతిక విలువలకు ప్రధాన స్థానం ఉండవలసినదిగాను, అది వ్యవసాయం, కుటీర పరిశ్రమలు, ఇతర వృత్తులతో సన్నిహిత సంబంధం కలదిగా ఉండవలసినట్లుగాను భావించాడు. తన ఆశ్రమంలో ఈలాటి విద్యనే ప్రవేశ పెట్టాడు. ఆనాటి విద్యావిధానం మూలంగా విద్యాధికులకూ సామాన్య ప్రజలకూ మధ్య ఒక అఖాతం ఏర్పడినదనీ, దానిని పూరించుటకు మాతృభాష ద్వారా అన్ని స్థాయిలలో విద్యను నేర్చుకొనడం ఏకైక సాధనమనీ భావించాడు. ఇందులో కూడా ఆనాటి రాజకీయ నాయకులకూ గాంధీకీ మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడినాయి.

వారందరు చట్టబద్ధమైన ఆందోళన ఒక్కటే రాజకీయ పురోగమనానికి సాధనంగా భావించారు. ఇది నిష్ఫలమైనా దీనికి భిన్నమైన ఇంకొకసాధనం వారు కనిపెట్టలేక పోయినారు. కాని గాంధీ ఆలాగు కాక సత్యాగ్రహం అనే శాంతియుత సాధనాన్ని కనిపెట్టి, దానిని దక్షిణ ఆఫ్రికాలో ఫలప్రదంగా వినియోగించి, భారతదేశంలో కూడా దానిని వినియోగించుటకు కృతనిశ్చయుడైనాడు. ఇది అప్పటి రాజకీయ నాయకులకు ఎంత మాత్రం అంగీకార యోగ్యం కాలేదు. ఇది దౌర్జన్యానికి దారి తీసే విధానమనేది వారి అభిప్రాయం. ఈలాటి వానితో సన్నిహిత సంబంధం కుదుర్చుకొనడం ప్రమాదకరమనే భావం వారిలో నాటుకొన్నది. 19.5 మొదలు 1920 వరకూ వారి దారి ఒకటిగాను, గాంధీ నడిచిన దారి ఇంకొకటిగాను ఉండుటకు ఇది ఒక ప్రధాన కారణం.

ఇదిగాక ఆయనది ఆధ్యాత్మిక నైతికదృష్టి. ప్రజలు ఆధ్యాత్మికంగాను నైతికంగాను పురోగమించడమే ఆయన వాంఛించిన మార్పు. ఇది జరిగిన పక్షంలో స్వరాజ్యం తనంతట అది వచ్చి తీరుతుందనేది ఆయన విశ్వాసం. ఆయన ఆశ్రమ జీవిత విధానం ఇందుకుగాను ఉద్దేశింపబడినది. ఆశ్రమంలో కాయకష్టంతో కూడిన నూలు వడకడము, కుటీర పరిశ్రమలు కొన్నిటిలో ఆశ్రమవాసులు కాలాన్ని వినియోగించినా వీటి ప్రధానోద్దేశం నైతిక లక్ష్యసాధన. ఆయన ఆధ్యాత్మిక జీవితమే సామాన్య ప్రజలను ఆకర్షించింది. తక్కిన రాజకీయ నాయకులకు లభించని ప్రజాదరణ ఆయనకు లభించుటకు ఇదే ప్రధాన కారణం. ఆయన దైవభక్తి, ఉపవాస వ్రతాలు, సత్యాహింసలపట్ల ఆయనకుగల విశ్వాసం, వారిని ముగ్ధులుగా చేశాయి. ఆయన ఒక

అవతార పురుషుడని, మానవుల ఉద్ధరించుటకు భగవంతుడే గాంధీగా జన్మించాడని వారు భావించసాగారు. విద్యాధికులందరికి ఇది ఒక మూఢనమ్మకంగా కనిపించింది. ఇది మూఢ నమ్మకమే కావచ్చు. కాని భారతీయులకు—వారిలో ప్రధానంగా హిందువులకు—ప్రకృతి సిద్ధమైన లక్షణం. గాంధీ వారిని చక్కగా అర్థం చేసుకొన్నాడు. కొల్లాయగుడ్డ కట్టుకొని వారి మధ్య సంచారం చేశాడు. ఆహారంలో కఠిన నియమాలను పాటించాడు. రైళ్ళలో మూడవక్లాసులో ప్రయాణం చేయుటకు అలవాటు పడినాడు. మాలమాదిగల వాడలకు వెళ్ళి వారితో కలిసి నివాసంచేశాడు. "మానవులందరు సోదరులు, అందరూ భగవంతుని సంతాన" మనే విశ్వాసంతో ప్రవర్తించాడు. ఆయన ఆలోచనలకూ మాటలకూ చేతలకూ మధ్య ఏలాటి భేదం లేదు. మాటలకంటే చేతలకే ఆయన ఎక్కువ ప్రాధాన్యం కల్పించాడు. జీవితానికి త్రికరణ శుద్ధి లక్షణంగా ఉండవలెననేది ఆయన జీవిత విధానానికి ఆధారం. ప్రజల ఐహిక సౌఖ్యాన్ని ఆయన విస్మరించలేదు. ఆయన తలపెట్టిన కార్యక్రమాలన్నీ దానికి సాధనాలు. దారిద్ర్య నిర్మూలనం ఆయన ఆశయం. వ్యవసాయం, పశుపోషణ, కుటీర పరిశ్రమలు, స్వదేశీ—ఇవే దానికి సాధనాలని ఆయన భావించాడు. ఈ సాధన సముదాయానికి నిర్మాణ కార్యక్రమమని ఆయన పేరుపెట్టాడు. నైతికజీవితంతో దీనిని జోడించాడు. వీటి అన్నిటి ప్రభావంచేత ఆయన సామాన్యప్రజలచే నాయకుడుగా గుర్తించబడినాడు.

రాజకీయనాయకులకు ఆయన ఒక వింత మనిషిగా కనుపించాడు. శ్రీనివాసశాస్త్రి వంటివాడు ఆయన బనియావేషాన్ని, నుదుటిలో గంధపుబొట్టును, కుంకుమబొట్టును, పాలను కూడా వర్జించి వేరుశనగ మొదలగు గింజల ఆహారాన్ని తినడం ఒక విధంగా 1915 లో హేళన చేశాడు. ఈలాటివాడు ప్రజలకు నాయకుడు కావడం స్వప్నతుల్యమని భావించాడు.

గాంధికి గోఖలే రాజకీయరంగంలో గురువుస్థానంలో ఉండేవాడు. కాని గోఖలే కూడా గాంధీ భారత రాజకీయాలలో ప్రవేశించడం, సత్యాగ్రహ సాధనాన్ని వినియోగించుటకు పూనడం ప్రమాదకరమని భయపడి ఒక సంవత్సరకాలం రాజకీయాలలో ప్రవేశించరాదనీ, రాజకీయాలపట్ల మౌనవ్రతం ధరించవలసిందనీ, దేశాటనంచేసి రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకొనవలసిందనీ సలహాఇచ్చాడు. గోఖలే స్థాపించిన భారతసేవకుల సంఘంలో (Servants of India Society) సభ్యత్వాన్ని గాంధీ కాంక్షించాడు. కాని ఒక సంవత్సరం తర్వాతనే దానికిగాను ప్రయత్నం చేయవలసిందిగా గాంధీని కోరాడు. దక్షిణ ఆఫ్రికాలో ఆయన వహించిన పాత్రకారణంగా గాంధీపట్ల గోఖలేకూ తక్కిన భారతీయ నాయకులకూ గొప్పగౌరవం ఉండినా ఆయన భారత రాజకీయాలలో ప్రవేశించడంవల్ల భయ సందేహాలు కలవారయ్యారు.

గోఖలే 1915 ఫిబ్రవరిలో కాలధర్మం పొందినాడు. అయినా ఆయన సలహామేరకు గాంధీ 1915 లో దేశంలోని నలుమూలలలో సంచారంచేసి పరిస్థితులను అవగాహన చేసుకొన్నాడు. రాజకీయాల గురించి ఏ సభలలోను మాట్లాడలేదు. విద్యార్థుల సభలలోను, వర్తకుల సభలలోను, లాయర్ల సమావేశాలలోను ప్రసంగించాడు గాని ప్రజల దారిద్ర్య నిర్మూలనం, స్వదేశీ, నిరాడంబర జీవితం....ఇవే ఆయన ప్రసంగాలలోని విషయాలు. 1915లో కాంగ్రెసు సమావేశానికి హాజరైనా వలసరాష్ట్రాలలోని భారతీయుల గురించి మాత్రమే ప్రసంగించాడు.

1916 లో కూడా రాజకీయాల గురించి ఎక్కువగా పట్టించుకోలేదు. హిందూ విశ్వ విద్యాలయ ప్రారంభోత్సవంలో బిసెంటు ఆహ్వానం కారణంగా పాల్గొన్నాడు. కాని ఏలాటి మొగమాటం లేక సంస్థానాధీశుల సమక్షంలో వారి ఆడంబర జీవితాన్ని ఖండించాడు. ఇంతే కాదు. అధికారులను హత్యలుజేసే విప్లవవాదుల ప్రవర్తన ఖండించదగినదైనా వారి దేశాభిమానం ప్రశంసింపదగినదని చెప్పగా బిసెంటు కుపితురాలై ప్రసంగాన్ని ఆపివేయవలసిందిగా కోరింది. ఆయన వెంటనే కూర్చుండి తాను శాంతిమార్గాన్ని గురించి చెప్పదలచిన మాటలను చెప్పలేకపోయినందుకు చాలా విచారించాడు. ఇది మొదలు గాంధీ బిసెంటుల మధ్య సుహృద్భావం దెబ్బతిన్నది. 1916 ఆఖరున లక్నోలో జరిగిన ముస్లింలీగు సమావేశానికి హాజరైనాడు. కాని అందులో ఆయన హిందువులు మహమ్మదీయులు ఐక్యభావంతో కృషిచేయవలసిన అవసరాన్ని గురించి మాత్రమే ప్రసంగించాడు. కాంగ్రెసు సమావేశానికి కూడా హాజరై దక్షిణ ఆఫ్రికావంటి వలసరాష్ట్రాలలో కాంట్రాక్టు కూలీ విధానం రద్దుకావలెననే తీర్మానాన్ని ప్రతిపాదించాడు. ఇతర రాజకీయ తీర్మానాలపట్ల శ్రద్ధచూపలేదు. కాంగ్రెసులో ఎక్కువగా పాల్గొనడమంటె ఏదో ఒక పార్టీతో సంబంధం కల్పించుకొనడమేనని, అది తన వ్యక్తిత్వానికీ, సామాన్య ప్రజల సేవకూ ప్రతిబంధకం కాగలదని ఆయన భావించాడు.

దీనికి రెండు మూడు మినహాయింపులు మాత్రమే ఉన్నట్లు చెప్పవచ్చు. కాంట్రాక్టు కూలీలపద్ధతిని రద్దుచేయని పక్షంలో తాను సత్యాగ్రహానికి సిద్ధంగా ఉన్నట్లు అధికారులకు తెలియపరచాడు. వారు కొంత భయపడి 1917 ఆఖరులోపుగా దానిని రద్దుచేయునట్లు హామీ ఇవ్వగా ఆ ప్రయత్నాన్ని విరమించాడు. ఈ పద్ధతి 1917 లో రద్దు చేయబడింది. 1916 లో ఆలీసోదరులు యుద్ధకాలంలో టర్కీపట్ల సానుభూతిని చూపినందుకు నిర్బంధంలో ఉంచబడినారు. గాంధీకి ముస్లింలపట్ల ప్రత్యేక అభిమానం వుండడంచేత వారి విడుదలకుగాను రాష్ట్రపతితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు. 1917 లో గుజరాతు సభకు అధ్యక్షుడుగా ఉండుటకు అంగీకరించి కాంగ్రెసు లీగు పథకాన్ని గ్రామాలలో ప్రచారం చేశాడు. ఆసంవత్సరం నవంబరులో జరిగిన గుజరాతు సమావేశానికి అధ్యక్షుడై కార్యక్రమమంతా గుజరాతిభాషలో జరగవలసిందిగా పట్టుపట్టి విజయాన్ని సాధించాడు. ప్రజల సమస్యల గురించి తీర్మానాలు చేయించి గ్రామ ప్రాంతాలలో వాటినిగురించి ప్రచారాన్ని సాగించాడు. ఇవితప్ప 1915-17లలో రాజకీయాలలో ఆయన శ్రద్ధవహించలేదు.

రాజకీయ నాయకులతో ఆయన సన్నిహిత సంబంధం పెట్టుకొనలేదు. వారు కూడా ఆయనపట్ల అలాటి వైఖరినే ప్రదర్శించారు. భారత సేవకుల సంఘంలో (Servants of India Society) సభ్యత్వానికి ఆయన పెట్టుకొన్న దరఖాస్తును దాని అధ్యక్షుడు శ్రీనివాసశాస్త్రి ఇతర కార్యకర్తలు నిరాకరించారు. సత్యాగ్రహంతో కూడిన ఆయన రాజకీయభావాలు వారికి రుచించలేదు. తిలక్ గొప్ప దేశాభిమానిగా ఆయన భావించినా పరోక్షంగా దౌర్జన్యాన్ని పురికొల్పిన నాయకుడనే భావం ఆయనకు కలిగింది. అందుచేత ఆయనతో సాన్నిహిత్యం పెట్టుకొనలేదు. ఈ విధంగా రెండు సంవత్సరాల కాలం గడపిన తర్వాత రైతులకు సేవజేయుటకు బీహారులోని చంపరాన్ జిల్లాలో ఆయనకు అవకాశం కలిగింది. దానిని పురస్కరించుకొని మొదటిసారిగా భారతదేశంలో ఆయన సత్యాగ్రహ సాధనాన్ని వినియోగించాడు. **దీనితో భారత దేశంలోని ఆయన జీవితంలో మొదటిఘట్టం ముగిసి రెండవ ఘట్టం ప్రారంభమైంది.**

# 2

చంపరాన్ బీహారు రాష్ట్రపు ఉత్తర ప్రాంతంలోని జిల్లా. ఇందులోని గ్రామాలు జమీందార్లకు చెందినవి. కాని వారు ప్రత్యక్షంగా రైతులతో సంబంధం పెట్టుకొనుటకు బదులు వాటిని ఇతరులకు కౌలుకు ఇచ్చి కౌలుదార్ల నుండి శిస్తులు వసూలు చేయసాగారు. ఈ కౌలుదార్లలో అధికసంఖ్యాకులు నీలిమందు తోటలకు యజమానులైన తెల్లవారు. రైతులపై యావత్తు అధికారం వీరిదే. సివిల్ క్రిమినల్ వ్యవహారాలను పైసలు చేయుటకు కోర్టులు ఉండినా చట్టవిరుద్ధంగా వీరే వాటిని పరిష్కరించేవారు. తప్పనిసరిగా తమ సాగులో ఉన్న భూములలో మూడవ వంతులో నీలిసాగు చేయవలసిందిగా వీరు రైతులను నిర్బంధించేవారు. నీలిపంట ధరలను వీరే నిర్ణయించి రైతులకు గిట్టుబాటుకాని ధరలను చెల్లించేవారు. కృత్రిమ నీలిమందు రసాయన శాస్త్ర సహాయాన పాశ్చాత్య దేశాలలో తయారుచేయడం ప్రారంభమైన తర్వాత భారతదేశపు నీలిమందుకు గిరాకి తగ్గి ధరలు పడిపోయినవి. ఆ పరిస్థితులలో తోట యజమానులు రైతులు చెల్లించవలసిన శిస్తులను విపరీతంగా పెంచారు. శిస్తులు కాక అనేక సెస్సులనుకూడా వసూలుచేయడం పరిపాటిగా ఉండేది. గ్రామాలలోని బందెల దొడ్డులన్నీ వీరి వశంలోనే ఉండడంచేత రైతులను పీడించుటకు ఇది కూడా ఒక సాధనమైంది. జిల్లా బోర్డులలోను తాలూకా బోర్డులలోను వీరే సభ్యులగుటచేత వీరి నిరంకుశాధికారానికి ఇది కూడా తోడ్పడింది. వీరు తెల్లవారు కావడంచేత అధికారులు వీరిపై ఏలాటి చర్యలను తీసుకొనేవారు కారు. రైతులను గ్రామాలను పేరునకు మాత్రమే ప్రభుత్వం పరిపాలించేదిగాను వాస్తవ పరిపాలనను తోట యజమానులు సాగించేవారుగాను ఏర్పడింది.

విద్యలో బీహారు రాష్ట్రము, అందులో చంపరాన్ జిల్లా చాలా వెనుకబడి ఉండిన కారణంగా కాంగ్రెసు ప్రభావం ఈ ప్రాంతాలకు వ్యాపించలేదు. పాట్నావంటి ప్రధాననగరం లోనివారు కొందరు మాత్రమే కాంగ్రెసు సమావేశాలలో పాల్గొంటూవచ్చారు. కాని వారెవ్వరూ రైతులు అనుభవించే కష్టాలను గురించి ఆలోచించలేదు. రైతుల పక్షం వహించినవారు కొందరు రాష్ట్రశాసనసభలో దీనిని గురించి ఒకటి రెండు పర్యాయాలు ప్రస్తావించినా ప్రభుత్వం వారి మాటలను పెడచెవిలో పెట్టింది. ప్రపంచ సంగ్రామ ఫలితంగా చంపరాన్ రైతుల కష్టాలు మరింత దుర్భరమైనాయి. వారి గోడులను ఆలకించే వారెవ్వరు లేకపోయారు.

ఈలాటి పరిస్థితులలో వారిలో ఒకడైన రాజకుమార్ శుక్లా 1916 ఆఖరున లక్నో కాంగ్రెసు సమావేశానికి వచ్చిన గాంధీని కలుసుకొని రైతులకు జరుగుచుండిన అన్యాయా లన్నిటిని వివరించి, వారికి సహాయము చేయవలసిందిగా అర్థించాడు. గాంధీ దానికి వెంటనే సమ్మతించలేదు. కాని శుక్లా పట్టుబట్టి ఆయన ఎక్కడికి వెళ్ళితే అక్కడికి తానూ వెళ్ళుతూ ఆఖరుకు ఆయనను ఒప్పించాడు. రైతుల ఇబ్బందులు ఏవో తెలుసుకొని వాటిని తొలగించే ఉద్దేశంతో 1917 ఏప్రిలులో చంపరాన్ ప్రధాన నగరమైన మోతిహారీకి వచ్చాడు.

ఆయన ప్రతి విషయాన్ని అందరి దృక్పథాలనుండి క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాతనే ఏదో ఒక నిర్ణయానికి వచ్చేవాడు. అందుచేత వెంటనే తోట యజమానులను అధికారులను కలుసుకొని రైతుల వాస్తవ పరిస్థితి ఏలాటిదో తెలుసుకొనుటకు తాను ఉద్దేశించినట్లు వారికి తెలియపరచాడు, ఇది ఒక ఆందోళనకు కారణం కాగలదనే భావంతో జిల్లా అధికారులు తామే

రైతుల ఇబ్బందులను తెలుసుకొని వాటిని తొలగించుటకు చర్యలు తీసుకొనుటకు సిద్ధంగా ఉన్నట్లును, ఆయన గ్రామాలలో పర్యటించి వాటిని తెలుసుకొనవలసిన అవసరం లేదనీ ఆయనకు నచ్చజెప్ప ప్రయత్నించారు; కాని స్వయంగా వాస్తవ సమాచారాన్ని సేకరించినగాని తనకు యదార్థం తెలియజాలదనీ, ఈ విషయంలో ఇతరుల అభిప్రాయాలపై ఆధార పడడం తనకు అంగీకారం కాదనీ, ఆయన వారికి స్పష్టం చేశాడు. దానిపై వారు ఆయన వెంటనే చంపరాన్ జిల్లానుండి వెళ్ళిపోవలసినదిగా ఉత్తరువులు జారీచేశారు.

కాని ఉత్తరువులను ఉల్లంఘించుటకు ఆయన నిర్ణయించుకొన్నాడు. ఇక్కడ ఆయన వినియోగించిన సత్యాగ్రహ సాధనం యిదే. ఉత్తరువులు ఉల్లంఘించినందుకు వారు ఆయనను విచారణ చేసి శిక్ష విధించుటకు సమకట్టారు. వారు జారీచేసిన ఉత్తరువులు న్యాయ విరుద్ధములనీ. ఏ పరిస్థితులలో కూడా వాటికి తాను లొంగడం లేదనీ, దాని ఫలితంగా ఏలాటి శిక్షను విధించినా దానిని అనుభవించుటకు సిద్ధంగా వున్నాననీ ఆయన వారికి ఘంటాపథంగా తెలియపరచాడు. ఇంతకుపూర్వం వారిఎదుట ఈలాగు ఎవరూ ప్రవర్తించలేదు. అందుచేత గాంధీ ప్రవర్తన వారిలో విస్మయాన్నీ, భయాన్నీ కలిగించింది. వారు విచారణను వాయిదావేసి, రాష్ట్రప్రభుత్వానికి విషయాన్నంతా తెలియపరచారు. ప్రభుత్వంవారు జిల్లా అధికారుల చర్య చట్టవిరుద్ధమనీ, గాంధీపై ఏలాటి చర్యను తీసుకొనరాదని ఆదేశించారు. కేసు ఉపసంహరించ బడింది. సత్యాగ్రహం విజయవంతమైంది.

అటు తర్వాత గాంధీ కొందరి అనుచరుల సహాయంతో గ్రామాలలో పర్యటించి రైతులనుండి వాఙ్మూలాలు తీసుకొని వారి వాస్తవ పరిస్థితిని చాలావరకు తెలుసుకొన్నాడు. కాని ఆయన గ్రామాలలో తిరగడం రాష్ట్రప్రభుత్వానికి అంగీకారం కాలేదు. ఇంతకు పూర్వం జిల్లా అధికారులు భావించినట్లే వారు ఆయన జిల్లాలో ఉండడం ప్రమాదకరమని భావించి దేశ రక్షణ చట్టంక్రింద ఆయనను జిల్లానుండి వెళ్ళగొట్టదలచి ఢిల్లీలోని అధికారుల అనుమతిని కోరారు. అప్పటికి గాంధీ ఢిల్లీ అధికారులకు తాను చంపరాన్‌కు ఏ ఉద్దేశంతో వచ్చిందీ తెలియపరచాడు. రైతుల పరిస్థితులను గురించి నిష్పక్షపాతంగా విచారణ చేయుటకు ఒక కమిషన్‌ను నియమించవలసిందిగా కూడా కోరాడు. ఢిల్లీ అధికారులు ఆయన కోరిక సహేతుక మైనదని భావించారు. ఆయనపై ఏలాటి చర్యను తీసుకొనరాదని, కమిటీ ఒక దానిని నియమించవలసిందిగాను, అందులో ఆయననుకూడా సభ్యునిగా నియమించవలసిందిగాను ఆదేశించారు. దానికి తలయొగ్గి బీహారు ప్రభుత్వం ఆలాటి కమిటీని నియమించింది. గాంధీ అందులో సభ్యుడయ్యాడు. కమిటీ పూర్తిగా విచారణచేసి, నీలిమందు యజమానులు రైతుల పట్ల అన్యాయంగా ప్రవర్తిస్తున్నారని, అన్యాయాలను తొలగించుటకు కొన్ని చర్యలను ప్రభుత్వం తీసుకొనడం ఉచితమనీ, ఒక నివేదికను ఏకగ్రీవంగా సమర్పించింది.

కమిటీ సూచనలకు అనుగుణంగా ప్రభుత్వం ఒక చట్టాన్ని చేసి, నిర్బంధ నీలి సాగును రద్దు చేసింది; రైతులు యజమానులకు చెల్లించవలసిన శిస్తును తగ్గించింది. చట్ట విరుద్ధంగా వారు వసూలుచేసే పెన్నులను రద్దుచేసింది. రైతులు కాంక్షించిన సదుపాయాలన్నీ వారికి లభించకపోయినా వారిబాధలు చాలావరకు తొలగిపోయినవి. ఈ విధంగా గాంధీ విని యోగించిన తొలి సత్యాగ్రహం విజయవంతంగా ముగిసింది.

ఈ సత్యాగ్రహం గాంధీ జీవితంలోను భారత దేశచరిత్రలోను ఒక ప్రధాన ఘట్టంగా పేర్కొన తగినట్టిది. ఈ సత్యాగ్రహం మూలంగా గాంధీకి అఖిలభారత ప్రఖ్యాతి లభించింది. నిరంకుశులైన బ్రిటిష్ అధికారులను ఎదుర్కొని తన నైతిక బలంతోను పట్టుదలతోను తన ఉద్దేశాన్ని కొనసాగించ గలిగాడు. ఇంతటి విజయాన్ని సాధించిన కారణంగా ఆయన అన్ని రాష్ట్రాలలోని నాయకులయొక్కయు ప్రజలయొక్కయు దృష్టిని ఆకర్షించాడు. దేశానికి ఏకైక నాయకుడుకాగల అర్హత ఆయనకు ఉన్నదనేభావం వ్యాపించింది.

ఇంతవరకూ సత్యాగ్రహం అనేది ఒక సిద్ధాంతంగా ఉండినది. అది దక్షిణ ఆఫ్రికాలో ఫలప్రదమైనా అనేక విభేదాలతో కూడుకొన్న ప్రజలుగల భారత దేశంలో విజయవంతం కాగలదా అనే సందేహం అందరికి కలిగిఉండినది. చంపరాన్ సత్యాగ్రహం ఈ సందేహాన్ని తొలగించింది. చట్టబద్ధమైన చర్యలు ఫలప్రదం కానప్పుడు ప్రజలు నిస్సహాయులై చేతులు ముడుచుకొని కూర్చుండవలసిన అవసరం లేదనీ, సత్యాగ్రహం అనే సాధనం వారి అందుబడిలో ఉన్నదనీ; దానిని వినియోగించి అధికారులను లొంగదీసి తమ వాంఛలను సఫలీకృతం చేసుకోవడం సాధ్యం కాగలదనే విశ్వాసం ప్రజలకు కలిగింది. ప్రాచీనకాలంలో అన్ని అస్త్రాలు విఫలములైనప్పుడు తపస్సంపన్నులైన యోగులు బ్రహ్మాస్త్రాన్ని ఉపయోగించే వారని ప్రతీతి. ఆధునిక యుగంలో సత్యాగ్రహం అలాటి ఆచరణసాధ్యమైన ఉత్తమ అస్త్రమనే భావం బీహారు ఉదంతాల ఫలితంగా ఏర్పడింది.

ఇది మొదలు బీహారులోని రైతులు, ఇతర సామాన్య ప్రజానీకము గాంధీపట్ల పరమభక్తి గలవారై, ఆయనను అనుసరించుటకు సిద్ధపడ్డారు. సామాన్య ప్రజల సహకారంతోనే భారతదేశానికి విముక్తి కలుగగలదనేది గాంధీ విశ్వాసం. చంపరాన్ సత్యాగ్రహ ఫలితంగా బీహారులోని ప్రజలు గాంధీకి అనుచరులైనారు. భవిష్యత్తులో ఆయన సాగించిన ఉద్యమాలన్నిటిలో వారు ఆయనకు సహాయపడినారు. ఇదివరకు కాంగ్రెసు రాజకీయాల దృష్ట్యా చాలా వెనుకబడినట్లుగా భావింపబడిన రాష్ట్రం నూతన చైతన్యంతో పురోగమించసాగింది. రైతుల మానసికతత్వం మారింది. అధికారులను చూచి భయపడవలసిన అవసరంలేదని వారు గ్రహించారు.

చంపరాన్ సత్యాగ్రహ సందర్భంలో గాంధీ ఆనాటి అఖిలభారత సంస్థలైన కాంగ్రెసు, ముస్లింలీగు, హోంరూల్ లీగ్‌లతో ఏలాటి సంబంధమూ పెట్టుకొనలేదు. వాటి సహాయాన్ని అపేక్షించక స్వతంత్రంగా వ్యవహరించాడు. ఇదివరకు రాజకీయ రంగంలో కృషిచేసినవారి సహకారాన్ని కూడా అపేక్షించలేదు. తనకు కావలసిన అనుచరుల నందరినీ తానే ఎన్నుకొన్నాడు. వీరు ఆనాడు ఉన్నతస్థాయికి చెందిన నాయకులుకారు. మధ్య స్థాయికి చెందినవారు. రాజేంద్రప్రసాద్, కృపలాని మొదలైనవారు ఈ సందర్భంలోనే ఆయనకు శిష్యులైనారు. భవిష్యత్తులో ఆయనకు సహాయపడినవారు వీరే. వీరే క్రమక్రమంగా అఖిలభారత నాయకులయ్యారు. చంపరాన్ సత్యాగ్రహం ఈలాటి అనుచరవర్గాన్ని ఆయనకు లభింపజేసింది.

రైతుల ఇబ్బందులను తొలగించడంతో ఆయన తృప్తిగాంచలేదు. అనుచరులను గ్రామాలకు పంపి, ప్రాథమిక విద్యావ్యాప్తికి, అస్పృశ్యత నివారణకు, హిందూ మహమ్మ

దీయ ఐక్యతకు కృషిచేయవలసిందిగా ఆదేశించాడు. వారు ఈ నిర్మాణకార్యక్రమాన్ని కొంత వరకు సాగించారు. ప్రజల కర్తవ్యం ప్రభుత్వాన్ని ఎదుర్కొని ఏవో కొన్ని ప్రయోజనాలను సంపాదించడము మాత్రమే కాదు. వారు స్వయంగా కృషిచేసి తమపరిస్థితిని చక్కపరచుకొన వలెననీ, అదే వాస్తవమైన స్వరాజ్యమనీ గాంధీ భావించాడు. ఆ భావానికి అనుగుణంగా చంపరాన్‌లో కార్యక్రమాలను సాగించాడు. రాజకీయాలకంటె స్వయంసహాయంతో ఈలాటి పరివర్తన ప్రజలలో రావడమే ఆయన లక్ష్యం. దాని సాధనకు చంపరాన్‌లో ప్రథమ ప్రయత్నాలు చేశాడు.

ఈ విధంగా చంపరాన్ సత్యాగ్రహం ఆయన జీవితంలోను దేశ చరిత్రలోను ప్రాధాన్యం వహించింది. ఇది క్రమక్రమంగా కాంగ్రెసు దృక్పథాన్ని కూడా మార్చి 1920 లో ఆయన నాయకత్వాన సహాయ నిరాకరణోద్యమానికి పురికొల్పింది.

## 3

గాంధీ గుజరాత్ రాష్ట్రంలో పుట్టిపెరిగినవాడు. ఆయన మాతృభాష గుజరాతి. ఆయనకు ఆ రాష్ట్రంపట్ల ప్రత్యేక అభిమానం ఉండడంలో ఆశ్చర్యపడవలసింది లేదు. అందు చేతనే ఆయన దక్షిణ ఆఫ్రికానుండి స్వదేశానికి వచ్చినతర్వాత గుజరాత్‌కు ప్రధాననగరమైన అహమ్మదాబాదు సమీపాన తన సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించి అందులో స్థిరనివాసియై తన కార్యక్రమాలకు దానిని కేంద్రంగా చేసుకొన్నాడు. స్వీయరాష్ట్రానికి స్వీయ భాషకు సేవ చేయడం మూలంగానే దేశసేవ చేయడం సాధ్యమనే భావంతో ఆయన ప్రజాసేవను ప్రారంభించాడు. అహమ్మదాబాదు, మిల్లు యజమానులకు వర్తక వ్యాపారాలకు కేంద్రం కావడంచేత తన ఆశ్రమానికి కావలసిన ఆర్థికసహాయం సులభంగా లభించగలదని భావించాడు.

ఇంతేకాదు. అహమ్మదాబాదులో చేనేత పరిశ్రమకూడా సజీవంగా ఉండినది. తాను పునరుద్ధరించదలచిన ఖద్దరు ఉద్యమానికి అది తగిన కేంద్రమని భావించాడు.

ఆయన సాగించిన రెండవ సత్యాగ్రహం గుజరాతు రాష్ట్రంలోని కైరా (లేక ఖేడా) జిల్లాకు సంబంధించినట్టిది.

కైరాజిల్లా గుజరాతు రాష్ట్ర ఉత్తరంలో ఉన్నది. అది చంపరాన్ జిల్లావలె గాక వ్యవసాయంలోను వర్తక వ్యాపారాలలోను ప్రాథమిక విద్యలోను పురోగమించినట్టిది. పటుదార్ల (Patudars)కులానికి చెందిన అందులోని రైతులు ఆంధ్రదేశంలోని రెడ్లు, కమ్మవారు క్షత్రియులవలె సుసంపన్నులు. వ్యవసాయంలో చాలా ఉత్సాహంగల సామాన్య భూస్వాములు. తూర్పు ఆఫ్రికాతో వ్యాపారం సాగించి ఆదాయాన్ని సంపాదించుటకు అలవాటుపడినవారు.

కాని, కాంగ్రెసు రాజకీయాలలో గాని, మరి ఎలాటి రాజకీయాలలో గాని వారికి ఎక్కువ ఆసక్తి కలగలేదు. ఇది గుజరాతు రాష్ట్రానికి ఒక లక్షణం. ఆర్థికంగా వారు మంచి స్థితిలో ఉండడమే దీనికి ప్రధానకారణం. 1917 నుండి ఈ విషయంలో వారిలో కొంత మార్పు వచ్చింది. హోంరూల్ ఉద్యమం గుజరాతు రాష్ట్రంపై ప్రభావం వహించింది. దాని శాఖలు కైరాతోసహా రాష్ట్రమందంతటా స్థాపింపబడినాయి. ఇందులో బిసెంటు ఉద్యమానికి చెందినవారు తిలక్ ఉద్యమానికి చెందినవారికంటె ఎక్కువ విజయాన్ని సాధించగలిగారు.

రాజకీయ సంచలనానికి గాంధీకూడ కొంతవరకు కారకుడయ్యాడు. ఆయన గుజరాతు సభకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన తర్వాత ఒక కార్యనిర్వాహక కమిటీని ఏర్పాటుచేసి, దానిద్వారా సంవత్సరం పొడుగునా గ్రామీణ ప్రాంతాలలో రైతుల సమస్యల గురించి ప్రచారం చేయ ప్రారంభించాడు. ఏవో కొన్ని తీర్మానాలు చేసి, వాటితో తృప్తిగాంచడం ఆయన ప్రకృతి కాదు. పట్టుదలతో ప్రజాసేవ చెయ్యడం ఆయన ఆశయం. ఈ కార్యక్రమాన్ని చేపట్టడంచేత ఆయనకూ ఆయన సహచరులైన విద్యార్థులకూ రైతులతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. 1917 నవంబరులో జరిగిన గుజరాతురాష్ట్ర సమావేశానికి అధ్యక్షుడై కార్యక్రమాలన్నిటిని గుజరాతీ భాషలో సాగవలసిందిగా నిర్ణయించి, గ్రామీణ ప్రజల సమస్యల గురించి సమావేశం చర్చించేటట్లు ప్రోత్సహించాడు. వీటి అన్నిటి ఫలితంగా రైతులలో రాజకీయాలపట్ల కొంత ఆసక్తి కలిగింది.

1917-18 లో కైరా జిల్లాలో పంటలకు చాలా నష్టం కలిగింది. యుద్ధపరిస్థితుల ఫలితంగాను, ప్లేగువ్యాధి వ్యాపించడం మూలంగాను వారు అనేక బాధలకు గురిఅయ్యారు. రైతులు ప్రభుత్వానికి చెల్లించవలసిన భూమి శిస్తును (Land Revenue) చెల్లించలేక ముజరాదయ చేయవలసిందిగా కోరారు. కాని అధికారులు పంటకు నష్టం కలిగినా అది స్వల్ప నష్టమేనని, చట్టదృష్ట్యా ముజరా ఇయ్యవలసినంత నష్టంకాదని వారికోరికను నిరాకరించారు. దీని ఫలితంగా రైతులకు అధికారులకు మధ్య వివాదం ఏర్పడింది. రైతులు సమర్పించిన వినతిపత్రాలు నిష్ఫలములైనాయి. విధిలేక కొందరు శిస్తులు చెల్లించినా తక్కినవారు చెల్లించలేని స్థితిలో ఉండినారు. తమ పశువులను ఇతర వస్తువులను అమ్మితేగాని శిస్తులను చెల్లించలేక పొయ్యారు.

ఈ పరిస్థితిలో గుజరాతు సభకు అధ్యక్షుడైన గాంధీ సలహాను వారు కోరారు. ఆయన వారికి సహాయం చేయదలచి, స్వయంగా వారి పరిస్థితుల గురించి పరిశీలన జరిపి, వారికి పంటనష్టం ఎక్కువగా కలిగిందని, శిస్తుముజరాకు చట్టరీత్యా వారు అర్హులనే నిర్ణయానికి వచ్చాడు. అనుచరుల సహాయంతో జిల్లాకలెక్టరు, కమీషనర్‌లతో రాయబారాలు జరిపాడు. అవి నిష్ఫలములుకాగా బొంబాయిలోని రాష్ట్రప్రభుత్వంతో సంప్రదింపులు జరిపాడు. తాను కైరాలో పర్యటనను సాగించి వాస్తవ పరిస్థితులను పూర్తిగా అవగాహన చేసుకొని, నివేదికను తయారుచేసేవరకు శిస్తుల వసూళ్ళను తాత్కాలికంగా ఆపుచేయవలసిందిగా అర్థించాడు. కాని ఏ విధమైన రాజీకి స్థానికాధికారులుగాని రాష్ట్రప్రభుత్వంగాని సిద్ధపడలేదు. దానిపై ఢిల్లీలోని కేంద్రప్రభుత్వం ఇందులో జోక్యం కలిగించుకొనవలసిందిగా కోరాడు. రైతుల వాదానికి ప్రభుత్వ వాదానికి మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడినప్పుడు ఎవరి వాదంలో ఎక్కువ సత్యం ఉన్నదో నిర్ణయించుటకు ఒక నిష్పాక్షికమైన విచారణ కమిటీని నిర్ణయించవలసినదిగా కోరాడు. ఇదే ఆయన ప్రధానమైన కోరిక. చంపరాన్‌లో ఈలాటి కమిటీని నియమించినట్లే కైరాలో కూడా నియమిస్తారని ఆయన భావించాడు. కాని దీనికికూడా వారు సమ్మతించలేదు.

కైరా రైతులు ఐచ్ఛికంగాకాక హోంరూల్ ఉద్యమనాయకుల ప్రోత్సాహంచేతనే శిస్తుల ముజరాను కోరుతున్నారని మొదటినుండి అధికారులు భ్రమపడ్డారు. రైతుల మొరలను ఆలకించకపోవుటకు ఈ భ్రమయే ఒక ప్రధాన కారణం.

ఈ దాయబారాలన్నీ 1917 డిసెంబరు 15 న ప్రారంభమై 1918 మార్చి 20 వరకూ సాగాయి. అన్నీ విఫలం కావడంతో రైతులకు సత్యాగ్రహ సాధనం ఒక్కటే ఉన్నట్లున్నూ దానిని వారు వినియోగించి న్యాయాన్ని పొందవలసినట్లుగాను గాంధీ వారికి సలహా చెప్పాడు. రైతులు దానికి అంగీకరించి సత్యాగ్రహ ప్రతిజ్ఞను చేసి, ఒక ప్రతిజ్ఞా పత్రంపై సంతకాలు చేశారు. శిస్తులు చెల్లించరాదని, దాని ఫలితంగా అధికారులు చరాస్తిని గాని తుదకు తమ భూములను గాని వశపరచుకొన్నా అలాటి నష్టాన్ని అనుభవించుటకు తాము సంసిద్ధులుగా ఉన్నట్లు ప్రతిజ్ఞ చేశారు. ప్రతిజ్ఞను ఏ పరిస్థితులలో కూడా జవదాటరాదని గాంధీ వారికి తెలియపరచాడు. జీవితంలో సత్యవాక్య పరిపాలన కంటె ఉత్కృష్టమైన కర్తవ్యం ఇంకొకటి లేదనే విషయాన్ని వారికి స్పష్టం చేశాడు. ఈ విధంగా 1918 మార్చి 22న సత్యాగ్రహం ప్రారంభమై జూన్ 6 వరకూ సాగింది.

ఏప్రిల్ 21కి 2337 రైతులు ప్రతిజ్ఞా పత్రంలో సంతకం చేశారు. అప్పటికి సత్యాగ్రహం ఉచ్ఛస్థితిలోకి వచ్చింది. చంపరాన్‌లో గాంధీ సత్యాగ్రహం చేశాడు. కైరాలో రైతులే సత్యాగ్రహం చేశారు. అధికారులంటే భయపడుతూ ఉండినవారు ఈ విధంగా వారిని ప్రతిఘటించడం ఇదే మొదటి పర్యాయం. ఇది సామాన్య ప్రజల జీవితంలో అపూర్వమైన సాహసం. దౌర్జన్య సహితంగా ప్రభుత్వంపై అప్పుడప్పుడు సామాన్య ప్రజలు తిరుగుబాటు చేయడం దేశానికి కొత్తకాదు. కాని సమస్త త్యాగాలకూ సిద్ధపడి శాంతియుతంగా ప్రతిఘటించడం దేశానికి కొత్త. సత్యాగ్రహంలోని విశేషం ఇదే. ఇందులో కైరా రైతులు దేశానికంతా మార్గదర్శకులయ్యారు.

మార్చి 22 నుండి గాంధీ తన అనుచరులతో కూడి రైతుల ఉత్సాహం తరగకుండా ఉండేటందుకు జిల్లాలో పర్యటనలను సాగించి సభలు సమావేశాలు జరిపాడు. దేశంలోని ప్రజల యొక్కయు రాజకీయనాయకుల యొక్కయు సానుభూతిని సంపాదించడం అవసరమని భావించి బొంబాయి వంటి నగరాలకు వెళ్ళి సమావేశాలు జరిపాడు. కరపత్రాలు విడుదల చేశాడు. వార్తా పత్రికలలో ఉద్యమాన్ని గురించి వ్రాశాడు. ఇతర రాష్ట్రాలలోని ప్రముఖులతో ఉత్తరప్రత్యుత్తరాలు సాగించాడు. చంపరాన్ ఉద్యమంలో ప్రభుత్వం తనతో సహకరించడం చేత ఈలాటి ప్రచారం అవసరం కాలేదు. కైరా సత్యాగ్రహం ప్రభుత్వ ఆగ్రహానికి పాత్రం కావడంచేత ఈలాటి ప్రచారం అవసరమైంది.

ఏప్రిల్ 24న అధికారులు తమ వైఖరిని మార్చుకొన్నట్లు సూచనలు కనుపించాయి. ప్రపంచ యుద్ధంలో పరిస్థితులు క్లిష్టరూపం ధరించి భారతీయు లందరి సహకారం అవసరం కావడం దీనికొక కారణం కావచ్చు. కారణం ఏదైనా అధికారులు కొంత మెత్తపడడం గుర్తించదగినది. శిస్తుల బకాయికిగాను రైతుల భూములను వశపరచుకొనరాదనీ, శిస్తు చెల్లించనివారిపై జరిమానాలను విధించరాదనీ, జప్తు చేయవలసినప్పుడు చరాస్తిని మాత్రమే జప్తు చేయవలసిందిగాను, బకాయీలను చెల్లించిన పక్షంలో అంతకు పూర్వం వశపరచుకొన్న భూములను రైతులకు తిరిగి ఇచ్చివేయ వలసిందిగాను, బకాయి శిస్తులను మరునటి సంవత్సరం చెల్లించుటకు అనుమతించ వలసిందిగాను పై అధికారులు శిస్తులు వసూలు చేసే మమాల్తిదార్లకు (తహసీల్దార్లకు) ఉత్తరువులు జారీ చేశారు. ఇవి వారు వెంటనే అమలుపరచక కొంత జాప్యం చేయడం చేత జూన్ 6న గాని ఈ సదుపాయాలు రైతులకు లభించలేదు. కాని

శిస్తులను పూర్తిగా రద్దు చేయకపోయినా ఈలాటి సదుపాయాలు కొన్ని రైతులకు లభించిన కారణంగా జూన్ 6న సత్యాగ్రహాన్ని ఉపసంహరించుకొనవలసింది గా గాంధీ రైతులను ఆదేశించాడు. వారు అలాగే చేశారు. ఈ విధంగా కైరా సత్యాగ్రహం 2½ నెలలు జరిగి పాక్షిక విజయంతో ముగిసింది.

ప్రభుత్వం అన్యాయానికి ఒడిగట్టినప్పుడు చట్ట బద్ధమయిన వినతి పత్రాలు వగైరా విప్పలములైనంత మాత్రం చేత అన్యాయానికి లొంగరాదని, శాంతియుత సత్యాగ్రహ సాధనం ద్వారా దానిని ప్రతిఘటించడం తమ విధి అని, ఈలాగు చేయడంలో ధర్మ విరుద్ధం ఏదీ లేదనీ రైతులు గ్రహించడం కైరా సత్యాగ్రహంలోని విశిష్టత. పరాయి పరిపాలకుల నిరంకుశత్వం సడలడంలోను, తుదకు అది నిర్మూలం కావడంలోను రైతులలో కలిగిన ఈ మార్పు ఒక మైలురాయిగా గుర్తించ తగినది.

ఈ సత్యాగ్రహ ఫలితంగా గాంధీ మరింత ఎక్కువగా అఖిలభారత ప్రఖ్యాతిని సంపాదించాడు. ఇంతకు పూర్వం రాజకీయ రంగంలో కృషి చేసిన గోఖలే, సురేంద్రనాథ్, తిలక్ వంటి మహామహు లెందరో ప్రజల ఆదరణకు పాత్రులయ్యారు. కాని వారెవ్వరు ప్రభుత్వాన్ని ప్రతిఘటించుటకు ప్రత్యక్షంగా సాహసించిన వారు కారు. గాంధీ అలాగు కాక, ప్రభుత్వం ప్రజలకు సహించరాని అన్యాయం చేసినప్పుడు సత్యాహింసల ద్వారా దానిని ప్రతిఘటించడం తన కర్తవ్యమనే భావంతో దానికి సిద్ధ పడడం ప్రజలలో ఆయన పట్ల అపూర్వమైన గౌరవ భావాన్ని కలిగించింది. సామాన్య ప్రజలకు జరిగే అన్యాయాలను తొలగించి వారి స్థితి గతులను చక్కపెట్టడంలోనే ఆయన శ్రద్ధ వహించడం వారికి ఆయన పట్లగల భక్తిని ఇనుమడించింది. ఈ పరిణామంలో కైరా సత్యాగ్రహానికి ప్రత్యేక ప్రాధాన్యం లభించింది.

ఈ సత్యాగ్రహ ఫలితంగా గుజరాతులోని సామాన్య ప్రజలు ఆయనకు అనుచరులైనారు. భవిష్యత్తులో ఆయన సాగించిన ఉద్యమాలన్నిటిలో వారాయనకు కుడిభుజంగా ప్రవర్తించారు. బ్రిటిష్‌వారు వారి బలప్రయోగ సాధనాన ఒక రాష్ట్రం తర్వాత ఇంకొక రాష్ట్రాన్ని తుదకు దేశాన్నంతా వశపరచుకొన్నారు. గాంధీ తన నైతిక బలాన్ని వినియోగించి ఇదే విధంగా 1917లో బీహారు రాష్ట్రాన్ని, 1918లో గుజరాతు రాష్ట్రాన్ని వశపరచుకొన్నాడు. అందుచేతనే ఆయన జీవిత చరిత్రలో కైరా సత్యాగ్రహానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నది.

ఈ సత్యాగ్రహంలోకూడా గాంధీ కాంగ్రెసు సహాయాన్నిగాని కాంగ్రెసు రాజకీయాలలో ప్రఖ్యాతిగాంచిన తిలక్, బిసెంటు మొదలైనవారి సహాయాన్నిగాని అపేక్షించలేదు. ఆయన స్వతంత్రంగా వ్యవహరించి తన ఆత్మశక్తి పైననే ఆధారపడినాడు. తనకు కావలసిన అనుచరులను తానే ఎన్నుకొన్నాడు. ఈలాటివారిలో అనేకులు వుండినా వారందరిలో వల్లభాయ్ పటేల్ ప్రసిద్ధిగాంచి భవిష్యత్తులో అఖిలభారత నాయకులలో ఒకడయ్యాడు. ఆయన ఆంగ్లభాష నభ్యసించి లండన్‌కు వెళ్ళి బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణుడై అహమ్మదాబాదులో న్యాయవాదిగా ఉండినవాడు. గాంధీకి ఆయనతో పరిచయం లభించి, కైరా సత్యాగ్రహంలో ఆయన సహాయాన్ని పొందాడు. ఆయనకూడా రైతు కావడంచేత కైరా రైతులకు విశ్వాసపాత్రుడై, సత్యాగ్రహంలో వారి ఉత్సాహం సడలకుండా ఉండేటట్లు, వారు చేసిన ప్రతిజ్ఞను పాలించేటట్లు వారిని ప్రోత్సహించాడు. ఇదిమొదలు ఆయన గాంధీ అనుచరుల

లోను శిష్యవర్గంలోను ఒకడైనాడు. బీహారులో రాజేంద్రప్రసాద్ ఈలాటి పాత్రనే ధరించాడు. పటేల్ నిర్మాణ కార్యక్రమాలను సాగించడంలో సిద్ధహస్తుడు. ఈలాటి శిష్యవర్గాన్ని కైరా సత్యాగ్రహకాలంలో గాంధీ సంపాదించి వారి సహాయంతో భవిష్యత్తులో తన ఉద్యమాలను సాగించాడు.

ఇతర రాజకీయ సంస్థల సహాయాన్ని ఈ సత్యాగ్రహంలో గాంధీ ఆపేక్షించక పోయినా హోంరూల్ సంఘంవారు ఇందులో పాల్గొన్నారు. ఆయనకు కావలసిన ఆర్థిక సహాయాన్ని బొంబాయి నగరంలోని హోంరూల్‌కు చెందిన వర్తకులు మొదలైనవారు చేశారు వీరిలో అధిక సంఖ్యాకులు గుజరాతీలు. దీని మూలంగా ఆయనకూ హోంరూల్ సంస్థలవారికీ సంబంధం ఏర్పడింది. 1919 లో ఆయన లేవదీసిన రౌలెట్టు సత్యాగ్రహంతో ఆయన కార్యక్రమాలలో అనేకం వీరి సహాయంతోనే జరిగాయి. కైరా సత్యాగ్రహం వీరిమధ్య ఈలాటి సంబంధాన్ని కలిగించడం గుర్తించతగ్గ విషయం. దీని మూలంగా గాంధీ అఖిలభారత రాజకీయాలలో ప్రవేశించినవాడయ్యాడు.

కైరాలో ఆయన సత్యాగ్రహాన్ని ప్రారంభించి సాగించడాన్ని అందరూ ఆమోదించారని అనుకొనరాదు. అనేకులు దానిని ఖండించారు. ఆశ్రమాలలో సుశిక్షితులైన వారు సత్యాగ్రహాన్ని పూనుకొనడంలో ప్రమాదం ఉండదని. సామాన్యులు పూనుకొనడం ప్రమాదకరమని వారు భావించారు. చట్టధిక్కారానికి ప్రజలు అలవాటుపడి, అందులో అధర్మం ఏదీలేదని భావించిన పక్షాన శాంతి భద్రతలకు భంగం కలగడం, దౌర్జన్యం వ్యాపించడం తప్పదని వారు భావించారు. సత్యాహింసలను తూచా తప్పకుండా అనుసరించగల సంస్కారం సామాన్య ప్రజలకు లేదు. వారు ఆవేశపరులై విధ్వంసక కార్యక్రమాలను సాగించడం తప్పదని విమర్శకులు అభిప్రాయపడినారు. కాని చట్టబద్ధమైన ఆందోళన విఫలమైన తర్వాత అన్యాయాలను తొలగించుటకు వారికి సాధనాంతరం ఏదీలేక పోవడాన్ని వారు విస్మరించారు. గాంధీ అలాటి సాధనాన్ని కనిపెట్టి దానిని దక్షిణ ఆఫ్రికాలో వినియోగించి భారత దేశంలోకూడా 1917, 1918 లో వినియోగించి విజయాన్ని సాధించాడు. అందుచేతనే ఆయన పట్లను, ఆయన సాధనంపట్లను ప్రజలనేకులకు విశ్వాసం కలిగింది. ఏలాంటి ఉన్నతమైన ఉద్యమంలోకూడా ప్రజలందరు పాల్గొనరు. భారతదేశం వంటి విస్తీర్ణాధిక్యం కలిగినట్టిన్నీ, భిన్న సంస్కృతులు కలిగినట్టిన్నీ దేశంలో ఈలాటి ఐకమత్యం సుసాధ్యం కాజాలదు. కాని గాంధీ అనేకుల ఆమోదాన్ని సంపాదించి సత్యాగ్రహాన్ని వినియోగించాడు. వారిలో మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజనదాస్, రాజగోపాలాచారి వంటి ప్రముఖులు అనేకులు ఉండినారు.

## 4

గాంధీ సాగించిన తొలిసత్యాగ్రహాలలో మూడవది అహమ్మదాబాదు నగరంలోని కార్మికులకు మిల్లు యజమానులకు మధ్య సంభవించిన వివాదానికి సంబంధించినట్టిది. ఇందులో ప్రభుత్వ ప్రమేయం ఏలాటిదీలేదు. వివాదం ఏలాటిదైనా దానిని పరిష్కరించుటకు సత్యాగ్రహం ఉత్తమ సాధనమనే విషయాన్ని ఇది నిరూపించింది.

ఇందులో కార్మికులేగాక వారిపై నాయకత్వం వహించిన గాంధీకూడా ప్రత్యేకంగా సత్యాగ్రహాన్ని సాగించాడు. సత్యాగ్రహానికి ప్రధాన లక్షణమైన స్వీయబాధానుభవానికి అనుభరులేగాక నాయకులుకూడా పాత్రులు కావలెనని అహమ్మదాబాదు ఉదంతం స్పష్టం చేసింది.

అహమ్మదాబాదు గుజరాతు రాష్ట్రానికి ప్రధాన నగరం. ఇది అనేక శతాబ్దాలుగా బట్టల నేతకు వర్తక వ్యాపారాలకు ప్రసిద్ధిగాంచినట్టిది. 1860 తర్వాత యంత్ర సహాయంచే బట్టలను తయారుచేసే భారీ పరిశ్రమకు ఇది కేంద్రంగా రూపొందింది.దీని ఫలితంగా లక్షాధికారులైన మిల్లు యజమానులు వర్తకులు నగరంలో ప్రాధాన్యం వహించారు. నగరంలోను పరిసరగ్రామాల లోను నివసించే సుమారు ఒక లక్ష కార్మికజనానికి మిల్లులలో పనులు దొరికి వారు కూడా మంచి స్థితిలోనే ఉండినారు. 1917 వరకూ ఉభయవర్గాలకూ రాజకీయాలేవీ ఆకర్షణీయం కాలేదు. రాజకీయాల ద్వారా పరిష్కరించవలసిన సమస్యలేవీ వారికి లేకపోవడమే దీనికి కారణం. 1917 లో బిసెంటు స్థాపించిన హోంరూల్ లీగు శాఖలు ఇక్కడ కొన్ని ఏర్పడినవి.

1917 లో ప్లేగువ్యాధి నగరంలో ఉధృతంగా వ్యాపించింది. కార్మికులనేకులు ప్రాణ నష్టానికి గురి అయ్యారు. కొందరు గ్రామాలకు పారిపోయ్యారు. కార్మికుల కొరత ఏర్పడిన కారణంగా మిల్లు యజమానులు ప్లేగు కాలంలో కార్మికుల వేతనాలను 75 శాతం పెంచినారు. డిసంబరునాటికి వ్యాధి చాలావరకూ తగ్గింది. దానిని ఆసరాగా తీసుకొని యజమానులు ప్లేగు కాలంలో ఇచ్చిన అదనపు వేతనాన్ని 20 శాతానికి తగ్గించారు. అప్పటికే ప్రపంచ సంగ్రామ ఫలితంగా అవసరవస్తువులకు కొరత ఏర్పడి వాటి ధరలు విపరీతంగా పెరిగాయి. వేతనాలను తగ్గించిన పక్షంలోజీవితాన్ని సాగించడం దుర్భరమనే కారణంగా కార్మికులు అధమపక్షం 50 శాతం అదనపువేతనాన్ని ఇయ్యవలసిందిగా కోరారు. యుద్ధకాలంలో విదేశవస్త్రాల దిగుమతి తగ్గడంవల్ల వస్త్రాల ధరలు పెరిగి మిల్లు యజమానులు లాభాలు గడించుచున్న కారణంగా అధనపు వేతనాలను ఇయ్యగల స్తోమత వారికి కలదని కార్మికులు తమ వాదాన్ని సమర్థించారు. కాని యజమానులు దీనికి అంగీకరించలేదు. బట్టల పరిశ్రమలో ప్రతిష్టంబన ఏర్పడి కార్మికులు ఇబ్బందులకు గురిఅయ్యే సూచనలు కనిపించాయి.

అహమ్మదాబాదు మిల్లు యజమానులలో అగ్రశ్రేణికి చెందినవాడు అంబాలాల్ శరభాయి. సత్యాగ్రహ ఆశ్రమంలో అస్పృశ్యులను చేర్చుకొన్న కారణంగా అంతకుపూర్వం ఆశ్రమానికి ధనసహాయాన్ని చేస్తూ ఉండినవారు ఆ సహాయాన్ని విరమించు కొన్నప్పుడు అంబాలాల్ ఐచ్ఛికంగా ఆశ్రమానికి రు 13, 000లు సహాయం చేశాడు. అప్పటినుంచి గాంధీకి అంబాలాల్‌తో స్నేహం ఏర్పడింది. ఇదిగాక అంబాలాల్‌సోదరి అనసూయాబెన్ ఇంగ్లండులో ఉన్నతవిద్య నభ్యసించినా ధనార్జనకు సాధనమైన వృత్తిని దేనినీ చేపట్టక సంఘసేవకు తన జీవితాన్ని అంకితంచేసి కార్మికుల స్థితిగతులను చక్కబరచుటలో శ్రద్ధవహించినట్టిది. ఆమెకూడా గాంధీకి అభిమానపాత్రురాలైనది. కార్మికుల వాదం సహేతుకమైనదని సోదరునికి నచ్చ చెప్పినది కాని ఆమె మాటలను ఆయన ఆలకించలేదు.

పరిస్థితులు ఈలాగు ఉండడం గాంధీకి ఎంతమాత్రం నచ్చలేదు. వాస్తవంగా కార్మి కులకు అన్యాయం జరుగుతున్నదని ఆయన విశ్వసించాడు. సామాన్యప్రజలలో ఎవరికి అన్యాయం జరిగినా అది దుర్భరమైనప్పుడు దానిని తొలగించడం తన కర్తవ్యంగా ఆయన భావించినవాడు. యజమానులు కార్మికులకు సహాయపడదగిన స్థితిలో ఉన్నందునను, బాధను అనుభవించేవారికి సహాయపడడం ధర్మం కావడంచేతను, తనకు ప్రేమపాత్రురాలైన సోదరిని తృప్తిపరచడం వాంఛనీయం కావడంచేతను కార్మికుల కోరికలను అంబాలాల్‌గాని ఇతర యజమానులుగాని నిరాక రించరాదని గాంధీ చెప్పాడు. కార్మికులు కోరిన 50 శాతం అదనపువేతనానికి యజమానులు ఇయ్యదలచిన 20 శాతం అధనపు వేతనానికి మధ్యే మార్గంగా

35 శాతం అదనపువేతనంతో తృప్తిపడవలసిందిగా కార్మికులను ఆయన ఒప్పించి; ఈ నిర్ణయం న్యాయమైనదోకాదో నిర్ణయించుటకు ఒక మధ్యవర్తి సంఘాన్ని నియమించవలసిందిగా కోరాడు. యజమానులు దానికంగీకరించి అలాటి సంఘాన్ని నియమించారు. కాని దాని నిర్ణయాలకు కట్టుబడి ఉండుటకు సమ్మతించరైరి. ఇంతేకాదు; 1918 ఫిబ్రవరి 22న అనేక మిల్లులను మూతవేసినట్లు (Lock out) ప్రకటించారు.

ఈ పరిస్థితులలో గాంధీ కార్మికులను సమావేశపరచి 35 శాతం అదనపువేతనం లభించేవరకూ పనులలో చేరరాదని వారిచే ప్రతిజ్ఞ చేయించాడు. సత్యాగ్రహం ఈలాటి ప్రతిజ్ఞతో ప్రారంభమౌతుంది. ఏ పరిస్థితిలోనుకూడా ప్రతిజ్ఞను పాలించడం (సత్యవాక్య పరిపాలన) ధర్మమనేది దానికి ఆధారం. ఈ విధంగా కార్మికుల సత్యాగ్రహం ఫిబ్రవరి 24న ప్రారంభమైంది.

సమ్మెకూ సత్యాగ్రహానికీ గొప్ప భేదం ఉన్నది. సమ్మె చేసేవారు యజమానుల ఆస్తికి కర్మాగారాలకు నష్టం కలిగిస్తారు. శాంతిభద్రతలకు భంగం కలిగిస్తారు. పోలీసుల లాటీ దెబ్బలకు కాల్పులకూ అవకాశం కలిగిస్తారు. సత్యాగ్రహంలో ఈలాటి దౌర్జన్యాలకు ఆస్కారం లేదు. దానికి సత్యాహింసలు ఆధారం. వీటికి కట్టుబడి, యజమానులకు ఏలాటి బాధను కలిగించక, స్వీయబాధకు సిద్ధపడుతారు. అహమ్మదాబాదు కార్మికులు పనులులేక, వేతనాలులేక, భార్యాపిల్లలతో పస్తుండవలసివచ్చినా దౌర్జన్యానికి దిగినవారుకారు. ఇది మామూలు సమ్మెవంటిదనే సందేహంతో అధికారులు మొదటి రెండు మూడు రోజులలో సాయుధ పోలీసు దళాలను వీధులలో అక్కడక్కడ నిలిపారు. కాని కార్మికుల శాంతియుత ప్రవర్తనను చూచి నాల్గవ రోజు నుండి అలాటి దళాలను ఉపసంహరించుకొన్నారు. ఇది పోలీసుల చరిత్రలో ఒక అపూర్వమైన అనుభవం. ప్రతిజ్ఞపట్ల కార్మికుల పట్టుదల సడలకుండా ఉండుటకు ప్రతిరోజూ సాయంకాలం గాంధీ వారిని సమావేశపరచి ఉపన్యసించేవాడు. రోజూ ఒక కరపత్రాన్ని అచ్చువేసి ప్రకటించేవాడు. సమావేశాలకు 10, 000 కార్మికులు హాజరయ్యేవారు.

రోజూ గాంధీ అంబాలాల్‌ను కూడా కలుసుకొని కార్మికుల పట్ల సానుభూతితో ప్రవర్తించవలసిందిగాను, సత్యాగ్రహం విఫలమై వారు పనులలో ప్రవేశించినా యజమానుల పట్ల ద్వేషం వహించినవారు కాగలరని, దాని మూలంగా యజమానులు కూడా నష్టపడగలరనీ చెప్పేవాడు. ఈ విధంగా మార్చి 12 వరకు జరిగింది. ఆ రోజున యజమానులు మిల్లులను తిరిగి తెరిచారు. కార్మికులు కొందరు 20 శాతం అదనపు వేతనానికి సమ్మతించి పనులలో చేరే ఉద్దేశం కనపరచారు. కొందరు ఆకలి బాధను భరించలేక విసుగుతో "తాము తమ భార్యాపిల్లలతో పస్తు ఉండినా గాంధీ అనసూయాబెన్ మొదలైనవారు యథాప్రకారం భోజనం చేస్తూ మోటారు కార్లలో తిరుగుతూ సుఖంగా ఉన్నారని, తమ కష్టాలు అలాటి వారికి తెలియదని" ఏవో గుసగుసలు ప్రారంభించడం గాంధీకి తెలియ వచ్చింది.

వారి మాటలలో సత్యం ఉన్నట్లు గ్రహించి కార్మికులకు 35 శాతం అదనపు వేతనం లభించేవరకు తాను ఉపవాసం చేయుటకు ప్రతిజ్ఞ పట్టి మార్చి 25న ఉపవాసం ప్రారంభించాడు. రోజూ అనసూయాబెన్ కారులో సమావేశానికి వచ్చేవాడు. 25 నుండి దానిని మాని ఆశ్రమాన నుండి ఇసక దిబ్బలపై నడుస్తూ సమావేశాలకు రాసాగాడు. కార్మికులతో పాటు తానుకూడా స్వీయబాధను అనుభవించ మొదలు పెట్టాడు.

ఇది అంబాలాల్‌తో సహా యజమానులలో సంచలనం కలిగించింది. సర్వసంగ పరిత్యాగియై, ప్రజాసేవకు తన జీవితాన్ని అంకితం చేసిన ఋషితుల్యుడైన గాంధీ ఉపవాస కారణంగా ప్రాణాలను కోల్పోయ్యే ప్రమాదం ఏర్పడింది. అలాటి వాని మరణానికి తాము కారణభూతులగుట కంటే పాపకార్యం ఇంకొకటి లేదని వారు భావించారు. యజమానులలో అనేకులు జైనులు, కొందరు వైష్ణవ శాఖకు చెందినవారు. అందరిలోను ఈ భావం కలిగింది. దీని ఫలితంగా వారి హృదయం మెత్తబడింది. ఏదో ఒక రాజీ చేసుకొని కార్మికులకు గాంధీకి తృప్తి గలిగించి వారి సత్యాగ్రహాన్ని విరమింపజేయడం తమ కర్తవ్యంగా భావించి మార్చి 18 న ఒకరాజీకి వచ్చారు.

కార్మికులు సత్యాగ్రహాన్ని మాని పనిలో ప్రవేశించిన తొలిరోజునవారి ప్రతిజ్ఞాను సారం వారికి 35 శాతం అధనపు వేతనం లభించేటట్లున్నూ, రెండవరోజున యజమానుల ప్రతిజ్ఞానుసారం 20 శాతం అధనపు వేతనం లభించేటట్లును, అటు తర్వాత వారికి లభించవలసిన అధనపు వేతనాన్ని ఒక మధ్యవర్తి నిర్ణయించవలసినట్లున్నూ రాజీ కుదిరింది. గుజరాత్ కళాశాల వైసుప్రిన్‌సిపాల్ (Vice Principal) ఆచార్య ధృవాను మధ్యవర్తిగా నియమించారు. ఆయన అదనపువేతనం 35 శాతం ఉండవలసిందిగా నిర్ణయించాడు. యజమానులు దీనికి అంగీకరించారు. సత్యాగ్రహం విజయవంతంగా ముగిసింది.

ఉభయపార్టీల ప్రతిజ్ఞ నెరవేరడం ఈ సత్యాగ్రహంలోని మొదటి విశేషం. వారు వివాదాన్ని మధ్యవర్తిద్వారా పరిష్కరించు కొనుటకు సిద్ధపడడం రెండవ విశేషం. ఇది తాత్కాలికంగా మాత్రమేగాక భవిష్యత్తులోకూడా ఒక సంప్రదాయంగా ఏర్పడింది. ఉభయపార్టీల మధ్య ఎప్పుడు వివాదాలు సంభవించినా సమ్మెలు లాకౌట్‌లు అవసరంలేక మధ్యవర్తులద్వారా అవి పరిష్కారం కాసాగినవి. అహమ్మదాబాదుకు లభించిన ప్రత్యేకత ఇది. 1918 లో బొంబాయి మిల్లులలోని కార్మికులవేతనాలకంటె అహమ్మదాబాదు మిల్లులలోనివారి వేతనాలు 10 శాతం తక్కువగా ఉండేవి. 1959 నాటికి అవి 10 శాతం అధనంగా ఉండినవి. దేశంలో మిల్లు కార్మికులకు మరెక్కడ ఇంతటి అధికవేతనం లభించడంలేదు. యజమానుల శ్రేయస్సుకు భంగకరంగా కార్మికులు ప్రవర్తించరాదని, కార్మికుల శ్రేయస్సుకు భంగకరంగా యజమానులు ప్రవర్తించరాదని ఉభయపార్టీలు గ్రహించారు, సత్యాగ్రహం ఈలాటి శాశ్వత ఫలితాన్ని కలిగించింది. గాంధీ ఉపదేశానుసారం 1920 లో ఏర్పడిన బట్టలమిల్లుల కార్మికుల సంఘం దేశంలోని కార్మిక సంఘాలన్నిటిలో సర్వవిధాలా అగ్రస్థానం వహించ గలిగింది. పరస్పరద్వేషం లేక సత్యాగ్రహంద్వారా 1918 లో సమస్య పరిష్కారం కావడమే దీనికి కారణం.

ఈ సత్యాగ్రహం మూలంగా గాంధీ కార్మికుల విశ్వాసంతోపాటు యజమానుల విశ్వాసాన్నికూడా సంపాదించాడు. నగరంలో ఆయన పలుకుబడికి స్థిరత్వం కలిగింది. కైరా సత్యాగ్రహం మూలాన గ్రామీణ ప్రాంతాల ప్రజలు ఆయనపట్ల భక్తి విశ్వాసాలు కలవారయ్యారు. అహమ్మదాబాదు సత్యాగ్రహాల ఫలితంగా నగరవాసుల భక్తి విశ్వాసాలను ఆయన సంపాదించాడు. గుజరాతు రాష్ట్రానికంతా ఈ విధంగా ఆయన ఏకైక నాయకుడయ్యాడు.

ఈ సత్యాగ్రహాలలోకూడా ఆయన కాంగ్రెసువంటి సంస్థల సహాయాన్నిగాని ప్రసిద్ధి గాంచిన రాజకీయ నాయకుల సహాయాన్నిగాని అపేక్షించక స్వతంత్రంగా వ్యవహరించి, తనకు

కావలిసిన అనుచరులను తానే ఎన్నుకొన్నాడు. అలాటివారిలో బొంబాయి హోంరూల్ లీగులో ప్రధానపాత్రను వహించిన శంకరలాల్ బ్యాంకరు ప్రధానుడు. అప్పటినుండి అంబాలాల్ అన సూయాబెన్ ఆయనకు మరింత సన్నిహితులయ్యారు.

ఈ సత్యాగ్రహ కాలంలోనే ఆయన ప్రప్రథమంగా గొప్ప ప్రయోజనాన్ని సాధించుటకు ఉపవాసవ్రతం ఒక సాధనంగా వినియోగించాడు. ఆయన జీవితంలో ఈలాటి ఉపవాస వ్రతాలు 17 పర్యాయాలు జరిగాయి. కాని ఎవరంటేవారు ఉపవాసవ్రతాన్ని చేపట్టరాదని, ప్రత్యేక అర్హతగలవారే దానిని చేపట్టడం యుక్తమని ఆయన పదే పదే చెప్పాడు. ఇంతే గాక, సాధించదగిన ప్రయోజనం ఉత్కృష్టమైనప్పుడే దానిని చేపట్టవలసిందిగా ఆయన బోధించాడు.

పైన వివరించిన తొలి సత్యాగ్రహాలు మూడూ గాంధీకి అఖిలభారత ప్రఖ్యాతిని సంపాదించి పెట్టినవి. ఇతర రాజకీయ నాయకులవలె ఆయన వాక్శూరుడు మాత్రమేకాడని, కార్యశూరుడుకూడా అని ప్రజలు విశ్వసించారు. ఆయన ప్రఖ్యాతికి ఇదే ప్రధాన కారణం. ఇది గాక ఆయన పరిష్కరించ దలచిన సమస్యలన్నీ రైతులు కార్మికులు మొదలైన సామాన్య ప్రజల ఇక్కట్టులకు సంబంధించినట్టివి. ఇంతకు పూర్వం ప్రసిద్ధిగాంచిన రాజకీయ నాయకులు ఈలాటి సమస్యల విషయంలో శ్రద్ధ వహించినవారు కారు. ఆయన ప్రఖ్యాతికి ఇది రెండవ కారణం. ఇదిగాక ఆయన వినియోగించిన సత్యాగ్రహమనే ప్రత్యేకసాధనం ప్రజలదృష్టిని ఆకర్షించింది. సమాజాన్ని పీడిస్తున్న అన్యాయాలను తొలగించడంలో దౌర్జన్యమూ బల ప్రయోగమూ మొదలైన వాటికంటె ఇది నైతికంగా ఉత్తమ సాధనమనీ, దీనిమూలంగా అన్యాయాలను తొలగించడం సాధ్యమనీ ఆయన నిరూపించి దేశచరిత్రలో దీనికి ఒక అపూర్వమైన స్థానాన్ని కల్పించాడు. దేశచరిత్రలోనేకాదు; ప్రపంచ చరిత్రలోకూడా దీనికి అలాటి స్థానం లభించింది. ఆయన ప్రఖ్యాతికి ఇది మూడవకారణం. ఈ ప్రఖ్యాతి మూలంగా 1918 ఆఖరుకు దేశానికంతకు నాయకుడగుటకు ఆయన అర్హుడనేభావం ఏర్పడింది. 1919 లో ఆయన సాగించిన అఖిలభారత రౌలెట్టు సత్యాగ్రహం (Rowlatt Satyagraha) ఆయనకు అలాటి నాయకత్వాన్ని లభింపజేసింది.

దానిని గురించి మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం.

చదువదగిన గ్రంథాలు :

Vidya Bhavan : Vol. xi.
Pattabhi Seetharamiah : History of the Indian National Congress, తెనుగు అనువాదం.
Judith M. Brown : Gandhi's Rise to power.
Erikson : Gandhi's Truth.

# అధ్యాయము-3

## రౌలెట్టు సత్యాగ్రహము

## 1919

## 1

1917-18 లో గాంధీ సాగించిన సత్యాగ్రహాలు ఒక జిల్లాకో ఒక నగరానికో పరిమితములైనట్టివి. అవి స్థానిక సత్యాగ్రహాలు. 1919 లో ఆయన సాగించిన రౌలెట్టు సత్యాగ్రహం ఈలాటిదిగాక దేశవ్యాప్తమైనట్టిది. ఇందులో ఆ సేతుహిమాచల పర్యంతం నివసించే ప్రజలు పాల్గొన్నారు. దేశవ్యాప్తమైన సత్యాగ్రహాలలో ఇదే మొదటిది.

19.9 మార్చిలో ప్రభుత్వంచేసిన రౌలెట్టు దట్టంమూలంగా ప్రజలందరికీ సంభవించిన అన్యాయాన్ని తొలగించుటకు ఇది ఉద్దేశింప బడింది. అన్యాయం ప్రజలందరికీ సంభవించడంచేత ప్రజలందరు ఇందులో పాల్గొన్నారు. రౌలెట్టుచట్టాన్ని ప్రతిఘటించుటకు ఇది ఉద్దేశింప బడినందున వ్యవహారంలో దీనికి రౌలెట్టు సత్యాగ్రహం అనే పేరు లభించింది.

1905 తర్వాత ప్రభుత్వం అనుసరిస్తున్న రాజనీతి విధానాన్ని అనుసరించి ప్రపంచ సంగ్రామ కాలంలో ఒకవైపు సంస్కరణల విధానాన్ని ఇంకొకవైపు దమన విధానాన్ని అనుసరించింది. తన పరిపాలనకు సుస్థిరత్వాన్ని శాశ్వతత్వాన్ని కల్పించుకొనడమే వీటి ఉద్దేశం. సంస్కరణల మూలంగా మితవాదులయొక్కయు జాతీయ వాదులలో శాసనసభల సభ్యత్వంపట్ల మంత్రి పదవులవంటి అధికార పదవులపట్ల వ్యామోహం కలవారియొక్కయు సహకారాన్ని సంపాదించ కోరింది. ప్రజలలో కొందరి సహకారం లభిస్తేనేగాని తమ పరిపాలనకు సుస్థిరత్వం చేకూరదనేది ఈ విధానానికి ఆధారం. సైనికబలం నౌకాబలం అత్యధికంగా ఉందినా వాటిపైన మాత్రమే ఆధారపడి సామ్రాజ్యాధికారాన్ని స్థిరపరచుకొనడం సాధ్యంకానిపని. ఈ సత్యాన్ని గ్రహించినవారు కావడంచేతనే మొదటినుండీ బ్రిటిషువారు ప్రజలలో కొన్ని వర్గాల—సంస్థానాధీశులు, జమీందార్లు, ముస్లింలు, మొదలైనవారి—సహకారాన్ని సంపాదించే కార్యక్రమాలు సాగించారు. ఈ వర్గాలతోపాటు 19 వ శతాబ్దిలో ప్రజల ఆదరణకు పాత్రమైన విద్యాధికవర్గం ఒకటి ఏర్పడడం చేతను, రాజకీయ రంగంలో ఎక్కువగా కృషిచేసేవారు వారే కావడంచేతను సంస్కరణలద్వారా పరిపాలనలో భాగస్వాములు కావడం వారి లక్ష్యంకావడం చేతను వారి సహకారాన్ని సంపాదించుటకు సంస్కరణలు అవసరమైనాయి. మార్లేమింటో సంస్కరణలు, మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలు ఈ ఉద్దేశంతోనే ప్రవేశపెట్టబడినవి.

కాని పరాయి పరిపాలనను పూర్తిగా తొలగించే ఉద్దేశంగల విప్లవ ఉద్యమం కూడా 1906 నుండి వ్యాప్తిగాంచింది. అధికారులను, వారికి సహాయంచేసే భారతీయులను హత్యలు చేయడం, ధనికులను దోపిడిచేసి తమ కార్యక్రమాలకు కావలసిన ధనాన్ని సంపాదించడం ఈ

ఉద్యమకార్యకర్తల ఆశయం. వీరినీ, వీరిపట్ల సానుభూతిని ప్రదర్శించినవారినీ పట్టుకొని శిక్షించితేగాని పరిపాలనకు స్థిరత్వం చేకూరని పరిస్థితులు ఏర్పడినవి. అందుకుగాను 1906 నుండి దారుణ దమన విధానాన్ని ప్రభుత్వం అనుసరించింది. ప్రజల స్వేచ్ఛకు భంగం కలిగించే చట్టాలను అనేకం చేసింది. ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో దేశ సంరక్షణచట్టం (India Defence Act) వీటి అన్నిటిలో ప్రధానమైనది. నేరం చేసినట్లు సాక్ష్యాధారంతో న్యాయస్థానాలు తీర్పుచేసినవారిని శిక్షించడం న్యాయంకావచ్చు. కాని, అధికారులకు అనుమానాస్పదులైన వారందరిని—వారు నేరంచేసిన వారైనా కాకపోయినా—శిక్షించడంలో ఏలాటి న్యాయంలేదు. ఇది సామాన్య సూత్రం. కాని దేశరక్షణ చట్టం ఈ సూత్రానికి విరుద్ధంగా అనుమానాస్పదులందరిని ఏదోవిధంగా విచారణ చేసిగాని, విచారణ చేయకగాని, శిక్షించే అధికారాన్ని ప్రభుత్వానికి లభింపచేసింది. దీని ఫలితంగా ఏలాటినేరం చేయనివారుకూడా వేల సంఖ్యలో ఉరిశిక్షలకు, ద్వీపాంతరవాస శిక్షలకు, దీర్ఘకాలజైలు శిక్షలకు, ఇతర నిర్బంధాలకు, ఆస్తినష్టానికి గురి అయ్యారు. ప్రజలను రక్షించవలసిన ప్రభుత్వం వారి రక్షణకు విరుద్ధంగా ప్రవర్తించసాగింది. ప్రజలరక్షణకంటె తన సామ్రాజ్యాధికారాన్ని సుస్థిరం చేసుకోవడమే దాని లక్ష్యం అయింది.

ప్రపంచ సంగ్రామకాలంలోని ప్రత్యేక పరిస్థితులను ఎదుర్కొనుటకు దేశరక్షణ చట్టంవంటి దారుణచట్టం అవసరమని ప్రభుత్వం వాదించింది. కాని యుద్ధం ముగిసిన తర్వాత ఆరు నెలలకు ఈ చట్టం రద్దుకావలసి ఉండినది. యుద్ధం ముగిసినా తన నిరంకుశాధికారం ఏ మాత్రం సడలరాదనే ఉద్దేశంతో దేశసంరక్షణ చట్టంవంటి చట్టాన్ని ఇంకొకదానిని చేయ సంకల్పించి దాని స్వరూపం ఏలాటిదిగా ఉండవలెనో నిర్ణయించుటకు బ్రిటన్‌లోని ఉన్నత న్యాయాధీశులలో ఒకడైన రౌలెట్టు అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ విప్లవ ఉద్యమంలో పాల్గొన్నట్లు శంకింపబడినవారు చేసిన నేరాలన్నిటినీ పరిశీలించి, ఆలాటి నేరంచేసే వారిని శిక్షించుటకు ఏలాటిచట్టం ఉండడం అవసరమో నిర్ణయించింది. ఈ కమిటీవారి నివేదికకు రౌలెట్టు నివేదిక అనేపేరు వ్యవహారంలోకి వచ్చింది. ఈ నిర్ణయానుసారం ప్రభుత్వం చేసిన చట్టానికి రౌలెట్టు చట్టం అనేపేరు వాడుకలోకి వచ్చింది.

రౌలెట్టు చట్టం దేశసంరక్షణ చట్టంవంటిదే, బహుశః అది అంతకంటె దారుణమైనట్టిది అనికూడా చెప్పవచ్చు. బ్రిటిష్ పరిపాలనను తొలిగించే ఉద్దేశంగల విప్లవకారులు దేశంలో ఉన్నారని, వారిని న్యాయా న్యాయాల విచక్షణతో సంబంధం పెట్టుకొనక నిర్మూలించడం కర్తవ్యమనేభావం ఈ చట్టానికి ఆధారం. ప్రభుత్వానికి విరుద్ధంగా కార్యక్రమాలు సాగించినట్లు అనుమానింపబడిన వారిని మామూలు శిక్షా స్మృతికి విరుద్ధంగా ప్రత్యేక న్యాయస్థానాలలో విచారణచేసి శిక్షించుటకు, ఏలాటి విచారణ లేక వారిని నిర్బంధించుటకు, వారిపై వివిధములైన ఆంక్షలు విధించుటకు, వారి ఆస్తులను వశపరచుకొనుటకు, వారి ఇండ్లను కార్యాలయాలను సోదాచేయుటకు ప్రభుత్వానికి ఈ చట్టంద్వారా పూర్తి అధికారం లభించింది. పోలీసు అధికారులు ఇష్టం వచ్చినవారిని ఇష్టం వచ్చినట్లు నిర్బంధించి బాధించగల వారయ్యారు. దేశంలో పూర్తిగా పోలీసువారి రాజ్యం ఏర్పడింది.

రౌలెట్టు కమిటీ నివేదికను 1917 ఆగస్టులో ప్రకటించారు. అప్పటినుంచి దేశంలోని రాజకీయ పార్టీలన్నీ దానిని ఖండించాయి. అందుకుగాను సభలు సమావేశాలు జరిపారు. వార్తా

పత్రికలు (దేశీయ వార్తాపత్రికలు) దానిని ఖండించాయి. కాని దాని సూచనలు ఆధారం చేసుకొని ప్రభుత్వం రెండు బిల్లులను తయారుచేసి 1919 ఫిబ్రవరి 9న కేంద్ర శాసన సభలో ప్రవేశపెట్టి మార్చి 18న వాటిలో మొదటిదానిని చట్టంగాచేసి అమలులో పెట్టింది.

కర్జన్ ప్రభువు ప్రజాభిప్రాయాన్ని ఏ మాత్రం లెక్కచేయక బెంగాలు రాష్ట్రాన్ని విభజించినట్లె 1919లో ప్రభుత్వం రౌలెట్టు చట్టాన్ని చేసింది. ఇంతేకాదు, శాసనసభలో మితవాదులు జాతీయవాదులు ఇతర అనధికార భారతీయ సభ్యులు ఏకకంఠంతో దానికి ప్రతికూలంగా వోటుచేశారు. కాని వారి వోటుకు ఏలాటి విలువా లేకపోయింది. సభలో యూరోపియన్ అధికార అనధికార సభ్యులకు మెజారిటీ బలంఉండినందున చట్టంచేసే అవకాశం ప్రభుత్వానికి లభించింది. 33 కోట్ల ప్రజల తరపున మాటలాడే భారతీయ సభ్యులకు లేని అధికారం ఒకటి రెండులక్షల తెల్లవారి ప్రతినిధులకు లభించింది. పరాయి పరిపాలకుల నిరంకుశత్వం ఇది స్పష్టం చేసింది.

బెంగాలు రాష్ట్ర విభజనపట్ల ఎక్కువగా బెంగాలీలే నిరసనను తెలియ పరచారు. రౌలెట్టుచట్ట విషయంలో దేశంలోని రాజకీయ చైతన్యంగల ప్రజలందరు నిరసనను తెలియ పరచారు. కాని లాభం లేకపోయింది.

చట్టం పాసైన తర్వాత కూడా దానిని రద్దుచేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఎన్నో సభలు సమావేశాలు జరిగాయి. వినతిపత్రాలు సమర్పించారు. బ్రిటన్‌లోని అధికారులతో సంప్రతింపులు జరిపారు. వార్తాపత్రికలు ఇదే ధోరణిలో సంపాదకీయాలను వ్రాశాయి. చట్టబద్ధంగా చేయదగిన పనుల నన్నిటినీ రాజకీయ నాయకులు చేశారు. కాని అవిఅన్నీ నిష్ప్రయోజనములైనాయి. అటుతర్వాత సాగించదగిన కార్యక్రమం రాజకీయ నాయకులకు ఏదీలేదు. చట్టబద్ధమైన కార్యక్రమం ఒక్కటే అనుసరణ యోగ్యంగా భావించినవారు నిస్సహాయులై దారీతెన్నూ లేక నిలబడిపోయినారు.

## 2

అలాటి పరిస్థితిలో గాంధీ రంగంలోకి దుమికి దేశానికి ఒక మార్గాన్ని సూచించాడు. దేశానికంతా అన్యాయం జరిగినప్పుడు దానికి లోబడటమూ, దానిని తొలగించుటకు ప్రయత్నం చేయకపోవడమూ పిరికితనమనీ, ఆత్మగౌరవము కలవా రెవరూ ఈలాగు చేయరనీ, దానిని ఎదుర్కొని. దానిని తొలగించుటకు సత్యాహింసలతో కూడిన సత్యాగ్రహ సాధనం ఉన్నదనీ, అది అమోఘమైనట్టిదనీ, దానిని వినియోగించుటకు తాను సిద్ధంగా ఉన్నట్లు ప్రప్రథమంగా ఫిబ్రవరి 9న తెలియపరచాడు. అంతకు పూర్వం కొన్ని నెలలుగా అనారోగ్యంమూలాన మంచంపట్టి ఉన్నందున రౌలెట్టు నివేదికగురించి తన నిరసనను వివరంగా తెలియపరచలేకపొయ్యాడు. ఫిబ్రవరికి ఆరోగ్యం కొంత కోలుకొని తన అభిప్రాయాన్ని తెలియపరచగలిగాడు.

గాంధీ మాటలతో తృప్తిపడేవాడు కాడు. ఆయన ప్రధానంగా కార్యశూరుడు: దేశవ్యాప్తంగా జరగవలసిన సత్యాగ్రహ కార్యక్రమాన్ని ఒక్కడే సాగించడం సాధ్యంకాదు, దానికి సహచరు లనేకులు ప్రతిరాష్ట్రంలో ఉండడం అవసరం. ఆ అవసరాన్ని తీర్చే ఉద్దేశంతో 1919 ఫిబ్రవరి 24న తన అనుచరుల కొందరిని, హోంరూల్ ఉద్యమంలో కృషిచేస్తూ

ఉన్న మరికొందిరిని సత్యాగ్రహ ఆశ్రమంలో సమావేశపరచి, వారిని తాను తలపెట్టిన సత్యాగ్రహంపట్ల, సుముఖులుగా చేశాడు. బిసెంటును నిర్బంధాననుండి విడుదలచేసే సందర్భంలో వీరిలో అనేకులు సాత్విక నిరోధాన్ని తలపెట్టిన వారు కావడంచేతను, రౌలెట్టుచట్టాన్ని ప్రతిఘటించుటకు సాధనాంతరం లేని కారణంచేతను వారు గాంధీచేసిన సూచనను అంగీకరించారు.

వెంటనే ఆయన ఒక సత్యాగ్రహ సభను స్థాపించాడు. సమావేశానికి హాజరైన వారు అందులో సభ్యులై, 11 రౌలెట్టుబిల్లులు న్యాయ స్వాతంత్ర్య సిద్ధాంతములకు విరుద్ధములుగా ఉన్నవనీ భారతదేశ క్షేమమునకును, భారతప్రభుత్వ క్షేమమునకును ఆధారభూతములైన ప్రజల ప్రాథమిక హక్కులకే భంగకరములుగా ఉన్నవనీ హృదయపూర్వకముగ విశ్వశిస్తూ. ఈ బిల్లులు చట్టరూపములోకి వచ్చేయెడల ఇవి ఉపసంహరించబడేవరకు ఈచట్టములను, ఇటు పిమ్మట నియమింపబడే కమిటీవారు సూచించబోవు ఇతర చట్టములను శాంతముగా ఉల్లంఘించ గలమనీ ప్రమాణము చేస్తున్నాము. ఈ ఉద్యమ సందర్భమున సత్యమార్గమునే అవలంబించెద మనీ, ఏ విధమైన దౌర్జన్యముకూడ చేయమనీ ప్రమాణము చేస్తున్నాము." అని ప్రమాణము చేసి, ప్రమాణపత్రములో సంతకం చేశారు. సత్యాగ్రహ సభను స్థాపించడం, ప్రతిజ్ఞాపత్రంలో సంతకం చేయడం రౌలెట్టు సత్యాగ్రహంలో మొదటి అడుగు.

తన అలవాటు ననుసరించి వెంటనే తన సత్యాగ్రహోద్దేశమును రాష్ట్రపతికి తెలియ పరచాడు. ప్రజాభిప్రాయాన్ని తనవైపునకు మరలించే ఉద్దేశంలో వార్తాపత్రికలకు సత్యాగ్రహం గురించి వర్తమానం పంపాడు. ప్రముఖ నాయకులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఇందులో బొంబాయిలోని హోంరూల్ శాఖవారు ఆయనకు కుడిభుజంగా సహాయం చేశారు. వారిలో అనేకులు గుజరాతీవారు. కైరా సత్యాగ్రహంలో ఆసక్తిని ప్రదర్శించి ధన సహాయం చేసినవారు. వారు అనేక నగరాలలో సభలు సమావేశాలు జరిపి, కరపత్రాలను ప్రకటించి రౌలెట్టు చట్టాన్ని గురించి, సత్యాగ్రహాన్ని గురించి ప్రచారం సాగించారు.

చట్టధిక్కారం, సత్యాగ్రహంలో ప్రధానభాగం. కాని సత్యాగ్రహప్రమాణం చేసిన వారే దీనికి పూనుకొనేవారు; సామాన్యప్రజలను ఆకర్షించగల కార్యక్రమం ఇంకొకటి ఉండడం అవసరమని గాంధీ భావించి మార్చి 30న (ఇది తర్వాత ఏప్రిలు 6కు మార్చబడింది) ప్రజలందరు వారి దైనందిన కార్యక్రమాల నన్నిటినీ కట్టిబెట్టి, హర్తాలు జరుపవలసిందిగాను, ఆ రోజును సంతాపదినంగా (Day of Mourning) దేశానికి గౌరవభంగం కలిగించినదినం గాను పాటించవలసిందిగాను, దీనికి సూచనగా వారు ఆరోజు ఉపవాసంచేసి దైవప్రార్థనలు గావించవలసిందిగాను, శాంతియుతంగా ఊరేగింపులు సమావేశాలు జరపవలసిందిగాను ఆదేశించాడు. ప్రజలకు మతంపట్ల ఎక్కువ ఆసక్తి ఉన్నదనీ, ఉపవాసాదులపట్ల వారికి సంప్రదాయ సిద్ధంగా విశ్వాసం ఏర్పడి ఉన్నదనీ, లౌకిక వ్యవహారాలను మతంతో జోడించినప్పుడే వారిని ఆకర్షించడం సులభసాధ్యమనీ ఆయన గ్రహించడంలో ఒక విశిష్టత ఉన్నది. ప్రజల మానసిక తత్వాన్ని తెలుసుకొన్నవాడు కావడంచేత వారు సులభంగా అర్థంచేసుకోగల కార్యక్రమాన్ని వారికి తెలియపరచాడు. దీనిని సాగించడం అందరికీ సులభసాధ్యం. ఒకే రోజున, దేశంలోని ప్రజలందరు, ఒకే లక్ష్యాన్ని సాధించుటకు పవిత్రమైన ఒక కార్యక్రమాన్ని సాగించడం దేశానికి అపూర్వం. కాని ఇది ఆసేతు హిమాచల పర్యంతం ప్రజలందరిని ఏకోన్ముఖులుగా చేయ

గలిగింది. తామందరు ఒకేజాతికి చెందిన భారతీయులనే భావం వారిని ఆవేశపరచడంలో ఈ కార్యక్రమం పటిష్టసాధన మైంది. చట్టధిక్కారానికంటె ఈ కార్యక్రమం ప్రజలందరి దృష్టిని ఆకర్షించుటలో పటిష్టసాధనమైంది.

ఈ విధంగా రౌలెట్టు సత్యాగ్రహంలో రెండు ప్రత్యేక భాగాలు ఉండడం గుర్తించవలసి ఉంది. వీటిలో ఒకటి రౌలెట్టుచట్టాన్ని సత్యాగ్రహ కమిటీ సూచించిన ఇతరచట్టాలను ధిక్కరించి శిక్షలను అనుభవించడం. రెండవది. ఏప్రిలు 6న హర్తాలు జరపడం. చట్టధిక్కారం మాత్రమే రాజకీయ నాయకులను ఎక్కువగా ఆకర్షించింది. వారిలో అనేకులు దానిపట్ల సుముఖులుగా ఉండినా అధిక సంఖ్యాకులు ఆ కార్యక్రమాన్ని ప్రతిఘటించారు. రౌలెట్టుచట్టం ఏలాటి విధినిషేధాలను విధించేటట్టిది కాకపోవడంచేత దానిని ప్రత్యక్షంగా ధిక్కరించడం నిరర్ధకం. చట్టాలను ధిక్కరించ దలచినవారు సత్యాగ్రహ కమిటీ సూచించే ఇతర చట్టాలను మాత్రమే ధిక్కరించడం సాధ్యమౌతుంది. మితవాదులకు జాతీయవాదు లనేకులకు ఇది ఎంతమాత్రం నచ్చలేదు. మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలు 1919 లో అమలులోకి రాగలవని, ఎన్నికలలో పాల్గొని శాసనసభలలో ప్రవేశించి మంత్రి పదవులను అనుభవించే అవకాశాన్ని సంస్కరణలు కలిగిస్తున్నాయని, చట్టాలను ధిక్కరించి జైలుకు వెళ్ళేపక్షాన ఆలాటి అవకాశాన్ని కోల్పోవడం తప్పదని. దానికి వీరెవ్వరు సిద్ధంగా లేరు. దేశంలో చట్ట ధిక్కార ఉద్యమం సాగినపక్షంలో సంస్కరణలను ప్రభుత్వంవారు వాయిదా వేయవచ్చు. మితవాదులు మొదలైన వారికి ఈ వాయిదా వేయడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత వీరందరు గాంధీ తలపెట్టిన చట్ట ధిక్కార సత్యాగ్రహాన్ని ప్రతిఘటించారు. కొందరి ప్రతిఘటనకు వ్యక్తిగతమైన కారణాలుకూడా ఉండినవి. దేశానికి గాంధీ నాయకుడు కావడం బిసెంటుకుగాని, తిలక్‌కుగాని ఆయన అనుచరులకుగాని ఎంతమాత్రం ఇష్టంలేదు. 1919 లో తిలక్ ఒక కేసు సందర్భంలో బ్రిటన్‌లో ఉండినా, ఆయన అనుచరులలో అనేకులు ఆయన తరపున గాంధీ ఉద్యమాన్ని ప్రతిఘటించారు. ఏప్రిలు 6న మధ్యప్రదేశ్‌లోని మహారాష్ట్ర ప్రాంతాలలోను, ఇతర మహారాష్ట్ర ప్రాంతాలలోను హర్తాలుపట్ల ప్రజలు ఉత్సాహం చూపకుండుటకు ఇదే ప్రధాన కారణం. బొంబాయి నగరంలో పూర్తి హర్తాలు జరిగినా మహారాష్ట్ర కార్మికులు అందులో ఈ కారణంచేతనే పాల్గొనలేదు. ఇంతకూ ఏ చట్టాలను ధిక్కరించవలసిందీ ఏప్రిలు 7న గాని సత్యాగ్రహ కమిటీ నిర్ణయించని కారణంగా ఆ కార్యక్రమానికి ఎక్కువ ప్రాధాన్యం లభించలేదు. హర్తాలు ఒక్కటే ప్రధాన కార్యక్రమం అయింది.

సరియైన సమాచారం అందని కారణంగా ఢిల్లీ ప్రజలు మార్చి 30 తేదీననే హర్తాలు జరిపారు. దేశంలోని తక్కిన ప్రాంతాలలో అది ఏప్రిలు 6న జరిగింది. ఇది అన్ని రాష్ట్రాలలో జరిగింది. బొంబాయి నగరంలోను గుజరాతు రాష్ట్రంలోను అధికసంఖ్యాకులు ఇందులో పాల్గొన్నారు. మధ్యప్రదేశ్‌లో అయిదు నగరాలలో హర్తాలు జరిగింది. మద్రాసు నగరంలో అనేకులు ఇందులో పాల్గొన్నారు. సాయంత్రం బీచిలో బ్రహ్మాండమైన సభ జరిగింది. ఆంధ్రలో విజయవాడ మొదలైన నగరాలవారు దీనిలో పాల్గొన్నారు. బెంగాలులో కలకత్తా. ఢాకా నగరాలలో ప్రజలు ఎక్కువ ఉత్సాహాన్ని ప్రదర్శించారు. చిత్తరంజన్‌దాస్, చక్రవర్తుల నాయకత్వంలో గొప్పసభలు జరిగాయి. బీహారులో పాట్నా, ముజఫర్‌పూర్, మాంఘీర్, గయా మొదలైన నగరాలలో హర్తాలు విజయవంతంగా జరిగింది. మజారుల్‌హక్, రాజేంద్రప్రసాద్,

సచ్చిదానంద సిన్‌హా మొదలైనవారు సమావేశాలను జరిపారు. ఉత్తరప్రదేశ్ నగరాలనేకంలో వేలాది ప్రజలు హర్తాలులోను సమావేశాలలోను పాల్గొన్నారు. పంజాబులోని లాహోరు, అమృతసర్‌వంటి నగరాలలో హర్తాలు సమావేశాలు విజయవంతంగా జరిగాయి.

సమాచార సౌకర్యాలు లేని ఆ రోజులలో నగరవాసులే ఎక్కువగా హర్తాలులో పాల్గొనడంలో ఆశ్చర్యపడవలసింది లేదు. వార్తాపత్రికలు, ఇతర ప్రచార సాధనాలు వారికిమాత్రమే అందుబాటులో ఉండినవి. సత్యాగ్రహ సభలు, హోంరూల్ శాఖలు వాటిలోనే ఎక్కువగా స్థాపింపబడినవి. అయినా నగరాలకు సమీపంలో ఉండిన గ్రామీణప్రాంతాలలో కూడా ప్రజలు ఏప్రిలు 6వ జరిగిన హర్తాలులో పాల్గొన్నారు. ఆసేతు హిమాచల పర్యంతం వ్యాపించిన దేశంలోనివారు ఈ రీతిన ఏకోన్ముఖంగా ప్రవర్తించడం కనివిని ఎరుగని విషయం. ఇంతేకాదు. దీనిఉద్దేశమంతా పరాయి పరిపాలనను ప్రతిఘటించుటకు ప్రజలందరు సిద్ధంగా ఉన్నారని వ్యక్తం చేయడమనే విషయం గుర్తించదగినది.

# 3

ఈ విధంగా ప్రజలు ప్రవర్తించడానికి గాంధీపట్ల 1919 నాటికి వారికి ఏర్పడిన భక్తి ప్రధాన కారణం. ఆయన దేశానికి విముక్తి కలిగించుటకు అవతరించిన మహాత్ముడని, ఋషితుల్యుడని, సామాన్య మానవులకు సేవచేయుటయే జీవితపరమార్థంగా పెట్టుకొన్నవాడనీ, ప్రజలు భావించసాగారు. అలాటివాడు ఆదేశించిన పిలుపును హృదయపూర్వకంగా అనుసరించడం తమ ధర్మమని వారు విశ్వసించారు. ఆయనవంటి నాయకుడు ఆదేశించిన కారణంగానే ప్రజలు అధిక సంఖ్యలో హర్తాలులో పాల్గొనడం జరిగింది.

కాని ఇది ఒక్కటే వారు పాల్గొనుటకు కారణమని భావించరాదు. 1919 నాటికి దేశంలోని వివిధ వర్గాల ప్రజలలో అనేక కారణాల మూలంగా బ్రిటిష్ ప్రభుత్వంపట్ల అసంతృప్తి ఏర్పడి ఉండినది. ఈ పరిపాలన కాలంలో అధిక సంఖ్యాకులు వంశ పారంపర్యంగా అనుసరిస్తున్న వృత్తులను కోల్పోయి, దరిద్రులయ్యారు. కంపెనీ పరిపాలన తొలగి సార్వభౌముల ప్రత్యక్ష పరిపాలన ఏర్పడినా వర్తక లాభాల దృష్టితోనే ఈ పరిపాలన సాగుతూ వచ్చింది. నిరుద్యోగ సమస్య తీవ్రరూపం ధరించింది. క్షామాల సంఖ్య పెరిగాయి. కాని ప్రభుత్వం మూలాన ఏలాటి రక్షణ ప్రజలకు లభించలేదు. సాహుకార్లు జమీందారులు ఉన్నత ఉద్యోగాలను సంపాదించగలిగినవారు భోగభాగ్యాలను అనుభవించ గలిగారు; కాని దేశంలో అలాటివారి సంఖ్య చాలా స్వల్పం. ప్రజల అసంతృప్తికి ఈ దారిద్ర్యం మౌలిక కారణం. దానిని వారు వ్యక్తం చేయలేకపోవడంతో ప్రభుత్వం వారు చాలా తృప్తిని గాంచినారని భావించింది. కాని ఇది గొప్ప పొరబాటు. వారి అసంతృప్తిని భారీఎత్తున వ్యక్తం చేయుటకు గాంధీ రౌలెట్టు సాధనాన్ని వినియోగించాడు. హర్తాలులో ఈ అసంతృప్తి కారణంగా వారు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ప్రజలలో అసంతృప్తి లేనప్పుడు నాయకుడెంతవాడైనా వారిని ఈలాటి ఉద్యమాలలో పాల్గొనేటట్లు చేయలేడు. ఇది ప్రపంచ చరిత్ర స్పష్టంచేస్తూ ఉంది. ప్రజల అసంతృప్తి, ప్రజలను నడిపించగల నాయకుడు ఈ రెండూ కలిసినప్పుడే గొప్ప ఉద్యమం సాగుతుంది.

1919 నాటికి ఈ అసంతృప్తి అనేక కారణాలమూలంగా ప్రాబల్యం గాంచింది. నాలుగు సంవత్సరాల యుద్ధ ఫలితంగా ధరలు విపరీతంగా పెరిగి కనీస అవసరాలకు కూడా

కొరత ఏర్పడింది. ధరలను అదుపులో ఉంచుటకు ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలు ఉద్యోగుల అవినీతి కారణంగా ఫలప్రదంకాలేదు. పన్నుల భారం విపరీతంగా పెరిగింది. యుద్ధ కాలంలో ప్రజలను పీడించి నిర్బంధ పూర్వకంగా పంజాబు మొదలైన రాష్ట్రాలలో సైనికులను సైన్యంలో చేర్చుకొన్నారు. రుణసేకరణను చేయడంలోను విరాళాలను సేకరించ డంలోను అధికారులు అమానుషంగా ప్రవర్తించారు. ఇవి అన్నీ ముండ్లవలె ప్రజల హృదయాలలో నాటుకొన్నవి.

1917-18లో ఇన్‌ఫ్లూయంజా వ్యాధీ ప్లేగూ అనేక రాష్ట్రాలలో వ్యాపించి ఎంతో ప్రాణ నష్టాన్ని కలిగించాయి. వీటి మూలంగా ప్రజల స్థితి మరింత దిగజారి పోయింది.

ఇవి అన్నీ ప్రజల అసంతృప్తికి కారణాలైనాయి. ఇవి అన్ని రాష్ట్రాలకు వర్తించే కారణాలు. కాని పంజాబులోని అధికారులు ఈ విషయాలలో ప్రజలపట్ల మరింత దారుణంగా ప్రవర్తించారు. 1913 నుండి లెఫ్టనెంటు గవర్నరుగా ఉండిన సర్ మైకేల్ వడయ్యర్ నగరాల లోని విద్యాధికుల పట్లా మధ్యతరగతికి చెందిన వారిపట్లా ద్వేషాన్ని వహించి వారికి నష్టం కలి గించే కార్యక్రమాలను సాగించాడు. లాలా హరికిషన్‌లాల్ అనే ప్రముఖుడు అతని ద్వేషానికి గురి అయ్యాడు. దాని ఫలితంగా లాల్ ఆధ్వర్యంలో ఉండిన బ్యాంక్‌లన్నీ దివాలా తీసి వేలాది మధ్యతరగతి కుటుంబాలకు అపార నష్టం కలిగించె. దీని ప్రభావం డిల్లీ నగర వర్తకులపై కూడా వ్యాపించింది. ఈలాటివాడు రాష్ట్ర పాలకుడు కావడం ప్రజల దురదృష్టం. 1919లో రాష్ట్రంలో సంభవించిన దురంతాలన్నిటికీ ఇతడే కారకుడు. బ్రిటిష్ పరిపాలన సుస్థిరత్వానికి తాను పాటుపడుతున్నట్లు భావించాడు. కాని ఈ ఉదంతాల ఫలితంగానే పరాయి ప్రభుత్వం పట్ల ప్రజలలో శాశ్వత ద్వేషం ఏర్పడి దాని నిర్మూలనానికి దారి తీసింది.

పై కారణాలన్నీ ప్రజలందరి అసంతృప్తికి కారణాలైనాయి. కాని దేశంలోని ముస్లింల అతృప్తికి ప్రత్యేక కారణం ఉండినది. ముస్లిములందరికి మతగురువైన కలీఫు (ఇతడు టర్కీ దేశానికి సుల్తాను కూడా) పట్ల ప్రపంచ సంగ్రామ కాలంలోను, సంగ్రామం ముగిసిన తర్వాతను బ్రిటిష్‌వారు అనుసరించిన విధానము ఈ ప్రత్యేక కారణం. దీని ఫలితంగా అతని పరిపాలనలో ఉండిన దేశాలలో అనేకాన్ని బ్రిటిష్‌వారు ఫ్రెంచివారు వశపరచుకొన్నారు. వశపరచుకొన్న ప్రదేశాలలో ముస్లింల పుణ్యక్షేత్రాలు కూడా ఉండినవి. ఇవి గాక అతని లౌకికాధికారం కూడా క్రైస్తవ రాజ్యాల వశంలోకి వచ్చింది. ఈ పరిణామాలు భారతదేశం లోని ముస్లింలకు ఆగ్రహం కలిగించాయి. కలీఫా సామ్రాజ్యం విచ్ఛిన్నం కాకూడదనీ, ముస్లింల పుణ్యక్షేత్రాలన్నీ అతని పరిపాలనలోనే ఉండవలెననీన్నీ అందుకుగాను వారు సమస్త త్యాగాలు చేయుటకు సిద్ధపడవలెననీన్నీ వారిలో ఒక వర్గం భావించి ఖిలాపత్ ఉద్యమం అనే పేరుతో ఒక ఉద్యమాన్ని ప్రారంభించింది. ముస్లింలతో దక్షిణ ఆఫ్రికాలో ఏర్పడిన సంబంధం కారణంగా గాంధీ ఈ ఉద్యమాన్ని అభిమానించాడు. ఉద్యమానికి నాయకులైన మహమ్మదాలీ షౌకతాలీ సోదరులను ప్రభుత్వం నిర్బంధంలో పెట్టినా 1916 నుండి వారి విడుదలకై ప్రయత్నం చేయసాగాడు. హిందువుల సహాయం ఉంటేనేగాని తమ ఉద్యమం ఫలప్రదం కాజాలదని ఖిలాపత్ ఉద్యమ నాయకులు భావించారు. అలాటి సహాయాన్ని చేయవలసిందిగా గాంధీ హిందువులను అర్థించాడు.

ఖిలాఫత్ ఉద్యమ ఫలితంగా ముస్లిం ప్రజలలో బ్రిటిష్ ప్రభుత్వం పట్ల అసంతృప్తిన్నీ, గాంధీపట్ల విశ్వాసమున్నూ, హిందువుల పట్ల స్నేహ భావమున్నూ ఏర్పడినాయి. అందువేతనే వారు రౌలెట్టు సత్యాగ్రహంలోను ఏప్రిలు 6 హర్తాలులోను భారీ ఎత్తున ఉత్సాహంతో పాల్గొనుటకు సిద్ధ పడ్డారు.

ఇంతేకాదు. ఈ సత్యాగ్రహ కాలంలో వారు హిందువులను తమ సోదరులని భావించి వారితో కలిసిపోయ్యారు. డిల్లీ, లాహోరు, బొంబాయి, కలకత్తా మొదలైన నగరాల లోని గొప్ప మసీదులలో ప్రార్థనలను జరిపే సమయంలో హిందువులకు ప్రవేశం కల్పించారు. ఇది ఎన్నడూ కనీ వినీ ఎరుగని దృశ్యం. హిందూ సన్యాసులు, నాయకులు మసీదుల వేదికల నుండి చేసిన ఉపదేశాలను మౌల్వీలు ఉలేమాలు చేసిన ఉపదేశాల కంటె ఎక్కువ శ్రద్ధతో ఆలకించారు. ఆ రోజులలో హిందువులు ముస్లింలు రెండు ప్రత్యేక వర్గాలకు చెందినవారనే భావం అదృశ్యమైంది. రౌలెట్టు సత్యాగ్రహ ఫలితంగా కలిగిన పరిణామాలలో ఈ సమైక్యత ప్రత్యేకంగా గుర్తించదగిన విషయం.

మాంటెగుచెమ్సుఫర్డు సంస్కరణలు విద్యాధికులు వాంఛించిన బాధ్యతాయుత పరిపాలన విధానాన్ని ప్రవేశపెట్టని కారణంగా వారిలో కూడా ఒక వర్గంవారు ప్రభుత్వం పట్ల అసంతృప్తిని గాంచినారు.

ఈలాటి వాతావరణంలో అవతార పురుషుడుగా ప్రజల అభిమానానికి పాత్రుడైన గాంధీ హర్తాలు జరిపించవలసిందిగా చేసిన పిలుపును ప్రజలు ఆలకించి, దేశమంతటా హర్తాలులో పాల్గొనడంలో ఆశ్చర్యపడవలసింది లేదు. హర్తాలు విజయవంతం కావడానికి ప్రజలకు ఆయన పట్లగల భక్తి ఒక్కటే కారణం కాదని. బ్రిటిష్ పరిపాలకుల పట్ల ప్రజలలో 1919 నాటికి ఏర్పడిన అసంతృప్తి కూడా కారణమని గుర్తించడం అవసరం.

## 4

సత్యాగ్రహానికి అహింస ప్రధాన లక్షణం. ఆ కారణంచేత ఆశ్రమంలో సుశిక్షితులైన వారు మాత్రమే సత్యాగ్రహాలలో పాల్గొనడం ఉత్తమ విధానం అని గాంధీ భావించాడు. కాని అలాటివారి సంఖ్య చాలా పరిమితం. రౌలెట్టు చట్టం పట్లను, దాని నిర్మాతలైన ప్రభుత్వాధికారుల పట్లను, ప్రజలలో ఎవరో కొందరు మాత్రమే గాక అందరూ ప్రతికూలురనే భావం అధికారులలో కలుగుటకు ప్రజలందరు హర్తాలులో పాల్గొనడం అవసరమని గాంధీ విశ్వసించాడు. వారు దౌర్జన్య రహితంగా ప్రవర్తించుటకుగాను మత సంబంధమైన ఉదయస్నానం. ఉపవాసం. ప్రార్థనలు వారు అనుసరించదగిన కార్యక్రమంగా నిర్ణయించాడు. ప్రజలలో సంస్కారం గలవారిని నాయకులుగా నియమించాడు. అయినా కొన్ని ప్రాంతాలలో హర్తాలు రోజుననేగాక తర్వాతకూడా దౌర్జన్య కార్యక్రమాలు సంభవించాయి; తన ఉద్దేశానికి విరుద్ధంగా ఈలాటి చర్యలు జరగడంచేత ఆయన ఏప్రిలు 18న ఉద్యమాన్ని తాత్కాలికంగా ఉపసంహరించుకొనవలసి వచ్చింది. శాంతియుతంగా జరగవలసిన సత్యాగ్రహం దౌర్జన్యాలకు దారి తీసి ఉద్యమానికి అపఖ్యాతిని గలిగించడం గుర్తించదగిన విషయం.

ఈ పరిణామానికి ప్రధానంగా కారణాలు మూడు అని చెప్పవచ్చు. వీటిలో మొదటిది గుంపులుగాను మూకలు (Mobs) గాను కూడిన ప్రజల మానసిక తత్వం(Mob pysychology)

వ్యక్తులుగా నీతిమార్గాన నడిచేవారు కూడా గుంపులలోను మూకలలోను కలిసిపోయినప్పుడు ఆవేశపరులై దౌర్జన్యాలలోకి దిగుతారు. గుంపులయొక్కయు మూకలయొక్కయు ప్రవర్తనకు విచక్షణ రహితమైన ఆవేశం ఆధారం. అందుచేత వాటిలో చేరినవారు ఏలాటి నియమాలకు లోబడక దౌర్జన్యాలలోకి దిగుతారు. రౌలెట్టు సత్యాగ్రహ కాలంలో కొన్ని ప్రాంతాలలో ఇదే జరిగింది. మహాత్ముడూ, సమస్తం తెలిపిన గాంధీ హర్తాలు చేయవలసిందిగా ప్రజలను ఆదేశించినా వారిలో కొందరు ఐచ్ఛికంగా హర్తాలులో పాల్గొనక పోవడం తక్కిన వారికి ఆవేశం ఆగ్రహం కలిగించింది. ఆలాటి వారిని బలవంతపెట్టి వారి దుకాణాలను మూత బడేటట్లు చేయడంలో అధర్మం ఏదీ లేదని, అది మహాత్ముని ఆదేశాన్ని ఆచరణలో ఉంచడమేనని గుంపులు మూకలు భావించారు. దీని ఫలితంగా ఘర్షణ సంభవించి దౌర్జన్యానికి దారి తీసింది.

కాని దౌర్జన్య సంఘటనలకు ఇది ఒక్కటే కారణం కాదు. దీనికంటే బలవత్తరమైన కారణం శాంతి భద్రతలను రక్షించడమే తమ విధ్యుక్త ధర్మంగా భావించిన పోలీసులు సైనికులు లాఠీలను తుపాకులను వినియోగించి శాంతిని రక్షించుటకు పూనుకొనడం. ఇది అగ్నిలో ఆజ్యం పోసినట్లుగా పరిణమించింది. ఈ వినియోగం మూలంగా గుంపులు మరింత ఆవేశాన్ని ఆగ్రహాన్ని పొందినవారై, తమ శక్తికొలది అధికారుల పైనను, ప్రభుత్వ ఆస్తుల పైనను దౌర్జన్య కార్యక్రమాలు సాగించి పగ తీర్చుకొన సిద్ధపడ్డాయి. పోలీసులు కొంత ఆత్మ నిగ్రహంతో ప్రవర్తించిన బొంబాయివంటి నగరాలలో దౌర్జన్యాలు ఎక్కువగా జరగకపోవడం. వారు విశృంఖలంగా ప్రవర్తించిన పంజాబులో దౌర్జన్యాలు విపరీతంగా జరగడం ఈ విషయాన్ని స్పష్టంచేస్తూ ఉంది.

అన్ని ప్రదేశాలలో దౌర్జన్యం ఏప్రిలు 10న. 11న ప్రారంభమైంది. ఏప్రిలు 9న రైలులో డిల్లీకి పంజాబుకూ ప్రయాణం చేసి, అక్కడ శాంతిని సుస్థిర పరచడానికి ఉద్దేశించిన గాంధీని అధికారులు అక్కడికి వెళ్ళరాదని నిషేధాజ్ఞలు జారీ చేశారు. ఆయన ఆ ఆజ్ఞలను ఉల్లంఘించగా వెంటనే ఆయనను ఆరెస్టు చేసి రైలులో బొంబాయికి తీసుకొని వెళ్ళారు. తమకు ఏకైక నాయకుడుగా భావించిన మహాత్ముని అధికారులు అరెస్టు చేయడం ప్రజలందరిని ఆగ్రహ పరవశుల చేసింది. దీని ఫలితంగా అనేక ప్రాంతాలలో ప్రజలు దౌర్జన్యాలలోకి దిగారు. దీనితో పాటు పంజాబులో అదే రోజున డాక్టరు కిచ్లూ అనే ముస్లిం ప్రముఖుని, డాక్టరు సత్యపాల్ అనే హిందూ ప్రముఖుని అధికారులు అరెస్టు చేసి ప్రవాసంలోకి పంపారు. ఒక వైపున మహాత్ముని అరెస్టు, ఇంకొక వైపున స్థానిక నాయకుల అరెస్టు పంజాబు ప్రజలలో మరింత ఆగ్రహాన్ని కలిగించి కొన్ని దౌర్జన్యాలకు దారి తీశాయి.

ఈలాటి కారణాల ఫలితంగా శాంతియుతంగా జరగవలసిన సత్యాగ్రహం దౌర్జన్య రూపం ధరించి అనేక అవాంఛనీయములైన పరిణామాలకు దారి తీసింది. చరిత్ర గతి ఈలాగే సాగుతుంది. "మానవుడు ఒకటి తలంచితే దైవం ఇంకొకటి తలంచి దానికి విఘ్నం కలిగిస్తుందనే లోకోక్తి" దీని ఫలితమే.

## 5

ఈ పరిణామాలకు డిల్లీ నగర సత్యాగ్రహ ఉదంతం ఒక దృష్టాంతం. ఇది మూడు దశలలో జరిగింది మార్చి 30, 31 లో మొదటి దశ; ఏప్రిలు 1 నుండి 9 వరకూ రెండవదశ: 10 నుండి 18 వరకూ మూడవ దశ.

గాంధీ ప్రథమంలో దేశవ్యాప్తంగా హర్తాలు మార్చి 30న జరగవలసిందిగా ఆదేశించి, తర్వాత తేదీని ఏప్రిలు 6కు మార్చాడు. ఈ మార్పు సకాలంలో ఢిల్లీ ప్రజలకు తెలియక, వారు మార్చి 30న హర్తాలు జరిపారు. మొదట అది శాంతియుతంగానే జరిగింది. కాని రైలు స్టేషన్‌లో మిఠాయి దుకాణాదార్లు హర్తాలు జరపని కారణంగా కొందరు ప్రజలు అక్కడికివెళ్ళి దుకాణాలను మూత వేయవలసిందిగా వారిని బలవంత పెట్టారు. వారు స్టేషన్ అధికారుల సహాయం అపేక్షించగా అధికారులు గుంపులోని ఇద్దరిని నిర్బంధంలోకి తీసుకొన్నారు. ఈ వార్త నగరమంతటా వ్యాపించగా నలుమూలల నుండి జనం అధిక సంఖ్యలో స్టేషన్‌లో గుమిగూడింది. ఇది సంఘర్షణకు దారి తీయగా పోలీసులు సైనికులు అక్కడికి వచ్చి కాల్పులు జరిపారు. కొందరు మరణించారు. అనేకులు గాయ పడినారు. ఇది కారణంగా జనసమ్మర్దంతో కూడిన ఛాందినీ చౌకులో ఇంకొక సంఘర్షణ జరిగింది. పోలీసులు అక్కడికి కూడా వెళ్ళి గుంపును చెదరగొట్టే మిషతో కాల్పులు జరపగా కొందరు మరణించారు. అనేకులు గాయ పడినారు.

ఆరోజు సాయంకాలం ప్రజల ఉద్రేకాన్ని తగ్గించ గోరి ఆర్య సమాజ నాయకుడుగా ప్రసిద్ధి గాంచిన స్వామి శ్రద్ధానంద పెద్ద సమావేశాన్ని ఏర్పాటుచేసి ప్రజలు శాంతియుతంగా ప్రవర్తించవలెనని, రౌలెట్టు చట్టాన్ని హిందువులు మహమ్మదీయులు కలిసి ప్రతిఘటించవలెనని ఉద్బోధించాడు. సమావేశం ముగిసిన తర్వాత ఆయన అనుచర బృందంతో ఇంటికి వెళ్ళుతున్నప్పుడు రోడ్డుప్రక్క ఉండిన పోలీసు దళంలోని వాడింకొకడు ఆయనపైన తుపాకిని గురిపెట్ట ప్రయత్నిచంగా వెంటనే ఆయన అతని ఎదుట నిలబడి, అంగర్ఖాను విప్పి, రొమ్మును చూపి, ధైర్యం ఉంటే కాల్పులను జరపవలసిందిగా ఆదేశించాడు. పోలీసువాడు దిగ్భ్రమ చెంది ఉండగా పోలీసు అధికారి ఆ సమయంలో అక్కడికి రావడం జరిగింది. అతడు పోలీసువానికి బుద్ధి చెప్పి సంఘర్షణ ప్రమాదాన్ని తప్పించాడు. ఈ ఉదంతం ఫలితంగా శ్రద్ధానందుని ప్రఖ్యాతి ఇనుమడించింది. ఢిల్లీ ప్రజలకు ఆయన ప్రధాన నాయకుడయ్యాడు.

గాంధీ, హర్తాలు ఒక రోజున మాత్రమే జరపవలసిందిగా ఆదేశించాడు. కాని 30 తేదీన పోలీసు కాల్పులపట్ల నిరసన చిహ్నంగాను మృతవీరుల సంస్మరణార్థమున్నూ 31న కూడా ఢిల్లీ ప్రజలు హర్తాలు జరిపారు. మృతవీరులైదుగురి మృత దేహాలను 50 వేల జనం శ్మశాన వాటికకు ఊరేగింపుగా తీసుకొనిపోయి ఖనన క్రియలు దహన క్రియలు జరిపారు. నాయకులు శాంతియుతంగా ప్రవర్తించవలసిందిగాను, హర్తాలును విరమించవలసిందిగాను ఉద్బోధించారు. ఆ రోజున అవాంఛనీయ పరిణామాలేవీ సంభవించలేదు. ఈ రెండురోజుల హర్తాలులలో ధనికులు, మధ్యతరగతివారు, నిరుపేదలు, అన్ని మతాలవారు పాల్గొన్నారు.

ఏప్రిలు 1 నుండి 9 వరకూ రాజకీయ సంచలనం ఎక్కువగా కనిపించలేదు. గాయ పడినవారు మృతిజెందగా వారి అంత్యక్రియల సందర్భంలో ఊరేగింపులు, నాయకుల ఉపన్యాసాలు జరిగాయి. ఏప్రిలు 4 శుక్రవారంనాడు ముస్లింలు జుమ్మా మసీదులో ప్రార్థనలు చేయ సమావేశమైనప్పుడు ఏరు శతాబ్దాల దేశ చరిత్రలో కనీ వినీ ఎరుగని ఉదంతం జరిగింది. దేశంలోని మసీదులన్నిటిలో జుమ్మా మసీదు అగ్రస్థానం లోనిది. మొగలాయి సామ్రాజ్యం అత్యంత వైభవంలో ఉన్నప్పుడు షాజహాన్ చక్రవర్తి దీనిని కట్టించాడు. ఏప్రిలు 4న

ప్రార్థనలో పాల్గొనవలసిందిగా ముస్లింలు హిందువులను ఆహ్వానించారు. ఇది కలలో కూడా భావించుటకు సాధ్యంకాని అపూర్వమైన ఆహ్వానం. ప్రార్థన సమావేశానికి హాజరైన వారిలో హిందువులు మూడవ వంతు. దీనికంటె అద్భుతమైనది ఇస్లాం మతానికి పరమ విరోధిగా భావింపబడిన ఆర్య సమాజ నాయకుడైన స్వామీ శ్రద్ధానంద ప్రార్థన వేదికను ఆరోహించి ఉపన్యసించడం. రౌలెట్టు సత్యాగ్రహం ఉభయ మతాలవారిలో ఏలాటి సోదర భావాన్ని సృష్టించ గలిగిందో ఈ ఉదంతం స్పష్టం చేస్తున్నది.

ఏప్రిలు 6 న దేశవ్యాప్తంగా హర్తాలు జరిగింది. డిల్లీ ప్రజలు తిరిగీ హర్తాలు జరపవలసిన అవసరం లేకపోయినా ఆ రోజున హర్తాలు జరిపారు.

డిల్లీ నగరంలో శాంతిని నెలకొల్పవలసిందిగా కోరుతూ నాయకులు గాంధీని ఆహ్వానించారు. ఆయన బొంబాయిలో రైలు ఎక్కి 9 రాత్రి డిల్లీ చేరవలసి ఉండినది. ఆయనకు ఘనమైన స్వాగతాన్ని అందజేయుటకు వేలాది జనం 9 రాత్రి స్టేషన్‌ను వెళ్లారు. ఆయన రైలులో ఎక్కడా కనుపించని కారణంగా జనం ఆశాభంగాన్ని పొంది ఇండ్లకు వెళ్ళి పోయ్యారు.

డిల్లీస్టేషన్‌కు కొంతదూరంలో ఇంకొక చిన్న స్టేషన్‌లో డిల్లీ అధికారులు ఆయన డిల్లీరాకను నిషేధిస్తూ ఉత్తరువులు జారీచేశారు. వాటిని ఉల్లంఘించగా ఆయనను అరెస్టుచేసి బంధితునిగా బొంబాయికి తీసుకొని వెళ్ళినట్లు ఏప్రిలు 10 ఉదయానికి వార్తలందినవి. డిల్లీ ప్రజలు ఆగ్రహపరవశులయ్యారు. 10 న హర్తాలు ప్రారంభించి 9 రోజులపాటు దానిని సాగించారు. గుమిగూడిన గుంపులను చెరదగొట్టడంలో మధ్యకాలంలో కొందరు మరణించారు. అనేకులు గాయపడినారు. గాంధీ అరెస్టుకు నిరసనగా ఇన్నిరోజులపాటు హర్తాలు జరపడం నాయకు లెవ్వరికీ అంగీకారం కాలేదు. దుకాణాలను తెరవవలసిందిగా వారు వర్తకులను బ్రతిమాలారు. కాని అప్పటికి ప్రధమశ్రేణికి చెందిన డాక్టరు అన్సారి, హాజిఅజ్మల్‌ఖాన్‌వంటి నాయకుల పలుకుబడి తగ్గింది. ద్వితీయశ్రేణికి చెంది సామాన్యప్రజలతోపాటు ఆవేశాలకు ఆగ్రహాలకు గురి అయినవారు నాయకులయ్యారు. ప్రజలను అదుపులో ఉంచడం వారిలక్ష్యం కాదు. ప్రభుత్వం హర్తాలును ముగించవలసిందిగా నాయకులతో సంప్రతింపులు జరిపిందిగాని ఫలితం లేకపోయింది. ప్రజాజీవితం స్తంభించి పోయింది. 16 న కొన్ని దుకాణాలను తెరిచారు గాని పోలీసుదళాలు అనవసరంగా వీధులవెంట తిరగడంచేత వెంటనే అవి మూతబడిపోయినవి.

14, 15, తేదీలలో చుట్టుపట్ల గ్రామాలలోని జాటులు సుమారు 20 వేలమంది పొడుగాటి కర్రలతో నగరాన్ని ప్రవేశించారు. పరిస్థితులు విషమించాయి.

నగరంలో 10 నుండి దౌర్జన్యం వ్యాపించడం 14, 17 తేదీలలో సంఘర్షణలు బయలుదేరి పోలీసు కాల్పుల మూలంగా కొందరు మరణించడం, మూకలను అదుపులో పెట్టడం తమకు సాధ్యంకాక పోవడం నాయకులలో విసుగును అతృప్తిని కలిగించాయి. వారు మధ్యతరగతికి చెందినవారు. వర్తక వ్యాపారాలద్వారాను, ఇతరవృత్తులద్వారాను నెమ్మదిగ జీవితాన్ని సాగించ ఉద్దేశించినవారు. సామాన్య ప్రజల దౌర్జన్యం వారి కెంతమాత్రము నచ్చ లేదు. సత్యాగ్రహ సభ ప్రజల కార్యక్రమాలను విరమింపజేయడంలో విజయాన్ని సాధించ లేక పోయినందుకు వారెంతగానో విచారించి, 17 న సభను రద్దుచేసి దానికి సంబంధించిన రికార్డులను పారవేశారు. వారి ఆశాభంగానికి ఇది ఒక గొప్ప తార్కాణం.

మధ్యతరగతివారిలో కలుగుతున్న ఈ మార్పును ప్రభుత్వం గుర్తించి, శాంతిభద్రతల సంస్థాపనకై 18 న కఠిన చర్యలను తీసుకొన్నది. సైనిక దళాలను నగరంలో సమీకరించి సభలను సమావేశాలను నిషేధిస్తూ రాజద్రోహ సభలచట్టాన్ని (Seditiou Meetings Act) అమలులో పెట్టింది.

వీటి ఫలితంగా 19 న హర్తాలు విరమించబడింది. కాని దేశానికి ప్రధాన నగరమైన ఢిల్లీలో 20 రోజులపాటు జరిగిన సత్యాగ్రహం ప్రజలపై శాశ్వత ముద్రను వేసింది. రౌలెట్టు చట్ట ఫలితంగా ప్రజలకు ప్రభుత్వంపట్ల ఏర్పడిన ద్వేషం తగ్గలేదు. బ్రిటిష్ పరిపాలన 194' వరకు జరిగినా పరిపాలకులు ప్రజల అభిమానాన్ని సంపాదించలేక పోయినారు.

## 6

(1) ఏప్రిల్ 6 న గాంధీ బొంబాయినగరంలో ఉండి హర్తాలును శాంతి యుతంగా సాగించగలిగాడు; కాని 10 న ఆయన అరెస్టువార్త ప్రజలలో అలజడి కలిగించింది. 10, 11 న హర్తాలు జరిగింది. గుమిగూడిన ప్రజలు, హర్తాలులో పాల్గొనని దుకాణాలపైనను, వారి బండ్లపైనను, పోలీసువారిపైనను రాళ్ళురువ్వడం ప్రారంభించారు. కాని దీనిమూలంగా విస్తార నష్టం కలంలేదు. పోలీసులు సైనికులు ఆత్మనిగ్రహంతో ప్రవర్తించారు; కాల్పులను జరిపించ లేదు. 11 న గాంధీ బొంబాయికి వచ్చి ప్రజల ఆవేశాన్ని తగ్గించి, శాంతియుతంగా ప్రవర్తించ వలసినట్లు బుద్ధిచెప్పాడు. అలాగు ప్రవర్తించని పక్షంలో వారిపై తాను సత్యాగ్రహాన్ని వినియోగించవలసి వస్తుందని తెలియపరచాడు. దీని ఫలితంగా 12న నగరంలో శాంతి పరిస్థితులు నెలకొన్నాయి.

ఏప్రిల్ 6 న జరిగిన హర్తాలులోను 10, 11 న జరిగిన వాటిలోను జవళీవర్తకులు, వెండి బంగార వ్యాపారంచేసే మార్వాడీలు, వారిక్రింద పనిచేసే గుమాస్తాలు మొదలైనవారు, విద్యార్థులు, విద్యాధికులైన మహారాష్ట్రులు, ఖిలాఫత్ ఉద్యమానికి చెందిన ముస్లింలు హోంరూల్ నాయకులచే ప్రభావితులైనవారు, ఎక్కువగా పాల్గొనడం గుర్తించదగిన విషయం.

(2) ఏప్రిల్ 6 న గుజరాతులోని అహమ్మదాబాదు మొదలైన నగరాలలోను గ్రామీణ ప్రాంతాలలోను ప్రజలు అధిక సంఖ్యలో హర్తాలు జరిపారు. మహాత్ముని సందేశానుసారం శాంతి యుతంగా ప్రవర్తించారు.

కాని 10 న గాంధి అరెస్టువార్తను విన్న తర్వాత అహమ్మదాబాదులోని కార్మికుల మనస్తత్వం పూర్తిగా మారింది. దైవసమానుడుగా భావించబడిన గాంధీని అధికారులు అరెస్టు చేయడం వారిని ఆగ్రహ పరవశుల గావించింది. వారు పనులకు వెళ్ళడం మాని, గుంపులు గుంపులుగా వీధులవెంట తిరుగసాగారు. గాంధీపట్ల గౌరవహీనంగా మాట్లాడినారన్న కారణంగా ఇద్దరు తెల్లవారిపై చేతులు చేసుకొన్నారు. ఒక ఘర్షణ సంభవించగా పోలీసులు కాల్పులు జరిపారు. ప్రాణనష్టం కలగలేదుగాని కొందరు గాయపడ్డారు. కార్మికులను శాంతిపరచే ఉద్దేశంతో సాయంకాలం వల్లభాయిపటేల్, ఇందులాల్ యాజ్ఞిక్, కస్తూరిబాయి వారిని ఆశ్రమ సమీపంలో సమావేశపరచి శాంతియుతంగా ప్రవర్తించవలసిందిగా హితబోధచేశారు.

11 న పరిస్థితులు విషమించినవి. అనసూయాబెన్ కూడా అరెస్టు చేయబడినట్లు వదంతులు వ్యాపించడం దీనికి ప్రధాన కారణం. ఇదిగాక కార్మికులపై నాయకత్వం వహించిన

వారు కొందరు బుద్ధిపూర్వకంగా దౌర్జన్య కార్యక్రమాలను సాగించవలసిందిగా వారిని పురికొల్పారు. దాని ఫలితంగా వారు కనిపించిన తెల్లఅధికారులపై చేతులు చేసుకొన్నారు. ప్రభుత్వ భవనాలను అగ్నిహోత్రునిపాలు చేశారు. తంతి తీగెలను కత్తిరించి వేశారు. కొందరు భారతీయ అధికారుల ఇండ్లపైబడి దోపిడిచేశారు. పోలీసు స్టేషన్‌లన్నిటినీ నాశనం చేశారు.

గాంధీ, అనసూయాబెన్ క్షేమంగా ఉన్నట్లు తెలిసిన కారణంగాను 11 న వినాశన కార్యక్రమం పూర్తిగా జరిగిన కారణంగాను 12 న ప్రజలు శాంతించారు. కాని అధికారులు వారిపై కసితీర్చుకొనే ఉద్దేశంతో కాల్పులు సాగించారు. 28 మంది హతులైనారు. 123 మంది గాయపడినారు. 13 న గాంధీ అహమ్మదాబాదుకువెళ్ళి, ప్రజలను సమావేశపరచి, వారి దౌర్జన్యచర్యలను నిర్మొగమాటంగా ఖండించాడు. తమకు ఆయనపట్ల గల ప్రేమయే తమ్ము దౌర్జన్య కార్యక్రమాలకు పురికొల్పిందని వారు ఆయనకు విన్నవించి తమ విచారాన్ని తెలియపరచారు. తమకు ఆరాధ్యుడైన నాయకునిపై ద్వేషాన్ని వహించి నిర్బంధించిన ప్రభుత్వంపై ద్వేషం వహించి, ఆయన బోధించిన అహింసా సిద్ధాంతాన్ని వారు అర్థం చేసుకొనలేక పోయినందుకు తానే కారణభూతుడని భావించి గాంధీ దానికి ప్రాయశ్చిత్తంగా మూడు రోజులపాటు ఉపవాసం చేయుటకు నిశ్చయించుకొన్నట్లు వారికి తెలియపరచి ఉపవాసం చేశాడు. దీనితో నగరంలో శాంతి పరిస్థితులు పూర్తిగా నెలకొన్నవి. కాని అధికారులలో ఎలాటి పరివర్తనా కలుగలేదు. దౌర్జన్యకార్యక్రమాలలో ఎవరు పాల్గొనినదీ వారికి తెలియని కారణంగా విచక్షణారహితంగా అనుమానాస్పదులనేకులను అరెస్టుచేసి న్యాయస్థానాలలో విచారణ జరిపించారు. తగిన సాక్ష్యాధారం లేనందున వీరిలో అనేకులను న్యాయస్థానాలు విడుదలచేసినా 106 మందికి శిక్ష విధించడం జరిగింది. ఇంతేగాక నగరమంతటిపై సామూహిక జరిమానాలు విధించి ఆ మొత్తాన్ని కార్మికుల వద్దనుండి, వర్తకులనుండి ప్రభుత్వం వసూలు చేసింది.

గాంధీ అరెస్టు ఫలితంగా కైరాజిల్లాలో నడియాడీ, హీరాంగం మొదలైన నగరాలలోను కొన్ని గ్రామీణ ప్రాంతాలలోను దౌర్జన్యాలు జరిగాయి. అనేకులు అరెస్టుకు పాత్రులై శిక్షలను అనుభవించారు. ప్రభుత్వం నడియాడు నగరంలో అధనపు పోలీసుదళాలను సమీకరించి దాని ఖర్చులను పటీదార్లనుండి వర్తకులనుండి వసూలు చేసింది.

అప్పటికే పంజాబులోని దురంతాలగురించి కొన్ని వార్తలు గాంధీకి తెలియవచ్చాయి. ఇంతేగాక తన సత్యాగ్రహ ఆశ్రమానికి స్థావరమైన అహమ్మదాబాదులోని ప్రజలు దౌర్జన్యంలోకి దిగడం ఆయనకు ఎంతో విచారాన్ని కలిగించింది. వారు అలాగు ప్రవర్తిస్తారని ఆయన కలలోకూడా ఊహించలేదు. కాని ఇది అంతా ఆయనకు ఒక కనువిప్పుగా పనిచేసింది. అహింస అంటె అర్థం తెలియనివారిని తెలిపినా దానిని ఆచరణలో పెట్టుటకు కావలసిన ఆత్మనిగ్రహం లేని వారిని సత్యాగ్రహంలో పాల్గొనవలసిందిగా ఆదేశించడం హిమాలయ శిఖరం వంటి గొప్ప పొరబాటు (Himalayan Blunder) అని బహిరంగంగా ఒప్పుకొని ఏప్రిల్ 18 న తన 3 రోజుల ఉపవాసానంతరం—తాత్కాలికంగా సత్యాగ్రహాన్ని ఉపసంహరించాడు. తాను చేసినది పొరబాటని గ్రహించిన వెంటనే దానిని ఒప్పుకొని, దానికి ప్రతిక్రియ చేయుటకు సిద్ధపడడమే ఆయనలోని విశిష్టత.

కాని ఉద్యమాన్ని ఉపసంహరించుకొనడం ఆయన అనుచరులలో అనేకులకు ఆశాభంగాన్ని కలిగించింది. ఉద్యమం ఉచ్ఛస్థాయిలోకి వచ్చినప్పుడు దానిని ఉపసంహరించుకొనడం అప్రాజ్ఞత అని వారు భావించారు. తాను చట్ట దిక్కార భాగాన్ని మాత్రమే ఉపసంహరించుకొన్నట్లు, ఆ ఉపసంహరణకూడా తాత్కాలికమైనట్లు, పరిస్థితులు అనుకూలించినప్పుడు దానిని తిరిగీ ప్రారంభించుటకు సిద్ధంగా ఉన్నట్లు ఆయన వారికి తెలియపరచి వారిని సమాధానపరచ ప్రయత్నించాడు. ఈ మధ్యకాలంలో అహింసా తత్వాన్ని గురించి మరింత ఎక్కువగా ప్రజలలో ప్రచారంచేసే కార్యక్రమాన్ని చేపట్టి యంగ్ ఇండియా (Young India) అనే ఇంగ్లీషు పత్రికను, నవజీవన్ అనే గుజరాతి పత్రికను తన సంపాదకత్వంలోకి తీసుకొని వాటిని ప్రచార సాధనాలుగా వినియోగించ సాగాడు. సత్యాగ్రహంలో పాల్గొనుటకు అర్హులైన వారితో కూడిన ఒక స్వచ్ఛంద బృందాన్ని నిర్మాణంచేసే కార్యక్రమాన్ని కూడా చేపట్టాడు. అహింస తత్వాన్ని ఆచరణలో పెట్టడం మూలంగానే భారతీయులకు వాస్తవమైన స్వరాజ్యం లభించగలదనే విశ్వాసం ఆయనలో ఎంతమాత్రము తగ్గలేదు.

మే 28 న తన సత్యాగ్రహ అనుచరుల కొందరిని సమావేశపరచి పంజాబు దురంతాలగురించి విచారణ చేయుటకు ప్రభుత్వం ఒక కమిటీని నియమించని పక్షంలో సత్యాగ్రహాన్ని తిరిగీ ప్రారంభించవలసిందిగా సూచించాడు. దీనికి అందరూ అంగీకరించినా జమ్నాదాసు ద్వారకదాసు అభ్యంతరాన్ని తెలియపరచాడు. సమావేశానికి హాజరు కాకపోయినా బీహారు నాయకుడైన హసాన్ ఇమాం, ఆర్యసమాజ నాయకుడైన స్వామీ శ్రద్ధానందా తమ విముఖత్వాన్ని తెలియపరచారు. సత్యాగ్రహం దౌర్జన్యానికి తప్పక దారితీస్తున్నదనేదే వారి ఆక్షేపణ.

జూన్ 12 న బొంబాయి సత్యాగ్రహ సభవారికి సత్యాగ్రహాన్ని తిరిగీ ప్రారంభించడం అవసరమనిన్నీ, కాని ఈ పర్యాయం తానొక్కడు మాత్రమే దానికి పూనుకొనడం యుక్తమనిన్నీ తెలియపరచాడు. జూలైలో తాను సత్యాగ్రహం చేసేటట్లు రాజప్రతినిధికి ఇండియా కార్యదర్శికి లేఖలు పంపాడు. కాని బొంబాయి గవర్నరుతో సంప్రతింపులు జరిపిన తర్వాతను, రాజప్రతినిధి నుండి ఏదో ఒక వర్తమానం వచ్చిన తర్వాతను తన అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు.

ఈ విధంగా పదేపదే తన అభిప్రాయాలను మార్చుకొనడం ఆయన అనుచరులకు ఆశాభంగం కలిగించింది. క్రమక్రమంగా సత్యాగ్రహంపట్ల వారి ఉత్సాహం అదృశ్యమైంది. బొంబాయిలోని సత్యాగ్రహులలో అనేకులు సత్యాగ్రహ సభనుండి రాజీనామా చేశారు. ఢిల్లీ సభ రద్దైపోయింది. లక్నో, అలహాబాదు సత్యాగ్రహ సభలకుకూడా ఇదేగతి పట్టింది. బెంగాలులో చిత్తరంజనదాసు సత్యాగ్రహానికి సుముఖుడైనా, పాల్ ఫజులత్‌హక్ మొదలైనవారిలో సిద్ధాంతదృష్ట్యా సత్యాగ్రహం ఉత్తమ విధానమైనా ఆచరణలో అది దౌర్జన్యానికి దారితీస్తుందనే అభిప్రాయం బలపడింది. మద్రాసురాష్ట్రంలో కూడా-ప్రధానంగా బిసెంటు ప్రభావంచేత—ఈ అభిప్రాయానికే బలం చేకూరింది. మహారాష్ట్ర ప్రాంతాలలో తిలక్‌పట్ల ప్రజలకుగల గౌరవాభిమానాలు కారణంగా మొదటినుండీ సత్యాగ్రహ ఉద్యమానికి బలం లేకపోయింది. ఈ విధంగా 1919 సెప్టెంబరు ఆఖరుకు రౌలెట్టు సత్యాగ్రహం ముగిసినట్లు చెప్పవచ్చు.

ఒక దృష్ట్యా రౌలెట్టు సత్యాగ్రహం పూర్తిగా విఫలమైనట్లు కనిపిస్తుంది. అది రౌలెట్టు చట్టాన్ని రద్దు చేయించుటకు ఉద్దేశింప బడినది. కాని సత్యాగ్రహం మూలంగా అది రద్దుకాలేదు.

అది రద్దయ్యేవరకు సత్యాగ్రహాన్ని సాగించేటట్లు సత్యాగ్రహులు ప్రమాణం చేశారు. కాని ఆ ప్రమాణం ప్రకారం వారు ఆచరించలేకపోయారు. అది రద్దుకాకపోయినా వారు ప్రమాణానికి అన్యథాగా ఉద్యమాన్ని ఉపసంహరించుకొన్నారు. ఇంతేగాక సత్యాగ్రహం అనేక ప్రాంతాలలో దౌర్జన్యాలకు దారితీసింది. ఇది ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా పంజాబులోని సైనికాధికారుల పైశాచిక చర్యలకు కారణమైంది.

కాని భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర దృష్ట్యా ఈ సత్యాగ్రహం గొప్ప ప్రయోజనాన్ని సాధించినట్లు చెప్పవచ్చు. ఆసేతు హిమాచలపర్యంతం దేశంలో నివసించే ప్రజలు పరాయి ప్రభుత్వం చర్యపట్ల నిరసన తెలియపరచే కార్యక్రమంలో పాల్గొన్నారు. పరాయి ప్రభుత్వం సహించరానట్టిదని దానిని ఎంత త్వరితకాలంలో నిర్మూలించేస్తే దేశానికి అంత శ్రేయస్కరమనే భావం దేశంలో వ్యాప్తిగాంచుటలో ఈ సత్యాగ్రహం గొప్ప ప్రాధాన్యం వహిస్తున్నది. ఇంతేగాక ఈ సత్యాగ్రహంలో సామాన్యప్రజలు, ఇదివరకు రాజకీయ రంగంలో ఆసక్తిని ఎక్కువగా ప్రదర్శించనివారు పాల్గొనడం విశేషం. కార్మికులు, చేతిపనులద్వారా జీవించేవారు, టాంగాబండ్లను తోలేవారు, చిల్లర దుకాణాదార్లు, వర్తక వ్యాపారాలు చేసేవారు ఇందులో పాల్గొన్నారు. హిందువులతోసహా ముస్లింలు ఇందులో అత్యంత ఉత్సాహాన్ని ప్రదర్శించినారు. ఢిల్లీ, లాహోరు, బొంబాయి, కలకత్తావంటి నగరాలలోని ప్రఖ్యాతిగాంచిన మసీదులలోని ప్రార్థనలలో హిందువులు ముస్లింల ఆహ్వానంపై పాల్గొనడం, హిందువుల నాయకులు ప్రార్థన వేదికలనుండి ప్రసంగాలు చేయడం, దేశచరిత్రలో కనీ వినీ ఎరుగని దృశ్యం. ఈలాటి పరిణామానికి రౌలెట్టు సత్యాగ్రహం కారణభూతమైనది. విద్యాధికులకు మాత్రమే ఇదివరకు పరిమితమై ఉండిన జాతీయత సామాన్య ప్రజలలోకి వ్యాపించి స్థిర స్థానాన్ని సంపాదించింది.

ఈ సత్యాగ్రహం గాంధీని అఖిల భారత రాజకీయ నాయకునిగా చేసింది. ఆయన పిలుపుమూలంగానే దేశంలోని ప్రజలందరు ఏప్రిలు 6 హర్తాలులో పాల్గొన్నారు. ఆయన అరెస్టు కారణంగానే 10 నుండి హర్తాలులూ ఇతర కార్యక్రమాలు జరిపారు. ఈ సత్యాగ్రహ కాలంలో ఆయన సంపాదించిన నాయకత్వం స్వాతంత్ర్య సమరం ముగిసేవరకు (1945) స్థిరంగా నిలబడి పోయింది. దేశానికి ఒకే నాయకుని సంపాదించి పెట్టడంలో ఈ సత్యాగ్రహం ప్రధాన సాధనంగా రూపొందింది.

తక్కిన సత్యాగ్రహాలలో చేసినట్లే ఈ సత్యాగ్రహంలోకూడా గాంధీ కాంగ్రెసు ముస్లిం లీగులవంటి సంస్థల సహాయాన్ని అపేక్షించలేదు. తనపట్ల విశ్వాసంగల స్థానిక నాయకుల సహాయంతోనే ఉద్యమాన్ని సాగించాడు. కాని వారు కొసవరకు ఆయనను అనుసరించలేదు. దీనిమూలంగా ఆయన ఒక గుణపాఠాన్ని నేర్చుకొన్నాడు. అఖిల భారత రాజకీయాలలో పాల్గొనదలచి, వాటిపై నాయకత్వం వహించగోరిన వానికి తాత్కాలికంగా లభించిన అనుచర వర్గ సహాయం చాలదనీ, కాంగ్రెసు వంటి ఒక అఖిలభారత సంస్థ సహాయం అవసరమనీ ఆయన నిర్ణయించుకొన్నాడు. ఈ కారణం చేతనే ఆయన 1919 డిసంబరులో అమృతసర్ నగరంలో సమావేశమైన కాంగ్రెసులో గొప్ప పాత్రను వహించుటకు సిద్ధపడ్డాడు. అంతకు పూర్వం కాంగ్రెసు సమావేశాలకు హాజరైనా దాని చర్చలలో ఎక్కువగా పాల్గొనలేదు. కాని అమృతసర్

సమావేశంలో మాంటెగు చెమ్స్‌ఫర్డు సంస్కరణల గురించి జరిగిన చర్చలలో రాజకీయ నాయకుల మధ్య తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఉత్పన్నమైనప్పుడు గాంధీ తన మామూలు ఉదాసీన ధోరణిని మాని, చర్చలలో పాల్గొని, సంస్కరణలను పూర్తిగా ఖండించవలెనని పట్టు బట్టిన తిలక్, చిత్తరంజనదాసు మొదలగు వారిని ప్రతిఘటించి, జిన్నా మాళవ్యా మొదలైన వారితో కలిసి సంస్కరణలను సమర్థించాడు. తన అభిప్రాయంతో కాంగ్రెసు ఏకీభవించని పక్షంలో తాను దేశవ్యాప్తంగా గొప్ప ఆందోళనను లేవదీయ సిద్ధంగా ఉన్నట్లు తన ప్రత్యర్థులను ఒకవిధంగా బెదరించాడు. అంతటితో ఉభయపార్టీల మధ్య రాజీ కుదిరి, అందరికీ ఆమోద యోగ్యమైన తీర్మానం చేయబడింది. రాజకీయ నాయకులు ఆయన అభిప్రాయాలను లెక్కలోకి తీసుకొనడం తప్పింది కాదు. ఇది మొదలు కాంగ్రెసు రాజకీయాలలో ఆయన గొప్ప పాత్ర వహించి, 1920 ఆఖరుకు కాంగ్రెసును తన వశంలోకి తెచ్చుకొనగలిగాడు. ఈవిధంగా రౌలెట్టు సత్యాగ్రహం దేశ చరిత్రలోను, గాంధీ జీవితంలోను గొప్ప ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. అది విఫలమైనట్లు భావించడం పొరబాటు.

చదువదగిన గ్రంథాలు :

Vidya Bhavan, Vol xi
R. Kumar (Ed): Essays on Gandhian Politics: Essays i, iv,- ix
Judith M. Brown: Gandhi's Rise to Power.

# అధ్యాయము-4

## పంజాబు విషాద గాథ

## 1919

## 1

రౌలెట్టు సత్యాగ్రహ కాలంలోను అటు తర్వాతను పంజాబు రాష్ట్రంలో అసంఖ్యాకములైన దురంతాలు సంభవించి ప్రజలు నానా బాధలను అనుభవించారు. వీటి అన్నిటికీ 1913 నుండి రాష్ట్రానికి లెఫ్టనెంటు గవర్నరైన మైకెల్ఒడయరు నిరంకుశ పరిపాలన మౌలిక కారణం. అతని నిరంకుశ చర్యలు ప్రజలలో అసంతృప్తిని ప్రభుత్వం పట్ల ద్వేషభావాన్ని కలిగించింది. వారు ఈ భావాన్ని రౌలెట్టు చట్టాన్ని నిరసించడం ద్వారాను. ఏప్రిలు 6న భారీ ఎత్తున హర్తాలు జరపడం ద్వారాను వ్యక్తం చేశారు. ప్రభుత్వాన్ని నిరసించగల సాహసం ప్రజలలో ఉండడం ఒడయర్‌కు ఎంత మాత్రం గిట్టలేదు. అందుచేత వారిని మరింత ఆగ్రహ పరవశులజేసే చర్యలు సాగించారు. దీని ఫలితంగా వారు దౌర్జన్యాలలోకి దిగారు. వారేదో బ్రిటిష్ ప్రభుత్వాన్ని తొలగద్రోయుటకు సిద్ధ పడ్డారనే భ్రమతో ఆలాటి సంకల్పం వారిలో ఎన్నడూ తల ఎత్తకుండా ఉండేటట్లు వారికొక గుణ పాఠాన్ని నేర్పే దురుద్దేశంతో రాష్ట్రంలోని అనేక జిల్లాలలో సైనిక పరిపాలనను ఏప్రిలు 14న ప్రవేశపెట్టి జూన్ 11 వరకు సాగించి పరిపాలనను సైనికాధికారుల పరం చేశాడు.

వీరి పరిపాలన కాలంలో ప్రజలు యమయాతనలకు గురి అయ్యారు. వీరు ఏలాటి న్యాయానికి గాని, ధర్మానికి గాని కట్టుబడక పంజాబు ఒక శత్రు రాష్ట్రమనే భావంతో యుద్ధ కాలంలో జయించి వశపరచుకొన్న శత్రు దేశ ప్రజలను నియంతలు పాలించుట కంటే క్రౌర్యంతో పాలించారు. వారిని ఎన్ని విధాలుగా హింసించుటకు సాధ్యమో అన్ని విధాలా హింసించి చిత్రవధలకు గురి చేశారు. ఈలాటి హింసాకాండ బ్రిటిష్ పరిపాలనలో ఇంతకు పూర్వం కనీ వినీ ఎరుగనట్టిది. వీరు 1857-58 తిరుగుబాటు కాలంలో సైనికాధికారుల పైశాచిక చర్యలను విస్మరింపజేశారు. దీని ఫలితంగా ప్రజలూ బ్రిటిష్ ప్రభుత్వమూ మధ్య ఒక ద్వేషరూపమైన అఖాతం ఏర్పడి పరాయి పరిపాలన పునాదులను పెకలించి అది కూలిపోవుటకు కారణ భూతంగా పరిణమించింది. ఇందువలననే స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో 1919లో పంజాబులో సంభవించిన విషాద సంఘటనలకు ప్రత్యేక ప్రాధాన్యం లభించింది.

ఒడయర్ దుష్ట పరిపాలన లక్షణాలను, దాని మూలంగా ప్రజలలోని వివిధ వర్గాలలో ఏర్పడిన అసంతృప్తిని ఇదివరకే తెలుసుకొన్నాము. సిపాయీలను సైన్యంలో అధిక సంఖ్యలో చేర్చుకొనడంలోను, యుద్ధ రుణాలను విరాళాలను సేకరించడంలోను అతడు అనుసరించిన నిర్బంధ విధానం, యుద్ధ కాలంలో తారాపథాన్ని అంటుకొన్న ధరల పెరుగుదలను అవసర

వస్తువుల కొరతను ఎదుర్కొనుటకు అతడు ఏలాటి చర్యలను తీసుకొనక పోవడము, ఉద్ధృతంగా వ్యాపించిన ఇన్‌ఫ్ల్యుయంజా ప్లేగు వ్యాధుల నివారణలో జాగ్రత్త వహించక పోవడము, మధ్యతరగతికి చెందినవారిని అణగ ద్రొక్కుటకున్నూ విద్యాధికుల రాజకీయ కృషిని ఆటంకపరచుటకున్నూ అతడు తీసుకొన్న చర్యల ఫలితంగా బ్యాంకు లనేకం దివాలా తీసి మధ్యతరగతి వారందరు విపరీతంగా నష్టపడడము ఇదివరకే వివరించడమైనది. 1918 కాంగ్రెసు సమావేశానికి హాజరైన పంజాబు ప్రతినిధులు తమ రాష్ట్రం ప్రేలుటకు సిద్ధంగా ఉండే ఒక అగ్ని పర్వతం మోస్తరుగా ఉన్నదని, దానికంతకు ఒడయర్ దుష్ట పరిపాలనే కారణమని, అది ఏ నిమిషంలోనైనా ప్రేలి దాని మంటలు రాష్ట్రమందంతటా వ్యాపించే ప్రమాదం ఉన్నదని స్పష్ట పరచారు. ఏప్రిలులో అగ్ని పర్వతం ప్రేలింది.

## 1. లాహోరు

లాహోరు పంజాబుకు ముఖ్య పట్టణము. ఇక్కడ లాహోరు ఇండియన్ సంఘము (Lahore Indian Association), కాంగ్రెసు కమిటీ ఒకటి రాజకీయ రంగంలో కృషి చేస్తూ ఉండేవి. ఇండియన్ సంఘం అధ్వర్యాన ఫిబ్రవరి 4న ఒక సమావేశం జరిగి అందులో రౌలెట్టు బిల్లులను నిరసిస్తూ తీర్మానాలు చేయబడినవి. గాంధీ పిలుపు అందకముందే ఈ సమావేశం జరగడం గుర్తించవలసిన విషయం. రౌలెట్టు బిల్లులు విద్యాధికులైన మధ్యతరగతి వారిలో ఏలాటి అసంతృప్తిని కలిగించిందో ఇది స్పష్టం చేస్తూ ఉంది. లాహోరులో జరిగిన దురంతాలకు ఈ నిరసన సభ నాందీగా వర్తించింది.

ఫిబ్రవరి 26న రౌలెట్టు బిల్లులను సత్యాగ్రహం ద్వారా ప్రతిఘటించవలసిందిగా గాంధీ ప్రజలను ఆదేశించాడు. దానిని పురస్కరించుకొని మార్చి 9న రాజకీయ నాయకులు సమావేశం జరిపారు. ఇందులో ముస్లింలతో సహా ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొని సత్యాగ్రహం పట్ల ఆమోదాన్ని తెలియపరచారు.

మార్చి 18న రౌలెట్టు బిల్లు చట్టరూపం ధరించింది. 23న గాంధీ ప్రజలందరు ఏప్రిలు 6న హర్తాలు జరపవలసిందిగా ఆదేశించాడు. దానిని గురించి ఆలోచించుటకు ఇండియన్ సంఘం, కాంగ్రెసు కమిటీ—ఈ రెండూ—కలిసి—ఏప్రిల్ 2న సమావేశం ఏర్పాటు చేసి, అందులో ఏప్రిల్ 6న హర్తాలు, ఆ సాయంకాలం బహిరంగ సభ జరగవలసిందిగా తీర్మానం చేశాయి.

అప్పటివరకు ఒడయర్ సమావేశాల పట్ల ఏలాటి విరోధాన్ని ప్రకటించలేదు. కాని 6న హర్తాలు జరగడం అతనికి పూర్తిగా ఇష్టం లేదు. రాజకీయ నాయకులను పిలిపించి హర్తాలులో ఏలాటి అవాంఛనీయ పరిణామాలు జరగరాదని హెచ్చరించాడు. అది శాంతియుతంగా జరగ గలదని వారు హామీ ఇచ్చారు. దానికి అనుగుణంగా 6న హర్తాలు శాంతియుతంగా జరిగింది. సాయంకాలం బహిరంగ సభలో పాల్గొనుటకు వేలాది సంఖ్యలో— వారిలో విద్యార్థులు, గుమస్తాలు మొదలైనవారు అధికంగా ఉండినారు—లాహోరు గేటు అనే ప్రదేశంలో గుమికూడి, వీధుల వెంట ఊరేగింపుగా తిరిగి, సాయంకాలానికి సమావేశానికి వెళ్ళదలచారు. కాని వారు ఊరేగింపుగా వెళ్ళడం అధికారులు సహించక గుంపును చెదరగొట్టుటకు పోలీసు దళాన్ని పంపారు. కాని సకాలంలో గోకుల్‌చంద్‌నరాంగ్ అనే ప్రజా

నాయకుడు అక్కడికి వచ్చి గుంపును బహిరంగ సభవైపు వెళ్ళిపోవలసినదిగా సమాధానపరచి కాల్పులు జరిపే అవకాశాన్ని పోలీసు దళానికి లేకుండా చేశారు. సభ శాంతియుతంగా జరిగింది. రౌలెట్టు చట్టాన్ని గాంధీ ఆదేశానుసారం సత్యాగ్రహం ద్వారా శాంతియుతంగా ప్రతిఘటించ వలెనని. ఇందులో హిందువులు మహమ్మదీయులు కలిసి కృషి చేయవలసినదని నాయకులు ఉద్ఘాటించారు.

సభ శాంతియుతంగా జరిగినా అందులో రౌలెట్టు చట్టాన్ని నిరసిస్తూ తీర్మానం చేయడం ఒడయర్‌కు గిట్టలేదు. ప్రభుత్వాన్ని ఖండించగల సాహసం రాజకీయ నాయకులకు ఉండడం అతనిని ఆగ్రహ పరచింది. ఏప్రిలు 7న శాసన సభ సమావేశంలో వారిని విమర్శిస్తూ నగరంలో ఏలాటి అవాంఛనీయ పరిణామాలు జరిగినా ప్రభుత్వం వారినే బాధ్యులుగా పరిగణించ గలదని హెచ్చరించాడు. దీనిని ఒక సవాలుగా రాజకీయ నాయకులు పరిగణించి దానిని ఎదు ర్కొనుటకు సిద్ధ పడ్డారు.

ఏప్రిలు 9న శ్రీరామ నవమి ఉత్సవాన్ని జరపడంలో వాకి సిద్ధతకు కార్యరూపం కలిగించారు. మామూలు కంటె భారీ ఎత్తున ఉత్సవాన్ని జరిపి, అందులో ముస్లింలను పాల్గొన వలసిందిగా ఆహ్వానించారు. ముస్లింలు వేల సంఖ్యలో అందులో పాల్గొన్నారు. ఇంతేగాక సాయంకాలం ఉత్సవం రౌలెట్టు చట్టాన్ని నిరసించే మహా సభగా మారి, నిరసన తీర్మానాలు చేయబడినాయి. హిందువులు ముస్లింలు శ్రీరామ నవమి ఉత్సవాలలో కలిసి పాల్గొనడం ఒడయర్ ఆగ్రహానికి ఇంకొక కారణమైంది.

ఏప్రిలు 10న పిడుగు పడినట్లు గాంధీ అరెస్టు వార్త ప్రజలకు తెలియ వచ్చింది. లాహోరు నాయకులు ఆయనను పంజాబుకు రావలసిందిగా ఆహ్వానించారు. అందుకుగాను ఆయన ప్రయాణం సాగిస్తూ ఉండగా ఆయన అరెస్టు జరగడం వారికి ఆశాభంగం కలిగించింది. దీనికి తోడు ఆ రోజుననే అమృతసర్ నగరంలో సుప్రసిద్ధ ముస్లిం నాయకుడు డాక్టరు కిచ్లూ హిందు నాయకుడు డాక్టరు సత్యపాలు అరెస్టయి ప్రవాసంలోకి పంపబడినట్లున్నూ మరికొన్ని అవాంఛనీయ పరిణామాలు జరిగినట్లును వార్తలు వచ్చాయి. వెంటనే లాహోరు నగరంలో హర్తాలు జరిగింది. మధ్యాహ్నానికి ప్రజలు అక్కడక్కడ గుమికూడారు. వారు యూరోపి యనులు నివసించే ప్రాంతాలకు వెళ్ళి వారిని హత్య జేయ ఉద్దేశించినట్లు అధికారులు భ్రమ పడి గుంపులను చెదరగొట్టుటకై పోలీసు దళాలను పంపారు. గుంపుల ఉద్దేశం శాంతియుతంగా బజారుల వెంట తిరగడం మాత్రమే అని నాయకులు పోలీసు వారికి చెప్పినా పోలీసువారు తొందర పడి రెండు ప్రదేశాలలో గుంపులపై కాల్పులు జరిపారు. దీని మూలంగా ముప్పై మంది మరణించారు. అనేకులు గాయ పడినారు.

దీనికి నిరసనగా 11న కూడా హర్తాలు జరిగింది. ఫ్యాక్టరీలలోను రైలు షెడ్డుల లోను వేలాది ముస్లింలు కార్మికులుగా పనిచేస్తూ ఉండేవారు. కిచ్లూ అరెస్టు వారికి ప్రత్యేకంగా ఆగ్రహాన్ని కలిగించింది. వారు పనులకు వెళ్ళడం మానుకొన్నారు. నగరంలో ప్రజా జీవితం స్తంభించి పోయింది.

11 శుక్రవారం. ఆ రోజున నగరంలో ప్రసిద్ధి గాంచిన బాదషాహి మసీదులో ప్రార్థనలు జరుపుటకు ముస్లింలు హిందువులను కూడా ఆహ్వానించారు. సమావేశమైన 35,000

జనంలో 12000 హిందువులు ఉండినారు. ప్రార్థనల అనంతరం ఇద్దరు ముస్లిం నాయకులు, ఒక శిక్కు నాయకుడు, హిందూ నాయకుడైన రాం భుజదత్తు ఆవేశపూరితంగా ప్రసంగించారు. అన్ని మత వర్గాలు పరస్పర సౌహార్ద్రంతో ప్రవర్తించవలసిన ఆవశ్యకతను పునరుద్ఘాటించారు. ఉపన్యాసాలు ముగిసిన తర్వాత ప్రభుత్వంతో రాయబారాలు జరుపుటకు 50 సభ్యులతో కూడిన ఒక ప్రజా కమిటీని నియమించారు. నగరంలో శాంతి భద్రతలను రక్షించే బాధ్యతను అధికారులకు బదులు వీరే వహించారు.

ప్రజా కమిటీ నియామకంతో లాహోరులోని రౌలెట్టు సత్యాగ్రహం ఉచ్ఛస్థాయిని అందుకొన్నది. 11 మొదలు 14 వరకూ—నాలుగు రోజుల పాటు—ప్రభుత్వానికి బదులు కమిటీయే ఒక విధంగా పరిపాలన సాగించింది. ప్రజలు తమ్ము పరిపాలించే హక్కు కమిటీకే గాని ప్రభుత్వానికి లేదనే భావంతో ప్రవర్తించారు.

ఈ పరిస్థితులలో అధికారులు విభ్రాంతపడి లాహూరులోని భూస్వాముల సహాయాన్ని అపేక్షించి వారిద్వారా కమిటీలతో సంప్రదింపులు జరిపి హర్తాలును విరమించుటకు కావలసిన ప్రయత్నాలను చేయవలసిందిగా అర్థించారు. సాధారణకాలంలో భూస్వాములకు ప్రజలపై ఎక్కువ పలుకుబడి ఉండేది. దానిని ఆధారం చేసుకొనివారు హర్తాలును విరమించవలసిందిగా ప్రజాకమిటీతో సంప్రదింపులు జరిపారు. కమిటీవారు కొన్ని షరత్తులకు ప్రభుత్వం అంగీకరించిన పక్షంలో హర్తాలు విరమణ సాధ్యంకాగలదని చెప్పారు. కాని ఒడయర్ షరత్తులకు అంగీకరించలేదు. రాజద్రోహాలతో కూడిన కమిటీ షరత్తులను విధించడం, తాను వాటికి తలయొగ్గడం స్వప్నతుల్యమని తెలియపరచాడు.

హర్తాలు నిరవధికంగా జరగడం, ప్రజాజీవితం స్తంభించడం రాజకీయనాయకులెవరికీ ఇష్టంలేదు. రౌలెట్టుచట్టం రద్దుకొరకే సత్యాగ్రహం ఉద్దేశింపబడినదనీ, బ్రిటీష్ ప్రభుత్వాన్ని తొలగద్రోపి దానిస్థానాన ప్రజాప్రభుత్వం స్థాపించడం దాని ఉద్దేశంకాదని, షరత్తులతో నిమిత్తంలేకుండా హర్తాలును విరమించడమే వాంఛనీయమని వారు భావించి 13 న దీనిని గురించి నిర్ణయించుటకు టౌన్‌హాలులో కమిటీ సమావేశాన్ని జరిపారు. పురప్రముఖులు కొందరినికూడా దానికి ఆహ్వానించారు. కమిటీవారిలో అనేకులు హర్తాలు విరమణకు సుముఖులుగా ఉండినా సమావేశంలోని కొందరు వారిని ప్రతిఘటించారు. సమావేశ వాతావరణం ఆందోళనను కలిగించింది. కమిటీవారు దీనిని గమనించి, హర్తాలుగురించి నిర్ణయించుటకు ఒక సబ్‌కమిటీని నియమించి టౌన్‌హాలు వెలుపలికివచ్చారు. అక్కడ ఒక మూక గుమిగూడి ఉండినది. వారు కమిటీని తూలనాడి వారు స్వార్థానికై ప్రభుత్వంతో సహకరించుచున్నట్లు వారిని అవహేళన చేశారు.

ఒడయర్ ఈ పరిణామాలన్నిటినీ గమనిస్తూనే ఉండినాడు. అరాజక పరిస్థితులు ఏర్పడకముందే కఠినచర్యలను తీసుకొనుటకు నిశ్చయించి 12 న సైనికదళాన్ని రప్పించి అధికారాన్ని చాలావరకు సైనికాధికారి జాన్‌సనుకు ఒప్పగించాడు. అతడు వీధులవెంట సైనికదళాలను సంచరింపజేసి 12 న బాదషాహిమసీదువద్ద గుమిగూడిన ఒక గుంపుపై కాల్పులు జరిపాడు. అందులో అనేకులు మరణించారు. 13 న టౌనుహాలులో కమిటీ సమావేశం ముగిసిన వెంటనే రాజద్రోహ సభాచట్టాన్ని (Seditious meetings Act) ప్రవేశపెట్టారు. అంతటితో సభలు

సమావేశాలు జరగడం సాధ్యంకాలేదు. 14న రాంభుజ్‌దత్తు, హరికిషన్‌లాల్, ధూనిచందులను జైలులో నిర్బంధించి నగరంలో సైనికశాసనాన్ని (Martial Law) ప్రకటించారు. అంతటితో సివిల్ ప్రభుత్వం అంతరించి సైనికప్రభుత్వం ఏర్పడింది. ఇంతటితో లాహూరులో రౌలెట్టు సత్యాగ్రహం ముగిసింది. వర్తకులు భీతావహులై హర్తాలును విరమించుకున్నారు.

ఈ సత్యాగ్రహంలో ప్రజలు హర్తాలు జరిపిరేగాని దౌర్జన్యాలకు దిగలేదు. వారిలో కనుపించిన తిరుగుబాటు ధోరణికి పోలీసులు సైనికులు జరిపిన కాల్పులూ గాంధీ. కిచ్లూ, సత్యపాల్ మొదలైన నాయకుల అరెస్టే ప్రధానకారణాలు.

ప్రజలు దౌర్జన్యాలకు దిగకపోయినా వారిలో తిరుగుబాటు ధోరణి కనుపించిన దనే కారణంగాను, రాజకీయనాయకులు సత్యాగ్రహాన్ని సాగించిన కారణంగాను లాహూరులో కర్నల్ జాన్‌సన్ సైనికపరిపాలనము పంజాబులోని ఇతరప్రాంతములలోని సైనికపరిపాలనముకంటె క్రూరముగ పరిణమించినది. అతడు కర్ఫ్యూ ఉత్తరువులను ఆరు వారములపాటు అములులో పెట్టినాడు. వాటి మూలమున రాత్రి ఎనిమిదిగంటల తరువాత బయటికి వచ్చినవారిని కాల్చివేయ వచ్చు: బుక్కాణములపై కొరడాలతో కొట్టవచ్చు: జరిమానాలు, లేదా జైలుశిక్షలు వారిపైన విధించవచ్చు. నగరంలో అంగళ్ళు వెంటనే తెరువనివారిలో కొందరు కాల్చివేయబడిరి. లేదా అధికారులు వాటిని తెరిపించి. వాటిలోని వస్తువులను ప్రజలకు ఉచితముగా పంచిపెట్టారు.

లాయర్లు మొదలైన విద్యాధికులకు గుణపాఠము నేర్పే నిమిత్తము వారు వారి పేరులను రిజిస్టరు చేసుకొనవలసిందని. అధికారుల అనుజ్ఞలేక నగరాన్ని విడిచి వెళ్ళరాదని ఉత్తరువులు జారీ చేయబడినవి. వారి ఇండ్లగోడలకు సైనికశాసన ప్రకటనలను అంటించి వాటిని జాగ్రత్తగా కాపాడవలసిన బాధ్యత వారిపైన వేయబడినది. రోడ్డుప్రక్కల కాలిబాటలలో వరుసగా ఇద్దరు మనుష్యులకంటే ఎక్కువ నడవరాదు. పేదవారి ఉపయోగార్థం కట్టబడిన ధర్మసత్రములు భోజనశాలలు మూతబడిపోయినవి. భారతీయుల మోటారుకార్లు, మోటారు సైకిళ్ళు, ఎలక్ట్రిక్ పానులు తెల్ల సైనికుల ఉపయోగార్థం వశపరచుకొనబడినవి. అద్దెబండ్లను తోలి జీవించేవారు రోజూ నగరమునకు అవల వాటిని సైనికాధికారులకు కనుపరచవలసిన వారైరి. విద్యార్థులు రోజుకు నాలుగు పర్యాయములు మిలటరీ అధికారుల సమక్షమున హాజరు కావలసి వచ్చెను. మండువేసవిలో వీరిలో అనేకులు రోజుకు ఈ కారణమున 16 మైళ్ళు నడవ వలసినవారైరి. వారిని అల్లరిచేయక మంచిమార్గమున పెట్టుటకు తాను ఈలాటి ఉత్తరువును జారీచేసినట్లు జాన్‌సన్ (తర్వాత) విచారణ కమిటీఎదట సాక్ష్యమిచ్చారు. ఒక కళాశాలగోడల మీద అంటించబడిన సైనికప్రకటన చించివేయబడినందుకు ఉపాధ్యాయులందరు శిక్షింపబడ్డారు. ఒకఊరుపెత్తనదారును చెట్టుకుకట్టి కొరడాలతో కొట్టారు. అది ఆయనకును గ్రామస్థులకును గుణపాఠముగ ఉండగలదని సైనికాధికారులు భావించారట! ఇంకను ఇంతకంటె ఘోరమైన చర్యలను జాన్‌సన్ తీసుకొని తానేదో ఘనకార్యము చేసినట్లు ఆనందభరితుడయ్యారు. లాహూరు యూరోపియనులు అతనికి విందులు విందుజరిపి "పేదలపాలిట పెన్నిధి" అని పొగడారు. భారతీయులపట్ల వారికిగల ద్వేషభావమును ఇది స్పష్టపరుస్తున్నది.

## 2. అమృతసర్

పంజాబులో లాహూరు తర్వాత ప్రసిద్ధిగాంచిన నగరం అమృతసర్. ఇది శిక్కుల ప్రధాన కేంద్రం. ఇక్కడి ప్రజలు గాంధీపిలుపును అందుకొని మార్చి 30 న, ఏప్రిలు 6 న రౌలెట్టు చట్టాన్ని నిరసిస్తూ శాంతియుతంగా హర్తాలు జరిపారు. కాని ఏప్రిలు 10 న వారి నాయకులైన డాక్టర్ కిచ్లూ, డాక్టర్ సత్యపాలులను ప్రభుత్వం ఏలాటినేరాన్ని ఆరోపించక, ఏలాటి విచారణచేయక అరస్టుచేసి ఎక్కడికో ప్రవాసంలోకి పంపడం వారిని ఆవేశపరవశుల చేసింది. వెంటనే వారు నగరంలో హర్తాలును ప్రకటించి, తమ నాయకులను అరెస్టుచేయుటకు కారణమేదో జిల్లా మ్యాజిస్ట్రేటునుండి తెలుసుకొనగోరి వేలాది సంఖ్యల్లో గుమిగూడి అతని నివాసభవనమునకు వెళ్ళసాగారు. మార్గమధ్యంలో వారికి గాంధీ అరెస్టు తెలియవచ్చింది. అప్పుడు వారు మరింత ఆవేశపరులైరిగాని శాంతిభద్రతలకు ఏలాటిభంగము కలిగించక వెళ్ళుతూఉండగా పోలీసువారు వారిని అడ్డగించి నిష్కారణంగా వారిపై కాల్పులు జరిపారు. అందులో ఇద్దరు మరణించారు; అనేకులు గాయపడినారు.

అప్పటివరకు శాంతియుతంగా ప్రవర్తిస్తున్న గుంపులోనివారు దీని ఫలితంగా ఆగ్రహపరవశులై వీధులలో తమకు కనుపించిన అయిదుగురు తెల్లవారిని హత్యజేశారు. ఒక మిషనరీ స్త్రీని సైకిలునుండి క్రిందకి పడద్రోశారు. అనేకభవనాలకు నిప్పు ముట్టించి కొన్నిటిని పూర్తిగా దగ్ధంచేశారు. వారిపై పోలీసులు ఇంకొక పర్యాయం కాల్పులు జరపగా 20-30 మంది మరణించడం, అనేకులు గాయపడడం జరిగింది.

10 న మరణించినవారి మృతదేహాలను ఊరేగింపుపూర్వంగా శ్మశానవాటికకు తీసుకొనిపోవడం తప్ప 11 న మరి ఏలాటి సంఘటనలు జరగలేదు. నగరంలో శాంతి నెలకొనినట్లు కనుపించింది. కాని ఆరోజు సాయంకాలం ఒక సైనికదళంతో డయ్యర్‌సేనాని రాకతో పరిస్థితులు పూర్తిగా మారినాయి. నగరపరిపాలన అతని వశంలోకి వచ్చింది. పరిపాలనను సైనికాధికారుల వశం చేయవలసిన అవసరం లేకపోయినా, ప్రజల భీతావహులచేసి అణచివేయ దలచి డయ్యర్ ఈ మార్పు చేశాడు. అమృతసర్‌లోని తర్వాతి విషాధగాధ కంతకు ఈమార్పు కారణమైంది.

డయ్యర్ 12 న అనేకులను అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచాడు. సభలను సమావేశాలను నిషేధించాడు. కాని నిషేధప్రకటనను నగరంలోని అన్ని ప్రాంతాలలోని వారికి సకాలంలో తెలియపరచలేదు. నిషేధాజ్ఞలు తెలియని కారణంగా నాయకులు 13 న జలియన్‌వాలాబాగులో బహిరంగ సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఈ ఏర్పాటుల విషయం 12 సాయంకాలమే డయ్యరుకు తెలియవచ్చినా దానిని నిషేధించలేదు.

13 హిందువులకు సంవత్సరాది. ఆ సాయంకాలం 20,000 ప్రజ సమావేశానికి హాజరయ్యారు. హన్‌సరాజీ అనే నాయకుడు ఉపన్యాసం ప్రారంభించాడు. వెంటనే డయ్యరు తన సైనికదళాలతో అక్కడికి వచ్చి సమావేశంలోని ప్రజలు రెండు నిముషాలలో చెదరిపోవలసినదిగా హెచ్చరించాడు.

జలియన్‌వాలాబాగు నాలుగు వైపులా ఎత్తయిన ప్రహరీ గోడలు. బయటికి ప్రజలు వెళ్ళిపోవుటకు ఒక సన్నని తోవ మాత్రమే ఉండినది. రెండు నిమిషాలలో వారు వెళ్ళిపోవడం

సాధ్యం కాని పని. డయ్యరుకు ఇది తెలిసికూడా రెండు నిమిషాల వ్యవధి దాటిన వెంటనే కాల్పులు జరపవలసిందిగా సిపాయి దళాన్ని ఆదేశించాడు. మందుగుండు సామానులు ఉండే టంత కాలం కాల్పులు జరిపించాడు. వేయి మంది మరణించారు; కొన్ని వేల మంది గాయ పడినారు. గాయ పడినవారికి ఏలాటి వైద్య సహాయం ఏర్పాటు చేయడం తన కర్తవ్యం కాదని భావించి తన పని విజయవంతంగా జరిగినదనే సంతోషంతో వెళ్ళిపోయ్యాడు. వెంటనే కర్ఫ్యూ ఉత్తరువులు జారీ చేశాడు. అందుచేత బంధువులు వచ్చి గాయ పడినవారికి సహాయం చేయడం సాధ్యం కాలేదు. చావ సిద్ధముగా నున్నవారికి త్రాగ నీరయినను ఇచ్చువారు లేక పోయారు. సమస్త బాధలను అనుభవించి వారిలో అనేకులు మరణించారు.

నగరంలో సమావేశములు జరుగరాదని చాటింపు చేయించినప్పటికీ ప్రజలీ విధముగ గుమి కూడినందుకు తాను నగుపాట్లు పాలు కాకుండుటకై ఈ రీతిగా కాల్పులు జరిపి నగర వాసులకు గుణ పాఠము చెప్పదలచుకొన్నట్లును, తన దగ్గిర మందుగుండు సామానులు ఉండి నట్లైతే ఇంకను కాల్పించే ఉండేవాడని, తానొక ఫిరంగి కారునుకూడా తీసుకొని వెళ్ళినట్లును, ఆది బాగు గొందిలో పట్టక పోవడముచేత దానిని ఉపయోగించలేక పోయినట్లును అతడు విచారణ కమిటీకి నిర్మొగమాటముగ తెలియ పరచాడు. తాను చేసినది భయంకర కృత్యము కాదా అని కమిటీ సభ్యుడొకడు అతనిని ప్రశ్నించగా : "కాదు; కానే కాదు. నేనొక భయంకర ధర్మమును నిర్వర్తింపవలసి వచ్చినది. అది చాలా దయాపూర్ణమైన పని అని నా అభిప్రాయము. నాకు గాని, మరియొకరికి గాని ప్రజలను మళ్ళీ కాల్పవలసిన అవసరము లేకుండ ఉండేటంత గట్టిగాను పటిష్టంగాను కాల్చవలెనని నేను తలంచితిని. కాల్పులు జరుపకనే ప్రజలను చెదర గొట్టడం సాధ్యమైనా, కాల్చని పక్షంలో వారు నన్ను అపహాస్యము చేసి ఉండేవారు. నేను తెలివి తక్కువ పని చేసినట్టుగా వారు భావించి ఉండేవారు. అందుచేతనే నేను కాల్పులు జరిపాను" అని సగర్వంగా సమాధానం చెప్పినాడు. తానేదో ఘనకార్యం చేసినట్లు పొంగి పొయ్యాడు. ఒడయర్ అతని చర్యను సమర్థించి, అందుకుగాను అతనిని అభినందించాడు.

జలియన్‌వాలాబాగు ఉదంతంతో డయ్యరు ఘనకార్యం ముగిసినది కాదు. అతడు సైన్యాధికారిగా నగరాన్ని రెండు నెలల పాటు పాలించాడు. ప్రజలకు గుణ పాఠాన్ని నేర్పే ఉద్దేశంతో నీటి సప్లై ఎలెక్ట్రిక్ సప్లై ఆపి వేశాడు. కనిపించిన వారందరిని కొరడా దెబ్బలకు గురి చేశాడు. మిషనరీ స్త్రీని సైకిలుమండి పడవేసినందుకు, "ఆ వీధిలో వెళ్ళే ప్రతి మనిషి పొట్టను నేలకు ఆనించి పాకి పోవలసినదిగా ఉత్తరువులు జారీ చేశాడు. ఆ వీధిలో కాపుర ముండిన వారందరు ఈ ఉత్తరువులకు లోబడవలసిన వారయ్యారు. రైళ్ళలో మూడవ తరగతి టిక్కెట్లు అమ్మకాన్ని ఆపి వేశాడు. ప్రజల సైకిళ్ళను వశపరచుకొన్నాడు. దుకాణాలలో సరకుల అమ్మవలసిన ధరలను నిర్ణయించాడు. కోటకు ఎదుట కొరడా శిక్షల నిమిత్తము ఒక బహిరంగ మంటపాన్ని నిర్మించాడు. నగరంలోని అనేక ప్రాంతాలలో కొరడాలతో గాని, పేము బెత్తములతో గాని కొట్టుటకు ముక్కోణాలను ఏర్పరచాడు. సైనిక న్యాయస్థానములో పెద్ద నేరముల క్రింద 298 మంది విచారింప బడినారు. వారిలో 218 మంది శిక్షకు పాత్రు లయ్యారు. 51 రికి మరణ శిక్ష, 46 మందికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష, ఇద్దరికి 10 సంవ త్సరముల జైలు శిక్ష, 78 మందికి ఏడు సంవత్సరములు, 10 మందికి 5 సంవత్సరములు, 13 మందికి 3 సంవత్సరములు, 11 మందికి ఒకటి రెండు సంవత్సరములు జైలు శిక్షలు

విధింప బడినవి. మిలిటరీ ఉద్యోగస్థులు మరి 60 మందికి, సివిల్ మ్యాజిస్ట్రేటులు 105 మందికి శిక్షలు విధించారు. ఏప్రిలు 10న ఆయిదుగురు తెల్లవారిని హత్య చేసినందుకు ఇందరు శిక్షలను అనుభవించవలసిన వారయ్యారు. డయ్యరు సేనాని పరిపాలన ఈ విధంగా జరిగింది.

## 3. కసూరు

కసూరులో పోలీసుల దుష్ట ప్రవర్తన మూలంగా ప్రజలు ఆవేశపూరితులై ఏప్రిలు 12న పెద్ద పోస్టాఫీసును మునసీపు కోర్టును దగ్ధం చేశారు. రైలు స్టేషన్‌కు అపార నష్టాన్ని కలిగించారు. తంతి తీగెలను తెంపి వేశారు. ఒక రైలుబండిని అటకాయించి, ఇద్దరు తెల్ల సైనికులను చావ కొట్టారు. ఇవిగాక మరికొన్ని దురాగతాలు చేశారు. వీరి ఆగ్రహానికి వినాశన చర్యలకు 12కు ముందు పోలీసు దౌర్జన్యం దారి తీసింది. దీనిని విస్మరించి నగరంపై సైనిక పరిపాలనను విధించి డవలున్ అనే వానిని పరిపాలకునిగా నియమించారు.

ఈ మహా మహుడు రైలుస్టేషన్ వద్ద ఒక బహిరంగ ప్రదేశంలో 150 మంది పట్టుటకు తగిన ఒక పెద్ద బోనును నిర్మించి నిర్బంధితులను అందులో చేర్చి వారిని చూచుటకు ప్రజలను రప్పించాడు. నేరస్థులుగా అనుమానింప బడిన వారిని దిగంబరులుగ జేసి, బహిరంగముగ వీధులలో ముక్కోణములకు టెలిగ్రాపు స్తంభములకు కట్టి కొరడాలతో కొట్టించాడు. కొరడా శిక్షలను చూచే నిమిత్తం నగరంలోని వేశ్యలను పిలిపించాడు. వ్యవహారములను మార్దవంగా నడపదలచి తాను కొన్ని శిక్షలను స్వయముగా కనిపెట్టినట్లు విచారణ కమిటీ ఎదుట సాక్ష్యం చెప్తూ, దానికి ఉదాహరణగా సైనిక శాసనాన్ని ఉల్లంఘించిన వారిని రైలుపెట్టెలలో ఉండే సామానులను క్రిందికి దించుటకు, క్రిందవుండే సామానులను రైలు బండ్లలోకి ఎక్కించుటకు పోర్టర్లవలె వినియోగించినట్లు తెలియ పరచాడు. డయ్యరు కంటె తాను ఎక్కువ నేర్పు గలవాడనే భావంతో అతడు వీధులలో నడిచే వారిని పొట్టలతో పాకవలసిందిగా ఆజ్ఞాపించినట్లు ఇతడు ఆలాటి వారిని నుదుళ్ళతో నేలను తాకుతూ దోగాడ వలసినదిగా ఆజ్ఞాపించాడు.

## 4. గుజ్రన్‌వాలా

ఎవరో ఒక ఆవుదూడను చంపి హిందువులను అవమానపరచే ఉద్దేశంతో దానిని ఒక రైలువంతెనకు వేలాడకట్టడంతో గుజ్రాన్‌వాలా నగరంలో దురాగతాలు ప్రారంభమైనాయి. దీనిని చేసినవారు పోలీసువారనే వదంతి బయలుదేరింది. ప్రజలు క్రోధావేశులై గుంపుగా ఏప్రిలు 14 న ఒక రైలుబండిని చుట్టుముట్టి దానిపై రాళ్ళవర్షాన్ని కురిపించారు. పైన పేర్కొన్న రైలువంతెనను ఇంకొక వంతెనను తగులపెట్టారు. రైలుస్టేషన్, టెలిగ్రాఫ్ ఆఫీసు, ఒక రైల్వేషెడ్డు. ఒక చర్చి, ఒక డాక్ బంగళా ఒక పాఠశాలను అగ్నిహోత్రుని పాలు చేశారు. దీనిఫలితంగా ఓబ్రియన్ అనే సైనికాధికారి నగరానికి పరిపాలకు డయ్యాడు.

తక్కిన నగరాలలో జరిగినట్లే ఇక్కడకూడా ఇతడు కర్ఫ్యూ విధించాడు. ప్రయాణాలను నిషేధించాడు. కొరడాశిక్షలు విధించాడు. గుంపులు గుంపులుగా ప్రజలను అరెస్టుచేసి వెంటవెంటనే శిక్షలు విధించాడు.

భారతీయు లెవరైనను బ్రిటిష్ ఉద్యోగస్థుని చూచినప్పుడు వానికి నమస్కరించవలసినదని, గుర్రపుస్వారీ చేస్తున్నా మోటారు తోలుతూ‌ఉన్నా వెంటనే దిగిపోవలసినదని, గొడు

గులను మూసివేయవలసినదని ఉత్తరువులు జారీచేశాడు. ఒక సందర్భంలో అనేకులను అరెస్టుచేసి, మండువేసవిలో రైలుస్టేషన్‌కు నడిపించి, వారందరిని ఒక గూడ్సుబండిలో కుక్కి, కాలకృత్యాలను తీర్చుకొనుటకు కూడా వీలులేని స్థితిలో 44 గంటలు ప్రయాణం చేయించి, లాహోరుకు పంపాడు. హిందువులను ముస్లింలను కలిపి సంకెళ్ళను తగిలించి, హిందూ ముస్లిం సఖ్యతను హేళన చేశాడు. ఎలాటి విచక్షణలేక తనకు ఇష్టం వచ్చినవా రందరిని అరెస్టుచేసి శిక్షించాడు. 1911 న జార్జి సార్వభౌముని రాక జ్ఞాపకార్థం లక్ష రూపాయలు ఖర్చుపెట్టి కింగ్ జార్జి విద్యాలయాన్ని స్థాపించినట్టివీన్నీ, యుద్ధంలో మరణించిన సిపాయీల కుటుంబాల సహాయార్థం గొప్ప విరాళాలను సమర్పించినట్టివీన్నీ ఒక వయోవృద్ధుడు ఈవిధంగా శిక్షింపబడిన వారిలో ఒకడు.

వీటి అన్నిటినీ మించిన ఇంకొక ఘోరకృత్యానికి కూడా ఇతడు పాల్పడినాడు. ప్రజలను భీతావహులను చేసే ఉద్దేశంతో విమానాలనుండి విచక్షణారహితంగా ప్రజా సమూహాలపై బాంబుల వర్షాన్ని కురిపించారు. దీని ఫలితంగా అసంఖ్యాకులు నగరంలోను సమీప గ్రామాలలోను హతులయ్యారు. సివిలియన్ ప్రజలపై ఇంతకుపూర్వం ఎప్పుడూ బాంబులను ప్రయోగించిన నిదర్శనాలు లేవు. ప్రపంచ మహాసంగ్రామ కాలంలో ఈ విధానం యూరపు మొదలైన ఖండాలలోని దేశాలలో ఉభయ పక్షాలవారు శత్రువులను అణచివేయుటకు దీనిని అనుసరించారు. ఓబ్రియల్ దృష్టిలోను, బాంబులను ప్రయోగించవలసిందిగా అతనిని ఆదేశించిన ఒడయర్ దృష్టిలోను పంజాబు శత్రుదేశం.

షేకూర్‌పురా నగరంలో బాస్వర్త్ స్మిత్ అనే సివిలియన్ ఉద్యోగి సైనికశాసనానుసారం ప్రజలను పాలించాడు. సైనికపాలన అవసరం కాకపోయినా అది వాంఛనీయమని తాను భావించినట్లు విచారణ కమిటీఎదుట సాక్ష్యమిచ్చాడు. సైనికాధికారు లందరివలెనే ఇతడు కూడ అనేకులను కొరడాదెబ్బలకూ ఇతర శిక్షలకూ పాత్రులుచేశాడు. చిన్న పిల్లలలోకూడా ప్రభుభక్తిని పెంపొందించే నిమిత్తం రోజూ రెండు మూడు పర్యాయాలు వారిని ఎండలో నిలబెట్టి వారిచేత పతాకవందనాన్ని (Saluting the Flag) చేయించాడు. వారిలో అనేకులు ఎండదెబ్బచే మూర్ఛిల్లి క్రింద పడిపోయినా దానిని పట్టించుకొనలేదు.

ఈ విధంగా రెండు నెలలపాటు రాష్ట్రంలోని అనేక ప్రాంతాలను సైనికాధికారులు పాలించారు. వారి తెలివితేటలన్ని ప్రజలను హింసించుటకు అపూర్వములైన పద్ధతులను కనిపెట్టి వాటిని ఆచరణ పెట్టుటలో వినియోగమైనవి. ప్రహ్లాదుని చంపుటకు రకరకములైన ఉపాయాలను వినియోగించిన హిరణ్యకశిపుని కాలంలో వీరు ఉండినపక్షంలో అతనికితోచని కొన్ని ఉపాయాలను వీరు అతనికి సూచించేవారు అని అనిపిస్తున్నది. వీరి పరిపాలన రాక్షస పరిపాలన అని చెప్పడం పొరబాటు. వీరిది దానినికి మించిన పైశాచిక పరిపాలన.

ఈలాటి పరిపాలను సాగించి తామేదో ఘనకార్యాన్ని సాధించినట్లు వీరు పొంగిపొయ్యారు. కాని ఈ పాలన కార్యం ఎలాటిదో వారానాడు గ్రహించలేక పొయ్యారు. వీరి పరిపాలనకు పూర్వం ప్రజలు ఆత్మతృప్తిపొందినవారుగా ఉండినారు. వీరి పరిపాలన ఫలితంగా అసంతృప్తి బ్రిటిషుప్రభుత్వంపట్ల ద్వేషరూపం దాల్చింది. ఈ భావం ప్రజల హృదయాలలో స్థిరస్థానం కల్పించుకొని, 30 సంవత్సరాలలో ఆ ప్రభుత్వ పతనానికి దారితీసింది. భారత

దేశంలో బ్రిటిషు సామ్రాజ్యపువాదులను వాస్తవంగా పెకలించినవారు ఈ సైనికాధికారులే. సామ్రాజ్యం అనే భవనం కూలిపోవుటకు వీరే కారకులు.

## 2

ఒడయర్ స్వభావాన్ని పూర్తిగా ఎరిగిన ఇండియా కార్యదర్శి మాంటెగు 1919 ఏప్రిలు ప్రారంభములోనే అతని నిరంకుశత్వం మూలంగా పంజాబులో ప్రజల కోపాగ్నిమంటలు వ్యాపించే ప్రమాదం ఉన్నదని. అలాటి పరిణామం జరగకుండా సకాలంలో చర్యలు తీసుకోవలసిందని రాజప్రతినిధి చెమ్సుఫర్డును హెచ్చరించాడు. అతడు అనుకొనినట్లే రాష్ట్రంలో అగ్నిశిఖలు ప్రజ్వరిల్లాయి. వాటిని నివారించుటకు చెమ్సుఫర్డు ఏలాటి చర్యలు తీసుకొనకపోవడమే కాక వాటికి కారణభూతుడైన ఒడయర్‌ను సర్వవిధాల సమర్థించాడు.

సైనికపరిపాలన మూలంగా పంజాబులో సంభవించిన దురంతాలు ఇతరరాష్ట్రాల వారికి తెలియకుండుటకై ప్రభుత్వం అనేక చర్యలను తీసుకొన్నది. కాని వాటిలో కొన్ని సమగ్రంగా కాకపోయినా పాక్షికంగానైనా ప్రజలకు రాజకీయనాయకులకు తెలియవచ్చాయి. ఏ నాగరిక ప్రభుత్వమూ చేయుటకు సాహసించని హింసా కార్యక్రమాలు నాగరికతకు న్యాయదృష్టికి ప్రఖ్యాతిగాంచిన బ్రిటిషుప్రభుత్వ ఆధ్వర్యాన విశృంఖలంగా జరగడం అందరిలో దిగ్భ్రాంతిని కలిగించింది. అందరు విస్మయంతోపాటు విచారాన్ని పొందినారు.

అలాటి ప్రభుత్వంతో సహకరించడం భారతజాతి గౌరవానికీ, తన వ్యక్తి గౌరవానికీ తగదనే భావంతో దురంతాలనన్నిటిని విరసిస్తూ రాజప్రతినిధికి ఒక ఉదాత్తమైన లేఖను వ్రాసి మహాకవి టాగూరు ప్రభుత్వం కొంతకాలం క్రిందట తనకు సమర్పించిన "సర్" బిరుదమును త్యజించాడు.1921-22 సహాయనిరాకరణంలో బిరుదములను త్యజించడము ఒక ప్రధాన కార్యక్రమంగా రూపొందింది. 1919 లోనే టాగూరు దానికి మార్గదర్శకుడయ్యాడు. మితవాదులలో అగ్రగణ్యుడైన శ్రీనివాసశాస్త్రి పంజాబు దురంతరాలను తీవ్రంగా ఖండించాడు. మదన్ మోహన్ మాలవ్యా వీటిని గురించి 93 ప్రశ్నలను భారతప్రభుత్వానికి పంపి శాసనసభ సమావేశంలో వాటికి సమాధానం చెప్పవలసిందిగా కోరాడు. ప్రభుత్వం ఈ కోరికను నిరాకరించడమే కాక సైనికాధికారుల చర్యలను క్షమిస్తూ ఒక చట్టాన్ని కూడా (Indemnity Bill) చేసింది. రాజకీయ నాయకులలో అనేకులు ఈ చట్టాన్ని విరసించారు. ఏలాటి విచారణను చేయక సైనికాధికారులను క్షమించడం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

గాంధీమాత్రం పూర్తి సమాచారం అందేవరకూ దురంతాలను ఖండించలేదు. క్షమార్పణ చట్టాన్నికూడా సమర్థించాడు. జూలైలో తాను ప్రారంభించదలచిన సత్యాగ్రహ ప్రయత్నాన్ని మానుకొన్నాడు. ప్రభుత్వ వైఖరిలో కలిగిన మంచిమార్పే దీనిని మానుకొనుటకు కారణమన్నాడు. మొదటనుండి ఆయనలో బ్రిటిష్‌సామ్రాజ్యంపట్ల ఒక ద్వంద్వాభిప్రాయం ఏర్పడినట్లు ఇదివరలో తెలుసుకొన్నాము. పంజాబు దురంతాలు జరిగిన కాలంలో ఆయన వ్యక్తంచేసిన అభిప్రాయాలు దీనికొక దృష్టాంతరం. ఆయనను అనేకులు అర్థంచేసుకొనలేక పొయ్యారు. ఆయన వైఖరి ఇతర రాజకీయనాయకు లనేకుల వైఖరికంటె భిన్నంగా ఉండినది.

సాధారణంగా పంజాబు దురంతాలవంటి అవాంఛనీయ పరిణామాలు సంభవించినప్పుడు ।వాటినిగురించి విచారణ చేయుటకు ఒక సంఘాన్ని నియమించి వాస్తవంగా

ఏమి జరిగిందో ఎందుకు జరిగిందో తెలుసుకొనడం పరిపాటి. పంజాబు దురంతాలగురించి వాదోపవాదాలు అనేకం బయలుదేరడంచేతను అధికారులు అనధికారులు పరస్పరవిరుద్ధములైన అభిప్రాయాలను వ్యక్తంచేయడంచేతను ఈలాటి విచారణ మరింత అవసరమైనది. 1919 మే ప్రారంభంలో ఆలాటి కమిటీని నియమించవలసిందిగా మాంటెగు రాజప్రతినిధికి సూచనచేశాడు. రాష్ట్ర గవర్నరులు కొందరు దానిని ప్రతిఘటించినా చెమ్సుఫర్డు దానికి అంగీకరించాడు. అక్టోబరు 14 న హంటరు ప్రభువు అధ్యక్షతన కమిటీ ఏర్పడినది. అందులో యూరోపియన్లు అయిదుగురు భారతీయులు ముగ్గురు సభ్యులుగా నియమింపబడినారు.

అనధికారులకు కమిటి నియామకం అవసరమని మొట్టమొదట సూచించినవాడు గాంధీ. మే 25 న సత్యాగ్రహుల సమావేశంలో ఈ సూచననుచేసి 30 న దానిని గురించి రాష్ట్రపతికి ఉత్తరం వ్రాశాడు. జూన్ 8 న అఖిల భారతకాంగ్రెసు కమిటీ సమావేశమే పంజాబు దురంతాల గురించి విచారణచేయుటకు తొమ్మిది సభ్యులతోకూడిన ఒక కమిటీని నియమించింది. అక్టోబరులో గాంధీకూడా అందులో సభ్యుడయ్యాడు. ఈ విధంగా ఒక అధికార కమిటీ. ఒక అనధికారకమిటీ ఏర్పడినవి.

అనధికార కాంగ్రెసుకమిటీ కొన్ని సూచనలుచేసి, ప్రభుత్వం వాటిని ఆమోదించిన పక్షంలో అధికారకమిటీతో సహకరించి విచారణ జరుపుటకు సిద్ధపడింది. కాని సూచనలన్నిటిని ప్రభుత్వం అంగీకరించని కారణంగా రెండు కమిటీలు వేర్వేరుగా విచారణచేసి వేర్వేరు నివేదికలను తయారుచేశాయి.

కాంగ్రెసు కమిటీవిచారణలో గాంధీ ప్రధానపాత్రను వహించాడు. చాలావరకు ఆయనే నివేదికను కూడా తయారుచేశాడు. ఈ సందర్భంలో కమిటీ 1700 సాక్షుల వాంగ్మూలాలను సేకరించింది. వాటిని క్షుణ్ణంగా పరిశీలించి నివేదికను తయారుచేసి 1920 మార్చి 20 న దానిని ప్రకటించింది. హంటరుకమిటీ నివేదిక దానితర్వాత రెండునెలలకు—మే 28 న-ప్రకటించబడింది. కాంగ్రెసుకమిటీ నివేదిక ఏకగ్రీవమైనట్టిది. హంటరు కమిటీలో అధిక సంఖ్యాకులైన యూరోపియన్లతో అల్ప సంఖ్యాకులైన భారతీయులు ఏకీభవించలేక పోయినారు. అందుచేత ఒక అధిక సంఖ్యాక నివేదిక (Majority Report) ఒక అల్ప సంఖ్యాక నివేదిక (Minority Report) ప్రకటితములైనవి. ఆనాడు భారతీయులు బ్రిటిష్‌వారి మధ్య ఏర్పడిన అభిప్రాయ భేదాలకు ఇది ఒక గొప్ప తార్కాణము.

కాంగ్రెసు కమిటీ నివేదిక (1) ఏప్రిలులో సంభవించిన ప్రజల దౌర్జన్యాలకు ఒడయర్ 1913 నుండి సాగించిన నిరంకుశ పరిపాలన, గాంధీ కిచ్లూ సత్యపాలుల అరెస్టులు ప్రధాన కారణాలనిన్నీ, రౌలెట్టు సత్యాగ్రహం కారణంకాదనిన్నీ నిర్ణయించింది. (2) శాంతి నెలకొనుటకు అనుకూల పరిస్థితులు ఏర్పడుచున్నప్పుడే ఒడయర్ ప్రభుత్వం తొందరపడి అనవసరంగా సైనిక పరిపాలనను ప్రవేశపెట్టిందని ఇంతేగాక అనవసరంగా దానిని రెండు నెలల కాలం పొడిగించినదని ఈ చర్యలు సమర్థించ దగునవికావని నిర్ణయించింది. (3) డయ్యారు జలియన్ వాలాబాగులో జరిపించిన హత్యలు బుద్ధిపూర్వకముగా చేయబడినవని, అతడూ ఇతర సైనికాధికారులు జరిపించిన అరెస్టులు శిక్షలు, వారు కొనసాగించిన ఇతర కార్యక్రమాలు ప్రాథమిక న్యాయసూత్రాలకు పరమ విరుద్ధములైనట్టివనీ, ప్రజలను హింసించి వారిని భీతావ

హింల చేయుటకును, వారిపై పగసాధించుటకును, వారిని మరియెన్నడూ తలయెత్తకుండా చేయుటకునూ ఉద్దేశింపబడినవని నివేదిక నిర్ణయించి, వాటిని పూర్తిగా ఖండించింది. (4) ఈలాటి ఘోర కృత్యాలను గావించిన ఒడయర్, డయ్యరు మొదలైన సైనికాధికారులు, వారి పరిపాలన విధానాన్ని సమర్థించిన రాజప్రతినిధి చెమ్సుఫర్డు ఉద్యోగంలో ఉండుటకు ఎంతమాత్రము అర్హులుకారని, వెంటనే వారిని ఉద్యోగాలనుండి తొలగించుటయే పంజాబు దురంతాలకు తగిన ప్రతిక్రియ అని కాంగ్రెసు కమిటీ నివేదిక నిర్ణయించింది.

హంటరు కమిటీ నివేదికలు రెండున్నూ రౌలెట్టు సత్యాగ్రహం ప్రజల దౌర్జన్యాలకు ప్రధాన కారణమనీ, పోలీసులయొక్కయు సైనికులయొక్కయు కాల్పులు సమర్థనీయములనీ, అధిక సంఖ్యాకులను కొరడాలతో కొట్టడం ఖండించ తగినదనీ, డయ్యరు అమలుపరచిన పొట్టపాకుడుశిక్ష, విద్యార్థులపై సైనికాధికారులు విధించిన శిక్షలు, ఎంతమాత్రము సమర్థనీయములు కాజాలవని నిర్ణయించాయి. కేంద్ర ప్రభుత్వ వైఖరి ఖండించ తగినదికాదని రెండు నివేదికలు తెల్పినవి.

ప్రజలు ప్రభుత్వంపై తిరుగుబాటు చేశారని, అందుచేత సైనిక పరిపాలనను ప్రవేశపెట్టడమూ, దానిని పొడిగించడము సమర్థనీయములనీ. జలియన్ వాలాబాగులో డయ్యరు ప్రజలు చెదరిపోవుటకు తగిన అవకాశమియ్యక కాల్పులను మితిమీరి సాగించాడని, కాని అతడు బుద్ధిపూర్వకంగా ప్రజలను హత్య చేయలేదని మెజారిటీ నివేదిక నిర్ణయించింది. కాని మైనారిటీ నివేదిక డయ్యరు ప్రవర్తనను పూర్తిగా ఖండించింది. సైనిక పరిపాలనను ప్రవేశపెట్టడమును, దానిని పొడిగించడమును గర్హించింది. ఈలాటి విషయాలన్నిటిలో మైనారిటీ నివేదిక కాంగ్రెసుకమిటీ నివేదికతో ఏకీభవించింది.

ఇండియా ప్రభుత్వం చాలావరకు మెజారిటీ నివేదికను సమర్థించింది. ఇండియా మంత్రి మాంటేగు ఆలాగుచేయక డయ్యరు మొదలైనవారి ప్రవర్తనను తీవ్రంగా ఖండించాడు. ఒడయర్ ప్రవర్తనకూడా అతని విమర్శకు గురి అయినది.

హంటరుకమిటీ నివేదిక ఫలితంగా డయ్యరు తన ఉద్యోగానికి రాజీనామాచేసి ఐచ్ఛికంగా ఉద్యోగాననుండి తొలగిపోయినాడు. అతని ప్రవర్తనను కామన్సు సభవారు ఖండించినా లార్డ్సు సభవారు ప్రశంసించారు. బ్రిటిష్ ప్రజలలో అధిక సంఖ్యాకులు భారతదేశంలోని బ్రిటిష్ సామ్రాజ్యాధికారం విచ్ఛిన్నంకాకుండా రక్షించిన మహామహుడు డయ్యరేఅని అతనిపట్ల తమకుగల కృతజ్ఞతను గౌరవానికి సూచకంగా ఒకకత్తిని సుమారు 28,000 పౌండ్లధనాన్ని అతనికి సమర్పించారు. భారతదేశంలోని యూరోపియనులు. వారిలో ప్రధానంగా స్త్రీలు చందాలు ధారాళంగా ఇచ్చారు. ఆంగ్లో ఇండియన్ పత్రికలన్నీ అతనిని ప్రస్తుతించాయి భారతీయులు దీనిని విషంగాపరిగణించారు. అదే బ్రిటిష్‌వారికి అమృతమైంది. డయ్యరుపెట్టిన హింసలకంటె బ్రిటిష్‌వారు అతనిని ప్రశంసించి బహూకరించడం భారతీయులకు ఎక్కువ బాధను కలిగించింది.

## 3

పంజాబు దురంతాలకు ప్రతిక్రియగా కాంగ్రెసు కమిటీ చేసిన సూచనలను ప్రభుత్వం లెక్కలోకి తీసుకొనలేదు. ఒడయరు, చెమ్సుఫర్డులు ఉద్యోగాలనుండి తొలగింపబడలేదు.

శిక్షలు అనుభవిస్తూ ఉండినవారికి విముక్తి కలుగలేదు. వారికిగాని, వారి కుటుంబాలకుగాని ఎలాటి నష్టపరిహారం చెల్లించబడలేదు. పై పెచ్చు అధికారులందరు క్షమించబడ్డారు.

ఇది అంతా రాజకీయ చైతన్యం గలవారిలో అలజడిని అసంతృప్తిని కలిగించింది. బ్రిటిషు పరిపాలనకు బలప్రయోగం ఒక్కటే ఆధారంకాదని, ప్రజల సహకారంకూడా ఆధారమని, దానిని సంపాదించుటకొరకే మాంటేగు, చెమ్సుఫర్డు సంస్కరణలు ఉద్దేశింపబడినవని బ్రిటిషు ప్రభుత్వం ఘోషించింది. కాని పంజాబులోని సైనిక పరిపాలన, తత్ఫలితంగా సంభవించిన దురంతాలు ప్రజల సహకారంతో నిమిత్తం లేకుండా బలప్రయోగాన్ని మాత్రమే ఆధారం చేసుకొని బ్రిటిషువారు తమ పరిపాలనను సాగించుటకు కృతనిశ్చయులైనట్లు స్పష్టం చేశాయి. ఈలాటి భావం వారిలో ఉన్నంతకాలం సంస్కరణ మూలంగా ఏలాటి ప్రయోజనం లభించదని అనేకులు నిశ్చయించారు. ఆలాటి వారిలో గాంధీ అగ్రగణ్యులయ్యారు. 1919 జులైలో పంజాబు దురంతాల గురించి పూర్తి సమాచారం అందని కారణంగా ప్రభుత్వాన్ని ఖండించడానికి ఆయన ఇష్టపడలేదు. అధికారుల క్షమార్పణ చట్టాన్ని కూడా సమర్థించారు. కాని కాంగ్రెసు విచారణ కమిటీ సేకరించిన సమాచారం ఆయనకొక కనువిప్పుగా పనిచేసింది. బ్రిటిష్‌వారు డయ్యరును ప్రస్తుతించి బహూకరించడం ఈ కనువిప్పునకు ప్రాబల్యం చేకూర్చింది. ప్రభుత్వం పంజాబు దురంతాలకు ఎలాటి ప్రతిక్రియ చేయకపోవడం ఆయన వైఖరిలో విప్లవాత్మకమైన మార్పు తెచ్చింది. పంజాబు దురంతాలకు కారణభూతమైన బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించడం ఒక పాపకృత్యంగా ఆయన భావించారు. దానిపట్ల సహాయ నిరాకరణ విధానాన్ని అనుసరించడమే ప్రజల కర్తవ్యమని నిర్ణయించారు. ఈ విధంగా పంజాబు దురంతాలు 1921-22 లో సాగిన సహాయ నిరాకరణోద్యమానికి దారితీశాయి. ఈ ఉద్యమంతో స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమైంది. దానికి గాంధీ సూత్రధారులయ్యారు.

సహాయ నిరాకరణోద్యమానికి దారితీసిన పరిస్థితులు పంజాబు దురంతాలు మాత్రమే కావు. వాటినన్నిటిని గురించి మన తెలుసుకొనడం అవసరం.

చదవవలసిన గ్రంథాలు.

Vidya Bhavan Vol xi.
B. Seetharamiah History of the Indian National Congress తెనుగు అనువాదం.

R. Kumar (Ed) Essays in Gandhian Politics—Essays i and ix.
Judith M. Brown: Gandhi's Rise to Power.

# అధ్యాయము-5

## సహాయ నిరాకరణోద్యమ జననము

### 1

రౌలెట్టు సత్యాగ్రహం ముగిసిన తర్వాత 1920 ఆగస్టున గాంధీ సహాయ నిరాకరణోద్యమ మనేపేర ప్రఖ్యాతిగాంచిన ఇంకొక సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభించి 1922 మార్చివరకు సాగించాడు. ప్రథమంలో దీనిని ఖిలాఫత్ విషయంలో బ్రిటిష్ ప్రభుత్వంమూలాన ముస్లింలకు జరిగిన గొప్ప అన్యాయాన్ని తొలగించుటకు ఉద్దేశించాడు. క్రమక్రమంగా పంజాబు దురంతాలమూలంగా ప్రజలకు జరిగిన అన్యాయాలను తొలగించుటకు దేశానికి స్వరాజ్యాన్ని సంపాదించుటకు దీనిని వినియోగించాడు. అందుచేత ఈ సత్యాగ్రహం మూడు ఉద్దేశాలను సాధించుటకు ఉద్దేశింపబడినట్టు చెప్పదగియున్నది.

(1) ఖిలాఫత్‌ను గురించిన్నీ, అది ముస్లింల ఆలజడికి కారణమగుటను గురించిన్నీ ఇదివరలోనే తెలుసుకొన్నాము. ఖలీఫు ముస్లింలకు మతగురువు. ఖిలాఫత్ ఉద్యమం అతని అధికారానికి సంబంధించినట్టి ఉద్యమం అందుచేతనే దీనికి ఖిలాఫత్ ఉద్యమం అనేపేరు లభించింది.

అనేక శతాబ్దాలుగా టర్కీ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తుండిన సుల్తాను ఖలీఫుగా ఉండినాడు. లౌకికమైన సుల్తాన్ పదవిని పారలౌకికమైన మతగురువు పదవిని ఒకడే అనుభవించడం గుర్తించదగిన విషయం. సుల్తానుపదవికి ఏలాటినష్టం కలిగినా అది మతగురువు పదవికికూడా నష్టం కలిగినట్టు వారు భావించడం పరిపాటి అయింది. ఖిలాఫత్‌సమస్య క్లిష్టరూపం ధరించుటకు ఇదే కారణం.

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో టర్కీ సులాను జర్మనీ పక్షము వహించి బ్రిటన్, ఫ్రాంసు, అమెరికా మొదలైన మిత్రమండలి దేశాలతో యుద్ధంచేసి పరాజితుడైనాడు. యుద్ధంలో ఓడిపోయినవారికి సాధారణంగా ఏలాటి దుర్గతి పట్టగలదో అలాటిదుర్గతే అతనికి పట్టింది. యూరపుఖండంలో అతని ఏలుబడిలో ఉండిన థ్రేసు అనే భూభాగాన్ని మిత్రమండలివారు గ్రీసు దేశానికి దానంచేశారు. పశ్చిమ ఏషియాలో అతని ఏలుబడిలో ఉండిన అరేబియా, ఇరాక్, సిరియా, పాలెస్టయిన్ దేశాలకు నామకంగా స్వతంత్రం ఇచ్చి వాస్తవంగా బ్రిటన్, ఫ్రాన్‌సులు వశపరచుకొన్నాయి. ఇవి సర్వదా ముస్లింల పరిపాలనలో ఉండివలసినట్లుగా మహమ్మదు ప్రవక్త ఆదేశించినాడు. మిత్రమండలి ప్రవర్తన దీనికి అన్యథాగా పరిణమించింది. ఇదిగాక ఖలీఫు పరిపాలనలో ఉండవలసిన మక్కా, మదీనా, జెరూసలం మొదలైన పుణ్యక్షేత్రాలన్నీ అతని పరిపాలననుండి తప్పి, క్రైస్తవుల పరిపాలనలోకి వచ్చాయి.

ఈ విధంగా టర్కీ సామ్రాజ్యం విచ్ఛిన్నంకావడం, ముస్లిం దేశాలూ ముస్లిం పుణ్యక్షేత్రాలూ, క్రైస్తవులు వశపరచుకొనడం, సుల్తాను నామమాత్రాధికారం కలవాడై మిత్ర మండలివారి ఆధీనంలోకి రావడం, భారతదేశంలోని ముస్లింలను ఆగ్రహ పరవశులుగా చేశాయి. తమ మత గురువునకు ఇంతటి నష్టం కలగడం వారి కెంతమాత్రం గిట్టలేదు.

ఖలీఫుకు ఈలాటి ప్రమాదం సంభవించ నున్నదనే భావం యుద్ధకాలంలోనే వారికి కలిగింది. తమ మతగురువుపట్ల భక్తిని ప్రదర్శించడమా లేక తమ్ము పరిపాలించే బ్రిటిషు ప్రభుత్వంపట్ల భక్తిని ప్రదర్శించడమా అనే సమస్యను వారు యుద్ధకాలంలో ఎదుర్కొనవలసి వచ్చింది. భారతసైన్యంలో ముస్లింలు అధికసంఖ్యలో ఉండినారు. వారు తక్కిన సిపాయీలవలె యుద్ధరంగాలన్నిటికీ వెళ్ళి బ్రిటిష్‌పక్షాన యుద్ధంచేస్తూ ఉండినారు. తమ మతగురువుపై యుద్ధంచేయడం పాపకార్యంగా వారు భావించినపక్షంలో బ్రిటిషు ప్రభుత్వానికి ఎంతో నష్టం కలగడం తప్పదు. ఆలాటిభావం దేశంలోని ముస్లింలలో కలిగిన పక్షంలో వారు తిరుగుబాటు కార్యక్రమాలను సాగించడం తప్పదు. ఈ పరిస్థితులను బ్రిటిష్ అధికారులు గమనించి, యుద్ధ ఫలితంగా సుల్తాను సామ్రాజ్యానికిగాని, ముస్లింల పుణ్యక్షేత్రాలకుగాని ఏలాటి ప్రమాదం జరగ దని హామీఇచ్చారు. ఆలాగు హామీ ఇచ్చినవారిలో బ్రిటిష్ ప్రధాని లాయిడ్ జార్జి ఒకడు. ముస్లింలు ఇదిఒక వాగ్దానంగా భావించి, యుద్ధకాలంలో ప్రభుభక్తి పరాయణులుగా ప్రవర్తించారు. యుద్ధానంతరం తమ వాగ్దానాలకు భంగకరంగా అధికారులు ప్రవర్తించడం ముస్లింల ఆగ్రహానికి ఇంకొక కారణమైంది. బ్రిటిష్‌వారు నమ్మకద్రోహులనేభావం వారిలో వ్యాపించింది.

టర్కీ సామ్రాజ్యం విచ్ఛిన్నంగాక యథాపూర్వంగా ఉండవలెనని, అరేబియా మొదలైన దేశాలు ముస్లింల పరిపాలనలోనే ఉండవలెనని, ముస్లిం పుణ్యక్షేత్రాలు ఖలీఫు అధీనంలోనే ఉండవలెనని ఖిలాఫత్ ఉద్యమాన్ని లేవదీసినవారు వాంఛించినారు. ఈ ఉద్యమం ఈ మూడు ఆశయాలను సాధించుటకు ఉద్దేశింపబడింది.

(2) ఉద్యమంలో గాంధీ ఆసక్తిని ప్రదర్శించి తుదకు దానికి నాయకుడయ్యాడు. ఇందులోఆయనకు ఆసక్తి కలుగుటకు అనేక కారణాలు ఉండినట్లు చెప్పవచ్చు. దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడే ఆయనకు ముస్లింలపట్ల ప్రత్యేక అభిమానం ఏర్పడడం దీనికి ఒక కారణం. టర్కీపక్షం వహించవలసిందిగా యుద్ధకాలంలో ప్రచారంచేసిన మహమ్మదాలి, షౌకతాలీ సోదరులను ప్రభుత్వం నిర్బంధంలో ఉంచగా వారి విడుదలకు 1916 నుండి ఆయన ప్రయత్నం చేయడంచేత ముస్లింల గౌరవానికి పాత్రుడైనాడు. ఇదిగాక దేశంలో ఎవరికి అన్యాయం జరిగినా దానిని తొలగించడం తన కర్తవ్యంగా ఆయన భావించినవాడు. ఆయన సాధించిన సత్యాగ్రహాలన్నీ దీనికి నిదర్శనాలు. ఖిలాఫత్ విషయంలో ముస్లింలకు గొప్ప అన్యాయం జరిగినట్లు ఆయన భావించాడు. దీనికితోడు ఈ విషయంలో బ్రిటిష్ అధికారులు ప్రతిజ్ఞాభంగంకూడా చేశారు. ప్రతిజ్ఞాభంగం ఆయన తత్వానికి విరుద్ధం. అందుచేతనే ఆయన ఖిలాఫత్ ఉద్యమంలో కృషిచేయ నిశ్చయించుకొన్నాడు. అందులో ఆయనకు కలిగిన ఆసక్తికి ఇది రెండవకారణం. ఇంతేగాక ఈ విషయంతో దేశాన్ని పాలించే అధికారుల ప్రవర్తనకారణంగా పాలితులైన ముస్లింలకు వారిపట్ల ద్వేషం కలిగింది. పాలితులు, పాలకులు మధ్య ద్వేషం కలగడం ఉభయులకు నష్ట కారణం. తాను ఉద్యమంలో ప్రవేశించిన పక్షంలో ఉభ

యులమధ్య సౌహార్ద్రాన్ని పెంపొందించే అవకాశం ఉంటుందని ఆయన భావించారు. ఇదికూడా ఉద్యమంలో ఆయన ఆసక్తికి ఇంకొక కారణంగా పరిణమించింది.

గాంధీ సత్యాగ్రహ సాధనంపట్ల పరమవిశ్వాసం కలవారు. మానవ సమాజంలో ఏలాటి సమస్యలు ఉత్పన్నమైనా వాటిని సంప్రతింపులద్వారా పరిష్కరించడం సాధ్యం కానప్పుడు హింసతో కూడిన బలప్రయోగ చర్యలకు దిగుటకు బదులు సత్యాగ్రహ సాధనాన్ని వినియోగించడం కర్తవ్యంగా భావించినవారు. ఖిలాఫత్ సమస్యను పరిష్కరించడంలో దీనిని వినియోగించి ఈ సాధనానికి గల అనంతశక్తిని రుజువుచేయదలచారు. ఖిలాఫత్ ఉద్యమంలో ఆయన కృషిచేయుటకు ఇదికూడా ఒక కారణమైంది. ఈ విధంగా అనేక ఉద్దేశాలను సాధించగోరి ఆయన ఈ ఉద్యమంలో ప్రవేశించారని గుర్తించవలసి ఉంది.

(3) ఖిలాఫత్ ఉద్యమంలో మొదటి దశ 1919 మార్చినుండి డిసంబరు వరకు సాగింది. ఇది ఉద్యమ ప్రచారదశ అని చెప్పవచ్చు. 1919 మార్చి 19 న బొంబాయి నగరంలోని ప్రముఖ ముస్లిం వర్తకులు బొంబాయి ఖిలాఫత్ కమిటీ (Bombay Khilafat Committee)అనే పేరట ఒక కమిటీని స్థాపించడంతో ఇది ప్రారంభమైంది. అదేసమయంలో లక్నోనగరంలో అబ్దుల్ భారి అనే మతప్రచారకుని ఆధ్వర్యాన కొంత సంచలనం కలిగింది. ఇతడు ఆలీ సోదరులకు గురువు. గాంధీ ఇతనితో సంప్రతించి హిందువులతో కలిసి ముస్లింలు ఉద్యమాన్ని సాగించివలసింది గాను, గోవధను నిషేధిస్తే ఈ కలయిక సులభసాధ్యం కాగలదని, అవసరమైనపక్షాన సత్యాగ్రహాన్నికూడా వినియోగించవలసి ఉంటుందనీ సూచించారు. భారీ గోవధ నిషేధవిషయంలో కొంత ప్రయత్నం చేశారు.

బొంబాయి కమిటీవారు, లక్నోలోనివారు కలిసి సెప్టెంబరు 21న ఒక అఖిల భారత ఖిలాఫత్ సమావేశాన్ని లక్నోలో జరిపారు. సమావేశంలో అనేక తీర్మానాలను చేశారు. అక్టోబర్ 17 న అఖిల భారత ఖిలాఫత్ దినంగా పాటించడం వీటిలో ఒకటి.

ఉద్యమాన్ని ప్రచారం చేయుటకు ఇది పటిష్ట సాధనం కాగలదనే భావంతో గాంధి ఆరోజున హిందువులు ముస్లింలుకలసి పూర్తిహర్తాలు జరపవలసిందిగాను, శాంతియుతంగా సభలను సమావేశపరచి ప్రజలకు ఉద్యమాన్ని గురించి తెలియపరచ వలసిందిగాను సూచించాడు. దీనినిగురించి వార్తాపత్రికలకు వ్రాశాడు. హోంరూలు లీగులోని తన అనుచరులను ఇతర అనుచరులను ఈ కార్యక్రమంలో శ్రద్ధవహించవలసిందిగా ఆదేశించాడు. వీటి అన్నింటి ఫలితంగా అక్టోబరు 17 న అన్నిరాష్ట్రాలలో అనేకనగరాలలో హర్తాలులు సభలుజరిగాయి. ఉద్యమ ఆశయాలను ప్రజలు గ్రహించ గలిగారు.

నవంబరు 23, 24 న ఢిల్లీలో రెండవ అఖిలభారత ఖిలాఫత్ సమావేశం జరిగింది. ఇందులో అతివాదు లనేకులు పాల్గొన్నారు. స్వామిశ్రద్ధానందా, మరికొందరు పంజాబు దురంతాలుకూడా ఒక గొప్ప అన్యాయమని, దానినితొలగించుటకు ప్రయత్నంచేయడం అవసరమని సూచించారు. అలాగు చేసినయెడల ఖిలాఫత్ ఉద్యమానికి హిందువుల సహకారం లభించడం సాధ్యంకాగలదనే అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. కాని గాంధీ దీనికి అంగీకరించలేదు. ఖిలాఫత్ సమస్యతో పంజాబు సమస్యను జోడించడం అప్పట్లో ఆయనకు రుచించలేదు. మరి

కొందరు విదేశవస్తువులను బహిష్కరించ వలసిందిగా సూచించారు. గాంధీ సహాయనిరాకరణ సూచననుచేశాడు. బహిరంగంగా ఆయన దీనిగురించి ప్రస్తావించడం ఇదే ప్రథమం. కాని ఈ సూచనలగురించి ఏలాటి తీర్మానాలు చేయబడలేదు. యుద్ధంముగిసి శాంతి నెలకొనినందుకు ప్రభుత్వం సంతోష సూచకంగా తలపెట్టిన ఉత్సవాలను ప్రజలు బహిష్కరించ వలసినదిగా గాంధీచేసిన సూచనమాత్రం అందరు అంగీకరించి అందుకుగాను ప్రచారం సాగించారు. దానిఫలితంగా అనేక నగరాలలో ప్రజలు ఉత్సవాలను బహిష్కరించారు.

బొంబాయి కమిటీలోని సభ్యులలో అనేకులు విదేశవస్త్రాలు మొదలైన వాటిలో వ్యాపారంచేసి లాభాలను గడించేవ్యక్తులు. వారికి విదేశవస్తువుల బహిష్కరణ ఆమోద యోగ్యంకాలేదు. సహాయ నిరాకరణంజరిగి. ముస్లింలు ప్రభుత్వోద్యోగాలను వదలుకొన్న పక్షంలో హిందువులు ఆఖాళీలలో ప్రవేశించగలరని. దానిమూలంగా ముస్లింలకు శాశ్వతమైన నష్టం కలగ గలదని అప్పట్లో అనేకులు సహాయ నిరాకరణ సూచనపట్లకూడా విముఖులుగా ఉండినారు. మొత్తంమీద 1919 డిసెంబరు నాటికి ఉద్యమాన్ని గురించి కొంత ప్రచారంసాగిందేగాని మరి ఏలాటి ఫలితాలు లభించలేదు.

(4) 1919 డిసెంబరులో మాంటిగుచెమ్సుఫర్డు సంస్కరణలు చట్టరూపం ధరించాయి. ఈ చట్టంమూలంగా దేశంలో కొత్తయుగం ప్రారంభం కాగలదని ప్రభుత్వం భావించి దానికి సూచకంగా రాజకీయ ఖైదీలనేకులను విడుదలచేసింది. విడుదలైనవారిలో ఖిలాఫత్ ఉద్యమంలో ప్రాధాన్యం వహించిన అలీసోదరులు ఆజాద్ మొదలైనవారు ఉండినారు వారి విడుదలలో అతివాదుల ప్రాధాన్యం బలపడి ఉద్యమం రెండవదశలో ప్రవేశించింది.

విడుదలైన అలీసోదరులు వెంటనే అమృతసర్‌కువచ్చి కాంగ్రెసు సమావేశంలో పాల్గొన్నారు.తర్వాత అమృతసర్‌లో హిందువులు ముస్లింలు సమావేశమై ఒక ప్రతినిధివర్గం రాజప్రతినిధిని కలుసుకొనవలసినదిగా తీర్మానించారు. దీనిమేరకు 1920 జనవరి 20 న ఒక ప్రతినిధి వర్గం అతనిని కలుసుకొని. ఖిలాఫత్ ఉద్యమ ఆశయాలు మూడింటిని నెల్లించవలసిందిగా కోరింది. కాని అది సాధ్యంకాదని అతడు జవాబుచెప్పడంతో ఉద్యమకర్తలు ఆశాభంగాన్నిపొంది అతివాద ధోరణిలో ప్రచారం చేయసాగారు. వారిలో కొందరు మతయుద్ధం ప్రకటించవలసిందిగా సూచనచేశారు. కొందరు ఆఫగన్‌స్థాన్ సహాయంతో బ్రిటిష్‌వారిపై యుద్ధంచేసి వారి పరిపాలనను తొలగించడం వాంఛనీయమనికూడా ప్రచారంచేశారు.

ఈ ధోరణి గాంధీకి ఎంతమాత్రం గిట్టలేదు. యుద్ధాన్ని తలపెట్టడం గొప్ప ప్రమాదంగా ఆయన భావించి అలాటి అతివాదులను మందలించే ఉద్దేశంతో మార్చి 10 న ఒక ప్రకటనను చేశాడు. ఉద్యమాన్ని సాగించడంలో యుద్ధప్రసక్తిని పూర్తిగా ఖండించాడు. సత్యాగ్రహం ఒక్కటే పటిష్టసాధనమని ఉద్ఘాటించాడు. “ఒక జాతిగాని. ఒక వ్యక్తిగాని దౌర్జన్యములను పూర్తిగా త్యజింపగలిగినయెడల ఆజాతికిగాని ఆవ్యక్తికిగాని కలిగేశక్తి అప్రతిహతము. దౌర్జన్యము, నిరర్థకము. మనము ఒక తెల్లవానినిచంపిన పక్షంలో ప్రభుత్వం 2000 భారతీయులను చంపగలదు. కాబట్టి ఇక మనకు మిగిలియున్న ఉపాయము అసహాయోద్యమ మొక్కటే. అది సంపూర్ణముగా దౌర్జన్య రహితముగానుండేయెడల దానికంటె తిన్ననైన ఉపాయము, బలవత్తరమైన ఉపాయము మరొకటి ఉండబోదు” అని ప్రకటనలో తన అభిప్రాయాన్ని స్పష్టం

చేసి, ఆ ఉద్యమంలో ఏయే అంశాలను చేర్చవలెనో పేర్కొన్నారు. ఇదిమొదలు సత్యాగ్రహాన్నిగురించీ, ప్రకటనలో సూచించిన కార్యక్రమాన్నిగురించీ, హిందువులు ముస్లింలు చర్చించసాగారు.

అమృతసర్ సమావేశం జరిగిన తర్వాత మహమ్మదాలీతో కూడిన ఒక రాయబార వర్గం లండన్‌కువెళ్ళి బ్రిటీష్ ప్రధానిలాయడ్ జార్జిని కలుసుకొన్నది. అతడు వారు సమర్పించిన వివేదికకు జవాబుగా. "(ఓడిపోయిన) క్రైస్తవ దేశాలకు (జర్మనీ, ఆస్ట్రియావంటి దేశాలకు) అనువర్తించే సిద్ధాంతాలకు భిన్నంగా టర్కీవిషయంలో వర్తించడం సాధ్యంకాదు. టర్కీజాతికి చెందిన భూములపై టర్కీకి లౌకికాధికారముండును. టర్కీజాతికి చెందని భూములు (అరేబియా, మెసపటేమియా, సిరియా, పాలెస్టైన మొదలైనవి) టర్కీపాలనలో ఉండుటకు వీలులేదు" అని నిర్దాక్షిణ్యంగా చెప్పాడు. రాయబారం విఫలమైనట్లు ఇది స్పష్టంచేసింది. అధికారులపై ఖరిపట్ల ప్రజలనిరసనను వ్యక్తంచేయుటకు మార్చి 19 న దేశమందంతట హర్తాలు జరిగినది. సభలలో గాంధీ ప్రకటనలో సూచించబడిన సత్యాగ్రహ కార్యక్రమం ప్రచారం చేయబడినది.

(5) ఈ విధంగా ఉద్యమ రెండవదశలో అతివాదుల ప్రాధాన్యం వృద్ధిగాంచి సత్యాగ్రహంగురించిన చర్యలు ప్రారంభమైనాయి. మే 14 న మిత్రమండలివారు సంధిషరతులను ప్రకటించారు. ఖిలాఫత్ ఉద్యమ కోరికలన్నిటినీ వారు నిరాకరించారు. వెంటనే గాంధి ఒక ప్రకటనగావించి తాను మార్చి 10 న సూచించిన సత్యాగ్రహ సాధనం ఆధారంగా సహాయ నిరాకరణాన్ని సాగించడంతప్ప అనుసరించదగిన మార్గం ఇంకొకటి లేదని పునరుద్ఘాటించాడు. దీనితో ఉద్యమం మూడవదశలో ప్రవేశించింది. మే 28 ఖిలాఫత్ కమిటి బొంబాయిలో సమావేశమై సహాయ నిరాకరణోద్యమాన్ని ఆమోదిస్తూ తీర్మానంచేసింది. కాని దీనిపట్ల హిందువులనాయకుల సహకారం సంపాదించవలసి ఉండినది.

మే 28 న పంజాబు దురంతాలగురించి హంటరు నివేదిక ప్రచురించబడింది. దీనిని గురించి చర్చించుటకు మే 30 న వారణాసిలో అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమైంది. సమావేశంలో ఖిలాఫత్‌కమిటీ ఆమోదించిన సహాయనిరాకరణ తీర్మానంకూడా చర్చకు వచ్చింది. దీనినిగురించి తీవ్రమైన అభిప్రాయభేదాలు ఉత్పన్నములైనందున సెప్టంబరులో ప్రత్యేక కాంగ్రెసు సమావేశాన్నిజరిపి సహాయ నిరాకరణమునకు సంబంధించిన నిర్ణయం దానికి వదలివేయవలెనని తీర్మానం చేయబడింది. హంటరుకమిటీ నివేదికను చర్చించి, అధిక సంఖ్యాకుల నివేదిక (Majority Report)ను పూర్తిగా ఖండించి, రాజప్రతినిధి చెమ్సపర్డును పదవినుండి తొలగించవలసినదిగాను, ఓడయర్, డయ్యరు మొదలైన సైనాధికారులను పదవి భ్రష్టుల చేయవలసిందిగాను బ్రిటిష్ ప్రభుత్వాన్నికోరుతూ తీర్మానం చేయబడింది.

జూన్ 1, 2 లలో ఖిలాఫత్‌కమిటీ అలహాబాదులో సమావేశమైంది. గాంధీ, మోతిలాల్‌నెహ్రూ. లజపత్‌రాయ్, సప్రూ, పాల్, మాళవ్యా, సత్యమూర్తి, రాజగోపాలాచారి, జవహర్‌లాల్ నెహ్రూ, చింతామణి మొదలైన హిందూ నాయకులుకూడా సమావేశంలో పాల్గొన్నారు. అఖిలభారత కాంగ్రెసుకమిటీ సహాయ నిరాకరహోద్యమాన్ని గురించి నిర్ణయం చేయకపోవడము, నిర్ణయాన్ని ప్రత్యేక కాంగ్రెసు సమావేశానికి వదలివేయడము ముస్లింలకు

ఆశాభంగం కలిగించింది. వారిలో కొందరు గాంధీ హిందువుల సహాయాన్ని సంపాదించడంలో తగిన శ్రద్ధను చూపలేదని ఆయనను ఆక్షేపించారు. కాని ప్రత్యేక కాంగ్రెసు సమావేశంలో సహాయ నిరాకరణమునకు సుముఖంగా తీర్మానం చేయబడుతుందనే విశ్వాసం తనకు ఉన్నట్లు చెప్పి ఆయన వారిని సమాధాన పరచాడు. అతివాదవర్గానికి చెందిన హసరత్‌మోహాని, షౌకతాలి, అజాద్, జఫరాలీఖాన్ మొదలైనవారు మరికొందరు విదేశ సైన్యాలు బ్రిటిష్ అధికారాన్ని తొలగించుటకు దేశంపై దండెత్తి వచ్చిన పక్షంలో ముస్లింలు వాటితోకలిసి బ్రిటిష్ వారిపై యుద్ధంచేయుటకు సిద్ధంగా ఉన్నట్లు ప్రసంగించారు. ఆరోజులలో ఆఫగన్‌స్థాన్ భారత దేశంతో యుద్ధం సాగిస్తూ ఉండినది. అలాటి సమయంలో ఈ విధంగా ప్రసంగించడం ప్రమాదకరమని, అతివాద ముస్లింల యుద్ధధోరణి ఏమాత్రం తగ్గలేదని సమావేశానికి హాజరైన లజపత్‌రాయ్ వీరిపై ఖరిని పూర్తిగా విరసించాడు. వచ్చల సమయంలో మోతిలాల్‌నెహ్రూ, సప్రూ, మాళవ్యాలు సహాయ నిరాకరణమును ఖండించారు. అనిబీసెంట్ కూడా వీరితో ఏకీభవించింది. ఈలాటి వారి ఖండనతో నిమిత్తం లేకుండా సభలో హాజరైన అధిక సంఖ్యాకులు (వారిలో దాదాపు అందరూ ముస్లింలు) సహాయ నిరాకరణమును ఆమోదిస్తూ తీర్మానంచేసి, పూర్తి కార్యక్రమమును రూపొందించి అమలు పరచుటకు గాంధీ అర్గురు ముస్లింలతోకూడిన ఒక సబ్‌కమిటీని నియమించింది. ఇది సర్వాధికారంగల కమిటీగా ఏర్పడి ఆగస్టు 1 న సహాయ నిరాకరణము ప్రారంభము కావలసిందిగా నిర్ణయించింది. ఈ విధంగా ఉద్యమం క్రియారూపం ధరించింది.

ఈ నిర్ణయానుసారం అన్ని రాష్ట్రాలకు చెందిన 90 ముస్లిం నాయకులుకలిసి ఒక ఉత్తరాన్ని, గాంధీ ప్రత్యేకంగా ఇంకొక ఉత్తరాన్ని రాజప్రతినిధికివ్రాసి సహాయ నిరాకరణ ఉద్యమం ఆగస్టు 1 న ప్రారంభం కానున్నదని తెలయపరచారు.

సబ్‌కమిటీ ఒక కార్యక్రమాన్ని తయారుచేసి ఆగస్టు 1 న దేశమందంతట హర్తాలు జరగవలసిందిగాను, బిరుదములను గౌరవపదవులను త్యజించవలసిందిగాను, విద్యార్థులు విద్యాలయాలను న్యాయవాదులు న్యాయస్థానాలను బహిష్కరించ వలసిందిగాను, శాసన సభల బహిష్కారమునుగురించి ప్రచారం జరగవలసిందిగాను, స్వదేశీవ్రతాన్ని చేపట్ట వలసిందిగాను ఆదేశించింది. దీనిమేరకు గాంధి ఆగస్టున అంతకుపూర్వం ప్రభుత్వం ఆయనకు బహూకరించిన పతకాలను అధికారులకు పంపివేశాడు. ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరగక పూర్వమే ఉద్యమం ప్రారంభంకావడం గమనించవలసిన విషయం.

(6) 1919 నవంబరులో గాంధీ పంజాబు దురంతాలను ఖిలాఫత్ ఉద్యమంతో జోడించరాదని భావించాడు. కాని క్రమక్రమంగా ఈ అభిప్రాయాన్ని మార్చుకోవడం అవసరమని గ్రహించాడు. హంటరు కమిటీ నివేదిక ప్రచురింపబడిన వెంటనే అందులోని అధిక సంఖ్యాకుల నివేదికను పూర్తిగా ఖండించాడు. కాంగ్రెసుకమిటీ నివేదికలోని సూచనలను ప్రభుత్వం అమలు పరచవలసిందిగాను. ఈలాగు జరగని పక్షంలో ప్రభుత్వాన్ని లొంగదీయుటకు సత్యాగ్రహ సాధనాన్ని వినియోగించ వలసిందిగాను జూన్ 30న ఒక ప్రకటన చేశాడు. అది మొదలు ఖిలాఫత్ సమస్య పరిష్కారానికే గాక పంజాబు దురంతాలకు ప్రతి క్రియను సంపాదించుటకు కూడా సత్యాగ్రహం ఉద్దేశింపబడినట్లు

ప్రచారాన్ని సాగించారు. ఈ విధంగా అభిప్రాయాన్ని మార్చుకొనుటలో రెండు కారణాలు ఆయనపై ప్రభావం వహించినట్లు చెప్పవచ్చు. అలహాబాదు సమావేశంలోను, ఇతర సమావేశాలలోను హిందూ నాయకులనేకులు సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రతిఘటించడం ఆయన గుర్తించి అధిక సంఖ్యాకులైన హిందువుల పూర్తి సహాయం లేక సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించడం కష్ట సాధ్యమని ఆయన గ్రహించాడు. ఉద్యమ ఉద్దేశం ఖిలాపత్ సమస్యకు పరిష్కారాన్ని సంపాదించడానికి మాత్రమే పరిమితమైన పక్షంలో హిందువుల సహాయం లభించే అవకాశం లేదని, పంజాబు దురంతాలకు కూడా ప్రతి క్రియను సంపాదించుట దాని ఉద్దేశమైన యెడల హిందువుల సహాయం లభించగలదని ఆయన భావించాడు. ఆయన అభిప్రాయాన్ని మార్చుకొనుటకు ఇది ఒక కారణం.

ఇది గాక ముస్లింలలో అతివాద ధోరణీ దౌర్జన్యం పట్ల సుముఖత్వమూ ఉండడం ఆయన దృష్టిని పదేపదే ఆకర్షించాయి. హిందువులు అధిక సంఖ్యలో ఉద్యమంలో చేరిన పక్షాన వీటిని చాలావరకు అదుపులో ఉంచడం సాధ్యం కాగలదని ఆయన భావించి దానికి సాధనంగా పంజాబు దురంతాలకు ప్రతి క్రియను సంపాదించడాన్ని కూడా కలిపాడు. సహాయ నిరాకరణ ఉద్దేశాలలో ఇంకొక విషయం కూడా ఈ సందర్భంలో గుర్తించడం అవసరం. రౌలెట్టు సత్యాగ్రహం విఫలమగుటకు అఖిలభారత సంస్థ ఏదీ తన వశంలో లేకపోవడం ఒక కారణంగా భావించి అలాటి సంస్థలను కొన్నిటిపై ఆధిపత్యం సంపాదించడానికి ఆయన పూనుకొన్నాడు. ఖిలాపత్ ఉద్యమంలో గొప్ప పాత్రను వహించడం చేత ఈలాటి సంస్థలలో ఒకటైన అఖిలభారత ఖిలాపత్ కమిటీ ఆయన వశంలోకి వచ్చింది. దానికి ఆయనే నాయకుడయ్యాడు. అలీ సోదరులు, అజాద్, మౌల్వీలు, ఉలేమాలు ఆయన ఆదేశానుసారం ప్రవర్తించుటకు సిద్ధ పడ్డారు. దీని ఫలితంగా ముస్లింలలో ఒక ప్రముఖ వర్గానికి, సామాన్య ముస్లిం ప్రజలకు ఆయన ఒకవిధంగా ఆరాధ్యుడయ్యాడు. 1920లో ఆయన అఖిలభారత నాయకత్వాన్ని సంపాదించడంలో ఇది గొప్ప సాధనమయింది. ఇది గుర్తించి హిందూ నాయకులనేకులు ఆయనకు అనుచరులైనారు.

కాని ఇందులో ఒక ప్రమాదం ఉండడం కూడా ఆయన గ్రహించాడు. తన నాయకత్వానికి ముస్లింలపై మాత్రమే ఎక్కువగా ఆధార పడడమే ఆ ప్రమాదం. దానికి విరుగుడుగా హిందువులతో కూడిన సంస్థలను కూడా తన అధీనంలోకి తెచ్చుకొన నిర్ణయించి ఏప్రిలు 1920లో బిసెంటు నాయకత్వంలో ఉండిన హోంరూల్ లీగుకు అధ్యక్షుడుగా ఉండుటకు అంగీకరించాడు. దీని మూలంగా ఈ లీగు ఆయన వశంలోకి వచ్చింది. దీనికి స్వరాజ్య సభ అనే పేరు పెట్టి దీని ద్వారా ఆయనకు అభిమాన పాత్రమైన నిర్మాణ కార్యక్రమమును సాగించ నిశ్చయించాడు. అందులో ఖద్దరు, కుటీర పరిశ్రమలు, భాషాప్రయుక్త రాష్ట్రాలు, అస్పృశ్యతా నివారణము, హిందూ ముస్లిం సఖ్యత, హిందూస్థానీ దేశభాషగా గుర్తించవలసిన ఆవశ్యకత మొదలైన అంశాలను చేర్చాడు. ఈ విధంగా లీగును తన వశంలోకి తెచ్చుకొనడమే గాక, దానికి నూతన ప్రాధాన్యం కల్పించాడు. అఖిలభారత నాయకత్వానికి ఒక ఖిలాపత్ కమిటీపై మాత్రమే ఆధారపడక ఇంకొక సంస్థను కూడా తన అధీనంలోకి తెచ్చుకొన్నాడు.

ఆయన తలపెట్టిన సహాయ నిరాకరణ ఉద్యమాన్ని సెప్టంబరులో కలకత్తాలో జరిగిన

ప్రత్యేక కాంగ్రెసు సమావేశంలో, డిసంబరులో జరిగిన నాగపూరు కాంగ్రెసు సమావేశంలో ఆమోదించిన కారణంగా కాంగ్రెసు కూడా ఆయన వశంలోకి వచ్చింది.

ఈ విధంగా 1920 ఆయన జీవితంలోను. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోను గొప్ప ప్రాధాన్యం వహిస్తున్నది. ఆయన అఖిలభారత నాయకుడయ్యారు. హిందువులు, ముస్లింలు ఆయన నాయకత్వాన్ని అంగీకరించారు. మూడు అఖిలభారత సంస్థలు ఆయన అధీనంలోకి వచ్చాయి. వీటి ఫలితంగా 1921-22లో సహాయ నిరాకరణ సాధనంద్వారా ఆయన స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించ గలిగారు.

(7) ప్రభుత్వానికి ప్రజలు సహాయం చేయడం మానుకొనిన పక్షంలో అది ప్రజలకు లొంగిపోయి వారి ఆశయాలను తీర్చగలదనేది గాంధి కనిపెట్టిన విధానం కాదు. అరవిందుడు పాల్, తిలక్, లజపతిరాయి మొదలైన జాతీయవాదులు ఈ సిద్ధాంతాన్ని 1905లోనే ప్రతిపాదించారని, అందుకు సంబంధించిన కార్యక్రమంలో విదేశ వస్తువుల బహిష్కరణము ప్రభుత్వ వశంలోని విద్యాలయాల బహిష్కరణము, న్యాయస్థానాల బహిష్కరణము, ప్రభుత్వ ఉద్యోగాలకు రాజీనామా చేయడం, సైన్యంలోని సిపాయీలు తిరుగుబాటు చేయడం, పన్నులను ఎగవేయడము. స్వదేశీ, జాతీయ విద్య, పంచాయతీ కోర్టుల నిర్మాణము మొదలైన అంశాలను చేర్చారని ఇదివరకే తెలుసుకొన్నాము. గాంధీ రూపొందించిన సహాయ నిరాకరణోద్యమంలో కూడా ఇవే ప్రధానాంశాలు. ఇవిగాక ప్రభుత్వం ప్రసాదించిన బిరుదములను, గౌరవ పదవులను త్యజించడమును ఒక అంశంగా చేర్చారు.

కాని ప్రథమంలో ఆయన రూపొందించిన కార్యక్రమంలో శాసన సభల బహిష్కారాన్ని చేర్చక పోయినా, తర్వాత దీనికే ఎక్కువ ప్రాధాన్యం లభించి, దీనిని గురించే తీవ్రమైన వాదోప వాదాలు బయలుదేరినవి. మాంటేగు చెమ్స్‌ఫర్డు సంస్కరణల చట్టాన్ని అనుసరించి 1920లో ఎన్నికలు జరిగేటట్లు ప్రభుత్వం ప్రకటించింది. మిత వాదులు. జాతీయ వాదులు, ఇతర పార్టీల వారు, ముస్లిం లీగు వారు. ఖిలాఫత్ ఉద్యమాన్ని లేవదీసిన వారు, ఎన్నికలలో పాల్గొనుటకు సిద్ధ పడ్డారు. దానికి సంబంధించిన ప్రయత్నాలను చేయ సాగారు. గాంధి కూడా ఈఎన్నికలలో యోగ్యులైన వారిని ఎన్నుకొనవలసినదిగా కోరారు. ఎన్నికలను బహిష్కరించ వలసినదిగా ప్రథమతః సూచించిన వారు లజపతిరాయి. సంస్కరణల చట్టం క్రింద భారత ప్రభుత్వం రూపొందించిన నియమ నిబంధనలు (Rules and Regulations) 1920 జూన్ రెండవ వారంలో ప్రకటింపబడినాయి. ఇవి పంజాబులోని నగరవాసులైన విద్యాధికులకు ప్రతికూలంగా ఉండినందున ఎన్నికలలో వారు విజయాన్ని సాధించడం కష్టసాధ్యంగా కనుపించింది. ఈ పరిస్థితులను గమనించి ఎన్నికలను బహిష్కరించడం ఉత్తమ విధానమని తన వ్యక్తిగత అభిప్రాయాన్ని ఒక పత్రికలో ప్రచురించారు. పంజాబు కాంగ్రెసు కమిటీతో గాని, ప్రముఖ నాయకులతో గాని సంప్రతించకుండా ఈ సూచనను చేశారు. వారు దానిని నిరసించగా తర్వాత తన అభిప్రాయాన్ని మార్చుకొన్నారు.

ఈ సూచన గాంధీని ఆకర్షించింది. లజపతిరాయ్ ఉత్తరం ప్రచురింపబడిన తర్వాత అయిదు రోజులకు—జూన్ 30న—ఆయన సూచనను సమర్థిస్తూ తన పత్రికలలో వ్రాసి, సహాయ నిరాకరణ కార్యక్రమాన్ని రూపొందించుటకు నియమింపబడిన సబ్ కమిటీ ఆమోదాన్ని

జూలై 4న సంపాదించి, సహాయ నిరాకరణ కార్యక్రమంలో దానికి ప్రధాన స్థానం కల్పించాడు. ఇది మొదలు ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరిగి, సహాయ నిరాకరణాన్ని అది ఆమోదించే వరకూ దీనిని గురించి తీవ్రంగా వాదోప వాదాలు జరిగాయి. సహాయ నిరాకరణ ఉద్యమం ఎన్నికల బహిష్కారంతో ప్రారంభమైంది.

మిత వాదులు, జాతీయ వాదులు మాంటేగు చెమ్సుఫర్డు సంస్కరణల మూలంగా శాసన సభలలో సభ్యత్వం సంపాదించుటకు ఎక్కువ మందికి అవకాశం కలగడమే కాక, భారతీయులు మంత్రి పదవులలో ప్రవేశించి అధికారాన్ని చెలాయించగల అవకాశాన్ని కల్పించడం కారణంగా ఎన్నికలలో పాల్గొని ఈ అవకాశాలను వినియోగించుకొని ఈ పదవులను అనుభవింప ఉవ్విళ్లూరుచుండినారు. 1885లో కాంగ్రెసు స్థాపింపబడినప్పటి నుండి ఇంగ్లీషు విద్యాధికులు ఇందుకుగానే గొప్ప కృషి చేశారు. వారి కృషి ఫలించనున్న సమయంలో గాంధీ ఆమోదించిన ఎన్నికల బహిష్కరణ వారికి విపరీతమైన ఆశాభంగాన్ని కలిగించింది. సహాయ నిరాకరణ కార్యక్రమంలోని తక్కిన అంశాల కంటె దీనినే రాజకీయ నాయకులు కలకత్తా కాంగ్రెసు సమావేశంలో ప్రతిఘటించుటకు ఈ ఆశాభంగమే కారణం.

సహాయ నిరాకరణ సబ్ కమిటీ నిర్ణయానుసారం ఆగస్టు 1న ఉద్యమం ప్రారంభమైంది. దేశంలోని రాష్ట్రాలన్నిటిలో హర్తాలు శాంతియుతంగా జరిగింది. ఇందులో నగరవాసులే ఎక్కువగా పాల్గొన్నారు. ఇదివరకూ రాజకీయంగా వెనుకబడిన ప్రాంతాలుగా భావించబడిన గుజరాతు, సింధు, పంజాబు, ఉత్తర ప్రదేశ్, బీహారు ప్రాంతాలలో హర్తాలు పట్ల సామాన్య ప్రజలు ఎక్కువ ఉత్సాహాన్ని ప్రదర్శించారు. వీటిలోనే గాంధీ ప్రభావం ఎక్కువగా వ్యాపించింది.

కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెసు సమావేశం కాకపూర్వమే ఉద్యమాన్ని ప్రారంభించి సాగించడంలో గాంధీకి ఒక ప్రధాన ఉద్దేశం ఉండినది. ఉద్యమం కొంతవరకు కొనసాగిన పక్షంలో కలకత్తా సమావేశం దానికి సుముఖంగా తీర్మానం చేయగలదని ఆయన భావించాడు.

ఈ మధ్యకాలంలో రాష్ట్రాలలోని కాంగ్రెసు కమిటీలు సమావేశమై సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గురించి చర్చలు సాగించాయి. గాంధీ అఖిలభారత నాయకత్వాన్ని సంపాదించడం, ఇందులో ఆయనతో పోటీ చేయగల తిలక్ ఆగస్టు 1న మరణించడంతో ఆయనకు ప్రత్యర్థి ఎవరూ లేకపోవడం కాంగ్రెసు నాయకులు గుర్తించి, ఆయనను ప్రతిఘటించడం సులభసాధ్యం కాదనే నిర్ణయానికి వచ్చారు. కాని వారిలో అనేకులకు ఆయన సూచించిన శాసన సభల బహిష్కరణ అంగీకార యోగ్యం కాలేదు. అందుచేత వారు ఈ విషయంలో ఒక ద్వంద్వ విధానాన్ని అనుసరించినారు. ఆయనను సంతోష పెట్టుటకు సిద్ధాంత దృష్ట్యా సహాయ నిరాకరణ సాధనం ఒక్కటే భారతీయులు అనుసరించదగినదని వారు తీర్మానించారు. రాష్ట్ర కమిటీలన్నీ ఈలాటి తీర్మానాన్ని ఆమోదించినాయి. కాని ఆయన సూచించిన కార్యక్రమాన్ని వారు పూర్తిగా సమర్థించలేక పోయినారు. గుజరాతు, సింధు రాష్ట్రము, బీహారు కమిటీలు మాత్రమే ఆయన కార్యక్రమం పట్ల పూర్తి ఆమోదాన్ని తెలియ పరచారు. బొంబాయి, మధ్య ప్రదేశ్ కమిటీలు దీనిని గురించిన నిర్ణయాన్ని ప్రత్యేక కాంగ్రెసు సమావేశానికి వదలినాయి. బెంగాలు కమిటీ శాసన సభల బహిష్కరణను ప్రతిఘటించింది. బహిష్కరణకు బదులు

కాంగ్రెసు వారు ఎన్నికలలో విజయాన్ని సంపాదించి. శాసన సభలలో ప్రవేశించి, సభల ద్వారా సహాయ నిరాకరణమునకు పూనుకొనవలసినదిగా తీర్మానించింది. ఇందులో చిత్తరంజన దాసు నాయకత్వాన్ని వహించాడు. మద్రాసు రాష్ట్ర కమిటీ సహాయ నిరాకరణ సిద్ధాంతాన్ని ఆమోదించినా గాంధి సూచించిన కార్యక్రమాన్ని పూర్తిగా ఖండించింది. ఆంధ్ర పంజాబు రాష్ట్రాల కమిటీలు ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరిగేటంతవరకూ కార్యక్రమాన్ని గురించి ఏలాటి నిర్ణయం చేయరాదని తీర్మానించాయి. ఈ విధంగా రాష్ట్ర కమిటీలు కార్యక్రమాన్ని గురించి విభిన్న అభిప్రాయాలను వ్యక్తం చేశాయి. అందుచేత కాంగ్రెసు ప్రత్యేక సమావేశానికి మరింత ప్రాధాన్యం లభించింది.

ఆగష్టు 1 తర్వాత గాంధీ కొన్ని రాష్ట్రాలలో పర్యటించి, సమావేశాలు జరిపి. సహాయనిరాకరణ కార్యక్రమాన్ని సమర్థించేవారినే కలకత్తా కాంగ్రెసు ప్రతినిధులుగా పంప వలసిందిగా ప్రచారాన్ని సాగించాడు. ఖిలాఫత్ ఉద్యమంలో అభిమానంగల ముస్లింలందరు తప్పక కలకత్తా కాంగ్రెసుకు రావలసిందిగా ఆయన అర్థించాడు. ఆయన కోరికను అనుసరించి అలాటి ముస్లింలు అధికసంఖ్యలో కాంగ్రెసుకు ప్రతినిధులుగా రావడంమూలాననే కాంగ్రెసు సమావేశంలో సహాయనిరాకరణ ఉద్యమానికి సంబంధించిన తీర్మానం నెగ్గింది. ఇది ప్రత్యేకంగా గుర్తించదగిన విషయం.

ఈ పరిణామాలన్నిటిని. ప్రభుత్వం గమనించి గాంధీని అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచడం వాంఛనీయమా అనే విషయాన్ని గురించి ఆలోచించి అది అప్పట్లో వాంఛనీయం కాదనే నిర్ణయానికి వచ్చింది. సహాయనిరాకరణ ఉద్యమం సాగినా అది దౌర్జన్యరూపం ధరించకుండా దానిని అదుపులో పెట్టగలవాడు ఆయన ఒక్కడే అనే విశ్వాసం ప్రభుత్వానికి కలగడమే ఈ నిర్ణయానికి కారణం.

## 3

ఈలాటి అనిశ్చితమైన వాతావరణంలో ప్రత్యేక కాంగ్రెసు సమావేశం సహాయనిరాకరణ కార్యక్రమాన్ని గూర్చి నిర్ణయించుటకు లజపతిరాయ్ అధ్యక్షతన సెప్టంబరు 4 నుండి 9 వరకు జరిగింది. ఈ కార్యక్రమంలో శాసనసభల బహిష్కరణము చాలాకాలాననుండి కాంగ్రెసులో ప్రధానపాత్రను వహించినవారికి ఎంతమాత్రము గిట్టలేదు. వారందరు దానిని ప్రతిఘటించే ఉద్దేశంతో సమావేశానికి హాజరైనారు. 4 న సమావేశం ప్రారంభమైనది. అధ్యక్షుడైన లజపతిరాయ్ సహాయనిరాకరణ కార్యక్రమాన్ని గురించి ఏలాటి అభిప్రాయాలను వ్యక్తంచేయలేదు. ఆయన ఉపన్యాసం ముగిసిన తర్వాత 5 న విషయనిర్ధారణసభకు ఎన్నికలు జరిగాయి. వీటిలో గాంధీకి అనుకూలురైనవారు ఎక్కువ సంఖ్యలో ఎన్నుకొనబడినారు. అందుచేత ఆయన సూచించిన కార్యక్రమానికి అనుకూలంగా విషయనిర్ధారణసభ తీర్మానం చేయగలదనే ఆశ ఆయన అనుచరులకు కలిగింది. సాధారణంగా ఈ సభ ఆమోదించిన తీర్మానాలను బహిరంగసమావేశంలో ఆమోదించడం సంప్రదాయం. ఈ కారణంచేత దీని నిర్ణయాలకు అత్యంత ప్రాధాన్యం లభించడం పరిపాటి.

ఎన్నికలు జరిగినవెంటనే గాంధీ సహాయనిరాకరణమునకు సంబంధించిన తీర్మానాన్ని ప్రవేశపెట్టినాడు. మోతిలాల్ నెహ్రూ సూచనమేరకు దాని ఉద్దేశాలలో స్వరాజ్య సంపాదనమును,

పరికొందరి సూచనలమేరకు దాని కార్యక్రమంలో విదేశవస్తుబహిష్కరణమును చేర్చారు. ఈ చేర్పులు జరిగిన తర్వాత దాని పూర్తిపాఠము ఈ క్రిందిరూపములో ఉండినది.

"ఖిలాఫత్ సమస్య సందర్భమున భారత ముస్లింల యెడల భారతప్రభుత్వము వారునూ, సామ్రాజ్యప్రభుత్వమువారునూ వారి వారి ధర్మములను సరిగా నిర్వర్తింపకపోవుట వలనను, బ్రిటిష్ ప్రధానమంత్రి ముస్లింలకు చేసిన వాగ్దానములను బుద్ధిపూర్వకముగ భంగపరచి నందువలనను, భారతదేశములోని ప్రతి మహమ్మదీయేతరునకును తన సోదరుల మతమునకు గలిగిన నష్టమును తొలగింప న్యాయముగా ప్రయత్నించుట ధర్మముకాబట్టిన్నీ, 1919 లో జరిగిన దురంతముల సందర్భమున ఆ రెండు ప్రభుత్వములవారునూ పంజాబులోని నిరపరాధులగు ప్రజలను సంరక్షించడంలో నిర్లక్ష్యం చేసినందువలనను. భయంకర ప్రవర్తనలకు కారణ భూతులైన సైనికోద్యోగులను వారు శిక్షింపకుండడమేగాక, ప్రజల దుఃఖములకును, అధికారుల అపరాధములకును బాధ్యతవహించవలసిన సర్ మైకిల్ ఒడయరును సమర్థించినందువలనను పార్లమెంటులో జరిగిన చర్చలబట్టి బ్రిటిష్‌వారికి భారతదేశప్రజలయందు సానుభూతిలేదని స్పష్టముగా తెలియవస్తున్నందువలనను, పంజాబురాష్ట్రంలో ప్రభుత్వము వారవలంబించిన నిరంతర భయంకర పద్ధతులమూలముననను, ఇటీవల వైస్రాయి చేసిన ప్రకటనమువలనను, ఖిలాఫత్ పంజాబు సమస్యలలో ప్రభుత్వము వారెంతమాత్రమూ పశ్చాత్తాపము చూపించనట్లు కనబడుతూన్నది కాబట్టిన్నీ.

ఈ పైన చెప్పబడిన సందర్భములలోను సరియయిన పరిహారము కలిగితేనేగాని భారతప్రజలకు సంతృప్తి ఉండదని ఈ కాంగ్రెసువారు అభిప్రాయపడుతున్నారు. భావికాలములో ఇటువంటి అన్యాయములు తిరిగి జరగకుండ జాతీయ గౌరవమును దృఢముగ నిలబెట్టుకోవలె నన్నయెడల స్వరాజ్యసంస్థాపన మత్యవసరము. ఆ అన్యాయములను నివారించేటందుకున్నూ, స్వరాజ్యమును సంస్థాపించేటందుకున్నూ గాంధీగారిచే ప్రారంభించబడిన దౌర్జన్యరహిత సహాయ నిరాకరణ సిద్ధాంతమును అంగీకరించి క్రమక్రమముగా ఆచరణలో పెట్టుటకంటె భారతప్రజలకు గత్యంతరము లేదు.

అందుకొరకు ఇంతకుపూర్వమునుండీ ప్రజాభిప్రాయమునకు ప్రాతినిధ్యము వహిస్తూన్న ఉన్నత తరగతులవారే పనిని ప్రారంభింపవలసి యున్నది.

ప్రభుత్వమువారు గౌరవ బిరుదములమూలముననను, పాఠశాలలు శాసనసభలు న్యాయ స్థానముల మూలముననను, తమ అధికారమును బలపరచుకొని ఉండిరి. ఇప్పుడు ప్రజలు సాధ్యమైనంత తక్కువ త్యాగముతోనూ, తక్కువ ప్రమాదముతోనూ, ఈ ఉద్యమును నడిపి తమ కోరికలను సిద్ధింప చేసుకొనవలసి యున్నది. కాబట్టి ఈ కాంగ్రెసు—

(ఎ) గౌరవోద్యోగములను, బిరుదులను త్యజించుట; స్థానికసంస్థలలో ప్రభుత్వ నామనిర్దేశ (Nominated) సభ్యత్వములకు రాజీనామా ఇచ్చుట;

(బి) ప్రభుత్వాధికారులవల్లగాని, వారి గౌరవముకొరకుగాని ఏర్పాటుచేయబడే దర్బారులకును, సన్మానములకు హాజరుకావడమును నిరాకరించుట;

(సి) ప్రభుత్వమువారి స్వాధీనములో ఉన్నట్టిగాని, లేక వారి సహాయమును

పొందుతూ ఉన్నట్టిగాని పాఠశాలలనుంచీ. కళాశాలలనుంచీ. పిల్లలను క్రమక్రమముగా మాన్పించుట; వాటిస్థానములో జాతీయ పాఠశాలలను అన్ని రాష్ట్రములలోను విర్మించుట;

(డి) లాయర్లున్నూ. వాది ప్రతివాదులున్నూ. బ్రిటిష్ న్యాయస్థానములను క్రమక్రమముగా బహిష్కరించుట; వాటిస్థానే ప్రజల తగాదాలను పరిష్కరించే నిమిత్తము గ్రామ పంచాయతీలను స్థాపించుట;

(ఇ) మెసపటోమియాలో పనిచేయుటకు సైనికులుగా గాని. గుమాస్తాలుగాగాని ఎవరూ పోకుండుట;

(ఎఫ్) నూతన శాసనసభల యెన్నికల కెవరును అభ్యర్థులుగ నిలబడకుండుట; నిలబడినవారు ఉపసంహరించుకొనుట; కాంగ్రెసు తీర్మానమునకు వ్యతిరేకముగ ఎవరైనను అభ్యర్థిగా నిలిచినప్పటికీ వోటర్లు ఆయనకు వోట్లు వియ్య నిరాకరించుట.

(జి) విదేశ వస్తువులను బహిష్కరించుట-ఈ కార్యక్రమమును అమలులో పెట్ట వలసినదని ప్రజలకు సలహా ఇస్తున్నది.

ఈ సహాయ నిరాకరణోద్యమము స్వార్థత్యాగ, స్వయంనిగ్రహములతో కూడుకొని ఉన్నది. ఈ రెండునూ లేనియెడల ఏ జాతీ అభివృద్ధి పొందజాలదు. భారతదేశములోని ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునకు. ప్రతి బాలునకు. స్వార్థత్యాగ స్వయంనిగ్రహములకొరకు సహాయ నిరాకరణోద్యమ ప్రథమదశలో శిక్షణీయవలసి ఉన్నది. కాబట్టి ఈ కాంగ్రెసు ప్రజలందరును విరివిగా స్వదేశ వస్తువులనే ఉపయోగించవలెనని సలహా ఇస్తున్నది. భారతదేశములో భారతీయుల అధికారము క్రిందనూ. భారతీయుల పెట్టుబడివలననూ నేడు నడుపడుతూ ఉన్న బట్టల యంత్రాలయములు భారతజాతికి కావలసినంత బట్ట సప్లయి చేయకపోవుటచేతను, కొద్ది కాలములోనైనను అవి సప్లయి చేయగలిగే స్థితిలోకి రాగలవనే విశ్వాసము లేకపోవుటచేతను, ఎన్నడో నశించిన నూలువడుకు పరిశ్రమను ప్రతిగృహములో పునరుద్ధరించవలసినదనీ. లక్షల కొలది నేతగాండ్రకు జీవనాధారమైన నేతపరిశ్రమనుకూడ తక్షణము తిరిగి ప్రారంభించవలెనని ఈ కాంగ్రెసు తీర్మానిస్తున్నది.''

ఈ దీర్ఘమయిన తీర్మానము సహాయనిరాకరణ ఉద్యమము ఎందుకు ప్రారంభించ వలసివచ్చినదీ. ఏ ఉద్దేశములను అది సాధించదలచినదీ, అందుకుగాను ఏ కార్యక్రమమును కొనసాగించవలసినదీ స్పష్టపరచినది. ఈ కార్యక్రమమునకంతకూ శాంతి, స్వార్థత్యాగము, స్వయంనిగ్రహము ఆధారములని ఉద్ఘాటించినది. ఆదర్శములు లౌకికములైనను వాటిని నైతిక సాధనములద్వారా మాత్రమే సాధించవలసినట్లు ప్రజలను ఆదేశించింది. ఇందులోనే గాంధీకిని జాతీయవాదులై ఇదివరలో స్వాతంత్ర్యోద్యమమును సాగించిన తిలక్, అరవిందుడు. పాల్. లజపతిరాయ్ మొదలైనవారికినీ. విప్లవ ఉద్యమమును సాగించిన వారికినీ గొప్పభేదము. వారి దేశాభిమానము. దేశస్వాతంత్ర్య. సంపాదనమువట్ల వారికిగల దీక్ష గాంధీ దేశాభిమానము దేశస్వాతంత్ర్య సంపాదనపట్ల దీక్షలకంటే తక్కువకావు. కాని వారు హింసాపద్ధతులకు వ్యతిరేకులు కారు. గాంధీ అలాగుకాక స్వాతంత్ర్య సంపాదన విషయములోకూడ అహింసయే అనుసరించదగిన మార్గమని పదే పదే నొక్కి చెప్పినాడు; దానికి ఈ తీర్మానంలో ప్రాధాన్యాన్ని కల్పించాడు.

పై తీర్మానమునుగురించి విషయనిర్ధారణసభలో మూడురోజులపాటు తీవ్రమైన చర్చలు జరిగినవి. చిత్తరంజన్‌దాస్, మాళవ్య, జిన్నా మొదలైన సుప్రసిద్ధ నాయకులు శాసన సభల బహిష్కరణము, విద్యాలయముల బహిష్కరణము, న్యాయస్థానాల బహిష్కరణములను గర్హించారు. ఉన్నత ఆశయాలవి నలిగినట్టిన్నీ. పురోగమన కార్యక్రమాలపట్ల ఆసక్తి గలిగి నట్టిన్నీ, కులభేదాలను, మతభేదాలను విస్మరించి ప్రజలందరు ఒకేజాతికి సంబంధించినవారనే భావంతో వ్యవహరించేటట్టిన్నీ కాంగ్రెసువారు శాసనసభలను బహిష్కరించిన పక్షంలో వాటిలోని సభ్యత్వాలు మంత్రిపదవులు సంకుచిత మనస్తత్వంతోను కులాభిమానంతోను ప్రవర్తించే కాంగ్రెసేతరులు వశపరచుకొని తిరోగమన కార్యక్రమాలను చేపట్టే ప్రమాదం ఉన్నదని, ప్రజాస్వామిక విధానంలో అనుభవాన్ని సంపాదించే అవకాశాన్ని కోల్పోవడం జరుగుతుందని, కాంగ్రెసువారు అధిక సంఖ్యలో శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వవిధానాలను ప్రతిఘటించిన పక్షంలో ఎక్కువ లాభం కలుగగలదనీ, ఇదికూడా సహాయ నిరాకరణమేనని వారు వాదించారు. ఈలాటి వాదం ద్వారానే వారు విద్యాలయాల బహిష్కరణను న్యాయస్థానాల బహిష్కరణను ప్రతి ఘటించారు. వారిలో మోతిలాల్ నెహ్రూ మొదలైన కొందరిని తృప్తిపరచే ఉద్దేశంలో ఈ బహి ష్కరణలు క్రమక్రమముగ జరుగదగినవి అనేమాటలను గాంధీ తన తీర్మానంలో ప్రవేశపెట్టాడు.

అప్పటికి కూడా తీర్మానానికి ప్రతిఘటన తగ్గలేదు. ప్రతిఘటించినవారి పక్షాన పాల్, "భారతదేశముయొక్క కష్టములను బ్రిటిష్ ప్రధానమంత్రికి నివేదించుటకున్నూ తక్ష ణము స్వపరిపాలనము కావలెనని ఆయనకు నచ్చచెప్పుటకున్నూ ఒక రాయబారము పంపబడ వలెనని, ఆ రాయబారవర్గమువారి సూచనల నంగీకరించి 1919 నాటి రాజ్యాంగ చట్టమునకు బదులుగా దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రసాదించే మరియొక ప్రణాళికను సిద్ధ పరచుటకు ఆయన అంగీకరించని పక్షంలో తీవ్రమైన సహాయనిరాకరణోద్యమము ప్రారం భింపబడవలెనని ఈ మధ్యకాలములో కాంగ్రెసువారు ఒక కమిటీని నియమించి గాంధీ మహా త్ముని కార్యక్రమమును పరిశీలిస్తూ భవిష్య దుద్యమునకు కావలసిన ప్రచారమును చేయవలెను'' అనే సవరణను ప్రవేశపెట్టాడు. చిత్తరంజన్‌దాసు దానిని బలపరచాడు. సవరణ నెగ్గినయెడల కొంత వ్యవధి లభించగలదని, నవంబరులో జరుగనున్న ఎన్నికలలో కాంగ్రెసువారు పాల్గొని శాసనసభలలో ప్రవేశించే అవకాశం కలగగలదని వారు భావించారు. దీనిమీద చాలా తర్జన భర్జనలు జరిగినపిమ్మట 7 న గాంధీ తీర్మానంపై వోటుచేయడం జరిగింది. విషయ నిర్ధారణ సభలో 144 మంది దానికి అనుకూలంగాను, 132 దానికి ప్రతికూలంగాను వోటుచేయడంతో అది నెగ్గింది. గాంధీకి ఘనవిజయం లభించింది.

ఈ వోటు విషయంలో రెండు మూడు అంశాలను గుర్తించవలసిఉంది. అందులో ఒకటి ముస్లింలవోట్ల ప్రభావం. గాంధీ పర్యటన ఫలితంగాను ఖిలాఫత్ ఉద్యమ ఫలితంగాను ముస్లింలు అధిక సంఖ్యలో కలకత్తా సమావేశానికి హాజరైనారు. వారిలో అనేకులు విషయ నిర్ధారణసభకు ఎన్నికై ఒక కీలకస్థానాన్ని ఆక్రమించారు. గాంధీ విజయానికి ఇది ఒక ప్రధానకారణం. గాంధీ తీర్మానాన్ని ప్రతిఘటించదలచినవారిలో మోతీలాల్ నెహ్రూ ఒకడు. కలకత్తాకు రాగనే జిన్నా, మాళవ్యా మొదలైనవారితో సంప్రతించి ప్రతిఘటనలో వారి సహాయాన్ని సంపాదించాడు. కాని 7 నాటికి ఆయన తన అభిప్రాయాన్ని పూర్తిగా మార్చుకొని గాంధీకి అనుకూలుడయ్యాడు. ఆయన ఉత్తరప్రదేశ్‌లోని రాజకీనాయకులలో సుప్ర

సిద్ధుడు. ఆయనకు ఆ రాష్ట్రంలోనేగాక తక్కిన రాష్ట్రాలలోకూడా కొంత పలుకుబడి ఉంది నది. అంతటివారు తన తొలిఅభిప్రాయాన్ని మార్చుకొనడం అనేకులపై ప్రభావం వహించి వారు కూడా గాంధీ తీర్మానానికి అనుకూలురయ్యారు. ఉత్తర ప్రదేశ్‌లోని ముస్లింలతో ఆయనకు సన్నిహిత సంబంధం ఉండడంచేతను, వారు గాంధీకి అనుకూలురు కావడంచేతను, వారి ఒత్తిడికిలోబడి ఆయన గాంధీపక్షం వహించాడని అనేకులు భావించారు. ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో కాంగ్రెసుకు విజయం లభించడం సందేహాస్పదం కావడంచేత ఎన్నికలను బహిష్కరించినా గొప్పనష్టం ఏలాటిదీ ఉండదని భావించడంచేత ఆయన గాంధీపక్షం వహించాడని మరి కొందరి వ్యాఖ్యానం. కారణాలేవైనా ఆయన గాంధీకి అనుకూలంగా వోటుచేయడంచేత మరి కొందరుకూడా అలాగేచేసి గాంధి విజయానికి తోడ్పడినారు.

వీరుగాక కలకత్తాలోని మార్వాడీ వర్తకులు, బొంబాయిలోని వర్తకులు కలకత్తా సమావేశానికివచ్చి గాంధీకి సహాయంచేశారు. అదికూడా ఆయన విజయానికి తోడ్పడింది.

విషయ నిర్ధారణసభలో నెగ్గిన తీర్మానం 8, 9 తేదీలలో బహిరంగ సమావేశంలో చర్చకు వచ్చింది. అందులోకూడా పాల్ తన సవరణ తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. 9 న గాంధీ తీర్మానమూ, పాల్ సవరణలపై ప్రతినిధులు వోటుచేశారు. వారిలో 1855 మంది గాంధీ తీర్మానానికి అనుకూలంగాను, 873 మంది పాల్ సవరణకు అనుకూలంగాను వోటు చేయడంతో గాంధీకి విజయం లభించింది. కాని సమావేశానికి హాజరైన మొత్తం ప్రతినిధులలో సుమారు అర్ధసంఖ్య ఏ తీర్మానానికి అనుకూలంగా వోటుచేయక తటస్థంగా ఉండడం గమనించతగ్గ విషయం.

రాష్ట్రాలవారిగా లెక్కపెట్టినప్పుడు గాంధీకి అనుకూలంగా వోటుచేసిన వారిలో అనేకులు ఇదివరకు వెనుకబడిన రాష్ట్రాలుగా పరిగణింపబడిన రాష్ట్రాలకు చెందినవారుగా కనిపిస్తారు. రాజకీయంగా అభివృద్ధి గాంచిన మద్రాసు, బెంగాలు, బొంబాయి మహారాష్ట్ర ప్రాంతాల ప్రతినిధులు ఆయన పక్షాన్ని అధిక సంఖ్యలో వహించిన వారుకారు. బీహారు, గుజరాతు, మధ్యప్రదేశ్‌లోని హిందీ ప్రాంతం, ఉత్తర ప్రదేశ్, పంజాబు, సింధు రాష్ట్రాలలో 1917-20 మధ్య ఆయన ఎక్కువ పలుకుబడిని సంపాదించాడు. సురేంద్రనాథుడు పాల్, తిలక్, మొదలైనవారు ఈరాష్ట్రాలలో ఎక్కువగా కృషిచేసినవారుకారు. ఈ క్రింది అంకెలవలన పైవిషయం స్పష్టం కాగలదు.

| రాష్ట్రం | గాంధీ తీర్మానానికి వోటుచేసినవారు | పాల్ సవరణకు వోటుచేసినవారు |
|---|---|---|
| బొంబాయి | 243 | 93 |
| మద్రాసు | 161 | 135 |
| బెంగాలు | 551 | 395 |
| ఉత్తరప్రదేశ్ | 259 | 28 |
| పంజాబు | 254 | 92 |
| ఆంధ్ర | 59 | 12 |
| సింధు | 36 | 16 |
| ఢిల్లీ | 59 | 9 |

| | | |
|---|---|---|
| బీహారు | 184 | 28 |
| బర్మా | 14 | 4 |
| మధ్యప్రదేశ్ | 30 | 33 |

ఖిలాఫత్ ఉద్యమంలో ఆయన ప్రధానపాత్ర వహించిన కారణంగా మౌల్వీలు, ఉలేమాలు, పీర్లు మొదలైన మతప్రచారకులు ఆయనకు సన్నిహితులై, వారి ప్రభావానికి గురిఅయిన సామాన్య ముస్లింప్రజానీకాన్ని ఆయనకు అనుచరులుగా చేశారు. దీని ఫలితంగా ముస్లింలు అధికసంఖ్యలో కలకత్తా సమావేశానికి వచ్చి ఆయన తీర్మానానికి అనుకూలంగా వోటుచేశారు. ఇదేవిధంగా చంపరాన్, కైరా, అహమ్మదాబాదు సత్యాగ్రహాలు, రౌలెట్టు సత్యాగ్రహం బీహారు గుజరాతు, పంజాబు, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్ సింధురాష్ట్రాలను ఆయన వశంలోకి తెచ్చాయి. ఇది కారణంగా ఈ ప్రాంతాలలోనివారు కలకత్తా సమావేశంలో ఆయన తీర్మానానికి అనుకూలంగా వోటుచేశారు. ఈ రాష్ట్రాలను వశపరచుకొనగలగడమే ఆయనలోని విశిష్టత.

# 4

(1) కాంగ్రెసు నియమావళిప్రకారం ప్రత్యేకసమావేశంలో ఆమోదింపబడిన తీర్మానాలు తర్వాత జరిగే సాధారణ సమావేశంలో ఆమోదింపబడితేనేగాని వాటికి స్థిరత్వం లభించదు. అలాటి సాధారణసమావేశం డిసెంబరులో నాగపూరులో జరగవలసినట్లుగా ఇది వరలోనే నిర్ణయమైంది. కలకత్తా సమావేశానికీ దీనికీ మధ్య సుమారు 3½ నెలల వ్యవధి ఉండినది. కాని నాగపూరు కాంగ్రెసు సమావేశం కాకపూర్వమే నవంబరులో శాసనసభలకు ఎన్నికలు జరుగవలసి ఉండినది. కలకత్తా సమావేశ తీర్మానప్రకారం వాటిని బహిష్కరించడమా వాటిలో పాల్గొనడమా అనే సమస్యను కాంగ్రెసువారు ఎదుర్కొనవలసి వచ్చింది. అక్టోబరు 3 న అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమై వాటిని బహిష్కరించవలసిందిగా తీర్మానించింది.

ఎన్నికలలో పాల్గొనదలచిన కాంగ్రెసు అభ్యర్థులలో అధిక సంఖ్యాకులు ఈ తీర్మానానికి కట్టుబడి తమ అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొన్నారు. ఎన్నికలలో పాల్గొనిన పక్షాన వారు కాంగ్రెసును వదలి వైదొలగడం తప్పదు. అలాగు వైదొలగిన పక్షంలో ఎన్నికలలో తమకు విజయం లభించడం సందేహాస్పదమని వారు గ్రహించారు. సామాన్య ప్రజలు గాంధీకి అనుచరులయిన కారణంగా వారు ఈలాటి అభ్యర్థులకు వోటు చేయరనేది స్పష్టమైంది. ఎన్నికలలో ఓడిపోవుట కంటె వాటిలో నిలబడక పోవడమే మర్యాదగా ఉంటుందని వారు భావించి కలకత్తా సమావేశ తీర్మానానికి కట్టుబడి పోయినారు. ఇంతేగాక కాంగ్రెసులో చీలికలను లేవదీసి దానిని బలహీన పరచడం వాంఛనీయం కాదనే నిర్ణయానికి వారు వచ్చారు. 1907లో సూరత్ కాంగ్రెసు చీలిపోయిన తర్వాత జాతీయవాదులు ఏమీ చేయలేకపోవడాన్ని గుర్తించారు. తాము కాంగ్రెసులోనే ఉండి దాని విధానాలను మార్చుటకు వారు తలపెట్టారు.

ఈ వాతావరణంలో నవంబరు ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసు తరఫున ఎవరూ అభ్యర్థులుగా నిలబడలేదు. తక్కిన పార్టీలవారు అందులో పోటీ చేసి సులభంగా విజయాన్ని సంపాదించారు. వారే మంత్రులై అధికార పదవులను అనుభవించారు. ఉదాహరణకు మద్రాసు

రాష్ట్రంలో బ్రాహ్మణేతర జస్టిసు పార్టీవారు విజయాన్ని సాధించి పానగల్‌రాజా ముఖ్యమంత్రిగా అధికారంలోకి వచ్చారు.

వోటర్లు ఎవ్వరూ ఎన్నికలలో పాల్గొనరాదని కలకత్తా సమావేశం తీర్మానించినా కాంగ్రెసు పట్ల అభిమానం కలవారు మాత్రమే వోటు వేయడం మానుకొన్నారు. తక్కినవారు వోటు చేశారు. కాని మొత్తంమీద వోటు చేసిన వారి శాతం చాలా తక్కువగా ఉన్నట్లు చెప్ప వచ్చు. ఉదాహరణకు, "గుంటూరులో వోటు చేసిన వారి శాతం 15; రాజమండ్రిలోని 120 ముస్లిం వోటర్లలో ఒకరు మాత్రమే వోటు చేశారు; నెల్లూరులో వోటు చేసిన వారి శాతం 17; అన్ని జిల్లాలలో కొన్ని పోలింగు స్టేషన్‌లో ఎవరూ వోటు చేయలేదు. వోట్ల పెట్టెలు ఖాళీగా ఉండినవి.

(2) నాగపూరు కాంగ్రెసు సమావేశం అయ్యేవరకు కలకత్తా సమావేశ తీర్మానాన్ని గురించి దేశమందంతటా తీవ్రమయిన వాదోప వాదాలు జరిగాయి. అన్ని పార్టీలవారు పోటీలో పాల్గొన్నారు. కలకత్తా తీర్మానాన్ని ప్రతిఘటించిన కాంగ్రెసువారు కూడా ఈలాగే ప్రవర్తించారు. దీని మూలంగా నాగపూరు కాంగ్రెసులో విజయాన్ని సాధించదలచారు.

సహాయ నిరాకరణ ఉద్యమంలో ఉద్రేకానికి గురి అయినట్టిన్నీ సత్యాగ్రహ తత్వాన్ని అర్థం చేసుకొన లేనట్టిన్నీ సామాన్య ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొనడం చేత దౌర్జన్యం తప్పదని అన్ని పార్టీల వారు వాదించారు. విద్యాలయాలను, న్యాయ స్థానాలను, ప్రభుత్వో ద్యోగాలను బహిష్కరించడం మూలంగా అనేకులు నిరుద్యోగులై జీవితం సాగించవలసి వస్తుందని, దాని ఫలితంగా దేశంలో అలజడి, అరాజక పరిస్థితులు ఏర్పడగలవని వారు భావిం చారు ఉద్యమం పట్ల విరోధం వహించిన ముస్లింలు ఉద్యమ ఫలితంగా ముస్లిములు ఉద్యోగాలను, సయ్యదు మహమ్మదుఖాన్ కాలాన నుండి వారికి ప్రభుత్వం అందజేసిన సదుపాయాలను కోల్పోయి, వెనుకబడిన వర్గంగా తయారయ్యే ప్రమాదం ఉన్నదని వాదించారు. ఈలాటి వాదోప వాదాలు జరుగుతున్న సమయంలో నాగపూరులో డిసంబరు 26 నుండి 31 వరకు కాంగ్రెసు సాధారణ సమావేశం జరిగింది.

సమావేశం జరుగుటకు ముందే గాంధీ తన పక్షాన వోటు చేసేవారు అధిక సంఖ్యలో ప్రతినిధులుగా వచ్చే విషయంలో జాగ్రత్త పడినాడు. నాగపూరు ప్రధాన నగరమైన మధ్యప్రదేశ్‌లో పర్యటించి, హిందీ ప్రాంతంలోనివారు అధిక సంఖ్యలో సమావేశానికి హాజరు కావలసిందిగా ప్రచారం చేశాడు. ఇది గాక అక్కడి సాహుకార్లలో అగ్రస్థానం వహించిన జమ్నాలాల్‌బజాజ్‌ను ఆహ్వాన సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికయ్యేటట్లు ఏర్పాటు చేశాడు. ఈ ఎన్నిక గాంధీకి మరింత బలాన్ని చేకూర్చింది. గాంధీ అనుచరులు బొంబాయి, గుజరాతు, బీహారు ప్రాంతాలలో ఈలాటి ప్రచారాన్నే సాగించారు. దీని ఫలితంగా ఒక అహమ్మదాబాదు నుండి 250 ప్రతినిధులు సమావేశానికి హాజరయ్యారు. మొత్తం ప్రతినిధులలో మధ్యప్రదేశ్, బొంబాయి, బీహార్లకు చెందిన వారి శాతం 79.04. మత బోధకుల ప్రచార ఫలితంగా సింధు మొదలైన రాష్ట్రాల నుండి అధిక సంఖ్యలో ముస్లింలు ప్రతినిధులుగా వచ్చారు. బెంగాలు ఖిలాఫత్ కమిటీవారు రు 16,000 లు ఖర్చుపెట్టి జితేంద్రలాల్‌బ్యానర్జి నాయకత్వాన కొందరు ప్రతినిధులను పంపినారు. ఈ విధంగా గాంధీకి అనుకూలురనేకులు సమావేశానికి హాజరైనారు.

వీరిలో ముస్లింలు, వర్తకులు, మధ్యతరగతి రైతులు, వెనుకబడిన రాష్ట్రాలలోని సామాన్య ప్రజలు అధిక సంఖ్యలో ఉండినారు.

గాంధీని ప్రతిఘటించదలచిన వారిలో చిత్తరంజన్‌దాస్ అగ్రస్థానం వహించాడు. అందు నిమిత్తం ఆయన రు 36,000 లు స్వయంగా ఖర్చుపెట్టి బెంగాలు, అస్సాం రాష్ట్రాలనుండి 250 ప్రతినిధులను నాగపూరుకు తెప్పించాడు. ఆయనతో జిన్నా, లజపతరాయ్, పాల్ మొదలైన వారు సహకరించుటకు సిద్ధ పడ్డారు.

గాంధీని ప్రతిఘటించదలచి అక్టోబరు ఆఖరు వారంలో దాస్ వారణాసిలో జాతీయ వాదుల సమావేశాన్ని ఏర్పాటు చేసి, వారి సలహాతో ఒక ప్రత్యేక ప్రణాళికను తయారు చేశాడు. ఇందులో సహాయ నిరాకరణ ఉద్యమానికి సంబంధించిన నాలుగు దశలు వెంటనే ప్రవేశపెట్ట వలసిందిగాను; ఆర్థిక బహిష్కరణను విస్తృతపరచ వలసిందిగాను, కోటి రూపాయల తిలక్ స్వరాజ్యనిధిని సమకూర్చ వలసినదిగాను, గ్రామస్థాయీ వరకు కాంగ్రెసు కమిటీలను నిర్మాణం చేయ వలసిందిగాను. కార్మిక సంఘాలను స్థాపించ వలసిందిగాను ఉద్ఘాటించాడు.

## 5

గాంధీ, ఆయన ప్రతికూలురు ఈలాటి సన్నాహాలను పూర్తి చేసుకొని నాగపూరు చేరుకొన్నారు. ఈ సమావేశానికి 14,582 ప్రతినిధులు హాజరయ్యారు. ఇంతమంది ప్రతినిధులు అంతకు పూర్వం జరిగిన కాంగ్రెసులకు గాని, తర్వాత జరిగిన కాంగ్రెసులకు గాని రాలేదు. సమావేశానికి సేలం నగరానికి చెందిన సుప్రసిద్ధ కాంగ్రెసు వాదియైన సి. విజయరాఘవాచారి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. అధ్యక్ష ఉపన్యాసంలో ఆయన సహాయ నిరాకరణ విధానాన్ని సిద్ధాంత దృష్ట్యా సమర్థించినా దానికి సంబంధించిన కార్యక్రమాన్ని పూర్తిగా ఖండించినాడు. కాని గాంధీ ఆయనతో సంప్రతించిన ఫలితంగా వార్తా పత్రికలలో ప్రచురణార్థం విడుదల చేసిన ఉపన్యాస ప్రతిలో ఈ ఖండనలోని తీవ్రతను చాలావరకు తగ్గించాడు. ఆనాటి రాజకీయ నాయకులపై గాంధీ సంపాదించిన ప్రభావానికి ఇది ఒక గొప్ప తార్కాణము.

తర్వాత విషయ నిర్ధారణ సభకు జరిగిన ఎన్నికలలో ఒక బెంగాలు రాష్ట్రం మినహాగా తక్కిన రాష్ట్రాల నుండి గాంధీకి అనుకూలురే అధిక సంఖ్యలో ఎన్నిక అయ్యారు. బెంగాలు ప్రతినిధులలో గాంధీ అనుచరులూ దాస్ అనుచరులూ మధ్య విపరీతమైన అభిప్రాయ భేదాలు చెలరేగి తుదకు కొట్లాటలకుకూడా దారి తీశాయి. గాంధీ వెంటనే వివాదంలో జోక్యం కలిగించుకొని, దాస్‌ను ప్రతిఘటించరాదని తన అనుచరులకు సలహా ఇచ్చాడు. దాని ఫలితంగా దాస్ వర్గం వారే అధిక సంఖ్యలో ఎన్నికయ్యారు. కాని దీని మూలంగా గాంధీకి ఏలాటి నష్టం కలుగలేదు.

గాంధీ సహాయ నిరాకరణమును గురించి ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. అందులో "వర్తకులు క్రమ క్రమముగా విదేశ వ్యాపారమును బహిష్కరించ వలెను" అనే వాక్యాన్ని చేర్చవలసిందిగా పూనా మహారాష్ట్రులకు తిలక్ నిర్వాణానంతరం నాయకుడైన కేల్కారు సూచించగా, గాంధీ ఆ వాక్యాన్ని చేర్చాడు. అప్పటినుండి కేల్కారు, అతని అనుచరులు గాంధీకి లోబడి పోయినారు. గాంధీని ప్రతిఘటించదలచిన వారిలో దాస్ అగ్రగణ్యుడు. ఆయన కూడా విషయ నిర్ధారణ సభలో బెంగాలు తప్ప తక్కిన రాష్ట్రాలకు చెందిన ప్రతినిధులు గాంధీకి

అనుకూలురుగా ఉండడం గుర్తించి గాంధీని ప్రతిఘటించడం మూలాన ఏలాటి ప్రయోజనము లభించదని భావించి, ఆయనతో సంప్రతింపులు జరిపి రాజీ పడడం ప్రాప్తతగా భావించారు. గాంధీ కూడా సంప్రతింపులకు అనుకూలురైనారు. సాధ్యమైనంతవరకు అందరు నాయకులను చేరదీసి వారి సహకారంతో తన ఉద్యమాన్ని నడపడమే ఆయన వాంఛ. ఈ సంప్రతింపులు ఫలితంగా దాస్ తయారు చేసిన ప్రణాళికలోని అంశాలలో అనేకాన్ని తన తీర్మానంలో చేర్చుటకు గాంధీ అంగీకరించాడు. అంతటితో దాస్ ప్రతిఘటన ఆగిపోయింది. ఆయన పూర్తిగా గాంధీకి లొంగిపోయినట్లు భావించరాదు.

ఈ సంప్రతింపులలో శాసన సభల బహిష్కరణ ప్రస్తావనకు స్థానం లేదనే విషయం గుర్తించడం అవసరం. నాగపూరు కాంగ్రెసు జరిగే నాటికి ఎన్నికలు జరిగిపోయాయి. వాటిని గురించి ప్రస్తావించడం నిరర్థకమని దాస్ గ్రహించాడు. ఇంతేగాక సమావేశంలో గాంధీ వ్యక్తం చేసిన అభిప్రాయాల మూలంగాను, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గురించి ఆయన ప్రతిపాదించిన తీర్మానం మూలంగాను స్వరాజ్యం ఒక సంవత్సరంలో లభించగలదని, శాసన సభల బహిష్కరణము తాత్కాలికము మాత్రమేనని అనేకులు భావించారు. ఉప ఎన్నికలలోను, 1923లో జరిగే ఎన్నికలలోను తాము పాల్గొని సభ్యత్వాలను సంపాదించే అవకాశం ఉన్నట్లు వారికి విశ్వాసం కలిగింది. నాగపూరు కాంగ్రెసులో వారు దీనిని గురించి ఎక్కువగా పట్టించుకొనక పోవుటకు ఇదికూడా ఒక కారణం. అందుచేతనే దాస్, మోతీలాల్ మొదలైన వారు 1923లో స్వరాజ్య పార్టీని నిర్మాణం చేసి ఎన్నికలలో పాల్గొనుటకు సిద్ధపడ్డారు.

నాగపూరులో గాంధీతో ఏలాటి రాజీకి సిద్ధపడని వారిలో ముస్లిం నాయకుడు జిన్నా, మహారాష్ట్రుల నాయకుడు కపర్డే, మాళవ్యాలు ప్రాధాన్యం వహించారు. మాళవ్యా సమావేశానికి రాకపోయినా వ్రాత మూలకంగా సహాయ నిరాకరణ ఉద్యమం పట్ల తన ప్రతిఘటనను తెలియ పరచాడు. కాని వీరి ప్రతిఘటనలు సమావేశంపై ఏలాటి ప్రభావమూ వహించలేదు.

సంప్రతింపులు ఫలితంగా రూపొందిన సహాయ నిరాకరణ తీర్మానాన్ని దాస్ ప్రతిపాదించగా లజపతిరాయ్ బలపరచాడు. వీరు గాంధీని ప్రతిఘటించే ఉద్దేశంతో కాంగ్రెసు సమావేశానికి వచ్చినవారు. అలాటివారు ఈ తీర్మానాన్ని పూర్తిగా సమర్థించడం గొప్ప విశేషం. తీర్మానాన్ని సమావేశం ఆమోదించింది. కలకత్తా సమావేశ తీర్మానంలోని అంశాలన్నీ ఇందులో చేర్చబడినవి. ఇవిగాక దీని ప్రకారము వర్తకులు క్రమ క్రమముగా విదేశ వ్యాపారమును బహిష్కరించవలసిన వారైరి. భారత జాతీయ సేవకులను సమకూర్చవలెనని (National workers), అఖిల భారత తిలక్ స్మారక స్వరాజ్య నిధిని సేకరించవలెనని, కాంగ్రెసులో ఒక కోటి సభ్యులను—వారిలో ప్రధానంగా శాసన సభల వోటర్లను చేర్చవలసిందిగాను, కార్మికుల సంఘాలను ఏర్పాటు చేయవలసిందిగాను తీర్మానించబడినది.

నాగపూరు సమావేశం కాంగ్రెసు ఆశయంలోను, దాని నిర్మాణ విధానంలోను విప్లవాత్మకములైన మార్పులను చేసింది. ఇంతకు పూర్వం కాంగ్రెసు ఆశయం బ్రిటిష్ సామ్రాజ్యంలోని వలస రాష్ట్రాల స్వపరిపాలన వంటి స్వపరిపాలనను చట్టబద్ధమైన పద్ధతుల ద్వారా సంపాదించడంగా ఉండేది (Colonial self Government by Constitutional means). నాగపూరు మార్పు ఫలితంగా అది "శాంతియుతముగను న్యాయసమ్మతముగను అయిన పద్ధతుల మూలమున స్వరాజ్యమును సంపాదించుటయే కాంగ్రెసు ఆశయము" అని నిర్వచింపబడినది. నాగపూరు సమావేశములో అలీ సోదరులు, హజరత్ మోహిని మొదలైనవారు బ్రిటన్‌తో ఏలాటి

సంబంధం లేని సంపూర్ణ స్వాతంత్ర్యంతో కూడిన ప్రజారాజ్యమే (Republic) భారతదేశపు లక్ష్యంగా ఉండవలెనని పట్టు బట్టారు. దాస్, జిన్నా వంటివారు బ్రిటన్‌తో కొంత సంబంధం ఉండడం వాంఛనీయమని భావించారు. గాంధీ అభిప్రాయం కూడా ఇదే. అయినా, రెండు పార్టీలను తృప్తిపరచే ఉద్దేశంతో "స్వరాజ్యం" అనే మాటను తీర్మానంలో చేర్చాడు. ఈ మాటను పై రెండు అర్థాలలో ఉపయోగించవచ్చు.

కాంగ్రెసు నిర్మాణ విధాన సందర్భంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు నిర్మింపబడినవి. అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యుల సంఖ్య 350కు పెంచబడింది. ఇదియే విషయ నిర్ధారణ సభగా గుర్తించబడింది. ఈ కమిటీ నుండి 15 సభ్యులతో కూడిన ఒక కార్యనిర్వాహక కమిటీ (Working Committee) ఏర్పాటు చేయబడింది.సంవత్సరం పొడుగున కాంగ్రెసు వ్యవహారాలను సాగించే సర్వాధికారం దీనికి సమర్పించబడింది. ఇంతకు పూర్వం ఈలాటి కమిటీ లేనందున కాంగ్రెసు మూడునాళ్ళ ముచ్చటగా జరిగిపోతూ ఉండేది. ఇప్పుడు నిర్వహించవలసిన బాధ్యతలు అత్యధికంగాను, అతి ప్రాధాన్యంగాను ఉండడంచేత ఈలాటి కమిటీ ఏర్పడడం అవసరమైంది. దీనికి తోడు జిల్లా తాలూకా కేంద్రాలలోను, గ్రామాలలోను కాంగ్రెసు శాఖలు ఏర్పాటు చేయవలసినట్లుగా నిర్ణయించబడింది. దీని ఫలితంగా సామాన్య ప్రజలు, ఇంగ్లీషు విద్యాధికులు కానివారు, గ్రామీణ ప్రాంతాలలో పలుకుబడి కలిగినవారు కాంగ్రెసుతో సన్నిహిత సంబంధం గలవారయ్యారు. ఇంతవరకూ కాంగ్రెసు ఒక ఇంగ్లీషు విద్యాధికవర్గానికి చెందిన సంస్థగా ఉండేది. ఇది మొదలు అది ప్రజా సంస్థగా రూపొందింది. ఈలాటి మార్పు జరిగినందుననే అది 1921-22లో సాగిన సహాయ నిరాకరణోద్యమ మందును, అటు తర్వాత జరిగిన స్వాతంత్ర్యోద్యమ మందును గొప్ప పాత్రను వహించగలిగింది. స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రజల ఉద్యమంగా మార్చడంలో ఇది పటిష్ఠ సాధనమైనది.

ఈ విధంగా సహాయ నిరాకరణ తీర్మానాన్ని దృఢపరచడం చేతను, కాంగ్రెసు ఆదర్శం స్వరాజ్య సంపాదనమని నిర్ణయించడంచేతను, కాంగ్రెసు నిర్మాణ స్వరూపంలో మార్పులుజేసి దానిని ప్రజా సంస్థగా రూపొందించడం చేతను నాగపూరు సమావేశం చరిత్రాత్మకమైనది. గాంధీ విధానాలన్నింటినీ అది ఆమోదించడం చేతను, తక్కిన రాజకీయ నాయకులలో అధిక సంఖ్యాకులు ఆయనతో సహకరించుటకు అంగీకరించడం చేతను ఆయన అఖిలభారత నాయకత్వానికి స్థిరత్వం కలిగింది. ఇది మొదలు స్వాతంత్ర్య సమరం విజయవంతంగా ముగిసేటంత వరకూ ఆయన ఒక్కడే అఖిలభారత నాయకుడుగా వ్యవహరించాడు. వీటి అన్నిటి ఫలితంగా ఇంతకు పూర్వం కాంగ్రెసు సమావేశాలకు లేని ప్రాధాన్యం నాగపూరు సమావేశానికి లభించింది. పరాయి పరిపాలనను నిర్మూలించి స్వరాజ్యాన్ని సంపాదించుటకు మొదటిసారిగా ఈ సమావేశం కార్యక్రమాన్ని నిర్ణయించి అమలులో పెట్టింది. ఆ కార్యక్రమానికే సహాయ నిరాకరణమనే పేరు లభించింది. ఈ కార్యక్రమం 1921-22లో ఏలాగు సాగిందో మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం.

చదువదగిన గ్రంథాలు :

**Bhavan: Vol. xi**

**B. Pattabhi Seetharamiah: A History of the Indian National Congress, తెలుగు అనువాదం.**

**Judith M. Brown: Gandhi's Rise to Power.**

**John Gallagher, Gordon Johnson and Anil Seal: Locality, Province and Nation—Essays in Indian Politics 1870 - 1940, Essay 4.**

# అధ్యాయము-6

## సహాయ నిరాకరణోద్యమము

### 1

సహాయ నిరాకరణోద్యమానికి మూడు ఉద్దేశాలున్నట్లున్నూ, వాటిని సాధించుటకు వరిష్ఠములైన సాధనాంతరాలేవీ లేవనే భావం వ్యాపించడం చేత నాగపూరు కాంగ్రెసు ఈ ఉద్యమాన్ని సాగించ తీర్మానించినట్లున్నూ గత అధ్యాయంలో తెలుసుకొన్నాము. ఉద్యమం ఏలాగు సాగినదీ ఈ అధ్యాయంలో తెలుసుకొనగలం.

ఉద్యమం మూడు పాయలలో ప్రవహించినట్లు చెప్పవచ్చు. వీటిలో మొదటిది నిర్మాణ కార్యక్రమము; రెండవది బహిష్కరణ కార్యక్రమము; మూడవది శాసనోల్లంఘనము. 1921 జనవరి నుండి నవంబరు వరకూ మొదటి రెండు కార్యక్రమముల పట్లనే కాంగ్రెసువారు ఎక్కువ శ్రద్ధను వహించారు. కాని వీటి మూలంగా ఫలితాలు ఆశించినంత మేరకు లభించనందున వారు శాసనోల్లంఘనము పట్ల దృష్టిని మరల్చవలసి వచ్చింది.

నిర్మాణ కార్యక్రమంలో రాట్నాలపై నూలు వడకడము, ఖద్దరు ఉత్పత్తి, దాని ధారణము, త్రాగుడు నిర్మూలనము, అస్పృశ్యతా నివారణము, హిందూ ముస్లిం సఖ్యత మొదలైన అంశాలు చేర్చబడినవి. బహిష్కరణ కార్యక్రమంలో శాసన సభల యొక్కయు, న్యాయస్థానముల యొక్కయు, విద్యాలయముల యొక్కయు బహిష్కారము చేర్చబడినవి. బిరుదములను త్యజించుటకూడ ఇందులోని అంశాలలో ఒకటి.

నాగపూరు కాంగ్రెసు సమావేశము ముగిసిన వెంటనే గాంధీ అనేక ప్రాంతాలలో పర్యటించి ఉద్యమాన్ని గురించి ప్రచారం చేశాడు. ఆయన దృష్టిలో బహిష్కరణము కంటె నిర్మాణ కార్యక్రమమే ఎక్కువ ప్రాధాన్యం వహించింది. ఈ కార్యక్రమం విజయవంతంగా సాగిన పక్షంలో స్వరాజ్యం లభించినట్లేనని ఆయన భావించాడు. నూలు వడకడము, ఖద్దరు ఉత్పత్తుల మూలాన గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగ సమస్య పరిష్కారం కాగలదని, దారిద్ర్యం అనేది ఉండదని, అందరికీ ఒక జీవనోపాయం ఏర్పడి అందరూ సుఖంగా జీవించ గలుగుతారని; త్రాగుడు నిర్మూలమయిన పక్షంలో చాలీ చాలని ఆదాయంతో జీవితాన్ని గడిపే బలహీన వర్గాల ఆర్థిక పరిస్థితి చక్కబడి వారు అవినీతికి పాల్పడక గౌరవ మర్యాదలతో జీవ యాత్ర సాగించడం సాధ్యం కాగలదని, అస్పృశ్యత నిర్మూలమైన పక్షంలో యుగయుగాలుగా హిందూ సమాజాన్ని ఆవరించిన ఒక కళంకం తొలగడమే గాక హిందువులు సుసంఘటితులై పరాయి పరిపాలనను ప్రతిఘటించడం సులభ సాధ్యం కాగలదని, హిందువులు ముస్లింలు కలిసిన పక్షంలో ఈలాటి ప్రయోజనాన్ని మరింత సులభంగా సాధించ వచ్చునని ఆయన భావించాడు. నిర్మాణ కార్యక్రమం ఈ ఉద్దేశాలనన్నిటినీ పూర్తిగా సాధించ గలదు. ఇది జరిగి, ప్రజల జీవి

శానికి సత్యాహింసలు ఆధారమైనప్పుడు పరాయి పరిపాలన దానంతట అదే తొలగిపోతుంది. ప్రజలలో ఈలాటి మార్పులు వచ్చిన తర్వాత జాత్యహంకారంతోను, నిరంకుశంగాను దేశాన్ని పాలించడం బ్రిటిష్ వారికి సాధ్యం కాజాలదు. సాధ్యం కాజాలదని వారు తప్పకుండా గ్రహిస్తారు. ఈవిధంగా వారి వైఖరి మారినప్పుడు వారు దేశానికి పరిపాలకులుగా ఉండినా విచారించ తగ్గది ఏదీ ఉండదు. ఇదే వాస్తవమయిన స్వరాజ్యం. స్వరాజ్యం ద్వారా ఏలాటి ఆశయాలను ప్రజలు సాధించదలచారో వాటిని నిర్మాణ కార్యక్రమం ద్వారా సాధించవచ్చు. ఇవి ప్రజలలో ఆత్మ విశ్వాసాన్ని, ఆత్మ గౌరవాన్ని పెంపొందించగలవు. ఈలాటి భావం ఆయనలో అనేక సంవత్సరా ల క్రిందటనే కలిగింది. అందుచేతనే సహాయ నిరాకరణ ఉద్యమంలో ఆయన నిర్మాణ కార్యక్రమానికి అగ్రస్థానం కల్పించాడు.

మార్చి ఆఖరున అఖిలభారత కాంగ్రెసు కమిటీ విజయవాడలో సమావేశమై తిలక్ స్వరాజ్య నిధికి వెంటనే ఒక కోటి రూపాయలు సమకూర్చ వలసిందిగాను, కాంగ్రెసులో ఒక కోటి సభ్యులను చేర్చ వలసిందిగాను, ఇరవై లక్షల రాట్నాలను ప్రజలకు పంచిపెట్ట వలసింది గాను తీర్మానం చేసింది. దీని మేరకు కార్యక్రమం చురుకుగా జరిగింది. స్వరాజ్య నిధికి అనుకొన్న దానికంటె 15 లక్షలు అధికంగా విరాళాలు వసూలు చేయబడినవి. రెండు నెలలలో 50 లక్షల సభ్యులు కాంగ్రెసులో చేరారు. వీరిలో అధిక సంఖ్యాకులు గ్రామీణ ప్రాంతాలవారు. ఇది కాంగ్రెసును ప్రజా సంస్థగా మార్చగలిగింది. రాట్నాల పంపకం కూడా విజయవంతంగా జరిగింది. ఖద్దరు ఉత్పత్తి బాగా పెరిగింది.

స్వరాజ్య నిధికి ఈ క్రింది విధంగా అన్ని రాష్ట్రాలనుండి విరాళాలు లభించాయి.

| రాష్ట్రం | వసూలైన రూపాయల మొత్తం |
|---|---|
| బొంబాయి (నగరంతో సహా) | 3,170.049 |
| ఉత్తర ప్రదేశ్ | 596,228 |
| మధ్య భారతం | 26,800 |
| మద్రాసు | 538,069 |
| ఢిల్లీ | 39,964 |
| బీహారు—ఒరిస్సా | 483,419 |
| సింధు | 112,530 |
| వాయవ్య సరిహద్దు రాష్ట్రం | 8,480 |
| బెంగాలు | 1800 000 |
| రాజపుటానా | 41,558 |
| అస్సాం | 86,563 |
| మధ్య ప్రదేశ్ | 264,500 |
| పంజాబు | 856,000 |

త్రాగుడు నిర్మూలనం మూలంగా బలహీన వర్గాల స్థితిగతులను చక్కబరచడమేగాక ప్రభుత్వ ఆదాయానికి కొంత నష్టం కలిగించవలెనని కాంగ్రెసువారు ఉద్దేశించారు. కల్లు, సారాయి మొదలయిన మద్యాలపై పన్నులను విధించి అబ్కారీ వేలాలు మూలంగా ప్రభుత్వం

ఆ రోజులలో చాలా ఆదాయాన్ని గడిస్తూ ఉండేది. కాంగ్రెసు వాలెంటర్లు పికెటింగు కార్యక్రమాన్ని సాగించి కల్లు, సారాయిలకు వెళ్ళే ప్రజలను వెళ్ళరాదని ప్రోత్సహించారు. ఇంతేగాక వీరు అబ్కారీ వేలంపాటలలో జోక్యం కలిగించుకొని వేలంపాట పాడేవారిని పాడకుండా ప్రోత్సహించారు. దీని ఫలితంగా ప్రభుత్వ ఆదాయం చాలా తగ్గింది. ఉదాహరణకు—ఆంధ్ర ప్రాంతంలోని కొన్ని జిల్లాలలో వేలంపాట పాడేవారే లేకపోయ్యారు. మద్రాసు ప్రభుత్వ ఆదాయంలో 65 లక్షల లోటు కనుపించింది. తక్కిన రాష్ట్రాలలో కూడా ఇదే సంభవించింది. సహాయ నిరాకరణోద్యమ కాలంలో త్రాగుడు చాలావరకు తగ్గినట్లు చెప్పవచ్చు.

అస్పృశ్యతను తొలగించుటకు కాంగ్రెసువారు కొంత ప్రచారం చేశారు. కాని ఇది ఎంతవరకు తొలగిందో నిర్ణయించుటకు తగిన ఆధారాలు లేవు. అయినా కాంగ్రెసు స్వచ్ఛంద దళాలలోను, కాంగ్రెసు సమావేశాలలోను అగ్ర కులాలవారితో సహా అస్పృశ్యులు పాల్గొనడం జరిగింది. అస్పృశ్యత తొలగుటలో ఇది మొదటి మెట్టుగా భావించవచ్చు. ఉద్యమకాలంలో హిందువులు, ముస్లింలు కలిపి ఉద్యమాన్ని సాగించారు. రెండు మత వర్గాలమధ్య ఎక్కువ సఖ్యత ఏర్పడింది. కాని అక్కడక్కడ వీరిమధ్య కొన్ని కొట్లాటలు సంభవించి అనేక అత్యాచారాలకు దారి తీశాయి. వాటిలో మలబారులో జరిగిన మాప్లా తిరుగుబాటు ప్రధానంగా పేర్కొన తగినది.

బహిష్కరణ కార్యక్రమంలో నాగపూరు కాంగ్రెసుకుముందే శాసన సభల ఎన్నికలు పూర్తి కావడంచేత ఉద్యమకాలంలో (1921—22లో) దీనికి ఎలాటి ప్రాధాన్యత లేకపోయింది. ఎన్నికలలో కాంగ్రెసు పాల్గొనకపోయినా తక్కిన పార్టీలవారు పాల్గొనడం చేతను, వాటి సహకారంతో ప్రభుత్వం శాసన సభల ద్వారా జరగవలసిన కార్యక్రమాలన్నిటినీ జరపడం సాధ్యం కావడం చేతను ఈ విషయంలో ఉద్యమం విఫలమైనట్లే చెప్పక తప్పదు.

న్యాయస్థానాల బహిష్కరణకూడా ఆశించిన ఫలితాలను అందజేయలేదు. మార్చి 1921 నాటికి 180 న్యాయవాదులుమాత్రమే వారివృత్తిని వదులుకొన్నారు. ఈ సంఖ్య చాలా స్వల్పమైనా వీరిలో న్యాయవాదులుగా అగ్రశ్రేణికి చెంది ఎక్కువ ఆదాయాన్ని గడిస్తూ ఉంటిన మోతీలాల్‌నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, టంగుటూరు ప్రకాశం వంటివారు ఉండడం గుర్తించదగింది. అధికసంఖ్యలో న్యాయవాదులు న్యాయస్థానాలను బహిష్కరించి పంచాయతీ కోర్టుల మూలంగా ప్రజలు తమ వివాదాలను పరిష్కరించుకొనుటకు అలవాటుపడిన పక్షంలో న్యాయం చౌకగాను, అనాలస్యంగాను కూటసాక్షులకు అవకాశంలేకుండగాను లభించగలదనీ, వృత్తిని వదులుకొన్న న్యాయవాదులు ప్రజాసేవలో తమ శక్తిసామర్థ్యాలను వినియోగించి దేశాభ్యుదయానికి తోడ్పడగలరని గాంధీ భావించారు. కాని వృత్తులను కోల్పోయి జీవనోపాధిలేక దారిద్ర్యాన్ని అనుభవించుటకు న్యాయవాదులు అంగీకరించలేరు. అక్కడక్కడ పంచాయితీ కోర్టులు స్థాపింపబడినా అవి సామాన్య ప్రజలకు ఆకర్షణీయం కాలేదు. అందుచేత న్యాయస్థానాల బహిష్కరణకూడా ఫలప్రదం కాలేదనే చెప్పవలసి వస్తుంది.

విద్యాలయాల బహిష్కరణ ఇంతకంటె కొంచెం ఎక్కువ విజయాన్ని సాధించింది. చిత్తరంజన్‌దాను వంటివారి ప్రచార ఫలితంగాను, విద్యార్థినాయకులు పికెటింగుచేయుట మూలంగాను వేలసంఖ్యలో విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరించారు. వీరు జాతీయ

విద్యాలయాలలో విద్యార్థులుగా ప్రవేశించారు. కొందరు కాంగ్రెస్ వాలంటరీదళాలలో చేరి కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొని ఉద్యమానికి చాలా సహాయం చేశారు. దేశంలో 1921 ఆఖరుకు 1246 జాతీయ విద్యాలయాలు స్థాపించబడినాయి. వాటిలో 81,555 విద్యార్థులు విద్యాభ్యాసం చేశారు. వీరు మాతృభాషద్వారా విద్యను నేర్చుకొనడం జరిగింది. ఏదైనా ఒక వృత్తిని చేపట్టుటకు తగినట్లుగా వీరి విద్యావిధానం రూపొందింది. జాతీయవిద్యను నేర్చుకొన్న వారు దేశాభిమానం జాతీయాభిమానం కలవారై ప్రజాసేవలో శ్రద్ధను వహించేవారయ్యారు. ఏ ఏరాష్ట్రాలలో ఎంతవరకు జాతీయవిద్య అభివృద్ధిగాంచిందో ఈ క్రింది అంకెలవల్ల స్పష్టం కాగలదు.

| రాష్ట్రం | విద్యాలయాలు | విద్యార్థులు |
|---|---|---|
| మద్రాసు | 92 | 5,072 |
| బొంబాయి | 189 | 17, 100 |
| బెంగాలు | 190 | 14,819 |
| ఉత్తరప్రదేశ్ | 137 | 8.476 |
| పంజాబు | 69 | 8,046 |
| బీహారు-ఒరిస్సా | 442 | 17,330 |
| మధ్యప్రదేశ్ | 86 | 6 338 |
| అసాం | 38 | 1,908 |
| వాయవ్యసరిహద్దు | 4 | 120 |
| తక్కినరాష్ట్రాలు | 10 | 1,255 |

దేశంలో 1921-22 లో (ప్రాథమిక విద్యాలయాలు మినహాగా) 8,987 విద్యాలయాలు ఉండినవి; వీటిలోని విద్యార్థుల సంఖ్య 1,239,524.

బిరుదములను త్యజించవలసిందిగాకూడా కాంగ్రెసు తీర్మానించింది. 1921 నాటికి దేశంలో బిరుదములను వహించినవారి సంఖ్య 5186. వారిలో 24 రు మాత్రమే బిరుదములను త్యజించారు. బిరుదములు వహించినవారు సాధారణంగా బ్రిటిష్ ప్రభుత్వంపట్ల భక్తిగలవారు. అలాటివారు వాటిని త్యజించకపోవడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు.

పై అంకెలను ఆధారంచేసుకొని కాంగ్రెస్ చరిత్రకర్త పట్టాభి సీతారామయ్యగారు. కళాశాలలు, న్యాయస్థానాలు బిరుదముల విషయంలో మద్యపాన విషేసంలో సాధించినంతటి విజయం కాంగ్రెసు సాధించలేకపోయిందనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

ప్రభుత్వ ఉద్యోగాల విషయంలోకూడా ఇదే జరిగింది. ఉద్యోగాలనుండి రాజీనామా చేసినవారి సంఖ్య చాలా స్వల్పం. కాని వారిలో ఐ. సి. యస్ పరీక్షలో కృతార్థుడై ఉన్నత ఉద్యోగి వర్గానికి చెందిన సుభాష్‌చంద్రబోసు ఉండడం గుర్తించ తగ్గది. వీరు కలకత్తాలోని జాతీయకళాశాలకు అధ్యక్షులు కావడమేకాక కలకత్తా మునిసిపల్ సంఘానికి కార్యనిర్వాహకుడుగా ఎన్నికై కాలక్రమాన రాజకీయరంగంలో ప్రఖ్యాత స్థానాన్ని సంపాదించినారు. అలీ సోదరులు నిర్బంధితులైన తర్వాత 90 ముస్లింలు పోలీసుదళాలనుండి రాజీనామా చేశారు. ఉద్యోగులు అధికసంఖ్యలో రాజీనామా చేసిన పక్షంలో పరిపాలనయంత్రాంగం విస్పందేహంగా

స్తంభించిపోయేది. తక్కిన బహిష్కరణలకు ఉద్యోగాల బహిష్కరణకు ఇందులోనే గొప్ప భేదం. కాని ఈ బహిష్కరణ విజయవంతం కాలేదు. ఉద్యోగవృత్తిని త్యజించడం అనేకులకు సాధ్యంకాలేదు. వారికి ఇంకొక జీవనోపాయం లేకపోవడమే దీనికి కారణం. అక్టోబరు 5 న కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం సమావేశమై దీనినిగురించి ఆలోచించి స్వతంత్రంగా జీవించగల వారు ఉద్యోగాలనుండి రాజీనామాచేయవలసిందిగా ఉద్బోధించింది. కాని దీనిమూలంగా ఎక్కువ ఫలితం లభించలేదు. ప్రభుత్వయంత్రాంగం యథాప్రకారం పనిచేయసాగింది.

బహిష్కరణ కార్యక్రమంలో ఇక మిగిలినది విదేశవస్త్రబహిష్కరణము. ఇది ద్వేషపూరితమైన విధానమని, తన అహింసాసిద్ధాంతానికి విరుద్ధమని ఒకప్పుడు గాంధీ భావించినా క్రమ క్రమంగా తన అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు. జూలై 28-30 తేదీలలో అఖిలభారత కాంగ్రెసు సంఘం బొంబాయిలో సమావేశమై కాంగ్రెసు పక్షానికిచెందిన వారందరు విదేశ వస్త్రములను ధరించరాదని ఖద్దరునే ధరించవలసిందని, మిల్లుల యజమానులు తమ ఫ్యాక్టరీలలో తయారయ్యే వస్త్రాలను చౌక ధరలకు విక్రయించవలసిందిగాను, విదేశ వ్యాపారంచేసే వర్తకులు విదేశవస్త్రాలను దిగుమతిచేయరాదని తీర్మానించింది. సెప్టెంబరు ఆఖరుకు విదేశ వస్త్రబహిష్కరణము పూర్తిగా జరగవలెనని ఆశించింది.

ఇందుకుగాను స్వచ్ఛంద సైనికులు ఇంటింటికి వెళ్ళి విదేశవస్త్రాలను సేకరించి వాటిని నడివీధులలో కుప్పలువేసి, దగ్ధంచేయవలసిందిగా ఆదేశించింది. ప్రముఖులెవరైనా నగరాలకు వచ్చినప్పుడు ఈలాటి కార్యక్రమంతో వారికి స్వాగతం అర్పించవలసిందిగా కోరింది. ఈకోరికక్రియా రూపం ధరించింది. వస్త్రాలను మంటలపాలుచేయడం అనాగరిక కృత్యమనీ పోగుచేసిన విదేశీవస్త్రాలను బీదలకు పంచిపెట్టడమో, విదేశాలలోని బీదల సహాయార్థం ఉచితంగా ఎగుమతిచేయడమో ఇంతకంటె ఉత్తమమైన కార్యక్రమం అని అనేకులు భావించి, వాటిని దగ్ధంచేయడాన్ని పూర్తిగా ఖండించారు. అలాగు ఖండించినవారిలో మహాకవి రవీంద్రుడు ఒకడు. కాని గాంధీ దీన్ని సమర్థించగలిగాడు. ఈ బహిష్కరణ ఫలితంగా 1920 లో 100 కోట్ల రూపాయల విలువగల విదేశవస్త్రాలు దిగుమతికాగా 1921-22 ఇది 57 కోట్లకు తగ్గింది. ప్రజలు ఖద్దరును, మిల్లుబట్టలను ధరించుటకు అలవాటుపడినారు. స్వదేశీఉద్యమం ఈ విధంగా అభివృద్ధి గాంచింది. కాని ఉద్యోగాల బహిష్కరణ కార్యక్రమం విజయవంతం కాకపోవడంచేతను తక్కిన బహిష్కరణ కార్యక్రమాలు మందకొడిగా సాగడంచేతను ప్రభుత్వానికి ఏలాటినష్టమూ కలుగలేదు. పరిపాలనయంత్రాంగం స్తంభించక యథాప్రకారం పనిచేస్తూనే వచ్చింది.

## 2

గాంధీ దృక్పథం ఆధ్యాత్మికమైనదనీ నైతికమైనదని లౌకికములైన రాజకీయాలను కూడా ఆ దృక్పథంతోనే ఆయన సాగించేవాడని, రాజకీయాలు హింసలతోకూడిన దౌర్జన్యాలకు దారితీసినప్పుడు ఆయన రాజకీయ కార్యక్రమాలను ఉపసంహరించుకునేవాడని ఇదివరకే మనం తెలుసుకొన్నాము. ఆయనకు ఆయన అనుచరులకు ఇందులోనే గొప్పభేదం. వారిలో అనేకులు అహింస రాజకీయ ప్రయోజనాలకు సాధనమైనప్పుడే దానిని పాటించేవారు. అది సాధనం కానప్పుడు దానిని విసర్జించవలసిందిగా వాంఛించేవారు. వారిమధ్య ఈలాటిభేదం ఉండడంచేత అప్పుడప్పుడు గాంధీ అనేక ఇబ్బందులను ఎదుర్కొనవలసిన వాడయ్యాడు.

గాంధీ అనుచరులలో ఆలీసోదరులు అగ్రశ్రేణికి చెందినవారు. మొదటినుండి వీరిపట్ల ఆయనకు గొప్ప అభిమానం. వారు అత్యంత ప్రతిభావంతులు. గాంధీ తర్వాత ఖిలాఫత్ ఉద్యమానికి వారే చెప్పుకొనదగిన నాయకులు. గాంధీ ప్రభావంచేత వారికి అహింస లోను హిందూ ముస్లిం సఖ్యతలోను విశ్వాసం ఏర్పడింది. కాని వారు ఆవేశాపరులు. వారిది అతివాద ధోరణి. అందుచేత వారు అప్పుడప్పుడు అహింస సిద్ధాంతానికి విరుద్ధంగా ఉపన్యాసాలు చేసేవారు. అఫ్గన్లు భారతదేశంపై దండెత్తివచ్చిన పక్షంలో ముస్లింలు వారితో కలిసి బ్రిటిష్ వారిపై యుద్ధంచేయుటకు సిద్ధంగా ఉన్నారని ఒక ఉపన్యాసంలో వారు చెప్పారు. ఇది హిందువులలో అసంతృప్తిని కలిగించడమేగాక ప్రభుత్వాధికారుల క్రోధానికి గురిఅయింది. 1921 మే నెలలో గాంధీ వైస్రాయి రీడింగును కలుసుకోవడం జరిగినప్పుడు చర్చల సందర్భంలో ఆలీ సోదరుల ఉపన్యాసాన్ని రీడింగు గాంధీ దృష్టికి తెచ్చాడు. గాంధీ దానిని పరిశీలించి అందులో అహింస సిద్ధాంతానికి విరుద్ధములైన అభిప్రాయాలున్నట్లు గ్రహించి, ఆలీసోదరులకు వ్రాసి వారి నుండి ఒక విధమైన క్షమార్పణను సంపాదించాడు. అప్పట్లో ప్రభుత్వం వారిని అరెస్టుచేయ సంకల్పించి ఉండినది. ఈ క్షమార్పణ ఫలితంగా ఆ సంకల్పాన్ని మానుకొన్నది.

కాని దీనితో ఆలీసోదరుల ఉదంతం ముగియలేదు. జూలైలో మహమ్మదాలీ అధ్యక్షతన కరాచీనగరంలో ఖిలాఫత్ మహాసభ జరిగింది. తన ఉపన్యాసంలో ముస్లింలు బ్రిటిష్ సైన్యాలలో చేరరాదని, అలాగుచేయడం ఇస్లాంమతానికి విరుద్ధమని అందుచేత ముస్లిం సైనికులు సైన్యమునుండి రాజీనామా చేయవలసిందని ఉద్ఘాటించాడు. దీనికి అనుగుణంగా మహాసభ ఒక తీర్మానంచేసింది. సైనికులను రాజీనామా చేయవలసిందిగా ప్రోత్సహించడం రాజద్రోహచర్య అని ప్రభుత్వం సెప్టెంబరులో ఆలీసోదరులను అరెస్టుచేసి, విచారణగావించి జైలుశిక్షను విధించింది. ఇది ఖిలాఫత్ ఉద్యమంలోని ముస్లింలందరికి ఆగ్రహకారణమైంది. గాంధీకూడా ఆగ్రహపరవశుడై ప్రజలు సైన్యంలో చేరరాదని చెప్పడంలో ఏలాటి రాజద్రోహంలేదని అలాగు చెప్పడడం పౌరుని వాక్స్వాతంత్ర్యానికి ఒక లక్షణమని భావించి, మహమ్మదాలీ ఉపన్యాసంలోని ఆ వాక్యాలను కాంగ్రెసు వేదికలనుండి పునశ్చరణ చేయవలసిందిగా ఆదేశించడమే కాక మరి యాభై నాయకులతోకలిసి ఆవాక్యాలను సమర్థిస్తూ అక్టోబరు 5 న ఒక ప్రకటన చేశాడు. అప్పటికి దేశంలో అక్కడక్కడ కొన్ని అల్లర్లు సంభవించాయి. ఆగస్టులో మాప్లాలు తిరుగుబాటు చేసినప్పటినుండి ఇవి ప్రారంభమైనాయి. ఈ పరిస్థితులలో గాంధీ ప్రకటనను చేయడం రాజద్రోహమనే భావంతో ఆయననుకూడా అరెస్టుచేసి సహాయ నిరాకరణోద్యమాన్ని తుదముట్టించ ప్రభుత్వం సంకల్పించింది. కాని అప్పట్లో వైస్రాయి కార్య నిర్వాహక సభలో సభ్యుడుగా ఉండిన సప్రూ గాంధీని అరెస్టు చేయడం ప్రమాదకరమని రౌలెట్టు సత్యాగ్రహం కాలంలోని పరిణామాలను రీడింగుదృష్టికి తెచ్చాడు. అంతటితో ప్రభుత్వం తన సంకల్పాన్ని మానుకొన్నది. కాని ఆలీసోదరుల నిర్బంధం మూలంగాను గాంధీని అరెస్టు చేసే సంకల్పంమూలంగాను దేశంలో సహాయ నిరాకరణ ఉద్యమ కర్తలలో అతివాద ధోరణి ప్రబలింది. అనేకులు నిర్మాణ కార్యక్రమం, బహిష్కరణ కార్యక్రమం విఫలమైనదనీ, కాంగ్రెసు శాసనోల్లంఘన కార్యక్రమాన్ని ప్రారంభించ వలసిన సమయం ఆసన్నమైనదని అభిప్రాయ పడినారు.

ఇంతేగాక, గాంధీ యొక్కయు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంయొక్కయు అభిప్రాయం ఏలాటిదిగా ఉండినా రాష్ట్రాలనేకంలో స్థానిక నాయకులు వారివారి ప్రాంతాల పరి

స్థితులకు అనుగుణంగా—సమష్టి శాసనోల్లంఘన కార్యక్రమంలోకి దిగారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి చీరాల పేరాల సంఘటన వీటిలో ఒకటి (వీటిలో కొన్నిటిని గురించి తర్వాత వివరిస్తున్నాను.) ఈ పరిణామాలను గమనించి నవంబరు 5 న ఢిల్లీలో సమావేశమైన అఖిల భారత కాంగ్రెసు కమిటీ శాసనోల్లంఘనకార్యక్రమాన్ని సాగించవలసిందిగా తీర్మానించింది. కాని దానిని అన్ని ప్రాంతాలలో విచక్షణ రహితంగా సాగించుటకు బదులు ఏయే ప్రాంతాలలో నిర్మాణ కార్యక్రమం విజయవంతంగా జరిగిందో, ప్రజలు అహింసపట్ల విశ్వాసం కలవారయ్యారో ఆ ప్రాంతాలలోనే దానిని సాగించవలసిందిగా రాష్ట్ర కాంగ్రెసు సంఘాలకు సలహా ఇచ్చింది.

ఈ తీర్మానానుసారం గుజరాతులోని బర్డోలీ తాలూకాలో పరిస్థితులన్నీ అనుకూలంగా ఉండడంచేత పన్నుల నిరాకరణతోసహా సమష్టి శాసనోల్లంఘన కార్యక్రమాన్ని అక్కడ స్వయంగా తన పర్యవేక్షణలో నవంబరు 23 నుండి సాగించుటకు గాంధీ సిద్ధపడ్డాడు. దీనితో సహాయనిరాకరణ ఉద్యమం నిర్మాణ కార్యక్రమం బహిష్కరణ దశలనుదాటి శాసనోల్లంఘనమనే మూడవదశలోకి ప్రవేశించింది. ఈలాటి శాసనోల్లంఘనము శాంతియుతమైన తిరుగుబాటు వంటిదే.

కాని ఈ మధ్యకాలంలో బర్డోలీ కార్యక్రమానికి ఒక ప్రతిబంధకం సంభవించింది.

జార్జి సార్వభౌముని కుమారుడు వేల్సు యువరాజు నవంబరు 17 న భారత దేశానికి వచ్చి కొన్ని వారాలపాటు పర్యటించేటట్లు ప్రభుత్వం కొన్ని నెలలక్రిందట నిర్ణయించింది. ప్రజలదృష్టిని సహాయ నిరాకరణ ఉద్యమాననుండి మరలించి వారిలో ప్రభుభక్తిని బలపరచే ఉద్దేశంతో ఆయన వస్తున్నాడనే భావంతో కాంగ్రెసు నిర్వాహకవర్గం జూలైలో సమావేశమై ఆయన భారత దేశంలో అడుగు పెట్టిన రోజున అన్ని నగరాలలోను గ్రామీణ ప్రాంతాలలోను శాంతియుతంగా హర్తాలుజరిపి, ఆయనరాకను ప్రజలు బహిష్కరించవలసిందిగా తీర్మానం చేసింది.

ఈ తీర్మానానుసారం అన్ని నగరాలలో శాంతియుతంగా నవంబరు 17 న హర్తాలు జరిగింది. కాని బొంబాయి నగరంలో ఆరోజున అల్లరులు ప్రారంభమై 21 వరకు అవిదారుణంగా సాగాయి. యువరాజు రాకసందర్భంగా ప్రభుత్వం ఏర్పాటుచేసిన ఉత్సవాలలో అనేకులు పాల్గొన్నారు. వారిలో పార్శీలు, యూరోపియన్లు, ఆంగ్లో ఇండియన్లు ప్రధానపాత్ర వహించారు. వారు ఉత్సవాలలో పాల్గొని తిరిగి వారి వారి ఇండ్లకు వచ్చే సమయంలో ప్రజలు వారిని అడ్డగించి, వారిపై అనేక దౌర్జన్య చర్యలను సాగించారు. పార్శీస్త్రీలు ప్రత్యేకంగా ప్రజల క్రోధానికి పాత్రులైనారు. వారిపై అనేక అత్యాచారాలు గావింపబడినాయి. వారూ, యూరోపియన్లు, ఆంగ్లోఇండియన్లు ప్రజలపై పగసాధించే ఉద్దేశంతో 18 నుండి ధారాళంగా తుపాకులను ఉపయోగించారు. రెండు వర్గాలమధ్య కొట్లాటలు ఉచ్చస్థాయిని అందుకొన్నాయి. పోలీసువారు వీటిలో జోక్యం కలిగించుకొని వారికి తోచినట్లు కాల్పులు సాగించారు. వీటి అన్నిటి ఫలితంగా 53 మంది మరణించారు. వారిలో 45 మంది సహాయ నిరాకరణ ఉద్యమానికి చెందినవారు. 400 మందికిపైగా గాయపడినారు.

ఆ రోజులలో గాంధీ బొంబాయిలోనే ఉన్నారు, ఆయన ప్రజలమధ్య ప్రవేశించి

వారు శాంతియుతంగా ప్రవర్తించవలసిందిగా బ్రతిమాలాడు. కాని ఎవరూ ఆయన మాటను వినలేదు. ఆయన నిర్ఘాంతపోయ్యాడు. అనేక సంవత్సరాలుగా ఆయనచేసిన అహింసా ప్రచారం వ్యర్థమైనట్లు ఆయన భావించాడు. ప్రాయశ్చిత్తంగా అయిదు రోజులపాటు ఉపవాసం చేశాడు. అల్లరిమూకలు తలపెట్టిన స్వరాజ్యం తనకు విసుగుకలిగిస్తున్నదని ఆక్రోశించాడు. ప్రజలు ఇంతటి హింసకు పాల్పడెదరని ఆయన కలలో గూడా ఊహించలేదు.

ఈలాటి పరిస్థితులలో బర్డోలీలో సత్యాగ్రహాన్ని సాగించడం సమంజసం కాదనే భావంతో దానిని వాయిదా వేశాడు. ఆయన దృష్టిలో సమిష్టి శాసనోల్లంఘనానికంటె అహింస ఎక్కువ ప్రాధాన్యం వహించ తగినది. ఈ రెండింటిమధ్య సంఘర్షణ సంభవించినప్పుడు ఆయన అహింసపట్లనే మొగ్గడం ఆయన ప్రకృతి. కాని ఈ వాయిదావేయడం ఆయన అనుచరులు కొందరికి అంగీకారం కాలేదు. బొంబాయిలో దౌర్జన్య చర్యలకారణంగా వందల మైళ్ళదూరంలో ఉండే బర్డోలీ తాలూకాలో సాగవలసిన ఉద్యమాన్ని వాయిదావేయడం ఎందుకు? అని చిత్తరంజన్‌దాస్ ఆయనను విమర్శించాడు. కాని ఈ విమర్శను ఆయన పట్టించుకోలేదు. ఖిలాఫత్ ఉద్యమానికి చెందిన కొందరు ముస్లిం నాయకులుకూడా ఈ ధోరణిలోనే విమర్శలు చేశారు. అవికూడా ఆయనపై ఎలాటి ప్రభావాన్ని వహించలేదు.

## 3

బొంబాయి అల్లరులు, యువరాజు రాక సందర్భంలో జరగడం ప్రభుత్వ వైఖరిలో గొప్ప మార్పును తెచ్చాయి. అప్పటివరకు కేంద్రప్రభుత్వం ఉద్యమాన్ని అణచుటకు దమన విధానాన్ని అనుసరించినా అది రౌలెట్టు సత్యాగ్రహం కాలంనాటివలె హద్దులు మీరలేదు. ఉద్యమంలో పాల్గొనే వారిపట్ల విచక్షణతో ప్రవర్తించ వలసిందిగా కేంద్రం రాష్ట్రప్రభుత్వాల నన్నిటిని ఆదేశించడంచేత ఒడయర్ డయ్యరువంటి వార్లకు విశృంఖలంగా కఠిన చర్యలు తీసుకొనే అవకాశం సన్నగిల్లింది. 1920 నాటికీ 1921-22 కూ ఇదియే గొప్పభేదం. కాని బొంబాయి అల్లరులు సంభవించిన తర్వాత ప్రభుత్వవైఖరిలో గొప్ప మార్పువచ్చింది. ఆగస్టులో మాప్లా తిరుగుబాటు జరిగినప్పటినుంచి దేశంలో మొత్తంమీద దౌర్జన్య వాతావరణం పెరిగినట్లు ప్రభుత్వం భావించింది. బొంబాయి అల్లరులు ఈ భావాన్ని బలపరచి కఠినచర్యలకు దారితీసింది. ఆయా రాష్ట్రాలకు అనుగుణంగా రాష్ట్ర పరిపాలకులు శాంతి భద్రతలను రక్షించుటకు వారి ఇష్టానుసారం చర్యలు తీసుకొనుటకు అనుమతించింది.

దీని ఫలితంగా బెంగాలు, మరికొన్ని రాష్ట్రాల ప్రభుత్వాలు స్వచ్ఛంద సైనిక దళాలను (Volunteer Corps) అక్రమ సంఘాలుగా ప్రకటించి వాటి చర్యలను ఆపివేశాయి. రాజద్రోహ సభలు చట్టాన్ని అములులోకి తెచ్చి సభలు సమావేశాలు జరగరాదని నిషేధించాయి. పత్రికల స్వేచ్ఛపైన వాక్స్వాతంత్ర్యంపైన కఠినమైన ఆంక్షలు విధించాయి. కాంగ్రెసు కార్యక్రమాలు స్తంభించి పోయాయి.

సహాయ నిరాకరణ ఉద్యమాన్ని సాగించడంలో మొదటినుండీ స్వచ్ఛంద బృందాలు గొప్ప పాత్రను వహించాయి. యుద్ధంలో సైనికులు ఏలాటి కృషిచేస్తారో ఆలాంటి కృషినే ఈ బృందాలు చేశాయి. పికెటింగ్ జరపడంలోను, సమావేశాలను ఏర్పాటుచేసి అవి సక్రమంగా సాగడంలోను, విరాళాలను వసూలుచేయడంలోను అవి అమోఘమైన కృషి చేశాయి.

ఆగస్టునాటికి పీటి సంఖ్య 345 కూ పీటిలోని సభ్యులసంఖ్య 15, 186 కు పెరిగినాయి. ఇవి గాక బెంగాలులో 404 సేవా సమితులు ఉండినవి. ఉత్తర ప్రదేశ్‌లో 80.000 స్వచ్ఛంద సైనికులు ఉన్నట్లు ఒక అంచనా.

ప్రథమంలో కొంత చదువును సాగించినట్టిన్ని సంస్కారం కలిగినట్టిన్ని క్రమ శిక్షణకు అలవాటు పడినట్టిన్ని విద్యార్థులు యువకులు వాలంటీరు దళాలలో చేరారు. కాని క్రమ క్రమంగా రౌడీలకుకూడా పీటిలో ప్రవేశం కలిగింది. ఈలాంటివారి మూలంగానే స్వచ్ఛంద బృందాలు దౌర్జన్యానికి పాలుబడడం జరుగుతున్నదనే అభిప్రాయం అధికారులలో వ్యాపించి అవి అక్రమ సంఘాలుగా ప్రకటింప బడినాయి.

ఈ ప్రకటన మూలంగా సహాయ నిరాకరణ ఉద్యమం చల్లబడిపోయే ప్రమాదం ఉన్నట్లు చిత్తరంజన్‌దాసు భావించాడు. ప్రకటనలు ఫలితంగా స్వచ్ఛంద సైనికుల సంఖ్య పూర్తిగా తగ్గింది. అలాటి సమయంలో ప్రకటనను ఉల్లంఘించుటకు దాస్ సిద్ధపడ్డాడు. నవంబరు ఆఖరున బెంగాలురాష్ట్ర సమావేశం జరిగి శాసనోల్లంఘనాన్ని అనుసరించవలసిందిగా తీర్మానం చేసి, దాస్‌కు సర్వాధికారం దత్తంచేసింది. దానిని పురస్కరించుకొని దాస్ రంగంలోకి ఉరికాడు.

ప్రథమంలో తన కుమారుని, మరుసటిరోజున తన భార్యను స్వచ్ఛందసేవకులుగా ఖద్దరు అమ్మకం చేయవలసిందిగా వీధులలోకి పంపాడు. పోలీసులు వారిని అరెస్టుచేసి జైలుశిక్షను విధించారు. దాస్ కుటుంబానికి చెందినవారు శిక్షకు పాత్రులుకావడం కలకత్తా నగరంలోనే కాక రాష్ట్రమంతట అలజడికి కారణమైంది. దీనిఫలితంగా యువకులు స్త్రీలు వేలసంఖ్యలో శాసనో ల్లంఘనం చేశారు. ఇతరరాష్ట్రాలలోకూడా ఈలాగే జరిగింది. జైళ్ళు నిండిపోయినవి. జైళ్ళలో స్వచ్ఛంద సైనికులను నిర్బంధించడం సాధ్యంకాక వారినికొట్టి గాయపరచి ఇండ్లకు పంపి వేయడం అవసరం అయింది. స్త్రీలను ఊరిబయటకు చాలాదూరం తీసుకొనివెళ్ళి వదలివేయడం వారు నానా బాధలకు గురియై తిరిగి తమ ఇండ్లకు ఎలాగోరావడం జరగసాగింది. డిసంబరు 10 న దాస్‌కూడా శాసనోల్లంఘనం చేయడంచేత జైలుశిక్షకు పాత్రుడయ్యాడు. మోతిలాల్ నెహ్రూ. లజపతిరాయ్ మొదలైన నాయకులందరు నిర్బంధంలో ఉంచబడినారు. దేశంలో ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది.

దారుణ రూపాన్ని ధరించిన ఈ దమన విధానాన్ని మితవాదులు కూడా నిరసించ దొడగారు. వారుకూడా ప్రభుత్వంతో సహకరించడం మానుకొని సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించే ప్రమాదం ఏర్పడినట్లు వైస్రాయి రీడింగు భావించాడు. దాస్‌తో సంప్రతింపులు సాగించి ఏదో ఒక రాజీకి రాగలిగిన పక్షంలో మితవాదులకు కూడా సంతృప్తి కలుగ గలదని మాళవ్యా ద్వారా సంప్రతింపులు సాగించ నిర్ణయించుకొన్నాడు.

ఈ నిర్ణయానికి ఇంకొక కారణం కూడా ఉండినది. డిసంబరు 24న వేల్సు యువరాజు కలకత్తా నగరం రావలసి ఉండినది. అప్పటికి నగరంలో శాంతియుతమయిన వాతావరణం ఏర్పడడం సర్వ విధాలా వాంఛనీయమని రీడింగు భావించాడు. ఈలాటి కారణాల ఫలితంగా కాంగ్రెసువారు డిసంబరు 24న హర్తాలు మానుకొనుటకు, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఉప సంహరించుకొనుటకు అంగీకరించిన పక్షంలో ప్రభుత్వం నిర్బంధితులయిన రాజకీయ

ఖైదీలను విడుదల జేయుటకును, కాంగ్రెసుతో సహా అన్ని పక్షాల నాయకులతో కూడిన ఒక రౌండుటేబిల్ సమావేశాన్ని జరిపి రాష్ట్రాలలోని బాధ్యతాయుత ప్రభుత్వాన్ని మరింత విశాల పరచే సంస్కరణలను ప్రవేశపెట్ట గలదని తెలియ పరచాడు.

జైలులో ఉండిన దాస్ అజాదుతో చర్చించి, సహాయ నిరాకరణ ఉద్యమం విజయవంతంగా ముగియగల అవకాశం ఏర్పడినట్లు భావించి వైస్రాయి చేసిన సూచనలను అంగీకరించవలసిందిగా అహమ్మదాబాదులో ఉండిన గాంధీకి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. గాంధీ అలీ సోదరులను మరికొందరిని విడుదల చేయవలసినదిగాను మరికొన్ని షరత్తులకు వైస్రాయి అంగీకరించవలసిందిగాను కోరాడు. 17న ప్రారంభమయిన ఉత్తర ప్రత్యుత్తరాలు 21 నాటికి కూడా పూర్తి కాలేదు. యువరాజు డిసంబరు 24న కలకత్తా రావలసి ఉండినది. సకాలంలో దాస్ గాంధీల నుండి జవాబు రాని కారణంగా వైస్రాయి విసుగు జెంది సంప్రతింపుల ప్రయత్నాన్ని 21న మానుకొన్నాడు.

ఈ పరిణామం దాసుకు అత్యంత ఆశాభంగాన్ని కలిగించింది. ఆలస్యానికి గాంధీయే కారణమని, సహాయ నిరాకరణ ఉద్యమం విజయవంతంగా ముగిసే అవకాశం తప్పిపోయిందని దాసు భావించాడు. ఇద్దరి నాయకుల మధ్య ఇది మనస్పర్థలకు కారణమైంది.

మితవాదులు కూడా ఈలాగే భావించారు. సంప్రతింపులకు వైస్రాయి సుముఖుడుగా ఉండినా ఏవో షరత్తులను విధించి గాంధీ వాటికి భంగం కలిగించాడనే అభిప్రాయం వారిలో ఏర్పడింది. వారు యథాపూర్వంగా ప్రభుత్వాన్ని సమర్థించే వారయ్యారు. వారు కాంగ్రెసు వారితో కలిసిపోయ్యే ప్రమాదం తప్పిందని ప్రభుత్వం సంతోషించింది. డిసంబరు 24 న యువరాజు రాక సందర్భంలో కలకత్తా నగరాన హర్తాలు జరిగినా అది ఏలాటి అల్లరులకు దారి తీయలేదు. కాని ప్రభుత్వం అనుసరించిన దమన విధానంలో ఏలాటి మార్పూ రాలేదు.

## 4

బర్డోలీ శాసనోల్లంఘనాన్ని గాంధీ వాయిదా వేయడం దాస్ వంటి వారికి అసంతృప్తి కలిగించిందని ఇదివరకే తెలుసుకొన్నాము. ఖిలాఫత్ ఉద్యమానికి చెందిన అతివాద ముస్లింలలో కూడా శాసనోల్లంఘనం ఒక్కటే ఆచరణ యోగ్యమనే అభిప్రాయం వ్యాపించింది.

ఈలాటి వాతావరణంలో కాంగ్రెసు డిసంబరు 26న అహమ్మదాబాదులో సమావేశమైంది. దానికి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన చిత్తరంజన్‌దాసు జైలులో ఉండడంచేత ఆయన స్థానంలో హాకీం అజ్మాల్‌ఖాన్ అధ్యక్షతుగా సమావేశం జరిగింది. సహాయ నిరాకరణోద్యమాన్ని మరింత పట్టుదలతో సాగించవలసిందిగాను, శాసనోల్లంఘన కార్యక్రమాన్ని వెంటనే ప్రారంభించవలసిందిగాను సమావేశం తీర్మానించింది. ఖిలాఫత్ ఉద్యమానికి చెందిన హసరత్ మోహినీ మొదలైన అతివాదులు భారతదేశం బ్రిటన్‌తో ఏలాటి సంబంధం లేని ప్రజారాజ్యంగా (Republic) రూపొందవలెనని, అహింసతో నిమిత్తం లేకుండా ప్రభుత్వంతో పోరాటాన్ని సాగించవలెనని ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. గాంధీ వారి అభిప్రాయాలను ఖండిస్తూ ఒక గొప్ప ఉపన్యాసం చేశాడు. ఈలాటి తీర్మానాలు చేయుటకు సిద్ధపడిన పక్షంలో: "ప్రపంచములోని మేధావులందరును మనలను ఆత్మశక్తి నెరుగనివారుగా నిందింతురు. మన హద్దులను మనమెరిగియుండవలెను. హిందూ మహమ్మదీయుల మధ్య నిరంతరాయమైన సఖ్యత కుదురవలెను. నేడు

హిందూ మహమ్మదీయుల మధ్య సంపూర్ణ సఖ్యత కలదని నమ్మకముగ చెప్పగలవారెవరైన ఈ సభలో ఉన్నారా? (మాప్లా తిరుగుబాటులో జరిగిన హింసాకాండలు, మరికొన్ని ప్రాంతాలలో సంభవించినట్టి వాటిని ఆయన స్మృతిపథంలో ఉంచినవి). పార్శీలు గాని, శిక్కులు గాని క్రైస్తవులు గాని, యూదులు గాని, అస్పృశ్యులు గాని నేటి ఈ మార్పున కంగీకరింతురని నమ్మకముగా చెప్పగల వారెవరైనా ఈ సభలో ఉన్నారా? (నవంబరు 17న బొంబాయిలో సంభవించిన అల్లరులను ఆయన మరవలేదు). నేటి మధ్యాహ్నమే కదా అస్పృశ్యుల గురించి మీరు విన్నది. ముందు మన బలమును మనము కూడదీసుకొనవలెను. లోతు తెలియని నీళ్ళలోకి మన మురకరాదు. హజరత్ మోహినీ యొక్క ఈ తీర్మానము మనలను పాతాళములోనికి తీసుకొని పోగలదు.” అని ఆయన సభవారిని మందలించడంతో తీర్మానము వీగి పోయినది. సమావేశమునకు వచ్చిన వారిలో అనేకులు స్వరాజ్యము ఒక సంవత్సరములో లభించగలదని గాంధీ ఇంతకు పూర్వము అనేక పర్యాయములు చెప్పిన మాటలు ఆయనకు జ్ఞాపకము చేశారేగాని నిర్మాణ కార్యక్రమమును సాగించి స్వరాజ్యానికి ప్రజలు అర్హులు కావలసి ఉన్నదని ఆయన చేసిన హెచ్చరికను వారు విస్మరించారు. ఇది ఆయనకు ఎంతో విచారం కలిగించింది. శాసనోల్లంఘనమును ప్రారంభించవలసిందిగా తీర్మానాన్ని నావించిన అహమ్మదాబాదు కాంగ్రెసు, కాంగ్రెసు వ్యవహారాలన్నీ సత్వరంగాను సౌష్ఠవంగాను జరుగుటకు వీలుగా సంపూర్ణ కార్య నిర్వహణాధికారాన్ని గాంధీకి సమర్పించింది. దీని ఫలితంగా ఆయనకు ఒక విధమైన నియంతృత్వాధికారం (Dictatorial Power) లభించింది.

అహమ్మదాబాదు సమావేశం ముగిసిన వెంటనే బర్దోలి శాసనోల్లంఘన కార్యక్రమాన్ని సాగించడం గాంధీకి అవసరమయింది. కాని ఆలాటి కార్యక్రమం మూలంగా ప్రభుత్వాన్ని ధిక్కరించే కార్యక్రమాలు దేశమంతటా వ్యాపించి అరాజక పరిస్థితులు ఏర్పడే ప్రమాదం ఉన్నదని మితవాద నాయకులలో అగ్రగణ్యులయిన మాళవ్యా, జిన్నా, జయకర్ మొదలైన వారు భావించి, కాంగ్రెసుకూ ప్రభుత్వానికీ రాజీ కుదిర్చే ఉద్దేశంతో జనవరి 14, 15 లలో బొంబాయి నగరంలో ఒక అఖిలపక్ష సమావేశాన్ని సమావేశపరచారు. గాంధీ దానికి ఒక ప్రేక్షకుడుగా హాజరయ్యాడు. సమావేశ కర్తలు వైస్రాయి ఒక రౌండు టేబిల్ సమావేశాన్ని జరిపి అన్ని పక్షాల నాయకులతో చర్చలు జరిపించవలసిందిగా సూచించారు. అప్పటివరకు తాను బర్దోలి కార్యక్రమాన్ని వాయిదా వేయుటకు సిద్ధంగా ఉన్నట్లు గాంధీ తెలియపరచాడు. సమావేశం చేసిన సూచన వైస్రాయికి అంగీకారం కాలేదు. బర్దోలి కార్యక్రమాన్ని గాంధీ వాయిదా వేశాడే గాని సహాయ నిరాకరణోద్యమాన్ని పూర్తిగా ఉపసంహరించుకొనలేదని చెప్పి వైస్రాయి తన నిర్ణయాన్ని సమర్థించాడు. అఖిలపక్ష సమావేశం విఫలం కావడంతో గాంధీ బర్దోలీ కార్యక్రమాన్ని సాగించడంలో కృతనిశ్చయుడై ఫిబ్రవరి 1న వైస్రాయికి ఒక లేఖ వ్రాసి అందులో తాను శాసనోల్లంఘనానికి ఎందుకు పూనుకొనవలసి వచ్చినదీ స్పష్టం చేశాడు. అందులో కొన్ని సూచనలు చేసి, వైస్రాయి వాటికి అంగీకరించిన పక్షంలో ఆ కార్యక్రమాన్ని విరమించుకొనుటకు సంసిద్ధుడుగా ఉన్నట్లు తెలియపరచాడు. కాని ఆయన లేఖ వైస్రాయి వైఖరిలో ఏలాటి మార్పునూ తేలేక పోయింది.

గాంధీ బర్దోలిలో శాసనోల్లంఘన కార్యక్రమాన్ని సాగించడం పట్ల దేశంలోని ప్రజలూ అధికారులూ ఎక్కువ ఆదుర్దాను ప్రదర్శించారు. అక్కడ కార్యక్రమం విజయవంత

మయిన పక్షంలో తక్కిన ప్రాంతాలలో ఆలాటి ఉద్యమాన్ని సాగించుటకు ప్రజలు సిద్ధంగా ఉండినారు. ఆయన కార్యక్రమం ఒక విధమైన శాంతియుత తిరుగుబాటు. అందుచేతను కూడా దాని ఫలితాలు ఏలాగు ఉండగలదో అని అందరు వీక్షించ సాగారు.

కాని ఈ మధ్యకాలంలో గాంధీ దృష్టిలో అవాంఛనీయంగా పరిగణించబడిన సంఘటన ఒకటి సంభవించింది. ఫిబ్రవరి 4న ఉత్తరప్రదేశ్ గోరక్‌పూరు జిల్లాలోని చౌరిచౌరా గ్రామంలో కాంగ్రెసువారు ఊరేగింపు జరుపుతూ ఉండగా పోలీసువారు వారిపై అనవసరంగా కాల్పులు జరిపారు. ప్రజలు కోపోద్రేకులై పోలీసులపై తిరుగుబాటు చేయగా పోలీసులు స్వీయ రక్షణార్థం సమీపంలో ఉన్న ఒక భవనంలో దాగుకొన్నారు. ప్రజలు దానికి నిప్పు అంటించగా అందులో కొందరు చనిపోయ్యారు. తక్కిన పోలీసులు బయటికి రాగానే మూకవారిని పట్టుకొని చంపి వారి మృతదేహాలను మంటలలో పడవేసింది. దేహాలన్నీ (వాటి సంఖ్య 22) భస్మీభూతములై పోయినవి, అదే సమయంలో ఈలాటి సంఘటన మరియొకటి బెరెల్లి నగరంలో (ఇది కూడా ఉత్తర ప్రదేశ్‌లోనిదే) సంభవించింది. స్వచ్ఛంద సైనికుల ఈ రాక్షసకృత్యాలను ఉత్తరప్రదేశ్ నాయకులు సుమారు యాభై మంది ఖండించారు. నాయకులు కొందరు సహాయ నిరాకరణోద్యమాన్ని వెంటనే ఆపివేయవలసినదిగా గాంధీని అర్థించారు. ఆయనకు కూడా ఈ హింసాకాండలు ఎంతో విచారాన్ని కలిగించాయి. ఫిబ్రవరి 8న బర్డోలి శాసనోల్లంఘన కార్యక్రమాన్నే గాక సహాయ నిరాకరణోద్యమాన్ని దేశంలోని అన్ని ప్రాంతాలలో ఉపసంహరించవలసినదిగా ఆదేశించాడు. కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం ఫిబ్రవరి 12, 13 తేదీలలో బర్డోలీలో సమావేశమై ఆయన ఆదేశాన్ని దృఢపరచింది. 24, 25 తేదీలలో డిల్లీలో సమావేశమయిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ దీనిని ఆమోదించింది. కాని ఈ ఉపసంహరణ తాత్కాలికమేనని, పరిస్థితులు అనుకూలించినప్పుడు ఉద్యమాన్ని తిరిగి సాగించే అవకాశమున్నదని ఉద్ఘాటించి, ఈ మధ్యకాలంలో కాంగ్రెసు వారందరు నిర్మాణకార్యక్రమాన్ని సాగించవలసిందిగా ఆదేశించింది. ఉపసంహరణ తాత్కాలికము మాత్రమే అనే అభిప్రాయం ప్రభుత్వ దృష్టిని ఆకర్షించి, మార్చి 10న గాంధీ అరెస్టుకు కారణమైంది.

ప్రభుత్వాన్ని లొంగదీయుటకు శాసనోల్లంఘన కార్యక్రమం ఒక్కటే సాధనంగా అప్పటికి అనేకులు భావించి ఉండినారు. అందుచేతనే అహమ్మదాబాదు కాంగ్రెసు దానికి సుముఖంగా తీర్మానం చేసింది. దానికి విరుద్ధంగా ఫిబ్రవరి 8 న గాంధీ ఉద్యమాన్ని పూర్తిగా ఉపసంహరించడం వారికి ఆశాభంగాన్ని కలిగించింది. ఫిబ్రవరి 25, 26 తేదీలలో డిల్లీలో ఖిలాఫత్ మహాసభ జరిగినప్పుడు ముస్లింనాయకులు కొందరు బర్డోలీ తీర్మానాన్ని లక్ష్యపెట్టక ముస్లింలు ఖిలాఫత్ ఉద్యమాన్ని సాగించడం వాంఛనీయమనే అభిప్రాయాన్ని వ్యక్తపరచారు. మార్చి 9 అజ్మీరులో సమావేశమైన ముస్లిం ఉలేమాలయొక్కయు. అతివాదుల యొక్కయు సమావేశంలో హిందువుల సహకారం ఉన్నా లేకపోయినా ఉద్యమాన్ని సాగించవలసిందిగా తీర్మానం చేసేసమయంలో గాంధీ జోక్యం కలిగించుకొని అతికష్టంమీద వారిని సమాధానపరచాడు. హిందువుల సహకారంపట్ల వారికి ఇదివరకు ఉండిన ఉత్సాహం చాలావరకు తగ్గినట్లు ఈ పరిణామాలు స్పష్టంచేశాయి. ప్రభుత్వం వీటినిగూడా గమనిస్తూనే ఉండినది. మరునటిరోజు ప్రభుత్వం గాంధీని అరెస్టు చేయడంతో ఇదికూడా కొంత ప్రభావం సహించింది. హిందువులు ముస్లింలు కలిసికట్టుగా ప్రవర్తిస్తూ ఉండినకాలంలో ఆయనను అరెస్టుచేయడం ప్రమాదం అనే

భావంతో ఉండిన ప్రభుత్వం బర్డోలీ తీర్మానంతర్వాత ముస్లింల వైఖరిలో కలుగుతున్న మార్పు దృష్ట్యా తనభావాన్ని మార్చుకొన్నది.

ఫిబ్రవరి 8 వ ఉద్యమాన్ని ఉపసంహరిస్తూ గాంధీచేసిన తీర్మానం కాంగ్రెసుకు చెందిన ప్రముఖనాయకు లనేకులను ఆగ్రహపరవశుల చేసింది. వారుకూడా ఆయనను తీవ్రంగా ఖండించారు. వారిఖండన ముస్లింల అసంతృప్తికంటే దేశంలోని రాజకీయాలపైన, ప్రభుత్వ వైఖరిపైన ఎక్కువ ప్రభావాన్ని వహించింది. మోతీలాల్ నెహ్రూ, లజపత్‌రాయ్, దాస్ మొదలైన వారికి అహింసాతత్వంలో పూర్తివిశ్వాసం లేదు. ప్రజలు హింసను పూనినారనే కారణంగా శాసనోల్లంఘన కార్యక్రమాన్ని పదేపదే ఆయన వాయిదావేయడం వారికి ఎంతమాత్రం రుచించలేదు. వా రేవిధముగ గాంధీని ఖండించారో పట్టాభి సీతారామయ్యగారు వారి కాంగ్రెసు చరిత్రలో వ్రాసిన ఈ క్రింది మాటలు స్పష్టపరచగలవు:

"అసహాయోద్యమమును ఒక్కసారిగా నిలిపివేసినందుకు గాంధీకి ప్రతికూలముగా ఒక గగ్గోలు పుట్టింది. పండిత మోతీలాల్, లాలా లజపతిరాయ్‌లు కారాగృహమునుండి గాంధీకి పెద్దపెద్ద ఉత్తరములు వ్రాసిరి. ఎక్కడో ఒకచోట జరిగిన నేరములకు యావత్తు భారత దేశమును శిక్షించినందుకు వారు గాంధీని నిందించిరి. 'కన్యాకుమారి అగ్రముకొట్ట కొననున్న గ్రామములో అహింస అవలింపబడనందుకు హిమాలయ పర్వత శిఖరమునకు దగ్గరగానున్న పట్టణమేల శిక్షింపబడవలయును?' అని పండితుడు ప్రశ్నించెను. అవసరమైతే చౌరిచౌరాను, గోరక్‌పురమును కూడ మినహాయించి, వ్యక్తి సమిష్టి శాసనోల్లంఘనములను కొనసాగింపవలసినదే అని మోతీలాల్, లాలాజీ, మరియిద్దరు ప్రముఖులు గాంధీకి వ్రాసిరి. వారందరును ఆకస్మికముగ అసహాయోద్యమమును ఆపివేయబడుట మూలమున తమకు కలిగిన ఆశాభంగమును, అసంతృప్తిని, విసుగును తమ ఉత్తరములలో స్పష్టముగ ప్రకటించిరి. ఈ ఉత్తరములు ఫిబ్రవరి 24 న ఢిల్లీలో డాక్టరు అన్సారీ ఇంటియందు జరిగిన అఖిల భారత కాంగ్రెసుసంఘ సభ్యుల ఇష్టాగోష్ఠి సభలో చదువబడినవి. ఆ సభా సభ్యులలో సి. ఐ. డి. ఉద్యోగస్తులు కూడా కలిసి యుండిరి. ఈ విషయము తరువాత తెలియ వచ్చింది. వారక్కడి ఆ విషయములను జాగ్రత్తగా గమనిస్తూనే ఉండిరి. ఈ ఉత్తరములకు ప్రతిగా గాంధీ ఒకమాట చెప్పెను. 'జైలులో ఉన్నవారు పౌరులుగా మృతినొందినట్లే. వారికి జైలు వెలుపల నున్నవారికి సలహాఇచ్చే అధికారము లేదు' అని ఆయన స్పష్టముగా నుడివెను. కాని తరువాత అఖిలభారత కాంగ్రెసు కమిటీ నిజముగా సమావేశమైనప్పుడు సభ్యులలో క్రోధాగ్ని ప్రదర్శితమైనది. అన్నివైపులనుండి గాంధీపైన తిరుగుబాటు బయలుదేరినది. ఉద్యమ మాపివేయబడినందుకు గాంధీ తీవ్రముగ విమర్శింపబడెను. ముఖ్యముగ బార్డోలీ తీర్మానమునకు ఆయన నిందింపబడెను. వంగరాష్ట్ర ప్రతినిధులు ఆయనను తుత్తునియలు చేసిరి." మహారాష్ట్ర నాయకుడైన ముంజి గాంధీపైన విశ్వాసరాహిత్య తీర్మానమునుకూడా ప్రతిపాదించెను. కాని అది వీగిపోయినది. అయినా పై ఉదంతమంతా గాంధీపై తక్కిన నాయకులలో అధికసంఖ్యాకులకు ఎంతటి క్రోధము ఏర్పడినదో స్పష్టం చేస్తూఉంది.

సహాయ నిరాకరణ ఉద్యమమనే భవనానికి ముస్లింలు, మోతీలాల్‌వంటి నాయకులు, రాష్ట్రాలలోని ఉద్యమాన్ని సాగిస్తూఉండిన స్థానిక నాయకులు మూడు మూలస్తంభాలు. కాని

బార్డోలీ తీర్మాన ఫలితంగా వీ రందరు ఆశాభంగాన్ని పొందడంచేత మూలస్తంభాలు విరిగి క్రింద పడిపోయినవి. దానితో భవనంకూడా కూలిపోయింది.

గాంధీని సమర్థించేవారి సంఖ్య తరిగిపోవడంతో ప్రభుత్వం ఆయనను అరెస్టు చేయుటకు నిర్ణయించింది. 1921 సంవత్సరం పొడుగునా రాష్ట్రగవర్నరులు, బ్రిటన్‌లోని అధికారులు భారత ప్రభుత్వాన్ని ఆయనను అరెస్టుచేయవలసిందిగా ఒత్తిడిచేసినా ప్రభుత్వం ఆప్రయత్నంలోకి దిగలేదు. దేశంలో ఉద్యమం తీవ్రంగా జరుగుతున్నప్పుడు, నాయకులందరు ఆయనను సమర్థించుచున్నప్పుడు. ముస్లింలు ఆయనతో సహకరిస్తున్నప్పుడు ఆయనను అరెస్టు చేయడం దౌర్జన్యాలకు దారితీయగలదని ప్రభుత్వం భావించింది. అరెస్టు చేయవలసిందిగా ప్రభుత్వం తలపెట్టిన రెండు మూడు సమయాలలో స్మట్సు హెచ్చరించడంచేత ఆ సంకల్పాన్ని మానుకొన్నది. కాని బర్డోలీ తీర్మానం జరిగిన తర్వాత దేశంలో ఆయనకుగల ఆదరణ తగ్గినదని భావించి, ఆయనను అరెస్టు చేసినా ఏలాటి ప్రమాదమూ సంభవించదనే విశ్వాసంతో మార్చి 10 న ఆయనపై రాజద్రోహ నేరమును ఆరోపించి అరెస్టుచేసింది. 18 న అహమ్మదాబాదు న్యాయస్థానంలో ఆయన విచారణ జరిగింది.

రాజద్రోహ నేరము చేసినట్లు ఆయన అంగీకరించాడు. ఒకప్పుడు రాజభక్తి పరాయణుడుగ ఉండిన తాను రాజద్రోహమును ఎందుకు చేసినది ఆయన వాంగ్మూలములో విశదపరచాడు. ఖిలాఫత్ విషయంలోను పంజాబు దురంతాల విషయంలోను బ్రిటిష్ ప్రభుత్వం చేసిన అన్యాయాలు కారణంగాను బ్రిటిష్‌వారు భారతీయుల శ్రేయస్సుపట్ల విముఖులగుటయే గాక వారిని పరిపరివిధాలా కష్టాలపాలు చేసినకారణంగాను రాజద్రోహమును చేయడం తన కర్తవ్యమైనదని స్పష్టపరచాడు. "నేను వివరింప ప్రయత్నించిన ఈ పై నేరమునకు తాము కారణభూతులమనే సంగతి భారతదేశ పరిపాలనముతో సంబంధముగల బ్రిటిష్‌వారికి గాని, భారతీయులకు గాని తెలియకపోవుట చాలాదురదృష్టము. బ్రిటిష్ అధికారులును, భారతీయాధికారులునుకూడ ప్రపంచములోని ఉత్తమ ప్రభుత్వములలో ఒకటైన బ్రిటిష్ పరిపాలనమునకు తాము సహాయపడుతున్నట్లుగా విశ్వసిస్తున్నారని నే నెరుగుదును. హిందూదేశము క్రమక్రమముగా వృద్ధి పొందుతున్నదని కూడా వారి ఉద్దేశము. ఒక ప్రక్క దౌర్జన్యమును ప్రయోగించి ప్రజలను భయపెట్టుటయు, రెండవప్రక్క ప్రతీకారమునకుగాని, ఆత్మరక్షణకు గాని, వీలులేకుండా వారిని నిరాయుధులుగా నొనర్చుటయు, ఈ ప్రభుత్వ పద్ధతి. అందువలన ప్రజలు నోరెత్తకపోవుటచే పరిపాలకుల అజ్ఞానమును, ఆత్మవంచనమును మరింత హెచ్చు పెరిగినవి....నా మీదను, బ్యాంకరు మీదను (శంకరలాల్ బ్యాంకర్ ఆయనతో కూడ అరెస్టయిన వాడు) ప్రేమరాహిత్యమును పురికొల్పి తమనేనేరము మోపబడినది.... భారతదేశ భక్తులలో (తిలక్‌వంటి) ఉత్తమోత్తములు ఈ నేరముక్రింద శిక్షింపబడిరను సంగతి నాకు తెలుసును. కాబట్టి ఈ నేరము నాపై మోపబడుట నే నొక గౌరవముగ భావింతును. ప్రభుత్వము వారియెడల నాకు ప్రేమ లేకపోవుటను గూర్చిన కారణములను ఇంతవరకు సంగ్రహముగ వివరింప ప్రయత్నించితిని. ఏ ప్రభుత్వాధికారి పైనను నాకు వ్యక్తిపరమైన ద్వేషభావము లేదు. ముఖ్యముగా రాజుగారి యెడల నాకెట్టి ద్వేషభావము ఉండవలసిన అవసరమేలేదు. భారతదేశము నింతకుపూర్వము పరిపాలించిన ఏ ప్రభుత్వమూ చేయని మహాపకారమును కావించిన పరిపాలనము నెడల ప్రేమ లేకుండుట సుగుణముగా నేను భావింతును. తదితర పరిపాలనములో కంటె బ్రిటిష్ పరిపాలనలో భార

తీయుల మానవత్వము ఎక్కువగా దెబ్బతిన్నది. ఇట్టి విశ్వాసముగల నేను ఈ పరిపాలనపద్ధతి యందు ప్రేమ గలిగియుండుట పాపముగా భావింతును. నా రాజద్రోహమునకు సాక్ష్యముగ ఉపయోగింపబడిన వ్యాసములను నేను వ్రాయగలుగుట నా అదృష్టము.

నా సహాయనిరాకరణ ఉద్యమము మూలముగ భారతదేశ ఇంగ్లాండుల అస్వాభావిక సంబంధమును వ్యక్తపరచి ఉభయ దేశములకును మహత్తరమైన సేవచేసినానని నా విశ్వాసము. మంచికి సహాయము చేయుటవలెనే చెడుగుకు సహాయము చేయకుండుటకూడ ముఖ్య కర్తవ్యము. ఇంతకు పూర్వము దుష్టులయెడ దౌర్జన్యసహిత సహాయనిరాకరణము ప్రబోధింపబడినది. దౌర్జన్యసహిత సహాయనిరాకరణము దుర్మార్గము నభివృద్ధిపరచుటకొరకే ఉపయోగపడునని నాదేశీయులకు నేను నిరూపింప ప్రయత్నించుచుంటిని. దుష్టత్వమున కెప్పుడును దౌర్జన్యమే ఆధారము. కాబట్టి దుర్మార్గమునకు సహాయముచేయ నిరాకరించేయెడల దౌర్జన్యమును పూర్తిగా విరమింపవలెను. దుష్కార్యమును సహాయముచేయ నిరాకరించుటవలన అనుభవింపవలసిన శిక్షకు పూర్తిగా లొంగిపోవుటకూడా అహింసా సిద్ధాంతమునందిమిడియున్నది. కాబట్టి బ్రిటిషు న్యాయశాస్త్రప్రకారము బుద్ధిపూర్వకమైన మహాపరాధముగా కనుపడుతూ, నా దృష్టిలో పౌరుని ఉత్తమధర్మముగా పరిగణింపబడుతూన్న ఈ నేరమునకు నాకు సాధ్యమైనంత ఎక్కువశిక్ష విధింపవలెననియే నేను మిమ్ములను వేడుకొంటున్నాను. నేడు మీ రేన్యాయ శాస్త్రముక్రింద నన్ను విచారించుచున్నారో ఆ శాస్త్రము దుష్టమైనదని మీరు విశ్వసించేయెడలను వాస్తవముగా నేను నిరపరాధినని మీకు తోచే యెడలను న్యాయమూర్తిగను, అసెస్సరులు [Assessors] గను పనిచేస్తున్న మీరందరును మీ ఉద్యోగములకు రాజీనామా ఇవ్వవలెను. లేక మీ రమలు జరుపుతూన్న న్యాయశాస్త్ర పద్ధతులు భారతదేశము క్షేమముకొరకే ఉద్దేశింపబడినవనే నా ప్రచారము ప్రజాక్షేమమునకు భంగకరమనీ మీరు భావించేయెడల నాకు మీరు సాధ్యమైనంత కఠినశిక్ష విధింపవలెను."

ఉదాత్తమైనట్టిన్ని గంభీరమైనట్టిన్ని సత్యాగ్రహ సారమును స్పష్టపరచునట్టిన్ని ఈ వాంగ్మూలమును విన్న తర్వాత న్యాయాధిపతి-లోకమాన్య బాలగంగాధరతిలక్ కేసును ఉదాహరణముగ తీసుకొని గాంధీకి ఆరుసంవత్సరముల శిక్షను విధించెను. ప్రపంచ చరిత్రలో తత్వవేత్త అయిన సాక్రటీస్ న్యాయ విచారణవంటిదిగ ప్రఖ్యాతిగాంచిన గాంధీ విచారణ ఈవిధముగా ముగిసెను. నేరారోపణ చేయబడి విచారణ నిమిత్తము ఆయన న్యాయస్థానాన్ని ప్రవేశించినప్పుడు అక్కడ ఆసీనులై ఉన్నవారందరును ఒక్కసారి తలవని తలంపుగా లేచి నిలబడి ఆయనను గౌరవించిరి. విచారణముగిసి ఆయనకు శిక్ష విధింపబడిన వెంటనే వారు కన్నీళ్ళు కార్చుచు సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయిరి.

తాను అరెస్టయిన పక్షంలో ప్రజలు హరతాలు ప్రదర్శనలు ఊరేగింపులు నిరసనసభలు మొదలైనవాటిని జరపరాదని ఆయన కొన్నిరోజుల క్రిందటనే తన పత్రికలలో వ్రాసినాడు. ప్రజలు అది ఒక ఆదేశమని భావించి ఆయన కోరినట్లు ఏలాటి ప్రదర్శనలను చేయక ప్రశాంతముగనుండిరి. రౌలెట్టు సత్యాగ్రహకాలంలో సంభవించిన అవాంఛనీయ పరిణామాలేవీ సంభవించక పోవడము గుర్తించవలసిన విషయము.

# 5

దేశ స్వాతంత్ర్య సంపాదనార్థం అఖిలభారత వ్యాప్తంగా జరిగిన మొదటి ఉద్యమం సహాయనిరాకర ణోద్యమం. దీనిపై నాయకత్వాన్ని వహించిన గాంధీ మొదటి అఖిలభారత నాయకుడు. ఇందు ప్రముఖవర్గానికి చెందిన విద్యాధికులకంటె సామాన్య ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. అందుచేత ఇది ప్రజల ఉద్యమంగా సాగింది. ఇదిమొదలు స్వాతంత్ర్యోద్యమం ప్రజల ఉద్యమంగా రూపొందింది. ఇందులో ఇదివరకు రాజకీయంగా అభివృద్ధి గాంచిన బెంగాలు, మద్రాసు, బొంబాయి రాష్ట్రాలేగాక వెనుకబడిన రాష్ట్రాలుగా భావింపబడిన అస్సాం, బీహారు, ఉత్తరప్రదేశ్, పంజాబు, మధ్యప్రదేశములుకూడా గొప్ప పాత్రను వహించాయి. ఈ ఉద్యమం ఇన్ని లక్షణాలతో కూడుకొన్నది కావడంచేత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో దీనికి ప్రత్యేక ప్రాధాన్యం లభిస్తున్నది.

ఉద్యమంలో పాల్గొన్నవారు పరాయి ప్రభుత్వానికి ఏలాటి సహాయం చేయరాదని, దానిపై తిరుగుబాటుచేయడం తమ ధర్మమనీ భావించారు. యుగ యుగాలుగా రాజకీయాల పట్ల ఉదాసీనులుగ నుండిన ప్రజలు ఉద్యమకాలంలోను అటుతర్వాతను వాటిపట్ల అత్యంతాసక్తికల వారయ్యారు. కాని ఇందులోవారు అఖిలభారత దృక్పథంతోనేగాక ప్రాంతీయ దృక్పథంతోకూడా ప్రవర్తించడం గుర్తించవలసిన విషయం. కలకత్తా నాగపూరు కాంగ్రెసులు నిర్ణయించిన అఖిలభారత కార్యక్రమాలను—నిర్మాణ కార్యక్రమం, బహిష్కరణ, శాసనోల్లంఘనములను—సాగించడంలో వారు శ్రద్ధవహించినా ఆయా ప్రాంతాల సమస్యలు వారిదృష్టిని ఎక్కువగా ఆకర్షించినాయి. దీనిఫలితంగా వారు తమ తమప్రాంతాలలోని అధికారులను, అధికారులకు సహాయంచేసే జమీందార్లు, తాలూకాదార్లు మొదలైనవారిని ప్రతిఘటించడం జరిగింది. సహాయ నిరాకరణోద్యమ చరిత్రలో చాలాభాగం ఈ స్థానిక సంఘటనల చరిత్రయే.

గాంధీ అఖిలభారత నాయకుడైనా ఆయన స్వయంగా ఉద్యమాన్ని సాగించడం సాధ్యంకాని పని. ఇందులో ఆయనకు అనేక ఉపనాయకులు అవసరమైనారు. వల్లభాయిపటేల్, రాజగోపాలాచారి, ప్రకాశం, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చిత్తరంజనదాస్, రాజేంద్రప్రసాద్, మోతీలాల్ నెహ్రూ మొదలైనవారు ఈలాటివారు. వీరు వారి వారి ప్రాంతాలలో ప్రజల ఆదరణకు పాత్రులైనవారు. వీరినికూడా అఖిలభారత కార్యక్రమాలేగాక వారి వారి ప్రాంతాలలోని ప్రజలు ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యలు ఎక్కువగా ఆకరించాయి. వాటిలో పాల్గొనడంచేతనే వారు ప్రజల ఆదరణకు పాత్రులైనారు.

ఒక్కొకప్పుడు వారు సాగించిన స్థానిక ఉద్యమాలు గాంధీ సమర్థించక పోయినా వారు వాటిపట్ల శ్రద్ధవహించడం తప్పించికాదు. వారి సహకారంలేనిదీ ఉద్యమాన్ని సాగించడం గాంధీకి సాధ్యంకాని కారణంగా గాంధీ వారిని విమర్శించడంగాని ఖండించడంగాని సాధ్యం కాలేదు.

అన్ని ప్రాంతాలలోని స్థానిక ఉద్యమాలు ఒకే మోస్తరువి కాకపోయినా అవి అన్నీ పరాయి ప్రభుత్వాన్ని దానికి సహాయంచేసే వివిధ వర్గాలను ప్రతిఘటించుటకు ఉద్దేశింపబడినవి.

ఈ దృష్ట్యా అవి అఖిలభారత కార్యక్రమాలను పోలినట్టివి. వాటిలో కొన్ని దేశంలోని ప్రజలందరి దృష్టిని ఆకర్షించినవి.

ఆంధ్రలోని గుంటూరు జిల్లాలో చీరాల పేరాల గ్రామాలనుకలిపి ఒక మునిసిపాలిటీని స్థాపించుటకు ప్రభుత్వం చేసిన ప్రయత్నాన్ని దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన గ్రామ ప్రజలు ప్రతిఘటించారు. వారు వారి గ్రామాలను ఖాళీచేసి, సమీపాన ఉన్న పోరంబోకు ఇసుక దిబ్బలలో గుడిసెలు వేసుకొని మండు వేసవిలోను వర్షాకాలంలోను పదినెలలపాటు ఒక ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని స్థాపించుకొని పరాయి ప్రభుత్వంతో సమరాన్ని సాగించారు. కాని గోపాల కృష్ణయ్య నిర్బంధితుడు కావడంచేతను. పోరంబోకు భూములలో గుడిసెలు వేసుకొన్నందుకు ప్రభుత్వం జరిమానాలను విధించడంచేతను. అధికారులు భేదోపాయాన్ని వినియోగించి ప్రజలలో చీలికలు కల్పించడంచేతను. జిల్లాలోని దేశంలోని ఇతర నాయకులు సహాయంచేయని కారణంచేతను ప్రజలు తిరిగి వారి స్వగ్రామాలనుచేరి మునిసిపాలిటీ స్థాపనకు అంగీకరించవలసి వచ్చినది. కాని పదిమాసాలకాలంవారు పరాయి ప్రభుత్వంతో సాగించిన పోరాటం దేశచరిత్రలో నాటికి వారినాయకుడు గోపాలకృష్ణయ్యకు ఒక శాశ్వతస్థానాన్ని కల్పించింది.

ఇదే విధంగా పల్నాడు తాలూకాలోని ప్రజలు అటవీ శాఖవారు విధించే పుల్లరిని చెల్లించడం మానుకొని తమ పశువులను అటవీ ప్రాంతాలలో మేపసాగారు. అధికారుల నిర్బంధాల నన్నిటిని ప్రతిఘటించారు. తుదకు పోలీసు కాల్పులలో తమ నాయకుడు కన్నెగంటి హనుమంతుని కోల్పోయినా సమరాన్ని సాగించ కృతనిశ్చయులైనారు కాని బర్డోలీ తీర్మానం కారణంగా వారు వారి ఉద్యమాన్ని ఉపసంహరించుకొన్నారు.

ఇంతకంటె పెదనందిపాడు తాలూకాలోని గ్రామాలవారు సాగించిన పన్నుల నిరాకరణోద్యమం దేశప్రజల దృష్టిని ఎక్కువగా ఆకర్షించింది. గాంధీ బర్డోలీ తాలూకాలో పన్నుల నిరాకరణోద్యమాన్ని సంకల్పించుటకు ముందే వారీ ఉద్యమాన్ని సాగించడం గుర్తించ దగిన విషయం. ఇందులో పర్వతనేని వీరయ్య చౌదరి నాయకుడై ప్రఖ్యాతిని గడించాడు. ప్రజలు పోలీసులయొక్కయు సైనికులయొక్కయు దౌర్జన్యాలకు లొంగక పోరాటాన్ని సాగించారు. కాంగ్రెసు స్వచ్ఛంద సైనికులు ఇందులో గొప్ప పాత్రను వహించారు. కొండా వెంకటప్పయ్య జిల్లా కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఉద్యమ పర్యవేక్షణను సాగించాడు. గ్రామాధికారులు వారి పదవులకు రాజీనామాచేసి ఉద్యమానికి సహాయపడినారు. దీని ఫలితంగా బ్రిటిష్ పరిపాలన పునాదులు శిధిలములయ్యే ప్రమాదం ఉన్నట్లు అధికారులు భావించారు. ఉద్యమం విజయవంతంగా సాగుతూ ఉండినా బర్డోలీ తీర్మాన ఫలితంగా దానిని ఉపసంహరించుకొనడం తప్పిందికాదు.

అస్సాం రాష్ట్రంలో సహాయ నిరాకరణోద్యమం ఇంకొక రూపాన్ని ధరించింది. ఆ రాష్ట్రంలో తేయాకుతోటల తెల్ల యజమానులు కార్మికులను బానిసలకంటే క్రూరంగా బాధించడం పరిపాటిగా ఉండేది. అధికారులు యజమానులపట్ల పక్షపాతం వహించిన కారణంగా కార్మికులకు ఏలాటి రక్షణాలభించే అవకాశం లేకపోయింది. కార్మికుల ఇబ్బందులే స్థానిక సమస్యలలో అగ్రస్థానం వహించింది. సహాయ నిరాకరణ ఉద్యమ ప్రచారకులచే

కార్మికులు ప్రభావితులై సుమారు 7000 మంది తోటలలో పనిచేయడంమాని వారి స్వరాష్ట్రమైన బీహారుకు వెళ్ళిపొయ్యారు. తోట యజమానులు నష్టానికి గురిఅయ్యారు. దీని ఫలితంగా ప్రభుత్వం కొన్ని చట్టాలనుచేసి కార్మికుల స్థితిగతులను కొంతవరకు చక్కబెట్టింది.

బీహారు రాష్ట్రంలోని రైతులు అడవుల విషయంలో జమీందార్లు మొదలైనవారు విధించిన నిర్బంధాలను సహించలేక తిరుగుబాటుచేసి కొన్ని నెలలపాటు పోరాటాన్ని సాగించారు. ఉత్తరప్రదేశ్‌లో మోతీలాల్ జవహర్‌లాలుల నాయకత్వాన జమీందారీ గ్రామాలలోని రైతులు ఒక కిసాన్ (Kisan) ఉద్యమాన్ని లేవదీసి శిస్తులను చెల్లించడం మానుకొన్నారు. ప్రభుత్వం మూలంగా అనుభవించవలసిన కష్టాలకంటె జమీందార్లు ఇతర భూస్వాముల మూలంగా కలిగిన కష్టాలే వారికి దుర్భరములైనాయి. గాంధి ఈలాటి స్థానిక సమస్యలపట్ల ప్రజలు శ్రద్ధవహించరాదని, శిస్తులను జమీందార్లకు చెల్లించవలసినదని ఆదేశించినా రైతులు వారి ఉద్యమాన్ని సాగించారు. మోతీలాల్‌వంటి స్థానిక నాయకులు రైతుల ఉద్యమాన్ని సర్వవిధాలా సమర్థించారు. సహాయ నిరాకరణ ఉద్యమంలో ప్రజలకు ఉత్సాహాన్ని కలిగించుటకు ఇది గొప్ప సాధనంగా వారు భావించారు. జమీందార్ల సహాయం లభించిన కారణంగానే పరాయివారు దేశాన్ని పాలించడం సాధ్యమౌతూ ఉండడంచేత ఆలాటివారిని ప్రతిఘటించడం ప్రభుత్వాన్ని ప్రతిఘటించడమేనని వారు గాంధీకి నచ్చచెప్పారు. ఈ విధంగా ఆయా ప్రాంతాల పరిస్థితులకు అనుగుణములైన కార్యక్రమాలను ప్రజలు సాగించారు. వారిని ఈ కార్యక్రమాలే ఎక్కువగా ఆకర్షించాయి. రాజకీయాలపట్ల వారిలో కొత్తగా జనించిన ఆసక్తికి ఇదే ప్రధాన కారణం.

పంజాబు రాష్ట్రంలో సహాయ నిరాకరణోద్యమం శిక్కులను ప్రత్యేకంగా ఆకర్షించింది. కొంత కాలాననుండి వారిలో సంస్కర్తలు సనాతనులు అనేవర్గాలు రెండు ఏర్పడినవి. వారి దేవాలయాలు—గురుద్వారములని వీటికి పేరు—అవినీతికి పాల్పడిన మహంతుల అధీనంలో ఉండేవి. సంస్కర్తలు అధికారాననుండి వీరిని తొలగించుటకు ఒక ఉద్యమాన్ని లేవదీశారు. దానిని సాగించుటకు గురుద్వారా ప్రబంధక కమిటీని స్థాపించారు. ఇందులో సంస్కర్తలలో అతివాదులైన అకాలీలు గొప్ప పాత్రను వహించారు. వీరు గాంధీ సూచించిన సత్యాగ్రహ విధానాన్ని వినియోగించి గురు ద్వారాల ఎదుట గుంపులుగా కూడి శాంతి యుతంగా సత్యాగ్రహాన్ని సాగించారు. నాన్‌ఖానా అనే చిన్న పట్టణంలో సత్యాగ్రహాన్ని సాగిస్తున్న గుంపులను చెదర గొట్టదలచి, అక్కడి గురుద్వారమహంతు వారిపై తుపాకుల కాల్పులను జరిపించగా సత్యాగ్రహులనేకులు ప్రాణాలను కోల్పొయ్యారు; అనేకులు గాయ పడినారు. ఇందులో పోలీసులు మహంతుకు సహాయం చేశారు. ఆ సహాయం లభించబట్టే అతడీ విధంగా ప్రవర్తించగలిగాడు. జలియన్ వాలాబాగ్ దురంతాలు మోస్తరుగానే ఈ విషాద సంఘటన శిక్కులను క్రోధావేశపరులుగా చేసింది. దీని ఫలితంగా వారి సత్యాగ్రహోద్యమం మరింత బలపడింది. సంస్కర్తలందరు కాంగ్రెసు పక్షాన్ని వహించి, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన నిర్ణయించుకొన్నారు. మత ఉద్యమంగా బయలుదేరిన శిక్కుల ప్రతిఘటన బ్రిటిష్‌వారు మహంతులను సమర్థించడం చేత రాజకీయ ఉద్యమంగా మారింది. ఇది కారణంగా పౌరుషానికి ప్రఖ్యాతి గాంచిన శిక్కులు

సహాయ నిరాకరణోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన వారయ్యారు. ప్రభుత్వం ఈ పరిణామాన్ని గమనించి, మహంతులను అధికార పదవులనుండి తొలగించి, గురుద్వారాలను శిక్కు ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధుల వశంలో ఉండవలసినట్లు చట్టాన్ని చేసింది. ఈ విధంగా శిక్కుల సత్యాగ్రహం విజయాన్ని సాధించింది.

# 6

ఉద్యమం శాంతియుతంగా జరగవలసిందని గాంధీ ఆదేశించాడు. మొత్తంమీద ప్రజలు ఆదేశానుసారం ప్రవర్తించినా అక్కడక్కడా వారు హింసాకాండలలోకి దిగి ప్రాణ నష్టాన్ని ఆస్తి నష్టాన్ని కలిగించారు. కల్లు దుకాణాలను విదేశ వస్త్రాలను విక్రయించే దుకాణాలను పికెటింగు చేసేవారు ఒక్కొకప్పుడు కొనుగోలు చేసేవారిని బెదరించడం, వారిపైన చేతులు చేసుకొనడం కారణంగా వారి కార్యక్రమంలో పోలీసులు జోక్యం కలిగించుకొనవలసి వచ్చేది. హర్తాలులన్నీ శాంతియుతంగా జరగలేదు. వేల్సు యువరాజు బొంబాయిలో అడుగు పెట్టిన రోజున నగరంలో నాలుగైదు రోజులపాటు దౌర్జన్య కార్యక్రమాలు ఏలాగు జరిగినవి ఇదివరకే తెలుసుకొన్నాము. ఉత్తరప్రదేశ్‌లో రైతులు జమీందార్లపై సాగించిన తిరుగుబాటు సందర్భంలో అనేక గ్రామాలలోను, ఫర్సత్‌గంజ్, మునిషీగంజ్ రాయబరేలీ, గోసాల్‌గంజ్ మొదలయిన పట్టణాలలోను ఇదే విధంగా ప్రజలు ప్రవర్తించారు. బొంబాయి రాష్ట్రంలోని నాసిక్ జిల్లాకు చెందిన మాలెగాన్ (Malegaon) గ్రామంలో ఖిలాఫత్ ఉద్యమంచేత ప్రభావితులైన ముస్లింలు అధికారులు జారీ చేసిన నిషేధాజ్ఞలను ఉల్లంఘించగా వారికీ పోలీసులకూ మధ్య తీవ్ర సంఘర్షణ సంభవించింది. మూకలు పోలీసులను చుట్టుముట్టగా వారిలో కొందరు దగ్గర ఉండిన హిందూ దేవాలయంలో తలదాచుకొన్నారు. మూకలు దానికి నిప్పంటించడంచేత దేవాలయమే గాక చుట్టుపట్ల ఇండ్లు దగ్ధమై పోయినవి. మంటలలో కొందరు పోలీసులు మరణించారు. ఈ సంఘర్షణ కొన్నాళ్ళపాటు జరగడంచేత మరికొందరు మృతి జెందారు. ఆస్తికి అపార నష్టం సంభవించింది. ఈలాటి దౌర్జన్యంతో కూడిన సంఘటనలు కొన్ని సంతాల్ పరగణాల (Santal Paraganas)లోని గిరిధిలోను, ఉత్తర ప్రదేశ్‌లోని అలీఘర్‌లోను, కర్ణాటకములోని ధార్వారులోను జరిగాయి. అన్నిటి కంటె విషాదకరమయిన సంఘటన మలబారు జిల్లాలో సంభవించింది. అక్కడ నివసించే మాప్లాలనే ముస్లింలు ప్రభుత్వంపై తిరుగుబాటు చేసి, యూరోపియన్ అధికారులను హత్య గావించి, పరిపాలన యంత్రాంగాన్ని స్తంభింపజేసి ఖిలాపత్ రాజ్యం స్థాపితమయినట్లు ప్రకటన చేశారు. కాని అటు తర్వాత హిందువులు వారి క్రోధానికి గురి అయినారు. హిందువులనేకులను వారు హత్య జేశారు; నిర్బంధించి అనేకులను ఇస్లాం మతంలోకి కలుపుకొన్నారు; దేవాలయాలను నాశనం చేశారు. స్త్రీలపై అత్యాచారాలు జరిపారు. బ్రిటిష్‌వారిపై ప్రారంభమైన తిరుగుబాటు ఈ విధంగా హిందువులపై దౌర్జన్యాలకు దారి తీయడం ఈ సంఘటనలోని విషాదాంకం. కాలక్రమాన ప్రభుత్వం సైనిక దళాలను మలబారుకు పంపి తిరుగుబాటును అణచి వేసింది.

# 7

ఉద్యమంయొక్క ఉద్దేశం పరిపాలనను స్తంభింప చేయడం కావడంచేత దాన్ని అణచుటకు దమన విధానాన్ని కఠినంగా అమలు పరచడంలో ఏలాటి అధర్మం లేదనే అభి ప్రాయంతో 1921-1922 లో ప్రభుత్వం ప్రవర్తించింది. రౌలెట్టు సత్యాగ్రహ కాలంలో పంజాబు వంటి రాష్ట్రాలలోని ప్రభుత్వాలు సర్వ స్వాతంత్ర్యంతో ప్రవర్తించడంచేత జలియన్‌వాలాబాగ్ దురంతాలవంటివి జరిగినవనే కారణంగా సహాయ నిరాకరణ ఉద్యమకాలంలో కేంద్రప్రభుత్వం వాటి స్వాతంత్ర్యంపై కొన్ని హద్దులను విధించి, ఏలాటి దమన విధానాన్ని అనుసరించవలసిందీ తానే నిర్ణయించింది. 1920కు, 1921-22కు ఇందు మూలంగా కొంత భేదం ఉండినా మొత్తం మీద దమన విధాన తీవ్రత చెప్పుకొనతగినంతగా తగ్గలేదు. గాంధీని అరెస్టు చేయవలసిందిగా బొంబాయి ప్రభుత్వం, మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఒత్తిడి చేసినా, కేంద్రప్రభుత్వం వాటి ఒత్తిడికి లొంగక, ఉద్యమాన్ని ఆయన ఉపసంహరించుకొనేవరకు ఆయనను అరెస్టు చేయడం మాని, ఇతర నాయకులను మాత్రం నిర్బంధంలో ఉంచింది. ఆ రోజులలో మితవాద నాయ కుడుగా ప్రఖ్యాతి గాంచిన సప్రూ వైస్రాయి కార్యనిర్వాహక సభలో (Executive Council) సభ్యుడుగా ఉండి, గాంధీని అరెస్టు చేసే ప్రయత్నాన్ని మానుకొనవలసినదిగా వైస్రాయికి సలహా ఇచ్చాడు. కేంద్రప్రభుత్వం ఈ విషయంలో కొంత ప్రాజ్ఞతతో ప్రవర్తించుటకు ఆయన సభ్యత్వం ఒక ప్రధాన కారణం.

ఇది మినహాగా దమన విధానాన్ని ప్రయోగించడంలో ప్రభుత్వం ఏలాటి హద్దులకూ లోబడలేదు. వ్యక్తుల యొక్కయు, సంఘాల యొక్కయు, వార్తాపత్రికల యొక్కయు స్వాతం త్ర్యంపై రకరకాల నిర్బంధాలను విధించింది. వందేమాతర ఉద్యమ కాలాననుండి చేయబడిన చట్టాలనన్నిటినీ ఇందుకుగాను ఉపయోగించింది. విచక్షణారహితంగా పోలీసువారు లాటీలను వినియోగించడం, కొరడా దెబ్బలు కొట్టడం, అనుమానాస్పదులను అరెస్టు చేసి, విచారణ చేయక జైళ్ళలో నిర్బంధించి, నానా బాధలకూ గురి చేయడం, సోదా నిమిత్తం ఇండ్లలో ప్రవేశించి, దోపిడీ చేయడం, స్త్రీలు ధరించిన ఆభరణాలను వశపరచుకొనడం, వారిపై అత్యాచారాలు గావిం చడం, కాంగ్రెసు ఆఫీసులను, ఖిలాపత్ ఆఫీసులను, జాతీయ విద్యాలయాలను ప్రవేశించి, వాటిలోని వస్తు సామగ్రిని, రికార్డులను వశపరచుకొని, దగ్ధం చేయడం పరిపాటి అయింది. గాంధీ టోపీని, ఖద్దరును ధరించినవారు వారి క్రోధానికి ప్రత్యేకంగా పాత్రులయ్యారు. ఉద్య మంలో పాల్గొన్న వారి పెన్‌షనులను ఆపి వేశారు. వారి జాగీర్లను వశపరచుకొన్నారు. సమా వేశాలను చెదరగొట్టడంలో ఏలాటి విచక్షణ లేక కాల్పులు జరపడంచేత అనేకులు మరణించారు; అనేకులు గాయ పడినారు. జైళ్ళలో తగిన ఆహారాది సదుపాయాలు లేని కారణంగా నిర్బం ధితులలో అనేకులు వ్యాధిగ్రస్తులై అకాల మరణానికి గురి అయ్యారు. అధికారులు ఎన్ని బాధలు పెట్టినా తాము దేశ స్వాతంత్ర్య సంపాదన సమరంలోని యోధులనే భావంతో వాటి నన్నిటినీ ఉద్యమంలో పాల్గొన్నవారు భరించారు. దీని మూలంగా వారు వారి దేశాభిమానాన్ని ప్రదర్శించారు. వారి కీర్తి చిరస్థాయి గాంచింది.

ఉద్యమంలో పాల్గొన్న ఫలితంగా రాజగోపాలాచారి, గోపాలకృష్ణయ్య, కొండా వెంకటప్పయ్య, చిత్తరంజనదాస్, రాజేంద్రప్రసాద్, మోతీలాల్‌నెహ్రూ, జవహర్‌లాల్‌నెహ్రూ, లజపతిరాయ్, వల్లభాయి పటేల్, మొదలైన నాయకులే గాక సామాన్య ప్రజలు వేలసంఖ్యలో

జైలుశిక్షను అనుభవించారు. వారిలో అన్ని రాష్ట్రాలకు చెందినవారున్నారు. అధికార నివేదికల లోని ఈ క్రింది సంఖ్యలు దీనిని స్పష్టం చేస్తున్నాయి.

| రాష్ట్రం | శిక్షితుల సంఖ్య |
|---|---|
| మద్రాసు | 617 |
| బొంబాయి | 1041 |
| బెంగాలు | 9163 |
| ఉత్తర ప్రదేశ్ | 2772 |
| పంజాబు | 1374 |
| బిహారు-ఒరిస్సా | 414 |
| మధ్యప్రదేశ్ | 344 |
| అసాం | 721 |
| వాయవ్య సరిహద్దు రాష్ట్రం | 68 |
| కూర్గు | 12 |
| ఢిల్లీ | 186 |

వీరుగాక అనేకులు అరెస్టయి విచారణజరగక నిర్బంధంలో ఉండినారు. పై సంఖ్యల బట్టి ఏయే రాష్ట్రంలో ఎందరు ఉద్యమంలో పాల్గొన్నదీ నిర్ణయించరాదు. పాల్గొన్న వారందరు శిక్షితులు కాలేదు. అన్ని రాష్ట్రాలలో వేల సంఖ్యలో ప్రజలు ఉద్యమంలో పాల్గొని దానిని ప్రజా ఉద్యమంగా మార్చారు.

# 8

సహాయ నిరాకరణోద్యమం విఫలమైనదా లేక సఫలమైనదా అనే ప్రశ్నకు సమాధానం చెప్పవలసి ఉంది. ఒక విధంగా ఇది విఫలమైనట్లు చెప్పక తప్పదు. దీని మూలంగా ఆశించిన ఫలితాలు మూడింటిలో ఏదీ కూడా లభించలేదు. ఖిలాఫత్ సమస్య సమస్యగానే ఉండిపోయింది; పంజాబు దురంతాలకు ప్రభుత్వం ఏలాటి ప్రతి క్రియా చేయలేదు. స్వరాజ్య సంస్థాపన జరగలేదు. బ్రిటిష్ పరిపాలన యథాప్రకారంగా నిలబడిపోయింది. ఉద్యమకాలంలో ప్రజలు చేసిన త్యాగాలు. వారు అనుభవించిన బాధలు. కష్టాలు. ఈ దృష్ట్యా వ్యర్థములైనట్లు చెప్పవలసి వస్తుంది.

కాని. ఇది సరియైన అభిప్రాయం కాదు. ఉద్యమం తలపెట్టిన మూడు ఆశయాలలో స్వరాజ్య సంపాదనము ప్రధానమైనట్టిది. ఇది జరగకపోయినా కాలక్రమాన జరుగుటకు అవసరములైన పరిస్థితులన్నీ ఉద్యమ కాలంలో ఏర్పడినవి. ఇవి ఏర్పడడం చేతనే స్వాతంత్ర్యోద్యమాన్ని ఇంకొకమారు ప్రారంభించి సాగించడం సాధ్యమైంది.

ఉద్యమకాలంలో రాజకీయంగా ప్రజలు మేల్కొన్నారు. స్వరాజ్యం తమ జన్మహక్కు-అని, దానిని సంపాదించడం తమ కర్తవ్యమనీ, అది లభించేవరకూ తమ ప్రయత్నాలను విరమించరాదని గ్రహించారు. ఇందుకుగాను పరాయివారిపై ఆధారపడడం మూఢత్వమని, స్వరాజ్య సంపాదనకు స్వయంకృషితప్ప సాధనాంతరం ఏదీలేదనీ. ఆ కృషిని సాగించడంలో తాము

అన్ని త్యాగాలకు సిద్ధపడడం అవసరమనీ నేర్చుకొన్నారు. పరాయి ప్రభుత్వమన్నా, పోలీసులన్నా, సైనికులన్నా, అరెస్టులన్నా, జైళ్ళన్నా. శిక్షలన్నా భయం తొలగిపోయింది. ఈ నిర్భయత్వమే తుదకు విముక్తిని కలిగించింది. బ్రిటిష్‌ప్రభుత్వానికి ఇదివరకు ఉండిన నైతికబలం అంతరించింది. దేశాన్ని పాలించే హక్కుగాని అర్హతగాని బ్రిటిష్‌వారికి లేదనే భావం స్థిరపడింది. ఉద్యమమంతా కాంగ్రెసు అధ్వర్యాన దాని ఆదేశానుసారముగాను సాగడంచేత దేశంలో దానికిగల పేరుప్రతిష్ఠలు పెరిగినాయి. ఇదిమొదలు ప్రజలు దానిపట్ల భక్తి శ్రద్ధలు గలవారై, దాని మూలంగానే తమకు విముక్తి కలగగలదనే భావంతో ప్రవర్తించసాగారు. ఈలాటి ఫలితాలు ఉద్యమమూలంగా లభించినందున ఉద్యమం చాలావరకు ఫలప్రదమైనట్లు భావించడమే సమంజసం. ప్రజలలో ఇటువంటి మానసిక పరివర్తన కలిగినట్లు అధికారులూ, దేశంలోని కాంగ్రెసు వర్గానికి చెందనివారూ అంగీకరించారు.

ఈ సందర్భంలో ఇంకొకమాట చెప్పవలసి ఉంది. ప్రపంచచరిత్రలో ఎన్నో స్వాతంత్ర్య సమరాలు జరిగాయి.ఏ సమరంకూడా ఒక సంవత్సరకాలంలో విజయవంతంకాలేదు. ఎన్నో ప్రయత్నాలు విఫలములైన తర్వాతనే విజయం లభించింది. స్పెయిన్ సామ్రాజ్యాధికారానికి లోబడిఉండిన డచ్చివారు సుమారు నలభై సంవత్సరాలకాలం స్వాతంత్ర్య సమరాన్ని సాగించారు. ఆస్ట్రియా సామ్రాజ్యాధికారానికి లోబడిఉండిన ఇటలీదేశం 1820 లో ప్రారంభించిన స్వాతంత్ర్యసమరం 1871 కు గాని ముగిసినదికాదు. అమెరికన్లు బ్రిటిష్ సామ్రాజ్యాధికారంపై ఏడు సంవత్సరాలకాలం యుద్ధంచేసి స్వాతంత్ర్యాన్ని సంపాదించినారు. ఈ యుద్ధాలన్నిటిలో పరాయివారి సహాయం లభించడంచేత తుదివిజయం సాధ్యమైంది. ప్రపంచచరిత్రలోని ఈ సంఘటనలదృష్ట్యా సహాయనిరాకరణోద్యమం ఫలప్రదం కానందుకు ఆశ్చర్యపడవలసిందిలేదు. అది వెంటనే ఫలప్రదం కాకపోయినా కాలక్రమాన ఫలప్రదమగుటకు కావలసిన పరిస్థితులు దాని మూలంగా ఏర్పడడం గుర్తించగిన ప్రధాన విషయం.

చదువదగిన గ్రంథాలు:

**Bhavan : Vol. xi**
**Judith M. Brown : Gandhi's Rise to Power.**
**R. Kumar (Ed) : Essays in Gandhian Politics : Essays x**
**B. Pattabhi Seetharamiah :** కాంగ్రెసు చరిత్ర

# అధ్యాయము-7

## 1921-28 మధ్య రాజకీయాలు

1921 నుండి దేశంలోని రాజకీయాలలో స్వాతంత్ర్యోద్యమందృష్ట్యా సహాయనిరాకరణోద్యమం అగ్రస్థానాన్ని వహించినా కాంగ్రెసేతర పార్టీలవారు వారి వారి కార్యక్రమాలను అనుసరించి సాగించిన రాజకీయాలు ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా స్వాతంత్ర్యోద్యమంలో కొంత ప్రాధాన్యాన్ని వహించాయి. పరాయిప్రభుత్వ నిరంకుశత్వాన్ని ఇవి మరింత స్పష్టంచేసి స్వాతంత్ర్య సంపాదనంలో ప్రజలకుగల దీక్షను మరింత బలపరచి, 1930-34 లో గాంధీమహాత్ముని నాయకత్వాన కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమానికి (Civil Disobedience Movement) దారితీశాయి.

1921 నాటికి దేశంలో కాంగ్రెసుతోపాటు లిబరల్ పక్షం (ఇది పూర్వపు మితవాదుల పక్షం), బ్రాహ్మణేతర పక్షం, ముస్లింలీగు, హిందూమహాసభ, మొదలైనవి రాజకీయరంగంలో కృషిచేస్తూ వచ్చాయి. తుదిలక్ష్యంలో వీటికీ కాంగ్రెసుకూ ఏలాటి భేదంలేదు. బ్రిటిష్‌సామ్రాజ్యంలో స్వపరిపాలనను అనుభవిస్తూ వచ్చిన కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణ ఆఫ్రికాలలో ఉండినట్టి స్వపరిపాలన విధానాన్నే భారతదేశానికి సంపాదించడం ఈ పార్టీలన్నిటి యొక్క తుదిలక్ష్యం. ఈ విధానానికే క్రమక్రమంగా డుమినియన్ ప్రతిపత్తి(Dominion Status) అనే పేరు వ్యవహారంలోకి వచ్చింది. కాంగ్రెసువారు నాగపూరు కాంగ్రెసులో స్వరాజ్యం తమ లక్ష్యమని తీర్మానించినా వారిలో అధిక సంఖ్యాకులు స్వరాజ్యం అనేమాటను డుమినియన్ ప్రతిపత్తి అనే అర్థంలోనే వాడుతూ వచ్చారు. గాంధీమహాత్ముడుకూడ వీరితో ఏకీభవించాడు. బ్రిటిష్ సామ్రాజ్యానునుండి భారతదేశం విడిపోవడం తన లక్ష్యంకాదని, బ్రిటిష్ సామ్రాజ్యంలో ఉంటూ బ్రిటన్‌తో సమానమైన హక్కులను సంపాదించడమే తన లక్ష్యమనీ ఆయన పదే పదే చెప్పినాడు. అహమ్మదాబాదు కాంగ్రెసులో హజరత్‌మోహాని భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యంగల రిపబ్లిక్‌గా రూపొందవలెనని ప్రతిపాదించిన తీర్మానాన్ని ఆయన తీవ్రంగా ప్రతిఘటించుటకు ఇదియే కారణం. బెల్గాం కాంగ్రెసులోకూడా ఈ అభిప్రాయాన్నే ఆయన వ్యక్తంచేశాడు. అందుచేత తుదిలక్ష్య విషయంలో కాంగ్రెసుకూ తక్కిన పార్టీలకూ మధ్య ఏలాటి భేదంలేదని స్పష్టం అవుతున్నది.

వీటిమధ్య భేదం అంతా లక్ష్యసాధన విషయంలో కనుపించింది. కాంగ్రెసువారు లక్ష్యాన్ని వెంటనే సాధించదలచారు. తక్కిన పార్టీలవారు దానిని క్రమంగా దశలవారిగా సాధించదలచారు. వెంటనే సాధించడం సాధ్యంకాదని, కావలసింది లక్ష్యసాధనమార్గంలో నడవడమని, లక్ష్యాన్ని చేరుటలో కొంత ఆలస్యం జరిగినా ఇబ్బందిలేదని భావించారు.

ఇదిగాక వీటిమధ్య ఇంకొక భేదంకూడా ఉండినది. బ్రిటిష్‌వారిని ఒత్తిడిచేసి వారిని లొంగదీయుటకు శాసనోల్లంఘనంతో కూడిన సహాయనిరాకరణ విధానం ఒక్కటే ఎన్నటికైనా

సాధనంకాగలదని కాంగ్రెసువారు భావించారు. దీనికే ప్రజాప్రత్యక్షచర్య అని (Direct Action) నామాంతరం. తక్కిన పార్టీలవారికి ఈ సాధనం అంగీకారయోగ్యం కాలేదు. ఇది శాంతిభద్రతలకు నష్టం కలిగించి, అరాచకానికి దారితీయగలదని, దీనిమూలంగా ప్రభుత్వం మరింత తీవ్రరూపంలో దమననీతినీ నిర్బంధవిధానాన్నీ సాగించడం తప్పదనీ, దీనికి బదులుగా చట్టబద్ధమైన ఆందోళనను సాగించి, శాసనసభలలోను వాటికి వెలుపలను తీర్మానాలను ప్రతిపాదించి, వినతిపత్రాలను సమర్పించి, ప్రజాభిప్రాయాన్ని బలపరచి బ్రిటిష్‌ప్రభుత్వ వైఖరిని క్రమ క్రమంగా మార్చడం సాధ్యంకాగలదని, కాంగ్రెసేతర పార్టీలవారు భావించారు. కాంగ్రెసువారు సహాయనిరాకరణ వాదులు; కాంగ్రెసేతరులు బ్రిటిష్‌ప్రభుత్వంతో సహకరించి, తుదిలక్ష్యాన్ని సాధించదలచారు. వీరందరి లక్ష్యం ఒకటే అయినా, దానిని సాధించుటకు వినియోగించవగిన సాధనవిషయంలో వీరిమధ్య భేదం ఏర్పడింది.

ఈలాటి భేదం ఉండడంవలననే మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణల ఫలితంగా రూపొందిన భారతదేశ ప్రభుత్వ చట్టప్రకారం (Government of India Act, 1919) 1921 లో ఏర్పడిన శాసనసభలను కాంగ్రెసువారు బహిష్కరించడం, తక్కినపక్షాలలో ప్రధానములైనవి ఎన్నికలలో పోటీచేసి, వాటిలో ప్రవేశించి, వాటికార్యక్రమాలలో పాల్గొనడం జరిగింది. 1924 లో కాంగ్రెసువారుకూడ శాసనసభలలో ప్రవేశించినా వాటిని ప్రభుత్వాన్ని ప్రతిఘటించుటకు ఒక సాధనంగా వినియోగించారు. అప్పుడుకూడా ప్రభుత్వంతో సహకరించడం తమ ఉద్దేశంకానట్లు ప్రవర్తించారు. 1921-28 మధ్య రాజకీయాలకు సహాయనిరాకరణవాదులూ సహకారవాదులూ మధ్య ఏర్పడిన ఈ విభేదాలు ఒక ప్రధానలక్షణమని చెప్పవచ్చు.

## 2

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో భారతదేశం చేసిన సహాయానికి కృతజ్ఞతా సూచకంగాను, యుద్ధకాలంలో తిలక్ అనిబీసెంటులు లేవదీసిన హోంరూల్ ఉద్యమ ఫలితంగాను బ్రిటిష్‌ప్రభుత్వం మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలకు రూపకల్పనగావిస్తూ భారతదేశప్రభుత్వ చట్టాన్ని 1919 లో చేసింది. ఇది 1921, జనవరిలో అమలులోకి వచ్చింది. దీనిమూలంగా భారతదేశప్రజలు సంతృప్తిగాంచి, రాజకీయాందోళనను మానుకొంటారని ప్రభుత్వం భావించింది. కాని ఇది జరగలేదు. సంస్కరణలమూలంగా ప్రభుత్వం ఆశించిన ఫలితాలు లభించలేదు. దేశంలోని రాజకీయ పార్టీలలో అగ్రస్థానం వహించినట్టిన్నీ, రాజకీయచైతన్యంగల ప్రజలలో అధికసంఖ్యాకుల ఆదరణకు పాత్రమైనట్టిన్నీ కాంగ్రెసు 1919 చట్టాన్ని అమలు పరచడంలో ప్రభుత్వానికి ఏలాటి సహకారాన్నీ అందజేయక, సహాయనిరాకరణ విధానాన్ని అనుసరించడం సంస్కరణల వైఫల్యానికి ప్రధానకారణం. కాంగ్రెసువారు శాసనసభలను బహిష్కరించడంతో ప్రజలకు వాటిపట్ల ఉత్సాహం అడుగంటింది.

కాని, కాంగ్రెసేతర పార్టీలవారు—వారిలో ప్రధానంగా లిబరల్‌పక్షానికి బ్రాహ్మణేతరపక్షానికి చెందినవారు—సంస్కరణలను అమలుపరచడంలో ప్రభుత్వంతో పూర్తిగా సహకరించారు. కొత్త చట్టంమూలంగా రాష్ట్రపరిపాలనలోని వ్యవసాయం, విద్య, ఆరోగ్యం మొదలైన శాఖలు శాసనసభలకు బాధ్యతవహించే మంత్రుల వశంలోకి రావడం వారిని ఆకర్షించింది. చాలాకాలంగా దేశపరిపాలనలో భారతీయులకు భాగస్వామ్యం లభించవలెననే

ఆశయం కొంతవరకు ఫలించిందని వారు భావించారు. వీరు కాంగ్రెసువారివలె స్వరాజ్యం వెంటనే లభించవలెనని వాంఛించినవారుకారు. పరిమితాధికారం లభించినా వారు తృప్తిపడ్డారు. ఇంతేగాక 1919 చట్టంమూలంగా ఏర్పడిన కేంద్ర శాసనసభలోను, రాష్ట్ర శాసనసభలలోను ప్రజలు ఎన్నుకొన్న సభ్యులు అధికసంఖ్యలో ఉండినారు.

దీని ఫలితంగా ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వానికి ప్రత్యక్షంగా తెలియపరచుటకు ఎక్కువ అవకాశం లభించింది. ఈ అవకాశాన్ని చక్కగా వినియోగపరచినపక్షాన ప్రభుత్వం తన నిరంకుశ విధానాన్ని కొంతవరకైనా మార్చుకొని, ప్రజాభిప్రాయానుసారం పరిపాలనను సాగించగలదని వారు భావించారు. వీరు కాంగ్రెస్ వారివలె స్వరాజ్యం వెంటనే లభించవలెనని వాంఛించిన వారుకారు. పరిమితాధికారం లభించినా వారు తృప్తిపడ్డారు.

ప్రభుత్వంతో వారు సహకరించుటకు ఇదికూడా ఒక కారణమైంది. వారి సహకారం లభించుటచేత పరిపాలనను నెమ్మదిగా సాగించవచ్చునని ప్రభుత్వం అనుకొన్నది. కాని కొలదికాలంలో కాంగ్రెసేతరపార్టీల వారుకూడా ఆశాభంగాన్నిపొందింది. మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలవలన దేశానికి విస్తార ప్రయోజనంచేకూర లేదని. 1919 చట్టానికి బదులు దేశానికి ఎక్కువ రాజకీయప్రయోజనాన్ని కలిగించే మరియొక శాసనాన్ని చేయవలసిందిగా ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయసాగారు. ఏకారణాలచేత ఈ పార్టీలవారుకూడా ఈలాగు భావించారో తెలుసుకొనడం అవసరం.

(1) 1919 చట్టం మంత్రుల వశంలోకి వచ్చిన శాఖలను వారి ఇష్టానుసారం స్వతంత్రంగా శాసనసభల అనుమతితో పరిపాలించుటకు ఉద్దేశింపబడింది. కాని ఈ ఉద్దేశం నెరవేరడంలో ఐ. సి. యస్ శాఖకు చెందిన ఉన్నత ఉద్యోగివర్గం అనేక అవరోధాలను కల్పించింది. చట్టాన్ని అమలుపరచడంలో అవసరములైన నియమ నిబంధనలను (Rules and Regulations) చేసే అధికారాన్ని పార్లమెంటు భారతదేశ ప్రభుత్వానికి ఒప్పగించింది. ఆ రోజులలో భారతదేశ ప్రభుత్వం అంటే ఉన్నత ఉద్యోగవర్గ ప్రభుత్వం అన్నమాట. ఈ వర్గానికి చెందినవారు బ్రిటిష్ పరిపాలన దేశంలో ఏర్పడినప్పటినుండి సర్వాధికారాన్ని వహిస్తూ ఉండినారు. ఆ అధికారంలో లేశమాత్రం కూడా భారతీయులైన మంత్రుల వశంలోకి రావడం వారికి అంగీకార యోగ్యం కాలేదు. ఈ కారణంచేత మంత్రుల అధికారం నామమాత్రంగాను వాస్తవాధి కారమంతా తమవశంలో ఉండేటట్లుగాను నియమ నిబంధనలను రూపొందించారు.

సాధారణంగా బాధ్యతాయుత ప్రభుత్వ విధానంలో ఉన్నత ఉద్యోగ వర్గానికి చెందిన వారు మంత్రులకు లోబడి, వారి ఆదేశాల ననుసరించి కార్యక్రమాలను సాగించడం సంప్రదాయం. అప్పుడుగాని మంత్రులు శాసన సభలకు బాధ్యులై ప్రవర్తించడం సాధ్యంకాదు. కాని ఈ సంప్రదాయానికి విరుద్ధంగా నియమ నిబంధనలు రూపొందింప బడినవి. మంత్రుల ఆదేశాలు ఉన్నతోద్యోగులకు ఆమోదయోగ్యం కానప్పుడు వారు గవర్నరుకు అపీలుచేసి, గవర్నరు అనుమతితో ఆ ఆదేశాలకు విరుద్ధంగా ప్రవర్తించే అధికారాన్ని సంపాదించారు. ఇది

మంత్రుల స్వాతంత్ర్యానికి బాధ్యతకు అవరోధంగా పరిణమించింది. సాధారణంగా బాధ్యతా యుత విధానంలో మంత్రులు యజమానుల స్థానంలోను ఉద్యోగులు వారికి సలహా ఇచ్చేవారి స్థానంలోను ఉంటారు. వారి సలహాలు మంత్రులకు నచ్చనప్పుడు మంత్రుల అభిప్రాయాను సారం ప్రవర్తించడం వారివిధి. కాని ఉద్యోగివర్గం దీనికి అన్యథాగా ప్రవర్తించసాగింది. ఇది మంత్రుల అతృప్తికి కారణమైంది.

ఉద్యోగవర్గంవారివైఖరిని సమర్థిస్తూ 1922 ఆగస్టులో బ్రిటిషు ప్రధాని లాయడ్ జార్జి పార్లమెంటులో ఒక ఉపన్యాసం చేస్తూ, అందులో "భారత పరిపాలనా నిర్మాణమునకు సివిల్ సర్వీసు ఉక్కు చట్రమువంటిది. దానిపైన ఏలాటి నిర్మాణమైనా స్థాపింపబడవచ్చు. కాని ఆ చట్రాన్ని తొలిగించిన పక్షంలో ఏ నిర్మాణము నిలువజాలదు. అది కూలిపోవడం తప్పదు. దానితో (సివిల్ సర్వీసుతో) మనం జోక్యం కలిగించుకొనరాదు. దానిని ఏ పరి స్థితులలోకూడా బలహీన పరచరాదు. దానికి లభించిన సౌకర్యాలను మనం తగ్గించరాదు. భారత దేశములో బ్రిటిష్‌వారి ధర్మము సరిగా నిర్వర్తింప బడవలెనన్నయెడల ఆ దేశ పరిపాల నమునుండి ఎన్నటికినీ ఐ.సి.యస్. ఉద్యోగులను తొలగింపవీలులేదు...." అని స్పష్టంచేశాడు. బ్రిటిష్ ప్రధానివంటివాడు ఈలాటి అభిప్రాయాలను వ్యక్తం చేయడంతో మంత్రులకు వాస్తవ మైన అధికారాన్ని ఒప్పగించే ఉద్దేశం బ్రిటిష్ అధికారులకు లేకపోవడం రుజువైంది. కాంగ్రెసే తర పక్షాల అతృప్తిని ఇది మరింత బలపరచింది.

(2) సాధారణంగా బాధ్యతాయుత విధానంలో అధినేత స్థానంలో ఉండేవాని అధి కారం నామమాత్రంగాను, వాస్తవాధికారం శాసనసభలకు బాధ్యులైన మంత్రుల వశంలోను ఉంటుంది. అందుచేతనే బ్రిటన్‌లోని రాజుల అధికారం నామ మాత్రమైనట్టిది. వాస్తవంగా ప్రధానమంత్రి తక్కిన మంత్రులు అధికారాన్ని చెలాయించేవారు. ఈ సంప్రదాయాన్ని అనుస రించి రాష్ట్రానికి అధినేత అయిన గవర్నరుకు మంత్రుల వశంచేయబడిన శాఖలపై ఏలాటి అధికారమూ ఉండరాదు. కాని నియమ నిబంధనలు అతని అధికారం వాస్తవరూపం ధరించే టట్లు చేశాయి. మంత్రుల అభిప్రాయాలకు గవర్నరు అభిప్రాయాలకు వైరుధ్యం ఏర్పడినప్పుడు గవర్నరు అభిప్రాయాలే చెల్లవలసిందిగా నియమ నిబంధనలు విధించాయి. ఈ పరిస్థితులలో మంత్రులు శాసన సభలకు బాధ్యత వహించుటకు బదులు గవర్నరుకు బాధ్యతవహించి, అతనికి లోబడి ప్రవర్తించవలసిన వారయ్యారు. 1919 చట్టం మంత్రులకు వాస్తవాధికారం ఉండవల సినట్లు నిర్ణయించినా ఇదివాస్తవ రూపం ధరించలేదు.

(3) మంత్రుల పరిపాలనలోకి వచ్చిన విద్య, వ్యవసాయం మొదలైన శాఖలను అభివృద్ధి చేయుటలో మంత్రులకు ఉత్సాహమూ ఆసక్తి ఉండినా దానికి అవసరమైన ఆర్థిక వనరులు వారి వశంలో లేనందున వారు అభివృద్ధి కార్యక్రమాలను సాగించలేక పోయ్యారు. ఆర్థికశాఖ కార్యనిర్వాహక సభ్యులవశంలో ఉండినది. ఈశాఖపై మంత్రులకు ఏలాటి అధి కారమూ లేదు. దానిపై యాజమాన్యాన్ని వహించిన కార్య నిర్వాహక సభ్యుని (Member of the Executive Council) సహకారం లభిస్తేనేగాని మంత్రులు వారి కార్యక్రమాలను సాగించలేని స్థితిలో ఉండినారు. ఇదికూడ మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలపట్ల వారికి కాలక్రమాన కలిగిన అతృప్తికి కారణమైంది.

(4.) రాష్ట్ర శాసనసభల నిర్మాణంకూడా వాస్తవమైన బాధ్యతాయుత ప్రభుత్వ విధానానికి అనుగుణంగా లేకపోయింది. శాసనసభలోని సభ్యులందరు ప్రజలు ఎన్నుకొన్న సభ్యులు కారు. వారిలో ముప్పై శాతం ప్రభుత్వంక్రింద పనిచేసే ఉద్యోగవర్గానికి చెందిన వారుగాను ప్రభుత్వంచే నామనిర్దేశం చేయబడిన వారుగాను (Nominated) ఉండిరి. వాస్తవమైన బాధ్యతాయుత విధానంలో ఎన్నుకొన్న సభ్యులలో అధికసంఖ్యాకులకు విశ్వాసపాత్రులైనవారు మాత్రమే మంత్రులుగా ఉండడం ఉత్తమ సంప్రదాయం. 1919 చట్టం మంత్రులు శాసనసభకు విశ్వాసపాత్రులుగా ఉండవలెనని విధించింది. ఈ విధించడంవల్ల ఉద్యోగవర్గానికి నామనిర్దేశ సభ్యులకు ఎవరు మంత్రులుగా ఉండడమో నిర్ణయించే అధికారం లభించింది. ఎన్నుకొన్న సభ్యులలో అధికసంఖ్యాకుల విశ్వాసానికి పాత్రులు కానివారుకూడా మంత్రుల పదవులను అనుభవించ గలిగారు.

(5.) 1919 చట్టం గవర్నరుకు సర్టిఫికేషన్ అధికారమనే ఒక ప్రత్యేక అధికారాన్ని కల్పించింది. దీనిమూలంగా శాసనసభ ఆమోదించని బిల్లులను శాసనాలుగా చేయగల అధికారాన్ని, శాసనసభ ఆమోదించని బడ్జెట్టుపద్దులను చట్టసమ్మతం చేయగల అధికారాన్ని గవర్నరు చెలాయించగలిగాడు. ఇందుచేత శాసనసభలకు సాధారణంగా ఉండవగిన అధికారం వాటికి లభించలేదు. ఇదికూడా ప్రజాస్వామ్యదృష్ట్యా మాంటేగు చెమ్సుఫర్డు సంస్కరణలలోని గొప్ప లోపం.

ఈలాటి లోపాలు 1919 చట్టంలో ఉండడం క్రమక్రమంగా కాంగ్రెసేతర పార్టీల వారు తెలుసుకొన్నారు. అందుచేత కాంగ్రెసువారి వలెనే వారుకూడ ఆ చట్టంపట్ల ఉత్సాహాన్ని కోల్పోయి దానిని మార్చడం అవసరమని నిర్ణయానికి వచ్చారు.

చట్టంలో ఇన్నిలోపాలు ఉంటినా అది పూర్తిగా విఫలమైనదని అనుకొనరాదు. ఈ చట్టంక్రింద మంత్రిపదవులలోకి వచ్చిన భారతీయులు పరిపాలన రంగంలో గొప్ప అనుభవాన్ని సంపాదించడమే గాక బాధ్యతతోను దక్షతతోను పరిపాలనను సాగించగలరని రుజువు చేశారు. పరిపాలన సామర్థ్యము యూరోపియన్లకు మాత్రమే ఉన్నదనే బ్రిటిష్‌వారి వాదన నిరాధారమని స్పష్టం చేయగలిగారు. ఇంతేగాక వీరు ప్రజలకు ఉపయోగపడే శాసనాలను కొన్నిటిని వారివశంలోకి వచ్చిన శాఖలలో చేయగలిగారు. మద్రాసులోను మరికొన్ని రాష్ట్రాల లోను మునిసిపాలిటీలలో మొదటిసారిగా ఉచిత నిర్బంధ విద్యావిధానమును ప్రవేశపెట్టినారు. కలకత్తావంటి నగరాలలోను, జిల్లాబోర్డులవంటి సంస్థలలోను ప్రజల ప్రాతినిధ్యాన్ని ఎక్కువ ప్రవేశపెట్టి ప్రభుత్వ అధికారాన్ని తగ్గించగలిగారు.

కేంద్ర పరిపాలనలో 1919 చట్టం బాధ్యతాయుత విధానాన్ని పరిమితంగా కూడా ప్రవేశపెట్టకపోయినా శాసనసభకు ఎన్నుకొనబడిన సభ్యులు ప్రజాభిప్రాయాన్ని పదేపదే ప్రభుత్వానికి తెలియపరచగలిగారు. ప్రభుత్వం ఈ అభిప్రాయానుసారం పరిపాలనను పూర్తిగా సాగించకపోయినా కొన్ని విషయాలలో దానిఫలితంగా తన విధానాలను మార్చుకొన్నది. కొంత వరకు ఇందులో సహాయనిరాకరణ ఉద్యమప్రభావం కనుపిస్తున్నట్లు చెప్పవచ్చు. ఈ ఉద్యమాన్ని బలహీనపరచే ఉద్దేశంతో ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని లెక్కలోకి తీసుకొనుటకు సిద్ధపడింది. ఉదాహరణకు—న్యాయ విచారణలో యూరోపియన్లకు ఉండిన ప్రత్యేక హక్కు

లను తొలగించింది. 1883 నాటి ఇల్బర్టు బిల్లు ఆశయం దీనిమూలంగా కొనసాగింది. శాసన సభ్యుల అభిప్రాయం మేరకు 1921 లో ప్రభుత్వం ఒక కమిటీని నియమించి దాని సిఫారస్సులు ఆధారంగా ప్రజల వాక్స్వాతంత్ర్యాదులపై అంతకుపూర్వం విధించిన నిర్బంధాలను కొంతవరకు సడలించింది. ముద్రణాలయ చట్టంలోని లోపాలలో కొన్నిటిని రద్దుచేసింది. భారతీయ యువకులకు సైనికశిక్షణను ఇచ్చే కార్యక్రమాన్ని ప్రారంభించింది. ఫ్యాక్టరీలలోను గనులలోను పని చేసే కార్మికులకు సౌకర్యాలను కలిగిస్తూ కొన్ని చట్టాలను చేసింది. పరిశ్రమలకు రక్షణకల్పించే ఉద్దేశంతో ఒక టారిఫ్ కమిషన్ (Tariff Commission) ను నియమించింది.

కేంద్ర శాసనసభలోని అనధికార సభ్యులు దేశ ప్రయోజనాల దృష్ట్యా అనేక తీర్మానాలను ప్రవేశపెట్టి చర్చలు సాగించారు. అలాంటి తీర్మానాలలో ఒకటి రాష్ట్రాలలో ద్వంద్వ పరిపాలన విధానానికి బదులు పూర్తిగా బాధ్యతాయుత పరిపాలనను 1924 లోపుగా ప్రవేశపెట్టవలసిందిగా, 1930 లోపుగా భారత దేశానికి డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించవలసిందిగాను కోరింది. ప్రభుత్వం ఈ తీర్మానాన్ని ప్రతిఘటించినా అది సభలో అధిక సంఖ్యాకుల ఆమోదాన్ని పొందగలిగింది. ప్రభుత్వం ఆ తీర్మానాన్ని బ్రిటన్‌లోని అధికారులకు పంపుటకు అంగీకరించింది.

ప్రజాభిప్రాయాన్ని కొంతవరకైనా మన్నించవలసిన అవసరాన్ని ప్రభుత్వం గ్రహించినా మొత్తంమీద అది నిరంకుశంగానే ప్రవర్తిస్తూ వచ్చింది. ఉదాహరణకు—శాసనసభ అభిప్రాయానికి విరుద్ధంగా 1923 లో ఉప్పుపన్నును రెండురెట్లు పెంచింది. ఐ. సి. యస్. ఉద్యోగుల జీతాలను ఇతర సౌకర్యాలను పెంచే ఉద్దేశంతో ఒక కమీషన్‌ను నియమించింది. నిర్బంధ విధానంలో చెప్పుకోదగిన మార్పులు ఏలాటివాటిని ప్రవేశపెట్టుటకు నిరాకరించింది. దమన విధానాన్ని యధాప్రకారం సాగిస్తూనే వచ్చింది. మాంటేగు చెమ్సుఫర్డు సంస్కరణల ఫలితంగా ఎన్నుకొనబడిన మొదటి శాసనసభల కాలంలో —అనగా 1921-23 లో—ప్రభుత్వ వైఖరిలో గొప్ప మార్పు కనుపించలేదు. కాంగ్రెసేతర పక్షాలవారి అతృప్తికి ఇది ప్రధాన కారణమైంది.

1921-23 లో కాంగ్రెసు పక్షానికి చెందినవారు శాసనసభలను బహిష్కరించిన కారణంగా ప్రభుత్వంతో సహకరించే కాంగ్రెసేతర పక్షాలవారు మాత్రమే వాటిలో సభ్యులయ్యారు. 1923 లో కాంగ్రెసులోని ఒకవర్గంవారు స్వరాజ్యపార్టీ అనే పేరుతో ఒకపార్టీని నిర్మాణంచేసి దాని తరపున ఎన్నికలలో పాల్గొని 1924 లో శాసనసభలలో ప్రవేశించారు. ఈలాటి పార్టీ ఏ పరిస్థితులలో నిర్మాణమైనదో, ఏ ఉద్దేశంతో అది శాసనసభలలో ప్రవేశించిందో దాని ఫలితంగా శాసనసభల కార్యక్రమాలలో ఎలాటిమార్పులు వచ్చినవో మనం తెలుసుకోవడం అవసరం. 1924-26 లో స్వరాజ్యపార్టీ ప్రధానపాత్ర వహించడం రాజకీయాలకు లక్షణంగా పరిణమించింది. 1921-23 రాజకీయాలకు 1924-26 రాజకీయాలకు ఇందులోనే గొప్ప భేదం.

## 3

గాంధీ సమష్టి శాసనోల్లంఘనంతో కూడిన సహాయనిరాకరణోద్యమాన్ని ఉపసంహరించుకొన్నా ప్రభుత్వం దమననీతికిగాని నిర్బంధవిధానానికిగాని స్వస్తిచెప్పలేదు సరిగదా వాటిని మరింత తీవ్రంగా వినియోగించసాగింది. ఉద్యమనాయకుడైన గాంధీకి ఆరుసంవత్సరాలు జైలు

శిక్షను విధించింది. ఇదేవిధంగా ఉద్యమంలో పాల్గొన్నవారిలో అనేకులనూ అనుమానాస్పదు లనూ ఏలాటి సాక్ష్యంతోగాని విచారణతోగాని నిమిత్తంలేకుండా నిర్బంధంలో ఉంచింది. ఉద్యమం తిరిగి తలఎత్తకుండా చేయడమే దాని లక్ష్యమైంది.

ఇది కాంగ్రెసువారిలో కొందరికి ఆగ్రహకారణమైనది. వీరు సమష్టి శాసనోల్లంఘనాన్ని తిరిగి ప్రారంభించదలచారు. మరికొందరు ఇందుకో ప్రజలకు ఉత్సాహంలేదనీ, ఇది సాధ్యంకాదనీ భావించారు. మోతీలాల్ చిత్తరంజనదాసు కేల్కారు మొదలైనవారు సహాయ నిరాకరణకార్యక్రమాన్ని మార్చి, 1923 నవంబరులో జరుగనున్న శాసనసభల ఎన్నికలలో కాంగ్రెసువారు పాల్గొని, శాసనసభలలో ప్రవేశించి, వాటిసాధనాన ప్రభుత్వాన్ని ప్రత్యక్షంగా ప్రతిఘటించడం ఉత్తమ విధానమని అభిప్రాయపడినారు.

1922 జూన్‌లో అఖిలభారతకాంగ్రెసుకమిటీ సమావేశమై కాంగ్రెసువారిలో అభిప్రాయ భేదాలు ఏర్పడడం గమనించి వీటిన్నిటిని క్షుణ్ణంగా పరిశీలించి నివేదికను సమర్పించుటకు ఒక కమిటీని నియమించవలసినదిగా అధ్యక్షుడైన హకీం అజ్మల్‌ఖానును కోరింది. ఆ కోరికమేరకు ఆయన మోతీలాల్‌నెహ్రూ, చక్రవర్తుల రాజగోపాలాచారి, డాక్టరు అన్సారి, విఠల్‌భాయ్‌పటేల్,కస్తూరి రంగయ్యంగార్లు సభ్యులుగా తన అధ్యక్షతక్రింద ఒక కమిటీని నియమించాడు. దీనికి శాసనోల్లంఘన విచారణకమిటీ (Civil Disobedience Enquiry committee) అనే పేరు వ్యవహారంలోకి వచ్చింది.

ఈ కమిటీ దేశమంతటా పర్యటించి, ప్రముఖులనేకుల సాక్ష్యాన్ని సేకరించి ఒక నివేదికను సమర్పించింది. అందులో యావద్భారత సమష్టి శాసనోల్లంఘనానికి ప్రజలు సంసిద్ధులుగా లేరని, నిర్మాణకార్యక్రమం పట్ల కూడా వారికి ఉత్సాహం తగ్గిందని సూచించింది. శాసనసభల ప్రవేశాన్ని గురించి కమిటీలో ఏకాభిప్రాయం కుదరలేదు. రాజగోపాలాచారి కస్తూరి రంగయ్యంగారు డాక్టరు అన్సారీలు శాసనసభలలో ప్రవేశించరాదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. మోతీలాల్‌నెహ్రూ, విఠల్‌భాయ్‌పటేల్, అజ్మల్‌ఖాన్‌లు శాసనసభల ప్రవేశాన్ని సమర్థించారు. వీటి బహిష్కరణ యథాప్రకారం జరగవలెననే అభిప్రాయపడినవారికి సనాతనులనీ, ( ro Changers అని మార్పులు కోరనివారికి No Changers అని) పేర్లు వ్యవహారంలోకి వచ్చాయి.

1922 నవంబరులో అఖిలభారతకాంగ్రెసు కమిటీ ఈ నివేదికను పరిశీలించి నివేదికలోని విషయాలను గురించి తుదినిర్ణయాన్ని తీసుకొనే బాధ్యతను డిశంబరులో జరుగనున్న కాంగ్రెసు సమావేశానికి వదలివేసింది.

ఈ మధ్యకాలంలో సనాతనులు సంస్కర్తలమధ్య వాదోపవాదాలు తీవ్రంగా చెలరేగాయి. శాసనసభలలో ప్రవేశించడం కలకత్తా నాగపూరు కాంగ్రెసుల తీర్మానాలకు విరుద్ధమనీ, జాతీయనాయకుడైన గాంధీ దానికి ప్రతికూలుడనీ, శాసనసభలలో ప్రవేశించడం సహాయ నిరాకరణ ఉద్యమం విఫలమైనట్లు బహిరంగంగా అంగీకరించడమేనని, అలాగు అంగీకరించడం కాంగ్రెసు గౌరవానికి ప్రతిష్టకు భంగకరమనీ, స్వరాజ్య సంపాదనకు పూర్తి బహిష్కరణ కార్యక్రమంతోకూడిన సహాయ నిరాకరణమొక్కటే సాధనమని, శాసనసభల ప్రవేశం దానికి

సాధనం కాజాలదని సనాతనులు ప్రచారాన్ని సాగించారు. పరిస్థితులు మారినపుడు కార్యక్రమాన్ని మార్చుకొనడం ప్రాజ్ఞత అనీ, గాంధీకూడా అనేక పర్యాయాలు కార్యక్రమాలను మార్చుకొన్నాడని, యుద్ధంలో ఒక వ్యూహం విఫలమైనప్పుడు ఇంకొక వ్యూహాన్ని పన్నుకొనడం అవసరమని, శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వాన్ని ప్రతిఘటించడంకూడా ఒక విధమైన సహాయ నిరాకరణమే అని, కాంగ్రెసువారు శాసనసభలలో ప్రవేశించని పక్షంలో కాంగ్రెసే తరులువాటిలో ప్రవేశించి ప్రజలకు హానిని కలిగించే కార్యక్రమాలలో ప్రభుత్వానికి సహాయపడే ప్రమాదం ఉన్నదని, ఈ పరిస్థితులలో కాంగ్రెసువారు శాసన సభలలో ప్రవేశించని పక్షంలో ప్రజల విశ్వాసాన్ని కాంగ్రెసు కోల్పోవునని, అది వాంఛనీయ పరిణామం కాజాలదని సంస్కర్తలు ప్రచారం చేశారు.

ఈలాటి వాతావరణంలో డిసంబరు ఆఖరువారంలో కాంగ్రెసు చిత్తరంజనదాసు అధ్యక్షతన గయలో సమావేశమైంది. అధ్యక్ష ఉపన్యాసంలో దాసు శాసనసభలలో ప్రవేశాన్ని సహేతుకంగా సమర్థించాడు. కాని చర్చలలో రాజగోపాలచారి మొదలైన సనాతనులు దానిని తీవ్రంగా ఖండించారు. తుదకు కాంగ్రెసు శాసనసభల బహిష్కారం యధా ప్రకారం జరగవలసిందిగా తీర్మానించింది. సనాతనులకు విజయం లభించింది.

కాని సంస్కర్తలు ఆశాభంగాన్ని పొందలేదు. సమావేశం ముగిసిన వెంటనే దాసు తన అధ్యక్షపదవికి రాజీనామాచేసి, నెహ్రూ, కేల్కారు మొదలైనవారితోకలిసి శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం ప్రాతిపదికగా స్వరాజ్యపార్టీ అనేపేరుతో ఒక పార్టీని నిర్మాణంచేశాడు. అయితే ఈ పార్టీవారు కాంగ్రెసును విడనాడిపోవుటకు ఇష్టపడలేదు. కాంగ్రెసులో ఒకభాగంగా తమ కార్యక్రమాలను సాగించుటకు నిశ్చయించు కొన్నారు. సనాతనులకు ఇది రుచించలేదు. రెండు వర్గాలమధ్య వాదోపవాదాలు చెలరేగుతూనే వచ్చాయి.

ఈ వాగ్వాదాల మూలంగా కాంగ్రెసు బలహీనత గాంచే ప్రమాదం ఏర్పడగలదని నాయకులనేకులు భావించి రెండు వర్గాలమధ్య రాజీ కుదుర్చుటకు ప్రయత్నించారు. అందులో అబ్దుల్‌కలాం అజాద్ ప్రధానపాత్ర వహించాడు. ఆ ప్రయత్నాల ఫలితంగా శాసనసభల బహిష్కరణను గురించి పునరాలోచించుటకు ప్రత్యేకకాంగ్రెసుసమావేశం సెప్టెంబరులో జరగవలసినట్లు అఖిలభారత కాంగ్రెసుకమిటీ తీర్మానించింది. దానిమేరకు డిల్లీలో అజాద్ అధ్యక్షతన సమావేశం జరిగింది. అందులో "శాసనసభా ప్రవేశమునకు మత సంబంధమునైన అభ్యంతరములుగాని, అంతరాత్మ సంబంధమైన అభ్యంతరములుగాని లేనివారందరు శాసన సభలకు అభ్యర్థులుగా నిలవవచ్చును. వారు రాబోయ్యే ఎన్నికలలో వోటింగుహక్కును కూడా చెలాయించ వచ్చును. కాబట్టి శాసనసభా ప్రవేశమునకు ప్రతికూల ప్రచారమును వెంటనే ఈ కాంగ్రెసు ఆపివేయవలసినదిగా కోరుతున్నది" అని తీర్మానింపబడింది. గయలో ఓటమి గాంచిన స్వరాజ్యపక్షంవారు డిల్లీలో విజయాన్ని సాధించారు. ఈ తీర్మానాన్నే డిసంబరులో మహమ్మదాలీ అధ్యక్షతన కాకినాడలో సమావేశమైన కాంగ్రెసు సాధారణ సమావేశము దృఢపరచింది.

ఈ మధ్యకాలంలో—అనగా 1923 నవంబరులో—శాసనసభలకు ఎన్నికలు జరిగాయి. దాని ఫలితంగా స్వరాజ్య పార్టీవారు కేంద్ర శాసనసభలో 48 స్థానాలను గెలుచు

కొన్నారు. మధ్యప్రదేశ్ శాసనసభలో వారికి అధిక సంఖ్యాకబలం (Majority) లభించింది. బెంగాలు శాసనసభలో తక్కిన పార్టీలకంటె వారికి ఎక్కువ సంఖ్యలో స్థానాలు లభించాయి. బొంబాయి, ఉత్తరప్రదేశ్, ఆసాం సభలలో వారికి కొంత బలం లభించింది. పంజాబు, మద్రాసు సభలలో వారిలోకొందరు మాత్రమే గెలిచారు. బిహారు, ఒరిస్సాలలో వారికి ఒక స్థానంకూడా లభించలేదు. కేంద్ర శాసనసభలో 48 స్థానాలను సంపాదించడం దేశంలోని వోటర్లలో అధిక సంఖ్యాకులు వారిపట్ల విశ్వాసం కలవారనే విషయాన్ని రుజువు చేసింది.

ఈ ఎన్నికలలో లిబరల్ పక్షంవారు (అంటే మితవాదులు) పూర్తిగా ఓడిపోయ్యారు. వారిలో మహామహులుగా చాలా కాలాననుండి ప్రఖ్యాతిగాంచిన సురేంద్రనాద్ బ్యెనర్జీ, శేషగిరి అయ్యర్, పరాంజపి, చింతామణి మొదలైనవారు కూడా విజయాన్ని సాధించలేక పొయ్యారు. భారత రాజకీయాలలో మితవాదుల ప్రాబల్యం ఈ ఎన్నికలతో అంతరించింది.

## 4

డిల్లీ కాకినాడ కాంగ్రెసులలో స్వరాజ్య పార్టీవారి శాసనసభల ప్రవేశాన్ని ఆమోదించినా నోచేంజర్లు సనాతనులు) వారిని విమర్శిస్తూనే వచ్చారు. కాంగ్రెసులో ఈ రెండు వర్గాలమధ్య పూర్తి సహకారం కుదరలేదు. దేశంలో సమష్టి శాసనోల్లంఘనంతో కూడిన సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించుటకు అనుకూల పరిస్థితులు లేవినాడు ఆలాటి పరిస్థితులను కల్పించుటకు సాధనమైన నిర్మాణ కార్యక్రమాన్ని పునరుద్ధరించుటకుబదులు వీరు స్వరాజ్య పార్టీని విమర్శించడంలో వారికాలాన్ని వ్యర్థపుచ్చుతూ వచ్చారు.

ఈలాటి వాతావరణంలో అనారోగ్యం కారణంగా గాంధీ ఆరు సంవత్సరాల శిక్షాకాలం పూర్తికాకముందే 1924 ఫిబ్రవరి 5 న జైలునుండి విడుదలయ్యాడు. కాంగ్రెసుకేగాక దేశానికంతా ఆయన ఏకైక నాయకుడనేభావం అన్ని వర్గాలలో వ్యాపించి ఉండినది. ఆయన శాసనసభల ప్రవేశాన్ని ఖండించి స్వరాజ్యపక్షంవారి కార్యక్రమాన్ని మార్చగలడనే విశ్వాసం నోచేంజర్లకు కలిగించి. తాము ఏ ఉద్దేశాలతో శాసనసభలను ప్రవేశించింది ఆయనకు విశదపరచినయెడల తమ కార్యక్రమాన్ని ఆయన ఆమోదించగలడనే ఆశ మోతీలాల్‌కు దాసుకు కలిగింది. వారు ఏప్రిలులో ఆయనను కలుసుకొని తమ కార్యక్రమాన్ని గురించి ఆయనతో సంభాషణలు జరిపారు శాసనసభల ప్రవేశం సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమానికి విరుద్ధమనేభావాన్ని ఆయన మార్చుకొనలేమగాని డిల్లీ కాకినాడ కాంగ్రెసులు దానిని ఆమోదించిన కారణంగా తాను దానిని ప్రతిఘటించరాదనే నిర్ణయానికి వచ్చాడు. నోచేంజర్లకుకూడా దానిని ప్రతిఘటించరాదని సలహా ఇచ్చాడు. దేశంలో జరగవలసింది నిర్మాణ కార్యక్రమమనీ అన్ని వర్గాలవారు దానిని కలిపి సాగించవచ్చుననీ. ప్రధానంగా నోచేంజర్లు వారి దృష్టిని దానిలో కేంద్రీకరించ వలసిందని వారికి నచ్చచెప్పాడు. మోతీలాల్ దాసులతో సంభాషణలు జరిగిన తర్వాత ఆయన చేసిన ప్రకటనలో ఈ అభిప్రాయాన్ని స్పష్టం చేశాడు.

శాసనసభల ప్రవేశాన్ని ఆయన ప్రతిఘటించక పోయినా కొన్ని నెలలవరకు ఆయనకు మోతీలాల్ దాసులకు మధ్య పూర్తిఏకీభావం కుదరలేదు. కద్దరు ఉత్పత్తి, రాట్నాలపై నూలు వడకడం, పంచవిధ బహిష్కరణల పాటించడం మొదలైన విషయాలగురించి వారి మధ్య అభిప్రాయభేదాలు ఏర్పడినవి. ఆయన దృష్టిలో దేశంలోని దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్ని

నిర్మూలించుటకు రాట్నము కద్దరుతప్ప వేరే సాధనంలేదు. వీటిలో కాంగ్రెసు వారందరు పాల్గొనినపక్షన నగరవాసులైన విద్యాధికులకు గ్రామాలలోని ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పడి సామాన్య ప్రజలలో రాజకీయ చైతన్యం కలుగుతుంది. స్వరాజ్య సంపాదనమునకు ఇది తప్పక అవసరం. ఇదేవిధంగా బిరుదములను, న్యాయస్థానాలను, ప్రభుత్వ సహాయాన్ని పొందే విద్యాలయాలను, విదేశ వస్త్రాలను, శాసనసభలను బహిష్కరించడం కాంగ్రెసువారి కర్తవ్యం. కలకత్తా నాగపూరు కాంగ్రెసులు వీటినిగురించి చేసిన నిర్ణయాలకు కాంగ్రెసు వారందరూ, వారిలో ప్రధానంగా కాంగ్రెసు కమిటీలలో సభ్యులుగా ఎన్నికైన వారు కట్టుబడి ఉండడంకూడా అవసరం. ఈ విషయంలో కమిటీలసభ్యులు ఇతరులకు మార్గదర్శకులుగా ఉండవలెను. ఇంతేగాక ఏ పరిస్థితులలోకూడా వారు అహింసను విడనాడరాదు. దానిని విడనాడిన వారిపట్ల సానుభూతిని ప్రదర్శించరాదు. ఇవి అన్నీ జైలుకు వెళ్ళుటకు పూర్వం ఆయన ప్రతిపాదించిన కార్యక్రమాలు. జైలునుండి విడుదలైన తర్వాతకూడా వీటి పట్ల ఆయనకుగల విశ్వాసం ఎంతమాత్రం తగ్గలేదు. కాని ఈ విశ్వాసం ఆయనకూ మోతీలాల్ దాసులవంటి నాయకులకు మధ్య అభిప్రాయభేదాలు బలపడుటకు కారణములైనాయి.

1924 జూన్‌లో అఖిలభారత కాంగ్రెసు కమిటీ అహమ్మదాబాదులో సమావేశమైనప్పుడు ఈ భేదాలు తారాపథాన్ని అందుకొన్నాయి. ఆ సమావేశంలో పై కార్యక్రమాలను ఖచ్చితంగా అమలుపరచే ఉద్దేశంతో ఆయన కొన్ని తీర్మానాలను ప్రవేశపెట్టాడు. వాటిలో ఒకటి: "కాంగ్రెసు కమిటీలలో సభ్యులుగా ఉండేవారు ప్రతిరోజు అరగంట రాట్నంమీద నూలు వడకవలసిందిగాను, నెలనెలా 2000 గజాల నూలును కాంగ్రెసు ఆఫీసుకు పంపవలసిందిగాను, ఆలాగు వారు చేయనియెడల వారి సభ్యత్వ స్థానాలు వెంటనే ఖాళీ కాగలవని" విధించింది. ఈలాటి తీర్మానం కాంగ్రెసు నియమావళికి విరుద్ధమనీ దానిని చర్చించరాదని మోతీలాల్ ఆక్షేపించాడు. కాని సమావేశంలో 68 సభ్యులు ఆక్షేపణకు అనుకూలంగాను 82 సభ్యులు ప్రతికూలంగాను వోటుచేయడంచేత అదివీగిపోయింది.

తీర్మానం చర్చకురాగా గాంధీ, "స్వరాజ్యాన్ని సంపాదించే ప్రయత్నంలో కాంగ్రెసు నియమావళికి విరుద్ధంగా ప్రవర్తించవలసి వచ్చినా ఆలాగు ప్రవర్తించడమే మనవిధి" అని తీర్మానాన్ని బలపరచాడు. కాని మోతీలాల్ ఆయనపై కత్తిదూసినట్లు ఆయనను ప్రతిఘటిస్తూ "చర్కా మూలంగా మనకు స్వరాజ్యం లభించను. గాంధీ జైలులో ఉండగా సభ్యులలో ఎందరు నూలువడకినారో చెప్పగలరా? మాకు (స్వరాజ్యం పక్షంవారికి) నిర్మాణ కార్యక్రమంలో విశ్వాసం లేకపోలేదు. కాని దానిమూలంగానే మనకు స్వరాజ్యం లభించగలదని మేము విశ్వసించుటలేదు. కార్య నిర్వాహక కమిటీలోను ఇతర కమిటీలలోను మాకు సభ్యత్వం లేకుండా చేయుటకే ఈ తీర్మానం ఉద్దేశింప బడింది. దానికి మే మెన్నడూ అంగీకరించము. కాంగ్రెసు అందరికీ చెందిన సంస్థ. ఒక సనాతనులకు మాత్రమే చెందినది కాదు. దాని నియమావళికి విరుద్ధమైన ఈ తీర్మానానికి నిరసనగా మేము సమావేశాననుండి బయటకు వెళ్ళిపోవుచున్నాము" అని ఉద్ఘాటించి బయటకు వెళ్ళిపోయినాడు. స్వరాజ్య పక్షానికి చెందిన వారందరు ఆలాగే చేశారు.

తర్వాత తీర్మానాన్ని వోటుకు పెట్టగా దానికి అనుకూలంగా 67 సభ్యులు ప్రతికూలంగా 37 సభ్యులు వోటుచేశారు. అది నెగ్గిందికాని గాంధీకి ఈ పర్యవసానం ఎంత

మాత్రము తృప్తి కలిగించలేదు. స్వరాజ్య పక్షంవారు బయటికి వెళ్ళిపోక వోటింగులో పాల్గొని ఉండిన పక్షాన తీర్మానం వీగిపొయ్యేది అని భావించి స్వరాజ్యపక్షంవారిని సమాధాన పరచే ఉద్దేశంతో తీర్మానంలోని రెండవభాగాన్ని (శిక్షాసూత్రాన్ని) రద్దుచేశాడు. అందుచేత వారు తర్వాతి చర్చలలో పాల్గొన్నారు.

ఆయన ప్రవేశపెట్టిన రెండవతీర్మానం పంచవిధ బహిష్కరణములను నిర్వర్తింపని వారినిగాని, వాటిపట్ల విశ్వాసంలేని వారినిగాని కాంగ్రెసు కమిటీలకు ఎన్నుకొనరావనేది. కాని స్వరాజ్యపక్షంవారిని సంతృప్తిపరచదలచి శాసనసభల బహిష్కరణను అంగీకరించనివారి విషయంలో ఈ తీర్మానం వర్తించదని నిర్ణయింపబడింది.

ఆయన ప్రవేశపెట్టిన ఇంకొక తీర్మానము అర్నెస్టుడే అనే యూరోపియనును గోపీనాథసాహా అనే యువకుడు హత్యచేసిన విషయానికి సంబంధించినట్టిది దీనిని గురించి అంతకు పూర్వము బెంగాలురాష్ట్ర రాజకీయసభ చర్చించి సాహా దేశభక్తిని స్వార్థత్యాగాన్ని కొనియాడుతూ ఒక తీర్మానము చేసినది. గాంధీకి ఈ తీర్మానం ఎంతో విచారాన్ని కలిగించింది. అహమ్మదాబాదు సమావేశంలో అతని చర్యను ఖండిస్తూ, అటువంటిచర్య కాంగ్రెసు అహింసా సిద్ధాంతమునకు ప్రతికూలమని, వాటివలన స్వరాజ్యాభ్యుదయమునకు ఆటంకము కలుగునని గాంధీ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టినాడు. దానిపైన తీవ్రమైన వాదోపవాదాలు జరిగినవి. వంగ రాష్ట్రానికిచెందిన దాసుకు ఆ తీర్మానము ఎంతమాత్రము రుచించలేదు. దానిని ఓటింగుపెట్టి నప్పుడు 78 సభ్యులు మాత్రమే దానికి అనుకూలంగాను, 70 సభ్యులు దానికి ప్రతికూలంగాను వోటు చేశారు. ఇందరు సభ్యులు సాహా ప్రవర్తనను ఖండించకపోవడం గాంధీకి ఎంతో విచారాన్ని కలిగించి ఆయన కళ్ళనీళ్ల పెట్టుకొనడంకూడా జరిగింది. ఆయన ఇన్ని సంవత్స రాలుగా ప్రచారంచేసిన అహింసాసిద్ధాంతం విఫలమైనట్లు భావించాడు. మొత్తంమీద అహమ్మ దాబాదులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సమావేశం ఆయనకు ఒక విధంగా కనువిప్పును కలిగించింది. కాంగ్రెసులోని ప్రముఖులలో సుమారు సగానికి సగం తనతో ఏకీభవించని వారనేది ఆయనకు స్పష్టమైనది. ఏదోవిధంగా స్వరాజ్యపక్ష నాయకులైన మోతీలాల్ దాసులతో ఒడంబడిక చేసుకొని కాంగ్రెసువర్గాల మధ్య పూర్తి ఐకమత్యాన్ని సాధించడం తన కర్తవ్య మనే నిర్ణయానికి వచ్చాడు.

ఈ నిర్ణయానికి రావడంలో మరిరెండు పరిస్థితులు ఆయనపై ప్రభావం వహించాయి. వాటిలో మొదటిది హిందువులు మహమ్మదీయులమధ్య 1921-22 లో ఏర్పడిన స్నేహభావం అంతరించి ద్వేషభావం ముదిరి అనేక మతకలహాలకు దారితీయడం, కాంగ్రెసువర్గాల మధ్యనే కాక హిందువులు ముస్లింల మధ్యను, కాంగ్రెసు కాంగ్రెసేతర పార్టీలమధ్యను ఐకమత్యాన్ని కుదర్చవలసిన అవసరం ఏర్పడినట్లు ఆయన భావించాడు. కాంగ్రెసువర్గాలమధ్య ఐకమత్యం ఏర్పడడం దీనికి మొదటిమెట్టని ఆయన తలచాడు. ఇదిగాక కాంగ్రెసులోని విభేదాలను ఆధా రంగా చేసుకొని 1924 లో ప్రభుత్వం—ప్రధానంగా బెంగాలు ప్రభుత్వం—దాని నిర్బంధ విధానాన్ని బలపరచి స్వరాజ్యపార్టీని అణచివేయుటకు సిద్ధపడింది. ఈ విధానాన్ని ఎదుర్కొ నడం అన్నిటికంటె అవసరమని గాంధీ గ్రహించాడు.

---

* ఇందుచేతనే ఈ సమావేశాన్ని గురించి ఇంత వివరంగా చెప్పవలసి వచ్చింది.

ఈలాటి పరిస్థితులఫలితంగా గాంధీ 1924 నవంబరులో కలకత్తాకు వెళ్ళి మోతీలాల్ దాసులతో సంప్రతింపులు జరిపి వారితో ఒక ఒడంబడికకు వచ్చాడు. దానిప్రకారం (1) విదేశ వస్త్ర బహిష్కరణము తప్ప తక్కిన బహిష్కరణములూ, సహాయనిరాకరణోద్యమమూ పూర్తిగా ఉపసంహరించుకోబడినాయి. ఇది స్వరాజ్యపక్షంవారికి సంతృప్తి కలిగించింది. దీని ఫలితంగా కాంగ్రెసేతర పార్టీలవారుకూడా కాంగ్రెసుతో కలిపి ప్రభుత్వం అనుసరిస్తున్న నిర్బంధ విధానాన్ని ప్రతిఘటించగలరనే ఆశ దేశంలో వ్యాపించింది. (2) నూలువడుకుట ఖద్దరు ఉత్పత్తి, అస్పృశ్యతా నివారణము, హిందూ మహమ్మదీయ సఖ్యత అనే అంశాలతో కూడిన నిర్మాణకార్యక్రమాన్ని కాంగ్రెసులోని అన్నివర్గాలవారు సాగించవలసినట్లుగా నాయకులు ముగ్గురూ అంగీకరించారు. (3) శాసనసభలలోని కార్యక్రమాలను స్వరాజ్యపక్షంవారు స్వతంత్రంగాకాక కాంగ్రెసుతరఫున జరపవలసిందిగా ముగ్గురూ అంగీకరించారు. దీనితో కాంగ్రెసు ఒక సంస్థ, స్వరాజ్యపక్షం వేరొక సంస్థ అనే భావం అంతరించింది ఇది మొదలు స్వరాజ్య పక్షంవారు కాంగ్రెసులో పూర్తిగా లీనమైపోయినారు. కాంగ్రెసులోని ఏవర్గంవారూ వారిని విమర్శించే అవకాశం లేకపోయింది. అన్ని వర్గాలమధ్య పూర్తి సహకారం కుదిరింది.

1924 డిసంబరు ఆఖరువారాన గాంధీ అధ్యక్షతన బెల్గాంలో కాంగ్రెసు సమావేశం జరిగింది. అందులో పై ఒడంబడిక దృఢపరచబడింది. ఈ విధంగా విభేదాలతో ప్రారంభమైన 1924 వ సంవత్సరం పూర్తి ఐకమత్యంతో ముగిసింది. ఈ ఐకమత్యానికి చిహ్నంగా స్వరాజ్య పార్టీవారు గాంధీ అభిప్రాయాన్ని అనుసరించి కాంగ్రెసు సభ్యత్వానికి ఇదివరకు ఉండినపావలా చందాకాక నూలువడుకు చందాకు అంగీకరించారు. ఈ అంగీకారం ప్రకారం కాంగ్రెసులో సభ్యత్వాన్ని కోరేవారు ఏటేట 2000 గజాల వడికిన నూలును కాంగ్రెసు కార్యవర్గానికి అందజేయవలెను. ఖద్దరుమూలంగానే దేశానికి ఆర్థికవిముక్తి, రాజకీయవిముక్తి లభించగలదనేది గాంధీ విశ్వాసము. స్వరాజ్యపార్టీవారికి అలాటి విశ్వాసం లేకపోయినా ఆయనతో రాజీ చేసుకొనడంలో ఈ విషయంలో ఆయనతో అంగీకరించడం అవసరమని కాంగ్రెసు చందా సందర్భాన ఈ నియమానికి అంగీకరించారు.

గాంధీకి స్వరాజ్యపక్షంవారికి పూర్తి సహకారం కుదరడంతో 1925 సెప్టంబరులో పాట్నాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఆఖరుమెట్టును అధిరోహించింది. కాంగ్రెసు ఒక రాజకీయ సంస్థమాత్రమేనని, స్వరాజ్యపక్షంవారి కార్యక్రమాలన్నీ కాంగ్రెసు కార్యక్రమాలే అని, ఖద్దరుకు సంబంధించిన కార్యక్రమాలన్నీ అఖిలభారత చర్కాసంఘం అనే ప్రత్యేక సంస్థ కాంగ్రెసుకు అనుబంధంగా నిర్వహించవలెననీ, కాంగ్రెసు సభ్యత్వానికి నూలు చందా మాత్రమేకాక పావలాచందాకూడా ఇయ్యవచ్చునని నిర్ణయించబడింది. ఈ తీర్మానాల ఫలితంగా స్వరాజ్యపక్షం కాంగ్రెసుపై సర్వాధికారాన్ని వహించింది.

1924 లో జైలునుండి విడుదలయినప్పుడే రాజకీయాలనుండి విరమించి తన దృష్టి నంతా నిర్మాణకార్యక్రమంలో కేంద్రీకరించవలసినట్లుగా గాంధీ నిర్ణయించుకొన్నాడు. అనారోగ్య పరిస్థితులు కారణంగా ఆయన జైలునుండి విడుదలచేయబడ్డాడు. లేనిపక్షంలో 1928 మార్చి వరకు జైలులో కాలంగడుపుతూ రాజకీయాలనుండి విరమించుకొనవలసినవాడు. ప్రభుత్వ ఔదార్యంవల్ల బయటకు రాగలిగినా శిక్షాకాలం పూర్తి అయ్యేవరకూ రాజకీయాలలో ఎక్కువగా

పాల్గొనక ఉండడం ధర్మం అనే నిర్ణయానికి వచ్చాడు. అందుచేతనే ఆయన క్రమ క్రమంగా రాజకీయాలన్నిటినీ స్వరాజ్యపక్షానికి వదలి, తాను ఖద్దరు, అస్పృశ్యతా నివారణము మొదలైన నిర్మాణ కార్యక్రమాలలో మాత్రమే శ్రద్ధవహించి 1924-28 లో ఎక్కువ కాలాన్ని దేశ పర్యటనలోను, నిర్మాణకార్యక్రమ సందేశాన్ని సామాన్యప్రజలకు అందజేయడంలోను గడిపాడు. నియమాలను పాటించడం ఆయన జీవితానికి ఒక ప్రధానలక్షణం. జైలుకు బైట ఉండికూడా జైలు నియమాలను పాటించి రాజకీయాలనుండి నాలుగు సంవత్సరాలకాలం విరమించడం ఈ దృష్ట్యా ప్రాధాన్యం వహిస్తున్నది.

1923 నవంబరు ఎన్నికలలో పాల్గొని స్వరాజ్యపక్షంవారు శాసనసభలలో ప్రవేశించారు. దీని మూలంగా వారు ఏమి సాధించగలిగారో తెలుసుకొనడం అవసరం.

## 5

స్వరాజ్యపక్షంవారికి కేంద్రశాసనసభలో 48 స్థానాలు మాత్రమే లభించాయి శాసన సభలోని సభ్యుల మొత్తంసంఖ్య 145. ఈ పరిస్థితిలో స్వరాజ్యపక్షంవారు తమంతట తాము ప్రభుత్వాన్ని ప్రతిఘటించి విజయాన్ని సాధించడం సాధ్యంకానిపని; కాని శాసనసభలో జిన్నా నాయకత్వాన 24 సభ్యులు ఉండినారు. 1924 లో వారు స్వరాజ్యపక్షంతో కలిసి కృషిచేయుటకు సిద్ధపడ్డారు. ఈ కలియకమూలంగా జాతీయపక్షం అనే పేరుతో ఒకపక్షం ఏర్పడింది. ఈ పక్షానికి చెందినవారు సత్వర స్వరాజ్యసంపాదనకు అనుగుణమైన తీర్మానాలను, దేశప్రయోజనాలదృష్ట్యా ప్రాధాన్యాన్ని వహించిన ఇతర తీర్మానాలను శాసనసభలో ప్రవేశపెట్టి, ప్రభుత్వం వాటిని తిరస్కరించినా, శాసనసభలోని అధికసంఖ్యాకుల ఆమోదాన్ని సంపాదించగలిగారు. ఇంతేగాక దేశశ్రేయస్సుకు భంగకరమైన బిల్లులను ప్రభుత్వం ప్రవేశపెట్టినప్పుడు వాటిని ప్రతిఘటించి ప్రభుత్వాన్ని ఓడించగలిగారు. ఇదేవిధంగా బడ్జెట్టు పద్దులను త్రోసివేయగలిగారు. మొత్తంమీద 1924 లో స్వరాజ్యపక్షంవారు ఏ ఉద్దేశాలతో శాసనసభలలో ప్రవేశించారో జిన్నా సహాయంతో వాటిని సాధించగలిగారు.

1925 లో ఉభయవర్గాలమధ్య కలయిక కొంత సడలింది. జిన్నాకు పూర్తిగా ప్రభుత్వ కార్యక్రమాలను ప్రతిఘటించడం ఇష్టంకాకపోయింది. అందుచేత స్వరాజ్యపక్షంవారు, కొన్ని సందర్భాలలో మాత్రమే విజయాన్ని సంపాదించడం, తక్కిన సమయాలలో అపజయాన్ని ఎదుర్కొనడం జరిగింది. ఈ పరిస్థితి వారికి ఆశాభంగాన్ని కలిగించింది. అందుచేత 1926 మార్చిలో వారు శాసనసభనుండి బయటకు వెళ్ళి శాసనసభకార్యక్రమాలలో (కొన్ని మినహాయింపులకు లోబడి) పాల్గొనడం మానుకొన్నారు.

స్వరాజ్యపక్షంవారి ప్రధానమైన ఆశయం సత్వరంగా స్వరాజ్యాన్ని సంపాదించడం. దీనికి అనుగుణంగా వారు 1924 లో రెండు తీర్మానాలను, 1925 లో ఒకతీర్మానాన్ని ప్రవేశపెట్టి చర్చలోకి తెచ్చారు. వీటిలో మొదటి తీర్మానాన్ని స్వరాజ్యపక్ష నాయకుడైన మోతీలాల్ నెహ్రూ 1924 ఫిబ్రవరి 8 న ప్రవేశపెట్టాడు. అది ఈ క్రిందివిధముగా ఉండినది.

"సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమును [Full Responsible Government] దేశంలో ప్రవేశపెట్టుటకు అనుగుణంగా 1919 భారతదేశ ప్రభుత్వచట్టాన్ని సవరించుటకు

కావలసిన చర్యలను తీసుకొనవలసినదిగా ఈ సభ గవర్నరుజనరల్‌కు సిఫారసు చేస్తున్నది. అందుకుగాను (1) ఒక రౌండుటేబిల్‌సభను (Round Table Conference) సమావేశపరచ వలసిందిగాను, అందులో ప్రజలందరికి ప్రాతినిధ్యం ఉండవలసినట్లుగాను దేశంలోని అల్ప సంఖ్యాకవర్గాల హక్కుల రక్షణకు అవసరమైన నియమ నిబంధనలతో కూడిన ఒక రాజ్యాం గాన్ని ఆ సభ రూపొందించవలసిందిగాను (2) ఆ రాజ్యాంగాన్ని కొత్తగా ఎన్నుకోబడిన భారతశాసనసభ చర్చించి ఆమోదించవలసిందిగాను (3) దాని ఆమోదము లభించిన తర్వాత ఆ రాజ్యాంగాన్ని బ్రిటిష్ పార్లమెంటుచట్టం చేయవలసిందిగాను ఈ సభ కోరుచున్నది"

ఈ తీర్మానంలోని లక్షణాలను కొన్నిటిని గుర్తించడం అవసరం. (1) వీటిలో మొదటిది సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ విధానాన్ని వెంటనే ప్రవేశ పెట్టవలెననేది. ఇందు లోనే కాంగ్రెసుకూ తక్కిన రాజకీయ పక్షాలకూ భేదం వున్నట్లు ఇదివరకే తెలుసుకొన్నాము. (2) దీనికి అనుగుణమైన కొత్త రాజ్యాంగాన్ని ప్రజాప్రతినిధులతో కూడిన రౌండుటేబిల్ సభ రూపొందించవలెననేది. ఇంతకు పూర్వం భారతదేశ ప్రభుత్వ విధానాన్ని రూపొందించే హక్కూ అధికారమూ బ్రిటన్‌లోని పార్లమెంటుకు ఉండేది. కాని ఇది జాతీయ సిద్ధాంతానికి పరమ విరుద్ధం. ఈ సిద్ధాంతం ప్రతి జాతికీ దానిని పాలించుటకు అనుగుణమైన రాజ్యాంగాన్ని రూపొందించుకొనే స్వాతంత్ర్యం ఉండవలసిందని ప్రతిపాదిస్తున్నది. ఇదియే సక్రమమయిన పద్ధతి అని మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటన్ మొదలయిన దేశాలలోని అధికారులు ప్రచారం చేశారు. ఆనాటి అమెరికా అధ్యక్షుడు విల్సన్ దీనికి "జాతీయ స్వయం నిర్ణయ సూత్రం" (Nat onal selfdetermination) అని నామకరణం చేసి, ఇది అన్ని జాతులకు వర్తించవలసిందిగా నిరూపించాడు. భారతదేశంలోని నాయకులందరూ దీనిచే ప్రభావితులైనారు. మోతీలాల్ ప్రవేశపెట్టిన తీర్మానం ఈ సూత్రానికి అనుగుణమైనట్టిది. (3) రౌండుటేబిల్ సభ రూపొందించిన రాజ్యాంగాన్ని కొత్తగా భారతీయులు ఎన్నుకొన్న కేంద్ర శాసనసభ ఆమోదించ వలెననేది మోతీలాల్ తీర్మానంలోని మూడవ విశేషం. అప్పుడుగాని అది ప్రజాభిప్రాయానికి అనుగుణంగా ఉండదు. (4) బ్రిటన్‌లోని పార్లమెంటుకు దీనిని చట్టం చేసే అధికారం మాత్రమే ఉండవలెననేది ఇందులోని నాల్గవ విశేషం. బ్రిటిష్ సామ్రాజ్యానికంతా చట్టాలను చేసే లాంఛనాధికారం ఈ పార్లమెంటుకు ఉండడం చేతనూ, బ్రిటిష్ సామ్రాజ్యాన నుండి విడి పొయ్యే ఉద్దేశం భారతీయులకు లేనందునను ఈలాటి అధికారం పార్లమెంటుకు ఉండడం అవసరం. కాని ఈ అధికారాన్ని రాజ్యాంగాన్ని ఇష్టం వచ్చినట్లు మార్చుటకు వినియోగించ రాదనీ శాసన సభ ఆమోదించిన చట్టాన్ని యథాతథంగా చట్టంగా చేయవలసిందని తీర్మానం స్పష్టం చేసింది. సామ్రాజ్యంలోని ఆస్ట్రేలియా, కనడా, దక్షిణ ఆఫ్రికాల రాజ్యాంగాలన్నీ ఈ విధంగానే రూపొందించబడినాయి. భారతదేశ విషయంలో కూడా ఈ మార్గమే అనుసరణీయ మని మోతీలాల్ ఉద్ఘాటించాడు.

ఈ తీర్మానాన్ని శాసన సభ మూడు రోజులపాటు చర్చించింది. భారతదేశంలో మత భేదాలు, కుల భేదాలు, ప్రాంతీయ భేదాలు లెక్క లేకుండా ఉండడం చేతను, కాంగ్రెసువారు అల్ప సంఖ్యాకులై ప్రజలందరి తరపున మాటలాడగల అర్హత లేనివారు కావడం చేతను, సామాన్య ప్రజలకు బ్రిటిష్ పరిపాలన పట్ల మాత్రమే అధిక విశ్వాసం ఉండడం చేతను, బ్రిటిష్ ప్రభుత్వం తొలగిన పక్షంలో అధికారాన్ని ఏ స్వల్ప సంఖ్యాకులో వహించే ప్రమాదం

ఉండడం చేతను, మోతీలాల్ ప్రవేశపెట్టిన తీర్మానం ఆచరణ యోగ్యం కాజాలదని ప్రభుత్వం తరపు సభ్యులు పాత పాటను పాడి దానిని ప్రతిఘటించారు. కాని సభ వారిలో దానికి అనుకూలంగా 76 సభ్యులు, ప్రతికూలంగా 48 సభ్యులు వోటు చేయడంచేత అది నెగ్గింది. ప్రభుత్వం ఓటమి గాంచింది.

ఈ సందర్భంలో మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలలోని లోపాలను పరిశీలించుటకు ఒక కమిటీని నిర్ణయించుటకు సిద్ధంగా ఉన్నట్లు ప్రభుత్వం ప్రకటించి, దానిమేరకు మడ్డిమాన్ అధ్యక్షతను అయిదుగురు అధికార సభ్యులతోను నలుగురు అనధికారుల సభ్యులతోను కూడిన ఒక కమిటీని నియమించింది. దాని నివేదిక ఎలాటిదో క్రమ క్రమంగా మనం తెలుసుకొనగలం.

దేశంలో బ్రిటిష్ పరిపాలనను నిర్వహించడంలో ఐ. సి. యస్. ఉద్యోగ వర్గానికి చెందినవారు ప్రధాన పాత్రను వహిస్తున్నట్లు మనం ఇదివరకు అనేక పర్యాయాలు తెలుసుకొన్నాము. రాజప్రతినిధి, గవర్నరులు, వారి కార్యనిర్వాహక వర్గానికి చెందినవారి కంటేకూడా వీరిదే ప్రధానమయిన పాత్ర. వీరిని బ్రిటిష్ పరిపాలనకు ఉక్కు చట్రమని బ్రిటిష్ ప్రధాని లాయడ్ జార్జి 1922లో ప్రస్తుతించడం మనం ఇదివరకే గుర్తించాము. దేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని రూపొందించడంలో ఆటంకాలను కల్పించేవారు వీరే. సర్వాధికారం వీరు వహించి. అందులో సహస్రాంశం కూడా భారతీయుల వశం చేయడం వీరి కెంత మాత్రమూ ఇష్టం లేదు.

దేశంలోని విద్యాధికులు మొదటినుండీ ఉన్నతోద్యోగాలు భారతీయులకు అందజేయవలసిందిగా కోరుతూ వచ్చారు. కాని దానిని పరిపాలకులు ఎంతమాత్రమూ మన్నింప లేదు. ఐ సి యస్. ఉద్యోగ వర్గంవారు అనుభవిస్తున్న జీత భత్యాలు, ఇతర సౌకర్యాలు మరింతగా వృద్ధిచేసే ఉద్దేశంతో లీ అనే బ్రిటిష్ ప్రముఖుని అధ్యక్షతను ప్రభుత్వం ఒక కమీషన్‌ను నియమించింది. ఆ కమీషన్ సమర్పించిన నివేదికను చర్చించి ఆమోదించవలసిందిగా ప్రభుత్వం 1924 సెప్టంబరులో ఒక తీర్మానాన్ని శాసన సభలో ప్రవేశపెట్టింది. ఆ తీర్మానాన్ని ఈ క్రింది విధంగా సవరించవలసిందిగా మోతీలాల్ నెహ్రూ కోరారు.

(1) లీ కమీషన్ శిఫారస్సులను ఆమోదించరాదు. (2) ఇప్పటినుంచి భారత దేశములో పని చేయవలసిన ఉన్నత ఉద్యోగ వర్గాన్ని బ్రిటన్‌లో (పోటీ పరీక్షల ద్వారా) నియమించే పద్ధతిని పూర్తిగా ఆపివేయవలెను. (3) వీరిని నియమించే అధికారాన్ని ఇండియా మంత్రివశంలో నుండి భారత ప్రభుత్వ వశంలోనికి, రాష్ట్ర ప్రభుత్వాల వశంలోనికి మార్చవలెను. కేంద్ర శాసన సభ, రాష్ట్ర శాసన సభలు వీరి నియామక విషయమై చట్టములను చేయవలెను. (4) భారతదేశంలో ఒక పబ్లిక్ సర్వీసు కమిషన్‌ను (Pub c Service Commission) కేంద్ర శాసన శిఫారస్సుల ఆధారంతో నియమించవలెను. (5) ప్రభుత్వం ప్రవేశపెట్టిన తీర్మానాన్ని అంగీకరించుటకు బదులు కేంద్ర శాసన సభ ఎన్నుకొన్న కమిటీ ఇప్పుడు ఉద్యోగంలో ఉన్నవారి జీత భత్యాలు ఇతర సౌకర్యాలు మొదలగు వాటిని గురించి క్షుణ్ణంగా పరిశీలించవలెను.

పై సవరణల సారాంశం ఇకమీదట ఐ. సి. యస్. ఉన్నతవర్గ నియామకంపై అధికారం బ్రిటన్‌లోని ఇండియా మంత్రికి ఉండరాదనీ, అది శాసన సభల చట్టాలకు లోబడిన భారత ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వాలకు ఉండవలెననేది. ఈ మార్పు జరిగిన పక్షంలో పోటీ పరీక్షలన్నీ భారతదేశంలోనే జరుగగలవు. దాని ఫలితంగా ఉన్నత ఉద్యోగ వర్గంలోనివారంతా భారతీయులుగానే ఉంటారు. ఈ మార్పు జరిగిన పక్షంలో ఐ. సి. యస్. ఉద్యోగుల జాత్యహంకారం, నిరంకుశత్వమూ అంతరించి దేశానికి స్వరాజ్యంలో అర్ధ భాగం లభించినట్లే.

ప్రభుత్వం ఈ సవరణను కూడా ప్రతిఘటించినా దానికి అనుకూలంగా 68 సభ్యులు ప్రతికూలంగా 46 సభ్యులు వోటు చేయడంతో అది శాసన సభ ఆమోదాన్ని పొందగలిగింది. ఇందులో కూడా జాతీయ పక్షం విజయాన్ని సాధించింది. ప్రభుత్వం ఓటమి గాంచింది. ఈ సవరణ స్వరాజ్య సంపాదనతో ప్రత్యక్షంగా సంబంధం లేనిదైనా దేశ పరిపాలనలో ఐ. సి. యస్. ఉద్యోగ వర్గానికి ఉండిన ప్రాధాన్యం దృష్ట్యా స్వరాజ్య సంపాదనలో ఒక భాగంగా పరిగణింపవలసి ఉంది.

స్వరాజ్య సంపాదన విషయంలో మడ్డిమాన్ కమిటీ నివేదిక చర్చ సందర్భంలో మోతీలాల్‌నెహ్రూ 1925 సెప్టంబరులో ప్రవేశపెట్టిన తీర్మానం ప్రాధాన్యం వహిస్తున్నది. ఈ కమిటీలో అధికార సభ్యులు ఆయిదుగురు ఒక నివేదికను, అనధికార సభ్యులు నలుగురు ఇంకొక నివేదికను సమర్పించారు. అధిక సంఖ్యాకులలో ఒక సభ్యుడు తర్వాత అధికార పదవికి రాజీనామాచేసి అనధికార సభ్యుల నివేదికకు అంగీకారాన్ని తెలియపరచాడు. అందుచేత ఇదియే అధిక సంఖ్యాకుల (Majority) ఆమోదాన్ని పొందినట్టు చెప్పవచ్చు.

ప్రభుత్వం అధికార సభ్యుల నివేదికను అంగీకరించవలసిందిగా శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టించి. ఈ నివేదిక మాంటెగుచెమ్సుఫర్డు సంస్కరణలలో ఏవో కొన్ని స్వల్ప మార్పులు జరగవలసినట్లుగా శిపారస్సు చేసింది. అనధికారులు అలాగు కాక, ఈ సంస్కరణలు పూర్తిగా విఫలములైనవని, మంత్రులకు లేశమాత్ర అధికారం కూడా లభించ లేదని, వాటిని పూర్తిగా రద్దు చేసి, వాటి స్థానే రాష్ట్ర పరిపాలనను పూర్తిగా మంత్రుల వశంలోకి తేగలిగినట్లున్నూ, రాష్ట్ర శాసన సభల సభ్యులందరు ఎన్నుకొన్న వారుగా ఉండవలసినట్లున్నూ, వారిని ఎన్నుకొనే హక్కు ప్రజలలో అధిక సంఖ్యాకులకు లభించవలసినట్లుగాను, కేంద్ర ప్రభుత్వంలో కూడా బాధ్యతాయుత ప్రభుత్వాన్ని (కొన్ని మినహాయింపులకు లోబడి) ప్రవేశపెట్టవలసినదిగాను- శిపారస్సు చేసింది ప్రభుత్వం ప్రవేశపెట్టిన తీర్మానానికి సవరణగా అనధికారుల నివేదికను అంగీకరించవలసిందిగా మోతీలాల్‌నెహ్రూ, ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. సవరణలోని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి ఒక నివేదికను సమర్పించుటకు ప్రభుత్వం ఒక రౌండుటేబిల్ సభను గాని, ఇంకొక విధమైన సభను గాని సమావేశపరచవలసిందిగా తన సవరణ ద్వారా మోతీలాల్ కోరాడు. సవరణను ప్రభుత్వం ప్రతిఘటించినా శాసన సభ వారు దానిని ఆమోదించారు.

ఈ విధంగా జాతీయ పక్షం తరపున స్వరాజ్యాన్ని సత్వరం ప్రవేశపెట్టవలసిందిగా ప్రతిపాదింపబడిన తీర్మానాలన్నీ శాసన సభ ఆమోదించడంచేత బ్రిటిష్‌వారి పరిపాలన విధానం ప్రజాభిప్రాయానికి విరుద్ధమనే విషయాన్ని స్వరాజ్యపక్షం వారు రుజువు చేసి, శాసన సభలలో ప్రవేశించడంలో వారు ఆశించిన ఫలితాన్ని కొంతవరకూ సాధించగలిగారు.

ఇదేవిధంగా వారు 1924, 1925 లలో ఉన్నా పక్షంవారితో కలిసి ప్రభుత్వం ప్రవేశ పెట్టిన బిల్లులను, బడ్జెటు పద్దులను నిరాకరించగలిగారు. శాసన సభల ద్వారా సహాయ నిరాకరణాన్ని సాగించడంలో ఇది ఒక ప్రధాన భాగం. జాతీయవాదుల ప్రతిఘటనవలన శాసన సభ తిరస్కరించిన బిల్లులన్నిటిలో బెంగాలురాష్ట్రానికి చెందిన శిక్షాస్మృతి సవరణ బిల్లు (Criminal Law Amendment Bill) అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. ఈ బిల్లు మూలంగా పోలీసు వారు అరెస్టు చేసిన వారిని ఏ విచారణా లేక ప్రభుత్వం ఇష్టం వచ్చినంత కాలం నిర్బంధంలో ఉంచుటకు అధికారాన్ని సంపాదించింది. దీనిఫలితంగా వేలాది నిర్దోషులు వారి స్వాతంత్ర్యాన్ని పూర్తిగా కోల్పోయే ప్రమాదం ఏర్పడింది. ఇది ప్రాథమిక న్యాయసూత్రాలకు పూర్తి విరుద్ధమని జాతీయ పక్షంవారు దానిని ఆక్షేపించారు. శాసన సభలో అధిక సంఖ్యాకులు వారితో ఏకీభవించారు. బిల్లు వీగి పోయింది.

కాని 1919 చట్టంలో గవర్నరులకు గవర్నరుజనరల్‌కూ సర్టిఫికేషన్(Certification) అధికారం లభించింది. దీనిమూలంగా శాసనసభ తిరస్కరించిన బిల్లులను చట్టంచేసే అధికారం వీరికి ప్రసాదింపబడింది. ప్రజాభిప్రాయానికి పూర్తి విరుద్ధంగా ప్రవర్తించే అధికారం వీరికి లభించింది. దానిని వినియోగించి, శాసనసభ తిరస్కరించిన బిల్లులను కూడా వీరు చట్టం చేయగలిగారు. శిక్షాస్మృతి సవరణబిల్లు వ్యక్తుల స్వాతంత్ర్యానికి ప్రమాదకరమైనా ఈ విధంగా చట్ట రూపం ధరించినది. ఇదే అధికారాన్ని వినియోగించి శాసనసభ తిరస్కరించిన బడ్జెట్ పద్దులు కూడా చట్టసమ్మతంగా గవర్నరు జనరల్ ప్రకటించాడు. అలాటి పద్దులలో ఉప్పుపన్ను ఒకటి.

మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణల మూలంగా అధికారంలో లేశమాత్రంకూడా ప్రజాప్రతినిధులకు లభించలేదని రుజువుచేసి, వాటిమూలంగా దేశానికి ఏలాటి రాజకీయ లాభం చేకూరలేదని సాటించే ఉద్దేశంతో స్వరాజ్య పక్షంవారు శాసనసభలలో ప్రవేశించారు. పదేపదే గవర్నరుజనరల్, గవర్నరులు సర్టిఫికేషన్ అధికారాన్ని వినియోగించేటట్లు చేయడంచేత ఈ ఉద్దేశాన్ని వారు చాలావరకూ నెరవేర్చుకొన గలిగారు. ఇది వారిఉద్దేశాలలో రెండవది. ఇది సహాయనిరాకరణానికి సంబంధించినట్టిది.

ప్రభుత్వాన్ని పూర్తిగా ప్రతిఘటించే ఉద్దేశంతో వారు శాసనసభలలో ప్రవేశించినా, ప్రవేశించిన తర్వాత తమ సంఖ్యాబలాన్ని వినియోగించి దేశప్రయోజనాల దృష్ట్యా అవసరమైన మార్పులను చేయుటకు కూడా వారి సభ్యతను వినియోగించారు. ఉక్కు పరిశ్రమ రక్షణ, దూది వస్త్రాలపై ఎక్సైజ్‌పన్ను రద్దు, ఉప్పుపన్ను తగ్గింపు, కార్మికుల పరిస్థితులను చక్కబెట్టుట, రైలుబండ్లలో జాతివిచక్షణ సడలింపు, భారతీయులకు సైనికశిక్షణ గరపుటకు ఒక సైనికశిక్షణ కళాశాల స్థాపనము వీటిలో కొన్ని.

ఇవిగాక ప్రభుత్వ నిరంకుశవిధానం మూలంగా నిర్దోషులైన ప్రజల స్వాతంత్ర్యానికి ఎన్నో ఇబ్బందులు ఏర్పడినవి. వేలాదిజనం జైళ్ళలో సంవత్సరాలకొద్దీ అష్టకష్టాలను అనుభవించవలసినవారయ్యారు. వారి ఇబ్బందులను తొలగించుటకు, నిర్బంధాననుండి వారికి విముక్తి కలిగించుటకూ వీటికన్నిటికీ ఆధారమైన చట్టాలను రద్దుచేయుటకు 1924-25 లలో జాతీయ పక్షంవారు అనేక తీర్మానాలను ప్రవేశపెట్టారు. అవిఅన్నీ అధికసంఖ్యాక సభ్యుల వోట్లతో శాసనసభ ఆమోదాన్ని పొందినవి. కాని, ప్రభుత్వవైఖరిలో ఏలాటిమార్పులూ రాలేదు. నిర్బం

ధితులందరు దౌర్జన్యాన్ని, హత్యలను, దోపిడీలను సాగించే విప్లవకారులని, వారు బోల్షివిక్ కమ్యూనిస్టులనీ, ఏవేవో నిరాధారాలైన నిందలను మోపి, వారిని విడుదలచేయుటకు అధికారులు నిరాకరించారు. దారుణమైన శిక్షాస్మృతిని మార్చుటకు ఎంతమాత్రం అంగీకరించరైరి. తీర్మా నాలను శాసనసభ ఆమోదించినా వాటిమూలంగా ఆశించిన ఫలితాలు లభించినవి కావు.

కాని ఇదంతా మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలు దేశ స్వాతంత్ర్యదృష్ట్యా గాని. దేశప్రయోజనాల దృష్ట్యా గాని నిష్ఫలములని సాటించగలిగాయి. ఈ సంస్కరణల మూలంగా దేశప్రగతిని సాధించడం సాధ్యంకాదని రుజువుచేయ గలిగాయి.

ఈ దృష్ట్యా శాసనసభల సభ్యత్వం కొంత ప్రయోజనకారి అయినా నిరంతరం శాసనసభలను ప్రభుత్వ విధానాలను ప్రతిఘటించుటకు వినియోగించడం స్వరాజ్యపార్టీవా రనే కులకు విసుగు కలిగించింది. వారిలో కొందరు—ప్రధానంగా మహారాష్ట్రికూ మధ్యప్రదేశ్‌కూ చెందినవారు—ప్రతిఘటన కార్యక్రమాన్ని విడనాడి మంత్రిపదవులను స్వీకరించి, తద్వారా ప్రజల స్థితిగతులను చక్కబరచుట సాధ్యమని భావించి దానికి సిద్ధపడినారు. దీనిమూలంగా పార్టీలో చీలికలు ఏర్పడినాయి. ఈ పరిస్థితులనుగుర్తించి 1925 డిసెంబరులో శ్రీమతి సరోజనీ దేవి అధ్యక్షతను కాన్‌పూర్‌లో సమావేశమైన కాంగ్రెసు 1926 మార్చిలో స్వరాజ్య పక్షంవారు శాసనసభలనుండి బయటకు రావలసినట్లు తీర్మానించింది. మోతీలాల్ నెహ్రూ మొదలైననాయకు లనేకులు ఈ తీర్మానానుసారం 1926 మార్చిలో సభనుండి బయటికివచ్చి, అటుతర్వాత ఏవో కొన్ని ప్రధాన కార్యక్రమాలు చర్చకు వచ్చినప్పుడే రెండు మూడుపర్యాయాలు శాసనసభలకు వెళ్ళారు,

శాసనసభల ప్రవేశాన్ని గురించి 1922-23 లో జరిగిన వాదోపవాదాలు బహు తీవ్ర స్థాయిని అందుకొన్నట్లు మనం ఇదివరలో తెలుసుకొన్నాము. సభలలో ప్రవేశించిన తర్వాత పై పరిణామాల ఫలితంగా స్వరాజ్యపక్షం వారికి వాటిపట్ల ఉత్సాహం తగ్గింది. అందుచేతనే 1926 మార్చిలో వారి నిష్క్రమణ జరిగింది. నిష్క్రమణకు ముందు మోతీలాల్ నెహ్రూ శాసనసభా వేదికనుండి ప్రభుత్వాన్ని ఉద్దేశిస్తూ స్వరాజ్యపార్టీవారు స్వరాజ్య సంపాదన విషయమై చేసిన తీర్మానాలను పెడచెవిని పెట్టినదనీ, శాసనసభ అభిప్రాయానికి విరుద్ధంగా నిర్బంధ శాస నాలను అనేకం చేసినదని, ఈ పరిస్థితులలో శాసనసభలో తాము ఉండడం నిష్ప్రయోజన మని "తిరిగి ఎన్నికలలో ప్రజల ఆమోదాన్ని సంపాదించుటకు మేము సభనుండి వెళ్ళిపోతు న్నాము. మీతో సమరాన్ని మేము వదలుకొనము....(శాసన సభలవంటి) ఈ బూటకపు సంస్థలు నిష్ప్రయోజనములని మేము భావిస్తున్నాము. మా దేశపు గౌరవాన్ని జాతిగౌరవాన్ని నిలబెట్టు కొనుటకు వాటినుండి నిష్క్రమించి ప్రజలమధ్య కృషిచేసి, ప్రభుత్వాన్ని లొంగదీయుటకు కావలసిన శక్తిని సంపాదించగలము. మిమ్ములను లొంగదీసి, మా కోరికలను ఫలప్రదములు చేసుకొనుటకు తగిన జవాబును ప్రజలు ఇవ్వగలరు," అని ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ తన అను చరు లందరితో సభనుండి వెళ్ళిపొయ్యాడు.

అటుతర్వాత తిరిగి నవంబరు ఎన్నికలు జరిగేవరకు శాసనసభ సమావేశాలు జరిగినా అవి చైతన్య హీనములైనాయి. స్వరాజ్యపక్షంవారు అందులో ఉండిన కాలంలో చర్చలు చైతన్యవంతంగా జరిగినవి. వారు వెళ్ళిపోయిన తర్వాత ఆ చైతన్యం అదృశ్యమైంది. జిన్నా

నాయకత్వంలోని స్వతంత్రులు సభలో ఉండి చర్చలలో పాల్గొనినా వారికి సంఖ్యాబలంలేని కారణంగా చర్చల తీవ్రత మందగించింది.

1924_26 లో కేంద్ర శాసనసభలోనే గాక మధ్యప్రదేశ్ బెంగాలు రాష్ట్రాల శాసన సభలలోకూడా స్వరాజ్యపార్టీవారు ప్రభుత్వాన్ని ప్రతిఘటించే కార్యక్రమంలో గొప్ప విజయాన్ని సాధించారు. మధ్యప్రదేశ్ శాసనసభలో వారికి మెజారిటీ సంఖ్యాబలం ఉండడంచేత వారిసహకారం లేనిదే మంత్రివర్గ నిర్మాణం సాధ్యం కాకపోయింది. వారు మంత్రిపదవులను స్వీకరించుటకు అంగీకరించలేదు. గవర్నరు ఇతరపార్టీలకు చెందినవారిని మంత్రులుగా నియమించాడు. కాని స్వరాజ్యపార్టీవారు వారిపట్ల విశ్వాసరాహిత్య తీర్మానాలను ప్రతిపాదించి దానికి శాసనసభ అమోదాన్ని పొందడంచేత మంత్రులు రాజీనామా చేయడం తప్పిందికాదు. అంతటితో ట్రాన్స్‌ఫర్డు శాఖలన్నిటినీ మంత్రుల సహాయంలేక గవర్నరే వశపర్చుకొని పరిపాలించవలసి వచ్చింది. ఇదేవిధంగా వారు 1924-1925-1926 లో బడ్జెట్టును, దానికి సంబంధించిన ఆర్థికబిల్లును తిరస్కరించి, 1926 మార్చిలో కాన్‌పూర్ కాంగ్రెసు తీర్మానాన్ని అనుసరించి శాసనసభనుండి నిష్క్రమించారు. వారి ప్రతిఘటన మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణల మూలంగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్ట దలచిన పరిమిత బాధ్యతాయుత ప్రభుత్వ విధానం ఆచరణసాధ్యం కాదని, ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని తొలగించి పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టడం తప్ప ప్రజలనూ ప్రధాన రాజకీయ పార్టీలనూ తృప్తిపరచడం సాధ్యంకాదని రుజువుచేసింది. స్వరాజ్యపక్షంవారు శాసనసభలలో ఈలాగు రుజువుచేసే ఉద్దేశంతోనే ప్రవేశించారు. ఆ ఉద్దేశం నెరవేరింది.

బెంగాలు శాసనసభలో స్వరాజ్యపార్టీకి మెజారిటీ బలం లేకపోయినా తక్కినపార్టీలకంటె దానికి ఎక్కువ సంఖ్యాబలం ఉండినది. అత్యంత ప్రతిభాశాలియైన దాసు దానికి నాయకుడయ్యాడు మంత్రివర్గాన్ని నిర్మాణం చేయవలసిందిగా గవర్నరు అందజేసిన ఆహ్వానాన్ని ఆయన నిరాకరించాడు. ఇతరపార్టీలకు చెందినవారిని గవర్నరు మంత్రులుగా నియమించాడు కాని స్వరాజ్యపార్టీ ప్రతిఘటన కారణంగా వారు అధికారంలో ఉండడం సాధ్యం కాకపోయి, గవర్నర్ ట్రాన్స్‌ఫర్డు శాఖలను పరిపాలించవలసి వచ్చింది. మధ్యప్రదేశ్‌లో జరిగినట్లే ఇక్కడ కూడా స్వరాజ్యపార్టీవారు మాంటెగు చెమ్సుఫర్డు సంస్కరణలు ఆచరణసాధ్యం కాజాలవని రుజువుచేయగలిగారు.

ఇదిగాక ఆ నాడు బెంగాలు ప్రభుత్వం వేలాది ప్రజలను ఏలాటి విశ్వసనీయమైన సాక్ష్యాధారాలతో గాని, మామూలు కోర్టులవిచారణతో గాని నిమిత్తంలేకుండా నిరవధికంగా నిర్బంధంలో ఉంచడం జరుగుతూ వచ్చింది. ఇందుకుగాను శాసనసభ ఆమోదించని బిల్లులు గవర్నరు సర్టిఫికేషన్ అధికారం ద్వారా చట్టాలుగా చేయడం, 1818 రెగులేషన్‌ను వినియోగించడం పరిపాటి అయింది. స్వరాజ్యపక్షంవారు ఇతర పార్టీలలోని కొందరి సహాయంతో ఈలాటి చట్టాలను రద్దుచేయవలసిందిగాను, వీటిక్రింద నిర్బంధంలో ఉంచబడినవారిని విడుదల చేయవలసిందిగాను శాసన సభలో తీర్మానాలను చేశారు. కాని ప్రభుత్వ వైఖరిలో ఏలాటిమార్పు రాలేదు. అందుచేత స్వరాజ్య పార్టీవారు రాష్ట్రమందంతట తీవ్రమైన అందోళనను చేయసాగారు. ప్రభుత్వంతో వీరు సాగించిన పోరాటం మరింత తీవ్రరూపం ధరించింది.

ఈ పరిస్థితులలో దాసుతో ఏదో ఒక విధమైన ఒడంబడిక చేసుకోనడం ప్రాజ్ఞత అనే భావం రాజప్రతినిధి రీడింగుకు, బ్రిటన్‌లోని ఇండియా మంత్రి బర్కన్‌హెడ్డుకు కలిగింది. రాజకీయ లక్ష్యాలను సాధించుటకు అధికారుల హత్యలవంటి దౌర్జన్య సాధనాలను వినియోగించ రాదని 1924 సెప్టంబరులో దాసు ప్రకటన చేయడంచేత ఈ భావం కార్యరూపం ధరించే అవకాశం లభించింది. బర్కన్‌హెడ్డు, స్వరాజ్య పక్షం ప్రతిఘటన కార్యక్రమాన్ని వదలి, ప్రభుత్వంతో సహకరించిన పక్షాన ఏదో ఒక రాజీ జరగడం సాధ్యమని ప్రకటన చేశాడు. దానిని పురస్కరించుకొని బెంగాలు రాష్ట్రీ రాజకీయ సభ ఫర్డిపూరులో జరిగినప్పుడు దాసు అధ్యక్షుడుగా రాజకీయ నిర్బంధితులను విడుదల చేసిన పక్షానను, 1818 రెగులేషన్ వంటి చట్టాలను రద్దుచేసిన పక్షానను తాను ప్రభుత్వంతో సహకరించుటకు సిద్ధంగా ఉన్నట్లు ఉపన్యసించాడు. తర్వాత రీడింగు బ్రిటన్‌కు వెళ్ళి బర్కన్‌హెడ్డుతో సంప్రతింపులు జరిపాడు. ఏదో ఒక రాజీ కుదురుతుందని, స్వరాజ్య పార్టీవారి ఆశయాలు కొంతవరకైనా సిద్ధించగలవని దాసు అభిప్రాయ పడినాడు. కాని దురదృష్టవశాత్తున జూన్ 1925లో దాసు అకస్మాత్తుగ మరణించాడు. దానితో బర్కన్‌హెడ్డుకు రాజీ పట్ల శ్రద్ధ అంతరించింది. సహాయ నిరాకరణ ఉద్యమకాలంలో దాసుతో ఈలాటి సంప్రతింపులు కొన్ని జరిగి విఫలములైనట్లు మనం ఇదివరకే తెలుసుకొన్నాము. అదే విధంగా 1924-25 సంప్రతింపులు కూడా విఫలములైనాయి.

తక్కిన రాష్ట్రాల శాసన సభలలో స్వరాజ్యపార్టీకి సంఖ్యాబలం లేనందున ప్రభుత్వంతో ఏలాటి ప్రతిఘటన కార్యక్రమాలు జరగలేదు.

దాసు మరణించడం, బర్కన్‌హెడ్డు వైఖరిలో ఏలాటిమార్పు రాకపోవడం, స్వరాజ్య పక్షంలో చీలికలకు దారితీశాయి. శాసనసభలను నిరంతరం ప్రభుత్వంతో ప్రతిఘటించుటకు సాధనంగా వినియోగించడం ప్రముఖులు కొందరికి నచ్చలేదు. తిలక్ అనుచరులైన కేల్కారు, ముంజీ, జయకర్, కఫర్డీ మొదలైనవారు ఆలాటివారిలో ఒక వర్గానికి చెందినవారు. తిలకుకు సహాయ నిరాకరణ ఉద్యమంపట్ల ఎక్కువ విశ్వాసం ఉండేదికాదు. అతని మరణానంతరం వీరు ప్రథమంలో శాసనసభల బహిష్కారానికి అంగీకరించలేదు. తర్వాత విధిలేక అంగీకరించారు గాని గాంధీ నాయకత్వంపట్ల వీరికి ఎన్నడూ పూర్తి విశ్వాసం కుదిరిందికాదు. అవసరమైనప్పుడు ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం, అవసరం కానప్పుడు దానితో సహకరించడం, భారతీయులు అనుసరించదగిన రాజనీతి అని తిలక్ మరణానికి పూర్వం ప్రతిపాదించాడు. దీనికే ఆయన అనుకూల సహకారం (Responsive Cooperation)అని పేరు పెట్టాడు. 1925 ఆఖరుకు కేల్కారు మొదలైనవారు ఈ విధానాన్ని అనుసరించుటకు నిర్ణయించుకొని స్వరాజ్యపార్టీ సభ్యత్వానికి రాజీనామాచేసి, అనుకూల సహకారపార్టీ అనే పేరుతో ఒక ప్రత్యేక పార్టీని నిర్మాణంచేశారు.

ఇదేవిధంగా మాళవ్యా, లజపత్‌రాయ్, మరికొందరు స్వరాజ్యపార్టీనుండి విడిపోయి, హిందూ మహాసభ అధ్వర్యాన ఒక ప్రత్యేకపార్టీని నిర్మాణం చేసుకొన్నారు. 1925 డిసంబరులో కాన్‌పూరులో జరిగిన కాంగ్రెసు ఎన్నటికైనా సమష్టి శాసనోల్లంఘనం ద్వారా మాత్రమే దేశానికి స్వరాజ్యం లభించగలదని, శాసనసభలనుండి స్వరాజ్య పక్షంవారు బయటికి రావలపిందని, చేసిన తీర్మానానికి ఎదురు తిరిగారు; కాని వారి ఆక్షేపణను ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు మన్నించలేదు.

మాళవ్యా, లజపత్‌రాయ్ మొదలైనవారు హిందూసభ అధ్వర్యాన ఒక ప్రత్యేక పార్టీగా నిర్మాణం కావడానికి బలమైన కారణం ఉండినది. 1922 తర్వాత ముస్లింలు హిందువులమధ్య వైషమ్యాలు పెరిగి అనేక కొట్లాటలకు దారితీశాయి. ముస్లింలలో అనేకులు సయ్యద్ అహమ్మదుఖాన్ అడుగుజాడలలో నడుచుటకు తీర్మానించుకొని, ప్రభుత్వంతో సహకరించి, ప్రత్యేక సదుపాయాలను సంపాదింప నిర్ణయించుకొన్నారు. ప్రభుత్వం కూడ ముస్లింలకు సదుపాయాలను కల్పించివారిని హిందువులనుండి విడదీసే చాణక్యనీతిని యథాపూర్వంగా అనుసరించ సిద్ధపడింది. ముస్లింలు ప్రభుత్వంతో సహకరించి సదుపాయాలను పొందడం, హిందువులు సహాయ నిరాకరణానికి కట్టుబడి ఉండడం ప్రమాదకరమని భావించి మాళవ్యా మొదలైనవారు హిందువుల అవసరాలను రక్షించుకొనే ప్రత్యేక ఉద్దేశంతో హిందూ మహాసభ పార్టీని నిర్మాణం చేశారు.

ఈ విధంగా కాంగ్రెసులో శుద్ధ స్వరాజ్యపార్టీ (మోతీలాల్ దీనికి నాయకుడు), అనుకూల స్వరాజ్యపార్టీ, హిందూ మహసభపార్టీ అని మూడు పార్టీలు ఏర్పడినాయి. దీని ఫలితంగా, 1926 నవంబరులో జరిగిన శాసనసభల ఎన్నికలలో స్వరాజ్యపార్టీ కొన్ని స్థానాలు మాత్రమే గెలిచింది. దీనితో దాని ప్రాముఖ్యం తగ్గింది. ఇదిమొదలు కాంగ్రెసు చరిత్రలోను స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోను ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది.

## 6

1927 నాటికి దేశంలో కాంగ్రెసు, అనుకూల స్వరాజ్యపార్టీ, హిందూ మహాసభ పార్టీ, బ్రాహ్మణేతరపార్టీ, ముస్లింలీగులు ప్రధానపార్టీలుగా ఉండినవి. వీటి అన్నిటి లక్ష్యం డుమినియన్ ప్రతిపత్తి, కాని దీనిని సాధించుటకు అనుసరించవగిన విధానాలలో వీటిమధ్య భేదం ఏర్పడినట్లు ఇదివరలో తెలుసు కొన్నాము. అప్పటి రాజకీయాలకు ఇన్నిపార్టీలు ఉండడం ఒక ప్రధానలక్షణం.

ఇదిగాక ఖిలాఫత్ ఉద్యమకాలంలో పూర్తిగా బలాన్ని కోల్పోయిన ముస్లింలీగు 1924 నుండి తిరిగి రాజకీయ రంగంలో ప్రవేశించి ముస్లింలపై నాయకత్వం వహించడం ఇంకొక లక్షణం. ఇదికూడా డుమినియన్ ప్రతిపత్తినే వాంఛించింది. కాని ముస్లింల ప్రత్యేక ప్రయోజనాలను సంపాదించుటకై 1924 లో జిన్నా నాయకత్వాన సమావేశమై (1) భారత దేశపు రాజకీయ వ్యవస్థ సమాఖ్యరూపం (Federal) ధరించవలెనని (2) ఎన్నికలమూలంగా ఏర్పడే శాసనసభలలోను ఇతర సంస్థలలోను ముస్లింలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెనని, (3) ప్రతినిధులు ప్రత్యేక నియోజకవర్గాలద్వారా ఎన్నుకొన బడవలెనని. (4) జనసంఖ్యలో ముస్లింలు మెజారటీగా ఉన్నరాష్ట్రాల శాసనసభలలో ఎన్నుకొనబడిన ముస్లింలు మెజారటీ సంఖ్యలో ఉండవలెనని, (5) మతవర్గాల ప్రతినిధులలో ముప్పాతిక సభ్యులకు ఆమోదయోగ్యం కాని బిల్లులుగాని. తీర్మానాలుగాని శాసనసభలలో చర్చకు రాకూడదని, (6) 1919 సంస్కరణలు ఎంతమాత్రమూ తృప్తికరంగాలేవని. వాటిస్థానే పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వ విధానాన్ని ప్రవేశపెడ్తూ పార్లమెంటు అనాలస్యంగా ఇంకొక చట్టాన్ని చేయవలసిందని తీర్మానాలుచేసింది. సమాఖ్య వ్యవస్థను గురించి ప్రప్రథమంగా ప్రస్తావించడం ఈ సమావేశంలోనే జరిగింది.

ప్రాతినిధ్య విషయమై హిందువులు ముస్లింలు మధ్య అభిప్రాయభేదాలు ఉత్పన్నం కావడంచేత హిందూ మహాసభపార్టీ ఏర్పడడం జరిగింది.

దేశంలోని పార్టీలమధ్య సహకారాన్ని పెంపొందించి, అందరికీ అమోదయోగ్యమైన ఒక స్వరాజ్య ప్రణాళికను రూపొందించుటకు 1923-24 లో అనిబిసెంటు, 1924 లో గాంధీ గట్టిప్రయత్నం చేశారు. ఇందుకుగాను బిసెంటు 1923 లో జాతీయ కన్‌వెన్‌షన్ (National Convention) అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి, శ్రీనివాసశాస్త్రి. తెజ్ బహదూరుసప్రూ మొదలైన ప్రముఖుల సహాయంతో దాని ఆధ్వర్యాన "కామన్ వెల్తు ఆఫ్ ఇండియా బిలు" (Commonwealth of India Bill) ను రూపొందించి బ్రిటన్‌లోని ప్రముఖుల సహకారాన్ని సంపాదించుటకు బ్రిటన్‌కు వెళ్ళి దానిని గురించి అక్కడ తీవ్రమైన ప్రచారాన్ని సాగించింది. ఈ ప్రచారంలో శ్రీనివాసశాస్త్రి. లజపత్‌రాయ్ మొదలైనవారు ఆమెతో కలిసి కృషిచేశారు. పార్లమెంటులో లేబర్‌పార్టీకి చెందినవారనేకులు ఆమె రూపొందించిన బిల్లును సమర్థించి, దానిని పార్లమెంటులో ప్రవేశపెట్టుటకు అంగీకరించారు.

గాంధీకూడా 1924 లో జైలునుండి విడుదలైన తర్వాత అన్ని పార్టీలమధ్య ఐక్యతను రూపొందించుటకున్నూ, ప్రధానంగా హిందువులు ముస్లింలమధ్య దానిని సాధించుటకున్నూ గొప్ప ప్రయత్నం చేశాడు. ఆయన ప్రోద్బలంచేత కాంగ్రెసు అధ్యక్షుడు మహమ్మదాలీ బొంబాయిలో నవంబరు 22-28 న అన్ని పార్టీలకు చెందిన 400 ప్రముఖులను సమావేశపరచాడు ఈ సమావేశంలో బెంగాలురాష్ట్రంలో నిర్బంధితులైన రాజకీయ ఖైదీలను విడుదల చేయవలసినట్లుగాను, అనుమానాస్పదులను అరెస్టుచేసి, ఏలాటి విశ్వసనీయమైన సాక్ష్యాధారాలతోగాని, మామూలు శిక్షాస్మృతితోగాని నిమిత్తంలేకుండా ప్రత్యేక న్యాయస్థానాలలో వారిని నామమాత్రంగా విచారణచేసి శిక్షించుటకు తగినట్లుగా ఉద్యోగివర్గానికి అధికారాలను కల్పించే శాసనాలను, 1818 రెగ్యులేషన్‌ను రద్దుచేయవలసిందిగాను, అన్ని పార్టీలకు ఆమోదయోగ్యమైన ఒక స్వరాజ్య పథకాన్ని రూపొందించవలసిందిగాను తీర్మానాలు చేయబడినవి. ఈ తీర్మానాలు అన్నిపార్టీలవారికి ఆమోదయోగ్యం కావడం హర్షించదగిన విషయం. బెంగాలుప్రభుత్వం అనుసరిస్తున్న దమనివిధానం ఎవరికీ నచ్చలేదని ఇది రుజువుచేసింది.

అందరికీ ఆమోదయోగమైన స్వరాజ్యపథకాన్ని రూపొందించుటకు సమావేశం ఒక కమిటీని నియమించింది. గాంధీ అధ్యక్షతన 1925 జనవరిలో అది సమావేశమై అందుకుగాను ఒక ప్రత్యేక ఉపకమిటీని, హిందువులు ముస్లింలమధ్య ఉత్పన్నములైన రాజకీయ విభేదాలను తొలగించుటకు కావలసిన మార్గాలను సూచించుటకు ఇంకొక ఉపకమిటీని నియమించింది. వీటిలో మొదటిదిదాని పనిని పూర్తిచేసి ఒక స్వరాజ్యపథకాన్ని రూపొందించింది. కాని రెండవ కమిటీ దాని పనిని పూర్తిచేయలేకపోయింది. హిందూ ముస్లిం సమస్యకు పరిష్కారమార్గంలేక స్వరాజ్యపథకం ఆచరణసాధ్యం కాజాలదనే కారణంచేత పార్టీల సమైక్యతకు గాంధిచేసిన ప్రయత్నం ఫలప్రదంకాలేదు. అటుతర్వాత బిసెంటు తయారుచేసిన బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టబడిందిగాని అది చర్చలోకి రాలేదు.

ఈ పరిణామాలదృష్ట్యా రాజకీయ పురోగమనానికి హిందువులు ముస్లింలమధ్య సహకారం కుదరకపోవడం గొప్ప అవరోధంగా ఏర్పడిందని చెప్పవలసి వస్తున్నది.

ఖిలాఫత్ ఉద్యమకాలంలో ముస్లింలకు హిందువుల సహకారం అవసరం కావడం చేత రెండువర్గాలవారు కలిసి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. కాని ఈ కలయిక శాశ్వతరూపం ధరించలేదు. ఖిలాఫత్ ఉద్యమం టర్కీలో సంభవించిన రాజకీయపరిణామాల మూలంగా ప్రాధాన్యాన్ని కోల్పోయింది. టర్కీలో రాజకీయాధికారాన్ని సంపాదించిన కెమాల్ పాషా సుల్తాను పదవినీ, దానితో ఖిలాఫత్ పదవినీ 1924 లో రద్దుచేశాడు. ఖిలాఫత్ పదవే అంతరించిన తర్వాత దానినిగురించిన ఉద్యమంకూడా అంతరించిపోయింది. ఆ ఉద్యమం మూలంగా హిందువులు ముస్లింలమధ్యన ఏర్పడిన సహకారంకూడా అంతటితో అంతరించింది రెండువర్గాలమధ్య అనేక సంవత్సరాలుగా ఏర్పడిన విభేదాలు తిరిగి తలఎత్తి, పరస్పర ద్వేషాలకు, కొట్లాటలకు దారితీశాయి. 1923-28 మధ్య ఈలాటి కొట్లాటలు 112 జరిగినట్లు ఒక అంచనా. వీటిని ప్రారంభించినవారు హిందువులని ముస్లింలని, ముస్లింలని హిందువులు నిందారోపణచేసినా ఉభయవర్గాలవారు వీటికి కారణభూతులని చెప్పడం తప్పదు.

ఈ కొట్లాటలు అన్ని రాష్ట్రాలలోను అనేక ప్రధాన నగరాలలోను సంభవించి, విశేష ప్రాణనష్టానికి ఆస్తినష్టానికి దారితీశాయి. శాంతి భద్రతలను రక్షించడంలో పోలీసు అధికారులు తగిన బాధ్యత వహించకపోవడం వీటితీవ్రతకు ప్రధానకారణం. తమ ప్రభుత్వం ద్వారానే వివిధవర్గాలమధ్య శాంతి సాధ్యంకాగలదని. తమ పరిపాలన అంతరించిన పక్షాన ఈలాటి కొట్లాటలు నిరంతరం సాగడం తప్పదని బ్రిటిష్‌వారు పదేపదే చెప్పి. తమ పరిపాలనను సమర్థించడం పరిపాటి అయింది. కాని దేశంలో ఇన్ని కొట్లాటలు సంభవించడం ఈ వాదం బలంలేనిదని రుజువుచేసింది. అనేక ప్రదేశాలలో అధికారుల రహస్య ప్రోత్సాహంవల్లనే ఇవి సంభవించాయి.

ఈ కొట్లాటలు గాంధీకి ఎంతో విషాదాన్ని కలిగించి, 1924 సెప్టెంబరు 17 న ఢిల్లీలోని మహమ్మదాలీ బసలో ఆయన 21 రోజుల నిరాహారవ్రతానికి దారితీశాయి. ఆయన ప్రాణాన్ని రక్షించే ఉద్దేశంతో దేశంలోని వివిధవర్గాలకు పార్టీలకుచెందిన 300 ప్రముఖులు సమావేశమై చర్చలు జరిపారుగాని వాటిమూలంగా ఏలాటిఫలితం లభించలేదు. తర్వాతకూడా ఈలాటి సమావేశాలు కొన్ని జరిగాయి. రెండువర్గాలమధ్య వైషమ్యాలకు కొట్లాటలకు మసీదుల ఎదుట హిందువులు మేళతాళాలతో ఊరేగింపులు జరపడం, బక్రీద్ పండుగ సందర్భంగా ముస్లింలు హిందువులు నివసించే ప్రాంతాలలో హత్యచేయుటకు ఉద్దేశింపబడిన గోవులను ఊరేగించడం వాస్తవమైన కారణాలు కావనీ, శాసనసభలు మొదలైన సంస్థలలో ప్రాతినిధ్యాన్ని గురించిన అభిప్రాయభేదాలే వీటికి కారణమని, ఇవి పరిష్కారమైతేతప్ప రెండువర్గాలమధ్య సమైక్యత కుదరజాలదని ఈ సమావేశాలు రుజువుచేశాయి. హిందూనాయకులు మొట్టమొదట సమైక్యత ఏర్పడడం అవసరమనీ అటుతర్వాతగాని ప్రాతినిధ్య సమస్య పరిష్కారం కాజాలదని వాదించారు. ప్రాతినిధ్య సమస్య పరిష్కారమైన మరు క్షణంలోనే సమైక్యత ఏర్పడుతుందని ముస్లింలు వాదించారు. "పిచ్చి కుదిరితేనేగాని పెండ్లి కాదు; పెండ్లి అయితేనేగాని పిచ్చి కుదరదు" అనే టట్లుగా ఈ వ్యవహారం సాగింది. తుదకు 1940 నాటికి ముస్లింల వైఖరి పూర్తిగా మారి, దేశ విభజన జరిగి, పాకిస్థాన్ అనే ప్రత్యేక రాజ్యం వారికి లభించడం తప్ప ఈ సమస్యకు పరిష్కార మార్గం లేదనే నిర్ణయానికి వచ్చారు.

# 7

1928 నాటికి దేశంలోని రాజకీయాలలో ఒక ప్రతిష్టంభన ఏర్పడింది. గాంధీ 1919 రాజకీయ రంగంలో ప్రవేశించాడు. కాంగ్రెసు లక్ష్యం స్వరాజ్యమని నిర్ణయించాడు. కలకత్తా నాగపూరు కాంగ్రెసులు దానికి అంగీకరించి, లక్ష్యసాధనకు సహాయ నిరాకరణ మొక్కటే సాధనమనే భావంతో 1921-22లో ఆ సాధనాన్ని వినియోగించింది. 1921 నవంబరులో ప్రభుత్వం దానితో రాజీ చేసుకొనే ఉద్దేశంతో దాసు ద్వారా సంప్రతింపులు ప్రారంభించింది. కాని ఆ సంప్రతింపులు విఫలములైనాయి. అటు తర్వాత సమష్టి శాసనోల్లంఘనాన్ని కొన్ని ప్రాంతాలలో సాగించవలసిందిగా అహమ్మదాబాదు కాంగ్రెసు తీర్మానించింది. దీని మేరకు గాంధీ స్వయంగా బర్డోలిలో దానిని సాగించుటకు నిర్ణయించాడు. అది సాగి ఉంటే ప్రభుత్వం ఏదో ఒక రాజీకి వచ్చి ఉండేది. కాని చౌరిచౌరా ఉదంతం కారణంగా గాంధీ ఉద్యమాన్ని ఉప సంహరించినాడు. ఆయన దృష్టిలో స్వరాజ్య సంపాదనము కంటె ప్రజలు హింసను పూర్తిగా త్యజించడం ఎక్కువ ప్రాధాన్యం వహించింది. మోతీలాల్, దాసు మొదలైనవారు ఆయనతో ఏకీభవించకపోయినా సామాన్య ప్రజలపై ఆయనకు అత్యంత ప్రభావం ఉండడంచేత ఆయన చేసిన నిర్ణయానికి కట్టుబడి ఉండినారు.

1922 మార్చిలో ప్రభుత్వం గాంధీకి ఆరు సంవత్సరాల జైలుశిక్షను విధించింది. కాంగ్రెసునూ, స్వరాజ్య ఉద్యమాన్నీ నడిపించుటకు తగిన నాయకుడు లేకపొయ్యాడు. ఉన్న నాయకుల మధ్య చీలికలు సంభవించాయి. వారిలో కొందరు స్వరాజ్య పార్టీగా నిర్మాణమై శాసన సభలలో ప్రవేశించి, వాటి సాధనాన 1924-26లో ప్రభుత్వాన్ని ప్రతిఘటించారు. ఈలాటి ప్రతిఘటన మూలంగా ప్రభుత్వం లొంగి, రాజీకి రాగలదని వారు ఆశించారు. ఒక దశలో ప్రభుత్వం దాసుతో సంప్రతింపులు జరపదలచింది. కాంగ్రెసువారి ఆశ ఫలప్రదం కాగలదని భావించడం జరిగింది. కాని 1925 జూన్‌లో దాసు మరణించడంచేత ప్రభుత్వం రాజీ ప్రయత్నాన్ని విరమించుకొన్నది. శాసన సభల ద్వారా సహాయ నిరాకరణను సాగించి స్వరాజ్యాన్ని సంపాదించడం సాధ్యం కాదని ఇది రుజువు చేసింది. శాసన సభలపట్ల స్వరాజ్యపార్టీ వారికి కలిగిన మోజు దీనితో తీరిపోయి. వారు కాంగ్రెసు తీర్మానానుసారం శాసన సభలనుండి 1926 మార్చిలో బయటకు వచ్చారు. అప్పటినుంచి కాంగ్రెసులో చీలికలు వృద్ధి గాంచి మూడు ప్రత్యేక పార్టీలు నిర్మాణమైనాయి. రాజకీయ రంగంలోని కృషి చైతన్యాన్ని కోల్పోయింది. 1928 మార్చి వరకు రాజకీయాలలో ఎక్కువగా ప్రవేశించరాదని గాంధీ నిర్ణయించుకొన్న కారణంగా కాంగ్రెసువారు దారీ తెన్నూ తెలియక ప్రవర్తించసాగారు. స్వరాజ్య లక్ష్యాన్ని సాధించుటకు మార్గం ఏదీ అనే సమస్య వారికి ఆందోళన కలిగించింది. కాని పరిష్కారమార్గం వారికేదీ లభించలేదు. 1927లో బ్రిటిష్ ప్రభుత్వం భారత రాజ్యాంగంలో జరగదగిన మార్పులు గురించి విచారణ చేసి నివేదికను సమర్పించుటకు సైమన్ కమీషన్‌ను నియమించిన కారణంగా దేశంలో తిరిగి రాజకీయ సంచలనం కలిగింది. అది ఏలాటి పరిణామాలకు దారితీసిందో మనం ఇప్పుడు తెలుసుకొనవలసి ఉంది.

చదువదగిన గ్రంథాలు:

**Bhavan: Vol. xi**
**R. C. Majumdar: History of Freedom Movement in India Vol. iii**
**Tarachand, Vol. iv**
**B. Pattabhi Seetharamayya:** కాంగ్రెసు చరిత్ర
**Tendulkar: Mahatma, Vol. ii**

# అధ్యాయము-8

## శాసనోల్లంఘన ఉద్యమ జననము

## 1928-29

### 1

స్వరాజ్య పార్టీవారు 1924 లో శాసనసభలలో ప్రవేశించిన ఫలితంగా దేశంలో ఏర్పడిన రాజకీయ సంచలనం 1926 లో అంతరించి 1927 మధ్యభాగం నాటికి రాజకీయాల లోను, స్వాతంత్ర్యోద్యమ ప్రగతిలోను ఒక విషమైన ప్రతిష్టంభన ఏర్పడింది. 1927 నవం బరులో బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ కమీషన్ గురించి ఒక ప్రకటనను చేయడంతో తిరిగి సంచ లనం ప్రారంభమై, అది అతిత్వరితగతిన నడచి. 1930 మార్చిలో శాసనోల్లంఘన ఉద్యమ మని ఉప్పు సత్యాగ్రహమనీ ప్రఖ్యాతిగాంచిన ఉద్యమానికి దారితీసి స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రెండవ ఘట్టంలో ప్రవేశించింది. 1928-29 లో జరిగిన ఈ విప్లవాత్మకములైన పరిణామా లను వివరించుటకుముందు స్వాతంత్ర్యోద్యమమునకు సంబంధించిన కొన్ని మౌలికలక్షణాలను జ్ఞాపకముచేసుకొనడం అవసరం.

(1) రాజారామ మోహనరాయల కాలమునాటినుంచి దేశంలో ఇంగ్లీషు విద్య వ్యాపించడంచేతను అధునిక విజ్ఞానానికి హేతువాదానికి నిలయమైన పాశ్చాత్య ప్రపంచంతో సన్నిహిత సంబంధం ఏర్పడడంచేతను దేశంలో ఇంగ్లీషు విద్యాధికులతో కూడిన ఒక మేధావి వర్గం ఏర్పడింది. వీరు జాతీయతత్వంచేత ప్రభావితులై ప్రజలలో జాతీయ భావాన్ని వృద్ధి చేశారు. ప్రపంచంలోని నాగరికతగాంచిన దేశాలన్నిటివలె తమ దేశంకూడా అన్ని రంగాలలో అభివృద్ధిని సాధించి, రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించ వలెనని వీరు కాంక్షించారు. ఈ కాలంలోనే దేశచరిత్రను గురించి గొప్ప పరిశోధన జరగడంచేత ప్రాచీనకాలంలో భారతదేశం అన్నిరంగాలలో ప్రగతిని సాధించి, ప్రపంచంలోని ఇతర దేశాలకు విజ్ఞానాన్ని అందించ గలిగిందని విద్యాధికులు తెలుసుకొన్నారు. ఆలాటి ప్రగతిని సాధించిన తమ పూర్వులవలె తాముకూడా ప్రగతిని సాధించి ఇతర జాతులకంటె తాము ఎందులోను తక్కువకాదని రుజువు చేయడం తమ విధ్యుక్త ధర్మంగా భావించారు. బంకిం చంద్రుడు, వివేకానందుడు, బాల గంగాధరతిలక్ మొదలైనవారు అందుకుగాను ఘనమైన కృషిచేశారు. దేశంలో ఆత్మ విశ్వాసం ఆత్మగౌరవం పెంపొందాయి. మధ్యయుగంలో నిద్రాణదశలో ఉండినవారు నూతన చైతన్యం కలవారయ్యారు.

(2) మేధావి వర్గంవారు ఈలాటి పరిణామానికి కర్తలు కావడమేగాక బ్రిటిష్ పరిపాలన మూలంగా దేశం అన్ని రకములైన కష్టాలకు నష్టాలకు గురియైనదని గ్రహించారు. దేశంలో దారిద్ర్యం పెరగడం, చేనేత మొదలైన పరిశ్రమలన్నీ నశించడం, వ్యవసాయం

ఒక్కటే ప్రజలకు ప్రధాన జీవనాధారం కావడం, దాని అభివృద్ధికి కావలసిన జలాధారాల నిర్మాణం మొదలైన కార్యక్రమాలను ప్రభుత్వం చేపట్టకపోవడం, అధిక లాభాలను చేకూర్చే వర్తక వ్యాపారాలన్నీ బ్రిటిషు వారివశంలోకి రావడం, వీటి అన్నిటి మూలంగా నిరుద్యోగుల సంఖ్య పెరగడం, క్షామాలు సంభవించినప్పుడు వాటిని ఎదుర్కొనగల స్తోమత ప్రజలకు లేక పోవడం, గ్రామీణ ప్రాంతాలలో ఒక భూస్వామికవర్గం, రైతులకు రుణాలుఇచ్చి అధిక వడ్డీలద్వారా సుఖంగా జీవించగల ఒక సాహుకారీ వర్గం ఏర్పడడం, ఇది అంతా మేధావుల దృష్టిని ఆకర్షించింది. పరాయి పరిపాలన నిర్మూలం కావడమే ప్రజల దుర్భర దారిద్ర్యానికి విముక్తి మార్గమనేభావం వారిలో నాటుకొన్నది.

దీని ప్రభావంచేతనే బాల గంగాధరతిలక్ "స్వరాజ్యం నా జన్మ హక్కు; దానిని ఏలాగైనా సాధించి తీరుతాను." అనే నినాదాన్ని లేవదీసి దానిని ఒక మంత్రంగా సామాన్య ప్రజలకు కూడా ఉపదేశించాడు.

(3) అంతకు పూర్వమే విద్యాధికులు ప్రథమంలో రాష్ట్రాలకు మాత్రమే పరిమితములైన రాజకీయ సంఘాలను; 1885 లో దేశమంతటికి కేంద్రంగా భారత జాతీయ కాంగ్రెసును స్థాపించి వాటిద్వారా బ్రిటిషు పరిపాలకులనుండి రాజకీయ సంస్కరణలను సంపాదించుటకు గొప్ప కృషిచేస్తూ వచ్చారు. కాని ఈ కృషి ఎంతమాత్రమూ ఫలప్రదం కాలేదు.

ఈ పరిస్థితులను గమనించి తిలక్, అరవిందుడు, పాల్, లజపతిరాయ్ మొదలైన మేధావులు జాతీయ ఉద్యమాన్ని లేవదీశారు. వీరిలక్ష్యం ఏవో కొన్ని సంస్కరణలను సంపాదించడంకాదు. స్వరాజ్యాన్ని సంపాదించడమే వీరిధ్యేయం. అన్ని దేశాలలో, అన్ని కాలాలలో పరాయి పరిపాలనను తొలగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు యుద్ధం ఒక్కటే సాధనంగా వినియోగంలోకి వచ్చింది. పరాయి పరిపాలకులను యుద్ధంలో ఓడించిన తర్వాతనే ప్రజలు స్వాతంత్ర్యాన్ని సంపాదించ గలిగారు. ఐచ్ఛికంగా తమంతట తాము తమ పరిపాలనాధికారాన్ని వదలుకొని తమ ఏలుబడిలో ఉండిన ప్రజలకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించినట్లు ప్రపంచంలో ఎక్కడా కనుపించదు. రాజకీయ సంఘాల తీర్మానాలు, వాటి ప్రార్థనలు, వినతిపత్రాలు, క్రమబద్ధములైన వాటి ఆందోళనలు పరాయి పరిపాలకులపై ఈ విషయంలో ఏలాటి ప్రభావం వహించలేవు. భారతదేశాన్ని పాలించే బ్రిటిషు పరిపాలకులపై ఇవి ప్రభావం వహించగలదనే మితవాదుల విశ్వాసానికి ఏలాటి ఆధారం లేకపోయింది.

అందుచేత జాతీయవాదులు స్వరాజ్యాన్ని సంపాదించుటకు బ్రిటిషువారితో పోరాటాన్ని సాగించడంతప్ప సాధనాంతరం లేదనే నిర్ణయానికి వచ్చారు. కాని ఆనాటికి దేశంలో ఏర్పడిన పరిస్థితులలో సాయుధ పోరాటం సాధ్యంకాదని గ్రహించి, అది సాత్వికనిరోధ రూపాన్ని ధరించవలసినట్లు గుర్తించారు. సాత్విక నిరోధంకూడా పోరాటమే. కాని ఇది సాయుధ పోరాటంకాదు. నిరాయుధులుగా చేయబడిన భారతీయులు ఆయుధాలను భారీ ఎత్తున సంపాదించడంగాని, వాటిని ఉపయోగించుటకు కావలసిన సైనికశిక్షణనుపొంది, యుద్ధానికి ఉపక్రమించడంగాని సాధ్యంకానిపని. కాని పోరాటంలేక బ్రిటిషువారు లొంగరు. బ్రిటన్‌తో వ్యాపారాన్ని. వారు భారతదేశంలో స్థాపించిన న్యాయస్థానాలను విద్యాలయాలను బహిష్కరించి, వారిక్రింద ఉద్యోగాలుచేసి పరిపాలనలో వారితో సహకరించడం మానుకొని, వారికి

పన్నులను చెల్లించడాన్ని నిరాకరించిన పక్షాన వారిని లొంగదీసి. స్వరాజ్యాన్ని సంపాదించడం సాధ్యం కాగలదనేది సాత్విక నిరోధ విధానానికి ఆధారం. ఇది దౌర్జన్య రహితమైన స్వాతంత్ర్యసమరం. ఇది ఒక్కటే భారతీయుల అందుబాటులో ఉండే సాధనం అని జాతీయవాదులు ప్రచారం చేశారు.

దీనిని వందేమాతర ఉద్యమకాలంలో పరిమితంగా వినియోగించి, బెంగాలు రాష్ట్ర విభజనరద్దు విషయంలో ప్రభుత్వాన్ని లొంగదీయ గలిగారు. సాత్విక నిరోధమనే పోరాటం ఫలప్రదం కాగలదనే విశ్వాసం దేశంలో ఏర్పడింది.

ఇదేకాలంలో బెంగాలు. పంజాబు. మహారాష్ట్రలలో కొందరు యువకులు హత్యలు దోపిడీలు మొదలైన దౌర్జన్య కార్యక్రమాలతోకూడిన విప్లవ ఉద్యమాన్ని సాగించారు. కాని దీనిమూలంగా స్వరాజ్య సంపాదన సాధ్యంకాలేదు. అందుచేత సాత్విక నిరోధంపట్ల ఏర్పడిన విశ్వాసం మరింత బలపడింది.

స్వాతంత్ర్యోద్యమం ఈ దశలోకి వచ్చినప్పుడు గాంధీ రాజకీయరంగాన్ని ప్రవేశించాడు. ఆయన లక్ష్యంకూడా స్వరాజ్యమే. ఆయన వినియోగించ దలచిన సాధనంకూడా సాత్విక నిరోధమే. కాని ఆయన ఈ విధానానికి సహాయ నిరాకరణమని పేరుపెట్టాడు. జాతీయవాదులకు ఆయనకు మధ్య ఈ విషయంలో గొప్పభేదం ఉంటినది. వారు సాయుధ పోరాటంలో ఏలాటి అధర్మం ఉన్నట్లు భావించిన వారుకారు. అది సాధ్యంకాక పోవడంచేతనే వారు దానిని విసర్జించారు. కాని గాంధీ అహింస పరమధర్మంగా స్వీకరించినవాడు. స్వరాజ్యాన్ని సంపాదించుటకు కూడా హింసతోకూడిన యుద్ధం ఆచరణ సాధ్యమైనప్పుడు కూడా దానిని వినియోగించరాదనేది ఆయన దృఢ విశ్వాసం. ఆయన దృష్టిలో స్వరాజ్యానికంటె అహింసయే ఎక్కువ ప్రాధాన్యంకలది. అందుచేత ఆయన అహింసను సహాయ నిరాకరణ ఉద్యమానికి ప్రధాన లక్షణంగాచేసి 1921-22 లో బ్రిటిషు ప్రభుత్వంతో పోరాటాన్ని సాగించాడు. కాని పోరాటం ఫలప్రదంకాక పూర్వమే ప్రజలు కొందరు హింసతో కూడిన చర్యలను సాగించడంచేత ఉద్యమాన్ని పూర్తిగా ఉపసంహరించాడు.

కాని వందేమాతర ఉద్యమంలోను, 1921-22 లో గాంధీ సాగించిన స్వరాజ్య సంపాదన ఉద్యమంలోను రాజకీయ నాయకులూ ప్రజలూ గడించిన అనుభవాల మూలంగా కొన్ని భావాలు స్థిరపడి పోయినవి. వాటిలో మొదటిది స్వరాజ్యం ఒక్కటే సాధించదగిన లక్ష్యం. రెండవది అది వెంటనే సాధించవలసిన లక్ష్యం. మూడవది దానిని సంపాదించుటకు బ్రిటిషువారితో పోరాటం సాగించడం తప్పదు. తీర్మానాలు, ప్రార్థనలు, వినతి పత్రాలు, చట్టబద్ధమైన ఆందోళనలు ఎంతమాత్రం సాధనాలు కాజాలవు. నాల్గవది ఈ పోరాటాలు దౌర్జన్య రహితంగా ఉండడం అవసరం. అలాటి పోరాటాన్నే నాయకుడైన గాంధీ సాగించుటకు అంగీకరించాడు. ఆయన నాయకత్వము లేక. పోరాటం సాధ్యం కాదు. సామాన్య ప్రజల భక్తి విశ్వాసాలకు పాత్రుడైన అఖిల భారతనాయకుడు ఆయన ఒక్కడే. ఈలాటి భావాలు స్థిరపడి పోవడంచేత ఎన్నటికైనా స్వరాజ్య పరిపాలనకు అహింసా పూర్వమైన సహాయ నిరాకరణ పోరాటం ఒక్కటే సాధనమనే విశ్వాసం దేశంలో ఏర్పడింది.

1924 లో స్వరాజ్య పార్టీవారు శాసనసభలలో ప్రవేశించి, సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని వెంటనే ప్రవేశ పెట్టవలసిందిగాను, దాని స్వరూపాన్ని నిర్ణయించుటకు ఒక రౌండుటేబిల్ సమావేశాన్ని జరపవలసిందిగాను రెండు పర్యాయాలు తీర్మానాలను ప్రవేశపెట్టి శాసనసభ ఆమోదాన్ని సంపాదించారు. కాని ప్రభుత్వం ఈ తీర్మానాలను లక్ష్యపెట్టక దాని నిరంకుశ విధానాన్ని యధాప్రకారం సాగిస్తూ వచ్చింది. శాసనసభలలోని ప్రజాప్రతినిధుల అభిప్రాయాలకు ఏమాత్రం విలువలేక పోయింది. శాసనసభలద్వారా ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం కూడా సాధ్యంకాదని రుజువైంది. దీని ఫలితంగా కాంగ్రెసువారికీ వారితో ఏకీభవించిన జాతీయవాదులకు శాసనోల్లంఘనంతో కూడిన పోరాటం ఒక్కటే స్వరాజ్య సంపాదనకు సాధనమనే గాంధీగారి విశ్వాసం బలపడింది. ఈ బలపడడమే క్రమక్రమంగా 1930 లో ప్రారంభమైన ఉప్పు సత్యాగ్రహమని ప్రఖ్యాతిగాంచిన శాసనోల్లంఘన ఉద్యమానికి దారి తీసింది.

## 2

స్వరాజ్యాన్ని వెంటనే సాధించడం తమ లక్ష్యంగాను, దానికి శాసనోల్లంఘనంతో కూడిన సహాయ నిరాకరణం పటిష్ట సాధనంగాను నిర్ణయించుకొని, దానిని 1921-22 లో ఒక పర్యాయం వినియోగించి, తిరిగీ దానిని ఇంకొక పర్యాయం వినియోగించుటకు సిద్ధంగా ఉండడం గాంధీకి, గాంధీ అనుచరులకు, ఇతర జాతీయ వాదులకు ప్రధాన లక్షణంగా రూపొందిన ఈ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం ఎన్నటికీ కూడా తన సామ్రాజ్యాధికారాన్ని వదలుకొని, భారతీయులకు స్వరాజ్యం ప్రసాదించరాదనీ, వారు లక్ష్యసాధనకై పోరాటంలోకి దిగిన పక్షంలో పోరాటాన్ని వారు అహింసా పూర్వకంగా సాగించినా దానిని బలప్రయోగం చేసి అణచి వేయడం తమ కర్తవ్యమనే నిర్ణయానికి వచ్చారు. ఇది కొత్త నిర్ణయం కాదు. చాలా కాలాన నుండి దీనిని అనుసరించియే వారు వారి పరిపాలనను సాగిస్తూ వచ్చారు. ఈ కాలంలో వారి నిర్ణయంలో ఏలాటి మార్పూ రాకపోవడం వారు అనుసరించిన పరిపాలన విధానానికి ప్రధాన లక్షణం.

ఈలాటి నిర్ణయానికి వారు రావడంలో ఆశ్చర్య పడవలసింది ఏదీ లేదు. వారి సామ్రాజ్యానికంతా భారతదేశం తలమాణిక్యం వంటిది. అధిక జనసంఖ్యతోనూ, అధిక వైశాల్యంతోనూ కూడిన భారతదేశం వారి సామ్రాజ్యంలో చేరి ఉండడం చేతనే వారు ప్రపంచ రాజకీయాలలో అగ్రస్థానం వహించ గలిగారు. భారతదేశాన్ని కోల్పోయిన పక్షంలో ఒక శతాబ్దంగా ప్రపంచంలో వారికి లభించిన ప్రాధాన్యమూ ప్రతిభ అంతరించడం తప్పదు. (1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత అంతర్జాతీయ రంగంలో వారి స్థితి ఏలాగు దిగజారి పోయిందో అందరికీ తెలిసిన విషయమే). ఈ సత్యాన్ని గ్రహించిన వారు కావడం చేతనే వారు వారి అధికారాన్ని లేశ మాత్రం కూడా వదలుకొనుటకు సంసిద్ధులు కాలేదు.

ఇంతే గాక, భారతదేశానికి వారు పరిపాలకులు కావడంచేత వారిలో అన్ని వర్గాల వారు గొప్ప లాభాలను పొందగలిగారు. విద్యాధిక వర్గానికి చెందినవారు ఐ. సి. యస్ మొదలైన పరీక్షల ద్వారా భారతదేశంలో ఉన్నతోద్యోగాలను సంపాదించి గొప్ప జీతబత్యాల

మూలంగాను, ఇతర సదుపాయాల మూలంగాను ఐశ్వర్య వంతులయ్యారు. ఫ్యాక్టరీ యజమానులు కార్మికులు వారు తయారు చేసిన వస్తు సామగ్రిని భారతదేశంలో విక్రయించి సునాయాసంగా అత్యధిక లాభాలను గడించ గలిగారు. వర్తక వ్యాపారాలు చేసేవారు, సాహుకారీ వర్గానికి చెందినవారు అనేక విధాలుగా లాభాలను సంపాదించడం పరిపాటి అయింది. అనేకులు భారతదేశానికి వచ్చి, తేయాకు తోటలకూ, జనుము పరిశ్రమ వంటి భారీ పరిశ్రమలకూ, బ్యాంకీలకూ, ఇతర వర్తక సంస్థలకూ యజమానులై కోట్ల కొలది లాభాలను సంపాదించ గలిగారు. బ్రిటన్‌లోని ప్రజలలో అయిదవ వంతుకు భారతదేశం తోటి ఈలాటి సంబంధాలు సుఖంగా జీవించడానికి ఆధారమయింది. భారతదేశంపై సామ్రాజ్యాధికారం అంతరించిన పక్షంలో వీరందరు జీవనభృతిని కోల్పోవడమే గాక, బ్రిటన్‌లో నిరుద్యోగ సమస్య తీవ్ర రూపం ధరించడం సత్యం. భారతీయుల స్వరాజ్య వాంఛను వారు తీర్చక పోవుటకు ఇదియే ప్రధాన కారణం. తన్మూలిన ధర్మానికి కట్టుబడేవారు ఎవరూ ఉండరు.

భారతదేశంపై వారు వహించిన అధికారాన్ని లేశ మాత్రం కూడా తగ్గించకొనకుండుటకు వారి స్వార్థం ప్రధాన కారణమైనా తమ పరిపాలన మూలంగా భారతీయులకు ఎన్నో లాభాలు సమకూరినవని, అది అంతరించిన పక్షంతో దానితో కూడా ఆ లాభాలు అంతరించడమే కాక ప్రజలు అనేక నష్టాలను అనుభవించడం తప్పదని వారు వారి అధికారాన్ని సమర్థించడం మామూలైంది. తమ నాగరికత ఉత్కృష్టమైనదని భారతదేశంలో అది వ్యాప్తి గాంచినప్పుడే భారతీయులు నాగరికులు కాగలరని. భారతీయులలో మతాన్ని బట్టి, భాషల బట్టి, నివసించే ప్రాంతాల బట్టి లెక్కలేని విభేదాలు ఏర్పడినవనీ, తాము పరిపాలించడం వలననే అంతః కలహాలు నశించి, శాంతిభద్రతలు ఏర్పడినవని, తమ అధికారం తొలగిన పక్షంలో హిందువులు ముస్లింల మధ్య యుద్ధాలు తప్పవనీ, ఇంతకూ స్వరాజ్యాన్ని కోరే వారి సంఖ్య చాలా స్వల్పమని. సామాన్య ప్రజలకు వీరిలో విశ్వాసం లేదని. వారు బ్రిటిష్ పరిపాలనను స్థిరంగాను, శాశ్వతంగాను ఉండవలెనని కోరేవారని, ఏవేవో ధర్మ పన్నాలను వల్లించి, తమ సామ్రాజ్యాధికారాన్ని సమర్థించడం పరిపాటి అయింది.

ఈ సమర్థన ఒక శతాబ్దంగా దేశంలో ఏర్పడిన వాస్తవ పరిస్థితులను విస్మరించడమే అనే విషయాన్ని వారు గుర్తించలేక పోయ్యారు. 1920 నాటి భారతీయులు 1820 నాటి భారతీయుల వంటివారు కారు. వారిలో ఎన్ని విభేదాలు ఉండినా తాము ఒకే జాతివారనే భావం 1920 నాటికి మేధావి వర్గంలోనేగాక వారి ప్రచారానికి ప్రభావానికి లోబడిన సామాన్య ప్రజలలో కూడా ఏర్పడింది. ప్రపంచంలో అభివృద్ధి గాంచిన అన్ని జాతులవలె తాము కూడా అభివృద్ధిని సాధించడంలో కృతనిశ్చయులై, సంఘ సంస్కరణము, మత సంస్కరణము మొదలైన రంగాలన్నిటిలో గొప్ప కృషిని చేసి అనేక సత్ఫలితాలను పొందగలిగారు. స్వాతంత్ర్య సంపాదన పట్ల పట్టుదల గలవారయ్యారు. ప్రజలలో కలిగిన ఈలాటి మార్పుల నన్నిటిని పరాయి పరిపాలకులు గుర్తించినవారు కారు. అందుచేతనే ఒక శతాబ్దానికి పూర్వం వారు పాడిన పాటనే పాడుతూ వచ్చారు. తల్లిదండ్రులు తమ పిల్లలు బాల్యదశను దాటి వయోజనులైన తర్వాత కూడా బాల్యదశలో వారిపై యాజమాన్యాన్ని వహించినట్లు వహించడం ప్రాజ్ఞత కాదనే విషయం అందరికీ తెలిసినదే. ఆలాగు వహించిన పక్షంలో వారు తల్లిదండ్రులపై తిరుగుబాటు చేయడం సర్వ సాధారణం, ఇది కుటుంబ విచ్ఛిన్నానికి దారి తీస్తుంది. దీనిని

గ్రహించిన కారణంగా తల్లిదండ్రులు వయస్సు వచ్చిన తమ పిల్లలపై అధికారాన్ని చెలాయించడం మానుకొని వారికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తారు. ఈ సామాన్య విషయాన్ని గ్రహించక బ్రిటిష్ పరిపాలకులు ప్రగతిని సాధించిన తర్వాతకూడా భారతీయులను బాల్యదశలో ఉండినట్లు భావించి, సామ్రాజ్య విచ్ఛిత్తికి దారితీశారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో ఏర్పడిన క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనలేక బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశ పరిపాలనలో తమ తుది లక్ష్యం బాధ్యతాయుత ప్రభుత్వమనీ, కాని అది దశలు వారిగా మాత్రమే సాధ్యం కాగలదని, దానికి మొదటి మెట్టుగా రాష్ట్ర పరిపాలనలో కొన్ని శాఖలను శాసన సభలకు బాధ్యులైన మంత్రుల వశం చేస్తూ 1919 లో ఒక చట్టాన్ని చేసింది. కాని యుద్ధం ముగిసిన తర్వాత ఈలాటి ప్రకటన చేసినందుకు ఎంతో విచార పడినారు. తొందరపడి దానిని చేసినట్లు భావించి, మంత్రులకు వాస్తవాధికారం లేకుండునట్లు అనేక నియమ నిబంధనలను చేసినట్లు ఇదివరకే తెలుసుకున్నాము. లీ కమీషన్ సిఫారస్సుల ఫలితంగా ఉన్నతఉద్యోగుల జీతబత్యాలను పెంచారు. ఖిలాఫత్ ఉద్యమం సమసిపోయిన తర్వాత యధాపూర్వంగా భేదోపాయాన్ని వినియోగించి ముస్లింలపట్ల పక్షపాతం వహించి,మత కలహాలలో వారికి అండగా నిలిచారు. మతం మూలంగా ఏర్పడిన విభేదాలను రాజకీయ ప్రయోజనాలకు వినియోగించే రాజనీతిని ఎంతమాత్రం వదలలేదు. స్వరాజ్యంపట్ల సామాన్య ప్రజలకు అభిలాష లేదని చెప్పారు గాని, వారి దారిద్ర్యాన్ని నిర్మూలించుటకు కావలసిన చర్యలను తీసుకొనరైరి.

వెంటనే స్వరాజ్యాన్ని సాధించడం లక్ష్యంగా పెట్టుకొన్న ప్రజలు ఉత్తర ధ్రువంలోను, దానికి భారతీయులు ఎన్నటికీ అర్హులు కారని తమ పరిపాలనను సమర్థించిన ప్రభుత్వం దక్షిణ ధ్రువంలోను ఉండేటట్లు 1927 మధ్యకాలం నాటికి పరిస్థితులు ఏర్పడినవి. ఉభయపార్టీలు ఏ విధమయిన రాజీకి వచ్చే సూచనలు కనుపించలేదు. ఈలాటి ప్రతిష్ఠంభన నుండి బయట పడుటకు పరాయి ప్రభుత్వంతో ఇంకొక పర్యాయం పోరాటంలోకి దిగడం తప్ప జాతీయవాదులకూ గాంధీకీ మార్గాంతరం కనుపించలేదు. సైమన్ కమీషన్ నియామకం అలాటి పోరాటానికి దారి తీసింది.

## 3

భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రసాదించడం బ్రిటిష్ ప్రభుత్వపు తుది లక్ష్యమైనా, అది దశల వారీగా ప్రవేశ పెట్టబడవలెనని, మరునటి దశలో ఎంతటి బాధ్యతను భారతీయుల పరం చేయవలసిందీ నిర్ణయించుటకు పది సంవత్సరముల గడువు మించకముందు ఒక కమీషనును నియమించవలసినదని 1919 చట్టం విధించింది. దీని మేరకు 1929 లో ఒక కమీషనును నియమించవలసి ఉండినది. కాని 1927 నవంబరులోనే అలాటి కమీషనును అప్పటికి అధికారంలో ఉండిన టోరీ పక్షమునకు చెందిన ఇండియా మంత్రి బర్కెన్‌హెడ్ నియమించాడు. 1929 నాటికి లేబరు పక్షంవారు అధికారంలోకి వచ్చే సూచనలు కనుపించినవి. వారు భారతీయుల స్వరాజ్య వాంఛపట్ల కొంత సానుభూతి కలవారు. కమీషనును వారు నియమించే పక్షాన భారతీయులకు అనుకూలంగా నిర్ణయాలు అది చేయవచ్చు. అది ఒక ప్రమాదంగా భావించి 1927 నవంబరులోనే బర్కెన్‌హెడ్ సర్ జాన్ సైమన్ అధ్యక్షతన ఏడ్గురు పార్లమెంటు సభ్యులతో కూడిన కమీషనును నియమించాడు.

ఈ నియామకం భారతదేశంలోని ప్రధాన రాజకీయ పక్షాల ఆగ్రహానికి గురి అయింది. దానికి ప్రధానంగా మూడు కారణాలున్నట్లు చెప్పవచ్చు. కమిషన్‌లోని సభ్యులందరు బ్రిటిష్ వారుకావడం, సభ్యులలో ఒకడు కూడా భారతీయుడు కాకపోవడం మొదటి కారణం. బ్రిటన్‌లోని ఆనాటి వర్గాల వారందరు భారతీయుల స్వరాజ్య వాంఛపట్ల ప్రతికూలురని ఇదివరకే తెలుసుకొన్నాము. కమీషన్‌లోని సభ్యులెవ్వరికీ భారతదేశాన్ని గురించి గాని, భారతీయుల ఆచార వ్యవహారాల గురించి గాని, సంస్కృతిని గురించి గాని ఏలాటి పరిజ్ఞానం లేని బ్రిటిష్‌వారు. దీనికి తోడు వీరిది పక్షపాతంతో కూడిన దృష్టి. భవిష్యత్తులో భారతదేశానికి ఏలాటి పరిపాలన విధానం ఉండవలెనో నిర్ణయించుటకు వీరు అర్హత లేని వారు. ఏ దేశానికి అనుగుణమయిన రాజ్యాంగాన్ని ఆ దేశానికి చెందినవారే నిర్ణయించుకొనడం ధర్మమనే "జాతీయ స్వయం నిర్ణయ సూత్రం" (Principle of National self-determination) అప్పటికి ప్రపంచంలో ప్రభావం వహించి ఉండినది. భారత రాజకీయ రంగంలో కృషి చేసే వారందరు దీనిచే ప్రభావితులైన వారు. పరాయి వారైన బ్రిటిష్‌వారు భారత రాజ్యాంగాన్ని నిర్ణయించడం వీరికి ఎంతమాత్రమూ అంగీకార యోగ్యం కాలేదు. బ్రిటిష్‌వారి వాదాన్ని ఎదుర్కొనుటకు కమీషన్‌లో ఒక భారతీయుడు కూడా లేకపోవడం వీరి అనంగీకారాన్ని మరింత బలపరచింది.

ఇదిగాక వెంటనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టవలసిందిగా కేంద్రశాసనసభ 1924 లో రెండు పర్యాయాలు తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని లేశమాత్రంకూడా లెక్కలోకి తీసుకొనక దశలవారీ సూత్రాన్ని ఆధారంచేసుకొని కమీషను నియమించడం రాజకీయనాయకుల ఆగ్రహానికి రెండవ కారణం. ఈ సూత్రప్రకారం ఒక్కొక దశలో ఎంతటి బాధ్యతను భారతీయులకు పరివర్తనం చేయవలసిందీ కమీషన్ నిర్ణయించవలసిఉంది. ఇదివరలో ఒప్పగించిన బాధ్యతను భారతీయులు సంతృప్తికరంగా నిర్వహించినారనే విశ్వాసం కమీషన్‌వారికి కుదిరినప్పుడే వారు మరికొంత బాధ్యతను ఒప్పగించే అవకాశం ఉన్నది. లేనిపక్షంలో వారు అంతవరకూ ఒప్పగించిన బాధ్యతను తగ్గించవలసినట్లుగాగాని లేదా రద్దుచేయవలసినట్లుగాగాని సిఫారసు చేయవచ్చు. ఈ విధంగా భారతీయుల అర్హతానర్హతలను పదేపదే పరీక్షించడం, ఆ పరీక్షకు వారు నిలబడగలగడం, వారి ఆత్మగౌరవానికి ఒక కళంకంగా భారతీయులు భావించడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీ లేదు.

కమీషన్ నియామకంపట్ల రాజకీయనాయకులు ఆగ్రహపరవశులగుటకు ఇంకొక కారణంకూడా ఉండినది. బాధ్యతాయుత పరిపాలన స్వరూపాన్ని నిర్ణయించుటకు ఒక రౌండు టేబిల్ సమావేశాన్ని ఏర్పాటుచేయవలసిందిగా 1924 లో కేంద్రశాసనసభ తీర్మానించినది. అలాటి సమావేశంలో భారతీయులకు ఎక్కువ ప్రాతినిధ్యం లభించిఉండేది. కాని దానికి బదులుగా సైమన్ కమీషన్‌ను నియమించబడింది. తాము వాంఛించిన రౌండ్ టేబుల్ సమావేశానికి ఇది పూర్తిగా విరుద్ధమైనట్టిది. దీనిమూలంగా భారతదేశానికి ఎలాటి ప్రయోజనం లభించదనే నిర్ణయానికి రాజకీయనాయకులందరూ వచ్చారు.

సైమన్ కమీషన్‌తో ఏవిధంగాకూడా సహకరించరాదని, దానిని పూర్తిగా బహిష్కరించవలసినదని, అది భారతదేశంలో అడుగుపెట్టినరోజున దానిపట్ల అసమ్మతిని ప్రకటిస్తూ ప్రజలు ప్రదర్శనలు జరుపవలసినదని, అది ఇతర పట్టణాలకు వెళ్ళినప్పుడు ఆయా పట్టణాల

లోని ప్రజలు ఈ విధంగానే ప్రవర్తించవలసినదని కాంగ్రెసు అధిష్టానవర్గం తీర్మానించింది. జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగువారు, లిబరల్ పక్షానికిచెందినవారు, హిందూమహాసభవారు ఇతర రాజకీయపక్షాలలో అనేకానికి చెందినవారు కమీషనును బహిష్కరించవలసిందిగా తీర్మానాలు చేశారు.

వీటి అన్నిటి ఫలితంగా రాజకీయరంగంలో తిరిగి సంచలనం ప్రారంభమైంది. పరాయిప్రభుత్వంతో పోరాటాన్ని ఏదో విధంగా సాగించడంపట్ల సామాన్యప్రజలు ఉత్సాహం కలవారుగా ఉండినారు. 1922 లో గాంధీ సహాయనిరాకరణోద్యమాన్ని ఉపసంహరించిన తర్వాత పోరాటాన్ని ఉపక్రమించుటకు వారికి తగిన అవకాశం లభించలేదు. కమీషన్ బహిష్కరణ కార్యక్రమం అలాటి అవకాశాన్ని కల్పించింది.

1927 డిసంబరు ఆఖరున కాంగ్రెసు డాక్టరు అన్సారి అధ్యక్షతన మద్రాసులో సమావేశమైనది. సైమన్ కమీషనును పూర్తిగా బహిష్కరించవలసిందిగా అంతకుపూర్వమే కాంగ్రెసు అధ్యక్షుడు చేసిన సూచనను ఇది దృఢపరచింది. ఇదిగాక భారతదేశలక్ష్యం డుమినియన్ ప్రతిపత్తియా లేక సంపూర్ణ స్వాతంత్ర్యమా అనే ప్రశ్న చర్చలోకి వచ్చింది. కొంతకాలమునుండి దేశంలో యువకవర్గానికి చెందిన జవహర్‌లాల్ నెహ్రూ సుభాష్‌చంద్రబోసు మొదలైనవారు సంపూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్యంగా ఉండవలెననే అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. పరిమిత బాధ్యతాయుత ప్రభుత్వంతో భారతీయులను తృప్తిపరచదలచి సైమన్‌కమీషనును నియమించిన బ్రిటన్‌లోని అధికారులకు సంపూర్ణ స్వాతంత్ర్యానికి సుముఖంగా కాంగ్రెసు తీర్మానం చేయడం తగిన సమాధానంగా ఉండగలదని వీరు భావించారు. దీనికితోడు 1926-27 లో నెహ్రూ యూరపుఖండంలో పర్యటన సాగించి, కమ్యూనిస్టు రష్యాకుకూడా వెళ్ళి సామ్రాజ్య విధానాన్ని నిరశించుటకు సమావేశమైన అంతర్జాతీయసభలో భారత ప్రతినిధిగా పాల్గొని విప్లవ భావాలతో స్వదేశానికి వచ్చి మద్రాసుకాంగ్రెసులో హాజరయ్యాడు. బ్రిటిష్‌సామ్రాజ్యంతో ఏలాటి సంబంధమూ భారతదేశానికి లేకుండా ఉండడమే భారతజాతికి గౌరవప్రదముకాగలదని భావించి, యువకబృందంవారి సహకారంతో దానికి అనుగుణంగా ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టాడు. కాంగ్రెసు దానిని ఆమోదించింది. ఇది జాతీయవాదులందరికీ హర్షాన్ని బ్రిటిష్‌అధికార వర్గాలకు విషాదాన్ని ఆగ్రహాన్ని కలిగించింది. చర్చలకాలంలో గాంధి కాంగ్రెసు సమావేశంలో లేకపోవడంచేత నెహ్రూ తీర్మానం సులభంగా నెగ్గినది. దీనితో చరిత్రాత్మకమైన 1927 వ సంవత్సరం ముగిసింది.

## 4

సైమన్‌కమీషను నియామకం మూలంగా బ్రిటిష్‌ప్రభుత్వం భారతీయులను సవాలు చేసినట్లు భావించి, దానిని ఎదుర్కొనుటను 1928 లో జాతీయవాదులు మూడురకములైన చర్యలను తీసుకొన్నారు. వాటిలో మొదటిది కమీషనును బహిష్కరించుట, రెండవది తమ దేశానికి అనుగుణమైన రాజ్యాంగాన్ని తామే రూపొందించడం; మూడవది తమ రాజకీయ వాంఛలను బ్రిటిష్‌ప్రభుత్వం చెల్లించవిపక్షంలో దానిని లొంగదీయుటకు తగిన సాధనాన్ని నిర్ణయించుకొనుట.

(1) కమీషన్ ఫిబ్రవరి 3 న బొంబాయిలో అడుగుపెట్టింది. ఫిబ్రవరి 2 న వైస్రాయి ఒక ప్రకటనచేస్తూ, భారతీయులు సహాయముచేసినా, చేయకపోయినా కమీషన్ దాని విచారణ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా జరిపించి తీరుతుందనీ, అది తయారుచేసిన నివేదికపైన పార్లమెంటువారు వారికి తోచినట్లు చర్యలను తీసుకొని భారతదేశానికి రాజ్యాంగాన్ని రూపొందించి తీరుతుందని ప్రతిజ్ఞచేశాడు. జాతీయవాదులు. సామాన్యప్రజలు ఇది ఒక విధమైన బెదిరింపని భావించి 3 న బహిష్కరణ కార్యక్రమాన్ని మరింత తీవ్రంగా సాగించారు. దేశమంతటా హర్తాలు జరిగినవి. "సైమన్, తిరిగీ మీ దేశానికి వెళ్ళిపో" అనే మాటలు వ్రాసిన అట్టలతో పెద్ద పెద్ద ప్రదర్శనలు. ఊరేగింపులు జరిగినవి. ప్రజలు శాంతియుతంగా వీటిని జరిపినా వారిని భయభ్రాంతుల చేయుటకు ప్రభుత్వం సాయుధ పోలీసుదళాలను సైనికదళాలను సమకూర్చింది. దీనిఫలితంగా మద్రాసులో కాల్పులు జరిగి ఒకడు మరణించాడు. అతని మృతకాయాన్ని చూచుటకు వచ్చిన ఆంధ్రకేసరి ప్రకాశంపై పోలీసులు తుపాకిని గురిపెట్టగా ఆయన వారి ఎదుట నిలబడి తన రొమ్మునుచూపి "ధైర్యం ఉండినపక్షంలో దీనిపై కాల్పులు సాగించండి" అని గర్జనచేయడంతో వారు వారి దౌర్జన్యకార్యక్రమాన్ని ఉపసంహరించుకొన్నారు. కలకత్తాలో కూడా ఈలాటి అవాంఛనీయ పరిణామాలు సంభవించాయి. కమీషన్‌వారి పర్యటన సందర్భంలో వారు వెళ్ళిన ప్రతిపట్టణంలోకూడా బహిష్కరణ నినాదాలతో నిరసన ప్రదర్శనలు జరిగాయి. లాహోరులో జనాన్ని చెదరగొట్టుటకు పోలీసువారు ప్రయోగించిన లాఠీలదెబ్బలకు గురిమై, క్రమక్రమంగా ఆరోగ్యాన్ని కోల్పోయి లజపతిరాయ్ మరణించాడు. దీనికి కారకుడైన సాండర్సు అనే పోలీసుఅధికారిని విప్లవకారులు హత్యజేశారు. లక్నోలోకూడా పోలీసువారు ఈలాగే ప్రవర్తించారు. జవహర్‌లాల్‌నెహ్రూలతోసహా అనేక నాయకులపై లాఠీలు. పోలీసు బెత్తములు విశృంఖలంగా నాట్యంచేశాయి. కమీషన్‌వారు 1928 ఫిబ్రవరి 3 నుండి మార్చి 31 వరకు ఒక పర్యాయము, అక్టోబరు 11 నుండి 1929 ఏప్రిల్ 13 వరకు రెండవ పర్యాయము దేశంలో పర్యటన సాగించారు. అది ఎక్కడికి వెళ్ళినా ప్రజలు బహిష్కరణ కార్యక్రమంతో దానిని ఎదుర్కొన్నారు. దానిగౌరవార్థం ప్రభుత్వం ఏర్పాటుచేసిన ఆహ్వానసభలలోను విందులలోను, ఉద్యోగులు. జమీందార్లు. బ్రాహ్మణేతర పక్షలవారు. అలాటి వర్గానికి చెందిన మరి కొందరుతప్ప తక్కినవారెవ్వరు పాల్గొనలేదు బహిష్కరణ కార్యక్రమం విజయవంతంగా సాగింది. ముస్లింలు, లిబరల్‌పక్షానికి చెందినవారు ఇందులోపాల్గొనరని భావించిన అధికారులకు ఇది కనువిప్పై ఎంతో ఆశాభంగాన్ని కలిగించింది.

ఇది అంతా శాసనసభలకు బయటజరిగిన కార్యక్రమం. సామాన్యప్రజల నిరసన భావాలు దీనితో వ్యక్తమైంది. దీనికితోడు ఫిబ్రవరి 16 న కేంద్రశాసనసభలో "భారత రాజ్యాంగాన్ని సవరించుటకు నియమించబడిన కమీషన్‌పట్ల ఈ సభకు ఏలాటి విశ్వాసం లేదనే విషయాన్ని ఇండియాప్రభుత్వం బ్రిటిష్‌ప్రభుత్వానికి తెలియపరచవలసిందిగా శిఫారసు చేస్తూన్నది'' అనే తీర్మానాన్ని లజపతిరాయ్ ప్రవేశపెట్టగా, అది సభవారి ఆమోదాన్ని పొందింది. ఇది ప్రభుత్వానికి మరింత కోపకారణమైంది. కాని, అది నిర్బంధవిధానాన్ని మరింత కఠినంగాను తీవ్రంగాను ప్రయోగించి నిర్దోషులనేకులను ఏలాటివిచారణతో నిమిత్తంలేకుండా నిర్బంధంలో ఉంచడంతప్ప రాజకీయనాయకులను సమాధానపరచగల చర్యలను తీసుకొనకపోయింది,

(2) బ్రిటిష్‌వారు రూపొందించే రాజ్యాంగాన్ని సర్వదా ఆక్షేపించుటకు పూనుకొన్న భారతీయనాయకులు అన్ని రాజకీయపక్షాల ఆమోదానికి పాత్రమైన రాజ్యాంగాన్ని రూపొందించిన పక్షంలో దానిని బ్రిటిష్‌అధికారులు సానుభూతితో పరిశీలింప సిద్ధంగా ఉన్నారని బర్కెన్‌హెడ్ అనేక పర్యాయాలు ప్రకటించాడు. అనేక విభేదాలతో కూడిన భారతీయులకు ఇది ఎన్నటికీ సాధ్యం కాజాలదని, బ్రిటిష్‌వారు తయారుచేసే రాజ్యాంగం ఒక్కటే వారికి శరణ్యమని అతడు భావించాడు. ఆతని సవాలును ఎదుర్కొనుటకు సిద్ధపడి, సైమన్‌కమీషన్ దాని సిఫారసుల్లను చేయుటకుముందే ఈ కార్యక్రమానికి రాజకీయనాయకులు ఉపక్రమించారు. 1927 డిసంబరులో సమావేశమైన కాంగ్రెసు ఇందుకుగాను కాంగ్రెసు అధిష్ఠానవర్గం చర్యలు తీసుకొనవలసినదిగా ఒక తీర్మానంచేసింది.

దీనిమేరకు కాంగ్రెసు అధ్యక్షుడు అన్‌సారి దేశంలోని సుమారు 25 సంఘాలకు ఆహ్వానం పంపాడు. వాటిలో అనేకంపంపిన ప్రతినిధులతోకూడిన అఖిలపార్టీల మహాసభ అన్‌సారి అధ్యక్షతన 1928 ఫిబ్రవరి 12 న డిల్లీలో సమావేశమైంది. కాని సమావేశంలో ఒక వైపు ముస్లింలు, ఇంకొకవైపు హిందువులు శిక్కులు మధ్య కొన్ని అభిప్రాయభేదాలు ఉత్పన్నం కావడంచేత మే 19 న జరిగిన సమావేశం అన్ని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి ఒక రాజ్యాంగాన్ని రూపొందించవలసిందిగా మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఇది ఆగస్టు 10 నాటికి రాజ్యాంగాన్ని తయారుచేయగా దానిని అఖిలపార్టీలమహాసభ ఆగస్టు 28-31 లో చర్చించింది. భారతదేశం బ్రిటిష్‌సామ్రాజ్యంలో ఒక డొమినియన్‌గా ఉండవలెనని ఇది చేసిన నిర్ణయాన్ని జవహర్‌లాల్ మొదలైన యువకబృందంవారు ప్రతిఘటించారు. కాని వోటింగుసమయంలో వారు సమావేశంలో పాల్గొనని కారణంగా నెహ్రూకమిటీ రూపొందించిన రాజ్యాంగం ఏకగ్రీవంగా ఆమోదించబడింది. తమ దేశానికి అనుగుణమైనరాజ్యాంగాన్ని తామే రూపొందించగల సామర్థ్యం భారతీయులకు కలదని ఈ సమావేశం రుజువుచేసింది. అన్ని పార్టీలవారు సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వాన్ని ఆశించేవారని, బ్రిటిష్‌వారు ఉద్దేశించిన పరిమిత బాధ్యతాయుత ప్రభుత్వం ఎవరికీ అంగీకారం కాదనీ, ఈ విషయంలో హిందువులు ముస్లింలు, ఇతర అల్పసంఖ్యాక వర్గాలవారు ఏకాభిప్రాయం కలవారని లక్నో సమావేశం స్పష్టంచేసింది.

నెహ్రూ కమిటీ రూపొందించిన రాజ్యాంగం భారతదేశంలో సమాఖ్య విధానం (Federal System) ఏర్పడవలెనని, కేంద్రానికి రాష్ట్రాలకు కేటాయించిన అధికారాలు కాక మిగిలిన అధికారాలు (Residuary Powers) కేంద్రానికి ఉండవలెనని, దేశాన్ని పాలించే అధికారం సర్వస్వామ్యం గలిగినట్టిన్నీ రెండు శాఖలతో కూడినట్టిన్నీ ఒక శాసనసభకూ, దానికి పూర్తిగా బాధ్యత వహించిన ఒక మంత్రివర్గానికి ఉండవలెనని, రాష్ట్ర శాసనసభలలో ఒకశాఖ ఉండవలెనని, దానికి బాధ్యత వహించిన మంత్రిమండలి ఒకటి ఉండవలెనని నిర్ణయించింది. శాసనసభ్యుల ఎన్నుకొనే హక్కు వయోజను లందరికి ఉండవలెనని నిర్ణయించింది.

చాలాకాలంనుండి ముస్లింల ప్రాతినిధ్యం ఒక వివాదాస్పదమైన విషయంగా ఉంటూ వచ్చింది. ఈ విషయంలో నెహ్రూ కమిటీ (1) ప్రత్యేక నియోజకవర్గాలు ఉండరాదని, అన్ని నియోజక వర్గాలు మిశ్రమములుగా ఉండవలెనని, (2) కేంద్ర శాసనసభలో కొన్ని మినహాయిం

పులకు లోబడి ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండరాదని. (3) రాష్ట్ర శాసనసభలలో పంజాబులోను, బెంగాలులోను ముస్లింలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండరాదని, (4) ఇతరరాష్ట్రాలలో మొత్తం జనాభాలో వారికిగల దామాషా ప్రకారం ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెనని. (5) ప్రత్యేక కేటాయింపులు పదిసంవత్సరాల వరకూ మాత్రమే ఉండవలెనని నిర్ణయించింది.

ఈ నిర్ణయాలను అఖిల భారత కాంగ్రెసు కమిటీ ఆమోదించింది. ముస్లింలీగు పూర్తిగా ఆమోదించలేదు. అందుచేత డిసంబరు 28 న కలకత్తాలో అఖిల భారత సమావేశం (All India Convention) జరిగి, నెహ్రూ నివేదికను నాలుగురోజులపాటు చర్చించి, ముస్లిం లీగు తరఫున జిన్నా (1) ముస్లింలకు కేంద్ర శాసనసభలో ⅓ ప్రాతినిధ్యం ఉండవలెనని, (2) వయోజన వోటింగు అములుకు రానిపక్షంలో బెంగాలు పంజాబు రాష్ట్రాలలో ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉండడంచేత పది సంవత్సరాలపాటు ఆ సంఖ్యకు అనుగుణంగా వారికి ప్రాతినిధ్యం కేటాయించవలెనని. (3) సమాఖ్యలో మిగులు అధికారాలు (Residuary Powers) కేంద్రానికి గాక రాష్ట్రాలకు ఉండవలెనని కొన్ని సవరణలను ప్రవేశపెట్టాడు. ఇవి సహేతుకమైన సవరణలనే చెప్పవచ్చు. కాని సమావేశానికి వచ్చిన జయకర్‌వంటి హిందూ మహాసభ ప్రతినిధులు వాటిని ప్రతిఘటించారు. సమావేశంలో అధికసంఖ్యాకులు జయకర్ వాదంతో ఏకీభవించడంచేత జిన్నా ప్రతిపాదించిన సవరణలు వీగిపోయినవి. జాతీయ ప్రయోజ నాల దృష్ట్యాను, బ్రిటిష్‌వారిని ఏకగ్రీవంగా ఎదుర్కొనే దృష్ట్యాను ఇది క్రమక్రమంగా అవాంఛ నీయ పరిణామాలకు దారితీసింది. ఇంతవరకు జాతీయవాదిగా ప్రఖ్యాతి గాంచిన జిన్నా ఇప్పటి నుంచి తన వైఖరిని మార్చుకొని వర్గ ప్రయోజనాలను మాత్రమే లక్ష్యంగా పెట్టుకొన్న ముస్లిం వర్గాలతో కలిసిపోయ్యాడు. హిందూ ముస్లిం ఐక్యత గొప్పదెబ్బ తిన్నది. అయినా, పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వం వెంటనే భారతదేశంలో ప్రవేశపెట్టవలెనని నెహ్రూకమిటీ చేసిన ప్రతి పాదన సమావేశంలోని వారందరి ఆమోదాన్ని పొందింది. ఇందులోనే భారతీయులకూ బ్రిటిష్ వారికీ మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడి ఉండినవి. ఈ విషయంలో భారతీయు లందరి మధ్య ఏకీభావం ఉండడాన్ని బ్రిటిష్ ప్రభుత్వం విస్మరించి. చిల్లర విషయాలలో హిందువులూ ముస్లింలు మధ్య ఉత్పన్నములైన విభేదాలకు మాత్రమే ప్రాధాన్యాన్ని కల్పించి. మింటోమార్లీ సంస్కరణల కాలాననుండి చేసినట్లే ఈ విభేదాలను మరింత వృద్ధిచేయుటకును, బాధ్యతాయుత ప్రభుత్వ ప్రవేశాన్ని నిరవధికంగా వాయిదా వేయడంలో మాత్రమే శ్రద్ధవహించింది. సైమన్ కమీషన్ నివేదిక చాలావరకు ఈ దృక్పథంతోనే తయారుచేయబడింది.

అఖిల భారత సమావేశం జరుగుచున్న రోజులలోనే కలకత్తాలో మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన కాంగ్రెసు సమావేశమైనది. నెహ్రూ కమిటీ ప్రతిపాదించిన డొమినియన్ ప్రతిపత్తి బదులు సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశ లక్ష్యంగా ఉండవలెనని అభిప్రాయపడినవారు జవహర్‌లాల్. సుభాష్ చంద్రబోసు మొదలైనవారి నాయకత్వాన అధిక సంఖ్యలో సమా వేశానికి హాజరైనారు. చర్చలు అతి తీవ్రరూపం ధరించేటట్లు గాంధీకి కనుపించింది. అప్పుడు ఆయన జోక్యం కలిగించుకొని ఒక రాజీమార్గాన్ని సూచించాడు. డొమినియన్ ప్రతిపత్తిని సమ ర్థించిన నెహ్రూకమిటీ నివేదికను ఆమోదించుటకు బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక సంవత్సరం గడువు ఇయ్యవలసిందిగాను 1929 డిసంబరు 31 నాటికి అలాటి అమోదం లభించని పక్షంలో కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని లక్ష్యంగా పెట్టుకొని. దానిని సాధించుటకు శాసనోల్లంఘన ఉద్య

మాన్ని సాగించవలసిందిగాను ఆయన సభవారికి తెలియపరచారు. ఒక సంవత్సరంలో మించి పొయ్యేది ఏదీలేదని అధికసంఖ్యాకులు ఈ సూచనను అంగీకరించారు. దీనితో నెహ్రూ కమిటీ నివేదిక ఆమోదించబడింది.

(3) సైమన్ కమీషనును ఎదుర్కొనుటకు కాంగ్రెసువారు మూడుచర్యలను తలపెట్టినారు. వాటిలో మొదటిదైన కమీషన్ బహిష్కరణ కార్యక్రమం విజయవంతంగా సాగింది. రెండవది అన్నిపార్టీలకు ఆమోదయోగ్యమైన రాజ్యాంగ నిర్మాణము. నెహ్రూ కమిటీ ఈ పనిని కూడా చాలావరకు విజయవంతంగా నిర్వహించింది. మూడవది ఈలాటి రాజ్యాంగానికి బ్రిటిష్ వారు బద్ధులు కానిపక్షంలో వారిని లొంగదీయుటకు సాధనాన్ని రూపొందించుట. కలకత్తా కాంగ్రెసు దీనిని కూడా నిర్ణయించింది. అది శాసనోల్లంఘన ఉద్యమరూపంలో ఉండవలెనని కాంగ్రెసు తీర్మానించడంచేత మూడవచర్య కూడ విజయవంతమైనట్లు చెప్పవచ్చును. 1928 ముగియునాటికి స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుటలో ఈ తీర్మానంమూలంగా కాంగ్రెసు రెండవ ఘట్టంలో ప్రవేశించింది. 1921-22 లోని సహాయ నిరాకరణోద్యమం ఇందులో మొదటిఘట్టమని ఇదివరకే తెలుసుకొన్నాము.

## 5

1929 లోని పరిణామాలు బ్రిటిష్ ప్రభుత్వానికి చాలా ఆందోళన కలిగించాయి. కాంగ్రెసులోని యువకబృందం సంపూర్ణ స్వాతంత్ర్యం దేశానికి లక్ష్యంగా ఉండవలెనని పట్టు పట్టడము, అందుకుగాను శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించుటకు సిద్ధపడడం, గాంధీ తిరిగి కాంగ్రెసుపై నాయకత్వం వహించడం ఈ ఆందోళనకు ప్రధాన కారణం. ఇదిగాక దేశంలో విప్లవఉద్యమం తిరిగీ తలఎత్తింది. అధికారుల హత్యలు, హత్య ప్రయత్నాలు జరగసాగినవి. లజపతిరాయిని లాటీదెబ్బలకు గురిచేసి ఆయన మరణానికి కారణభూతుడు సాండర్సు అనే పోలీసు అధికారి అనే అనుమానంతో భగత్‌సింగు అతనిని హత్యచేశాడు. 1929 లో కేంద్ర శాసన సభలో ఒక బాంబును ప్రేల్చారు. చిట్టగాంగులోని ఆయుధాగారాన్ని దోపిడిచేశారు. దక్షిణ భారతానుండి వైస్రాయి ప్రయాణంచేస్తున్నరైలుకు ప్రమాదం కలిగించారు. లాహోరు కుట్రకేసులో నేరస్థుడుగా పరిగణింపబడిన జితీంద్రదాసు అనే యువకుడు జైలులో ఆమరణాంత ఉపవాసాన్ని సాగించి మరణించాడు. ఇది దేశంలోని యువకులందరికి ఆగ్రహ కారణమై యువకఉద్యమం విప్లవరూపం ధరించుటకు సాధనమైంది. 1929 లో విప్లవభావాలు గల యువకులు ప్రధాననగరాలలో సమావేశాలు జరిపి వారి భావాలను ప్రచారం చేయగలిగారు.

1927 నుండి దేశంలో ఆర్థికపరిస్థితులు విషమించాయి. ప్రపంచంలో ఆర్థికమాంద్యం ఏర్పడడం దీనికి ప్రధాన కారణం. ఇతర దేశాలలో ప్రజల ఇబ్బందులను తొలగించుటకు ప్రభుత్వాలు సత్వరచర్య లనేకం తీసుకొన్నవి. కాని భారతప్రభుత్వం ఈలాటి కార్యక్రమాన్ని తలపెట్టలేదు. పంటలధరలు ముడిపదార్థాల ధరలు పడిపోయినవి. రైతులు ఎంతో నష్టానికి గురి అయ్యారు. దిగుమతుల ధరలు పెరగడం కారణంగా వస్త్రములు మొదలైన అవసర వస్తువులు కూడా లభించక కార్మికులు సమ్మెలలోకి దిగారు. 1929 లో పరిశ్రమ లన్నిటిలోను రైళ్ళలోను ఈ సమ్మెలు తీవ్రరూపం ధరించాయి. వాటిని అణచే ఉద్దేశంతో కొన్ని ప్రదేశాలలో పోలీసులు కాల్పులు జరిపారు. మామూలు కాలంలోకూడా కర్షకులు కార్మికులు దారిద్ర్యబాధను, ఋణబాధను,

అనుభవిస్తూ ఉండేవారు. ఆర్థికమాంధ్యం మూలంగా వారిస్థితి మరింత దిగజారింది. కాని అధికారులు వారిపట్ల ఏలాటి సానుభూతిని చూపుటకు బదులు వారిపై కఠినచర్యలు తీసుకోవడంచేత వారుకూడా ఉద్రేకపూరితులై శాసనోల్లంఘన ఉద్యమంపట్ల అభిమానం కలవారయ్యారు. గాంధి తిరిగి రాజకీయరంగంలో ప్రవేశించడం వారికి ఉత్సాహజనక మైంది.

ఇదేకాలంలో దేశంలో కమ్యూనిస్టు పార్టీకూడా దాని కార్యక్రమాలను పటిష్టంగా సాగిస్తూవచ్చింది. 1924 ప్రాంతాన సుప్రసిద్ధ విప్లవకారుడైన యం. యన్. రాయ్ కృషి ఫలితంగా దేశంలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. 1925-26 లో బ్రిటన్‌లోని కమ్యూనిస్టు పార్టీకి చెందిన స్ప్రాట్ మొదలైనవారు కొందరు భారతదేశానికి వచ్చి కమ్యూనిస్టు సిద్ధాంతాలను తీవ్రంగా ప్రచారంచేసి అనేక కర్షక కార్మిక సంఘాలను స్థాపించగలిగారు. 1929 లో సమ్మెలను లేవదీసి, సాగించుటలో వారు గొప్ప పాత్రను వహించారు. 1929 మార్చిలో 31 కమ్యూనిస్టు నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసి, మీరట్‌కోర్టులో వారి విచారణకు ఏర్పాటు చేసింది. మీరట్ కుట్రకేసు అనే పేరుతో ఈ విచారణ కొంత ప్రఖ్యాతి వహించింది. క్రిందికోర్టులో ఇరవై ఏడుగురికి దీర్ఘకాల శిక్షలు విధింపబడినవి. హైకోర్టు చాలవరకు శిక్షలను తగ్గించింది. 1935 నాటికి వీరందరు విడుదలయ్యారు. 1929 లో ప్రభుత్వం ఆందోళన పడుటకు కమ్యూనిస్టుల కార్యకలాపాలు ఒక కారణమని గుర్తించవలసి ఉంది.

ఈ మధ్యకాలంలో బ్రిటన్‌లో పార్లమెంటుకు ఎన్నికలు జరిగి టోరీపక్షంవారు ఓడిపోయి రాంసే మాక్డనాల్డు నాయకత్వాన కార్మికపక్షంవారు అధికారంలోకి వచ్చారు. కలకత్తా కాంగ్రెసు తీర్మానాల దృష్ట్యాను 1929 లో దేశంలో సంభవించిన ఇతర పరిణామాలదృష్ట్యాను ప్రభుత్వవిధానం ఎలాటిదిగా ఉండవలెనో తెలుసుకొనుటకు వైస్రాయి ఇర్విన్ ఇంగ్లండుకు వెళ్ళి కార్మికపక్ష నాయకులతోను ఇతర ప్రముఖులతోను చర్చలు సాగించి భారతదేశానికి తిరిగి వచ్చిన తర్వాత 1929 అక్టోబరు 31 న జాతీయవాదులను తృప్తిపరచే ఉద్దేశంతో బ్రిటిష్‌ప్రభుత్వ ఆదేశానుసారం ఒక ప్రకటన చేశాడు. ఇందులో (1) 1917 నాటి ప్రకటనలో ఉద్దేశింపబడిన భారత రాజ్యాంగముయొక్క సహజ పరిణామము డుమినియన్ ప్రతిపత్తి (It is implicit in the declaration of 1917 that the natural issue of India's constitutional progress, as there contemplated, is the attainment of Dominion Status;) (2)పార్లమెంటు భారత రాజ్యాంగాన్ని నిర్మాణం చేయుటకు పూర్వం దేశంలోని బ్రిటిష్ పరిపాలనలోని రాష్ట్రాలయొక్కయు స్వదేశసంస్థానాల యొక్కయు బ్రిటన్‌లోని మూడు రాజకీయ పక్షముల యొక్కయు ప్రతినిధులతో కూడిన రౌండు టేబిల్ సమావేశాన్ని ఏర్పాటుచేసి ఆ సమావేశంలో గరిష్ట ఆమోదానికి (Greatest possible measure of agreement) పాత్రములైన ప్రతిపాదనలను లెక్కలోకి తీసుకొని రాజ్యాంగాన్ని రూపొందిస్తుంది అనే సూత్రాలు రెండూ చేర్చబడినాయి.

వైస్రాయి ప్రకటనలోని డుమినియన్ ప్రతిపత్తి అనే మాట, రౌండ్ టేబుల్ సమావేశం అనే మాట దేశంలోని జాతీయ వాదులను తృప్తిపరచుటకు ఉపయోగింపబడినవి. జాతీయవాదులు కోరినది డుమినియన్ ప్రతిపత్తి; కాంగ్రెసువారు కూడా దీనినే కోరారు. సైమన్ కమీషన్‌లో భారతీయు డొకడు కూడా సభ్యుడుగా లేడనే కారణంగా దేశంలోని పార్టీల వారందరు దానిని బహిష్కరించారు. వైస్రాయి ప్రకటనలో ఉద్దేశింపబడిన రౌండు

టేబిల్ సమావేశంలో భారతీయులకు ఎక్కువ ప్రాతినిధ్యం ఉండేటట్లు స్పష్టం చేయబడింది. ప్రకటనలో ఈ రెండు లక్షణాలు ఉండడంచేత భారతీయులకు అది తృప్తి కలిగించగలదని ప్రభుత్వం భావించింది. కాని అది ఆలాటి తృప్తిని కలిగించలేదు.

ప్రకటన జరిగిన వెంటనే బ్రిటన్‌లోని టోరీ పక్షానికి లిబరల్ పక్షానికి చెందినవారు భారతదేశానికి డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించడాన్ని తీవ్రంగా ఆక్షేపించారు. దీనిని గురించి పార్లమెంటులో చర్చలు జరిగాయి. చర్చల సందర్భంలో కార్మిక పక్షంవారు డుమినియన్ ప్రతిపత్తి తుది లక్ష్యమనీ, దానిని వెంటనే ప్రసాదించే ప్రసక్తి లేనే లేదని, అది అనేక దశలు గడచిన తర్వాత కొద్ది కొద్దిగా ప్రసాదింప బడుతుందనీ చెప్పి ప్రతిపక్షాల వారిని సమాధాన పరచారు. కార్మిక పక్షం అధికారంలో ఉండినా దానికి పార్లమెంటులో ఆనాడు మెజారిటీ బలం లేదు. ఇతర పార్టీల సహకారంతోనే వారు అధికారంలోకి రాగలిగారు. ఈ కారణం చేతను, కార్మిక పక్షం వారికి కూడా భారతదేశానికి వెంటనే డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించే ఉద్దేశం లేకపోవడం చేతను వారీ విధంగా పార్లమెంటులో ప్రవర్తించడం తప్పింది కాదు.

పార్లమెంటులో జరిగిన ఈ చర్చలు దేశంలోని రాజకీయ నాయకులకు దిగ్భ్రమ కలిగించింది. గాంధీ, మోతీలాల్ నెహ్రూ, సప్రూ, జిన్నా మొదలైన నాయకులు డిసంబరు 23 న వైస్రాయిని కలుసుకొని, అతడు చేసిన ప్రకటనలోని అర్థం ఏమిటో చెప్పవలసిందిగా కోరారు. కాని వెంటనే డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించే ప్రసక్తి లేదని, భవిష్యత్తులో పార్లమెంటు రూపొందించే రాజ్యాంగ స్వరూపం రౌండుటేబిల్ సమావేశంలోని చర్చలపై ఆధారపడి ఉంటుందని స్పష్టం చేశాడు. ఇది వారికి ఆశాభంగాన్ని కలిగించింది. బ్రిటిష్‌వారి నిరంకుశ విధానంలో చెప్పుకోతగిన మార్పు రాలేదని వారు గ్రహించారు.

తర్వాత ఆరు రోజులకు—డిసంబరు 29 న—జవహర్‌లాల్ అధ్యక్షతన లాహోరులో కాంగ్రెసు చరిత్రాత్మక సమావేశాన్ని జరిపింది.

## 6

కాంగ్రెసు సమావేశమైన నాటికి సభ్యులలో భారతదేశ లక్ష్యం డుమినియన్ ప్రతిపత్తియా, సంపూర్ణ స్వాతంత్ర్యమా అనే సందేహం తీరిపోయింది. కలకత్తా కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వానికి ఇచ్చిన సంవత్సరం గడువు తీరింది. ఇంత గడువు వారికి ఇచ్చినా వారు ఒక శతాబ్దం క్రింద భారతదేశ పరిపాలనము గురించి ఏలాటి సంకుచితములైన అభిప్రాయాలు వ్యక్తం చేశారో ఆలాటి అభిప్రాయాలకే దాసులయ్యారు. వైస్రాయి అక్టోబరు 31 న చేసిన ప్రకటన కాంగ్రెసు నాయకులకు ప్రథమంలో కొంత ఆశాజనకంగా ఉండినా డిసంబరు 23 న ప్రకటనను గురించి అతడు చేసిన వ్యాఖ్యానం వారికి పూర్తి ఆశాభంగాన్ని కలిగించింది. శ్రీకృష్ణుడు మహాభారతయుద్ధం సంభవింపకుండా చేయుటకు కౌరవుల వద్దకు రాయబారం వెళ్ళి ఆశాభంగాన్ని పొందినట్లున్నూ, యుద్ధం అనివార్యమని భావించినట్లున్నూ వైస్రాయి వద్దకు రాయబారం వెళ్ళిన గాంధీ, మోతీలాల్‌నెహ్రూ బ్రిటిష్ ప్రభుత్వంతో శాసనోల్లంఘనపూర్వమైన యుద్ధం తప్పదనే నిర్ణయానికి వచ్చారు. కాంగ్రెసు సమావేశానికి వచ్చిన ప్రతినిధులందరు ఈలాటి యుద్ధంపట్ల అపరిమితమైన ఉత్సాహాన్ని ప్రదర్శించారు.

తన అధ్యక్ష ఉపన్యాసంలో జవహర్‌లాల్ దేశ స్వాతంత్ర్యం పరమ పవిత్రమైన ఆదర్శంగా ప్రజలందరు భావించ వలసినదని. దానిని సాధించుటకు సమస్త విధములయిన త్యాగాలు చేయుటకు వారు సిద్ధపడ వలసిందని ఉత్తేజపూరితములయిన మాటలు పలికారు. ఆ మాటలే ప్రతినిధులందరి హృదయాలలోనే గాక దేశ స్వాతంత్ర్య ప్రియులైన ప్రజలందరి హృదయాలలో ప్రతిధ్వనించాయి. గాంధీ ఆరు సంవత్సరాల కాలం రాజకీయాల నుండి విరమించుకొని (తన అజ్ఞాతవాసం పూర్తి అయినదనే భావంతో) 1928 మార్చిలో నూతన దీక్షతో తిరిగి రాజకీయ రంగంలో ప్రవేశించి స్వాతంత్ర్యోద్యమంపై నాయకత్వాన్ని వహించాడు. జవహర్‌లాల్ అధ్యక్షోపన్యాసం ముగిసినతర్వాత ప్రధాన విషయాల గురించి చర్చలు జరిగాయి. వాటి అనంతరం గాంధీ దేశ స్వాతంత్ర్యమునకు సంబంధించిన ప్రధాన తీర్మానమును ప్రతిపాదించాడు. అందులో (1) కాంగ్రెసు నిర్మాణ విధానములోని మొదటి సూత్రములోని "స్వరాజ్యము" అన్న మాటకు "సంపూర్ణ స్వాతంత్ర్యము" అని అర్థమనిస్నీ; (2) (దానిని సాధించుటకు) కొన్ని ప్రత్యేక స్థలములలో గాని లేక దేశంలోని అన్ని ప్రదేశములలో గాని పన్నుల నిరాకరణముతో గూడిన శాసనోల్లంఘన కార్యక్రమమును తగిన సమయములో నడిపించుటకు ఈ కాంగ్రెసు అఖిలభారత కాంగ్రెసు కమిటీకి అధికారమిస్తున్నది; ఈ విషయములో కమిటీ వారు తమకు తోచిన విధానాలన్నిటినీ వినియోగించవచ్చును; (3) ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశంలో ప్రాతినిధ్యం వహించడంవల్ల ఏలాటి ప్రయోజనమూ లేదు; (4) జాతీయోద్యమమునందు పాల్గొను కాంగ్రెసువారు ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని రాబోయే ఎన్నికలలో జోక్యము కలిగించుకొన గూడదు; (5) శాసన సభలలో గాని, కమిటీలలో గాని ప్రస్తుతము సభ్యులుగా ఉండే కాంగ్రెసువారు వారి సభ్యత్వాలకు రాజీనామా ఇయ్యవలెను అని విధించబడింది.

తీర్మానములోని అయిదు విషయములూ ప్రాధాన్యము వహించినవైనా మొదటి రెండూ భారతదేశ భవిష్యత్తు దృష్ట్యా మౌలికములని గుర్తించడం అవసరం. వీటి మూలంగా భారతదేశ లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యమనీ. దానిని సంపాదించుటకు శాసనోల్లంఘన రూపంలో శాంతియుత యుద్ధాన్ని సాగించడం అవసరమనీ ఇవి ఉద్ఘాటించాయి. ఇది మొదలు స్వాతంత్ర్యోద్యమం పూర్తి అయ్యేవరకు వీటిని ఆధారం చేసుకొని జాతీయవాదులు కార్యక్రమాన్ని సాగించారు. ఈ కార్యక్రమమునకు మొదటి మెట్టుగా 1930, జనవరి 26 న కాంగ్రెసు అధిష్ఠాన వర్గం తయారు చేసిన స్వాతంత్ర్య ప్రకటన పత్రం దేశమందంతటా సభలను జరిపి. వాటిలో చదువ వలసినదిగా తీర్మానించబడినది. ఇది చరిత్రాత్మకమైన ప్రకటనము. ఇందులోని సిద్ధాంతాలను ఆశయాలను అనుసరించియే భారతీయులు స్వాతంత్ర్య సమరాన్ని సాగించి, విజయాన్ని సాధించి, పరాయి పరిపాలనను తొలగింపడంలో ఏషియా ఆఫ్రికా ఖండాలలోని తక్కిన జాతులకు మార్గ దర్శకులయ్యారు. 1776 లో బ్రిటిష్ సామ్రాజ్యాధికారమును తొలగించుటకు అమెరికా వారు స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభిస్తూ జగత్ప్రఖ్యాతి గాంచిన స్వాతంత్ర్య ప్రకటనను (Declaration of Independence) చేశారు. పాశ్చాత్య ప్రపంచ చరిత్రలో ఇది ఎంతటి ప్రాధాన్యాన్ని వహించిందో 1931, జనవరి 26 న భారత జాతీయ కాంగ్రెసు చేసిన ప్రకటన అంతటి ప్రాధాన్యాన్ని ప్రాచ్య ప్రపంచంలో వహించినది. అందుచేత ఈ ప్రకటన పూర్తిపాఠం ఏలాటిదో తెలుసుకొనడం అవసరం. అది ఈ క్రింది విధంగా ఉండినది.

"తమ కష్టార్జిత ఫలముల ననుభవించి, తమ జీవితావసరములను తీర్చుకొనుటకు ప్రతి జాతికీ హక్కు ఉన్నట్లుగానే భారత జాతికి కూడా శాశ్వతమయిన హక్కు కలదని మా విశ్వాసము. అందు మూలముననే వారి అభివృద్ధికి సంపూర్ణావకాశములు కలుగ గలవు. ఏ ప్రభుత్వమైననూ ప్రజల ఈ హక్కులను తృణీకరించి, వారి నణగద్రొక్క పూనే యెడల ప్రజలకా ప్రభుత్వమును మార్చుటకు గాని, లేక నిర్మూలించుటకు గాని హక్కు కలదని కూడా మా విశ్వాసము. భారతదేశములోని బ్రిటిష్ ప్రభుత్వము భారత ప్రజల స్వాతంత్ర్యమును తృణీకరించుటయే గాక, ప్రజల ధనములను దోచుకొనుట పైన ఆధార పడియున్నది. ఆ ప్రభుత్వము మూలమున ప్రజల మత, రాజకీయ, ఆర్థిక విజ్ఞానములు నాశనము చేయబడినవి. కాబట్టి భారత దేశము బ్రిటిష్ సంబంధమును వదలుకొని, పూర్ణ స్వరాజ్యము పొందవలెనని మా విశ్వాసము.

"ఆర్థికముగా భారతదేశము నాశనము చేయబడినది. మా దేశ ప్రజలనుండి తీసుకొనబడే పన్నులు మా ప్రజల ఆదాయమున కెంతమాత్రము అనుగుణములుగా లేవు. మా సగటు ఆదాయము రోజుకు ఏడు కానులు (అనగా రెండు పెన్నీలకంటె తక్కువ). మేము చెల్లించే పన్నుల భారంలో నూటికి 20 వంతున హెచ్చింపబడిన భూమి శిస్తులు రైతులు చెల్లించుకొనవలసి యున్నది. నూటికి 3 వంతున హెచ్చింపబడిన ఉప్పు పన్ను పేదలకు భరింప శక్యము కాకున్నది.

"చేతితో నూలు వడకుట వంటి గ్రామ పరిశ్రమలు నిర్మూలింపబడినవి. రైతులు కనీసము సంవత్సరములో 4 నెలలు తదితర వృత్తులు లేక సోమరులుగా ఉండవలసి యున్నది. సున్నితములయిన చేతిపనులు లేకపోవుట మూలమున వారి బుద్ధి మొద్దు బారినది. ఇతర దేశములలోవలె నిర్మూలింపబడిన చేతిపనులకు బదులుగా ఈ దేశములో క్రొత్త వృత్తులు కల్పింపబడలేదు.

"దిగుమతి పన్నుల మూలముగను, కరెన్సీ (చెలామణి) తికమకముల మూలముగను రైతులపై క్రొత్త బరువులు మోపబడినవి. బ్రిటిష్ దేశములో తయారు చేయబడిన వస్తువులే ఎక్కువగా మాకు దిగుమతి చేయబడుతూ ఉన్నవి. దిగుమతి పన్నులలో స్పష్టముగా ఇంగ్లండులో తయారు చేయబడిన వస్తువుల పట్ల పక్షపాతము చూపబడుతున్నది. అందు మూలమున వచ్చిన ప్రభుత్వాదాయము ప్రజల పన్నుల భారము తగ్గించుటకు గాక ప్రభుత్వము వారి దుబారా ఖర్చుకు వినియోగింపబడుచున్నది. మారకపు రేటు విషయములలో చేయబడే కృత్రిమములు అన్నిటికంటె నిరంకుశముగ నున్నవి. ఇందు మూలమున ఈ దేశము నుండి లక్షల కొలది ద్రవ్యము పరాయి దేశములకు ప్రవహిస్తున్నది.

"రాజకీయముగా బ్రిటిష్‌వారి హయాములోవలె అంతకు పూర్వమెన్నడునూ భారత దేశపు స్థితి అధోగతికి రాలేదు. సంస్కరణములు ప్రజలకు నిజమైన రాజకీయాధికారములను ఇయ్యలేదు. మాలోని ఉత్తమోత్తములు విదేశీయుల అధికారమునకు తలయొగ్గవలసి ఉన్నది. అభిప్రాయ ప్రకటనమునకు గాని, సభా సమావేశమునకు గాని, మాకు స్వాతంత్ర్యము నిరాకరింపబడినది. మా దేశములో అనేకులు విదేశములందు అజ్ఞాతవాసము చేయవలసి వచ్చినది. వారు తమ గృహములకు తిరిగి రా వీలులేకున్నది. మా పరిపాలన సామర్థ్యము పూర్తిగా నిర్మూలింపబడినది. సామాన్య ప్రజలు చిన్నచిన్న గ్రామ నౌకరీలతోను, గుమాస్తా గిరీలతోను తృప్తి పడవలసి వచ్చినది.

"నేటి విద్యా పద్ధతి మమ్ములను మా విజ్ఞాన మార్గమునుండి వెర మార్గములను పట్టించినది. మా కీయబడు శిక్షణము మమ్ములను బంధించు గొలుసులనే మేమంటిపట్టుకొని యుండునట్లు చేసినది.

"నిర్బంధముగా మేము నిరాయుధులుగా ఒనర్పబడితిమి. అందుమూలమున మా పౌరుషము నశించినది, మాలోని నిరోధకశక్తి నణగద్రొక్కుటకు భయంకర ఆయుధములతో విదేశసైన్యములు దేశములో నిలుపబడినవి. మేము స్వసంరక్షణము చేసుకో కలిగినస్థితిలో లేము. విదేశ దండయాత్రల విషయములోగాని, లేక దొంగలు బందిపోటువారులు మొదలగు దుర్మార్గులనుండి, మా గృహములను. మా కుటుంబములను రక్షించుకొనే విషయములోగాని మాకు శక్తిలేదని తెలుపవలసి వచ్చినది.

"ఇటువంటి ఆపత్తులను కలిగించిన పరిపాలనమునకు మా దేశమును ఇంకను గురి చేయుట, దేవునికీ, మానవునికీ కూడ ప్రతికూలముగా అపరాధము చేసినట్లు మేము భావించు చున్నాము. కాని మా స్వాతంత్ర్యమును సంపాదించు కొనుటకు ప్రయోజన కరమైన మార్గము దౌర్జన్యపద్ధతి కాదని మాకు తెలుసును; కాబట్టి మాకు సాధ్యమైనంతవరకు బ్రిటిష్ పరిపాలనము నుండి పూర్తిగా సంబంధమును వదలుకొని, పన్నుల నిరాకరణముతో కూడిన శాసనోల్లంఘన మును ప్రారంభించుటకు మేము సంసిద్ధులు కాగలము. మేము ప్రభుత్వమువారికి చేసే మా స్వచ్ఛంద సహాయము నుపసంహరించుకొని, ఎట్టి ఆగ్రహకారణములు కలిగినప్పటికీ దౌర్జన్య మును విడనాడి పన్నుల చెల్లించుటను ఆపివేసినయెడల ఈ అమానుష ప్రభుత్వము అంత రించునని మా విశ్వాసము. కాబట్టి పూర్ణ స్వరాజ్య సంపాదనార్థము అప్పుడప్పుడు కాంగ్రెసు పంపించే ఉత్తరువులను శిరసా వహించుటకు మేమిందు మూలముగా ప్రమాణము చేసుకొను చున్నాము."

ఉదాత్త ఆశయములతోకూడిన ఈ ప్రకటన, స్వాతంత్ర్యము ప్రతిజాతికి జన్మ హక్కు అని. బ్రిటిష్ పరిపాలన మూలముగ ప్రజలకు ఆర్థికముగను రాజకీయముగను. వైజ్ఞా నికముగను దుర్భరనష్టములు సంప్రాప్తించినవని, అందుచేత వారిపై తిరుగుబాటుచేసి, తమ జన్మహక్కును సంపాదించుకొనుట తమ కర్తవ్యమని, ఈ తిరుగుబాటు దౌర్జన్య పూరితము గాక అహింసాపద్ధతి ననుసరించినదిగ ఉండగలదని, అది కాంగ్రెసు నాయకత్వాన జరుగునదీ తెలియపరచింది. ప్రమాణ పూర్వముగ ఈ తిరుగుబాటులోకి దిగుట మూలముననూ, ప్రమాణ మునకు అన్యథాగా ప్రవర్తించుట ధర్మ విరుద్ధమగుటచేతను స్వరాజ్యము లభించువరకు తిరుగు బాటును సాగించుటకు ప్రజలు సంసిద్ధులయ్యారు.

కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారి ఆదేశంమేరకు 1930. జనవరి 26 న ప్రజలు నగరము లలోను, పట్టణములలోను గ్రామములలోను మహాసభలు బహిరంగముగా జరిపి, స్వాతంత్ర్య ప్రకటనను చదివి, దానిని సంపాదించుటకై శాంతియుతముగ పరాయి ప్రభుత్వంతో యుద్ధాన్ని సాగించుటకు ప్రమాణము చేసినారు. ఇదిమొదలు జనవరి 26 ఒక పవిత్ర దినముగ పరిగణ లోనికి వచ్చినది. ఆ రోజునుండియే స్వాతంత్ర్య సమరములోని రెండువఘట్టము ప్రారంభ మైనదని చెప్పవచ్చును.

కాని ఈ సమరము ఏ రూపములో జరగవలసినది, శాసనోల్లంఘనము ఏ విధముగా సాగవలసినదీ నిర్ణయించే అధికారమును అఖిలభారత కాంగ్రెసు కమిటీకి లాహోరు కాంగ్రెసు వదలివేసినది. అందుచేత ఆ కమిటీ నిర్ణయానికి ప్రజలు అత్యంత దేశాభిమానంతోను, ఉత్సాహంతోను పట్టుదలతోను నిరీక్షిస్తూ వచ్చినారు. గాంధీ నాయకత్వంలో శాసనోల్లంఘన కార్యక్రమం ఏరూపం ధరించిందో అది ఏలాగు సాగిందో మనం ఇప్పుడు తెలిసికొనవలసి ఉన్నది.

చదువదగిన గ్రంథాలు :

Bhavan: Vol. xi
Tarachand Vol. iv
పట్టాభిసీతారామయ్య - కాంగ్రెసు చరిత్ర
M. Venkatarangaiya History of the Freedom struggle in Andhra Pradesh - Andhra : Vol iii
R. C. Majumdar: History of the Freedom Movement in India Vol. iii
Tendulkar: Mahatma, Vol. ii

# అధ్యాయము-9

## శాసనోల్లంఘన ఉద్యమము ప్రథమ దశ

## 1930-31

## 1

లాహోరు కాంగ్రెసు, సంపూర్ణ స్వాతంత్ర్యం వెంటనే సాధించవలసిన లక్ష్యమనీ, అందుకుగాను పన్నుల నిరాకరణతోకూడిన శాసనోల్లంఘనమును సాగించవలెనని తీర్మానించింది. ఈ తీర్మానమును ఆచరణ సాధ్యం చేయుటలో ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకొనడం ఎంతైనా అవసరం. వారి హృదయ పూర్వకమైన సహాయంలేనిదే ఉద్యమం ఫలప్రదం కాజాలదు. వారి అభిప్రాయాన్ని తెలుసుకొనే ఉద్దేశంతో 1930, జనవరి 26 ను స్వాతంత్ర్య దినంగా ప్రకటించి, ఆ రోజున దేశమందంతట స్వాతంత్ర్య మహాసభలు జరగవలసిందిగా కాంగ్రెసు నాయకులు ఆదేశించారు. దానిమేరకు ఆనాడు నగరాలలోను పట్టణాలలోను గ్రామాలలోను మహాసభలు సమావేశమైనాయి. లక్షలాది ప్రజలు వాటిలో పాల్గొని స్వాతంత్ర్య ప్రకటనపత్రాన్ని చదివించి విన్నారు. ఈ సమావేశాలు ప్రజలలో నివురుగప్పిననిప్పువలె ఉన్న స్వరాజ్య వాంఛను, దానిని సంపాదించుటకు కావలసిన త్యాగ సంసిద్ధతను, వెల్లడిచేశాయి. ఇటుపైన నాయకులు శాసనోల్లంఘనము ఏరూపం ధరించవలసింది నిర్ణయించి ప్రజల ఉత్సాహాన్ని తగిన మార్గాలలో నడుపుటకు సిద్ధపడవలసి యుండెను.

ఉద్యమ స్వరూపాన్ని నిర్ణయించుటకు కొంతకాలము పట్టింది. ఈ మధ్యకాలములో గాంధీ వైస్రాయికి ఒక ఉత్తరము వ్రాస్తూ అధికారులలో హృదయ పరివర్తనము ఏ మాత్రమైనా కలిగినదో తెలుసుకొనుటకు వాంఛించి, వెంటనే జరగవలసిన పదకొండు సంస్కరణలను పేర్కొని, వాటిని అములుపరచిన పక్షంలో శాసనోల్లంఘన ప్రసక్తి ఉండదని తెలియపరచాడు. సంపూర్ణ స్వరాజ్య సంపాదనను తలపెట్టి అందుకుగాను శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించ సంసిద్ధులుగా ఉన్న ఈ తరుణంలో ఈలాటి లేఖను గాంధీ వైస్రాయికి వ్రాయడం కాంగ్రెసు వర్గాలకు దిగ్భ్రమను కలిగించినది. ఆయన ఉద్దేశం అధికారుల మనోవైఖరిని తెలుసుకొనడం మాత్రమే అనే విషయాన్ని వారు గ్రహించలేక అనవసరంగా ఆందోళన పడినారు. వైస్రాయి ఈ లేఖకు ఏలాటి సమాధానం చెప్పక పోవడంతో శాసనోల్లంఘనం తప్ప మార్గాంతరం లేదనే విషయం గాంధీకి స్పష్టమైనది.

ఫిబ్రవరి 14, 15, 16 లలో కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం సబర్మతి ఆశ్రమంలో సమావేశమై గాంధీని ఉద్యమాన్ని సాగించుటకు సర్వ సేనాధిపతిగా నియమించి, ప్రథమదశలో అందు "అహింసను మతసిద్ధాంతముగా విశ్వసించేవారు మాత్రమే పాల్గొనవలసినట్లు" నిర్ణయించింది. కాని గాంధీ ఉప్పు సత్యాగ్రహ రూపంలో ఉద్యమాన్ని ప్రారం

భించిన తర్వాత అఖిలభారత కాంగ్రెసు కమిటీ అహమ్మదాబాదులో సమావేశమై ఉద్యమంలో ప్రజలందరు పాల్గొనుటకు అనుమతించినది.

కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం సమావేశమైన తర్వాతకూడ కొన్ని రోజులవరకు ఉద్యమం ఏ రూపంలో సాగవలసిందీ గాంధీ నిర్ణయించలేదు. దానిని గురించి సుదీర్ఘంగా ఆలోచించి తుదకు అది ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించే రూపంలో ఉండవలసిందిగా నిర్ణయించాడు. ఈ నిర్ణయం ఆయన ప్రతిభకు దూరదృష్టికి గొప్ప తార్కాణం. ఉప్పు శాసనం మూలంగా ప్రజలందరికి నష్టం కలిగింది. ఉప్పు అందరికీ అవసరం. ఈ శాసన ఫలితంగా ఉప్పును తయారు చేసే హక్కు ప్రభుత్వానికి మాత్రమే ఉండేది. తయారయిన ఉప్పుపైన పన్నునుకూడా విధించి దాని ఖరీదు ఎక్కువ చేసి చాలా ఆదాయాన్ని సంపాదించడం ప్రభుత్వానికి పరిపాటి అయింది. ఈ శాసనాన్ని ఉల్లంఘించడమంటే ప్రజలే ఉప్పును తయారు చేయడం అన్న మాట. ఇది అందరి అందుబడిలో ఉన్న ఉల్లంఘనం. మొదటినుండి గాంధీ స్వాతంత్ర్య పోరాటంలో సామాన్యప్రజలు పాల్గొనడం అవసరమని భావించాడు. అప్పుడుగాని అది ప్రజల పోరాటం కాజాలదు. ప్రజల పోరాటమే వాస్తవమయిన పోరాటం అనేది ఆయన విశ్వాసం. స్వాతంత్ర్య సంపాదనలో సామాన్యప్రజలు పాల్గొనినప్పుడే వారు దాని విలువను గ్రహించి, దాని సంరక్షణార్థం శ్రద్ధ వహించడం జరుగుతుంది. ఇంతేగాక ఈ ఉల్లంఘనంలో గ్రామీణ ప్రజలు—ముఖ్యంగా సముద్రతీర ప్రాంతాలలోని వారు పాల్గొనడం సులభ సాధ్యం. దేశంలోని నగరవాసులకంటె గ్రామీణ ప్రజలకే ఎక్కువ ప్రాధాన్యం ఉన్నట్లు గాంధీ ఎల్లప్పుడు భావించాడు. ఉప్పు శాసనోల్లంఘనం దీనికి అనుకూలంగా కనుపించింది. దీనికి తోడు ఇందులో పురుషులతోపాటు స్త్రీలుకూడా పాల్గొనడం సాధ్యమౌతుంది. స్వాతంత్ర్య సంపాదనలో స్త్రీలకు గొప్ప పాత్ర ఉండవలెననేది కూడా గాంధీ సిద్ధాంతాలలో ఒకటి. ఈలాటి కారణాలను బట్టి శాసనోల్లంఘన ఉద్యమం ఉప్పు రూపాన్ని ధరించవలెననే ఆయన నిర్ణయం సర్వ విధాలా ప్రశంసించదగినది.

తాను తీసుకొనిన ఈ నిర్ణయాన్ని ప్రజలందరికీ తెలియపరచడమేగాక మార్చి 2 న వైస్రాయికికూడా ఒక లేఖద్వారా దానిని తెలియపరచాడు. అంతేగాక ఆ లేఖలో భారతీయులు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు కారణాలు, బ్రిటిష్ ప్రభుత్వం మూలంగా ప్రజలకు కలిగిన కష్టాలు, నష్టాలు ఇంకొకమారు ఆయనకు స్పష్టపరచాడు. వైస్రాయి, "ప్రజాశాంతికి భంగకరమున్నూ, న్యాయశాస్త్రమునకు విరుద్ధమున్నూ అయిన ఇటువంటి ఉప్పు శాసనోల్లంఘన చర్యను గాంధీ తలపెట్టినందుకు విచారము వెల్లడించెనేగాని ప్రజల వాంఛలను చెల్లించుటకు ఏ విధంగాను సిద్ధపడలేదు. అందుచేత తాను నిర్ణయించుకొన్న ప్రకారము గాంధీ ఉప్పు శాసనోల్లంఘనమునకు పూనుకొన్నాడు.

ప్రపంచములో నాల్గవ భాగంపై సర్వాధికారాన్ని చెలాయిస్తూ, సూర్యుడు అస్తమించని సామ్రాజ్యమని ప్రఖ్యాతి గాంచిన బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని శాంతియుత శాసనోల్లంఘన సాధన సహాయంతో నిర్మూలించడంలో ఉప్పు ఒక బ్రహ్మాస్త్రంగా పని చేయగలదని తొలి దశలో ఎవరూ భావించలేదు. గాంధీ ఒక వెర్రివాడని అనేకులు అభిప్రాయ పడినారు. ప్రభుత్వంతో సహా అనేకులు ఆయనను అవహేళన చేశారు. కాని లక్షలాది భారతీయులు

ఉప్పును సాధనంగా చేసుకొని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించగలిగారు. ఈ అస్త్రాన్ని కనిపెట్టిన గాంధీ ప్రపంచంలోని వారందరికీ ప్రశంసాపాత్రు డైనాడు.

## 2

మార్చి 12 న సుశిక్షితులయిన ఆశ్రమవాసులతో కూడిన 79 మంది అనుచరులతో 200 మైళ్ళ దూరము కాలినడకను ప్రయాణముచేసి, సముద్రతీరమందుండిన దండిగ్రామములో ఉప్పు శాసనోల్లంఘమును చేయుటకు గాంధీ తనజైత్రయాత్రను ప్రారంభించాడు.దారి పొడుగునా గ్రామీణ ప్రజలు వేలాది సంఖ్యలో ఆయనను దర్శించి, ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించి, దాని ఫలితంగా అధికారులుపెట్టే బాధలకు ఏలాటి ప్రతిక్రియ చేయక శాంతియుతంగా వాటినిసహించి, స్వరాజ్యాన్ని సంపాదించవలసిందిగా ఆయన చేసిన ప్రబోధాన్ని శ్రద్ధాభక్తులతో ఆలకించి, శాస నోల్లంఘన కార్యక్రమంలో పాల్గొనుటకు సంసిద్ధులయ్యారు. ఈ విధంగా 24 రోజులు పాద యాత్ర చేసి, ఏప్రిలు 5 న ఆయన అనుచరులతో దండిగ్రామాన్ని చేరాడు.

జలియన్‌వాలాబాగు ఘోరాలు జరిగినప్పటినుండి దేశంలో ఏప్రిలు 6 నుండి 13 వరకు ఏడు రోజులను జాతీయవారంగా ప్రజలు పరిగణిస్తూ వచ్చారు. అందుచేత ఏప్రిలు 6 ఒక పవిత్ర దినంగా భావింపబడుతూ వచ్చింది. గాంధీ ఆలాటి రోజుననే భారతదేశ విముక్తికై తాను తలపెట్టిన ఉప్పు శాసనోల్లంఘనాన్ని ప్రారంభించవలచి ఉదయమే అనుచరు లతో సముద్రస్నానం చేసి, దైవప్రార్థనలు జరిపి, సముద్రతీరంలో ప్రకృతిసిద్ధంగా తయారైన కొంత ఉప్పును చేతులతో తీసుకొని లాంఛనప్రాయంగా శాసనోల్లంఘన సమరానికి అంకు రార్పణ చేశాడు. దేశంలో ఇతరులెవ్వరు తాను ప్రారంభించేటంతవరకు శాసనోల్లంఘనానికి ఉపక్రమించరాదని అంతకు పూర్వమే ఆదేశించాడు. ఆ ఆదేశానుసారం ఏప్రిలు 6 వరకు ఎవరూ ఉద్యమాన్ని ప్రారంభించ లేదుగాని దానికి కావలసిన సన్నాహాలన్నిటినీ పూర్తి చేసి, ఆ శుభప్రదమయిన రోజునకు వేచియుండినారు. వారి ఆశ ఫలించినదనే భావంతో 6 నుండి 13 లోపల ఉద్యమాన్ని ప్రారంభించారు. దేశమంతా ఒక ఉప్పు శిబిరంగా మారిపోయింది. సముద్ర జలాలతో ఉప్పు కాచడం, సముద్ర తీరంలోని ఉప్పు మళ్ళలోని ఉప్పును సేకరణ చేయడం, దానిని విక్రయించడం, వారి కార్యక్రమంలో ప్రాధాన్యం వహించింది. వారందరూ ఐచ్ఛికంగా శాసనోల్లంఘనానికి పూనుకొని, దాని మూలంగా కలిగే బాధలన్నిటినీ సహించుటకు సిద్ధపడ్డారు. దేశ విముక్తిపట్ల వారిలో ఏర్పడిన గాఢాభిమానం ఈ విధంగా వ్యక్తమైంది.

దండీయాత్ర జరుగుతున్న కాలంలోనే గాంధీ శాసనోల్లంఘన పూర్తి కార్య క్రమాన్ని ప్రజలకు వివరించి చెప్పాడు. ఉప్పు కాచడం, ప్రకృతిసిద్ధంగా లభించే ఉప్పును సేకరించడం, ఇవి సాధ్యం కానప్పుడు ఉప్పు కొటారులపై దాడి చేయడం, ఇదికూడా సాధ్యం కాని ప్రాంతాలలో కల్లు సారాయి దుకాణాలను పికెటింగు చేసి, మద్యపాన నిషేధాన్ని అమలు పరచడం, అబ్కారీ వేలంపాటలలో పాల్గొనరాదని కంట్రాక్టర్లను ప్రోత్సహించి, ప్రభుత్వానికి ఆదాయ నష్టం కలిగించడం, విదేశ వస్త్రాలను విక్రయించే దుకాణాలవద్ద పికెటింగు చేసి, వాటిని బహిష్కరించే ఉద్యమాన్ని విజయవంతం చేయడం, తాటిచెట్ల మొవ్వులను పూర్తిగా నరికి వేయడం ఈ కార్యక్రమంలో ఒక భాగం, ఇదిగాక రాట్నాలపై నూలు వడకడం, ఖద్దరును విరివిగా ఉత్పత్తిచేసి విక్రయించడం, అస్పృశ్యతను నివారించడం, హిందువులు

ముస్లింల మధ్య ఐక్యతను బలపరచడం, ఈ కార్యక్రమంలో రెండవ భాగం. దీనికే నిర్మాణ కార్యక్రమం అనే పేరు. 1921 నుండి వ్యవహారంలోకి వచ్చింది. స్వరాజ్య సంపాదనలో గాంధీ దీనికి గొప్ప స్థానాన్ని కల్పించాడు. పికెటింగును, నూలు వడకడం, ఖద్దరును విక్రయించడం అనే కార్యక్రమాలను సాగించడంలో స్త్రీలకు ప్రత్యేకమైన నేర్పు శక్తిసామర్థ్యాలు కలవనీ, వాటిలో వారు ప్రధానంగా పాల్గొనవలసిందనీ ఆయన నొక్కి చెప్పాడు. ఏప్రిలు 6 నుండి ఈ కార్యక్రమం కూడా చురుకుగా సాగింది.

శాసనోల్లంఘనం చేసినవారిని అరెస్టు చేసి, కోర్టులలో విచారణ గావించి, జైలుశిక్షలను విధించడం చట్టసమ్మతమైన పద్ధతి. దీనిని అనుసరించిన పక్షంలో ఎవరూ అధికారులను తప్పు పట్టే అవకాశం ఉండదు. అలాటి శిక్షలకు సిద్ధపడే ప్రజలు శాసనోల్లంఘనానికి పూనుకొన్నారు. కాని ఈ పద్ధతిని అనుసరించుటకు బదులు ఉద్యమంలో పాల్గొన్నవారిపై దౌర్జన్య చర్యలను సాగించి వారిని నానావిధాలుగా బాధించుటకు మొదటినుండి ప్రభుత్వం నిర్ణయించింది. వారిపైకి పోలీసులను పంపి, వారిని లాటీ దెబ్బలకు గురి చేయడం, వారి తలలను ఎముకలను విరగకొట్టడం, వారిని నేలమీద పడదోసి చేతులతోను కాళ్ళతోను లాగడం, వారి గుహ్యాంగాలను నలిపి స్పృహ తప్పి పొయ్యేటట్లు చేయడం, వారి పిడికిళ్ళలోని ఉప్పును వశపరచుకొనుటకు వారి పిడికట్లను కొట్టి రక్తపాతం చేయడం, గుమికూడిన వారిపై అనవసరంగా కాల్పులు జరిపి అనేకులకు ప్రాణనష్టాన్ని కలిగించడం, అనేకులను గాయపరచడం, అనేకులను లారీలలో తీసుకొనిపోయి మారు మూలలో నిర్మానుష్య ప్రదేశాలలో వదలివేయడం, వారిని దిగంబరుల గావించి కొరడాలతో కొట్టడం, వారి చేతులలోని కాంగ్రెసు జెండాలను లాగివేయడం,వారి తలలపై ధరించిన గాంధీ టోపీలను తొలగించడం, - ఇవి పోలీసు వారి చర్యలలో ప్రాధాన్యం వహించాయి. వేలాది జనాన్ని జైళ్ళలో నిర్బంధించడం సాధ్యం కాదనే భావంతో పోలీసువారు ఈలాటి అక్రమములూ చట్ట విరుద్ధాలూ అయిన కార్యక్రమాలకు పూనుకొన్నారు. ఉద్యమం ప్రారంభమయిన తొలి రోజులలోనే వారు దీనికి పూనుకొనడం గాంధీ దృష్టిని ఆకర్షించింది. కాని ఆయన ఏలాటి ఆశాభంగాన్ని పొందలేదు. ఈలాటి బాధలే ఉద్యమాన్ని బలపరచగలవని ఆయన భావించాడు.

## 3

దండిలో లాంఛనప్రాయంగా శాసనోల్లంఘనాన్ని ప్రారంభించిన తర్వాత ఒక నెలకు సూరత్ జిల్లాలోని ధర్శన ఉప్పుకొటారుపై దాడిచేయుటకు గాంధీ నిర్ణయించుకొని, తన అలవాటు ప్రకారం ఒక లేఖద్వారా తన నిర్ణయాన్ని మే 5 న వైస్రాయికి తెలియపరచాడు. ఆ లేఖలో ఈ నెలరోజుల మధ్య అధికారులు గావించిన రాక్షసకృత్యాలన్నిటిని వైస్రాయి దృష్టికితెచ్చి ఉప్పుకొటారుపై తాను ఎందుకు దాడిచేయ నిర్ణయించుకొన్నదీ స్పష్టపరచాడు. ఆ లేఖలోని విషయములను కొన్నిటిని తెలుసుకొనడం చాలా అవసరం.

"నేను కొంత సందేహముతోనే ఈ పనికి పూనుకొంటిని. ప్రభుత్వమువారు నాగరిక పద్ధతిప్రకారము శాసనవిరోధకులతో వ్యవహరింతురని నే నాశించితిని. శాసనవిరోధకులతో వ్యవహరించేటప్పుడు సాధారణ శాసనపద్ధతులను ప్రభుత్వమువారు అనుసరించి యుండినయెడల నేను నాళీనేమీ అనవలసినపని యుండేదికాదు. సుప్రసిద్ధనాయకుల విషయములో న్యాయశాస్త్ర

లాంఛనములు కొన్ని జరిగింపబడుతూ ఉన్నా తక్కినవారు క్రూరముగాను. మోటుతనముగాను కొట్టబడుతూ ఉన్నారు. ఇది ఎక్కడనో ఒకచోట జరిగియున్నయెడల అంతగా లెక్కపెట్ట నక్కరలేదు. కాని వంగ, బిహారు, ఢిల్లీ. ఉత్కళ, ఉత్తరప్రదేశములనుండీ. బొంబాయినుండీ కూడ గుజరాతు రాష్ట్రములో జరిగినటువంటి చర్యలు జరుపబడినట్లు నాకు తెలియవచ్చింది.... కరాచి, మద్రాసు, పెషావరులలో జరిగిన కాల్పులు అనవసరముగాను, ఆగ్రహకారణము లేకుండాను జరిగింపబడినట్లు కనుపిస్తున్నవి. వాలంటీర్ల దృష్టిలో అమూల్యమై ప్రభుత్వదృష్టిలో విలువలేని ఉప్పును వాలంటీర్ల చేతులలోనుండి లాగుకొనుటకు బొమికలు విరుగగొట్టబడు చున్నవి. గుహ్యాంగములు నలుపబడుచున్నవి... ఉప్పుసత్యాగ్రహ సందర్భములో వంగరాష్ట్రమందు కొందరుమాత్రమే శిక్షింపబడినట్లును, మరికొందరు దెబ్బలు కొట్టబడినట్లును తెలియ వచ్చినది. కాని వాలంటీర్ల చేతులనుండి జెండాలను లాగుకొనే సందర్భంలో ఊహింపరాని క్రూరకార్యములు జరుపబడినట్లు తెలియవచ్చినది.... ఈ చర్యలన్నీ ప్రజాసమూహముల కండ్ల ఎదుట జరిగినవి. కాని వారు కాంగ్రెసు ఆజ్ఞానుసారము ప్రతిక్రియ చేయక లొంగిపోయిరి. సత్యమునుమాత్రమే చెప్పెదమని ప్రమాణముచేసినవారు చెప్పే మాటలను నమ్మవలెనని మిమ్ములను నేను కోరుతున్నాను. బార్డోలీలో ఇట్టివిషయములు అనేకములు జరిగినవి. ఉన్నతోద్యోగులు అవి జరగలేదని ప్రకటించిరిగాని వారి ప్రకటనలు అబద్ధములని రుజువైనవి.”

తర్వాత అహింసాపద్ధతిలోని ఉత్కృష్టతను ఆయన వివరించి. ఆ పద్ధతిద్వారానే తానూ, తన అనుచరులైన భారతీయులు స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించ నిశ్చయించు కొన్నారని తెలియపరచి ఉప్పుపన్ను రద్దు చేయవలసినదిగాను, దానిని రద్దుచేయని పక్షంలో దర్శనకొటారుపై దాడిచేయడం తప్పదని స్పష్టంచేశాడు.

“ఉప్పుపన్ను న్యాయముకాదని సుప్రసిద్ధులగు మీ దేశీయులనేకులు ఖండించియున్న సంగతి మీకు తెలుసును. యావద్భారతదేశమూ ఆపన్నును ప్రతిఘటిస్తున్న సంగతి నేటి శాసనోల్లంఘన ఉద్యమమూలకముగ మీకు తెలిసియుండకపోదు. కాబట్టి ఆ పన్నును తీసి వేయించ వలసినదని నేను మిమ్ములను కోరుతున్నాను. మీరు శాసనతిరస్కారమునుగూర్చి మీ ఇష్టమువచ్చిన భాషలో ఖండించవచ్చును. శాసనోల్లంఘనముకంటె దౌర్జన్యయుత విప్లవ మును మీరు ఎక్కువగా ఇష్టపడెదరా? శాసనతిరస్కారోద్యమము దౌర్జన్యముతో అంతమొం దింతునని మీరిదివరకు చెప్పినట్లుగానే ఇప్పుడు కూడా చెప్పవచ్చును.... కాని బ్రిటిష్‌ప్రభుత్వము వారు అహింసాసిద్ధాంతమును గురించి వినీ, కనీ యుండకపోవుటచేత దాని తత్వమును తెలుసు కొనలేక, మానవస్వభావమును దౌర్జన్యకార్యములకు పురికొల్పిరని చరిత్రకారులు మిమ్ములను గూర్చి వ్రాయగలరు. కాని మీరు ఎంత బలవంతపెట్టినప్పటికీ, ఎన్ని ఆగ్రహకారణములు కలిగించినప్పటికీ, ప్రజలు దౌర్జన్యమునకు దిగకుండుటకు తగిన సమ్బుద్ధిని దేవుడు వారికి ప్రసా దించగలడని నా విశ్వాసము. కాబట్టి ఉప్పుపన్నును మీరు రద్దుచేయనియెడలను, ప్రజలు సొంతముగా ఉప్పు తయారుచేసుకొనుటకు గల నిషేధమును తొలగింపనియెడలను నేనీఉత్తరము నందలి మొదటిపేరాలో వ్రాసిన దండయాత్రను (దర్శన దండయాత్రను) నిర్విచారముగా సాగించితీరెదను.” ఇంతటి ధైర్యముతో వైస్రాయికి ఉత్తరం వ్రాయుటకు సిద్ధపడినవాడు గాంధీ ఒక్కడే.

కాని ఉత్తరంమూలంగా ఆశించిన ఫలితం లభించకపోవడమేగాక మే 5 న అర్ధరాత్రి వేళ అధికారులు గాంధీని అరెస్టుచేసి, పూనాలోని ఎరవాడజైలులో నిర్బంధించారు. ఈ నిర్బంధం మూలాన ఉద్యమం అంతరించగలదని వారు భావించారు. కాని దీనిఫలితంగా అది మరింత తీవ్రరూపాన్ని ధరించింది.

గాంధీ నిర్బంధానికి నిరసనగా దేశమంతటా హరతాళ్ళు జరిగినవి. బొంబాయిలో బట్టలవర్తకులు ఆరురోజులపాటు వారి వ్యాపారాన్ని కట్టిపెట్టారు. దూదిమిల్లులలోని కార్మికులు రైలు కర్మాగారములలోనివారు వేలసంఖ్యలో వారి పనులను మానుకొన్నారు. వివిధరాష్ట్రాలలో అనేకులు తమ గౌరవోద్యోగాలకు రాజీనామా ఇచ్చారు. ప్రపంచంలోని ఇతరదేశాలవారుకూడా గాంధీపట్ల సానుభూతిని, ప్రభుత్వచర్యపట్ల నిరసనను వ్యక్తంచేశారు. అమెరికాలోని క్రైస్తవ మతప్రచారకులు 102 మంది గాంధీతోను భారతప్రజలతోను రాజీ చేసుకొనవలసినదిగా బ్రిటిష్ ప్రధాని రాంసేమ్యాక్డొనాల్డుకు తంతివార్తను పంపినారు. సత్యాహింసలను ఆధారంచేసుకొని గాంధీ సాగించదలచిన ఉద్యమం ప్రపంచమంతటి దృష్టిని ఆకర్షించింది. అందరూ ఆయనను ఆయన అనుచరులను శ్లాఘించేవారయ్యారు.

గాంధీ నిర్బంధించబడిన తర్వాత ఆయన అనుచరులు మరింత పట్టుదలతో ఉప్పు కొటారులపై దాడులు సాగించవలసినదిగా నిర్ణయించుకొన్నారు. దర్శనాకొటారిపై మే 16 న 21 న, జూన్ 3 న మూడు దాడులను సాగించినారు. వాడాలాకొటారుపై మే 19 న, 22 న, 25 న (రెండు పర్యాయాలు) జూన్ 1 న దాడులు జరిగినవి. వీటిలో కాంగ్రెసు స్వచ్ఛందసైనికులు వేలసంఖ్యలో పాల్గొన్నారు. దాడిచేసినవారిపట్ల లాటీలుధరించిన పోలీసులు, సైనికులు యమ కింకరులవలె ప్రవర్తించి, వారిని అన్నివిధములైన దెబ్బలకు బాధలకు గురిచేయడమేకాక వారిపై తుపాకికాల్పులు జరిపి ప్రాణనష్టాన్ని కలిగించారు. గాంధీ ఆదేశానుసారం సత్యాగ్రహులు బాధలన్నిటినీ భరించారేగాని ఎదుటివారిపై ఏలాటి ప్రక్రియకు పూనలేదు.

మే 21 దర్శనాపై జరిగిన దాడిని ప్రఖ్యాతిగాంచిన అమెరికన్ పత్రికవిలేఖరి మిల్లరు స్వయముగా చూచి, దానిని పూర్తిగా వివరించి, కొసన ఈ క్రింది విధముగా తన అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు.

"18 సంవత్సరములనుండి పత్రికా విలేఖరిగా నేను 22 దేశాలను చూచినాను. లెక్కలేని అంతరంగిక కల్లోలములను, దొమ్మీలను, వీధిపోరాటాలను, తిరుగుబాటులను నేను కండ్లార చూచినాను. కాని దర్శనాలో చూచిన భయంకర దృశ్యాలను మరిఎక్కడా చూడలేదు. ఆ ఘోరాలను చూడలేక తాత్కాలికముగ వెనుకకు వెళ్ళిపోయిన సందర్భములుకూడా కలవు. ఆ (కాంగ్రెసు) స్వచ్ఛందసైనికుల క్రమశిక్షణ ఒక్కటియే నాకు ఆశ్చర్యము కలిగించెను. గాంధీ అహింసాసిద్ధాంతము వారి రక్తములో జీర్ణించినట్లు నాకు తోచినది."

ఈ సంఘర్షణలో కాంగ్రెసువారు 320 మంది గాయపడినారు. అనేకులు స్పృహతప్పి పడిపోయినారు. అనేకులు లాటీదెబ్బల ఫలితంగా మూలుగసాగారు. ఇద్దరు మరణించారు. ఈ దాడిలో పాల్గొన్న స్వచ్ఛంద సైనికులసంఖ్య 2500.

అన్ని దాడులలోను ప్రేక్షకులుగా వెళ్ళిన పత్రికావిలేఖరులకు ఈలాటి దృశ్యమే కనుపించినది. సత్యాగ్రహ యుద్ధంలో అహింస అనే ఆయుధాన్ని ధరించినవారు ఒక పక్షాన,

సాయుధులై హింసకు పూనుకొనినవారు ఇంకొకపక్షాన పోరాటాన్ని సాగించినారు. లండన్‌లో డెయిలీ హెరాల్డు పత్రికావిలేఖరి జార్జిస్లోకోంబు ఈ దృశ్యాలను చూచి.

"నేను వాడాలలోని గుట్టపైఎక్కి అక్కడి దృశ్యాలను చూచితిని. మిత్రులవలె మెలగుటలో పట్టుదలగల స్త్రీలు గాంధీ ప్రబోధంద్వారా శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనడంచేత స్వాతంత్ర్యాన్ని సంపాదించి ప్రజాజీవితంలో గొప్పస్థానాన్ని వహించగలిగారు." ఈ విధంగా స్త్రీలకు కలిగిన విముక్తిని పాశ్చాత్య విలేఖరులందరు ప్రశంశించారు. గాంధీ ఉద్యమంమూలంగా కలిగిన సత్ఫలితాలలో వారు దీనికి అగ్రస్థానం కల్పించారు. ఇందులో ఎంతైనా సత్యంఉన్నది.

# 4

శాసనోల్లంఘన ఉద్యమం స్వరాజ్యసంపాదనార్థం భారతీయులు పరాయి ప్రభుత్వంతో సాగించిన పోరాటం. ఇందులో ఉప్పు శాసనోల్లంఘనం ప్రథమంలో ప్రథమస్థానం వహించినా క్రమ క్రమంగా ఆయారాష్ట్రాల ప్రత్యేకపరిస్థితుల ననుసరించి కాంగ్రెసు నాయకులు ఇతర కార్యక్రమాలను సాగించారు. అంతరిధ్యేయం ప్రభుత్వంతో పోరాడడం. ఆ పోరాటం అనేక రూపాలను ధరించింది.

కల్లు దుకాణాలను పికిటింగుచేయడం, అబ్కారీ వేలంపాటలను పాడరానివి కంట్రాక్టర్లను ప్రోత్సహించడం ప్రభుత్వానికి ఏటేటా లభించే ఆదాయాన్ని తగ్గించడంలో ఒకసాధనమైంది. మధ్యప్రదేశ్, బొంబాయి రాష్ట్రాలలో సత్యాగ్రహులు అటవీ శాసనాలను ఉల్లంఘించారు. ఆంధ్రప్రదేశ్‌లోవారు ఈతచెట్లను తాటిచెట్లను కొట్టివేసిమద్యపాన నిషేధంతోపాటు ప్రభుత్వ ఆదాయాన్ని తగ్గించారు. గుజరాతులో—అందులో ప్రధానంగా బార్డోలీతాలూకాలోను, ఉత్తరప్రదేశ్‌లోను, బెంగాలులోని మిద్నాపూరు జిల్లాలోను పన్నుల నిరాకరణ ఉద్యమం చురుకుగా సాగింది. బీహారులో ప్రజలు చౌకదారి పన్నును చెల్లించడం నిరాకరించారు. కర్ణాటక రాష్ట్రంలోకూడా పన్నుల నిరాకరణ ఉద్యమం భారీఎత్తున సాగింది. అన్ని రాష్ట్రాలలో గ్రామోద్యోగు లనేకులు రాజీనామచేసి, శిస్తువసూళ్ళు సాధ్యంకాకుండా జేశారు. బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో బ్రిటిష్ వస్త్రాల బహిష్కరణ అతి తీవ్రంగా కొనసాగింది. 1929 నవంబరుకంటె 1930 నవంబరు నాటికి 100 కి 95 వరకు బ్రిటిష్ వస్త్రముల దిగుమతి పడిపోయినట్లు ఒక అంచనా. బొంబాయి నగరంలో కుంకుమపువ్వురంగు ఖద్దరు చీరెలను ధరించిన స్త్రీలు ప్రత్యేకంగా బ్రిటిష్ వస్త్రాల దుకాణాలను పికెటింగు చేయడంలో గొప్ప విజయాన్ని సాధించారు. వారి ప్రయత్న ఫలితంగాను, ఇతర కాంగ్రెసు నాయకుల ప్రయత్న ఫలితంగాను వర్తకులకూ కాంగ్రెసుకూ ఒక ఒడంబడిక కుదిరింది. పికెటింగు జరుగుతున్న కాలంలో వందలకొలది బేళ్ళ విదేశీబట్టలు విక్రయించుటకు సాధ్యంకాక బొంబాయి రేవులో మూలుగుతూ ఉండినవి. ఒడంబడిక మూలంగా దిగుమతి వర్తకులు సమావేశమై ఆ బట్టలను తీసుకొన కుండుటకు తీర్మానించుకొనిరి. వర్తకుల అధీనంలో ఉండిన విదేశీబట్టల గిడ్డంగు లన్నిటినీ కాంగ్రెసు సీలువేయుట కంగీకరించిరి. విదేశబట్టల వ్యాపారం స్తంభించిపోయింది. ప్రభుత్వ బెదరింపులకు లోబడుటకు బదులు వర్తకులు కాంగ్రెసుకు లోబడిపోయిరి.

గాంధీ అరెస్టైన తర్వాత కాంగ్రెసు కార్యవర్గమువారు అలహాబాదులో సమావేశమై బ్రిటిష్ వస్త్రములనేగాక వస్తువుల నన్నిటిని పూర్తిగా బహిష్కరించ వలెనని, బ్రిటిష్ బ్యాంకింగు సంస్థలను, భీమా సంస్థలను, నౌకా కంపెనీలను, ఇతర సంస్థలను బహిష్కరించ వలెనని తీర్మానించారు. ఈ బహిష్కరణ కార్యక్రమంకూడా చురుకుగా జరిగింది. బ్రిటన్ నుండి భారతదేశానికి వచ్చే దిగుమతులు 2/3 వంతు తగ్గినవి.

వస్త్రాల బహిష్కరణ ఫలితంగా ఖద్దరుకు గిరాకి పెరిగింది. అఖిలఖాదీచర్కా సంఘం 1,40,000 నూలు వడికే వారికి, 11,500 నేతగాండ్రకు వృత్తిని కల్పించింది. కాని ప్రజలకు అవసరమైనంత ఖద్దరు లభించని కారణంగా బొంబాయిలోని దూదిమిల్లులలో ఉత్పత్తి అయిన నూలుతో చేనేత వస్త్రాలను తయారు చేయుటకు ఏర్పాటులు గావించింది. ఆ సందర్భంలో కాంగ్రెసువారికి మిల్లు యజమానులకు మధ్య ఒక ఒడంబడికజరిగి చేనేతకు కావలసిన నూలును చౌకధరలకు విక్రయించుటకు యజమానులు అంగీకరించిరి. కాంగ్రెసువారి సహాయం ఈ సందర్భంలో మిల్లు యజమానులకు చాలా అవసరమైంది. కాంగ్రెసు విధించిన ఇతర షరతులకుకూడా అంగీకరించిన మిల్లులనుండియే నూలు కొనుగోలుచేయడం జరిగింది. విదేశ వస్త్రాల వర్తకులను లోబరుచుకొన్నట్లె మిల్లు యజమానులను కూడా కాంగ్రెసు లోబరచుకొనగలిగింది. ఈ విషయంలో బొంబాయిలో కాంగ్రెసు పరిపాలనాధికారాన్ని వహించగలిగింది. అధికారులు నిస్సహాయులై పోయిరి. వారి దౌర్జన్యం, వారి నిరంకుశత్వం నిష్ప్రయోజనమైనది.

ఈ విధంగా శాసనోల్లంఘన ఉద్యమం అన్ని వర్గాలవారి సహకారంతో శాఖోపశాఖలుగా దేశమందంతటా వ్యాపించి, ప్రభుత్వాధికారానికంటె ప్రజాశక్తి ఉత్కృష్టమైనదని రుజువుచేసింది.

## 5

ఉద్యమాన్ని అణచుటకు ప్రభుత్వం పూర్తిగా దమనవిధానాన్ని అనుసరించింది. ప్రజలపై అనేక నిర్బంధాలను విధించింది; వారిని అనేక బాధలకు గురిచేసింది. శాసనోల్లంఘన ఉద్యమం శాంతి భద్రతలకు ప్రమాదం కలిగిస్తున్నదనీ, అలాటి ఉద్యమాన్ని అణచడం దాని ప్రథమ కర్తవ్యమని, దమనవిధానాన్ని సమర్థించింది. దాని పరిపాలన మూలంగా దేశంలో దారిద్ర్యం, నిరుద్యోగం, విపరీతంగా వ్యాపించినదని, ప్రజలకు శాంతి కలుగుటకు వీటిని నిర్మూలించడంతప్ప సాధనాంతరం ఏది లేదని, ఇవి నిర్మూలం కాకపోవడంచేతనే వారు స్వరాజ్యాన్ని కాంక్షించారని అధికారులు విస్మరించి, వీటిని నిర్మూలించుటకు బదులు దమన విధానాన్ని అనుసరించారు. అన్ని దేశాలలో అన్ని కాలాలలో నిరంకుశులైన పరాయి పరిపాలకులు ఈలాగే ప్రవర్తించారు. ఈలాటి ప్రవర్తన మూలంగా ఏ సామ్రాజ్యమూ సుస్థిరంగాను శాశ్వతంగాను నిలబడ లేదనేది చరిత్ర నేర్పే గుణపాఠం. కాని ఈ విషయాన్ని బ్రిటిష్ పరిపాలకులు పూర్తిగా విస్మరించి తమ పరిపాలనను సుస్థిరం చేసుకొనుటకు దమన విధానాన్ని ప్రధాన సాధనంగా చేసుకొన్నారు. ఈ విధానం అనేక రూపాలను ధరించింది.

(1) దేశాన్ని పాలించుటకు ప్రభుత్వం ఆర్డినెంసులను (Ordinances) జారీ చేసింది. ఇవి మామూలు చట్టాలవంటివికావు, చట్టాలు శాసన సభలలో ప్రజాప్రతినిధులు

పాల్గొనే చర్చలు ఫలితంగా చేయబడుతవి. వాటిని చేయడంలో ప్రజాప్రతినిధుల అభిప్రాయానికి విలువ లభిస్తుంది. ఆర్డినెంసులను శాసనసభలతో నిమిత్తం లేకుండా గవర్నరు జనరల్ తన ఇష్టానుసారం చేస్తాడు. ఇది నిరంకుశత్వానికి ప్రధానలక్షణం. 1930 లో 12 ఆర్డినెంసులను గవర్నరు జనరల్ జారీచేశాడు.

(2) ఇవి ముద్రణాలయాలపై కఠిన నిర్బంధాలు విధించడంచేత 131 వార్తాపత్రికలు ధరావత్తులను కోల్పోయినాయి. అనేక పత్రికలు మూతబడినాయి. ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేయడం సాధ్యంకాక పోయింది. అందరి నోళ్ళకు తాళం వేయబడింది. ఇదిగాక వీటిమూలంగా బహిరంగ సమావేశాలు నిషేధింప బడినాయి. పన్నుల నిరాకరణను ప్రచారం చేయడం, పికెటింగు చేయడం, మొదలైనవి నేరాలుగా పరిగణింప బడినవి.

(3) సమావేశాలను జరిపినందుకు, పికెటింగు మొదలైన కార్యక్రమాలలో పాల్గొనినందుకు, ఇతర నిషేధాజ్ఞలను ఉల్లంఘించి నందుకు 1930 ఆఖరుకు సుమారు లక్ష జనం జైళ్ళలో నిర్బంధింప బడినారు. మోతీలాల్, జవహర్‌లాల్, సుభాష్ చంద్రబోసు, అబ్దుల్ గఫార్‌ఖాన్, కొండా వెంకటప్పయ్య మొదలైన నాయకులు ఇదేవిధంగా శిక్షింపబడినారు. దేశమంతా ఒక కారాగారంగా మారిపోయింది.

(4) కాంగ్రెసు కమిటీలను, కాంగ్రెసుతో సంబంధం ఉండిన ఇతర సంఘాలను అక్రమ సంఘాలుగ ప్రభుత్వం ప్రకటించింది. అందుచేత అవి బహిరంగంగా వాటిపనులను చేయలేక పోయినాయి. ప్రభుత్వం వాటి ఆస్తులను స్వాధీనపరచుకొన్నది; వాటి రికార్డులను దగ్ధం చేసింది.

(5) ప్రజలను రక్షించవలసిన ప్రభుత్వం భయంకరమైన రాక్షస రాజ్యరూపాన్ని ధరించింది; లాటీలు ధరించిన పోలీసులు, తుపాకులు ధరించిన సైనికులు విశృంఖలంగా స్వైర విహారం చేశారు. వారే దేశాన్ని పరిపాలించే వారయ్యారు. వారు యమకింకరులవలె ప్రవర్తించి, విచక్షణా రహితంగా ప్రజలను నరకబాధలకు గురిచేశారు.

(6) ఉద్యమంలో పాల్గొన్న స్త్రీల విషయంలో వీరు మరీ కఠినంగాను నిర్దాక్షిణ్యంగాను ప్రవర్తించారు. వారిపై అత్యాచారాలు గావించారు. వారిని లారీలలో ఎక్కించి దూరంగా తీసుకొనిపోయి నిర్మానుష్య ప్రదేశాలలో వదలివేయడం పోలీసులకు పరిపాటి అయింది. వారు వాడిన దుర్భాషలకు హద్దులేక పోయింది.

(7) గాంధీ శిష్యులలో సత్యాగ్రహంలో ప్రఖ్యాతి గాంచిన మాదలీన్ స్లేడ్ (Miss Madeline Slade) స్వానుభవాన్ని ఆధారం చేసుకొని పోలీసువారు కాంగ్రెసు స్వచ్ఛంద సైనికులను పెట్టిన బాధలను వివరించింది. తలపైన,రొమ్ముపైన,కడుపుపైన కీళ్లపైన లాఠీలతో కొట్టడం; గుహ్యాంగాలపైనను పొత్తి కడుపుపైనను లాఠీలను ప్రయోగించడం కొట్టుటకు ముందు పురుషులను దిగంబరులుగ చేయడం; వారి బట్టలను విప్పి, ఆసనాలలో కర్ర పుల్లలను త్రోయడం; స్పృహతప్పి నేలమీద పడిపోయేవరకు గుహ్యాంగాలను నలపడం; గాయపడినవారిని కొడ్తూ, చేతులతోను కాళ్ళతోను లాగడం; గాయపడినవారిని ముళ్ళపొదలలోను, ఉప్పునీటిలోను త్రోయడం; ఉద్యమంలో పాల్గొన్నవారు నేలమీద కూర్చుండగా

గుర్రాలను వారిపై నడిపించడం; వారి శరీరాలలో సూదులను గుచ్చడం; స్పృహతప్పిన వారిని కొట్టడం; మితిమీరి దుర్భాషలాడి వారిని అవమాన పరచడం—ఈలాటి బాధలకు వారిని గురిచేశారు. స్వాతంత్ర్యయోధులు వీటిని అనుభవించి, ఈనాటి తరంవారికి స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టినారన్న విషయం విస్మరింప దగినదికాదు.

పోలీసు దురాగతములను గూర్చి స్వయముగా సాక్ష్యసేకరణ చేసి వివరించిన ప్రఖ్యాత బ్రిటిష్ వార్తాపత్రిక విలేఖరి బ్రెయిల్స్‌ఫర్డు (Brailsford) ఈ క్రింది విధముగా వ్రాసినాడు.

"బాధ్యతగల భారతీయ నాయకులనేకులు పోలీసువారిపైన అనేక నిందారోపణలను చేయుచున్నారు. పోలీసువారనేక చోట్ల, అనేక సమయములలో చేసిన దుష్కార్యములను గూర్చి వారు వర్ణింతురు. అవి విచారించుటకు వీలులేనంత విస్తారముగ నున్నవి. ప్రతిచోట నిషిద్ధ సమావేశములను చెదరగొట్టుటలో పోలీసువారి క్రూరకృత్యములు వివరింపబడినవి. ఈ విషయములను కండ్లతో చూచిన అనేకమంది ఆంగ్లేయులు నాకు చెప్పిరి. గాయములు తగిలిన వారికి చికిత్స చేసిన భారతీయ డాక్టర్లుకూడ నాకీ సంగతిని చెప్పిరి. నేను పోలీసువారిని ప్రశ్నించితిని. చాలా సందర్భములలో ఆ సమావేశములను నిషేధించిన ఉన్నతాధికారులదే తప్పని నా అభిప్రాయము. నేను నిషేధింపబడని రెండు సభలకు పోతిని. ఉపన్యాసములు శాంతములుగానే ఉన్నవి. కాని రాజద్రోహకరములు కాకపోలేదు. (ఉద్యమము యొక్క లక్ష్యము స్వాతంత్ర్య సంపాదనమగుటచే రాజద్రోహము కాక తప్పదు). వారు దౌర్జన్యమును విరంతరము ఖండించిరి. ప్రజలు నేలపైన శాంతముగా కూర్చుండి నూలు వడుకుతూ ఉపన్యాసములను వినిరి. అనేకమంది స్త్రీలుకూడా ఆ సమావేశములో నుండిరి. వారు నెమ్మదిగా, శాంతముగా కనబడిరి. ఆ విధముగా సమావేశములను సాగనిచ్చినయెడల కల్లోలమే ఉండేది కాదు. సభాసదులకు కొంతకాలమునకు విసుగుపుట్టి ఉండేది. ముఖ్యముగా బొంబాయిలో పోలీసులు మొరటుతనముగా సమావేశములను చెదరగొట్టుట మూలమున నగరమందంతటా క్రోధము ప్రజ్వరిల్లెను; లాటీఛార్జీ నెదుర్కొనుట గౌరవప్రదముగ భావింపబడెను. వాలంటీర్లు వందల కొలది ప్రాణముల నర్పించుటకు సంసిద్ధులైరి. వారు సుశిక్షితమయిన సాత్వికధైర్యమును ప్రకటించిరి. శాంతముగానున్న అనేకమంది యువకులను బలిష్ఠులైన పోలీసులనేకులు కొట్టగా యూరోపియను లనేకమంది చూచిరి. వారు నాకా విషయమును వర్ణించి చెప్పిరి."

ఈ విధంగా కల్లోలానికంతకు పోలీసులే కారకులని బ్రెయిల్స్‌ఫర్డు చెప్పి, ఒక ఫ్రెంచి విలేఖరి అనుభవాలనుకూడా ఈ క్రింది విధముగా తన నివేదికలో పొందుపరచాడు.

"ఇంగ్లీషు ఉద్యోగస్థుల తనిఖీ క్రిందకూడ పోలీసువారు వాలంటీర్లను కొట్టిరన్న మాట నేను సందేహింపను. కలకత్తాలో కొంతమంది విద్యార్థులు పోలీసువారు ఒక ఉత్సవమును చెదరకొడుతూ ఉండగా తమ విశ్వవిద్యాలయ మేడనుండి "పిరికి వాండ్లు" అని కేకలు వేసిన కారణముగా తరువాత రెండు గంటలకు ఒక ఇంగ్లీషు ఉద్యోగి కొంతమంది పోలీసులతో యూనివర్సిటీలో ప్రవేశించి క్లాసు గదులలో చొరబడి విద్యార్థులను విచక్షణ లేకుండా గోడల పైన నెత్తురు చింది పడేటట్లు కొట్టించెను. విశ్వ విద్యాలయాధికారులు ఈ విషయమును గూర్చి నిరసించిరి కాని పోలీసులకు ఏమీ శిక్ష జరగలేదు. లాహోరులోకూడ ఇట్టి సంగతియే మరి

యొకటి జరిగినది. అక్కడ ఒక ఆంగ్ల ఉద్యోగి పోలీసువారిని తీసుకొనిపోయి ఒక కళాశాలను ముట్టడించి విద్యార్థులనే గాక ప్రొఫెసరులనుకూడ కొట్టెను. మరియొక కాలేజీలోని విద్యార్థులు వీధులలో శాంతియుతముగ పికెటింగు చేస్తున్నందుకు కొట్టబడిరి....

ఈ విధముగా దేశమందంతటా ఏలాటి విచక్షణ లేక పోలీసురాజ్యం వ్యాపించింది. చట్టవిరుద్ధముగ ప్రవర్తించినవారిని న్యాయస్థానములలో విచారణ చేసి శిక్షించిన పక్షములో అధికారులను నిందించుటకు అవకాశముండదు. కాని అధికారులు ఆలాగు ప్రవర్తించక ప్రజలను బాధించి భయపెట్టి వారిని లొంగదీసి, ఉద్యమమును అణచివేయుటకు సిద్ధపడ్డారు. ఈలాటి ఘాతుక చర్యలు జరిగినా ప్రజలు చలించక. ఉద్యమాన్ని మరింత పట్టుదలతో సాగించారు.

పైన వివరించిన పోలీసుదౌర్జన్యాలు దేశమందంతటా జరిగినవి. ఇవిగాక షోలాపూరు, పెషావర్, బార్డోలీ మొదలైన ప్రదేశాల లోనివారు ప్రత్యేక బాధలకు గురి అయ్యారు. షోలాపూరులోను, పెషావరులోను కొంతకాలం పాటు సైనిక పరిపాలన ప్రవేశపెట్టబడింది ఆ కాలంలో సైనికాధికారులు దయ్యరు సేనానికంటే క్రూరంగాను అమానుషంగాను ప్రవర్తించారు. బార్డోలి రైతులు భూమిశిస్తును చెల్లించడం నిరాకరించినందుకు వారు పరిపరి విధాలుగా బాధింప బడినారు. వీటిని భరించలేక వేలాది సంఖ్యలో వారు వారి గ్రామాలను వదలి బరోడా సంస్థానానికి వలస వెళ్ళుటకు నిర్ణయించుకొన్నారు. ఆనాడు బ్రిటిష్ పరిపాలన ఎంతగా భరింపరానిదైనదో ఈ ఉదంతం స్పష్టం చేస్తూ ఉంది.

## 6

గాంధీ ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించుటకు దండీయాత్రను ప్రారంభించిన నాడు వైస్రాయి ఆయన వెర్రివాడనీ, ఆయన ఉద్యమాన్ని పట్టించుకొనవలసిన అవసరంలేదనీ, ఆయనను అవహేళన చేసిననాడు. కాని ఉద్యమంలో క్రమక్రమంగా అన్ని రాష్ట్రాలకు, అన్ని వర్గాలకు చెందిన లక్షలాది జనం ఉత్సాహంతోను పట్టుదలతోను పాల్గొనడం, ఆర్డినెంసులు వారిపై ఏలాటి ప్రభావాన్ని వహించక పోవడం. పోలీసువారి భీకర చర్యలు ఉద్యమాన్ని బలహీన పరచుటకు బదులు వానిని మరింత బలపరచడం. గాంధీ నిర్బంధంతో అది చల్లారక పోవడం. దేశ విముక్తికిగాను సమస్త త్యాగాలు చేయుటకు ప్రజలు సిద్ధపడడం వైస్రాయికి కనువిప్పును కలిగించింది. బేదోపాయాన్ని ప్రయోగించి మితవాదులను, ముస్లింలను, జమీందార్లను చేరదీసి, దేశంలోని అల్ప సంఖ్యాకుల ఆమోదానికి పాత్రంగాని రాజ్యాంగ సంస్కరణలను బ్రిటిష్‌వారు ఎన్నటికీ ప్రవేశపెట్టరని ప్రత్యేకంగా ముస్లింలకు హామీ ఇచ్చాడు. కాని అన్ని ప్రధాన వర్గాలవారు దేశానికి డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించవలసిందిగా కోరారు. మితవాద నాయకులలో అగ్రశ్రేణికి చెందినట్టిన్నీ, ప్రభుత్వానికి విశ్వాస పాత్రుడైనట్టిన్నీ సప్రూతో సంప్రతించగా ఆయనకూడా కొన్ని మినహాయింపులకు లోబడి డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించడం తప్ప రాజ్యాంగ సమస్యకు వేరే పరిష్కార మార్గం లేదని సలహా ఇచ్చాడు.

ఉద్యమం నానాటికి తీవ్రరూపం ధరించడం, దానిని అణచడం సాధ్యం కాకపోవడం, అన్ని వర్గాలవారు డుమినియన్ ప్రతిపత్తిని వాంఛించడం వైస్రాయికి ఆందోళన కలిగించింది,

పరిస్థితులు ఈలాటి క్లిష్టరూపం ధరించిన గడ్డు సమయంలో సైమన్ కమీషన్ 1930, జూన్‌లో దాని నివేదికను బ్రిటిష్ ప్రభుత్వానికి సమర్పించింది. జాతీయ దృక్పథం కలవారందరు కమీషన్‌ను బహిష్కరించడం చేత వారి అభిప్రాయాలను తెలుసుకొనుటకు దానికి అవకాశం లేక పోయింది. దానిని కలుసుకొన్న వారందరు దేశ ప్రయోజనాలను విస్మరించి వర్గ ప్రయోజనాలను మాత్రమే కాంక్షించినవారు. కమీషన్ దేశంలో పర్యటించిన కాలంలో శాసనోల్లంఘన ఉద్యమం తీవ్రంగా సాగుతూ ఉండినా దాని ప్రాధాన్యాన్ని అది గుర్తించలేక పోయింది. బ్రిటిష్ పరిపాలనను సుస్థిరం చేసే ఉద్దేశంతోనే అది దాని నివేదికను తయారు చేసింది.

నివేదికలో ఎక్కడా డుమినియన్ ప్రసక్తి లేనేలేదు. అది తుదిలక్ష్యంగాకూడా అది గుర్తించలేదు. కేంద్రప్రభుత్వం ఏవిధంగాను శాసనసభకు బాధ్యతవహించవలసింది లేదని, యథాతదంగా నిరంకుశాధికారాన్ని వహిస్తూ ఉండవలసిందని నిర్ణయించింది. రాష్ట్రాలలో ద్వంద్వ ప్రభుత్వం తొలగి పరిపాలనశాఖలన్నీ శాసనసభకు బాధ్యతవహించిన మంత్రుల అధీనంలో ఉండవలసినట్లుగా సూచించిందిగాని గవర్నరుల ప్రత్యేకాధికారాలు విస్తృతం కావలసినట్లుగా శిఫారస్సుచేసింది. ఉన్నతఉద్యోగ వర్గంవారి అధికారాలు జీతబత్యాలు మారకూడదని, సైన్యం యథాతదంగా ఉండవలెనని సూచించింది. ప్రత్యేకప్రాతినిధ్యం, ప్రత్యేక నియోజకవర్గాలు ముస్లింలకుమాత్రమేగాక శిక్కులు, అస్పృశ్యులు మొదలైన ఇతర అల్పసంఖ్యాకులకుకూడా ఉండవలననే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. ఈ సిఫారస్సులలో ఏవీకూడా కాంగ్రెసువారికే గాక మితవాదులు మొదలైనవారికి కూడా తృప్తిని కలిగించలేదు. కమీషన్ నివేదికను అందరూ నిరశించారు.

నివేదికలో డుమినియన్ ప్రతిపత్తి ప్రసక్తిలేకపోవడం, కేంద్రంలో ఏలాటిమార్పులు సూచించకపోవడం వైస్రాయికికూడా ఆశాభంగాన్ని కలిగించింది. కాంగ్రెసువారిని ఇతర జాతీయవాదులను కొంతవరకైనా తృప్తిపరచనలసిన సమయంలో వారందరికీ ఆశాభంగాన్ని కలిగించిన నివేదికవలన ఏలాటి ప్రయోజనంలేదని, దీనిని ఆధారంచేసుకొని రాజ్యాంగ సంస్కరణలను పార్లమెంటుచేయడం ప్రమాదకరమని అతడు భావించి, రాజ్యాంగసమస్యను పునఃపరిశీలన చేయవలసిందిగాను, అందుకు భారతప్రతినిధులతో కూడిన రౌండుటేబిల్ సమావేశం ఒక్కటే సాధనమనీ, ఆలాటి సమావేశాన్ని అనాలస్యంగా ఏర్పాటుచేసి, దానిలో జరిగే చర్చలు ఆధారంగా పార్లమెంటు రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టడం అవసరమనీ అతడు బ్రిటన్‌లోని అధికారులకు తెలియపరచాడు. అప్పట్లో లేబర్‌పార్టీ అధికారంలో ఉండినది. అది వైస్రాయి అభిప్రాయంతో ఏకీభవించి, 1930 నవంబరులో రౌండుటేబిల్ సమావేశాన్ని ఏర్పాటుచేయుటకు అంగీకరించింది.

కాని సమావేశంలో పాల్గొనదగిన భారతీయ ప్రతినిధులలో కాంగ్రెసుకు చెందినవారు ఉన్నప్పుడే సమావేశం ఫలప్రదంకాగలదనే సత్యాన్నిగ్రహించి అందుకుగాను కొంతప్రయత్నం చేసి విఫలమైంది. దేశంలోని పార్టీలన్నిటిలో కాంగ్రెసు అగ్రస్థానం వహించినట్టిది; ప్రజలలో అధికసంఖ్యాకులు దానిని అనుసరించేవారు. జాతీయదృక్పథంగల ప్రధానమైనపార్టీ అదిఒక్కటే. దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు బ్రిటిష్‌వారితో పోరాటాన్నిసాగిస్తున్న పార్టీ అది. బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టవలసిన రాజ్యాంగసంస్కరణలు దానికి ఆమోదయోగ్యంగా ఉన్నప్పుడే

పోరాటం ఆగిపోవడం, సంస్కరణలు సార్థక్యాన్ని వహించడం జరుగుతుంది. ఈ పరిస్థితులలో కాంగ్రెసు ప్రతినిధులు రౌండుటేబిల్ సమావేశంలో పాల్గొనడం ఎంతైనా అవసరం. అందుచేత వైస్రాయి నిర్బంధంలో ఉండిన గాంధీతోను మోతీలాల్ జవహర్‌లాల్ మొదలైన కాంగ్రెసు నాయకులతోను సప్రూజయకార్ల ద్వారా రాయబారాలు జరిపారు. సంపూర్ణ స్వరాజ్యం ప్రాతిపదికగా చర్చలు సాగించుటకు బ్రిటిష్‌ప్రభుత్వం సిద్ధపడితేతప్ప కాంగ్రెసు సమావేశంలో పాల్గొనజాలదని వారు స్పష్టంచేశారు. దానికి ప్రభుత్వం సమ్మతించలేదు, అందుచేత కాంగ్రెసు ప్రతినిధులు లేకుండగనే సమావేశం జరగవలసి వచ్చింది.

సమావేశంలో పాల్గొనుటకు ప్రభుత్వం 89 సభ్యులను పేర్కొన్నది. వారిలో సంస్థానాధీశులు 16, ముస్లింలు 16, హిందూమహాసభకు చెందినవారు 3, ఇద్దరు శిక్కులు, నల్గురు బ్రాహ్మణేతరులు, ఇద్దరు అస్పృశ్యులు, నల్గురు క్రైస్తవులు, నల్గురు యూరోపియన్లు ఒక ఆంగ్లోఇండియన్, ఒక భారతీయ వర్తకుడు, ముగ్గురు బర్మావారు, 20 లిబరల్ మొదలైన పక్షాలకు చెందినవారు. బ్రిటన్‌లోని మూడు రాజకీయపార్టీల ప్రతినిధులు 16. సభ్యుల నియమించడంలో వర్గ ప్రయోజనాలను మాత్రమే వాంఛించేవారు అధికసంఖ్యలో ఉండడం గుర్తించవలసిన విషయాలలో ఒకటి; హిందువులలో ఎన్నిభేదాలు (వర్గాలబట్టి, వృత్తులబట్టి, కులాలబట్టి) ఉండినవో అన్నిభేదాలు ముస్లింలలో ఉండినా హిందూప్రతినిధులను ఈ భేదాలను ఆధారంచేసుకొని నియమించడం, ముస్లింప్రతినిధుల విషయంలో పాటించకపోవడం గుర్తించవలసిన విషయాలలో రెండవది. ముస్లిం ప్రతినిధులలో జాతీయ వాదులైన డాక్టర్ అన్సారివంటివారు ఒకరుకూడా లేకపోవడం, అందరూ ప్రత్యేక నియోజకవర్గాలద్వారా ప్రాతినిధ్యాన్ని కోరేవారుగా ఉండడం గుర్తించవలసిన విషయాలలో మూడవది. భారతీయులు ఒక జాతికి చెందినవారుకారని, వారిలో ఎన్నో చీలికలు ఉన్నవని ప్రపంచానికి చాటించే ఉద్దేశంతో బ్రిటిష్‌ప్రభుత్వం సభ్యులను నియమించింది. సమావేశంమూలంగా స్వాతంత్ర్య సంపాదన దృష్ట్యా సత్ఫలితాలు లభించకపోవుటకు సభ్యులను పేర్కొనుటలో ప్రభుత్వం అనుసరించిన భేదోపాయమే ప్రధాన కారణం.

రౌండుటేబిల్ సమావేశం మూడుదశలలో జరిగింది. వాటిలో మొదటిది 1930 నవంబరు 12 నుండి 1931 జనవరి 19 వరకున్నూ, రెండవది 1931 సెప్టెంబరు 7 నుండి డిసెంబరు 11 వరకు, మూడవది 1932 నవంబరు 17 నుండి డిసెంబరు 24 వరకు సాగినవి. వీటిలో మూడవదానికి ఏలాటి ప్రాధాన్యంలేదు. మొదటి సమావేశంలో కాంగ్రెసు పాల్గొనలేదు; రెండవదానిలో కాంగ్రెసుపాల్గొన్నది. మొదటిది బ్రిటన్‌లో లేబర్‌పార్టీ అధికారంలో ఉండినప్పుడు జరిగింది. ఆనాటి ఇండియా మంత్రి బెన్ కాంగ్రెసు వాంఛలపట్ల ఉదారస్వభావాన్ని ప్రకటించి సాధ్యమైనంతవరకు వాటిని కొనసాగించడం అవసరమని భావించాడు. అల్పసంఖ్యాకులైన ముస్లింలను తృప్తిపరచడం అవసరమైనా అధికసంఖ్యాకుల వాంఛలను విస్మరించరాదని, వారినికూడా తృప్తిపరచడం అవసరమని భావించి హిందూ ముస్లిం సమస్యను కొంత నిష్పక్షపాతవైఖరితో పరిశీలించినాడు. రెండవ సమావేశానికి కాంగ్రెసు తరఫున ప్రతినిధిగా గాంధీ వెళ్ళినాడు. కాని అప్పటికి లేబర్‌పార్టీ అధికారాన్ని కోల్పోయి కాన్సెర్వేటివ్ పక్షంవారు అధికారంలోకి వచ్చారు. వారు భారతదేశంపట్ల ఏలాటి సానుభూతిలేని శుద్ధసామ్రాజ్యవాదులు. గాంధీ వారి వైఖరిని మార్చలేక ఆశాభంగాన్ని పొంది స్వదేశానికివచ్చి శాసనోల్లంఘన ఉద్యమాన్ని తిరిగి

ప్రారంభించాడు. కాన్సర్వేటివ్ పక్షంవారు ముస్లింలవర్గతత్వానికి మరింత బలంచేకూర్చి వారిని హిందువులనుండి పూర్తిగా విడదీయగలిగారు. వారి సహాయంతో సైమన్‌కమీషన్ నివేధికను ఎక్కువగా ఆధారం చేసుకొని భారతరాజ్యాంగాన్ని తమ ఇష్టానుసారం రూపొందించ గలిగారు. ఏ ఉద్దేశాలతో రౌండుటేబిల్ సమావేశం ప్రథమంలో ఏర్పాటుచేయబడినదో ఆ ఉద్దేశాలు నెరవేరలేదు.

మొదటి సమావేశంలో జరిగిన చర్చల ఫలితంగా రెండు విషయాల గురించి భారతీయ ప్రతినిధులమధ్య ఏకీభావం కుదిరింది. స్వదేశ సంస్థానాలు బ్రిటిష్ పరిపాలనలోని రాష్ట్రాలు కలిపి ఒక అఖిలభారత సమాఖ్యగా (All-India Federation) ఏర్పడవలెననేది వీటిలో మొదటి విషయం. బ్రిటిష్‌వారు మొదటినుండి సంస్థానాలను రాష్ట్రాలనుండి వేరుచేసి తమ పరిపాలనను సాగించారు. అఖిలభారత సమాఖ్య వారిపరిపాలన విధానాన్ని పూర్తిగా మార్చి వేసింది. సంస్థానాధీశులు ప్రజాస్వామికంపట్ల అభిమానంలేని నిరంకుశ పరిపాలకులు; జాతీయవాదులు వాంఛించే ప్రజాస్వామికాన్ని విరోధించుటలో వారు తమకు సహాయ పడగలరనే దురుద్దేశంతో బ్రిటిష్‌వారు ఈ మార్పునకు అంగీకరించి, 1935 చట్టంలో దానికి ప్రధానస్థానం కల్పించారు. ఇదిగాక రాష్ట్ర ప్రభుత్వాలేగాక కేంద్ర ప్రభుత్వంకూడా కొన్ని మినహాయింపులకు లోబడి శాసన సభకు బాధ్యత వహించవలెనని భారతీయ ప్రతినిధులు అంగీకరించిన విషయాలలో రెండవది. దేశరక్షణ, విదేశ వ్యవహారాలవంటి మౌలిక విషయాలు పూర్తిగా గవర్నరు జనరల్ అధికారంలో కొంతకాలం ఉండదగినవని భారతీయ ప్రతినిధులు భావించడంచేత ఈ మార్పునకు కూడా బ్రిటిష్‌వారు అంగీకరించారు.

ఈ రెండు విషయాలగురించి భారతీయ ప్రతినిధులమధ్య ఏకీభావం కుదిరినా హిందూ ముస్లిం సమస్యలపట్ల అలాటి ఏకీభావం కుదరలేదు. ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండవలెనని, శాసనసభలలో ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెనని వారు పట్టుపట్టారు. కాని హిందూమహాసభ ప్రతినిధులుగా వెళ్ళిన ముంజి, జయకార్ మొదలైనవారూ మరికొందరు దీనిని ప్రతిఘటించారు. అందుచేత ఈ సమస్యకు పరిష్కారం కుదరలేదు. సమావేశం ముగిసిన నాడు ముస్లిం ప్రతినిధులు ఈ సమస్య పరిష్కారం కానిపక్షంలో ఏలాటి రాజ్యాంగానికీ తాము అంగీకరించజాలమని ఒక ప్రకటనను చేశారు. 1935 చట్టం భారత రాజ్యాంగాన్ని మార్చినా అందులో ముస్లింల వాంఛలు పూర్తిగా తీర్చబడి, ద్విజాతి సిద్ధాంతానికి ప్రాబల్యం చేకూరింది.

మొదటి సమావేశం జరుగుచున్నకాలంలోనే బ్రిటన్‌లోని విశ్వవిద్యాలయాలలో విద్యనభ్యసించుచుండిన ముస్లింయువకుడు—రహిమత్ఆలీ అని అతనిపేరు—ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే రాష్ట్రాలన్నీ కలిపి పాకిస్తాన్ అనే ప్రత్యేక రాజ్యంగా ఏర్పడడం ఒక్కటే హిందూ ముస్లిం సమస్యకు పరిష్కారమార్గమని ప్రప్రథమంగా ఉద్ఘాటించాడు. అదే సమయంలో అలహాబాదులో సమావేశమైన ముస్లింలీగుపై అధ్యక్షతవహించిన ప్రఖ్యాతకవి, తత్వవేత్త ఇక్బాల్‌కూడా ఈలాటి అభిప్రాయాన్నే వ్యక్తంచేశాడు. రౌండుటేబిల్ సమావేశ కాలంలో దేశవిభజనకు పునాదులు ప్రారంభంకావడం గుర్తించదగిన విషయం.

రౌండుటేబిల్ సమావేశంలో ప్రతినిధులు వారి వారి అభిప్రాయాలను వ్యక్తంచేశారే గాని, ఏలాటితీర్మానాలు చేయబడలేదు. సమావేశం తుదిఘట్టంలో 1931 జనవరి 19న బ్రిటిష్

ప్రధాని రాంసేమాక్డనాల్డు ఉపన్యసిస్తూ (1) కొన్ని మినహాయింపులకు లోబడి భారతదేశ ప్రభుత్వము శాసనసభలకు బాధ్యతవహించవలెననే విషయంపట్ల, (2) అఖిలభారత సమాఖ్య ఏర్పడవలెననే విషయంపట్ల, బ్రిటిష్‌ప్రభుత్వం సానుభూతితో ఆలోచించి నిర్ణయాలను తీసుకొనుటకు సిద్ధంగా ఉన్నదని, (3) హిందూ ముస్లిం సమస్యను ఆయా వర్గాలవారు పరస్పరం సంప్రతించుకొని పరిష్కరించడం వాంఛనీయమని. (4) బ్రిటిష్‌ప్రభుత్వ సానుభూతిని ఆధారంచేసుకొని శాసనోల్లంఘన ఉద్యమాన్ని విరమించి. దేశశ్రేయోభివృద్ధికిగాను అందరు ప్రభుత్వంతో సహకరించడం ఉత్తమ విధానమనీ తెలియపరచినాడు. ఉపన్యాసంలో తాను వ్యక్తపరచిన విషయాలను స్వేచ్ఛగాను సంపూర్ణంగాను పరిశీలించుటకు అవకాశాన్ని కల్పిస్తూ జనవరి 26 న గాంధీ, కాంగ్రెసు కార్యనిర్వాహకకమిటీ సభ్యులు విడుదల చేయబడినారు.

వెంటనే కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము సమావేశమై (1) భారతదేశముయొక్క వాస్తవమైన నాయకులు పాల్గొనని రౌండుటేబిల్ సమావేశముగాని దానిచర్చలుగాని గుర్తింపదగినవి కావని, (2) బ్రిటిష్‌ప్రధాని చేసినఉపన్యాసము సందిగ్ధముగానున్నదని. సుస్పష్టముగా లేదని, కాంగ్రెసువారు కాంక్షించిన సంపూర్ణ స్వరాజ్యముతో అది ఎంతమాత్రము సంబంధం లేనట్టిదని, (3) అందుచేత శాసనోల్లంఘన ఉద్యమం యథాతథంగా సాగవలసిందనీ, తీర్మానించింది. కాని రౌండుటేబిల్ సమావేశంలో పాల్గొన్న సప్రూ, శ్రీనివాసశాస్త్రి, ఆ తీర్మానాన్ని ప్రకటించరాదని, తామువచ్చి సంప్రదించేవరకు కాంగ్రెసు నాయకులు ఏ నిర్ణయాన్ని ఆచరణలో పెట్టరాదని తంతివార్త పంపుటచేత వారు వచ్చేవరకు ఆ తీర్మానం ప్రకటింపబడలేదు.

ఫిబ్రవరి 6 న సప్రూ, శాస్త్రి మరికొందరు నాయకులు స్వదేశానికివచ్చి గాంధీని కలుసుకొని, ఆయన వైస్రాయితో సంభాషణలు కొనసాగించుటకు సిద్ధంగా ఉన్నట్లు ఒక లేఖ వ్రాయవలసిందిగా కోరారు. గాంధీ వారి కోరికమేరకు వైస్రాయికి లేఖ వ్రాయగా ఆయన ఫిబ్రవరి 17 న గాంధీ తన్ను కలుసుకోవలసిందిగా కోరాడు. ఆ కోరికమేరకు గాంధీ వైస్రాయిని కలుసుకొని సంభాషణలు జరిపాడు. తుదకు ఈ సంభాషణలు ముగిసి. ఈ ఇరువురిమధ్య మార్చి 5 న గాంధీ ఇర్విన్ ఒడంబడిక అని దేశచరిత్రలో ప్రఖ్యాతిగాంచిన ఒడంబడిక జరిగినది.

దీని మూలమున (1) కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమాన్ని మానుకొనుటకు అంగీకరించినది (2) భారత రాజ్యాంగ స్వరూపాన్నిగురించి ఇకమీదట జరిగే చర్చలు రౌండుటేబిల్ సమావేశంలో తయారుచేయబడిన ప్రణాళికను విస్తృతపరచుటకు వీలైనట్టిదిగ ఉండవలెను. ఈ ప్రణాళికలో (ఎ) అఖిలభారత సమాఖ్య. (బి) శాసనసభలకు బాధ్యతవహించిన ప్రభుత్వములు. (సి) భారతదేశక్షేమార్థము దేశరక్షణ. విదేశవ్యవహారములు. అల్పసంఖ్యాకుల స్థితిగతులు, మొదలైన విషయములగూర్చిన కొన్ని రక్షణలు—ఈ మూడు ప్రధానభాగములు. (అనగా భవిష్యత్తులో పార్లమెంటు నిర్మాణంచేసే భారతరాజ్యాంగానికి ఈమూడు భాగములు ఆధారంగా ఉండగలవు); (3) ఈ రాజ్యాంగ స్వరూపాన్ని గురించిన (రౌండుటేబిల్ సమావేశంలో జరుగు) చర్చలలో కాంగ్రెసు పాల్గొనవలెను. (మొదటి సమావేశం సంపూర్ణస్వరాజ్యాన్ని ప్రాతిపదికగా గ్రహించని కారణంగా కాంగ్రెసు అందులో పాల్గొన నిరాకరించింది. దేశరక్షణ, విదేశవ్యవహారాలు మొదలైన ముఖ్యవిషయాల గురించి రక్షణలు ఉండుటకు

ఒడంబడికలో గాంధీ అంగీకరించినందున కాంగ్రెసు ఆశించిన సంపూర్ణ స్వరాజ్యం లభించ లేదు. అయినా రెండవ సమావేశంలో కాంగ్రెసు పాల్గొనుటకు అంగీకరించింది. కాంగ్రెసు నాయకులు కొందరు ఒడంబడికను విమర్శించుటకు ఇవియే ప్రధాన కారణాలు.

పై మూడు షరత్తులుగాక ఒడంబడికలో ఆర్డినెంసులను రద్దుచేయుటకు; ఉద్యమంలో పాల్గొన్నందుకు జైళ్ళలో నిర్బంధించినవారిని వదలివేయుటకు; కోర్టువిచారణలోవున్న వారిపై కేసులను ఉపసంహరించుకొనుటకు; వశపరచుకొన్న సత్యాగ్రహుల ఆస్తులలో కొన్నిటిని వారికి ఇచ్చివేయుటకు; వసూలుచేయని జరిమానాలను రద్దు చేయుటకు; రాజీనామా చేసిన ఉద్యోగులు ధరఖాస్తు పెట్టుకొనిన పక్షంలో వారిని తిరిగీ ఉద్యోగంలో చేర్చుకొనుటకు రాజకీయ ఉద్దేశములతోగాక నైతికఉద్దేశములను సాధించుటకు చట్టసమ్మతముగా కల్లు సారాయి దుకాణాలను పికెటింగుచేయుటకు, ఆర్థిక ఉద్దేశాలను సాధించుటకు ఒక బ్రిటిష్‌వస్త్రములనేగాక అన్ని విదేశములవస్త్రముల దుకాణాలను చట్టసమ్మతముగా పికెటింగుచేయుటకు ఉప్పుశాసనాన్ని రద్దు చేయకపోయినా, ఉప్పుమడుగులకు సమీపమందున్న గ్రామప్రజల వ్యాపారమునకుగాక వారి స్వంత అనుభవమునకు కావలసిన ఉప్పును తయారుచేసి తీసుకొనిపోవుటకు ప్రభుత్వం అంగీకరించింది.

ఒడంబడిక ఒక దీర్ఘమైన పత్రము. పైన పేర్కొన్నవి అందులోని ప్రధాన విషయములు. కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గములోని జవహర్‌లాల్‌వంటి వారు కొందరు సంపూర్ణ స్వరాజ్యంగాని కాంగ్రెసువారు కాంక్షించిన ఇతర సౌకర్యాలుగాని లభించకపోయినా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించుకొనుటకు, రౌండు టేబిల్ సమావేశంలో పాల్గొనుటకూ గాంధీ సమ్మతించడమును విమర్శించారుగాని వారుకూడా ఒడంబడికను పూర్తిగా అంగీకరించారు. ఉద్యమకాలంలో ప్రజలు, అనుభవించిన బాధలు, చేసిన త్యాగాలు వ్యర్థములైనవనే భావం కాంగ్రెసులోని అతివాద వర్గానికి చెందిన సుభాష్‌చంద్రబోసు వంటి యువకులకు కలిగినమాట వాస్తవమే. కాని అతడుకూడా గాంధీ ఒడంబడికను పూర్తిగా సమర్థించాడు.

తిరుగుబాటు చేసిన కాంగ్రెసుతో ఒడంబడిక జరిగిననాని దేశంలో శాంతి భద్రతలు నెలకొనజాలవని ప్రభుత్వం గ్రహించి, కాంగ్రెసు నాయకుడైన గాంధీతో ఒడంబడిక చేసుకొనుటకు సిద్ధపడడం కాంగ్రెసు విజయానికి గొప్ప తార్కాణమనీ, దేశంలో అనేక పార్టీలు ఉండినా కాంగ్రెసు ఒక్కటే ప్రజల ఆదరణకు పాత్రమైనదనీ ప్రభుత్వం గుర్తించడం కాంగ్రెసు వారందరు గర్వించవలసి ఉన్నదని గాంధీ తెలియపరచాడు. ఉద్యమ ఫలితంగా జాతీయ తత్వం దేశంలో పూర్తిగా నాటుకొన్నది. స్వరాజ్యాన్ని సంపాదించడం తమ లక్ష్యమనీ. అవసరమైన పక్షంలో శాసనోల్లంఘన ఉద్యమాన్ని తిరిగీ ప్రారంభించుటకు వారు సంసిద్ధులుగా ఉండినారు. ఇదికూడా ఉద్యమం సఫలత గాంచినందుకు తార్కాణం అని గాంధీ ఉద్ఘాటించాడు. ఒడంబడిక ఒక రాజీవంటిది. రాజీ విధానంలో ఉభయపార్టీలు తమతమ వాంఛలను కొంతవరకు సడలించుకొనడం అవసరం. ఇదికూడా గుర్తించదగిన విషయమని గాంధీ ఒడంబడికను సమర్థించాడు. ఇదిగాక ప్రజలు ఉద్యమకాలంలో భరింపరాని బాధలను భరించారు. వారిని నిరవధికంగా బాధలను అనుభవించవలసిందిగా కోరడం వాంచనీయంకాదు; అది పూర్తి అపజయానికి దారితీయవచ్చు. ఎదటి పక్షం రాజీకి సుముఖంగా ఉన్నప్పుడు ఉద్యమాన్ని ఉప

సంహరించుకొని, ప్రజల బాధలకు స్వస్తిచెప్పడం ప్రాజ్ఞత. ఏ స్వాతంత్ర్య పోరాటంకూడా నిర్విరామంగా సాగలేదు. ఈ దృష్ట్యాకూడా ఒడంబడిక సమర్థనీయమని గాంధీ భావించాడు.

కాంగ్రెసులోని అతివాదులు ఒడంబడికను విమర్శించినట్లే బ్రిటిష్ వారిలో కాన్సర్వే టివ్ పక్షంవారు, లిబరల్ పక్షంవారు, భారతదేశంలోని ఉన్నత ఉద్యోగివర్గానికి చెందిన బ్రిటిష్ వారు, అనధికార యూరోపియన్లు ఒడంబడికను విరసించారు. ప్రభుత్వంపై తిరుగుబాటుచేసిన గాంధీతో చర్చలకు సిద్ధపడడం, ఆయన వాంఛలను తీర్చడం బ్రిటిష్ వారి పేరు ప్రతిష్ఠలకు ఒక గొడ్డలిదెబ్బ వంటిదని వారు భావించారు. వీలైన పక్షంలో ఏదో ఒక మిషను ఆధారం చేసుకొని ఒడంబడికను రద్దు గావించడం బ్రిటిష్ వారికి గౌరవకరం అని కూడా వారు భావించారు. క్రమక్రమంగా వారిలో ఈ భావము బలపడింది.

ఇర్విన్ ప్రభువు వెళ్ళిపోవడం, ఆయన స్థానంలో విలింగ్డను ప్రభువు గవర్నరు జనరల్ కావడం ఈ భావానికి దోహదం కల్పించింది. ఒడంబడికలోని షరత్తులకు విరుద్ధంగా గవర్నరులు, ఉద్యోగులు ప్రవర్తించసాగారు. గాంధీ ఈ విషయాన్ని విలింగ్డన్ దృష్టికితెచ్చాడు. కాని కాంగ్రెసువారే షరత్తులకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారని ఆయన జవాబు చెప్పాడు. ఈ పరిస్థితులలో కాంగ్రెసు ప్రతినిధులు, ప్రభుత్వ ప్రతినిధులు కలిసిన ఒక కమిటీ ఉల్లంఘన విషయాల గురించి విచారణ చేయవలసిందిగా గాంధీ కోరాడు. కాని అది నిరాకరింపబడింది. ఇదిగాక ఉత్తరప్రదేశ్‌లోను సరిహద్దు రాష్ట్రంలోను, బార్డోలీ తాలూకాలోను అధికారులు రైతులపైనా ఇతర సామాన్యప్రజల పైనా చట్టవిరుద్ధమైన కఠినచర్యలను తీసుకొనసాగారు. గాంధీ విసిగి, కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంవారి అనుమతితో లండన్‌లో జరుగనున్న రెండవ రౌండు టేబిల్ సమావేశంలో పాల్గొన (ఆగస్టు 13 న) నిరాకరించాడు. అటుపైన కొన్ని సంప్రతింపులు జరిగి కొన్ని ప్రాంతాలలో రైతులపైన ఉద్యోగులు సాగించిన కఠినచర్యల గురించి విచారణ చేయుటకు విలింగ్డన్ అంగీకరించాడు. గాంధీకి ఇది పూర్తిగా తృప్తిని కలిగించకపోయినా ఆగస్టు 29 న లండనుకు ప్రయాణమైనాడు.

ఈ మధ్యకాలంలో మార్చి 21 న వల్లభాయ్‌పటేల్ అధ్యక్షతన కాంగ్రెసు సాంవత్సరిక సమావేశం కరాచీలో జరిగింది. అది గాంధీ ఇర్విన్ ఒడంబడికను ఆమోదించింది. కాని అంతకుపూర్వం ఆరు రోజులక్రిందట ప్రభుత్వం భగత్‌సింగు, రాజగురు, సుఖదేవ్ అనే విప్లవవీరులను ఉరితీసింది. ఆనాడు భగత్‌సింగు ప్రజలందరి ప్రేమాభిమానాలకు పాత్రుడై ఉండినవాడు. అతనిపై విధింపబడిన ఉరిశిక్షను రద్దు చేయవలసిందిగా గాంధీ ఇర్విన్‌ను కోరవలసిందిగాను, ఆ కోరికను చెల్లించని పక్షంలో ఒడంబడికకు అంగీకరించకూడదని అనేకులు గాంధీని కోరారు. గాంధీ ఉరిశిక్ష రద్దుకై కొన్ని ప్రయత్నాలుచేసి విఫలుడయ్యాడు. కరాచీ సమావేశానికి హాజరైన యువక ప్రతినిధుల ఆలజడికి భగత్‌సింగును ఉరితీయడం కారణమై అతనిని పూర్తిగా ప్రశంసిస్తూ కాంగ్రెసు తీర్మానించవలసిందిగా వారు పట్టుపట్టారు. హత్యలు గావించినవారిని ప్రశంసించడం గాంధీకి ఎన్నడూ ఆమోదం కానట్టివిషయం; అందుచేత తీర్మానంలో, "కాంగ్రెసువారికి రాజకీయ విషయములందు ఏ విధమైన దౌర్జన్యము ఉండడం ఆమోద యోగ్యం కాకపోయినా" అనే మాటలనుచేర్చి భగత్‌సింగును ప్రశంసిస్తూ ఒక తీర్మానం చేసింది.

ఇంకొక విషయంకూడా కాంగ్రెసు ప్రతినిధుల అలజడికి కారణమైంది. మార్చి 23, 24, 25 తేదీలలో కాన్‌పూరు నగరమందు అతి ఘోరమైన హిందూముస్లిం కలహాలు సంభవించి హిందువుల దుకాణాలు, దేవాలయాలు, దగ్ధం కావడం, దోపిడి చేయడం జరిగింది. వారిని రక్షించుటకు పోలీసువారు ఏలాటి చర్యలను తీసుకొనలేదు. ఈ కొట్లాటలో 166 గురు ప్రాణములను కోల్పోయిరి; 480 మంది గాయపడిరి. గణేశ్ శంకర విద్యార్థి కొట్లాటలను ఆపుటకు ప్రయత్నము చేయగా అతడుకూడా హత్య చేయబడినాడు. కాంగ్రెసు సమావేశము అతని ధైర్యసాహసాలను ప్రశంసిస్తూ కొట్లాటపట్ల విచారమును తెలియపరచుచు ఒక తీర్మానము చేసినది. 1931 జూలైలో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం సమావేశమై హిందూముస్లిం సమస్యను పరిష్కరించుటకు అనేక సూత్రాలతో కూడిన ఒక తీర్మానము చేసినది. కాని పరిష్కారము సాధ్యము కాగలదా అనే సందేహము గాంధీకి బాధను కలిగించింది. ఈ సందేహముతో రౌండు టేబిల్ సమావేశంలో పాల్గొనడం ఉచితంకాదని కూడా ఆయన భావించేవాడయ్యాడు.

కరాచీ సమావేశం ముగిసిన తర్వాత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం ఏప్రిల్ 1, 2 తేదీలలో కాంగ్రెసు తరపున రౌండుటేబిల్ సభకు పంపదగిన ప్రతినిధుల గురించి నిర్ణయించింది. కాంగ్రెసు తరపున 15, 20 ప్రతినిధులను పంపవచ్చునని ప్రభుత్వం తెలియపరచింది. కాని కార్యనిర్వాహక వర్గం గాంధీ ఒక్కడే ప్రతినిధిగా వెళ్ళవలసినట్లు తీర్మానించింది. ఇది అంత ప్రాజ్ఞతతోను దూరదృష్టితోను చేయబడిన తీర్మానంకాదని అనేకులు విమర్శించారు. గాంధీ ఎంతటి శక్తిసామర్థ్యాలు కలవాడైనా ఆయన ఒక్కడే రౌండు టేబిల్ సభలో కాంగ్రెసు దృక్పథాన్ని వ్యక్తం చేయడం సాధ్యం కాజాలదు. జాతీయవాదులైన ముస్లింలు కొందరు ఆయనతో కూడ కలసివెళ్ళి ఉండిన పక్షంలో ముస్లింలు అందరు వర్గప్రయోజనాలను మాత్రమే కాంక్షించేవారు కారని రుజువు చేయడం సాధ్యమై ఉండేది. గాంధీ మాత్రమే కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళడంచేత ఇది సాధ్యంకాక పోయింది. కాంగ్రెసు ఒక హిందూ సంఘమని భావించిన బ్రిటిష్‌వారి వైఖరి ఈ విషయంలో మరింత బలపడింది.

గాంధీ రెండవ రౌండు టేబిల్ సమావేశానికి వెళ్ళేనాటికి భారతదేశంలోను బ్రిటన్ లోను రాజకీయ వాతావరణం పూర్తిగా మారిపోయింది. భారతదేశంలో విలింగ్డన్, ఉన్నత ఉద్యోగి వర్గం వారు గాంధి ఇర్విన్ ఒడంబడికపట్ల పూర్తి ద్వేషాన్ని వహించి, అందులోని షరతులకు అన్యథాగా ప్రవర్తించి, కాంగ్రెసును పూర్తిగా అణచివేయ నిర్ణయించారు. బ్రిటన్‌లో లేబరుపార్టీవారి స్థానే కాంసర్వేటివ్ పక్షంవారు అధికారంలోకి వచ్చారు. భారతదేశం బ్రిటన్‌తో సమానమైన హోదాగలది అనీ, కాంగ్రెసు భారతదేశానికి ఏకైక ప్రతినిధి అని, దానిని తృప్తి పరచడం అవసరమని లేబర్‌పార్టీలో ఇండియా మంత్రిగా ఉండిన బెన్ ఆనాటి గవర్నరు జనరల్ ఇర్విన్ భావించారు. గాంధీని వైస్రాయి భవనానికి ఆహ్వానించి, ఆయనతో సంప్రతించి ఒడంబడికను చేసికొనడం బ్రిటన్ గౌరవానికి భంగకరమైనదని, బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని పునఃప్రతిష్ఠితం చేయడం అవసరమనీ, భారతదేశాన్ని పాలించడంలోను దాని రాజ్యాంగ భవిష్యత్తును నిర్ణయించడంలోను బ్రిటన్‌కు పూర్తి స్వేచ్ఛ ఉండవలెనని, భారతీయ ప్రతినిధులతో ఈ విషయాల గురించి చర్చలలోకి దిగడం అనవసరమనేది కాన్‌సర్వేటివ్ పక్షంవారి సిద్ధాంతం. రౌండు టేబిల్ చర్చలకు ఏలాటి ప్రాధాన్యాన్ని కల్పించడం వారి అభిమతంకాదు. భారత దేశంలో జాతీయవాదులు ఏలాటి తిరుగుబాటు చేసినా, దానిని అణచుటకు కావలసిన సైనిక

బలం తమకు కలదని, దానిని వినియోగించడంలో తాము వెనుకాడవలసింది ఏమీలేదని వారు భావించారు. ఇంతేగాక ముస్లింలను హిందువుల నుంచి పూర్తిగా చీలదీసి, తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొనడం సాధ్యమనీ, ఈ భేదోపాయాన్ని ఏ పరిస్థితులలో కూడా విడనాడరాదని వారు తీర్మానించుకొన్నారు. ఈలాటి రాజకీయాభిప్రాయాలుగల కాంసెర్విటివ్ పక్షంవారు అధికారంలోకి వచ్చిన తర్వాతను, ఈ అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తించుటకు సిద్ధపడ్డ విలింగ్డన్ భారతదేశానికి గవర్నరు జనరల్ అయిన తర్వాతను రెండవ రౌండు టేబిల్ సమావేశం లండన్‌లో 1930 సెప్టంబరు 7 న ప్రారంభమైంది.

గాంధీ ఈ సమావేశంలో పాల్గొని భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసిందిగాను, దానికి సర్వవిధాలా దేశం అర్హత కలదనీ, దానికి విరుద్ధంగా పార్లమెంటు ఏలాటి రాజ్యాంగాన్ని రూపొందించినా దానిని భారతీయులు ప్రతిఘటించడం తథ్యమని అనేక పర్యాయాలు సభ్యుల సమక్షంలో గంభీరంగా ఉపన్యసించాడు. కాని ఈ ఉపన్యాసాలు ఉదాత్తములుగా ఉండినా కాన్‌సర్వేటివ్ పక్షానికి చెందినవారి పైనగాని, వర్గ ప్రయోజనాలను మాత్రము ఆశించే భారతదేశము నుండి వచ్చిన ప్రతినిధుల పైనగాని ఏలాటి ప్రభావమును వహించలేదు. అయినా ఆయన, "ఇప్పుడు కావలసినది వట్టి రాజ్యాంగ ప్రకటనము కాదు. సమాన ప్రతిపత్తి గలిగి, ఈ రెండు దేశములు భాగస్వాములుగా ఉండదగిన వ్యవహార ప్రణాళికను నిర్మింపవలయును." అని ఉద్ఘాటించాడు.

కాంగ్రెసు భారతదేశములోని తక్కిన పార్టీల వంటిది కాదని, అది భారతదేశములో 85 శాతం ప్రజల తరపున ప్రాతినిధ్యము వహించు చున్నదని, తక్కిన ప్రతినిధులు చిన్న చిన్న ప్రత్యేక సంఘములకు ప్రతినిధులనీ, సాంఘిక భేదములకతీతమైన సంస్థ కాంగ్రెసు ఒక్కటే అనీ, ఎన్నటికైనా బ్రిటిష్‌వారు దానితో రాజీకి వచ్చుట తప్పదనీ, దానిని తృప్తి పరచక భారతీయులను తృప్తి పరచడము స్వప్నతుల్యమని స్పష్టపరచాడు.

రౌండుటేబిల్ సమావేశ కాలంలో హిందూ ముస్లిం సమస్యను పరిష్కరించుటకు సప్రూ, జయకార్ మొదలైనవారి సహాయంతో బృహత్తరమైన ప్రయత్నం చేశాడు. కాని ముస్లింలలో ఆనాటికే అనేకులు బ్రిటిష్‌వారి సహాయంతో పాకిస్థాన్ అనే పేరుతో ప్రత్యేక రాజ్యాన్ని నిర్మాణం చేసుకొనడం సాధ్యమనీ, అది సాధ్యం కాకపోయినా బ్రిటిష్‌వారు తమ ఇతర వాంఛలనన్నిటినీ నెరవేర్చుటకు సిద్ధంగా ఉండడంచేత హిందువులతో రాజీ చేసుకొనడం అవసరం లేదనే నిర్ణయానికి వచ్చారు. దీనికి తోడు భారతదేశంలో వర్తక వ్యాపారాలు చేసే బ్రిటిష్‌వారు ముస్లింల ఆర్థికాభివృద్ధికి కావలసిన సదుపాయాలనన్నిటినీ సమకూర్చుటకు వాగ్దానాలు చేసి, తెర వెనుకనుండి వారి వర్గ వైఖరిని బలపరచారు. ముస్లింలు ఇంతటితో తృప్తి పడక బ్రిటిష్‌వారి సహాయంతో బ్రాహ్మణేతరులను, అస్పృశ్యులను, భారతదేశంలోని క్రైస్తవులను, వర్గ ప్రాతినిధ్యాన్ని కోరేవారుగా చేశారు. వీరందరు కలిసి తమకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని కల్పించవలసిందిగా ఒక నివేదికను బ్రిటిష్ ప్రధానికి సమర్పించారు. ఈ పరిస్థితులలో గాంధీ ఉపన్యసిస్తూ, "ఈ సాంఘిక సమస్య ఇచట పరిష్కారముకాజాలదు. రాజ్యాంగ నిర్మాణమే ఇచట అవసరము. ఈ ప్రతినిధుల నెల్లరను ఆరువేల మైళ్ళ దూరమునుండి పిలిపించినది సాంఘిక సమస్యను పరిష్కరించుటకా? ఈ ప్రతినిధులు తిరిగి స్వదేశమునకు చేరు లోపల

భారత స్వాతంత్ర ప్రతిపాదకమై, సగౌరవమై, క్రియాను గుణమైన ఒక రాజ్యాంగమును నిర్మించి, పార్లమెంటువారి అనుమతికి సమర్పించ గలిగితిమని సంతృప్తి జనింప వలెను. (అల్పసంఖ్యాక వర్గముల వారందరు కలిసి) సమర్పించిన నివేదిక బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించునట్టిది కాదు....కాంగ్రెసుకు దానితో ఎట్టి జోక్యమును ఉండదు. స్వాతంత్ర్య వృక్షము నెన్నటికిని పెరుగనీయని ఇట్టి ప్రణాళికను అంగీకరించుటకంటె కాంగ్రెసు మరికొన్ని సంవత్సరములు అడవుల బట్టి సంచారము చేయుటకు వెనుదీయదు" అని వర్గ ప్రాతినిధ్యము కోరే వారికి, వారిని ఆడించుచున్న బ్రిటిష్‌వారికి హెచ్చరిక పూర్వముగ తెలియపరచాడు.

ఈ ప్రణాళికలో అస్పృశ్యులను తక్కిన హిందువుల నుండి వేరుపరచుట గాంధీకి ప్రత్యేకముగ విచారము కలిగించెను. దీనిని గురించి ఉపన్యసిస్తూ ఆయన, "అస్పృశ్యులనబడు వారిని గురించి ఒక మాట. తక్కిన సంఘముల వారి వాదము నాకవగతమగుచునే యున్నది కాని, అస్పృశ్యుల తరపున చేయబడిన వాదము మాత్రము మిక్కిలి క్రూరాతి క్రూరమైన ఆఘాతము....అస్పృశ్యులను ప్రత్యేక సంఘముగా విడదీయుట నాకిష్టము లేదు. శిక్కులట్లు నిత్యముగా ఉండవచ్చును. అట్లే ముస్లిములు, క్రైస్తవులు విడిపోయి ఉండవచ్చును. కాని అస్పృశ్యులు ఇట్లు సార్వకాలికముగ విడిపోయి ఉండెదరా? వారెప్పటికిని అస్పృశ్యులుగా ఉండెదరా? నేను హిందూమతము నశించుటకైన అంగీకరింతును గాని, అస్పృశ్యతా దోషము నిలిచియుండుటకు మాత్రము అంగీకరింప జాలను. అస్పృశ్యుల రాజకీయ హక్కులను గురించి వాదించెడువారు భారతదేశము నెరుగరు. భారతదేశములోని సంఘ నిర్మాణము ఎట్లు జరిగినదియు, వారికి తెలియదు కావున నేనొక్కడనే నిరోధింపవలసియున్నను నా ప్రాణము లర్పించియైనను దీనిని నిరోధించుచున్నానని చెప్పుచున్నాను" అని తన అభిప్రాయమును స్పష్ట పరచెను. (1932 లో ఇందుకుగాను ఆయన ఆమరణ ఉపవాస దీక్ష వహించెను).

ఆయన రెండవ రౌండుటేబిల్ సమావేశములో పాల్గొనడమువలన దేశ స్వాతంత్ర్య విషయములో గాని హిందూ ముస్లింల సమస్య పరిష్కార విషయమున గాని ఏలాటి ఫలితము లను సాధించలేక పోయినాడు. కాన్‌సర్వేటివ్ పక్షము వారికి ఈ సమావేశము అనవసరమని తోచినది. అందులోని చర్చలకు వారేలాటి ప్రాధాన్యమూ కల్పించలేదు. సైమన్ కమీషన్ నివేదికయే వారికి వేదమయ్యెను. అందుచేత వారు డిసంబరు ఒకటవ తేదీన సమావేశము ముగిసింప జేసిరి. తన రాక నిష్ఫలమగుటను గాంధీ గుర్తించి, శాసనోల్లంఘన ఉద్యమమును తిరిగీ ప్రారంభించుట తప్పదనే నిర్ణయానికి వచ్చాడు. తాను బ్రిటన్‌లో ఉన్నప్పుడు ఒడంబడికకు విరుద్ధముగా విలింగ్డన్ ప్రభుత్వము నిరంకుశముగ ప్రవర్తించి, కాంగ్రెసును అణచి వేయుటకు అనుగుణమైన కార్యక్రమములను సాగించు చుండుటకూడ ఆయనకు తెలియవచ్చెను. సమావేశము ముగిసిన రోజున గాంధీ అధ్యక్షునకు అభివందనములు సమర్పిస్తూ, "మనము విడి పోవుచున్నాము. మన త్రోవలు వేరైనవి. ఇక రాబోవు తుపానులకు సహించుటయే మాకు గౌరవము. నా భవితవ్యమెట్టి త్రోవను బట్టునో నాకు తెలియదు. కాని అది ఎట్లైనను నేను గణింపను. నేను పూర్ణముగ విరుద్ధ మార్గమున బోవలసియున్నను మీకు మాత్రము నా హృదయ పూర్వక నభినందనము లొసగుచున్నాను". ఆపత్సూచకములైన ఈ మాటలతో

ఆయన తన అశాభంగాన్ని వెలిబుచ్చుచు సభను వీడి. డిశంబరు 28 న స్వదేశమునకు వచ్చి చేరెను.

చదువదగిన గ్రంథములు :

Bhavan : Vol. xi

R C. Mazumdar : History of the Freedom Movement in India Vol, iii

Tarachand, Vol. iv

M. Venkatarangaiya: History of the Freedom struggle in Andhra Pradesh-Andhra : Vol iii

Pattabbi Seetharamayya : కాంగ్రెసు చరిత్ర

# అధ్యాయము-10

## శాసనోల్లంఘన ఉద్యమము - ద్వితీయ దశ

## 1932-34

గాంధీ రౌండుటేబిల్ సమావేశంలో పాల్గొంటూ లండన్‌లో ఉండినప్పుడు భారత దేశంలోని పరిస్థితులు పూర్తిగా దిగజారి పోయినవి. ఇర్విన్‌తో ఆయన చేసుకొన్న ఒడంబడిక లోవి షరత్తులను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించి, కాంగ్రెసు తిరిగీ శాసనోల్లంఘనమును ఉపక్ర మించునట్లు చేసి, ఆ సందర్భంలో గాంధీని, కాంగ్రెసును, దేశంలోని స్వాతంత్ర్య ప్రియులను తిరిగీ తల ఎత్తనీయక పూర్తిగా అణచివేయుటకు విలింగ్డన్ ప్రభుత్వం నిర్ణయించుకొన్నది. ఇందులో బ్రిటన్‌లోని కాంసర్వేటివ్ ప్రభుత్వం దానికి పూర్తి మద్దతును అందజేసింది. భారత దేశం బ్రిటన్‌లో సమాన ప్రతిపత్తిని వాంఛించడం సాహసమనీ, అది ఎన్నటికీ జరగరాదని, ఇర్విన్ గాంధీని తనతో సమానునిగా భావించి, ప్రభుత్వ భవనానికి ఆహ్వానించి, ఆయనతో సంప్రతింపులు జరిపి ఒక ఒడంబడికను చేసుకొనడం బ్రిటిష్‌వారి పేరు ప్రతిష్ఠలకు గొడ్డలి దెబ్బగా పరిణమించినదని, అలాటి ఒడంబడికను ఉల్లంఘించడంలో అధర్మం లేదని, దానిని ఉల్లంఘించి బ్రిటిష్‌వారి గౌరవాన్ని పునరుద్ధరించి, వారి సామ్రాజ్యాధికారాన్ని చెక్కు చెదరక సుస్థిరం చేసుకొనడం తమ కర్తవ్యమని, దానికి అవసరమైన సైనిక బలం తమకు కలదని, గొంకు జంకు లేక ఈ విధానాన్ని అనుసరించుటకు వారు నిర్ణయించుకొన్నారు. దేశంలోని పరిస్థితులు దిగజారుటకు ఈ నిర్ణయం మూల కారణం. ఇందులో ముస్లింలలో అధిక సంఖ్యాకులు, వర్గ ప్రయోజనాలను మాత్రమే వాంఛించు ఇతర వర్గాలవారు, తమతో సహకరించడం తమ నిర్ణయం ఫలప్రదం కాగలదనే విశ్వాసం వారిలో బలపడింది.

గాంధీ లండన్‌కు వెళ్ళుటకు పూర్వం బార్డోలి రైతుల సమస్యను పరిష్కరించుటకు ఒక విచారణకమిటీని నియమించుటకు అధికారులు అంగీకరించారు. కాని ఆయన వెళ్ళి పోయిన తర్వాత కమిటీ ఒకటి నియమింపబడినా కాంగ్రెసు ప్రతినిధిగా విచారణలో పాల్గొన్న వల్లభాయిపటేల్‌తో అది సహకరించడం మానుకొన్నది. దీని ఫలితంగా విచారణ ఫలప్రదం కాలేదు.

వాయవ్యరాష్ట్రంలో కాంగ్రెసువారిలో ఒకడైన అబ్దుల్ గఫార్‌ఖానును, అతని అనుచరులను అధికారులు నిర్బంధించారు. ఆయన నిర్మాణం చేసిన "రెడ్‌షర్టుల" దళాన్ని అక్రమ సంఘంగా ప్రకటించి, అందులోని వారనేకులకు ఏలాటి విచారణలేకుండా జైలుశిక్ష విధించారు, సైనికులను గ్రామాలకు పంపి గ్రామీణులను భయభ్రాంతులచేశారు. రాష్ట్రంలో ఒకవిధమైన సైనికపరిపాలన అమలులోకి వచ్చింది. శాంతిభద్రతలను రక్షించుటకు ఇది అవసరమైనదని అధికారులు తమ నిరంకుశత్వాన్ని సమర్థించారు,

ఉత్తరప్రదేశ్‌లో క్షామపరిస్థితులు ఏర్పడడంచేత రైతులు భూమి శిస్తులను చెల్లించలేకపోయ్యారు; కాని అధికారులు బలప్రయోగంచేసి, శిస్తులను వసూలుచేయసాగారు. అప్పుడు రాష్ట్ర కాంగ్రెసుసంఘం వ్యవహారంలో జోక్యం కలిగించుకొని అధికారులతో సంప్రతింపులు ప్రారంభించి సంప్రతింపులు పూర్తి అయ్యేవరకూ శిస్తువసూళ్ళను తాత్కాలికంగా ఆపివేయవలసిందిగా కోరింది. కాని అధికారులు దానికి సమ్మతించకపోవడంచేత రైతులు శిస్తుల నిరాకరణ ఉద్యమాన్ని సాగించవలసిందిగా సలహా ఇచ్చింది. రైతులు ఉద్యమాన్ని ప్రారంభించారు. వెంటనే ప్రభుత్వం జవహర్‌లాల్ మొదలైన కాంగ్రెసునాయకులను అరెస్టుచేసి వారికి దీర్ఘకాలశిక్షలను విధించింది. గాంధీ బొంబాయిరేవులో దిగుటకు నాలుగురోజుల ముందు ఈ అరెస్టులు జరిగినవి, కాంగ్రెసునాయకులు ఆయనను కలుసుకొనడం ఇష్టంలేక ప్రభుత్వం ఈ అరెస్టులలోకి దిగింది.

బెంగాలులోని వ్యవహారాలు మరింత భీకరరూపం తాల్చాయి. విప్లవకారులు అధికారుల కొందరిని హత్యచేయడం మిషగా తీసుకొని ప్రభుత్వం అనేక ఆర్డినెన్సులను జారీచేసి అనుమానాస్పదులందరిని విచక్షణారహితంగా నిర్బంధించింది. హిజ్లీజైలులో నిర్బంధించబడిన రాజకీయఖైదీలపై కాల్పులు జరిపి. ప్రాణనష్టాన్ని కలిగించింది. చిట్టగాంగు నగరాన్ని అనధికార యూరోపియనుల యొక్కయు వారికి సహాయపడిన రౌడీమూకల యొక్కయు స్వాధీనంలో కొన్ని రోజులపాటు ఉంచి వారిచేత అనేక దోపిడీలను చేయించింది. శాంతిభద్రతలను కాపాడవలసిన పోలీసువారు ప్రజలను రక్షించడం మానుకొన్నారు. ప్రభుత్వ ఆధ్వర్యాన దౌర్జన్యం విశృంఖలంగా తాండవమాడసాగింది. గాంధీ ఇర్విన్ ఒడంబడికలో ఆర్డినెన్సుల రద్దుచేయవలసిందిగా ఒక షరతు చేర్చబడింది. కాని వాయవ్య రాష్ట్రంలోను, ఉత్తరప్రదేశ్‌లోను, బెంగాలులోను ఆర్డినెన్సుల రాజ్యం పునఃప్రతిష్ఠితమైంది.

డిసెంబరు 28 న బొంబాయిలో దిగిన గాంధీని అన్ని రాష్ట్రాలలోని నాయకులు కలుసుకొని తమ గోడులను చెప్పుకొని తరుణోపాయాన్ని చూపవలసిందిగా అర్థించారు. ఆయన అలవాటుప్రకారం ఉభయ పార్టీలవారిని సంప్రతించిన తర్వాతగాని ఏ నిర్ణయానికి వచ్చుటకు ఇష్టపడక ప్రజాప్రతినిధులనుండి తాను విన్న విషయాలన్నిటిని వైస్రాయికి తెలియపరచి, ప్రభుత్వపక్షంవారి కథనంతెలుసుకొనుటకు సిద్ధంగాఉన్నట్లును, అందుకుగాను వైస్రాయిని కలుసుకొనుటకు అనుజ్ఞ దయచేయవలసిందిగాను తంతివార్తను పంపినాడు.

కాని వైస్రాయి వాయవ్యరాష్ట్రంలోను, ఉత్తరప్రదేశ్‌లోను, బెంగాలులోను కాంగ్రెసువారూ విప్లవకారులూ శాంతిభద్రతలకు ప్రమాదకరంగా ప్రవర్తించినారని, అందుచేతనే వారిపై కఠినచర్యలు తీసుకొనడం జరిగిందని, ఈ చర్యలనుగురించి తాను గాంధీతో చర్చించడం అవసరం లేదనీ. ఈ చర్యలన్నిటినీ ఆమోదించినపక్షంలోనే గాంధీతో తక్కిన విషయాలగురించి చర్చలలోకి దిగే అవకాశం ఉన్నదని నిర్మొగమాటంగా తంతిద్వారా జవాబును పంపినాడు.

ప్రభుత్వం తీసుకొన్న చర్యలగురించి వైస్రాయి గాంధీతో చర్చలుసాగించుటకు నిరాకరించడం ఆయనకు దిగ్భ్రాంతిని కలిగించింది. ఆయన ఉదాత్తమైన జవాబును వైస్రాయికి పంపుతూ ఈ క్రింది విధంగా తన అభిప్రాయాలను వివరించాడు.

"నేను ఎంతో మిత్రభావముతో చేసిన సూచనను వైస్రాయిగారు ఈవిధముగా నిరాకరించినందుకు నాకు చాలా విచారముగా ఉన్నది.... నిజస్థితిని తెలుసుకొనగోరు సత్యాన్వేషిగా నేను వైస్రాయిగారికి విన్నవించుకొంటిని. ప్రభుత్వంవారు తీసుకొన్న అసాధారణ. తీవ్ర చర్యలను గురించి వారు ఏమి చెప్పదలచుకొన్నారో విని తెలుసుకొనుటకై నేను కాంక్షించితిని. నాయొక్క మనవిని హృదయమును గ్రహించుటకు బదులు వైస్రాయిగారు ముందుగానే నిరాకరించినారు. నేనెంతో గౌరవపూర్వకముగ అభిమానించే నా మిత్రులు తప్పుచేసినారని ముందుగానే నేననవలెనని వైస్రాయిగారు అనుచున్నారు. ఒకవేళ నేనిట్టి అనుచితచర్యకు పాల్పడి. నా మిత్రులను నిందించి, వైస్రాయి సన్నిధికి పోవుటకు సిద్ధపడినా. జాతికంతా చావుబ్రతుకులతో సమానములగు ఈ ఆర్డినెన్సుల విషయము చర్చించుటకుకూడ నాకు అవకాశము లేదు.

నా దృష్టిలో ఆర్డినెన్సుల ఎదుట ఈ రాజకీయ సంస్కరణలు వట్టిగాలిగా కనుపించు చున్నవి. ఈ నిరంకుశ శాసనములను తీవ్రముగా ఎదిరించనియెడల జాతి నిర్వీర్యమైపోవుట తప్ప వేరొండులేదు. ఏదో అబద్ధములైన సంస్కరణములు వచ్చునను సందేహాస్పదమైన ఆశకొరకు జాతిని చంపుకొనుటకు ఆత్మగౌరవముగల ఏ భారతీయుడును ఒప్పుకొనడు. జాతి చచ్చిన తర్వాత ఈ సంస్కరణలు ఎవరికి కావలెను? ఇచ్చిన సంస్కరణలను ఆచరణలో పెట్టుటకుగాని, అనుభవించుటకుగాని జాతియే ఉండదు.

ఇక సరిహద్దురాష్ట్రములో జరిగినవని చెప్పబడు సంగతులను మీరు ఏకరువు పెట్టితిరి. అవి నిజమనుకొన్నను, ప్రభుత్వము తీసుకొన్న తీవ్ర చర్యలకు అవి కారణములుగా చెప్పుటకు వీలులేదు. ప్రజలప్రేమకు పాత్రులైన నాయకులను అరెస్టుచేయుట, న్యాయ చట్టమతిక్రమించిన ఆర్డినెన్సులను చేయుట, మనుష్యుల అర్థప్రాణములకు నిలకడలేకపోవుట, నాయకుల అరెస్టుకు అసమ్మతిని తెలుపుటకు ప్రజలు ఊరేగింపులు చేయసాహసింతురా అను అహంకారముతో నిరాయుధులను శాంతిపరులును అగు ప్రజాసమూహములపై తుపాకులను పేల్చుట—ఈ చర్యలన్నిటికి ఎంతమాత్రము కారణము కనుపడదు. గఫూర్‌ఖాన్ సంపూర్ణ స్వాతంత్ర్యమునకు తనకు హక్కుకలదని గట్టిగా వాదించుటలో తప్పేమున్నది? అది జన్మ హక్కు. అట్టి ప్రకటనను 1929 లో లాహోరుకాంగ్రెసు ఏ జంకూ గొంకూలేక ప్రకటించి యుండలేదా? లండనులో నేను బ్రిటిష్‌గవర్నమెంటు ఎదుటనే అదురుబెదురులేక గట్టిగా వాదించి యుండలేదా?....

సంయుక్తరాష్ట్రములోని (ఉత్తరప్రదేశ్‌లో) రైతులు ఆర్థికముగా నలిపివేయబడు చున్న సంగతి ఎల్లరుకు తెలిసిన విషయమే. ఈ సమస్య యీనాటిదికాదు. ఇందులో కోట్ల కొలది రైతుల సమస్య ఇమిడియున్నది....దుర్భరమగు అర్థపీడనమునుండి విముక్తి నొందుటకై సర్వవిధముల ప్రయత్నముచేసి నిష్ఫలమైనవారికి పన్నుల నిరాకరించుటతప్ప వేరొండు గత్యంతరము కానరాదు. ఇట్టి సందర్భములో ఈ పన్నులనిరాకరణము ప్రజలకు సహజమును, సనాతనమును అయిన జన్మహక్కు. దీనిని ఎవరును తీసివేయజాలరు. దేశములో వట్టిపుణ్యానికి ఏ రూపమునగాని అల్లకల్లోలమును తెచ్చిపెట్టే తలంపు కాంగ్రెసుకు ఏకోశ మందును లేదు. ఇట్టి తలపుకలదని చెప్పు సూచనను నేను నిరాకరించి తీరవలెను.

ఇక బెంగాలు విషయము—హత్యలను ఖండించు విషయములో కాంగ్రెసు ప్రభుత్వముతో ఏకీభవించుచున్నది. ఇట్టి నేరములను తుడిచివేయుటకు అవసరములగు చర్యలను

తీసుకొనుటలో ప్రభుత్వమునకు కాంగ్రెసు మనస్ఫూర్తిగ తోడ్పడగలదు. కాని విప్లవకారుల దౌర్జన్య కృత్యములను కాంగ్రెసువారు ఎంత నిర్మొగమాటముగ ఖండింతురో అంత నిర్మొగ మాటముగనే ప్రభుత్వ దౌర్జన్యములను కూడా ఖండింతురు. బెంగాలు ఆర్డినెన్స్ పేరట జరుప బడుచున్న ప్రభుత్వ దౌర్జన్య కృత్యములతో కాంగ్రెసు వారెట్టి సానుభూతిని చూపజాలరు. అది గాక "లా" (చట్టము) పేరట ప్రభుత్వము చేయు దురంత కృత్యములను కాంగ్రెసు తన అహింసా తత్వమునకు లోబడి శాయశక్తుల ఎదిరించి తీరును. సహకారము పరస్పరము ఉభయులయందు ఉండవలెనని తాము చెప్పిన మాటతో నేను మనఃపూర్వకముగ ఏకీభవించు చున్నాను. కాని మీ టెలిగ్రాము యావత్తూ చదివి చూడగా సహకారమంతయు మా కాంగ్రెసే చేయవలెననియు. గవర్మెంటు పక్షము నుండి ఐమలు సహకారమేమియు రానక్కరలేదనియు ప్రభుత్వమువారి అభిప్రాయమైనట్లు నాకు నిష్కర్షగా కనబడుచున్నది.

కాని, ఇప్పటికైనను మించినదేమియులేదు. వైస్రాయిగారు తమ నిశ్చయమును పునర్విమర్శించుకొని, ఎట్టి షరతులులేక మిత్రునిగా నన్ను రప్పించుకొనగోరుతున్నాను.

ప్రభుత్వముతో సహకరించవలెననే కోర్కెతోపాటు నాకున్న నియమములను కూడా వైస్రాయిగారికి తెలియపరచవలసి ఉన్నది. అహింస నాకు సంపూర్ణ ఆదర్శతత్వము. శాసనో ల్లంఘనము ప్రజలకు—ముఖ్యముగా తమ ప్రభుత్వముతో పలుకుబడిలేనప్పుడు—స్వభావ సిద్ధ మగు హక్కు అని నా నమ్మకము. అంతేకాదు. దౌర్జన్యమునకు, కత్తులతో తిరుగుబాటు చేయు టకు బదులుగా ఇది మంచి ప్రయత్నమని నా విశ్వాసము....దీనిని నేను త్రోసివేయజాలను.... కాబట్టి నా అహింసా సిద్ధాంతము ననుసరించి ఇకమీద నడుపవలసిన శాసనోల్లంఘన కార్య క్రమమును గూర్చి కాంగ్రెసుకు సలహా ఇచ్చితిని. ఆ సలహాను కాంగ్రెసు కమిటీవారు ఆమో దించి శాసనోల్లంఘన తీర్మానమును తాత్కాలికముగ జేసిరి. ఆ తీర్మానము నకలును ఇందుతో పంపుచున్నాను. ఇప్పటికైనను వైస్రాయిగారు నన్ను చూచుటవలన ప్రయోజన మున్నదని తలచినట్లయితే ఈ తీర్మానముయొక్క ఆచరణ ఆపుదల చేయబడును. మాఉభయుల సంప్రతింపుల వల్ల ఈ తీర్మానమును ఆచరణ పెట్టవలసిన అవసరము ఉండకపోవచ్చును...."

ఆఖరు నిమిషము వరకు శాంతి సంప్రతింపులు ద్వారా వివాదపరిష్కారానికి గాంధీ కృషిచేశాడు.

కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము అప్పటికి సమావేశమై గాంధీ విలింగ్డన్‌ల మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను, దేశంలో అధికారుల నిరంకుశత్వము మూలమునను ఆర్డి నెన్సుల మూలమునను ఏర్పడిన దుర్భరములను భీకరములును అగు పరిస్థితులను పరిశీలించి జాతీయ గౌరవమును రక్షించుటకు శాసనోల్లంఘన ఉద్యమమును తిరిగి ప్రారంభించి సాగిం చుట తప్ప సాధనాంతరమేదియు లేదని భావించి, తదనుగుణముగ ఒక సుదీర్ఘమైన తీర్మానము గావించినది. గాంధీ తన ఉత్తరముతోకూడ ఈ తీర్మానమును వైస్రాయికి పంపినాడు. వెంటనే వైస్రాయి కార్యాలయము నుండి గాంధీకి జవాబు వచ్చినది. గాంధీని కలుసుకొని ప్రభుత్వ విధానాల గురించి ఆయనతో చర్చించుటకు విలింగ్డన్ నిరాకరించినాడు. నిరాకరించుటకు ఏవేవో కారణాలను చూపించినాడు. కాని ఇవి ఎంతమాత్రమూ సందర్భోచితముగా కనుపించనందున తన తీర్మానము ప్రకారము కాంగ్రెసు నిర్వాహకవర్గము జనవరి 4 న శాసనోల్లంఘన ఉద్య

మమును ప్రారంభించి, ప్రజలందరు శాంతియుతముగ దానిలో పాల్గొనవలసిందిగా కోరినది. ప్రజలు ఈ పిలుపును ఉత్సాహముతోను పట్టుదలతోను అందుకొని పరాయి ప్రభుత్వముతో పోరాటమునకు దిగి సమస్త బాధలను అనుభవించి ఉద్యమాన్ని సాగించినారు.

1932 లో ప్రారంభింపబడిన శాసనోల్లంఘన ఉద్యమానికి ప్రభుత్వంవారు ప్రధాన కారణభూతులు. వారు గాంధీ ఇర్విన్ ఒడంబడికను బుద్ధిపూర్వకముగ ఉల్లంఘించి వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోను, ఉత్తర ప్రదేశ్‌లోను, బెంగాలులోను దుర్భరపరిస్థితులను కల్పించారు. ప్రజలను పీడించుటకు అనేక ఆర్డినెన్సులను జారీచేసి అములుపరచారు. కాంగ్రెసువారు జరిపించిన దౌర్జన్యచర్యల ఫలితంగా వీటిని జారీచేయవలసి వచ్చిందని తమ విధానాలను వారు సమర్థించుకొన ప్రయత్నించారు. కాని ఈ సమర్థన ప్రయత్నాన్ని నిష్పక్షపాత దృక్పథంగల బ్రిటిష్‌వారు ఖండించారు. వారిలో వెరియర్ ఎల్విన్ (Verrier Elwin) ఒకడు. ఇతడు వాస్తవమును తెలుసుకొనుటకు ఈ రాష్ట్రాలలో పర్యటనను సాగించి ప్రభుత్వమూ కాంగ్రెసు నాయకుల మధ్య జరిగిన వాదోపవాదాలలో ఎవరివాదంలో ఎక్కువ సత్యం ఉండినదీ నిర్ణయించ గలిగాడు. ఉత్తర ప్రదేశ్‌లో రైతులు దుర్భరస్థితిని అనుభవించుచుండిరని, శిస్తులు చెల్లించగల శక్తిని వారు పూర్తిగా కోల్పోయ్యారని, అందుచేత వారు శిస్తులు చెల్లింపును మానుకొనడం తప్పింది కాదని. అందుకుగాను వారిపై కఠినచర్యలను తీసుకొనడంలో ఏలాటి న్యాయంలేదని తేల్చాడు. వాయవ్య రాష్ట్రంలో ఆర్డినెన్సులను ప్రవేశపెట్టవలసిన అవసరం ఎలాంటిదీ లేదని, గఫూర్‌ఖాన్ శాంతిభద్రతలకు ఏలాటి ప్రమాదాన్ని కలిగించలేదని, అక్కడ మతకలహాలు గాని దౌర్జన్య సంఘటనలు గాని జరగలేదని, కాంగ్రెసును అణచివేసే ఉద్దేశంతోనే ప్రభుత్వం దాని చర్యలను సాగించినదని స్పష్టంచేశాడు. దేశంలో ఏర్పడిన పరిస్థితుల నన్నిటని పింహావలోకనం చేస్తూ గాంధీ ఇర్విన్ ఒడంబడికను ప్రభుత్వమే ఎక్కువగా ఉల్లంఘించి, కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమాన్ని పునఃప్రారంభించడం అనివార్యంగా చేసిందనే నిర్ణయానికి వచ్చాడు. బ్రిటన్‌నుండి 1932 ఆగస్టులో భారతదేశానికి వచ్చిన ఇండియా లీగు ప్రతినిధుల బృందం కూడా ఈలాటి అభిప్రాయాన్నే వ్యక్తంచేసింది.

ఇర్విన్ గాంధీతో ఒడంబడిక చేసుకోవడమే క్షంతవ్యంగాని పొరబాటనీ, దానిని ఉల్లంఘించి, కాంగ్రెసు వారిని తిరిగి శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించునట్లు చేసి, అది సాగేకాలంలోగాంధీని, కాంగ్రెసును, తిరిగి తలఎత్తకుండా అణచివేసి, బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని సుస్థిరం చేసే ఉద్దేశంతో ప్రభుత్వం ఈలాగు ప్రవర్తించింది.

## 2

జనవరి 4 న ప్రభుత్వం గాంధీని, ఇతర నాయకు లనేకులను ఏలాటి నేరారోపణను గాని విచారణనుగాని చేయక జైళ్ళలో నిర్బంధించింది. నాయకులు లేకపోయినా ప్రజలు తమంతట తాము ఆ రోజుననే శాసనోల్లంఘన ఉద్యమాన్ని తిరిగి ప్రారంభించారు.

ఈలాటి ఉద్యమం వారికి కొత్తకాదు. 1921-22 లో ఒక పర్యాయం, 1930-31 లో ఇంకొక పర్యాయం ఈలాటి పోరాటాన్ని వారు సాగించారు. వీటిలో వారు గడించిన అనుభవం ఈ సమయంలో వారికి ఎంతో తోడ్పడింది. మొదటినుండి ఒకప్రణాళిక ననుసరించి వారు ఈ ఉద్యమాన్ని సాగించారు.

తమ ఉద్యమం పూర్తిగా అహింసాపద్ధతిపైన సాగవలసిందిగా వారు నిర్ణయించుకొన్నారు. జనవరి 1 న కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం. "ఎంత చీకాకు కలిగినను, మనస్సులోను, వాక్కులోను, క్రియలోను అహింసను అనుసరించవలెను ఈ పోరాటం మనలను పీడించువారిపై కసి తీర్చుకొనుటకు ఉద్దేశింపబడలేదు. మనము సమస్త బాధలను అనుభవించి, మనలను హింసించువారి మనస్సును మార్చి మన ఆత్మ పారిశుధ్యము చేకూర్చుటయే ఈ పోరాటము యొక్క ఉద్దేశమని ఎల్లరూ గ్రహించవలెను",అని తీర్మానించింది. ఉద్యమకాలంలో కాంగ్రెసు వారు ఈ మౌలికసూత్రానికి కట్టుబడి ప్రవర్తించారు. దీనికి అన్యథాగా వారు ప్రవర్తించిన ఘట్టాలు చాలా తక్కువ.

శాసనాలను ఉల్లంఘించి శిక్షలను అనుభవించుటకు లక్షల సంఖ్యలో ప్రజలు సిద్ధపడ్డారు. వారిని నిర్బంధించుటకు జైళ్ళు చాలలేదు. అందుకుగాను కాంపు జైళ్ళు (Camp Jails) తాత్కాలిక జైళ్ళు నిర్మింపబడినవి. ఇవికూడా జైలుకు వెళ్ళుటకు సిద్ధపడినవారందరిని నిర్బంధించుటకు చాలలేదు. ఈ పరిస్థితులలో ఎప్పటికైనా ప్రభుత్వం విసుగుచెంది. ఉద్యమాన్ని అణచడం సాధ్యంకాదనే భావంతో రాజీకివస్తారని కాంగ్రెసువారు ఊహించారు.

శాసనోల్లంఘనాన్ని వారుఇంకొక ఉద్దేశాన్ని సాగించుటకు వినియోగించారు.ప్రజలపై ప్రత్యక్ష పన్నులను పరోక్షపన్నులను విధించి ప్రభుత్వ యంత్రాంగం నడుచుటకు కావలసిన ఆదాయాన్ని సంపాదించడం జరుగుతూ వచ్చింది.పన్నులకు సంబంధించిన శాసనాలను ఉల్లంఘించి,వాటిని చెల్లించడం మానుకొన్న పక్షంలో పరిపాలనయంత్రాంగం స్తంభించి ప్రభుత్వం అపజయాన్ని ఎదుర్కొనడం తప్పదు. ఇందుకుగాను అనేక రాష్ట్రాలలో భూమిశిస్తూ. చౌకిదారీ పన్ను, అటవీ రుసుంలు చెల్లించడం ప్రజలు మానుకొన్నారు. కల్లు. సారాయి దుకాణాల పికెటింగు మూలంగాను. అబ్కారీ వేలాల బహిష్కరణ కార్యక్రమం సాగించుట మూలంగాను అబ్కారీ ఆదాయం చాలావరకు తగ్గింది. విదేశాలనుండి దిగుమతి అయ్యే వస్త్రాలు. ఇతర వస్తువులు, మందులు మొదలైనవాటిని బహిష్కరించవలసిందిగా చేసిన ప్రచారంమూలాన దిగుమతి పన్నులనుండి లభించే ప్రభుత్వ ఆదాయం తగ్గింది. ఇందునిమిత్తమై అనేక శాసనాలు ఉల్లంఘించబడినాయి.

అన్ని పోరాటాలలో—అవి శాంతియుతములైనా దౌర్జన్యయుతములైనా—జాతీయ జెండా. జాతీయ గీతం మొదలైన చిహ్నాలు గొప్ప ప్రాధాన్యం వహిస్తవి. వీటి గౌరవాన్ని కాపాడడం పోరాటం సాగించేవారు తమకర్తవ్యంగా భావిస్తారు. ఎదుటి పక్షంవారు వీటిని అగౌరవపరచినప్పుడు వారిని తీవ్రంగా ప్రతిఘటిస్తారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్న వారికి కాంగ్రెసు జెండా, గాంధీ టోపి, ఖద్దరుదుస్తులు. వందేమాతర గీతం, గౌరవించదగిన జాతీయ చిహ్నాలైనవి. జెండాను సభలలోను. సమావేశాలలోను, ఉత్సవాలలోను, ఊరేగింపులలోను ప్రదర్శించడమేగాక కోర్టులపైన, ఇతర ప్రభుత్వ భవనాలపైన, మార్కెట్లవంటి బహిరంగ స్థలాలలోను ప్రతిష్ఠించడం వారి కార్యక్రమాలలో ఒక ప్రధానాంశమైంది. పోలీసువారు జెండాను లాగివేయుటకూ చింపివేయుటకూ విశ్వప్రయత్నం చేయడం. శాంతియుతంగా కాంగ్రెసువారు వారిని ప్రతిఘటించడం పరిపాటి అయింది. తలలపైనుండి గాంధీ టోపీలను బలాత్కారంగా తొలగించడం, ఖద్దరు దుస్తులను ధరించినవారిని విచ్చలవిడిగా కొట్టడం, ఒక్కొక్కమారు వారిని దిగంబరులు చేయడం పోలీసువారి దినచర్యలలో ఒకటిగా పరిణ

మించింది. ఇదికూడా వారిని ప్రతిఘటించవలిసిన అవసరాన్ని కల్పించింది. సభలలోను, సమావేశాలలోను, ఊరేగింపులలోను కాంగ్రెసువారు వందేమాతరగీతాన్ని పాడడం మామూలు. దీనినికూడా అధికారులు నిషేధించారు. ఈ ఆజ్ఞలను ఉల్లంఘించడం ఉద్యమంలో ప్రాధాన్యం వహించింది.

ఉద్యమంలో పాల్గొన్నవారు విదేశవస్తువుల బహిష్కరణ కార్యక్రమాన్ని పికెటింగు ద్వారా ఉమ్మరంగా సాగించారు. ఇందుమూలంగా బ్రిటన్‌లోని మిల్లు యజమానులకు, మిల్లులలో పనిచేసే కార్మికులకూ గొప్పనష్టం కలుగుతుందని కాంగ్రెసుతో రాజీ చేసుకొననవలసినదిగా వారు ప్రభుత్వాన్ని వొత్తిడి చేయగలదని కాంగ్రెసువారు భావించారు. ఇదిగాక ఈ కార్యక్రమం మూలంగా ఖద్దరు ఉత్పత్తి దేశంలో పెరుగుతుందని కూడా భావించారు. ఇందులో వారు ఈలాటి ఫలితాలను ఆశించి ఎక్కువ శ్రద్ధను వహించారు. పికెటింగు జరగరాదని ప్రభుత్వం చట్టాలు చేసినందున ఇదికూడ శాసనోల్లంఘన ఉద్యమంలో ప్రాధాన్యం వహించింది. ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించి సముద్రతీర ప్రాంతాలలోనివారు ఉప్పును తయారు చేశారు.

పైన సూచించిన కార్యక్రమాలే గాక కాంగ్రెసువారు నిషేధాజ్ఞల ఉల్లంఘించి సభలను సమావేశాలను ఉత్సవాలను, ఊరేగింపులను జరిపారు. ముద్రణాలయ చట్టంమూలంగా ముద్రణాలయాలపైన వార్తాపత్రికలపైన అనేక ఆంక్షలను విధించడంచేత వీటిలో అనేకం మూతపడిపోయినవి. కాని కాంగ్రెసువారు రహస్యంగా కరపత్రాలను, పత్రికలను, పుస్తకాలను ప్రకటిస్తూనే వచ్చారు. వీటిలో కొన్నిటిని టైపుచేసియు, సైక్లోస్టయిలు చేసియు విరివిగా పంచిపెట్టారు. జాతీయభావంగల కొన్ని ముద్రణాలయాలు తమపేరు లేకుండా కరపత్రాలను అచ్చువేసి ఇచ్చేవి. ఒక్కొక్కప్పుడు ఊరూపేరూ లేని ముద్రణాలయాలపేర్లు. మనుష్యులపేర్లు వాటిపైన ముద్రింపబడేవి. దేశంలో ఏ మూల ఏమిటి జరుగుచుండేది—పోలీసు దౌర్జన్యాలతో సహా—వీటిద్వారా ప్రజలు తెలుసుకొనేవారు. పోలీసువారు ఎంత మెలకువతో ఉన్నా ఈ కరపత్రాలు ప్రచురణ కావడం ఆశ్చర్యం. కాంగ్రెసు కరపత్రాలను మామూలు పోస్టుద్వారా పంపడం సాధ్యం కాకపోవడంచేత కాంగ్రెసువారు ఆయా రాష్ట్రాలలో తమ స్వంత ఏర్పాటులను చేసుకొన్నారు. ఈ ఏర్పాటులను చేసి, సాగిస్తున్న కాంగ్రెసు ఆఫీసులు ఎక్కడ ఉండినవో ప్రభుత్వం వారు కనిపెట్టలేక పోయినారు.

కొన్ని రోజులు ప్రత్యేక సభలు సమావేశాలు జరుపుటకు కేటాయించబడినవి. జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవానికి ప్రత్యేకించబడింది. గాంధీ నిర్బంధింపబడిన జనవరి 4 అఖిల భారత ఖైదీల దినంగాను, పెషావరులో కాల్పులు జరిగినరోజు పెషావరురోజుగాను, ఏప్రిలు 6 మొదలు 17 వరకు జాతీయవారంగాను గుర్తింపబడినాయి. ఎన్ని నిషేధాజ్ఞలు ఉండినా ఈ రోజులలో ప్రజలు సమావేశమై ఉత్సవాలను సభలను జరిపేవారు. జాతీయవారంలో ఒక్కొక రోజు ఒకవిధమైన బహిష్కరణ కార్యక్రమానికి కేటాయించబడింది. ఈ ఉత్సవాలు, సమావేశాలు ప్రజల ఉత్సాహం తరగకుండా ఉండుటకు ఎంతగానో తోడ్పడినాయి.

1931 కాంగ్రెసు సాంవత్సరిక సమావేశం కరాచీలో మార్చినెలలో జరిగినదని మనం ఇదివరకే తెలుసుకొన్నాము. కాంగ్రెసు అక్రమసంఘంగా ప్రకటించబడినా 1932లో జరగవలసిన సమావేశాన్ని ఢిల్లీలో—ప్రభుత్వ రాజధానిలో—జరిపి కాంగ్రెసు యొక్కయు ప్రజలయొక్కయు

శక్తిని ప్రదర్శించుటకు కాంగ్రెసువారు కృతనిశ్చయులైనారు. సమావేశం జరగకుండా ఉండుటకు కావలసిన సన్నాహాలన్నిటిని అధికారులు చేశారు. కాని వారి కండ్లను కప్పి ఏప్రిలులో 500 ప్రతినిధులతో డిల్లీలోని చాందినీ చౌకులో కాంగ్రెసు సమావేశమయింది. అహమ్మదాబాదుకు చెందిన రంఛోడదాస్ అమృతలాల్ అధ్యక్ష స్థానాన్ని అలంకరించాడు. సాంవత్సరిక నివేదిక పంచబడినతర్వాత (1) కాంగ్రెసులక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదన మని. (2) శాసనోల్లంఘన ఉద్యమం తిరిగి ప్రారంభం కావడం ఆమోద యోగ్యమని, (3) గాంధీ పిలుపును అందుకొని ఉద్యమంలో పాల్గొంటున్న లక్షలాది ప్రజలు ప్రశంసా పాత్రులని. ఆయన నాయకత్వంలో ప్రజలకు పూర్తి విశ్వాసమున్నదని, (4) అధికారులు ఎంత చీకాకు కలిగించినా, ఎన్ని దౌర్జన్యాలను సాగించినా అహింసా తత్వం ఒక్కటే అనుసరణీయమని నాలుగు తీర్మానాలు చేయబడినవి. ఈ కార్యక్రమం పూర్తి కాగానే సమావేశం రద్దయి ప్రతినిధులు వారి వారి బసలకు వెళ్ళుటకు సిద్ధంగా ఉన్నప్పుడుగాని పోలీసువారు అక్కడికి రాలేదు. ఆఖరు నిమిషంలో వారు ఏలాగో సమావేశాన్ని గురించి తెలుసుకొని ప్రతినిధులలో కొందరిని అరెస్టు చేసి సంతృప్తి పొందినారు. కాని కాంగ్రెసువారు సమావేశాన్ని జరిపి. గొప్ప విజయాన్ని సాధించారు. ఇంతే గాదు. ఆయా రాష్ట్రాలలోని కాంగ్రెసువారు నిషేధాజ్ఞలను ఉల్లంఘించి, పోలీసువారి కండ్లలో దుమ్ము పోసి, రాష్ట్ర కాంగ్రెసు సమావేశాలను జిల్లా కాంగ్రెసు సమావేశాలను జరిపి, డిల్లీ కాంగ్రెసు చేసిన తీర్మానాల వంటి తీర్మానాలను చేశారు.

1933లో కూడా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రజలు ఉత్సాహంతో సాగించారు. జనవరి 26న స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరిపారు. మార్చి 31 న కలకత్తా నగరంలో 1000 మంది ప్రతినిధులతో కాంగ్రెసు సమావేశమయింది. దానికి మాళవ్యా అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు గాని ఆయన కలకత్తాకు రైలులో ప్రయాణం చేస్తూ ఉండగా మార్గమధ్యంలో అధికారులు ఆయనను అరెస్టు చేయడం చేత ఆయన స్థానే శ్రీమతి సెన్‌గుప్తా అధ్యక్షత వహించింది. సమావేశం ప్రారంభం కాగానే పోలీసువారు వచ్చి లాటీ దెబ్బలతో దానిని చెదరగొట్టుటకు ప్రయత్నించారు. కాని ప్రతినిధులు ఆ దెబ్బలను తింటూ ఏడు తీర్మానాలను చేసి తమ కార్యక్రమాన్ని పూర్తి చేసుకొన్నారు. ఆటుపైన పోలీసువారు శ్రీమతి సెన్‌గుప్తాను అరెస్టు చేసి ఆరు నెలల శిక్షను విధించారు. మరికొందరు ప్రతినిధులకు కూడా ఈలాటి శిక్షలు విధింపబడినాయి.

పై వివరణవలన కాంగ్రెసువారు 1932-33 లో శాసనోల్లంఘన ఉద్యమం ద్వారా స్వాతంత్ర్య పోరాటాన్ని ఏ విధంగా సాగించారో స్పష్టమౌతున్నది. ఇందులో వారు అమోఘమైన నిర్మాణ శక్తిని, యుద్ధ కౌశలాన్నీ ప్రదర్శించారు. అన్ని యుద్ధాలలో ఎదటి పక్షంవారు చేసే సన్నాహాలను ఎదుర్కొనుటకు ఉచితములైన ఉపాయాలను పన్ని వాటిని ప్రయోగించడమే ఉత్తమకౌశల్యానికి లక్షణం. ప్రభుత్వం చేసిన రక రకములైన సన్నాహాలను కాంగ్రెసువారు 1932-33 లో ఎదుర్కొన గలిగారు. వారిది ఒక విధమైన ప్రత్యామ్నాయ ప్రభుత్వంగా (Parallel Government) రూపొందింది. వారి స్వచ్ఛంద సైనికులు (Volunteers), జెండా మొదలైన వారి చిహ్నాలు, వారి శిబిరాలు ఈ ప్రభుత్వానికి అంగాలైనవి. వీటిని సమకూర్చుకొని వారు పోరాటాన్ని సాగించారు. ఇందులో వారు దౌర్జన్యాన్ని విసర్జించి, అహింసా విధానాన్ని వినియోగించడం ప్రత్యేకంగా గుర్తించవలసిన విషయం.

ఈ కార్యక్రమం అన్ని రాష్ట్రాలలో ముమ్మరంగా జరిగింది. ఒక్కొక రాష్ట్రం ఇంకొక రాష్ట్రంతో పోటీపడి తన కార్యక్రమాన్ని సాగించినట్లు తోచింది. ప్రతి రాష్ట్రంలోను కొన్ని నగరాలు, పట్టణాలు. పెద్ద గ్రామాలు ఈ విషయంలో ప్రఖ్యాతి గాంచాయి. స్థలాభావం చేత వాటిని ఇక్కడ వివరించడం సాధ్యం కాలేదు. (ఆంధ్ర ప్రాంతానికి సంబంధించిన వివరాలన్నిటినీ ఈ గ్రంథకర్త రచించిన "ఆంధ్రలో స్వాతంత్ర్య పోరాటం" నాల్గవ సంపుటంలో చదువ వచ్చును).

## 3

ప్రతి పోరాటానికి రెండు పక్షాలవారు ఉంటారు. శాసనోల్లంఘన రూపాన్ని ధరించిన స్వాతంత్ర్య పోరాటంలో ఒకవైపు ఉద్యమంలో పాల్గొన్న భారతీయులు, ఇంకొకవైపు బ్రిటిష్ బలాలకు చెందినవారు ఉండినారు. పోరాటంలో అహింసకు కట్టుబడిన భారతీయులు ఏలాటి కార్యక్రమాలను సాగించారో ఇంతవరకు వివరింపబడినాయి. ఇప్పుడు బ్రిటిష్ వారనుసరించిన విధానాలను తెలుసుకొనడం అవసరం.

ఈ సందర్భంలో బ్రిటన్‌లోని ప్రభుత్వ ఆమోదంతో విలింగ్డన్ ప్రభుత్వం ప్రపంచ చరిత్రలో కని వినీ ఎరుగనట్టి దౌర్జన్య కార్యక్రమాలను సాగించింది. ఆనాడు బ్రిటన్‌లో ఇండియా లీగు (India League) అనే సంస్థ ఒకటి ఉండేది. దానికి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన తత్వవేత్త బెర్ట్రాండు రసెల్ (Bertrand Russell) అధ్యక్షుడు. ఆ సంస్థ నలుగురు ప్రతినిధులతో కూడిన (వారిలో ముగ్గురు బ్రిటిష్‌వారు; ఒకడు—కృష్ణమీనన్—భారతీయుడు) ఒక ప్రతినిధి వర్గాన్ని భారతదేశంలో శాసనోల్లంఘన ఉద్యమాన్ని గురించి పరిశీలించి ఒక నివేదికను సమర్పించుటకు పంపింది. ఆ వర్గం భారతదేశానికి 1932 ఆగస్టు 17న వచ్చి తన పనిని ముగించుకొని నవంబరు 7న స్వదేశానికి వెళ్ళిపోయింది. ఈ మధ్య కాలంలో అది అధికారులను, అనధికారులను, ఉద్యమంలో పాల్గొంటున్న వారిని. జైళ్ళకు వెళ్ళి విడుదల గాంచినవారిని కలుసుకొని, చర్చలు సాగించింది. జైళ్ళను సందర్శించి వాటిలోని పరిస్థితులను తెలుసుకొనగలిగింది. ఉత్సవాలను ఊరేగింపులను ఏ విధంగా చెదరగొట్టేది స్వయంగా చూచింది. ఈ విధంగా సమాచార సేకరణ చేసి, నివేదిక నొక దానిని ఇండియా లీగుకు సమర్పించింది. రసెల్ వ్రాసిన పీఠికతో దానిని లీగువారు బ్రిటన్‌లోని ప్రజల ఉపయోగార్థం పుస్తక రూపంలో ప్రచురించారు. లీగు ప్రతినిధి వర్గంలో ముగ్గురు బ్రిటిష్‌వారు ఉండినందున దాని అభిప్రాయాలు ప్రభుత్వ అభిప్రాయాల కంటెను కాంగ్రెసువారి అభిప్రాయాల కంటెను నిష్పక్షపాతములని చెప్పవచ్చును. ఆ కారణంచేత అది చరిత్ర రచయితలందరి ప్రశంసకు పాత్రమయింది. ఈ గ్రంథంలో దానినే ఎక్కువగా ఆధారం చేసుకొని ప్రభుత్వం ఉద్యమాన్ని అణచుటకు ఏలాటి కార్యక్రమాలను సాగించిందో వివరిస్తున్నాము.

రసెల్, గ్రంథానికి పీఠిక వ్రాస్తూ, "జర్మనీలోని నాజీల దురంతాల పట్ల బ్రిటిష్ ప్రజలు ఎంతో ఆసక్తిని ప్రదర్శిస్తున్నారు. వాటిని గురించి వార్తా పత్రికలు పూర్తిగా వివరిస్తున్నాయి. వాటిపైన సంపాదకీయ వ్యాఖ్యానాలు ఎన్నో ప్రకటింపబడుతున్నాయి. కాని భారతదేశంలో బ్రిటిష్‌వారు వాటికి మించిన దురంతాలను సాగిస్తున్నారని బ్రిటన్‌లోని ప్రజలలో కొందరికికూడ తెలియదు" అని అన్నాడు. ప్రతినిధి వర్గం వారుకూడ, "భారతదేశానికి వెళ్ళుటకు పూర్వం

పోలీసురాజ్యం అంటే మాకు అర్థం కాలేదు. అక్కడికి వెళ్ళిన తర్వాత అది ఏలాటిదో తెలుసుకొన్నాము. ఈ రాజ్యంలో పోలీసువారి ఇష్టమే చట్టం. తక్కువ స్థాయిలోని అధికారులుకూడ ఏలాటి హద్దులకు లోబడక నిరంకుశంగా ప్రవర్తించి ప్రజలను సర్వవిధాలా హింసిస్తున్నారు." ఈలాటి పోలీసురాజ్యాన్ని స్థాపించి బ్రిటిష్‌వారు ఉద్యమాన్ని అణచ సంకల్పించారు. నిరాయుధులై, అరెస్టులకు జైలు శిక్షలకు సిద్ధపడినవారి పట్ల ఈలాటి హింసతో కూడిన కార్యక్రమాలను సాగించడం వారికి విస్మయం కలిగించింది.

ఉద్యమాన్ని అణచుటకు ప్రభుత్వం తీసుకొన్న చర్యలలో మొదటిది క్రమక్రమముగా 12 ఆర్డినెన్సులను జారీచేసి అమలు పరచుట. వీటి ఫలితంగా ప్రజల ప్రాణం, అర్థం, మానం పూర్తిగా పోలీసువారి వశంలోకి వచ్చాయి. వారు ఏమి చేసినా ప్రజలు భరించవలసినదే. వారికి జరిగిన అన్యాయాన్ని తొలగించవలసినదని న్యాయస్థానాలకు నివేదించి, వాటి మూలంగా పరిహారాన్ని సంపాదించే అవకాశాన్ని వారు పూర్తిగా కోల్పోయ్యారు. న్యాయస్థానాలకు పోలీసువారి చర్యలను గురించి విచారణ చేసే అధికారం తొలగింపబడింది.

ఈ ఆర్డినెన్సులో ఒకటి ముద్రణాలయాలపై ఆంక్షల విధించింది. ఇంకొకటి కాంగ్రెసు మొదలైన సంఘాలను అక్రమ సంఘాలని ప్రకటించి వాటి ఆస్తులను స్వాధీనం చేసుకొనే అధికారాన్ని కల్పించింది. మొత్తంమీద ఈ ఆర్డినెన్సులన్నిటి స్వభావం ఒకేవిధంగా ఉండినా అవి అంతటి విశాలమయిన అధికారాన్ని ఉద్యోగుల పరం చేసింవో తెలుసుకొనుటకు బెంగాలు ఆర్డినెన్సును ఒక మచ్చుగా తీసుకొనవచ్చును. దీని ప్రకారం-

"ప్రభుత్వం చేత అధికారాన్ని పొందిన ఏ ఉద్యోగి కాని ఏ మనిషినైనా సరే అనుమానించ తగినవాడని తోచిన పక్షంలో వాని పేరు ఊరు చెప్పమని అడిగి తెలుసుకొని ఆ మాటలు నిజమని రుజువయ్యేవరకు అతనిని అరెస్టులో ఉంచవచ్చును. అరెస్టు చేయుటలో అతడు ఏ ఉపాయమునైనా అనుసరించవచ్చును. ఏ ఇల్లు అయినా సరే గవర్నమెంటుకు కావలసినన్ని రోజులు ఇచ్చి తీరవలసినదని గవర్నమెంటు ఆ ఇంటి యజమానుని గాని, అందులో కాపురమున్న వానిని గాని అడుగుటకు అధికారము కలదు. ఆ ఇంటిలోని సామానుతో సహా గవర్నమెంటుకు ఇచ్చివేయవలెను. దానికి అద్దెగాని ప్రతిఫలముగాని గవర్నమెంటు ఇస్తే ఇయ్యవచ్చును, లేకపోతే లేదు. అదే విధముగా ఏ వస్తువునైనా కోరుటకు కలెక్టరుకు అధికారమియ్యబడెను. ఎవరు గాని, ఏ ఇంటిలోనికి గాని, ఏ స్థలములోనికి గాని, రైళ్ళలోనికి గాని పోగూడదని కలెక్టరు నిర్బంధించవచ్చును. అట్లే రహదారినికూడ అరికట్టవచ్చును. ఎవరి వద్ద ఎన్నెన్ని బండ్లు ఉన్నదీ, కలెక్టరు కోరినప్పుడు లెక్క దాఖలు చేయవలెను. ఇవి అన్నీ తనకు ఒప్పగించవలసినదిగా కోరవచ్చును. కత్తులు, మందుగుండు సామానుల అమ్మకమును నిషేధించవచ్చును. వాటిని కలెక్టరు వశపరచుకొనవచ్చును. శాంతి భద్రతలు నెలకొల్పు విషయములో భూస్వాములు, స్కూలు మాస్టర్లు, మొదలైనవారు వచ్చి (పోలీసువారి వలెనె) తనకు సహాయము చేయవలసినదిగా కలెక్టరు ఎవరినంటె వారిని కోరవచ్చును. ఇండ్లు సోదాలు చేయించవచ్చును. ఒక ప్రాంతంలో నివసించు వారందరిపై (సామూహిక) జుల్మానాలను విధించవచ్చు....ఈ ఆర్డినెన్సు క్రింద అధికారులు ఏమి చేసినా సరే సివిల్ కోర్టులో దావా చేయుటకు వీలులేదు. ఈ నేరములను విచారించుటకు క్రొత్త కోర్టులు, ప్రత్యేక మాజిస్ట్రేటులు ఏర్పరచబడినారు. ముద్దాయి ఎదురుగా లేకపోయినా సరే

ఈ కోర్టులు విచారణ చేసి శిక్షించవచ్చు." ఇది ఆర్డినెన్సులోని కొన్ని అంశాలు మాత్రమే. అన్ని ఆర్డినెన్సులు దాదాపు ఈ రూపంలోనే ఉండినవి. దేశాన్ని శత్రు దేశంగాను ప్రజలను శత్రువులుగాను అధికారులు పరిగణించారు. శత్రు దేశాలలోని ప్రజలపై ఆక్రమణ కాలంలో విధింపబడే నిర్బంధాలన్నీ భారతీయులపై విధింపబడినాయి. ఇవి ఆర్డినెన్సుల స్థూల స్వరూపం.

ఉద్యమాన్ని అణచుటకుగాను (1) కాంగ్రెసు సంఘాలనే గాక జాతీయ పాఠశాలలు ఇతర సంఘాలు అక్రమ సంఘాలుగా ప్రకటింపబడినవి; (2) అలాటి సంఘాల ద్రవ్య నిధులు వశపరచుకొనబడినవి; (3) కాంగ్రెసుకు ఆర్థిక సహాయం చేసే కంపెనీలయొక్కయు, పత్రిక వ్యాపారస్థుల యొక్కయు లెక్కలపై అధికారులు అధికారాన్ని వహించారు; (4) ఉద్యమం ప్రారంభమయిన మొదటి వారంలోనే నాయకులందరిని అరెస్టు చేశారు; (5) సమావేశాలను చెదరగొట్టడంలో అనవసరమైనంత బలప్రయోగం చేశారు. (6) తాత్కాలికంగా విచారణ కాలంలో నిర్బంధింపబడిన వారిపై బలప్రయోగం చేశారు. (7) గ్రామాలను పోలీసువారు బెదిరించారు; (8) సామూహిక శిక్షలను. జరిమానాలను విధించారు. (9) నేరస్థుల స్నేహితులను. బంధువులను బాధించారు; (10) భూములను, పశువులను, పాత్ర సామానులను, ఇండ్లలోని ఇతర వస్తువులను వశపరచుకొన్నారు; (11) స్త్రీలపైన అత్యాచారాలు గావించారు; (12) పిల్లలను కూడా బాధించారు; (13) జెండా ప్రతిష్ఠించిన వారిపైన, ఖద్దరు ధరించిన వారిపైన, గాంధీ టోపీలను ధరించిన వారిపైన చట్టవిరుద్ధంగా బలప్రయోగం చేశారు; (14) ఇష్టం వచ్చినట్లు దుకాణాలను మూయించి వేశారు. (15) వార్తా పత్రికలపై ఆంక్షలు విధించారు; (16) ఉత్తర ప్రత్యుత్తరాలను ఆటకాయించారు; (17) స్వేచ్ఛగా ప్రయాణం చేయడాన్ని నిరోధించారు; (18) విచారణతో నిమిత్తం లేకుండాను, నామకా విచారణతోను జైళ్ళలో నిర్బంధించారు; (19) వారంటుతో గాని వారంటు లేకుండా గాని సోదాలు సాగించారు; (20) అయిదుగురుకంటె ఎక్కువ మందితో కూడిన సమావేశాలను నిషేధించి, అన్ని సమావేశాలను గూఢచారుల సహాయంతో పర్యవేక్షించారు; (21) పికెటు చేసినవారిని, స్వచ్ఛంద సైనికులను కొట్టారు; (22) పిల్లి ఎలుక పోరాటం మోస్తరుగా ఖైదులో ఉంచడం, విడుదల చేయడం, తిరిగీ నిర్బంధించడం జరిపారు; (23) ఇష్టానుసారం నివాస ప్రదేశాన నుండి బహిష్కరించారు, ఇష్టానుసారం డిటెన్యూలుగా నిర్బంధించారు; (42) ప్రజల భీతావహాల చేసే ఉద్దేశంతో గ్రామాలలో సైనిక దళాలను సంచరింప జేశారు; (25) రహస్య పోలీసులు ఏలాటి విచక్షణ లేక అందరి చర్యలను గమనిస్తూ వచ్చారు; (26) ఆస్తిని నాశనం చేశారు; (27) సాంఘిక సేవను చేసే సంస్థలను ఇతర సంస్థలను మూసి వేశారు.

పై అంశాలకు సంబంధించిన వివరాలను నివేదిక పూస గ్రుచ్చినట్లు సమకూర్చింది.

ఆ వివరాలలో కొన్నిటిని ఈ క్రింద పొందు పరుస్తున్నాము.

(1) ఉద్యమంలో పాల్గొన్న స్త్రీలపై పోలీసులు జరిపిన ఘాతుక కృత్యాలెన్నో మా దృష్టిలోకి వచ్చినవి. ఇవి ఎక్కువగా గ్రామాలలోను జైళ్ళ లోపలను జరిగినవి. అనేక సమయాలతో పోలీసులు వారిని వెంటాడి క్రూరంగా కొట్టినారు. దీనిని అన్ని స్థాయిలలోని

పోలీసు ఉద్యోగులు సాగించినారు. పోలీసులాకీలలో వారిని కుక్కి మురికి ప్రాంతాలలోని నిర్మానుష్య ప్రదేశాలలో వదిలి పెట్టడం, కొట్టడం, దుర్భాష లాడడం, అవమాన పరచడం, చెర పడం, మొగ పోలీసుల వశంలో ప్రయాణం చేయించడం మామూలుగా జరుగుతూ వచ్చింది.

(2) దెబ్బలు కొట్టడానికి హద్దు లేదు. పారిపోతున్న వాలంటీర్లను, అరెస్టు చేయబడిన వారిని, ప్రతి క్రియ తలపెట్టని వారిని, స్పృహతప్పి నేలమీద పడిపోయిన వారిని (మొగ ఆడ అనే విచక్షణ లేక) కొట్టేవారు. దీనికి తోడు దుర్భాషలు; రంగు నీళ్ళను వారిపైన పోయడం, రోడ్లవెంట లాగుకొని పోవడం, సర్వ సామాన్యం. ఈలాగు దెబ్బలు తిన్నవారు ఉద్యమంలో పాల్గొన్నవారు మాత్రమే కాదు. ప్రేక్షకులు కూడా వారిలో ఎందరో ఉండినారు. అయిదుగురుకంటె తక్కువ సంఖ్యలో గుమిగూడిన వారికి, ఒక్కొకప్పుడు ఒంటరిగా ఉండిన వారికి దెబ్బలు తప్పేవి కావు.

మేము (ప్రతినిధి వర్గంవారు) ఒకరోజు ఉదయం గుజరాతులోని ఒక పట్టణాన్ని చేరి, ప్రచ్ఛన్నంగా ఒక భవనంపైన నిలబడి వీధిలో జరిగే సంఘటనలను చూచాము. సుమారు ముప్పై మంది స్త్రీలు ఊరేగింపుగా వెళ్ళుతున్నారు. పొడుగైన లాటీలతో పోలీసులు వారిని ఎదుర్కొనగా వారు కదలక నిలబడి పోయినారు. ఇదివరకు దేశంలో ఎక్కడా మేము చూచి ఉండనట్టి దెబ్బలకు వారు గురి అయ్యారు. వారి తలలపైన భుజాలపైన కొట్టిన దెబ్బలకు అంతులేదు. ఇది ఘోరమైన రాక్షసకృత్యమని వేరుగా చెప్పవలసింది లేదు.

(3) దక్షిణాదిని ఒక చాకలి ఖద్దరు ధరించి పికెటింగు చేస్తూ ఉండగా పోలీసులు అతని తలపై కిరసన్ పోసి అగ్గిపుల్ల అంటించారు. అతి కష్టంపైన మంటలు చల్లార్చబడినాయి. వెంటనే పోలీసు అధికారి వానిని ఒక రూలర్(Ruler)తో చేతులపైన కాళ్ళపైన భుజాలపైన మణికట్టుపైన. గట్టి దెబ్బలు కొట్టాడు.

(4) మూగిన జనం రాళ్ళు రువ్వారనే కారణంగా కాల్పులు జరపడం మామూలు. అన్ని దేశాలలో పోలీసుకాల్పులు జరిగినతర్వాత మాజిస్ట్రేటు ద్వారా దానిని గురించి విచారణ చేయడం మామూలు. కాని భారతదేశంలో కాల్పుల మూలంగా అనేకులు మరణించినా ఏలాటి విచారణా జరిగేది కాదు.

(5) దేశమందంతా పోలీసువారు గావించిన దొమ్మిలకు (Raids) సోదాలకు అంతు లేదు. ఉదాహరణకు గత ఆరునెలలలో మిద్నాపూరు జిల్లాలోని ఒక ప్రాంతంలో 45, ముజఫర్‌పూరు జిల్లాలో 39 జరిగినవి.

(6) విచారణ కాలంలో పోలీసువారి నిర్బంధంలో ఉండిన ముద్దాయిల స్థితి వర్ణనాతీతం. ప్రతి రాష్ట్రంలోను—వాటిలో ప్రధానంగా గుజరాత్, మద్రాసు, ఉత్తర ప్రదేశ్, బెంగాలులో—అలాటివారిని కొట్టి, చిత్రవధలకు గురి చేసిన ఉదంతాలనేకం మాకు తెలియ వచ్చినవి. కళ్ళకోటలోని సబ్‌ఇన్‌స్పెక్టరు ఒకడు రోజూ లాకప్(L~ckup)కు వచ్చి, నిర్బంధితుడైన ఘాసిలాల్ అనే వాని తలజుట్టును లాగి, తలను గోడకు కొట్టేవాడు. ఒక వారం రోజులు నీళ్ళను కూడా ఇయ్యక పస్తు పెట్టాడు. రోజు సబ్‌ఇన్‌స్పెక్టరు మూడు పర్యాయాలు వచ్చి ఈ కృత్యాన్ని సాగించేవాడు. మరి నలుగురికి కూడా ఇదే గతి పట్టింది. మాకు తెలిసిన ఉదంతాలలో ఇది ఒకటి మాత్రమే.

(7) జైళ్ళలో నిర్బంధింపబడిన వారి స్థితి దుర్భరంగా ఉండేది. వారికి పెట్టిన ఆహారం మనుష్యులు తిన తగినది కాదు. మట్టిపాత్రలు చూచుటకే అసహ్యంగా ఉండేవి. తినుటకు వినియోగించిన పాత్రల విషయం చెప్పవలసిందే లేదు నీళ్ళ సప్లై కూడా చాలీచాలక ఉండేవి. ఈ దుర్భర పరిస్థితుల గురించి అధికారులకు విన్నవించుటకు ఖైదీలు సాహసిస్తే వారి గతి మరికొన్ని తన్నులు తినడం లేదా ఒంటరి నిర్బంధం (Solitary Confinement). ఖైదీలలో 9–16 సంవత్సరాల పిల్లల పట్ల జైలు అధికారుల వైఖరి ఒక విధమైన నేరమే. వారిలో అనేకులు కొరడా దెబ్బలకు గురి అయ్యేవారు. శక్తికి మించిన పనులను వారిచేత చేయించడం పరిపాటి.

వీణాదాస్‌గుప్తా, ఆరతిముఖర్జీ అనే చదువుకొన్న ఇద్దరు స్త్రీ ఖైదీలను ఒక బ్రిటిష్ పోలీసు అధికారి నిర్దాక్షిణ్యంగా కొట్టాడు.

(8) డిటెన్యూ శిబిరాలలో పరిస్థితులు మరీ దుర్భరంగా ఉండేవి. 1931 సెప్టెంబరులో హిజ్లీ శిబిరంలోని వారిని విచక్షణారహితంగా తుపాకులతో కాల్చారు.

(9) అనేక ప్రాంతాలలో సామూహికంగా శిస్తుల నిరాకరణ ఉద్యమం సాగింది. మేము అనేక గ్రామాలకు వెళ్ళి విచారణ చేసినాము. గ్రామాలలోని ప్రజలను పోలీసువారు భయభ్రాంతుల జేశారు. భూస్వాములు రైతులను ఇష్టానుసారం బాధించారు. వారి ఇండ్లను నాశనం చేశారు. పోలీసుల సహాయంతో వారి ఆస్తిని వశపరచుకొన్నారు.

అనేక గ్రామాలకు అదనపు పోలీసుదళాలను పంపి, వాటిఖర్చులను గ్రామస్థుల నుండి వసూలు చేశారు....ఇతర పోలీసులు ఆ గ్రామాలకు వెళ్ళి, పన్నులను నిరాకరించినవారిలో ముఖ్యులను కొట్టి, పశువులను, గడ్డిని, ఆహార పదార్థాలను వశపరచుకొని, ఇండ్లను పడగొట్టారు. ఇవి అన్నీ చట్టవిరుద్ధములైన చర్యలు.

(10) పోలీసుదళాలు ప్రజలను వశపరచుకొనే నిమిత్తం గ్రామాలను ముట్టడి వేసేవారు. ఈ ముట్టడి రోజులకొద్దీ జరిగేది....రైతులు వారి పొలాలకువెళ్ళి సకాలంలో వ్యవసాయ కార్యకలాపాలను సాగించడం సాధ్యమయ్యేది కాదు.

(11) అదనపు పోలీసుదళాల వారు గ్రామాన్ని దోపిడీ చేయడం మామూలు. పన్నులను వసూలు చేసే సమయంలో గుజరాతు గ్రామాలనేకంలో ఈలాటి దోపిడీలు మామూలు పోలీసులు చేశారు. బెంగాలులోను ఉత్తర ప్రదేశ్‌లోను పోలీసు దోపిడీలు మితిమీరినాయి. యుద్ధకాలంలో శత్రు దేశాన్ని ఆక్రమించిన సైనికుల దోపిడీలతో ఇవి పోల్చదగినవి.

పై వివరాలన్నీ ఇండియా లీగు ప్రతినిధివర్గం వారి నివేదికలో పొందుపరచినట్టివి. ఇంతకంటె మించిన ఘోరాలు ఎన్నో వారి దృష్టికి రాలేదు. ఉద్యమంలో పాల్గొన్నవారు, జైళ్ళలో శిక్షలను అనుభవించినవారు వాటిని వివరించి ఉన్నారు. మొత్తం మీద ఉద్యమ కాలంలో దేశంలోని ప్రజలు యమయాతనకు గురి అయ్యారు. బ్రిటిష్ అధికారులు మానవత్వాన్ని పూర్తిగా కోల్పోయి, కనీ వినీ ఎరుగని దురంతాల కొంతవరకు స్వయంగాను చాలావరకు వారి క్రింద ఉద్యోగం చేస్తున్న భారతీయుల సాధనానను సాగించారు. పొట్టకూటికిగాను భారతీయులనేకులు ఈలాటి నీచకృత్యాలకు పాల్పడి అధికారులతో సహకరించడం సిగ్గు చేటు.

కాని ఈలాటి నరకబాధలకు గురి అయినా ప్రజలు ఉద్యమాన్ని పట్టుదలతో సాగించడం ప్రశంసించ తగ్గది. దేశ విముక్తికై వీటిని అనుభవించడం తమ కర్తవ్యంగా భావించారు. ఎదటిపక్షం వారిని ఏ విధంగాను హింసించక అత్యంత ధైర్యసాహసాలతో శాంతియుతంగా వారి నెదుర్కొన్నారు. కారాగారాలలో బంధింపబడుటకు గాని, ఆస్తిపాస్తులను పోగొట్టుకొనడానికి గాని, తుదకు మృత్యువు నెదుర్కొనుటకు కాని వారు వెనుదీయలేదు. 1930–32 లోని సత్యాగ్రహ సమరాన్ని ప్రత్యక్షంగా సందర్శించిన (ఇండియా లీగు ప్రతినిధులే గాక) విదేశీ పత్రికా రచయితలు యావద్భారత దేశంలోని సత్యాగ్రహ సమరవీరులు ప్రదర్శించిన ధైర్యస్థైర్యాలను ప్రశంసించారు. గాంధీ తన "హింద్ స్వరాజ్యం" అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు. "మీరేమనుకొంటున్నారు? ఒక ఫిరంగికి వెనుక నిలబడి ఇతరులను తునా తునకలుగా పేల్చివేయడం ధైర్యమా? లేక చిరునవ్వుతో ఫిరంగికి ఎదురుగా నిలబడి ముక్కలు ముక్కలుగా కాల్చివేయబడడం ధైర్యమా? వీరిలో నిజమైన యోధు డెవరు?....నిరంతరం మృత్యువును ఆప్త మిత్రునిగా ఆహ్వానించేవాడా లేక ఇతరుల చావునకు యాజమాన్యం వహించే వాడా?" అని. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నవారు ఈలాటి ధైర్యసాహసాలను ప్రదర్శించి చిరకీర్తిని గడించారు.

## 4

దేశంలోని ప్రజలు అనేక బాధలను అనుభవిస్తూ ఉద్యమాన్ని సాగిస్తున్న కాలంలో ఇంకొక విషయం నిర్బంధంలో ఉన్న గాంధీ దృష్టిని ఆకర్షించి తుదకు ఉద్యమ ఉపసంహరణకు దారి తీసింది.

రెండవ రౌండుటేబిల్ సమావేశ కాలంలో హిందూ ముస్లిం సమస్యను, ఇతర అల్పసంఖ్యాక వర్గాల సమస్యను పరిష్కరించుటకు గాంధీ చేసిన ప్రయత్నాలు విఫలమైనట్లు ఇదివరకే తెలుసుకొన్నాము. కాని దీనిని ఏదో విధంగా పరిష్కరించి, ఆ పరిష్కారాన్ని పార్లమెంటు చేయదలచిన రాజ్యాంగ శాసనంలో చేర్చవలెనని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. దాని మేరకు బ్రిటిష్ ప్రధాని 1932 ఆగస్టు 10 న "కమ్యూనల్ అవార్డు" (Communal Award) అనే పేరుతో ఒక పరిష్కారాన్ని ప్రకటించాడు. భారతదేశంలోని ప్రజలు రాజకీయంగా ఒక జాతికి చెందినవారు కారని, వారు అనేక వర్గాలతో కూడినవారని, శాసన సభలలోని ప్రాతినిధ్యానికి ఈ వర్గ విభేదాలు ఆధారంగా ఉండవలెననేది ఈ పరిష్కారానికి ఆధారం. దీని ఫలితంగా ముస్లింలు, సిక్కులు, భారతీయ క్రైస్తవులు, ఆంగ్లో ఇండియనులు, భారతదేశంలోని యూరోపియనులు మాత్రమేగాక అస్పృశ్యులు కూడా ఒక ప్రత్యేక వర్గంగా గుర్తింపబడినారు. అన్నివర్గాల మొత్తముగా అస్పృశ్యులకు రాష్ట్ర శాసన సభలలోను, కేంద్ర శాసన సభలోను కొన్ని స్థానాలు కేటాయింపబడినాయి. ఆ స్థానాలకు ఎన్నుకోవలసిన ప్రతినిధులను ప్రత్యేక నియోజక వర్గముల ద్వారా వారు ఎన్నుకొనవలసినదిగా నిర్ణయింపబడింది.

అస్పృశ్యులు హిందువులని, తక్కిన హిందువులనుండి వారిని వేరుచేసి హిందూ సంఘంలో రాజకీయములైన చీలికలను కల్పించి దాని బలహీనపరచడం వాంఛనీయం కాదని చాలాకాలాననుండి గాంధీ అభిప్రాయపడి ఉండినాడు. సవర్ణులకు ఇష్టంలేకపోయినా తన ఆశ్రమంలో అస్పృశ్యులనుకూడా చేర్చుకొన్నాడు. వారిని ఒక ప్రత్యేక వర్గంగా గుర్తించిన

పక్షంలో తాను నిరవధికంగా ఉపవాసవ్రతాన్ని పట్టి మరణించుటకు సిద్ధంగా ఉన్నట్లు రౌండు టేబిల్ సమావేశంలో సుస్పష్టంగా చెప్పినాడు. బ్రిటిష్‌ప్రధాని ప్రకటన వెలువడగానే హరిజనులకు సంబంధించిన నిర్ణయాన్ని రద్దుచేయనిపక్షంలో సెప్టంబరు 20 నుండి ఆయన ఉపవాసదీక్షను తాను కొనసాగించుటకు సిద్ధంగా ఉన్నట్లును, దీనికి తిరుగులేనట్లును, బ్రిటిష్‌ప్రధానికి తెలియ పరచాడు. అస్పృశ్యుల నాయకులు రద్దుకు అంగీకరిస్తే తన నిర్ణయాన్ని రద్దుచేయుటకు అభ్యంతరం లేదని బ్రిటిష్‌ప్రధాని జవాబును పంపినాడు.

ఈ పరిస్థితులలో గాంధీ పూనాలోని ఎరవాడజైలులో సెప్టంబరు 20 న ఉపవాసవ్రతాన్ని ప్రారంభించాడు*. ఇది ఆయన మరణానికి దారి తీయవచ్చునని నాయకులందరు ఆందోళన పడినారు. దాని ఫలితంగా మాలవ్యా హిందూనాయకులతోకూడిన ఒక సభను పూనాలో ఏర్పాటు చేశాడు. దానికి అస్పృశ్యుల నాయకులూ వారిలో అగ్రస్థానానికి చెందిన డాక్టరు అంబేడ్కారు హాజరయ్యారు. పూర్తిచర్చలు జరిగిన తర్వాత అంబేడ్కారుతో సభానాయకులందరు ఒక రాజీకి వచ్చారు. అది పూనా ఒడంబడిక Poona pact అనే పేరుతో ప్రసిద్ధిగాంచింది.

ఈ ఒడంబడికలో రెండు ప్రధానమైన షరత్తులు చేర్చబడినాయి. (1) వాటిలో మొదటిదానివలన రాష్ట్రశాసనసభలో బ్రిటిష్‌ప్రధాని అస్పృశ్యులకు కేటాయించిన 71 స్థానాలు 148 కి పెంచబడింది. ఇది అస్పృశ్యుల నాయకులకు తృప్తికలిగించింది. తక్కిన హిందూ నాయకులకుకూడా ఇది ఆమోదయోగ్యమైంది. (2) షరతులలో రెండవది నియోజకవర్గాలకు సంబంధించినట్టిది. దీని ప్రకారం శాసనసభలలోని అస్పృశ్యుల ప్రతినిధులను రెండు స్థాయీ లలో ఎన్నుకొనవలెను. మొదటిస్థాయీలో అస్పృశ్యులు మాత్రమే వారికి కేటాయింపబడిన ఒక్కొక్కస్థానానికి నలుగురును ఎన్నుకొనవలెను. రెండవస్థాయిలో ఈ నలుగురునుండి ఒకరిని అస్పృశ్యులు తక్కిన హిందువులు కలిసిన సంయుక్త నియోజకవర్గములు ఎన్నుకొన వలెను. రెండు స్థాయీలలోకూడిన ఈ ఎన్నికల విధానం ఒక రాజీరూపంలో ప్రత్యేక

* ఉద్యమం ఉమ్మరంగా సాగుతున్నకాలంలో హరిజనసమస్య విషయమై ఉపవాస వ్రతాన్ని పూని ప్రజలదృష్టిని ఉద్యమంనుండి ఒక స్వల్పమైన హరిజన సమస్యపట్ల మరల్చిన గాంధీగారి చర్యనుగురించి జవహర్‌లాల్ నెహ్రూ ఈ క్రిందివిధంగా వ్యాఖ్యానించాడు.

తన ప్రాయోపవేశానికి ఈలాటి స్వల్ప ప్రాధాన్యంగల సమస్యను ఆధారం చేసు కొనినందుకు నేను గాంధీపట్ల కోపాన్ని వహించాను. మన స్వాతంత్ర్య ఉద్యమంపై దాని ప్రభావం ఏలాటిది? తాత్కాలికంగానైనా మన బృహత్తరమైన ఉద్యమం వెనుకబడిపోదా? ఆయన తన తాత్కాలిక ఉద్దేశాన్ని సాధించి, సంయుక్త నియోజకవర్గాలను సంపాదించిన పక్షాన మనమేదో ఒక గొప్ప కార్యాన్ని సాధించినట్లు భావించి, కొంతకాలంవరకు మనము చేయ వలసినది ఏదీలేదని ప్రజలు అనుకొనరా? ఆయన తీసుకొన్న ఈ చర్య ప్రభుత్వం చేసిన పరి ష్కారాన్ని పాక్షికంగా గుర్తించి ఆమోదించడమే కదా? ఇది సహాయనిరాకరణ సిద్ధాంతానికి శాసనోల్లంఘన ఉద్యమానికి అనుగుణమైన చర్యయా? మన త్యాగాలకు ప్రయత్నాలకు ఈలాటి స్వల్పప్రయోజనమా ఫలితం?" ఇతరులనేకులు ఈలాగే వ్యాఖ్యానించారు. శాసనోల్లంఘన ఉద్యమం చల్లారిపోవుటకు ఇది దారితీసినది అనుటలో సందేహం లేదనేదే వారి వ్యాఖ్యానాల సారాంశం.

వియోజకవర్గాలను కోరేవారికి సంయుక్త వియోజక వర్గాలను కోరేవారికి సంతృప్తిని కలిగించింది. గాంధీకూడా తృప్తిపడి సెప్టెంబరు 26 న ఉపవాసదీక్షను విరమించారు. బ్రిటిష్‌ప్రధాని పూనా ఒడంబడికను గుర్తించి, దానికి అనుగుణంగా తన ఆగష్టు 10 నిర్ణయాన్ని మార్చుకొన్నాడు. ఒడంబడిక కొంతవరకు అస్పృశ్యులను ఒక ప్రత్యేక వర్గంగా గుర్తించడము, జనాభాలో వారి దామాషాకంటే ఎక్కువ సంఖ్యలో వారికి స్థానాలు కేటాయించడం జాతీయవాదులు కొందరు విమర్శించినా మొత్తంమీద ఒడంబడికపట్ల అందరు హర్షాన్ని ప్రకటించారు.

పూనా ఒడంబడికకు ఒకరోజు ముందు హిందూనాయకులందరు అక్కడ ఒక సమావేశాన్ని జరిపి, ఇది మొదలు హిందూసంఘంలో ఎవరినీ అస్పృశ్యులుగా పరిగణించరాదని, ఇది వరకు అలా పరిగణింపబడిన వారందరికి ఇతరహిందువులతోపాటు పబ్లిక్ నూతులు, పబ్లిక్ విద్యాలయాలు, పబ్లిక్ రోడ్లు, ఇతరపబ్లిక్ సంస్థలను ఉపయోగించుకొనే హక్కులు ఉండవలెనని స్వరాజ్యం లభించిన తర్వాత స్వరాజ్యపార్లమెంటు చేయవలసిన శాసనాలలో దీనికి సంబంధించిన శాసనం మొదటిదిగా ఉండవలెనని, ఈ మధ్య కాలంలో అస్పృశ్యులపై తరతరాలుగా విధించబడిన ఆంక్షలన్నిటినీ—హిందూ దేవాలయాలలో వారు ప్రవేశించరాదనే ఆంక్షతోసహా తొలగించుటకు హిందూ నాయకులందరు గట్టి కృషిచేయవలసినదని, ఒక చరిత్రాత్మకమైన తీర్మానాన్ని చేశారు. గాంధీ ఉపవాసం అస్పృశ్యత నివారణకు దారితీయడం ప్రత్యేకంగా గుర్తించవలసి ఉన్నది.

ఈలాటి హృదయ పరివర్తన హిందువులలో కలగడంచేత క్రమ క్రమంగా అస్పృశ్యులకు దేవాలయప్రవేశం లభించింది. పబ్లిక్ నూతులలో నీళ్ళు తోడుకొనుటకు వారికి వీలైంది. వారి ఉద్ధరణకుగాను బిర్లా అధ్యక్షతన ఒక హరిజన సేవాసంఘం ఏర్పడింది. దానికి సుప్రసిద్ధ అమృతలాల్ ఠాకర్ కార్యదర్శి అయ్యారు.

హరిజనులదృష్ట్యా ఈ పరిణామాలన్నీ ప్రశంసనీయములైనా ఉపవాసానంతరం గాంధీకి శాసనోల్లంఘన ఉద్యమంపట్ల ఆసక్తి చాలావరకు తగ్గి హరిజన ఉద్ధరణ ఆయన దృష్టిని ఎక్కువగా ఆకర్షించింది. తన శక్తిసామర్థ్యాలను పలుకుబడిని దానికి మాత్రమే వినియోగించవలెనని, స్వరాజ్య సంపాదనముకంటే ఈ ఉద్ధరణ ఎక్కువ ప్రాధాన్యంగలదని ఆయన భావించసాగాడు. హరిజన ఉద్ధరణ విషయములో హిందువులలో పూర్తి హృదయపరివర్తన జరగలేదనే కారణంతో ఆయన మే 8 న 21 రోజుల ఉపవాసాన్ని ప్రారంభించాడు. హరిజన ఉద్ధరణకై ఈ వ్రతాన్ని ప్రారంభించడంచేత ఆయనను నిర్బంధంనుండి విడుదలచేయడం ఉచితమని ప్రభుత్వం భావించి వెంటనే ఆయనను విడుదలచేసింది. ఈ విధంగా ఆయనకు లభించిన స్వేచ్ఛను ఉపవాసవ్రతమును కొనసాగించుటకును, తద్వారా హిందువులలో హరిజనోద్ధరణము పట్ల పూర్తి ఆసక్తిని కలిగించుటకును నిర్ణయించుకున్నాడు.

కాని శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగిస్తున్న కాంగ్రెసు నాయకులు దానివిషయమై ఆయన అభిప్రాయాలను వాంఛించినారు. శాసనోల్లంఘన ఉద్యమం ఆయన నాయకత్వంలో ప్రారంభమైంది. ఉద్యమం ప్రారంభమైననాడు ఆయన నిర్బంధింపబడడంచేత ఆ నాయకత్వం ఆచరణ సాధ్యంకాలేదు. ఇప్పుడు ఆయనకు స్వేచ్ఛ లభించినందున ఆ నాయకత్వాన్నివహించి దానిని సాగించవలసిందిగా వారు ఆయనను కోరారు. కాని వారి కోరికను పూర్తిగా నిరాక

రించాడు. హరిజనోద్ధరణకై తాను పూనిన ఉపవాసాన్ని పురస్కరించుకొని ప్రభుత్వం తన్ను విడుదలచేసింది. ఆ విధంగా లభించిన స్వేచ్ఛను రాజకీయాలకై వినియోగించడం సత్యాగ్రహ తత్త్వానికి విరుద్ధం. అందుచేత తాను ఉద్యమాన్ని నడిపే ప్రసక్తి ఉపవాసవ్రతం పూర్తి అయ్యే వరకు లేదని తన సలహా కోరినవారికి చెప్పాడు.

ఇంతేకాక ఉద్యమాన్ని సాగించే విషయాన్ని గురించి తన అభిప్రాయాలను ఒక ప్రకటనద్వారా వ్యక్తంచేశాడు. ఉద్యమంలో పాల్గొన్న "అసంఖ్యాకులు చూపిన ధైర్య సాహసములకు, స్వార్థత్యాగమునకు వారిని నిస్సంకోచంగా అభినందించుచున్నాను. అయితే దానితోపాటు యింకొక విషయమునుకూడా నేను చెప్పవలసియున్నది. ఈ ఉద్యమములో ప్రవేశించిన రహస్యపుపనులే (రహస్యముగ కరపత్రాలను అచ్చువేయుటవంటివి) ఈ ఉద్యమమునకు నాశనకారణములైనవి. కాబట్టి ఈ ఉద్యమమును కొనసాగించేయెడల రహస్యపుపనులు మాని వేయవలసిందని మనవి చేయుచున్నాను. ఇందువల్ల శాసనోల్లంఘనము చేయుటకు ఒక్కడు కూడా రాకపోయిననూ పరవాలేదు." ఇదిగాక ఇంకొక అభిప్రాయమునుకూడా ఆయన వ్యక్తం చేశాడు. అది ఏమిటంటే, "ప్రజా సామాన్యము బెదరెననుటలో సంశయములేదు. ఆర్డినెన్సులు ప్రజలను అణచిపెట్టినవి. ఈ నిరుత్సాహమునకు మనవారు అవలంభించిన రహస్యపద్ధతియే కారణమని నా అభిప్రాయము; ఈ ఉద్యమతత్త్వమేమనగా దీనిలోకి ఎంతమంది వచ్చినారనేది కాదు ప్రశ్న. ఎట్టిగుణములుగలవారు వచ్చినారనునది ప్రధాన విషయము. నేను ఈ ఉద్యమమును నడుపుచున్నయెడల మందికంటే గుణమును ఎక్కువగా కోరెదను. ఈ గుణము లభించేయెడల ఉద్యమప్రభావము తక్షణమే పైకిలేచును. ప్రజాసమూహముమీద పనిచేయుచున్నప్పుడు ఇదితప్ప వేరుమార్గములేదు. ఇక ఉద్యమమును నడిపించువిషయమై నేను ఏమియు చెప్పజాలను. ఈ అభిప్రాయములను ఇన్నాళ్ళనుండి నా మనస్సులో బంధించియుంచితిని. వీనిని గురించి సర్దార్ వల్లభాయిగారు సంపూర్ణముగా ఏకీభవించుచున్నారు," ఉద్యమమునుగురించి తానేమియు చెప్పజాలనని ప్రకటనలో తెలియపరచినా ఉద్యమాన్ని సాగించడంలో ఆయనకు ఉత్సాహములేదని ప్రకటన స్పష్టంచేసింది.

ఇంకా ఆయన ప్రకటనలో "నాకు ఇష్టమున్నను లేకపోయినను శాసనోల్లంఘనము గురించి ఇంకొకమాట చెప్పెదను. ఈ (ఉపవాస వ్రతము) మూడువారములలో శాసనోల్లంఘనముచేయు వారి మనస్సులు చాలా ఆందోళన చెందియుండును. కాబట్టి కాంగ్రెసు అధ్యక్షుడు తానే ఉద్యమమును ఒక నెలవరకుగాని, లేక ఆరువారముల వరకుగాని ఉపసంహరిస్తూ ఒక ప్రకటనచేస్తే బాగుంటుందని నా అభిప్రాయము.

ఇక గవర్నమెంటుకు ఒకమనవి చేసెదను. దేశములో నిజమైన శాంతిని వారు కోరేయెడల, ఇప్పుడు దేశములో నిజమైన శాంతిలేదనివారు తలచేయెడల, ఆర్డినెన్సు పరిపాలన నిజమైన పరిపాలనకాదని వారికి తోచేయెడల వారీ అవకాశమును (ఉద్యమ తాత్కాలిక ఉపసంహరణము) తీసుకొని ఖైదీలందరిని ఎట్టిషరతులు కోరకుండ వదిలిపెట్టవలెను. *

* శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించుకొనవలసినదిగా గాంధీ కాంగ్రెసు అధ్యక్షునికి సలహా ఇయ్యడాన్ని విమర్శిస్తూ ఆరోగ్యార్థం అప్పట్లో యూరపులో వియన్నా నగరంలో ఉండిన విటల్‌భాయిపటేల్, సుభాష్‌చంద్రబోసులు ఈ క్రింది ఉత్తరాన్ని వ్రాశారు.

"శాసనోల్లంఘనమును ఆపుదల చేయుటలో గాంధీగారు చేసిన పని బాగుండలేదు.

ప్రకటన మేరకు కాంగ్రెసు అధ్యక్షుడు శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రథమంలో ఆరు వారాలవరకు తర్వాత మూడు నెలలవరకు ఉపసంహరించినాడు. ప్రభుత్వం గాంధీకోరికను నిరాకరిస్తూ ఒక మర్యాద రహితమైన ప్రకటనను గావించింది. ఉద్యమ ప్రథమ దశలో ఇర్విన్ గాంధీపట్ల చూపిన గౌరవానికి విలింగ్డన్ ప్రభుత్వకాలంలో ఏలాటి స్థానము లేకపోయింది. ఉద్యమం చల్లారిపోయిందని, ఆర్డినెన్సులపరిపాలన, దాని మూలంగా స్థాపితమైన పోలీసు రాజ్యము ఫలప్రదమైనదనీ, జాతీయవాదులను చూచి భయపడవలసిందిలేదనీ ప్రభుత్వం సంతోషించింది.

ఉపవాస వ్రతం ముగిసి, గాంధీకి కొంత విశ్రాంతి కలిగిన తర్వాత 1933. జూలై 12న పూనాలో గాంధీ సమక్షాన కాంగ్రెసు నాయకులు సమావేశమై భవిష్యత్తున జరగవలసిన కార్యక్రమాన్ని గురించి ఆలోచించి (1) శాసనోల్లంఘన ఉద్యమాన్ని పూర్తిగా ఉపసంహరించుకొనరాదని; (2) సమిష్టి శాసనోల్లంఘనమునకు (Mass Civil Disobedience) బదులుగా వ్యక్తి శాసనోల్లంఘనమును సాగించవలెనని; (3) దీనిని ప్రారంభించుటకు పూర్వం గాంధీ వైస్రాయిని కలుసుకొని ఆయనతో చర్చలు సాగించవలెనని తీర్మానించారు. ఈ తీర్మానం మేరకు వైస్రాయిని కలుసుకొనుటకు అనుజ్ఞ ఇయ్యవలసినదిగా గాంధీ వైస్రాయికి ఉత్తరం వ్రాశాడు. అలాటి అనుజ్ఞను ఇచ్చుటకు వైస్రాయి నిరాకరించాడు. ఈ నిరాకరణ జాతీయ గౌరవానికి భంగకరమని, దానిని రక్షించుకొనుట అవసరమని, అందుకుగాను వ్యక్తి సత్యాగ్రహాన్ని సాగించడమే తగిన సాధనమని, అందులో విశ్వాసం కలవారు దీనికి పూనుకొన్నారు.

ఆగస్టు 1న గాంధీ 34రు ఆశ్రమ వాసులతో వ్యక్తి సత్యాగ్రహాన్ని ప్రారంభించదలచాడు. కాని జూలై 31 రాత్రి ప్రభుత్వం ఆయనను, ఆయన అనుచరులను అరెస్టు చేసి జైలుకు పంపించి, ఆగస్టు 4న ఆయనను విడుదల చేసి. పూనాలో నివసించవలసిందిగా ఉత్తరువులు జారీ చేసింది. గాంధీ ఆ ఉత్తరువులను ఉల్లంఘించగా ఆయనను తిరిగీ అరెస్టు చేసి ఒక సంవత్సరం జైలు శిక్షను విధించింది. అటు తర్వాత కాంగ్రెసుకు చెందిన వారనేకులు వ్యక్తి సత్యాగ్రహాన్ని సాగించి జైళ్ళకు వెళ్ళారు.

జైలునుండి హరిజన ఉద్యమాన్ని ప్రచారం చేయుటకు ఏలాటి వసతులు ప్రభుత్వం కల్పించని కారణంగా ఆగస్టు 16న గాంధీ ఉపవాస దీక్షకు పూనుకొన్నాడు. ఆయన ఆరోగ్యం

అది ఓటమిని ఒప్పుకొన్నట్లగును; రాజకీయ నాయకులుగా గాంధీగారు అపజయము పొందినారు. కాంగ్రెసు కొత్త సిద్ధాంతముల మీద కొత్త పద్ధతి ననుసరించి పునర్నిర్మాణము గావింపవలసిన అవసరము వచ్చినది. దీనికి కొత్త నాయకుడు కావలెను. జీవితమంతంతా స్వంత పద్ధతులతో కృషి చేసిన గాంధీ ఈ కొత్త పద్ధతి ప్రకారము నడిపించవలసినదని కోరుట న్యాయము కాదు. కాంగ్రెసు యావత్తు ఇట్టి మార్పు పొందేయెడల చాలా ప్రశస్తముగా ఉండును. ఒకవేళ యావత్తు కాంగ్రెసు కొత్త పద్ధతి ప్రకారము మారనియెడల కాంగ్రెసులోనే తీవ్రవాదులందరు కలిసి ఒక పార్టీని నిర్మించవలెను." ఆయన ఆధ్యాత్మిక దృష్టి వీరికిని, జవహర్‌లాల్ వంటి వారికిని నచ్చలేదు. వీరందరిది శుద్ధమైన లౌకిక దృష్టి. రాజకీయాలు ఐహికములకు సంబంధించినవి. ఆధ్యాత్మిక దృష్టితో వాటిని నడిపించుట అనుచితమనేది వీరి అభిప్రాయము.

చాలా వరకు క్షీణించింది. దీనిని గమనించి ప్రభుత్వం ఆయనపై ఏలాటి షరతులను విధించక ఆగస్టు 23 న ఆయనను విడుదల చేసింది. అయినా ఆయన జైలులో ఉన్నట్లే భావించి సంవత్సరం పూర్తి అయ్యేవరకు రాజకీయాల నుండి విరమించి హరిజనోద్ధరణ కార్యక్రమంలో నిమగ్నుడయ్యాడు. దీని ఫలితంగా వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమం కూడా ఆగిపోయింది. 1934 ప్రారంభంలోని దేశ పరిస్థితులను సమీక్షిస్తూ పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు చరిత్రలో, "శాసనోల్లంఘన విషయంలో అభివృద్ధి సంతృప్తికరముగా లేకపోయెను. విడుదలైన ఖైదీలు అలసిపోయిరి. సమిష్టి శాసనోల్లంఘనమును విరమించిన మొదల తాము వ్యక్తి శాసనోల్లంఘన సాగింతుమని పూనాలో వాగ్దానము చేసిన రాష్ట్రనాయకులు ఎవరో కొద్దిమంది తప్ప తమ మాటను నిలబెట్టుకొనలేక పోయినారు. జైలునుండి విడుదలైనవారు మరల జైలుకు పోవుటకు అశక్తులో, లేక అయిష్టులో అయియుండిరి. అందుకు సిద్ధపడినవారికి జైలు దొరకలేదు. ప్రభుత్వంవారు కాంగ్రెసువారిని జైలులో పెట్టుటకు బదులుగా లాటీచార్జీ చేసియో, సబ్ జైళ్ళలో హింసించియో వదలిపెట్టుచుండిరి. అరెస్టుచేయుట, వదలిపెట్టుట, మరల అరెస్టు చేయుట వదలిపెట్టుట—ఈ విధానాన్ని సాగించిరి. ఇది వాలంటీర్లకు విసుకు కలిగించెను." ఈ విధంగా 1932, జనవరి 4 పునఃప్రారంభమైన శాసనోల్లంఘన ఉద్యమం ఆగిపోయింది. 1934, మే 18, 19 లలో పాట్నాలో సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు కమిటీ శాసనోల్లంఘనము నిలిపివేయబడినట్లు లాంఛనప్రాయంగా తీర్మానము చేసినది.

## 5

1932-34 ఉద్యమంలో లక్షలాది ప్రజలు పాల్గొన్నారు. ప్రభుత్వ లెక్కలప్రకారం వారిలో 1933 ఫిబ్రవరి ఆఖరుకు 67,991 పురుషులు, 3,462 స్త్రీలు జైళ్ళలో శిక్షను అనుభవించారు. కాని కాంగ్రెసు అంచనాప్రకారం జైలుశిక్షను ఒక లక్షకుపైగా అనుభవించారు. వీరిలో సుమారు 12,100 ముస్లింలు ఉండినారు. వీరు ఎక్కువగా వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి చెందినవారు. జైళ్ళలో నిర్బంధించబడక ఇతరశిక్షకు పాత్రులైనవారి సంఖ్యను అంచనా వేయడం సాధ్యంకాదు. జైళ్ళు నిండిపోవడం చేతను, తాత్కాలికంగా ఏర్పాటైన జైళ్ళు చాలక పోవడంచేత అనేకులకు జరిమానాశిక్షను విధించి, లక్షలాదిసొమ్మును వసూలుచేశారు. ఈ వసూలు చేయడంలో అనేక అక్రమచర్యలను సాగించారు. నేరస్థులనుండి వసూలుచేయడం సాధ్యంకానప్పుడు వారి బంధువులనుండి వసూలు చేశారు. ఉద్యమంలో పాల్గొన్నవారనేకులు సభలకు, సమావేశాలకు ప్రేక్షకులుగా వెళ్ళినవారు విచక్షణారహితంగా లాటీదెబ్బలకు తుపాకి కాల్పులకు గురి అయ్యారు. అనేకులు ఎముకలు విరిగి యావజ్జీవం రోగపీడితులైనారు.

ఉద్యమాన్ని అణచడంలో ప్రపంచ చరిత్రలో కనివిని ఎరుగని శిక్షలను అధికారులు క్రొత్తగా కనిపెట్టి అమలులోకి తెచ్చినారు. పోలీసులు, జైళ్ళ అధికారులు యమకింకరుల కంటె భయంకరంగా ప్రవర్తించి ఉద్యమంలో పాల్గొన్నవారిని నరకబాధలకంటె ఘోరమైన బాధలను అనుభవించేటట్లు చేశారు.

ఉద్యమంలో పాల్గొన్నవారు ఆశించిన సంపూర్ణ స్వాతంత్ర్యం లభించకపోయినా వారు చేసిన త్యాగాలు, అనుభవించిన బాధలు ఫలరహితములైనట్లు భావించరాదు. స్వరాజ్యమనేది హిమాలయ పర్వతంలో ఎవరెస్టు శిఖరంవంటిది; అనేకులు దానిని ఆరోహించుటకు

ప్రయత్నంచేసి కొన్నిమెట్లు ఎక్కినతర్వాత జారి కిందికి పడిపోయినారు. కాని తర్వాతకాలంలో ఆశాభంగాన్ని పొందక ఇతరులు అలాటి ప్రయత్నాన్నే చేసి కిందికీ మీదకూ పడి, తుదకు ఏలాగో ఆఖరుమెట్టు నెక్కి శిఖరాన్ని చేరగలిగినారు. స్వరాజ్య శిఖరాన్ని ఎక్కుటకు ప్రయత్నం చేసినవారిస్థితి ఈలాటిదే. ఈ ప్రయత్నం వందేమాతర ఉద్యమం, హోంరూల్ ఉద్యమం, రౌలెట్టు సత్యాగ్రహం, సహాయ నిరాకరణ ఉద్యమం, ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమం మూలంగా ఒకమెట్టునుంచి ఇంకొకమెట్టుకు తీసుకొని వెళ్ళింది. ప్రయత్నం చేసిన వారు ఎన్నడూ ఆశాభంగాన్ని పొందలేదు. ఒక్కొక్క ప్రయత్నంవలన ప్రజలలో దేశాభిమానం, పరాయి ప్రభుత్వంపట్ల ద్వేషం, స్వాతంత్ర్యంపట్ల దీక్ష బలపడినాయి. ఈ ఉద్యమాలు ఫలరహితములైనట్లు కనుపించినా వాటిమూలంగా ప్రజలలో కలిగినమార్పులు వారిని స్వరాజ్యానికి దగ్గరదగ్గరగా వచ్చునట్లు చేసింది.

ఈ దృష్ట్యా 1932-34 శాసనోల్లంఘనం ఫలప్రదమైనదనే చెప్పవలసి ఉన్నది.

ఈ ఉద్యమం మూలంగా బ్రిటిషుప్రభుత్వం దాని నైతికబలాన్ని పూర్తిగా కోల్పోయింది. ప్రజల అభిమానాలను పోగొట్టుకొన్నది. దాని నిలకడకు పశుబలం ఒక్కటే ఆధారమైంది. అది సాగించిన ఘోరకృత్యాలను జాతీయవాదులే గాక ఇతర పార్టీలవారుకూడా ఏవగించారు. పరిస్థితులు అనుకూలించినప్పుడు పోరాటాన్ని తిరిగి సాగించి పరాయి ప్రభుత్వాన్ని కూలద్రోయడమే తమ కర్తవ్యమనే భావం ప్రజలలో నాటుకొన్నది. ఇది క్రమక్రమంగా 1942 "క్విట్ ఇండియా" ఉద్యమానికి దారితీసింది. ప్రజలలో నిర్భయత్వం, ఆత్మవిశ్వాసం, త్యాగశీలత, ప్రాబల్యం గాంచాయి. తమకు వాస్తవమైన పరిపాలకులు కాంగ్రెసు నాయకులనీ, వారి ఆదేశాలకు మాత్రమే నైతికంగా తాము లోబడడం ధర్మమనీ, పరాయి పరిపాలకుల శాసనాలకు తాము లోబడవలసినది లేదనేభావం వారిపై అత్యంత ప్రభావాన్ని వహించింది. పరాయిప్రభుత్వం నిర్మూలం కావడం తప్పదని, తమకు స్వరాజ్యం వచ్చి తీరుతుందని వారు విశ్వసించినవారయ్యారు.

ఉద్యమంలో అన్ని కులాలవారు, సవర్ణులతో సహా అస్పృశ్యులు పాల్గొన్నారు. అందరుకలిసి బాధలను అనుభవించారు. ఇది ప్రజలలో సంఘీభావాన్ని బలపరచింది.

పరాయిప్రభుత్వాన్ని ఎదుర్కొనడంలో పురుషులతో పాటు స్త్రీలుకూడా గొప్ప పాత్రను వహించారు. సంఘంలో యుగయుగాలుగా వారు అనుభవిస్తూ ఉండిన దాస్యంనుండి వారు విముక్తి గాంచుటకు ఇది పటిష్టసాధనమైంది. అంతరంగికంగాను బాహ్యంగాను ఇన్ని మార్పులకు దారితీసిన ఉద్యమం ఫలరహితమైనదని భావించడం గొప్ప పొరపాటు.

చదువదగిన గ్రంథాలు:

Bhavan: Vol. xi
Tarachand Vol. iv
పట్టాభిసీతారామయ్య - కాంగ్రెసు చరిత్ర
R. C. Majumdar: History of the Freedom Movement in India Vol. iii
Tendulkar: Mahatma, Vol. iii
M. Venkatarangaiya: History of the Freedom struggle in Andhra Pradesh - Andhra: Vol iv

# అధ్యాయము-11

## విప్లవ ఉద్యమ పునరుద్ధరణము

స్వాతంత్ర్యం ప్రజల జన్మహక్కు అనే భావం 1905 నాటికి ప్రథమంలో విద్యాధికులలోను తర్వాత క్రమక్రమంగా సామాన్య ప్రజలలోను ఏర్పడింది. దీనిని సాధించడంలో సాయుధ పోరాటాన్ని సాగించడం నీతి విరుద్ధం కాకపోయినా బ్రిటిష్ పరిపాలన మూలంగా ప్రజలు నిరాయుధులు కావడంచేత అది ఆచరణసాధ్యం కాదనే కారణంగా తిలక్ మొదలైన జాతీయవాదులు సాత్విక నిరోధ విధానాన దానిని సాధించవలసిందిగా ప్రచారం చేశారు. వందేమాతర ఉద్యమ కాలంలో కొంతవరకూ దీనిని వినియోగించారు. కాని అది ఫలప్రదం కాజాలదని, సాయుధ పోరాటం ఎంతవరకు సాధ్యమో అంతవరకైనా దానిని వినియోగించి పరాయి ప్రభుత్వాన్ని ఎదుర్కొనడం అవసరమనీ బెంగాలులోను ఇతర ప్రాంతాలలోను యువకతరానికి చెందినవారు భావించి అందుకుగాను విప్లవ ఉద్యమాన్ని 1918 వరకూ సాగించినారు. ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో జర్మనుల సహాయంతో ఆయుధాలను సేకరించిన్నీ, భారత సైన్యంలోని సిపాయీల సహాయాన్ని సంపాదించిన్నీ భాకీమెత్తున సాయుధపోరాటాన్ని సాగించవారు సంకల్పించారు. కాని వారి ప్రయత్నం విఫలమైంది. దీనికి సంబంధించిన వివరాలన్నింటినీ మనం ఇదివరకే తెలుసుకొన్నాము. ప్రభుత్వం కఠినమైన దమన విధానాన్ని అమలుపరచి విప్లవకారులను వేలసంఖ్యలో నిర్బంధంలో ఉంచడంచేత ఉద్యమం బలాన్ని కోల్పోయింది.

ప్రభుత్వం దీనిని గుర్తించి, మాంటేగు చెమ్సుఫర్డు సంస్కరణలను ప్రవేశపెట్టే సందర్భంలో 1919 న రాజకీయ ఖైదీలను విడుదల చేసింది. ఉద్యమకాలంలో విప్లవసాధనంలో వారికి ఏర్పడిన విశ్వాసాన్ని వదలుకొనకపోయినా ఉద్యమాన్ని తిరిగి కొనసాగించుటకు దేశంలో పరిస్థితులు అనుకూలించలేదని గ్రహించారు. 1919 నాటికి గాంధీ రాజకీయరంగంలో ప్రవేశించి స్వరాజ్యాన్ని సంపాదించుటకు సత్యాహింసలతో కూడిన సత్యాగ్రహ విధానమునే వినియోగించవలసినదనీ ఏ పరిస్థితులలో కూడా జీవితంలో మానవులు హింసావిధానాన్ని వినియోగించరాదని, ఈ నైతిక విధానం దౌర్జన్యవిధానానికంటె పటిష్టమైనదని ప్రచారంచేసి 1920-22 లో దౌర్జన్యరహిత సహాయ నిరాకరణోద్యమాన్ని సత్యాగ్రహ సిద్ధాంతానుసారం సాగించారు. ఈ విధానం ఎంతవరకు ఫలప్రదం కాగలదో తెలియునంతవరకూ దౌర్జన్యవాదులలో అనేకులు హృదయపూర్వకంగా ఇందులో పాల్గొన్నారు. కాని ఆయన ఉన్నట్లుండి, ఉద్యమం ఉచ్ఛస్థితిలోకి వచ్చిన తరుణంలో చౌరిచౌరాఉదంత కారణంగా దానిని ఉపసంహరించుకొనడం వారికి చాలా ఆశాభంగాన్ని కలిగించింది. ఈ ఉపసంహరణ ప్రజల ఉత్సాహాన్ని తగ్గించి, స్వాతంత్ర్య సమరం పూర్తిగా వెనుకబడిపోయే ప్రమాదం ఉన్నట్లు వారు భావించి, విప్లవ ఉద్యమాన్ని తిరిగి ప్రారంభించి కొనసాగించడం తమ విద్యుక్తధర్మమనే నిర్ణయానికివచ్చారు.

1922 ఏప్రిలులో బెంగాలు కాంగ్రెసు సాంవత్సరిక సమావేశం జరిగినప్పుడు విప్లవ వాదులు కూడా సమావేశమై వారి కార్యక్రమ ప్రణాళికను తయారుచేశారు. చిత్తరంజనదాస్‌వంటి కాంగ్రెసునాయకులు వారితో సన్నిహిత సంబంధం కలవారై వారిపట్ల సానుభూతిని ప్రదర్శించారు. 1923 లో బెంగాలులోని వార్తాపత్రికలు 1906-18 లో ఉద్యమంలో పాల్గొన్న జితేంద్రలాల్ ముఖర్జీ వంటివారిని ప్రశంసిస్తూ అనేక వ్యాసాలు వ్రాశాయి. ఉద్యమానికి ఒక విధమైన అనుకూల వాతావరణం ఏర్పడింది. పోలీసు అధికారుల హత్యలు దోపిడీలు యధా పూర్వంగా కార్యక్రమంలో ప్రాధాన్యం వహించాయి. అనుశీలన, యుగాంతర సమితులు పునరుద్ధరింపబడినాయి. చిట్టగాంగులో సూర్యసేన నాయకత్వాన ఇంకొక విప్లవోద్యమం నిర్మాణమైంది. దీనిశాఖలు అనేక ప్రాంతాలలో స్థాపింపబడినాయి. యువకు లనేకులు ఇందులో సభ్యులయ్యారు

చిట్టగాంగు సంఘం 1924 లో రైలుస్టేషన్‌పై దాడి సాగించి రూ. 77 000 లను అపహరించగలిగింది. ఆనాడు సర్ చార్లెసుటెగార్టు అనే పోలీసు కమీషనరు విప్లవకారులపట్ల అతి దారుణంగా ప్రవర్తిస్తూ ఉండేవాడు. యుగాంతర సమితివారు అతనిని హత్య చేయుటకు గోపీనాధసాహ అనే యువకుని నియోగించినారు. అతడు టెగార్టును హత్యచేయుటకు బదులు పొరపాటున డీ అనే ఇంకొక అధికారిని హత్యజేసి ఉరిశిక్షను అనుభవించాడు. అతని సాహసాన్ని దేశాభిమానాన్ని ప్రశంసిస్తూ రాష్ట్ర కాంగ్రెసు సమావేశంలో దాసు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించగా సభవారందరూ దానిని ఆమోదించారు. అటుతర్వాత అహమ్మదాబాదులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో సాహను ప్రశంసిస్తూ దాసు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని గాంధీ ప్రతిఘటించిన విషయం ఇదివరకే తెలుసుకొన్నాము. కాంగ్రెసు నాయకులలో అనేకులు విప్లవవాదులను సమర్థించడం గుర్తించదగిన విషయం. స్వాతంత్ర్య సంపాదనకు సాయుధ విప్లవంకూడా ఒక సాధనంగా వీరు పరిగణించారు.

1923 తర్వాత పటిష్ఠమైన బాంబులను తయారుచేయుటకు కలకత్తాలోను పరిసర ప్రాంతాలలోను ఫ్యాక్టరీలను స్థాపించడంకూడా జరిగింది. వీటిని తయారుచేయడంలో విప్లవ కారులు ఎక్కువ నైపుణ్యాన్ని సంపాదించారు. విప్లవ ఉద్యమం బలపడుతున్నదని ప్రభుత్వం గ్రహించి దానిని అణచుటకు మరింత కఠినమైన ఆర్డినెన్సులను 1924-25 లో జారీ చేసింది. పోలీసువారి నిరంకుశత్వం విశృంఖలంగా తాండవమాడసాగింది. ఉద్యమంతో ఏలాటి సంబంధం లేనివారుకూడా వీటిమూలంగా నిర్బంధంలోకి తీసుకోవడం పరిపాటి అయింది. దీని ఫలితంగా ప్రజలకు ప్రభుత్వంపట్ల ద్వేషమూ, విప్లవవాదులపట్ల అభిమానమూ వృద్ధి గాంచాయి. 1924-25 లో హత్యాప్రయత్నాలు అనేకం జరిగాయి గాని, అవి ఫలప్రదం కాలేదు. వీటిమూలంగా ఆలీపూర్ జైలును చూచుటకు వచ్చిన ఒక పోలీసు సూపరెంటెండెంటు మాత్రమే హతుడయ్యాడు.

1923 తర్వాత ఉత్తరప్రదేశ్‌లో కూడ ఉద్యమవాదులు వారి ప్రయత్నాలను సాగించారు. వారణాసి వీరికి ప్రధానకేంద్ర మైంది. 1924 అక్టోబరులో వీరు కాన్‌పూరులో ఒక అఖిల భారత విప్లవవాదుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అనేక రాష్ట్రాలనుండి దానికి ప్రతినిధులు వచ్చారు. ఈ సమావేశం "హిందూస్థాన్ రిపబ్లికన్ సంఘం" (Hindustan Republican Association) అనే పేరుతో ఒక కొత్త సంఘాన్ని నిర్మాణం చేసింది. క్రమక్రమంగా

బీహారు, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబులలో దానిశాఖలు ఏర్పడినాయి. ఈ సంఘంపై నాయకత్వం వహించిన సచీంద్ర సన్యాల్ కమ్యూనిస్టు నాయకుడుగా ప్రఖ్యాతిగాంచి, భారతదేశంలో కమ్యూనిస్టు తత్వాన్ని ప్రచారం చేయుటకు సోవియట్ అధికారులచే నియోగింపబడిన యం. యన్. రాయ్‌తో సన్నిహిత సంబంధం కలవాడయ్యాడు.

ఈ సంఘంవారు ప్రభుత్వవశంలో ఉన్న ధనాన్ని మాత్రమే దోపిడి చేయవలసిందిగా తీర్మానించారు. ఈలాటి దోపిడీలు అనేకం జరిగినా వాటిలో రామప్రసాద్ నాయకత్వంలో జరిగిన కకోరి (Kakori) రైలుదోపిడి ప్రఖ్యాతి గాంచింది. ఇతడు 9 మంది అనుచరులతో కలిసి షహరన్‌పూరు లక్నో మార్గంలో ఒకరైలు ఎక్కి కకోరిస్టేషన్ సమీపంలో గొలుసు లాగి, రైలుబండి ఆగిపోగానే గార్డుపెట్టెలో ప్రవేశించి కొన్ని లక్షల సొమ్మును అపహరించాడు. అధికారులు వీరి ఆచూకీ తెలుసుకొని 41 పై కకోరికుట్ర కేసును పెట్టారు. ఒక సంవత్సర కాలం విచారణ జరిగింది. దీనిఫలితంగా నలుగురికి ఉరిశిక్ష, నలుగురికి ద్వీపాంతరవాస శిక్ష విధింపబడింది. కొందరికి 5 మొదలు 14 సంవత్సరాలు జైలుశిక్ష విధింపబడింది. శిక్షలు అతి దారుణమని ప్రజలు భావించి వాటిని తగ్గించవలసినదిగా ఆందోళన జరిపారు. ఉత్తరప్రదేశ్ శాసనసభలో ఇందునిమిత్తం అనధికార సభ్యులు ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. కాని ఫలితం లేకపోయింది. 1926 డిసంబరులో రామప్రసాద్ ఉరితీయబడినాడు. "బ్రిటిష్‌సామ్రాజ్యం పతనం కావడమే నా లక్ష్యం" అనే మాటలతో అతడు ప్రాణాలను కోల్పోయాడు. రోషన్ లాల్ అనే అతని సహచరుడు భగవద్గీతను చేతులో పెట్టుకొని, వందేమాతర మంత్రాన్ని ఉచ్చరిస్తూ ప్రాణార్పణం చేశాడు. అష్ఫక్‌ఉల్లా తనమెడలో కొరాన్‌ను ధరించి, "నేను భారతదేశ విముక్తికై ప్రయత్నించాను. నా మరణంతో ఈ ప్రయత్నం అంతరించదు" అని చెప్తూ ప్రాణార్పణం చేశాడు.

1927-30లో ఉద్యమం చాలావరకు చల్లారింది. విప్లవకారులలో హృదయ పరివర్తన కలిగిందనే భావంతో ప్రభుత్వం నిర్బంధింపబడిన వారిలో అనేకులను విడుదలచేసి. ఆర్డినెన్సులను కొన్నిటిని రద్దుచేసింది. కాని వారివైఖరిలో ఏలాటి మార్పూ రాలేదు. పరాయి ప్రభుత్వాన్ని నిర్మూలించడంలో వారి పట్టుదల తగ్గలేదు. దానిని సాగించడంలో అనుసరించదగిన కార్యక్రమాన్ని గురించి వారు ఆలోచించసాగారు. ఇందులో వారు కాంగ్రెసులో వామ పక్షానికి చెంది, యువకవర్గంపై ప్రభావం వహించిన జవహర్‌లాల్, సుభాష్ చంద్రబోస్‌లతో సంబంధం పెట్టుకొన్నారు. ఈ సంబంధం మూలంగా 1928 కలకత్తా కాంగ్రెసు సమావేశంలో మోతీలాల్ కమిటీ నివేదికలో సమర్థింపబడిన డుమినియన్ ప్రతిపత్తిని ప్రతిఘటించి, బ్రిటన్‌తో ఏలాటి సంబంధం లేని సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశలక్ష్యంగా ఉండవలెననే తీర్మానాన్ని ప్రతిపాదించారు. (ఇది 1929 లాహోరు కాంగ్రెసు సమావేశంవరకూ వాయిదా వేయబడినట్లు ఇదివరకే మనం తెలుసుకొన్నాము) ఇంతే గాక సమావేశకాలంలో అన్ని ఏర్పాటులు చేయుటకు నియమించబడిన వాలంటీర్ల దళంలో విప్లవకారులు సుమారు రెండువేల మంది చేరారు. వీరందరు సైనికదుస్తులను ధరించి, వాలంటీరు దళానికి సేనానాయకుడైన సుభాష్ చంద్రబోసు నాయకత్వంలో కృషి చేశారు. గాంధీ విధానాలకు, వీరివిధానాలకు గొప్ప భేదాలుండినా ఈ రెండువర్గాలవారి లక్ష్యం ఒకటే కావడంచేతను, విప్లవకారులు ప్రదర్శించిన

ధైర్యసాహసాలు, ఆత్మార్పణ సంసిద్ధత కాంగ్రెసువారిలో అనేకులు ప్రశంసించారు. ఈ రెండు వర్గాలవారు ఒకరిపై ఇంకొకరు ప్రభావం వహించడం గుర్తుంచుకోవలసి ఉంది.

1930 లో శాసనోల్లంఘన ఉద్యమం సాగుతున్న కాలంలో విప్లవకారులుకూడా వారి ఉద్యమాన్ని తిరిగి ప్రారంభించారు. వ్యక్తులను హత్యచేయడం వీరి కార్యక్రమంలో ఒక భాగమైనా ప్రభుత్వంతో ఒకవిధమైన గోరిల్లా యుద్ధాన్ని సాగించడం ఎక్కువ ప్రయోజనకరం కాగలదనే నిర్ణయానికి వీరు వచ్చారు. 1930 ఏప్రిలులో బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు సమావేశం రంగపూరులో జరుగుతున్నప్పుడు వీరుకూడా అక్కడే సమావేశమై వారి నూతన కార్యక్రమాన్ని సాగించుటకు నిశ్చయించుకొన్నారు. ఒకపర్యాయం చిట్టగాంగు, మైమన్‌సింగు, బారిసాల్ పట్టణాలలోని ఆయుధాగారాలపై దాడిచేసి, ఆయుధాలను వశపరచుకొని, ఆ పట్టణాలలో కొన్నిరోజులపాటైనా తమ పరిపాలనను సాగించడం వీరి ఉద్దేశం. ఇది కొనసాగిన పక్షంలో ప్రజలలో విప్లవభావాలు బలపడి, బ్రిటిష్ ప్రభుత్వానికి గొప్పదెబ్బ తగలగలదని వీరు భావించారు.

ఈ నిర్ణయ ప్రకారం సూర్యసేన్ నాయకత్వాన విప్లవకారులు హిందూస్థాన్ రిపబ్లిక్ ప్రజాసైన్యం పేరిట బ్రిటిషువారు దేశంలో సాగించిన ఘోరాలన్నిటిని వివరించి, వారి అధికారాన్ని నిర్మూలించే ఉద్దేశంతో యుద్ధానికి ఉపక్రమించినట్లు 1930 ఏప్రిల్ 18 న చిట్టగాంగులో ఒక ప్రకటనను గావించి రాత్రి పదిగంటల సమయంలో పోలీసు ఆయుధాగారంపైన, సహాయక సైనిక ఆయుధాగారంపైన (Auxiliary Force Armoury) పైన, యూరోపియన్ క్లబ్బుపైన, టెలిగ్రాఫు, టెలిఫోన్ ఎక్స్ఛేంజిపైన దాడిచేశారు. ఆయుధాగారాలను కాపలాకాస్తున్న ఇద్దరి ముగ్గురిని హత్యజేసి, మస్కెట్లు, రైఫిల్సు, రివాల్వర్లు, తుపాకులను వశపరచుకొని, వెలుపల ఒకకారులో ఉన్న ఉద్యోగులపైన వారి నౌకర్లపైన కాల్పులు జరిపి, ఆయుధాగారంపై పెట్రోలుపోసి నిప్పు అంటించి దగ్ధంచేశారు. టెలిఫోన్ ఎక్స్ఛేంజిని నాశనంచేశారు కాని టెలిగ్రాఫు ఆఫీసులో వారికృషి ఫలప్రదం కాలేదు. ఈ పనులు పూర్తిచేసుకొని, పోలీసుస్టేషన్‌లో సమావేశమై సూర్యసేన్ అధ్యక్షతన స్వాతంత్ర్య ప్రభుత్వం తాత్కాలికంగా ఏర్పడినట్లు ప్రకటించారు.

కొన్నిగంటలైనతర్వాత పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఒక సాయుధ పోలీసుదళంతో విప్లవకారులను ఎదుర్కొనగా వారు నగరాన్నుంచి కొండలవైపు పారిపోయి రెండు రోజులు అన్నపానాలు లేక తిరిగి 22 న జలాలాబాదు కొండపైన వారి బలాలను సమీకరించారు. ప్రభుత్వ సైన్యాలు వారిని ఎదుర్కొనగా మూడుగంటల కాలం యుద్ధం జరిగింది. అందు 11 విప్లవకారులు హతులయ్యారు. ప్రభుత్వపక్షంలో 64 గురు మరణించారు. ఈ యుద్ధం బెంగాలు రాష్ట్రమంతటా గొప్ప సంచలనం కలిగించింది. ప్రభుత్వంతో సాయుధ పోరాటాన్ని సాగించడం సాధ్యమనే భావం వ్యాపించింది. యువకు లనేకులు విప్లవసంఘాలలో చేరారు. స్త్రీలుకూడా ఉద్యమంలో పాల్గొనుటకు సిద్ధపడ్డారు. మే నెలలో అక్కడక్కడ విప్లవకారులు ప్రభుత్వ సైనికులు మధ్య సంఘర్షణలు జరిగాయి. అనేకులు హతులయ్యారు. అనేకులు ప్రభుత్వానికి పట్టుబడ్డారు. కాని సూర్యసేన్ తప్పించుకొని అజ్ఞాతంలో ఉండి, కార్యక్రమాలను సాగిస్తూవచ్చాడు.

చిట్టగాంగు దాడిచే యుగాంతర బృందంవారు ప్రభావితులై ప్రభుత్వాన్ని కలకత్తా లోను పరిసర ప్రాంతాలలోను ఎదుర్కొనుటకు ఒక బృహత్పథకాన్ని తయారుచేశారు. బాంబులను ప్రయోగించి కలకత్తా క్లబ్బులలోను, సినీమాలలోను, హోటళ్ళలోను కనుపించిన యూరోపియనులను హత్యచేయుట. విమానాశ్రయాన్ని దగ్ధం చేయుట, పెట్రోలు బంకులను నాశనంచేయుట. కలకత్తాలోని ట్రాం బండ్ల రాకపోకలను టెలిగ్రాపు సౌకర్యాలను నిరోధించుట. రైలు వంతెనలను, పట్టాలను నాశనంచేయుట—ఇవీ ఈ పథకంలోని ప్రధాన అంశాలు. కాని ఇవి అన్నీ ఆచరణసాధ్యంకాలేదు. అయినా మొత్తంమీద 1930-1931-1932 లలో విప్లవ చర్యలు ప్రధానంగా బెంగాలలో భారీఎత్తున సాగినాయి. 1933లో ఇవి కొంత తగ్గుముఖం పట్టినా పూర్తిగా తగ్గలేదు.

ఈ చర్యలలో కొన్ని ప్రజలదృష్టిని ఆకర్షించాయి. ఇద్దరు యువతులు బెంగాలు గవర్నరులు జాక్సన్, ఆండెర్సనులను హత్యచేయుటకు ప్రయత్నించారు. పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ తాముూన్‌నును, పోలీసు సూపరిండెంట్ హాడ్సన్‌ను తుపాకులతో కాల్చి చంపారు. ముగ్గురు విప్లవకారులు కలకత్తాలోని ప్రభుత్వకార్యాలయంలో ప్రవేశించి పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ సింప్సనును హత్యచేశారు; మరి ఇద్దరు అధికారులు గాయపడినారు. ముగ్గురు జిల్లా కలెక్టర్లు, ఒక జిల్లాజడ్జి, ఒక పోలీసు సూపరెంటెండెంటు(వీరందరు యూరోపియన్లు)ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు హత్యచేయబడినారు. పోలీసు కమీషనరు టెగార్టు, ఢక్కా కమీషనరు కాసెల్సు, ఢక్కా పోలీసు సూపరెంటెండెంటు, ఢక్కా కలెక్టరు రాజషాహి జైలు సూపరెంటెండెంటు ల్యూక్, యూరోపియన్ సంఘాధ్యక్షుడు విలియర్సు, స్టేట్సుమాన్ పత్రిక సంపాదకుడు వాట్సన్—వీరిని హత్యచేయుటకు జరిగిన ప్రయత్నాలు విఫలమునైనాయి.

చిట్టగాంగు దాడి జరిగిన తర్వాత సూర్యసేన్ నాయకత్వంలో మూడు సంవత్సరాల కాలం విప్లవచర్యలు కొనసాగుతూనే వచ్చాయి. దాడిసంవత్సరంలో అరెస్టయినవారిలో 14 గురు ద్వీపాంతర శిక్షకు పాత్రులైనారు. సూర్యసేన్ నలుగురు అనుచరులతో ఒక గ్రామంలో దాగి ఉండగా కామిరాన్ నాయకత్వంలో పోలీసులు దానిపై దాడిచేశారు. అప్పుడు గొప్ప సంఘర్షణ జరుగగా ఇద్దరు విప్లవకారులు, కామిరానూ ప్రాణాలను కోల్పోయారు. సూర్యసేన్, ఇద్దరు యువతులు తప్పించుకొని పారిపోగలిగారు.

పారిపోయిన యువతి ప్రతిలత కొందరి అనుచరులతో చిట్టగాంగులోని యూరోపియన్ క్లబ్బులో 1932 సెప్టంబరు 22న ప్రవేశించి, బాంబులనుపేల్చి తుపాకులను కాల్చగా ఒక యూరోపియన్ స్త్రీ మరణించింది. పదముగ్గురు గాయపడినారు. ప్రతిలతపై కాల్పులు జరిగాయి. అప్పుడు ఆమె విషాన్నిమ్రింగి చనిపోయింది. తక్కినవారు తప్పించుకోగలిగారు.

1933 ఫిబ్రవరిలో సూర్యసేన్ ఒక గ్రామంలో దాగిఉండగా పోలీసులు అతనిని పట్టుకొనుటకు ప్రయత్నించారు. అతడు వారితో పోరాడి, తప్పించుకొనిపోయి ఒక మడుగులో ఉండగా ఘూర్కాసిపాయి అతనిని పట్టుకొన్నాడు. అతనికి ఉరిశిక్షను విధించారు. కాని అతని నివాసాన్ని పోలీసులకు తెలియపరచిన వానిని విప్లవకారులు హత్యచేశారు. సూర్యసేన్ మరణానంతరం బెంగాలులోని విప్లవ ఉద్యమం తీవ్రతను కోల్పోయింది.

ఉద్యమాన్ని అణచుటకు కొత్త ఆర్డినెన్సులనేకం అమలులోకి వచ్చాయి. వీటిని సంఘటితపరచి 1930 లో ఒక చట్టాన్ని చేశారు. దానిఫలితంగా 1933 ఆఖరుకు 1639 మంది జైలుశిక్షలకు ఇతర నిర్బంధాలకు గురి అయ్యారు. ఇదిగాక 1818 చట్టంక్రింద 19 మంది నిర్బంధింపబడినారు. 1932-34 లో మరికొన్ని ఆర్డినెన్సులు జారీచేయబడినవి. 1934 లో వీటన్నిటిని కలిపి శిక్షాస్మృతి సవరణ చట్టం అనే పేరిట ఒక చట్టాన్ని చేశారు. దారుణములైన ఈ చట్టాల ఫలితంగా కలెక్టరు మొదలైన అధికారులకు అనుమానాస్పదులను అరెస్టుచేసి, నిర్బంధించుటకు. ఆస్తులను వశపరచుకొనుటకు. ప్రజలపై సామూహిక జరిమానాలను విధించుటకు నిర్బంధితులను వెంటనే విచారణచేసి. శిక్షించుటకు వీలుగా ప్రత్యేక న్యాయస్థానాలను ఏర్పాటుచేయుటకు. అవసరమని తోచిన ఇతరచర్యలను తీసుకొనుటకు సంపూర్ణాధికారం లభించింది. వీటిఫలితంగా విప్లవచర్యలు కొంతవరకు తగ్గినవి.

1933 ఆఖరున ప్రభుత్వం పరిస్థితులను సమీక్షిస్తూ. "ఇటీవల అరెస్టులవల్ల హత్యలసంఖ్య కొంత తగ్గినా మొత్తంమీద దేశమంతటా విప్లవ వాతావరణం వ్యాపించింది. అక్షరాస్య వర్గాలందరిలోకి విప్లవభావాలు చొచ్చుకొనిపోయాయి. కొంతవరకు నిరుద్యోగ సమస్య దీనికి కారణమైనా వార్తాపత్రికల ప్రచారం, సహాయనిరాకరణోద్యమం, శాసనోల్లంఘన ఉద్యమం ఎక్కువ ప్రభావాన్ని వహించాయి. గాంధీ అనుచరులకు అహింసయందు విశ్వాసం ఉన్నా ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించడంలో అధర్మంగాని, నీతికివిరుద్ధంగాని ఏదీ లేదనే వారితత్వం ప్రభుత్వంపట్ల ప్రజలకు భయంగాని గౌరవంగాని లేనట్లు వారిని మార్చింది. విద్యార్థులలో విప్లవభావాలు పూర్తిగా నాటుకొన్నాయి. అన్ని విద్యాలయాలలో విప్లవబృందాలు ఏర్పడినాయి. పోలీసువారు వీరి ఆచూకీని తెలుసుకొనడం సాధ్యంకాలేదు. యువకులనేకులు ఉద్యమంలో పాల్గొనడం ఇంకొక విచారకరమైన పరిణామం" అని ఒక నివేదికను ప్రకటించింది. ఒకవైపు శాసనోల్లంఘన ఉద్యమాన్ని, ఇంకొకవైపు విప్లవఉద్యమాన్ని ప్రభుత్వం ఏకకాలంలో ఎదుర్కొనవలసి వచ్చింది. ఉద్యమాలు వెంటనే పరాయిప్రభుత్వాన్ని నిర్మూలించ లేకపోయినా అనేక విధాలుగా దానికి కష్టాలను నష్టాలను చేకూర్చగలిగాయి.

విప్లవకారులు బెంగాలులో 1930-33 లో 23 ఉద్యోగులను 20 అనధికారులను హత్యచేశారు. 167 దోపిడీలను సాగించారు. 24 పర్యాయాలు బాంబులను ప్రయోగించారు. విప్లవకారులలో 30 మంది హతులయ్యారు.

విప్లవ ఉద్యమానికి బెంగాలు ప్రధాన కేంద్రమైనా తక్కిన రాష్ట్రాలలో కూడా దీనికి ప్రభావం లేకపోలేదు. ఉత్తర ప్రదేశ్‌లోని విప్లవకారులు 1925 లో కకోరి రైలుదోపిడిని ఏ విధంగా సాగించి శిక్షలను అనుభవించారో మనం ఇదివరకే తెలుసుకొన్నాము. ఆటు తర్వాత పోలీసులు నిరంకుశంగా ప్రవర్తించి అనేకులను పట్టుకొన్నారు. వారి దౌర్జన్య విధానం యువకులను భయభ్రాంతులుగ చేయడంవేత ఉద్యమం తీవ్రతను కోల్పోయింది. అలాటి పరిస్థితులలో చంద్రశేఖరఅజాద్ అనే యువకుడు రంగంలోకి ప్రవేశించి ఉద్యమానికి ప్రాణం పోశాడు. అనుచరులనేకులను ఆకర్షించాడు. విప్లవ సంఘం పేరు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ సంఘం అని మార్చాడు. బ్రిటిష్ అధికారం నిర్మూలమై స్వరాజ్యం ఏర్పడిన తర్వాత సోషలిస్టు సిద్ధాంతాలకు అనుగుణంగా భారతరాజ్యం నిర్మాణం కావలెననేది దీని లక్ష్యం. సంఘాన్ని

పునర్నిర్మాణం చేసి అనేక విప్లవ చర్యలను సాగించినారు. 1928 ప్రాంతాన దేశంలో ఆర్థిక పరిస్థితులు దిగజారి సాగాయి. బొంబాయి, కాన్‌పూరు, కలకత్తా నగరాలలో కార్మికులు సమ్మెల లోకి దిగారు. ఇదికూడా విప్లవభావాన్ని బలపరచింది.

ఆజాద్ నాయకత్వంలో జరిగిన హత్యలన్నిటిలో లాహోరు నగరంలోని పోలీసు అధికారి హత్య ప్రసిద్ధి గాంచింది. ఈ హత్యను చేసినవాడు భగత్‌సింగు. సైమన్ కమీషన్ 1928లో లాహోరు వెళ్ళిన సందర్భంలో ఏర్పాటైన బహిష్కరణ ఊరేగింపులో లజపతిరాయికి లాఠీదెబ్బలు తగిలి, తర్వాత కొంత కాలానికి—1928, నవంబరు 17న ఆయన మరణించాడు. ఈ లాఠీదెబ్బలకు సాండర్సు కారకుడనే భావం వ్యాపించింది. అందుచేత విప్లవకారులు అతనిని హత్యజేయడం అవసరమని భావించి అందుకుగాను యువకుడైన భగత్‌సింగును నియమించారు. అతడు పట్టపగలు నిర్భయంగా సాండర్సును కాల్చి, చంపి, తప్పించుకొని వెళ్ళిపొయ్యాడు.

ఈ హత్య ఫలితంగా లాహోరు ప్రజలపై పోలీసువారు అనేక కఠిన చర్యలను తీసుకొన్నారు. వాటిని భరించలేక వారిలో కొందరు, హత్యలను గావించి తప్పించుకొన్న విప్లవ కారులు పారిపోవడము. ప్రతిఫలాన్ని ప్రజల అనుభవించడమూ జరుగుచున్నదని గొణగ సాగారు. ఈలాటి మాటలు భగత్‌సింగు మొదలైనవారి చెవులలో పడగా వారు ఈ పర్యాయం బాంబును ప్రేల్చి, తామే ఉరి శిక్షకు పాత్రులు కావడం ఉచితమని నిర్ణయించుకొన్నారు. ఇంతేగాక 1921లో సహాయ నిరాకరణోద్యమం ఉపసంహరింపబడిన తర్వాత దేశంలో రాజకీయ చైతన్యం చాలావరకు నశించింది. పరాయి పరిపాలనపై తిరుగుబాటు చేసే ధోరణి ప్రజలలో తగ్గింది. విప్లవకారులకు ఈ ధోరణి చాలా అసంతృప్తిని కలిగించింది. ప్రజలలో స్వాతంత్ర్య తృష్ణను తిరిగీ రేకెత్తించడం తమ ధర్మంగాను. దానికి దేశాన్నంతా ఆకర్షించగల ఒక విప్లవ కృత్యం తగిన సాధనంగాను వారు భావించారు.

దీనిని ఆచరణలో పెట్టుటకు భగత్‌సింగు, అతని సహచరుడు బటుకేశ్వరదత్తా నియోగింపబడినారు. 1929, ఏప్రిలు 8న ఢిల్లీలో కేంద్ర శాసనసభ సమావేశమై కార్మికులు సమ్మెచేసే హక్కును తగ్గించుటకు ఉద్దేశింపబడిన బిల్లు నొకదానిని గురించి వోటుచేయవలసి ఉండినది. ఇదిగాక కమ్యూనిస్టులను అణచివేయదలచి ఇంకొక బిల్లును కూడా ప్రభుత్వం ఆనాడే ప్రవేశ పెట్టదలచింది. దీనిని ప్రవేశపెట్టడం అనుచితమనే అభిప్రాయాన్ని సభాధ్యక్షుడైన విఠల్ భాయిపటేల్ వ్యక్తంచేసి, దాని ప్రవేశాన్ని ప్రతిఘటిస్తాడనే అభిప్రాయం దేశంలో వ్యాపించి ఉండినది. ఈ రెండు కారణాలచే ఏప్రిలు 8 సమావేశం దేశంలోని ప్రజలందరి దృష్టిని ఆకర్షించింది.

ఆలాటి రోజున శాసన సభలో ప్రవేశించి బాంబును ప్రయోగించవలసిందిగా భగత్‌సింగు బటుకేశ్వర్లు తీర్మానించుకొన్నారు. వారి ఉద్దేశం ఎవరినీ హత్యచేయడంకాదు, బాంబులను ప్రయోగించి. తాము ప్రాణత్యాగాన్ని చేయ సంసిద్ధులుగా ఉన్నట్లు ప్రజలకు విశదపరచి, దేశంలో రాజకీయ సంచలనాన్ని కలిగించడం అవసరమని భావించి వారీ కార్యానికి పూను కొన్నారు. వారు శాసన సభను ప్రవేశించి కార్మిక సమ్మెల చట్టంపై వోటింగు జరిగినవెంటనే శాసనసభ మధ్య భాగంపై మొట్టమొదట భగత్‌సింగు, తర్వాత బటుకేశ్వరు ఒక్కొక బాంబును ప్రేల్చారు. ఎవరికో కొందరికి స్వల్పగాయాలు తగిలాయి. బాంబులు ప్రేల్చినవారు వెంటనే

తప్పించుకొనిపోగల అవకాశం ఉండినా వారు అక్కడే నిలబడి "విప్లవం శాశ్వతంగా వర్ధిల్లుగాక", "సామ్రాజ్య తత్వం పతనమైపోవుగాక" అనే నినాదాలతో హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ సంఘపు ఎరుపు కరపత్రాలు రెంటిని సభలో విసరారు. ఇంతలోనే పోలీసువారు వారిని అరెస్టుచేసి తీసుకొని వెళ్ళిపోయ్యారు. "విప్లవం శాశ్వతంగా వర్ధిల్లుగాక" అని వారు లేవదీసిన నినాదం "ఇంక్విలాబ్ జిందాబాద్" అనే మాటలతో దేశంలో విప్లవ నినాదంగా స్థిరపడి పోయింది.

కోర్టులో వారి విచారణ 1929 మే 7 న ప్రారంభమై జూన్ 12 న ముగిసింది. ఆ సందర్భంలో వారిద్దరు కలిసి కోర్టు వారికి నివేదించిన వాఙ్మూలం వారి విప్లవ సంఘంయొక్క ఉద్దేశాలను స్పష్టపరచింది. ఆనాడు దేశంలో వ్యాప్తిగాంచిన విప్లవ తత్వాన్ని అర్థంచేసుకొనుటకు పై రెండు కరపత్రాలు ఈ వాఙ్మూలము గొప్ప సాధనములు. విప్లవంయొక్క ఉద్దేశం బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని నిర్మూలము చేయుటమేగాక సామాన్యప్రజల శ్రేయస్సును వృద్ధి చేయగల వర్గరహిత సోషలిస్టు సమాజాన్ని స్థాపించుటయని వారు పేర్కొన్నారు. విచారణ ఫలితంగా వారికి ద్వీపాంతరవాస శిక్ష విధించబడింది.

ఈ మధ్య కాలంలో 70.000 బాంబులు తయారు చేయుటకు కావలసిన ముడిపదార్థాలతోకూడిన ఒక ఫ్యాక్టరీని లాహోరులో పోలీసువారు కనుగొన్నారు. తర్వాత షహరన్‌పూరులోని అలాటి ఫ్యాక్టరీ ఇంకొకటి వారికి కనపడింది. ఈ సందర్భంలోవారు అనేకులను అరెస్టు చేశారు. వీరిలో కొందరు విప్లవ సంఘంయొక్క రహస్యాలను, దానిలో పాల్గొనుచున్న వారిపేర్లను వెల్లడిచేశారు. పోలీసు అధికారి సాండర్సును హత్య చేసినవారు భగత్‌సింగు అనేదికూడా వెల్లడి అయింది. వీరందరిపై లాహోరు కుట్ర కేసు పెట్టబడి. భగత్‌సింగు బతుకేశ్వర దత్తులను లాహోరు జైలుకు తీసుకొని వెళ్లారు.

విచారణ కాలంలో వీరు నిరాహార దీక్షను ప్రారంభించారు. బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని రూపుమాపుటకు చక్రవర్తిపై వీరు యుద్ధాన్ని సాగించారనే నేరం వీరిపైన ఆరోపింపబడిన కారణంగా తాము యుద్ధ ఖైదీలని, యుద్ధ ఖైదీలకు ఉండవలసిన సదుపాయాలన్నీ తమకు ఉండటం ఉచితమని, ఇదీగాక రాజకీయ ఖైదీలకు ప్రత్యేక సదుపాయాలు ఉండవలెనని వీరు ఈ దీక్షను చేపట్టారు. వీరితో కలిసి నిర్బంధితులుగా ఉన్నవారుకూడా ఇదే విధంగా ప్రవర్తించారు. వారిలో కలకత్తాకు చెందిన జతీంద్రనాథదాసు ఒకడు. సుమారు రెండు నెలలు గడచిన తర్వాత ప్రభుత్వం రాజీకివచ్చి కొన్ని సదుపాయాలను కల్పించగా జతిన్‌దాసు తప్ప తక్కిన వారందరు ఉపవాసాన్ని విరమించినారు. అతడు మాత్రం 63 రోజులు ఉపవాసాన్ని సాగించి మరణించాడు. ఈ మరణవార్త దేశమందంతట గగ్గోలు పుట్టించింది. అతని మృతకళేబరానికి జోహారు లర్పించుటకు జైలు వెలుపల లక్షలాది జనం గుమికూడారు. అది అంత్యక్రియలకై కలకత్తాకు తీసుకొని పోబడినపుడు మార్గంలో రైలు ఆగిన ప్రతి స్టేషనులోను వేలాది జనం గుమికూడి జోహారు లర్పించారు. కలకత్తాలో ఆరులక్షల జనం మృతదేహాన్ని ఊరేగింపుతో తీసుకొని వెళ్ళి దహనక్రియలో పాల్గొన్నారు. ఆనాడు దేశంలో విప్లవవాదులపట్ల ప్రజలకు ఎంతటి గౌరవాభిమానాలు ఉండినదీ ఈ ఉదంతం స్పష్టం చేస్తున్నది.

భగత్‌సింగు మొదలైనవారు, పోలీసువారి ప్రవర్తనకు నిరసనగా విచారణ కాలంలో కోర్టుకు హాజరుకావడం నిరాకరించారు. బలవంతంగా వారిని హాజరుపెట్టడం సాధ్యంకాలేదు.

నేరస్థులు కోర్టుకు రాకపోయినా వారిని విచారణ చేయుటకు అనుకూలంగా ప్రభుత్వం ఒక ఆర్డినెన్సును జారీచేసి, నామకార్థం విచారణ జరిపించింది. 1930 అక్టోబరు 7 న కోర్టువారు తీర్పు చెప్పారు. దీనిఫలితంగా భగత్‌సింగు, సుఖదేవ్, రాజగురులకు ఉరిశిక్ష, మహావీర్ తివారి విజయకుమార్‌సిన్‌హా (ప్రస్తుతం హైదరాబాదు నివాసి)లకు ద్వీపాంతరవాస శిక్ష, అనేకులకు దీర్ఘకాల జైలుశిక్షలు విధించారు. భగత్‌సింగు జైలునుండి తప్పించుకొని పోవుటకు తోడిఖైదీలు కొందరు ఉపాయాన్ని పన్నినారు. కాని అతడు తప్పించుకొనిపోయి ఉద్యమాన్ని అప్రతిష్టపాలు చేయడం ఇష్టపడలేదు. ఉరిశిక్షను రద్దు చేయించుటకు ఒడంబడిక సంప్రతింపులు కాలంలో గాంధీ కొంత ప్రయత్నం చేశాడు. కాని ఇర్విన్ దానికి అంగీకరించలేదు. తుదకు 1931 మార్చి 23 న ఉరితీయబడినాడు.

ప్రజలు అతని మృతదేహాన్ని తమకు ఒప్పించవలసిందిగా కోరారు. కాని దీన్ని నిరాకరించడమేగాక దానిని ముక్కలు ముక్కలుగాచేసి, ఒక గోనెసంచిలోపెట్టి, రహస్యంగా ఫిరోజ్‌పూరుకుతీసుకొనివెళ్ళి సట్లేజ్‌నదీతీరంలో దహనంచేసి,దేహం పూర్తిగాకాలకముందే నదిలో పారవేశారు. గ్రామస్థులు కొందరు ఆ సమయంలో అక్కడ ఉండినారు. ఈ దృశ్యాన్ని చూచి చింతించలేక పోలీసువారు వెళ్ళిపోయిన వెంటనే కాలీకాలని శరీరాన్ని వెలుపలికితెచ్చి మంత్ర పూర్వంగా దహనంచేసి, అస్తికలను చితాభస్మాన్ని నదిలో కలిపారు.

"ఆ రోజులలో భగత్‌సింగు నామము భారతదేశము నలుమూలల గాంధీజి పేరువలె విఖ్యాతమైపోయెననుట అతిశయోక్తి కాదు," అని పట్టాభి సీతారామయ్యగారు వారి కాంగ్రెసు చరిత్రలో వ్రాశారు. ఈ వాక్యంలో ఎంతైనా సత్యం ఉన్నది. శాసనోల్లంఘన ఉద్యమం ప్రజల ప్రశంసకు పాత్రమైనట్లే విప్లవ ఉద్యమం కూడా వారి ప్రశంసకు పాత్రమైంది. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని లాటీ దెబ్బలకు, తుపాకి కాల్పు లకు, జైలు బాధలకు గురిఅయిన వారిపట్ల ప్రజలు ఏలాటి గౌరవాభిమానాలను ప్రదర్శించారో విప్లవ ఉద్యమంలో పాల్గొని దేశవిముక్తికై అసువులు కోల్పోయిన భగత్‌సింగు సూర్యసెన్, చంద్రశేఖర ఆజాద్ మొదలైన వారిపట్ల ప్రజలు అలాటి గౌరవాభిమానాలనే ప్రదర్శించారు. దేశవిముక్తికి దౌర్జన్యరహితమైన పోరాటం సాధనమైనట్లే దౌర్జన్య సహితమైన విప్లవ ఉద్యమం కూడా సాధనమని వారు భావించారు. తాత్కాలికంగా ఈ రెండు సాధనాలు ఫలప్రదం కాలేదు కాని భవిష్యత్తులో బ్రిటిష్‌వారు దేశాన నుండి వెళ్ళిపోయి స్వరాజ్యం లభించడంలో రెండు సాధనాలు ప్రభావం వహించాయి.

లాహోరు కుట్ర కేసు ఫలితంగా ఉద్యమం కార్యకలాపాలకు కేంద్రంగా ఉండిన హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ సంఘానికి చావు దెబ్బ తగిలింది. దాని నాయకులలో అయి దాస్గురు తప్ప తక్కినవారంతా ఉరిశిక్షకో జైలుశిక్షలకో పాత్రులయ్యారు. వీరుకూడా అజ్ఞా తంగా సంచరించవలసి వచ్చింది. సంఘానికి చాలాకాలాన నుండి నాయకుడుగా ఉండిన చంద్ర శేఖర ఆజాద్ రహస్యంగా ఉద్యమ కార్యకలాపాలను సాగిస్తూనే వచ్చాడు. లాహోరు కుట్ర కేసుకు జవాబుగా 1929 డిసెంబరులో వైస్రాయి ప్రయాణం చేస్తున్న రైలుబండి పట్టాలపై బాంబు ప్రేలే ఏర్పాటులు చేశారు. అది ప్రేలడం మూలంగా బండికి కొంత నష్టం కలిగిందిగాని వైస్రాయికి ఏలాటి ప్రమాదం సంభవించలేదు.

ఆజాద్ సాయుధపోరాటాన్ని తలపెట్టి, దానికి అవసరమైన ఆయుధాలను ధనాన్ని సమకూర్చుకొనుటకు 1930 జూలైలో ఢిల్లీలోని ఒక వ్యాపార కేంద్రంపై దాడిచేసి రు 14,000 లు సేకరించాడు. ఈ సందర్భంలో అరెస్టయినవారు కొందరు ఆజాదు గురించిన రహస్యాలను బయటపెట్టారు. తర్వాత కొన్ని రోజులకు బాంబులను సేకరించిన అతని అనుచరులలో ఒకడు పోలీసులకు పట్టుబడినాడు. ఢిల్లీలో బాంబులు తయారుచేసే ఫ్యాక్టరీకూడా పోలీసులు కనుగొన్నారు. వీటిఫలితంగా ఆజాద్‌తోసహా అనేకులపైన రెండవ లాహోరు కుట్రకేసు ఢిల్లీ కుట్రకేసు పెట్టబడినాయి. ఆజాద్ మాత్రం పోలీసువారికి చిక్కలేదు. రహస్యంగా ఢిల్లీనుండి పంజాబుకు వెళ్ళి అనేక బాంబుల ప్రయోగానికి ఏర్పాటు చేశాడు. కొందరు ఉద్యోగులు దారుణంగా హతులయ్యారు; కొందరు గాయపడినారు. కాని పోలీసులు, వారి గూఢచారులు సర్వదా ఆజాద్‌పై కన్నువేసి ఉండడంచేత అతడు ఒకచోట ఉండడం సాధ్యంకాక దేశసంచారి కావలసివచ్చింది. 1931 ఫిబ్రవరి 27 న అతడు అలహాబాదుపార్కులో ఒక పాత స్నేహితునితో ఉండగా పోలీసు వారికి అది తెలియవచ్చి, పంద్రెండుగురు సాయుధులై అతనిని ముట్టడించారు. అప్పుడుకూడ అతడు వారికి లొంగక తుపాకి గుండ్లను కాల్చి ఇద్దరు ఉద్యోగులను హతమార్చాడు. కాని వారు కాల్చిన గుండ్లు అతనికి తగిలి ప్రాణాలను కోల్పోయాడు. దీని ఫలితంగా ఉద్యమ కారులు ఉద్యమంపట్ల ఆశాభంగాన్ని పొంది, వారి చర్యలను విరమించుకొన్నారు. అనేకులు కాంగ్రెసులోను, కొందరు కమ్యూనిస్టుపార్టీలోను చేరారు. కొందరు పోలీసుల తరపున గూఢచారులుగా పని చేశారు. 1931-34 లో కూడా అక్కడక్కడ బాంబు ప్రేలుళ్ళు, హత్యలు, హత్యాప్రయత్నాలు జరిగినా, మొత్తంమీద ఆజాదు మరణంతో ఉత్తరప్రదేశ్‌లోను పంజాబులోను ఉద్యమం అంతరించినట్లు చెప్పవచ్చు.

ఇదే కాలంలో కొంతవరకు విప్లవ ఉద్యమం బొంబాయి, మధ్యప్రదేశ్, మద్రాసు, రాజపుటానా మొదలైన ప్రాంతాలకుకూడా వ్యాపించింది. బొంబాయిలోను అహమ్మదాబాదులోను బాంబులు తయారుచేసే ఫ్యాక్టరీలు స్థాపింపబడినాయి. 1930 జూలైలో పూనాలోని ఫెర్గుసన్ కాలేజికి అతిథిగా వచ్చిన బొంబాయి గవర్నరును హత్యచేసే ప్రయత్నం జరిగింది. బొంబాయి, అహమ్మదాబాదులలో సాగిన సమ్మెల సందర్భంగా అక్కడక్కడ బాంబు ప్రేలుళ్లు కూడా సంభవించాయి. కాని ఉత్తరహిందూస్థానంలో జరిగినంత తీవ్రంగా ఈ రాష్ట్రాలలో ఉద్యమం జరగలేదు.

విప్లవ ఉద్యమాన్ని సాగించిన వారికి బ్రిటిష్‌వారు "ఘాతకులు"(Terrorists) అని పేరుపెట్టి, వారిని హంతకులని దోపిడీదారులని చిత్రించడం పరిపాటి అయింది. కాని ఇందులో ఏలాటి సత్యంలేదు. వారి మూలంగా తమ ప్రభుత్వానికి గొప్ప ప్రమాదం ఏర్పడడంచేత వారిని బ్రిటిష్‌వారు ఈ విధంగా చిత్రించడంలో ఆశ్చర్యపడవలసిందిలేదు. స్వార్థాన్ని ఆశించి వారు ఈ చర్యలలోకి దిగినవారుకారు. వారు ఉన్నతస్థాయికి చెందిన దేశాభిమానులు; వారిలో అనేకులు విద్యాధికులు; సంస్కారంగలవారు; దేశవిముక్తికై నిరంతరం పాటుపడినవారు. వారు ఐచ్ఛికంగా ప్రాణార్పణ చేయుటకు సిద్ధపడినవారు. గాంధీ అనుసరించిన అహింసా విధానం మూలంగా ఆయన భావించినట్లు బ్రిటిష్ వారికి హృదయపరివర్తనం కలగడం ఎన్నటికీ జరగదని వారు విశ్వసించారు. ప్రజలకుకూడా అది ఆచరణ సాధ్యంకాదని,దానిని ఆధారం చేసుకొని

స్వాతంత్ర్య సమరాన్ని సాగించడం ఆకాశంలో భవననిర్మాణ ప్రయత్నం వంటిదని, ఉన్నత ఆశయాన్ని సాధించుటకు బలప్రయోగం చేయటం నీతివిరుద్ధంకాదని, గీత మొదలైన మతగ్రంథాలు ఈలాటి బలప్రయోగాన్ని సమర్థిస్తున్నవని భావించి వారు విప్లవ ఉద్యమాన్ని సాగించారు.

కాలక్రమాన వారి ఆశయం విశాలతరమైంది. తమ లక్ష్యం పరాయిపరిపాలనని తొలగించడం మాత్రమేకాదని. దాని స్థానేదేశంలో సర్వమానవ సమత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని ఆధారంగా నవసమాజాన్ని నిర్మించడమనిన్నివారు ప్రచారంచేశారు. వారి సంఘనామధేయంలో "సోషలిస్టు" అనే మాటను చేర్చడం దీనికి తార్కాణం. భగత్‌సింగు బటుకేశ్వర్లు వారి వాఙ్మూలంలో దీనిని స్పష్టం చేశారు. బాంబులు తయారుచేయడంలోను పోరాటాన్ని సాగించడంలోను వారు కాలక్రమంగా ఎక్కువ సాంకేతిక నైపుణ్యాన్ని ప్రదర్శించారు. చిట్టగాంగు ఆయుధాగారాలపై దాడి దీనికొక నిదర్శనం. బ్రిటిష్‌వారిపై గొరిల్లా యుద్ధాన్ని సాగించుటకు వారు సంకల్పించారు. మొగలు సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయడంలో శివాజీ ఈలాటి యుద్ధాన్ని సాగించాడు. వీరికి శివాజి మార్గదర్శకుడయ్యాడు.

విప్లవ ఉద్యమం ప్రజల ఆమోదాన్ని గౌరవాభిమానాలను సంపాదించగలిగింది. ఉరిశిక్షకు ఇతర శిక్షలకు గురియైన విప్లవకారులను ప్రశంసిస్తూ దేశమంతటా ప్రజలు నిషేధాజ్ఞలను ఉల్లంఘించి సమావేశాలను జరిపడం దీనికి ప్రబల తార్కాణం. ఉద్యమం మూలంగా ప్రజలలో రాజకీయ చైతన్యం, స్వాతంత్ర్య సంపాదనపట్ల దీక్ష, పరాయిపరిపాలనపట్ల ద్వేషం బలపడినాయి. విప్లవకారులు ప్రధానంగా ఆశించిన ఫలితాలు ఇవే. ఇవి కాలక్రమాన పరాయిపరిపాలన అంతరించుటకు స్వరాజ్యం లభించుటకు దారితీశాయి.

విప్లవ ఉద్యమ ప్రభావం 1942-44 "క్విట్ ఇండియా" ఉద్యమంలో స్పష్టంగా కనుపించింది. స్వాతంత్ర్య పోరాటంలో ఇది తుదిఘట్టం. ఇందులో అహింసావాదులతోపాటు దౌర్జన్యవాదులుకూడా పాల్గొన్నారు.

ఈ విధంగా విప్లవ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒక ప్రధానస్థానాన్ని సంపాదించింది.

చదువవలసిన గ్రంథములు :

Bhavan: Vol. xi
Tarachand, Vol. iv
పట్టాభి సీతారామయ్య: కాంగ్రెసు చరిత్ర
R. C. Mazumdar: History of the Freedom Movement in India Vol, iii
Manmathanath Gupta: History of the Indian Revelutionary Movement

# అధ్యాయము-12

## 1929-39 లోని పరిణామాలు

శాసనోల్లంఘన ఉద్యమం సాగుతున్న కాలంలోను, ఆటుతర్వాత అయిదారు సంవత్సరముల వరకు దేశంలో జరిగిన ఇతర రాజకీయ పరిణామాలు స్వాతంత్ర్యోద్యమ చరిత్రపై అధిక ప్రభావాన్ని వహించినాయి. వాటిని గురించి ఇప్పుడు తెలుసుకొనవలసి వుంది.

## 1

జాతీయఉద్యమం ప్రారంభమైనప్పటినుండి బ్రిటిష్ పరిపాలకులు దానిని ప్రతిఘటించుటకు రెండువిధానాలను అనుసరించారు. అందులో మొదటిది దమనవిధానం. దీనిమూలంగా వారు ఉద్యమాన్ని అణచివేయుటకు సంకల్పించారు. దీనితోపాటు వారు కొన్ని రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజలలో కొన్ని పక్షాలకు చెందినవారిని కొన్నివర్గాలవారిని తమకు అనుకూలంగా చేసుకొన ప్రయత్నించారు. మింటో, హార్డింజి ఈ విధానాలను వినియోగించి వందేమాతర ఉద్యమాన్ని విప్లవ ఉద్యమాన్ని అణచుటకు ప్రయత్నించినదీ, మింటోమార్లె సంస్కరణలు ఈ ప్రయత్నంలో ఒకభాగమైనదీ మనం ఇదివరకే తెలుసుకొన్నాము. హోమ్ రూల్ ఉద్యమాన్ని అణచుటకు చెమ్స్‌ఫర్డు మాంటేగులు ఈ విధానాన్ని అనుసరించారు. ఆ కాలంలో వారు అనేకులను నిర్బంధించుటతో సహా మాంటేగు చెమ్స్‌ఫర్డు సంస్కరణలను ప్రవేశపెట్టారు.

శాసనోల్లంఘన ఉద్యమం సాగుతున్న కాలంలో కూడా అధికారులు ఈ విధానాలనే అనుసరించారు. దారుణమైన ఆర్డినెన్సులను, వాటికి ఆధారములైన సాయుధ పోలీసులను, సైనికులను వినియోగించి వందలాది జనానికి ప్రాణనష్టము, వేలాది జనానికి నరకబాధలతో కూడిన నిర్బంధము కలిగించారు. దీనితోపాటు లిబరల్‌పక్షానికి చెందినవారిని, ముస్లింలవంటి అల్పసంఖ్యాక వర్గాలను తృప్తిపరచే ఉద్దేశంతో రాజకీయ సంస్కరణలను కొన్నిటిని ప్రవేశపెట్ట సంకల్పించి "భారతదేశ ప్రభుత్వ చట్టము"ను 1935 లో (Government of India Act 1935) చేశారు.

ఈ చట్టాన్ని రూపొందించే విషయంలో జాతీయవాదులకు బ్రిటిష్ పరిపాలకులకు మధ్య విపరీతములైన అభిప్రాయభేదాలు ఉత్పన్నములైనాయి. జాతీయవాదులు చట్టంయొక్క లక్ష్యం డొమినియన్ ప్రతిపత్తిని వెంటనే ప్రవేశపెట్టడంగా ఉండవలసినదని, దానిని రూపొందించడంలో భారత ప్రతినిధుల సూచనలను ఆధారం చేసుకొనవలెనని పట్టుపట్టారు. కాని ప్రథమ దశలో అధికారులు ఈ అభిప్రాయాలను నిరాకరించి, భారతీయులకు ఏలాటి ప్రాతినిధ్యంలేని సైమన్ కమీషన్‌ను నియమించి, దాని నివేదికను ఆధారంచేసుకొని చట్టాన్ని రూపొందించుటకు సిద్ధపడ్డారు. కాని ఈ కమీషన్‌ను దేశంలోని ప్రముఖపార్టీలన్నీ బహిష్కరించడంచేతను, అది

దేశంలో చర్చలు జరుపుతున్న కాలంలో కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించి ప్రజాభిప్రాయానికి గల శక్తిని నిరూపించడంచేతను. 1929 నాటికి బ్రిటన్‌లో లేబరుపక్షం అధికారంలోకి రావడంచేతను ,అధికారులు తమవైఖరిని కొంతవరకు మార్చుకొని భారత ప్రతినిధులతో కూడిన రౌండుటేబిల్ సమావేశ చర్చలను ఆధారం చేసుకొని చట్టాన్ని రూపొందించుటకుద్దేశించారు. కాని అప్పుడుకూడా డొమినియన్ ప్రతిపత్తి చర్చలకు ప్రాతిపదిగా ఉండవలెననే వాదాన్ని వారు నిరాకరించడంచేత సమావేశంలో కాంగ్రెసు పాల్గొనలేదు. మొదటి రౌండుటేబిల్ సమావేశం జరిగినా అందులో కాంగ్రెసు పాల్గొనకపోవడంచేత దానిలో జరిగిన చర్చలుగాని, అది చేసిన నిర్ణయాలుగాని దేశంలో అత్యంత ప్రాధాన్యాన్ని వహించి సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనార్థం శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగిస్తున్న కాంగ్రెసుపార్టీకి ఆమోదయోగ్యం కాలేదు. కాంగ్రెసుకు ఆమోదయోగ్యంకాని రాజకీయ సంస్కరణలు నిష్ప్రయోజనములనే భావం బ్రిటన్‌లో అధికారంలో ఉండిన లేబర్‌పక్షంవారికి ఏర్పడింది. అంతేగాక శాసనోల్లంఘన ఉద్యమాన్ని అణచుటకు ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు ఫలప్రదం కాలేదు. ఈ పరిస్థితులలో 1931 లో గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగి, రౌండుటేబిల్ రెండవ సమావేశంలో కాంగ్రెసు ప్రతినిధిగా గాంధీ పాల్గొన్నాడు. కాని ఇందుమూలంగా ఏమీ లాభం లేకపోయింది. మొదటి సమావేశంలోనే ప్రధానములైన చర్చలు జరిగి బ్రిటిష్‌ప్రభుత్వం కొన్ని నిర్ణయాలను తీసుకొన్నది. గాంధీ వాటిలో ఏలాటి మార్పు చేయలేకపోయినాడు. ఇంతేగాక మొదటి సమావేశ కాలంలోనే బ్రిటన్‌లోని ప్రముఖవర్గాలవారు ముస్లిం ప్రతినిధులను హిందూ ప్రతినిధులనుండి పూర్తిగా చీలదీయగలిగారు. రెండవ సమావేశ కాలంలో ఈ చీలికలు మరింత బలపడినవి. రెండు మతవర్గాల మధ్య సమైక్యతను కుదుర్చుటకు గాంధీచేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలములైనాయి. దీనికితోడు అప్పటికి బ్రిటన్‌లో లేబరుపక్షం అధికారంలో నుండి తొలగి సామ్రాజ్యతత్వ వాదులైన కాన్‌సర్వేటివ్ పక్షంవారు అధికారంలోకి వచ్చారు. ఈ కారణా లన్నిటి మూలంగా రెండవ సమావేశంలోని చర్చలలో కాంగ్రెసు ప్రతినిధిగా గాంధీ పాల్గొనినా ఇది రాజ్యాంగచట్టం రూపొందడంలో ఏలాటి ప్రభావాన్ని వహించలేదు.

కాన్‌సర్వేటివ్ పక్షం అధికారంలోకి వచ్చినతర్వాత రాజ్యాంగ సంస్కరణల విషయంలో బ్రిటిష్ అధికారులవైఖరి పూర్తిగా మారింది. భారతీయుల అభిప్రాయంతో నిమిత్తం లేకుండా సైమన్‌కమీషన్ నివేదికను ఆధారంచేసుకొని రాజ్యాంగచట్టాన్ని రూపొందించుటకు వారు నిర్ణయించుకొన్నారు. ఈలాటి నిర్ణయాన్ని కాంగ్రెసువారూ స్వాతంత్ర్యాన్ని కోరే ఇతర పక్షాలవారూ ప్రతిఘటించినా అల్పసంఖ్యాకవర్గాల సహాయంతో—వాటిలో ప్రధానంగా ముస్లింల సహాయంతో—ఆలాటి ప్రతిఘటనను ఎదుర్కొనడం సులభసాధ్యమని భావించి, తమరాజ్యాంగ సంస్కరణలలో వర్గప్రయోజనాలకు ప్రాధాన్యం కల్పించారు. ఇదికూడా సైమన్‌కమీషన్ నివేదికకు అనుగుణమైన నిర్ణయమే. దీనికితోడు రెండవసమావేశం జరిగిన తర్వాత కాంగ్రెసు సాగించిన శాసనోల్లంఘన ఉద్యమాన్ని బలప్రయోగంద్వారా పూర్తిగా అణచివేయగలిగారు. ఆ నాడు వైస్రాయిగా ఉండిన విలింగ్డన్ దారుణమైన ఈ దమనవిధానాన్ని విజయవంతంగా కొనసాగించాడు. వీటి అన్నిటి ఫలితంగా రాజ్యాంగ సంస్కరణలనే చక్రం చుట్టి చుట్టి తుదకు యథాస్థానానికి వచ్చింది. సైమన్ కమీషన్‌తో ప్రారంభమై రెండు రౌండుటేబుల్ సమావేశాలతో కూడిన మార్గంలో నడిచి తిరిగి సైమన్‌కమీషన్ నివేదికను చేరింది.

జాతీయఉద్యమం ప్రారంభమైన నాటినుండి బ్రిటన్ ప్రముఖవర్గాలకు చెందినవారనేకులు, భారతదేశంలోని ఉన్నత ఉద్యోగివర్గం, వైస్రాయిలలో అధికసంఖ్యాకులు, అనధికార యూరోపియన్లు, ఆంగ్లో ఇండియన్ పత్రికలవారు బ్రిటిష్‌వారు వారి సైనికబలం తోనే భారత దేశాన్ని జయించినట్లును, సైనికబలంచేతనే దానిని తమవశంలో ఉంచుకొనవలసినట్లుగను, ఇందులో ప్రజల సమ్మతిని సంపాదించుటకు ప్రయత్నించడం అనవసరమనీ, వ్యర్థమనీ విశ్వసించారు. ఇందులో భేదోపాయాన్ని వినియోగించి ముస్లిములను హిందువులనుండి చీలదీసి, తమపక్షంలో చేర్చుకొనడం సులభమనే అభిప్రాయం వారి విశ్వాసాన్ని బలపరచింది. సయ్యద్ అహమ్మద్‌ఖాన్ కాలాననుండి వారీ భేదోపాయాన్ని వినియోగించారు. రెండవ రౌండుటేబిల్ సమావేశంలో ఇది పూర్తిగా ఫలప్రదమైంది.

ఈ విశ్వాసంతో వారు రాజ్యాంగ చట్టాన్ని రూపొందించారు. ఈ రూపొందించడంలో 1932 ఆగస్టు 10న బ్రిటిష్ ప్రధాని రాంసే మాక్డనాల్డు ప్రకటించిన సాంఘిక సమస్యా పరిష్కారము (Communal Award) మొదటిమెట్టు. భారతదేశ ప్రజలు ఒక జాతికి చెందినవారు కారని, వారు అనేక అల్పసంఖ్యాక వర్గాలతోకూడిన ఒక సముదాయమనేది ఈ పరిష్కారానికి ఆధారమైన సూత్రం. ఇందులో (1) ముస్లింలు (2) అస్పృశ్యులు (3) బలహీన వర్గాలు, (4) శిక్కులు, (5) ఆంగ్లో ఇండియన్లు, (6) భారతీయ క్రైస్తవులు (7) యూరోపియన్లు, (8) వర్తక వ్యాపారాలను చేసేవారు. (9) భూస్వాములు, (10) కార్మికులు ప్రత్యేక వర్గాలుగా గుర్తించబడినారు. వీటిలో ఒక్కొక్కవర్గానికి శాసనసభలలో ఎన్నిస్థానాలు ఉండవలసినది, నిర్ణయించబడింది. ఒక్కొకవర్గంవారు ఇతరవర్గాలవారితో ఏలాటి సంబంధంలేక, వారి వారి ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా (Communal Electorate) వారి ప్రతినిధులను ఎన్నుకొనవలసిన విధానం ప్రవేశపెట్టబడింది. ఈ వర్గాలు మినహాగా తక్కినవారినందరిని కలిపి వారి నియోజక వర్గాలకు సాధారణ నియోజక వర్గాలని (General Constituencies) పేరుపెట్టి, వారు ఎన్నుకొనవలసిన ప్రతినిధుల సంఖ్య ప్రత్యేకంగా నిర్ణయించబడింది. ఇవి హిందూ నియోజకవర్గాలు. ఈ పరిష్కారానికి అంతరార్థం హిందువులు వేరే, తక్కినవర్గాలు వేరే అనేది; రాజకీయంగా హిందువులకు వీరికి ఏలాటి సంబంధం ఉండరాదనేది. పరిష్కారానికి ఇది మొదటి లక్షణం.

ఇదిగాక దేశం మొత్తపు జనాభాలో హిందువులు అత్యధిక సంఖ్యలో (Majority) ఉండినా కేంద్ర శాసనసభలో వారికి కేటాయించిన స్థానాలు అల్పసంఖ్యలో (Minority) ను ముస్లింలకు జనసంఖ్యలో వారి దామాషాకంటె ఎక్కువ సంఖ్యలో స్థానాలను కేటాయించడం పరిష్కారానికి రెండవ లక్షణం. ఈ పక్షపాత వైఖరిలో ఏలాటి అన్యాయంగాని అధర్మంగాని లేదని బ్రిటిష్‌వారు భావించారు. బ్రిటిష్ అధికారాన్ని నిర్మూలించి స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు జరిగిన తిరుగుబాటు ప్రయత్నాలన్నిటిలో హిందువులదే ప్రముఖపాత్ర అని; ఇందులో నాయకత్వం వహించిన కాంగ్రెసు హిందూసంస్థ అనీ, శాసనసభలలో వారికి తక్కువ దామాషాలో సభ్యత్వాలను కేటాయించి, రాజకీయరంగంలో వారికిగల పలుకుబడిని తగ్గించి, వారికొక గుణపాఠాన్ని నేర్పడం అవసరమనీ అభిప్రాయపడి వారీ విధానాన్ని అనుసరించారు. ముస్లింల పట్ల పక్షపాత వైఖరి తమ పరిపాలనను శాశ్వతపరచుకొనుటకు పటిష్ట సాధనమనే భావంతో వారు ప్రవర్తించారు. కాంగ్రెసు సాగించిన స్వాతంత్ర్యోద్యమంలో హిందువులేగాక ముస్లింలు,

హిందువులుకాక ఇతర భారతీయులు కూడా పాల్గొంటున్నారనే విషయాన్ని వారు పూర్తిగా విస్మరించారు.

కేంద్రంలోని దిగువ సభలో మొత్తం సభ్యుల సంఖ్య 250. ఇందులో 33 శాతం—అనగా 82 స్థానాలను—ముస్లింలకు కేటాయించారు. మొత్తం జనాభాలో వారి శాతం 24 మాత్రమే. హిందువులకు 105 స్థానాలను—అంటె 250 లో సగం కూడా లేదు—కేటాయించారు.

రాష్ట్ర శాసనసభలలో వివిధ వర్గాలవారికి కేటాయించిన స్థానాలు కూడా ఈ పక్షపాత వైఖరినే ప్రదర్శిస్తున్నది. ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలో జనాభాలో వారి శాతానికంటె ఎక్కువ స్థానాలను వారికి కేటాయించారు. కాని హిందువులు అల్పసంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలో ఈపద్ధతిని అనుసరించలేదు. ఉదాహరణకు: మద్రాసులో జనాభా శాతాన్నిబట్టి ముస్లింలకు లభించవలసిన 17 స్థానాలకు బదులు 29, ఉత్తర ప్రదేశ్‌లో 35కు బదులు 66, బీహారులో 20కి బదులు 40, మధ్య ప్రదేశ్‌లో 5కు బదులు 14 కేటాయించారు. కాని బెంగాలులో అల్ప సంఖ్యాకులైన హిందువుల జనాభా శాతం 43 అయినా శాసనసభలో వారికి 32 శాతం స్థానాలు మాత్రమే లభించాయి.

సాంఘిక పరిష్కారం జరిగినతర్వాత రౌండుటేబిల్ మూడవ సమావేశం 1932 నవంబరు 17 నుండి డిసెంబరు 24 వరకు సాగింది. అప్పటికే కాన్సర్వేటివ్ ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణల గురించి నిర్ణయాలన్నిటినీ తీసుకొనడంచేత సమావేశంలోని చర్చలకు ఏలాటి ప్రాధాన్యం లేకపోయింది. లేబరు పక్షంవారికి ఈ నిర్ణయాలు రుచించని కారణంగా వారు సమావేశంలో పాల్గొనలేదు. సంస్థానాధీశులకు కూడా సమాఖ్య విధానంలో ఉత్సాహం తగ్గింది. వారు సమావేశంలో స్వయంగా పాల్గొనక వారి దివానులను పంపినారు. దీనితో సమావేశం తంతు పూర్తి అయింది.

కాన్సర్వేటివ్ మంత్రివర్గ నిర్ణయాలన్నిటినీ 1933 మార్చిలో ఒక శ్వేతపత్రం (White Paper)లో ప్రభుత్వం ప్రకటించింది. రాజ్యాంగ నిర్మాణంలో ఇది రెండవ మెట్టు. ఇందులో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గురించి గాని, డుమినియన్ ప్రతిపత్తిని గురించి గాని ఏలాటి ప్రస్తావన లేదు. అఖిలభారత సమాఖ్య ఏర్పడిన తర్వాత కేంద్ర పరిపాలన శాఖలలో కొన్ని శాసనసభకు బాధ్యత వహించిన మంత్రుల వశంలోకి రావలెనని శ్వేతపత్రం ప్రతిపాదించింది. దీని ఉద్దేశం ఇంతకు పూర్వం రాష్ట్రాలలో ఉండినట్టి ద్వంద్వ పరిపాలన విధానాన్ని (Dyarchy) కేంద్రంలో ప్రవేశ పెట్టడమే. ఇదిగాక రాష్ట్ర పరిపాలనలో ద్వంద్వ విధానం పూర్తిగా తొలగ వలెనని, పరిపాలన శాఖలన్నీ గవర్నరులకు కేటాయించబడిన ప్రత్యేక రక్షణాధికారాలకు (Safeguards) లోబడి శాసనసభకు బాధ్యత వహించిన మంత్రుల అధీనంలోకి రావలెనని ప్రతిపాదించింది. ఈ విధంగా అఖిలభారత సమాఖ్య, కేంద్రంలో పాక్షిక బాధ్యతాయుత పరిపాలన విధానము, రాష్ట్రాలలో పూర్తి బాధ్యతాయుత పరిపాలనము నూతన రాజ్యాంగానికి లక్షణాలుగా ఉండవలెనని శ్వేతపత్రం ప్రతిపాదించింది.

కాని ఈ పత్రంలోని ప్రతిపాదనలు దేశంలోని ఏ పక్షంవారికీ తృప్తిని కలిగించలేదు. నిరంకుశ పరిపాలకులకు లోబడిన సంస్థానాలు, ప్రజాస్వామిక విధానానికి అలవాటుపడిన

రాష్ట్రాలు కలిపి ఒక సమాఖ్యగా ఏర్పడటం ఎవరికీ అంగీకారం కాలేదు. సంస్థానాలలో అధిక సంఖ్యాకం హిందూ రాజులు పరిపాలించేవి. సమాఖ్యలో హిందువుల ప్రాతినిధ్యం దీని మూలంగా ఎక్కువ కాగలదని ముస్లింలీగు వంటి ముస్లిం సంస్థలు సమాఖ్య విధానాన్ని తిరస్కరించాయి. దీనికితోడు కేంద్రంలో డొమినియన్ ప్రతిపత్తిని గురించి తుది లక్ష్యంగా కూడా ఏలాటి ప్రసక్తి లేకపోవడం అందరికీ ఆశాభంగాన్ని కలిగించింది. రాష్ట్రాలలో ద్వంద్వ పరిపాలన అంతరించినా గవర్నరులకు ప్రత్యేకాధికారాలు లభించడం కూడా ఎవరికీ ఆమోదయోగ్యం కాలేదు. సాంఘిక సమస్య పరిష్కారం మాత్రం ముస్లింలకు ఇతర అల్పసంఖ్యాక వర్గాలకు తృప్తిని కలిగించింది. ఇది తప్ప శ్వేతపత్రంలో ప్రశంసార్హమైన లక్షణాలు లేవనే అభిప్రాయం సర్వత్రా వ్యాపించింది. ఇదే సహేతుకమైన అభిప్రాయం.

సంస్థానాధీశులను సమాఖ్యలోకి ఆకర్షించి కాంగ్రెసు వంటి ప్రజాస్వామిక శక్తులను విరోధించే ఉద్దేశంతోనే బ్రిటిష్‌వారు ఈ విధానానికి అంగీకరించారు. వాస్తవాధికారాన్ని భారతీయులకు పరివర్తన చేసే ఉద్దేశం వారికి లేశమాత్రం కూడా లేదు.

బ్రిటన్‌లోని పార్లమెంటు సంప్రదాయాన్ని అనుసరించి శ్వేతపత్రంలోని ప్రతిపాదనలను క్షుణ్ణంగా పరిశీలించి ఒక నివేదికను సమర్పించుటకు ఉభయ సభల సభ్యులతో కూడిన ఒక సంయుక్త కమిటీ (Joint committee) 1933 ఏప్రిలులో నియమించబడింది. దీనికి సహాయం చేయుటకు 28 భారతీయ ప్రతినిధుల కమిటీ ఒకటి కూడా నియమించబడింది. సంయుక్త కమిటీ ఎదట బ్రిటిష్ ప్రముఖులు భారతీయులనేకులు సాక్ష్యం చెప్పారు. సాక్ష్యం చెప్పుటకు వెళ్ళిన భారతీయ ప్రతినిధులు శ్వేతపత్ర ప్రతిపాదనలలో జరగవలసిన మార్పులను సూచిస్తూ రెండు నివేదికలను కూడా సమర్పించారు. కాని వీరి సాక్ష్యము, వీరి నివేదికలు కమిటీపై ఏలాటి ప్రభావము వహించలేదు. శ్వేతపత్రంలోని ప్రతిపాదనలను సమర్థిస్తూ సంయుక్త కమిటీ తన నివేదికను సమర్పించింది. రాజ్యాంగ పరిణామంలో సంయుక్త కమిటీ ఎదట జరిగిన చర్చలు, దాని నివేదిక మూడవ మెట్టు. బ్రిటిష్ ప్రధాని 1932 ఆగస్టు 10 న ప్రకటించిన సాంఘిక పరిష్కారము మొదటి మెట్టు అని, శ్వేతపత్ర ప్రకటన రెండవ మెట్టు అని ఇదివరకే తెలుసుకొన్నాము.

సంయుక్త కమిటీ నివేదికను ఆధారం చేసుకొని బ్రిటిష్ ప్రభుత్వం ఒక సమగ్రమైన బిల్లును తయారు చేసింది. అందులో ఒక భాగం కేంద్ర పరిపాలన విధానానికి—అనగా అఖిల భారత సమాఖ్య, ద్వంద్వపరిపాలన వగైరాలకు—సంబంధించినట్టిది. రెండవ భాగం రాష్ట్రాల పరిపాలనకు సంబంధించినట్టిది. ఈ బిల్లును పార్లమెంటు ఉభయసభలు 1935 ఆగస్టు 2 వరకు చర్చించి ఆమోదించాయి. ఆగస్టు 4 న చక్రవర్తి ఆమోదించడంతో బిల్లు 1935 భారతదేశ ప్రభుత్వ చట్టంగా (Government of India Act, 1935) రూపొందింది. బిల్లు గురించి పార్లమెంటులో జరిగిన చర్చలు రాజ్యాంగ పరిణామంలో ఆఖరు మెట్టు.

1858 తర్వాత భారతదేశ పరిపాలన విధానంలో మార్పులు చేస్తూ పార్లమెంటు 1861, 1892, 1909, 1919 లో చట్టాలను రూపొందించింది. కాని ఏ చట్టాన్ని రూపొందించడంలో కూడా 1935 చట్టాన్ని రూపొందించడంలో జరిగినన్ని చర్చలు కాలయాపన జరగలేదు. ఈ చట్టస్వరూపాన్ని గురించి 1927 లో సైమన్ కమీషన్ నియామకంతో చర్చలు ప్రారంభ

మైనాయి. ఇవి మూడు రౌండుటేబిల్ సమావేశాలలో సాగినవి. తర్వాత బ్రిటిష్ ప్రధాని సాంఘిక సమస్య పరిష్కారం. శ్వేతపత్ర ప్రకటన. పార్లమెంటు సముక్త కమిటీ చర్చలు పార్లమెంటు ఉభయ సభలలో చర్చలు మొదలైన మెట్లను దాటి తుదకు పార్లమెంటులో చర్చలు జరిగి తుది స్వరూపాన్ని ధరించింది. ఈ క్రమమంతా జరుగుటకు ఎనిమిది సంవత్సరాలు పట్టింది. కాని ఇంతటి దీర్ఘ కాలం జరిగిన చర్చల ఫలితం, కొండను తవ్వి ఎలుకను పట్టినట్లుగా పరిణమించింది. భారతీయుల ఆశయాలలో ఏదీకూడా దీని మూలంగా లభించలేదు. దేశపరిపాలన విధానంలోని మౌలిక లక్షణాలు 1927పూర్వం ఏ విధంగా ఉండినవో 1935 తర్వాత కూడా ఆ విధంగానే ఉండినవి.

అఖిలభారత సమాఖ్య, కేంద్రంలో ద్వంద్వ ప్రభుత్వం ఏర్పడవలసినదిగా ఈ చట్టం నిర్ణయించినా ఈ నిర్ణయం ఆచరణలోకి రాలేదు. కొంత సంఖ్యలో సంస్థానాధీశులు సమాఖ్యలో చేరుటకు అంగీకరించిన తర్వాతనే కేంద్ర పరిపాలన విధానంలో మార్పులు జరగవలసినట్లుగా చట్టం విధించింది. తాము కోరిన రక్షణలన్నీ సమాఖ్యలో తమకు లభించలేదనే కారణంగాను, కేంద్ర శాసనసభలో ప్రజాస్వామ్యంలో విశ్వాసంగల కాంగ్రెసుపార్టీ వంటి పార్టీలకు అధిక సంఖ్యలో స్థానాలు లభించే అవకాశం ఉండడంచేతను, తమ హోదాకు తగిన పలుకుబడి లభించే అవకాశం లేదనే కారణంగాను, సమాఖ్యలో చేరిన పక్షంలో రాష్ట్రాలలోని ప్రజాస్వామికం మోస్తరుగా సంస్థానాలలో కూడా సంస్కరణలు జరగవలెనని సంస్థాన ప్రజలు ఆందోళనలను లేవదీసే ప్రమాదం ఉన్నదనే కారణంగాను సంస్థానాధీశులు తగిన సంఖ్యలో సమాఖ్యలో చేరుటకు వెనుదీశాను. భారతప్రభుత్వం వారితో బేరసారాలు చేసి, వారి అనుమతిని సంపాదించుటకు ప్రయత్నించింది. కాని ఇవి పూర్తి కాకముందే 1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. యుద్ధకాలంలో కేంద్రంలో ఏలాటి మార్పులు జరగరాదని భావించి, యుద్ధం ముగిసేవరకు వాటిని ప్రవేశపెట్టరాదని నిర్ణయించింది. అందుచేత కేంద్ర పరిపాలన 1935 చట్టానుసారంగా గాక, 1919 చట్టానుసారమే జరుగుతూ వచ్చింది. 1935 చట్టానుసారం మూడు మార్పులు మాత్రమే జరిగాయి. వాటిలో మొదటిది ఫెడరల్ కోర్టు స్థాపన; రెండవది ఫెడరల్ పబ్లిక సర్వీసు కమీషన్ (Federal Public Service commission) నియామకం, మూడవది ఫెడరల్ రైల్వే బోర్డు స్థాపన (Federal Railway Authority). కాని ఇవి కేంద్ర పరిపాలన విధానంలో చెప్పుకోతగ్గ మార్పులు చేయలేదు. చట్టం నిర్ణయించిన మార్పులు కేంద్రంలో జరగని కారణంగా వాటిని గురించి విపులంగా ఇక్కడ వివరించలేదు.

1935 చట్టఫలితంగా రాష్ట్ర స్థాయిలో ఈ క్రింది మార్పులు జరిగినాయి. బర్మా భారతదేశాన నుండి వేరుచేయబడింది. ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే రాష్ట్రాల సంఖ్యను పెంచవలసిందిగా కొంతకాలాన నుండి ముస్లిం నాయకులు కోరుతూ వచ్చారు. వారిని తృప్తి పరచే ఉద్దేశంతో సింధు ప్రాంతం బొంబాయి రాష్ట్రాన నుండి వేరై, ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేయబడింది. 1935 కు పూర్వం ఒరియా భాషను మాట్లాడేవారిలో కొందరు బీహారు రాష్ట్రంలోను, కొందరు బెంగాలులోను, మరికొందరు మద్రాసు రాష్ట్రంలోను ఉండినారు. ఈలాగు కాక, వారినందరిని కలిపి ఒకే రాష్ట్ర నిర్మాణం చేయవలసిందిగా చాలా కాలానుండి వారి నాయకులు కోరుతూ వచ్చారు. దీనికి అనుగుణంగా 1935 చట్టం ప్రత్యేక ఒరిస్సా రాష్ట్రాన్ని నిర్మాణం చేసింది.

ఈ చట్టం ఫలితంగా రాష్ట్రాలలో ద్వంద్వ పరిపాలన అంతరించింది. పరిపాలన శాఖలన్నీ శాసనసభకు బాధ్యత వహించిన మంత్రుల అధీనంలోకి వచ్చాయి. కాని అల్పసంఖ్యాక వర్గాల రక్షణ నిమిత్తమూ, మరికొన్ని ప్రయోజనాలను సమకూర్చే నిమిత్తమూ గవర్నరులకు కొన్ని ప్రత్యేకాధికారాలు కల్పించబడినాయి. వీటికి లోబడి మంత్రులు వాటి పరిపాలనను సాగించవలసి వచ్చింది.

మద్రాసు, బొంబాయి, బెంగాలు, ఉత్తర ప్రదేశ్, బిహారు, అసాం రాష్ట్రాలలో రెండు శాఖలతో కూడిన శాసనసభలు ప్రవేశపెట్టబడినాయి. తక్కిన రాష్ట్రాలలోని శాసన సభలలో ఒక్కటే శాఖ ఉండినది. శాసన సభలోని సభ్యులందరు ప్రజలు ఎన్నుకొన్న వారు. ప్రభుత్వం నామనిర్దేశం చేసిన ఉద్యోగులు గాని, ఉద్యోగేతరులు గాని వారిలో ఎవరూ లేరు. కాని ఎన్నిక విధానం 1932లో బ్రిటిష్ ప్రధాని చేసిన సాంఘిక సమస్య పరిష్కారానుసారంగా ఏర్పడింది. కొంత ఆస్తిని కలిగినవారే ఎన్నికలో పాల్గొనుటకు అర్హులైనా, వారికి ఉండవలసిన ఆస్తి పరిమితిని తగ్గించిన కారణంగా 1919 చట్టం క్రింద వోటర్ల సంఖ్యకంటె 1935 చట్టం క్రింద వోటర్ల సంఖ్య నాలుగురెట్లు పెరిగింది.

పరిపాలనాధికారాలన్నీ సమాఖ్య విధానాన్ని అనుసరించి కేంద్ర రాష్ట్రాలమధ్య విభజింపబడినాయి. 1935 చట్టానికి పూర్వం రాష్ట్రాలకు స్వతంత్రాధికారాలేవీ ఉండినవి కావు. వాటికి లభించిన అధికారాలు శాసనవ్యవస్థా కేంద్రానికి లోబడి చెలాయించ తగ్గవి. 1935 చట్టం ఈ విధానాన్ని మార్చింది. దీనిప్రకారం వాటికి లభించిన అధికారాలు చాలావరకు స్వతంత్రంగా చెలాయించదగినవి. ఈ సూత్రానికి అనుగుణంగా వాటికి కావలసిన ఆర్థిక వనర్ల విషయంలో కూడా వాటికి స్వతంత్రం లభించింది.

ఈ విధంగా రాష్ట్రాలకు స్వాతంత్ర్యం లభించినా అది గవర్నరు ప్రత్యేకాధికారాలకు లోబడి ఉండడమూ, రాష్ట్రాలు కొన్నిటిలో రెండవ శాసనశాఖ ఏర్పడడమూ కాంగ్రెసుకు, ముస్లింలీగుకు, ఇతర ప్రముఖ పార్టీలకు ఆమోదయోగ్యం కాలేదు.

1935 చట్టం వెంటనేగాక 1937 ఏప్రిలులో అమలులోకి వచ్చింది.

## 2

1929-39 మధ్య సంభవించిన పరిణామాలలో రెండవది హిందువులు, ముస్లింలు మధ్య చాలా కాలానుండి ఏర్పడిన విభేదాలను తొలగించి, రెండు వర్గాలమధ్య సమైక్యతను కుదుర్చుటకు చేసిన ప్రయత్నాల వైఫల్యం. 1928 లో నెహ్రూ కమిటీ నివేదిక గురించిన చర్చల సందర్భంలో సమైక్యత సాధ్యమయ్యే సూచనలు కనుపించాయి. కాని నివేదికలో జరగవలసిన సవరణలు గురించి ముస్లిం నాయకులలో అగ్రశ్రేణికి చెందిన జిన్నా ప్రతిపాదనలు వీగిపోవడంతో సమైక్యత సాధ్యం కాకపోయింది. ఇది కారణంగా అతడు 1929 లో 14 అంశాలతో కూడిన ఒక ప్రణాళికను తయారు చేసి, వీటి అన్నిటికీ హిందువులు అంగీకరించిన పక్షంలోనే ఎన్నటికైనా రెండు వర్గాలమధ్య ఐక్యత కుదిరే అవకాశం ఉన్నదనీ, అది జరగని నాడు ఎవరి మార్గాన వారు వేర్వేరుగా వెళ్ళడం తప్పదని ఉద్ఘాటించాడు. ఈ విషయంలో తక్కిన ముస్లిం నాయకులనేకులు కూడా అతనితో ఏకీభవించారు. ఈ అంశాలు చాలా ప్రఖ్యాతి గాంచాయి. అందుచేత వాటిని ఈ క్రింద పొందు పరుస్తున్నాము.

(1) భావి రాజ్యాంగ వ్యవస్థ సమాఖ్య రూపంలో (Federation) ఉండవలెను. అందులో కేంద్ర ప్రభుత్వ అధికారాలు మినహాగా శేషించిన తక్కిన అధికారాలన్నీ (Residuary Powers) రాష్ట్ర ప్రభుత్వాలకు సంక్రమించవలెను.

(2) అన్ని రాష్ట్రాలకు ఒకేవిధమైన అంతరంగిక స్వాతంత్ర్యం (Autonomy) ఉండవలెను.

(3) అన్ని శాసనసభలలోను, ఇతర ఎన్నికల సంస్థలలోను అల్పసంఖ్యాకులకు తగిన ప్రాతినిధ్యం ఉండవలెను. ఏ రాష్ట్రంలోకూడా అధికసంఖ్యలో ఉండే వర్గాలకు (Majority) శాసనసభలో అంతకంటే తక్కువ ప్రాతినిధ్యంగాని, ఇతర వర్గాలతో సమాన ప్రాతినిధ్యంగాని ఉండరాదు.

(4) కేంద్రశాసనసభలో ముస్లింసభ్యుల దామాషా ⅓ కు తగ్గి ఉండరాదు.

(5) అన్ని వర్గాలు ప్రత్యేక నియోజక వర్గాలద్వారా వారి ప్రతినిధులను ఎన్నుకొనవలెను. ఏ వర్గమైనా ఐచ్ఛికంగా అలాటి వర్గాలను రద్దుచేయవలసిందిగా కోరిన పక్షంలో దానిని రద్దుచేయవచ్చు.

(6) రాష్ట్ర పునర్విభజన జరగడం అవసరమైనప్పుడు వాయవ్యసరిహద్దు రాష్ట్రంలోను, పంజాబులోను, బెంగాలులోను ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండుటకు భంగకరంగా పునర్విభజన జరగరాదు.

(7) అన్ని వర్గాలకు పూర్తి మతస్వాతంత్ర్యం ఉండవలెను.

(8) ఏ శాసనసభలోకూడా ఒక వర్గానికిచెందిన సభ్యులలో ¾ మంది ఆక్షేపించిన బిల్లుగాని, తీర్మానంగాని ప్యాసుకాకూడదు.

(9) సింధుప్రాంతాన్ని బొంబాయినుండి విడదీయవలెను.

(10) ఇతర రాష్ట్రాలలో ఉండునట్లె వాయవ్యసరిహద్దురాష్ట్రంలోను, బెలూచిస్థాన్‌లోను పరిపాలన సంస్కరణలను ప్రవేశపెట్టవలెను.

(11) ఇతర వర్గాలతోపాటు ముస్లింలకు ఉద్యోగాలలోను, స్థానికస్వపరిపాలన సంస్థలలోను తగిన భాగస్వామ్యం ఉండవలెను.

(12) రాజ్యాంగంలో ముస్లింల సంస్కృతి, వారి విద్య, భాష, మతము, వ్యక్తులకు సంబంధించిన స్మృతివిధానము (Persual Law) వారి ధర్మసంస్థలు మొదలైనవాటిని రక్షించుటకు తగిన హామీలు ఉండవలెను. ప్రభుత్వం ఇచ్చే విరాళాలలో (Grants-in-aid) వారికి ఉచితమైన వంతు ఉండవలెను.

(13) కేంద్రంలోగాని, రాష్ట్రాలలోగాని ఏర్పడే మంత్రివర్గాలలో ముస్లింలకు ⅓ కు తక్కువగాక ప్రాతినిధ్యం ఉండవలెను.

(14) రాష్ట్రాల ఆమోదంలేక కేంద్రశాసనసభ రాజ్యాంగంలో ఎలాంటి మార్పులూ చేయరాదు.

**ఈ 14 అంశాలలో ప్రత్యేక నియోజకవర్గాలు (3 వ అంశం) మాత్రమే హిందువుల ఆక్షేపణకు ఎక్కువగా గురిఅయింది, తక్కిన అంశాలగురించి ఏదో ఒకవిధమైన రాజీ చేసుకొనే అవకాశం ఉండినది. ఈ జాబితాను తయారుచేసిన తర్వాత కొద్దికాలానికి జిన్నా దేశాన్ని**

వదిలి 1934 వరకు బ్రిటన్‌లో నివాసం ఏర్పరచుకొన్నారు. అతని అంశాలగురించి ఉభయ వర్గాలమధ్య చర్చలు సాగడానికి అవకాశం లేకపోయింది.

ఈ మధ్యకాలంలో పంజాబులో ప్రముఖుడైన ఫజుల్ హుస్సేన్ వర్గప్రయోజనాలను ఆశించే ముస్లింలకు నాయకుడైనాడు. ఇతడు క్రమ క్రమంగా బ్రిటిష్‌వారి అధికారం తగ్గాలెనని అధికారం భారతీయులకు సంక్రమించవలెనని భావించినా ఆ అధికారాన్ని హిందువులు ముస్లింలు సరిసమానంగా అనుభవించవలెనని. దేశంలోని రాష్ట్రాలలో సింధు. పంజాబు. బెలూచిస్థాన్. వాయవ్యసరిహద్దురాష్ట్రం. బెంగాలు. (వీలైన పక్షంలో) అసాం ముస్లింలు అధికసంఖ్యాకులుగాగల రాష్ట్రాలుగా ఉండవలెనని. ఉత్తరప్రదేశ్, బీహారు. ఒరిస్సా. మధ్యప్రదేశ్. మద్రాసు బొంబాయిలు—ఈ ఆరు రాష్ట్రాలు—హిందువులు అధికసంఖ్యాకులుగాగల రాష్ట్రాలుగా ఉండవలెనని. అప్పుడుగాని అధికారం సరిసమానంగా అనుభవించడం జరగదని. ఏ పరిస్థితులలో కూడా ప్రత్యేక నియోజకవర్గాలు రద్దుకాకూడదని ప్రతిపాదించాడు. రౌండుటేబిల్ సమావేశం జరుగుచుండిన కాలంలో ఇతడు వైస్రాయి కార్యనిర్వాహకసభలో (Executive Council) సభ్యుడుగా ఉండడంచేత ప్రభుత్వ విధానాలపైన. సమావేశంలోని ముస్లిం ప్రతినిధులపైన గొప్ప పలుకుబడిగలవాడయ్యాడు. దీనఫలితంగా డాక్టర్ అన్సారివంటి జాతీయవాదులు సమావేశానికి ముస్లిం ప్రతినిధులుగా వెళ్ళరాదని పట్టుపట్టాడు. అందుచేత అలాటివారెవ్వరు సమావేశానికి వెళ్ళలేదు. ఒక దశలో సమావేశంలోని ముస్లిం ప్రతినిధులు మిశ్రమ నియోజక వర్గాలను అంగీకరించ సంకల్పించారు. కాని హుస్సేన్ తన పలుకుబడిని వినియోగించి దానికి అడ్డుతగిలి తన లక్ష్యాన్ని సాధించగలిగాడు ఇతని నాయకత్వంలో ముస్లింల వేర్పాటుధోరణి పూర్తిగా బలపడింది.

1932 ఆగస్టులో అల్పసంఖ్యాకవర్గాల సమస్యను పరిష్కరిస్తూ బ్రిటిష్‌ప్రధాని తన నిర్ణయాన్ని (Communal Award) ప్రకటించాడు. అస్పృశ్యులను తక్కిన హిందువుల నుంచి చీలదీసి. వారికికూడా ప్రత్యేక నియోజకవర్గాలను ఈ నిర్ణయం కల్పించినదని. అమరణ ఉపవాసదీక్షను వహించి గాంధీ దానిని రద్దుచేయగలిగాడని ఇదివరలో తెలుసుకొన్నాము. ఈ నిర్ణయానుసారం ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలు సుస్థిరం చేయబడినవి.

ఆ సమయంలో జాతీయవాదులైన ముస్లిం నాయకులు కొందరు—ప్రధానంగా ఆజాద్, షౌకతాలివంటివారు—హిందువులు ముస్లింలతో కూడిన ఒక ఐక్యసభను లక్నోలో అక్టోబరున సమావేశపరచి. ముస్లింప్రతినిధులను మిశ్రమ నియోజకవర్గాలకు. కేంద్రశాసనసభలో 32 శాతం ముస్లిం ప్రాతినిధ్యానికి అంగీకరించేవారినిగా చేశారు. హిందూప్రతినిధులు జిన్నా జాబితాలోని తక్కిన అంశాలకు అంగీకరించారు. రెండు వర్గాలమధ్య ఒక విధమైన రాజీ కుదిరింది. కాని హుస్సేన్ నాయకత్వంలోనివారు దీనిని ప్రతిఘటించారు. ఇంతేకాదు. ఈ రాజీ కుదిరినట్లు తెలిసిన వెంటనే ఇండియా మంత్రి సర్ సామ్యూల్‌హోరు బ్రిటిష్‌ప్రభుత్వం కేంద్రశాసనసభలో ముస్లింలకు $\frac{1}{3}$ ప్రాతినిధ్యం కల్పిస్తున్నట్లు, సింధుప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా నిర్మాణం చేయడమేగాక. దానికి కావలసిన ఆర్థికపరిస్థితులన్నిటినీ కల్పిస్తున్నట్లు ఒక ప్రకటన చేశాడు. లక్నో సమావేశంద్వారా లభించిన సదుపాయాలకంటె ప్రభుత్వం ప్రసాదించదలచిన సదుపాయాలు ఎక్కువ లాభకరంగా ఉన్నట్లు ముస్లింలు భావించారు. లక్నో రాజీ ఈ కారణంచేత ఆచరణలోకి రాలేదు. హిందువులతో బేరసారాలు జరుపుటకంటె ప్రభుత్వంపై

ఆధారపడడమే ముస్లింలకు లాభకరమనే భావం స్థిరపడిపోయింది. దీనితో సమైక్య ప్రయత్నాలు చాలావరకు ముగిసినవి. జిన్నా చెప్పినట్లు రెండు వర్గాలవారు విభిన్నమార్గాలలో నడిచే వారయ్యారు. బ్రిటిష్‌వారి కుటిలనీతిని ప్రతిఘటించడం హిందువులకు సాధ్యంకాలేదు.

పరిస్థితులు ఈలాగు విషమిస్తున్నకాలంలో ఇక్బల్ అనే ప్రఖ్యాత ఉర్దూకవి, తత్వవేత్త ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ముస్లింలోని వేర్పాటుశక్తులను బలపరచాడు. ఇస్లాంమతం ఒక భారతదేశానికి పరిమితమైనట్టిది కాదని, అది అనేక దేశాలలో వ్యాప్తిగాంచినట్టిదని, ఆ మతాన్ని స్వీకరించినవారందరు ఏ దేశంలో నివశించేవారైనా విశ్వవ్యాప్తమైన ఇస్లాంసమాజానికి చెందినవారనీ. జాతి అనేది ఒక దేశానికి మాత్రమే పరిమితమైన భావమనిన్నీ. అది ముస్లింలకు వర్తించదనిన్నీ. జాతి అనే సంకుచిత భావానికి వారు అతీతులనిన్నీ. హిందువులు. ముస్లింలు కలిసి ఒక జాతివారనేది ఇస్లాంమతానికి పరమ విరుద్ధమైన భావమనిన్నీ. ఈ కారణంచేత ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండే రాష్ట్రాలన్నీ కలిపి ఒక ప్రత్యేక రాజ్యంగా ఏర్పడడమే హిందూ ముస్లిం సమస్యకు పరిష్కార మార్గమనిన్నీ. 1930 లో అలహాబాదులో సమావేశమైన ముస్లింలీగు అధ్యక్షస్థానాన నుండి ఉద్ఘాటించాడు. ఇది ముస్లింలపై అత్యంత ప్రభావాన్ని వహించింది. ఇక్బల్ వంటి తత్వవేత్త ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం వేర్పాటుధోరణిగల ముస్లింలందరిని మరింత ప్రభావితులుగ చేసింది. ప్రత్యేక నియోజకవర్గాలకంటె ఇది ఉన్నతఆశయంగాను, ప్రత్యేకరాజ్యం సంపాదించడమే తమ లక్ష్యంగాను వారు భావించారు. ఇది దేశవిభజనకు, పాకిస్థాన్ సంస్థాపనకు దారితీసింది. హిందువులమార్గం వేరు తమ మార్గం వేరుఅని భావించిన ముస్లింలకు ఒక లక్ష్యం ఏర్పడింది. 1940 నాటికి ఇది బలపడి 1940 లో లాహూరులో సమావేశమైన ముస్లింలీగు దీనికి అనుకూలంగా తీర్మానంచేసింది. నాగపూరులో సమావేశమైన కాంగ్రెసు తన లక్ష్యం స్వరాజ్యమని తీర్మానించడం దేశచరిత్రలో ఎంతటి ప్రాధాన్యాన్ని వహించిందో ఇక్బల్ సిద్ధాంతం ఆధారంగా 1940 లో ముస్లింలీగు పాకిస్థాన్‌సంస్థాపన తన లక్ష్యమని నిర్ణయించడం అంతటి ప్రాధాన్యాన్ని వహించింది. సయ్యద్ అహమ్మద్‌ఖాన్ నాటిన ద్విజాతి సిద్ధాంతం అనే విత్తనాననుండి క్రమక్రమంగా పాకిస్థాన్ అనే వృక్షం పెరిగింది.

ఈ విధంగా 1923-39 మధ్య ముస్లింల రాజకీయ భావాలలోను కార్యక్రమాల లోను కలిగిన పరిణామాలు స్వాతంత్ర్యోద్యమంపై ప్రభావాన్ని వహించాయి. 1947 లో బ్రిటిష్ వారి అధికారం తొలగినా దానిస్థానే ఒకరాజ్యం దేశమంతటిపైన అధికారాన్ని వహించుటకు బదులు రెండు రాజ్యాలు ఏర్పడి ఒక్కొక్క రాజ్యం ఒక్కొక్క ప్రాంతంపై అధికారం వహించడం జరిగింది.

1935 చట్టం అమలుకు వచ్చిన తర్వాత ఉభయవర్గాలమధ్య అంతకుపూర్వం ఏర్పడిన విభేదాలు ఏవిధంగా మరింత బలపడినవో క్రమక్రమంగా మనం తెలుసుకొనగలము.

## 3

ఈ కాలంలో కాంగ్రెసువైఖరిలో అనేక మార్పులు వచ్చాయి. 1934 ప్రారంభం నాటికి శాసనోల్లంఘన ఉద్యమం పట్ల ఉత్సాహం తగ్గినందున స్వరాజ్యపార్టీని పునరుద్ధరించి, శాసన సభలలో ప్రవేశించి. వాటి సాధనాన ప్రభుత్వాన్ని ప్రతిఘటించడం వాంఛనీయమనే

అభిప్రాయం బలపడింది. గాంధీగారు దీని పట్ల సుముఖత్వాన్ని వ్యక్తపరచారు. ఈ నిర్ణయం ప్రకారం 1934 ఆఖరు భాగంలో కేంద్ర శాసనసభలకు జరిగిన ఎన్నికలలో పాల్గొనుటకు కాంగ్రెసువారు నిశ్చయించారు.

కాని బ్రిటిష్ ప్రధాని ప్రకటించిన సాంఘిక పరిష్కారాన్ని గురించి కాంగ్రెసు నాయకులమధ్య తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఉత్పన్నమైన కారణంగా ఎన్నికలకు ముందు కాంగ్రెసులో చీలికలు ఏర్పడినవి. మాళవ్యా, అనే మొదలైనవారు కొందరు పరిష్కారాన్ని పూర్తిగా ఖండించవలసిందిగా కోరారు. కాని కాంగ్రెసు దేశంలోని అన్నివర్గాలకు ప్రాతినిధ్యం వహించిన జాతీయ సంస్థ అవీ, పరిష్కారం కొన్ని వర్గాలవారికి ఆమోదయోగ్యంగా ఉండడం చేత దానిని పూర్తిగా ఖండించడం గాని, ఆమోదించడం గాని ప్రాజ్ఞత కాదని తక్కినవారు భావించారు. ఈ సందిగ్ధరూపమైన అభిప్రాయం మాళవ్యా మొదలైనవారికి నచ్చక. వారు కాంగ్రెసు జాతీయపార్టీ అనే పేరుతో ఇంకొక పార్టీగా ఏర్పడి దాని ఆధ్వర్యాన ఎన్నికలలో పాల్గొన్నారు. కాని, వారు తక్కిన విషయాలలో కాంగ్రెసులోని ఇతరులతో ఏకీభవించిన కారణంగా కాంగ్రెసునుండి విడిపోక. దానిలో ఒక భాగంగానే కృషి చేశారు.

ఎన్నికలలో కాంగ్రెసుకు 44 స్థానాలు. జాతీయ పక్షానికి 11 స్థానాలు లభించాయి. ఎన్నికల నాటికి జిన్నా కూడా స్వదేశానికి తిరిగి వచ్చి. ముస్లింలీగుపై నాయకత్వం వహించి ఎన్నికలలో పాల్గొన్నాడు. అతని పక్షంవారు 22 స్థానాలను గెలుచుకొన్నారు. వీరుగాక 11 యూరోపియన్లు, ఉద్యోగివర్గానికి చెందినవారు 26రు. ప్రభుత్వం నామనిర్దేశం చేసినవారు 13 రు సభ్యులుగా ఉండినారు.

ఈ ఎన్నికలు చాలా ప్రాధాన్యాన్ని వహించాయి. కాంగ్రెసు, కాంగ్రెసు జాతీయ పక్షంవారు కలిపి 55 స్థానాలను సంపాదించడం గొప్ప విశేషం. కాంగ్రెసు ప్రజాదరణను పొందిన సంస్థ కాదని. అది స్వల్ప సంఖ్యాకులైన విద్యాధికులకు మాత్రమే ప్రాతినిధ్యం వహించినట్టిదని. అందుచేత దాని అభిప్రాయాలను కార్యక్రమాలను లెక్క చేయవలసినది లేదని ప్రభుత్వం భావిస్తూ వచ్చింది. లక్షలాది జనం శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్న తర్వాత కూడా ప్రభుత్వం ఈ అభిప్రాయాన్ని మార్చుకొనలేదు. కాని 1934 ఎన్నికలు ముస్లింలు కాని ప్రజానీకానికి విశ్వాసపాత్రమైన పక్షం దేశంలో కాంగ్రెసు తప్ప ఇంకొకటి లేదని స్పష్టం చేసింది. కాంగ్రెసు పట్ల ద్వేషాన్ని వహించి. దానిని పూర్తిగా అణచివేయుటకు ప్రభుత్వం ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రజలు కాంగ్రెసును మాత్రమే అభిమానించే వారని. దానిని లక్ష్యపెట్టక ప్రజలను వశపరచుకొనుట ప్రభుత్వానికి సాధ్యం కాజాలదనే విషయాన్ని ఈ ఎన్నికలు ఋజువు చేశాయి.

ఇదిగాక జిన్నా ముస్లింలీగు పక్షానికి చెందినవాడైనా, ఒక సాంఘిక పరిష్కార విషయంలో తప్ప తక్కిన విషయాలలో కాంగ్రెసుతో పూర్తిగా ఏకీభవించి శాసనసభలో కాంగ్రెసువారితో కలిసి కృషి చేయుటకు సిద్ధపడ్డాడు. ఇది కూడా ఆనాటి పరిణామాలలో గుర్తించదగిన విశేషం. జిన్నా మొదటినుండి ఒక గొప్ప జాతీయ వాది. కాంగ్రెసువలెనే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని వాంఛించిన వాడు. ఈ లక్ష్యాన్ని సాధించుటకు హిందువులు, ముస్లింలు కలిసి కృషి చేయడం అవసరమని. ఆలాటి కలియకకు గొప్ప ప్రయత్నం చేసిన

వాడు. బ్రిటిష ప్రధాని సాంఘిక పరిష్కారాన్ని ప్రకటించిన తర్వాతకూడా రెండు వర్గాలు దానిని గురించి చర్చలు జరిపి ఒక రాజీకి రావటం అవసరమని భావించిన వాడు. అందుచేతనే కేంద్ర శాసనసభలో కాంగ్రెసువారితో కలిసి ప్రభుత్వ ప్రతిపాదనలను తిరస్కరించాడు. ఇది కూడా ప్రభుత్వానికి ఒక కనువిప్పుగా పని చేసింది. శాసనసభలో ప్రభుత్వ పక్షానికి చెందినవారు 52రు మాత్రమే. కాంగ్రెసు పక్షానికి జిన్నా పక్షానికి చెందినవారి సంఖ్య 77. ఈ కారణంచేత 1934 తర్వాత సభలో ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్టు పద్దులు, బిల్లులు, తీర్మానాలు అధిక సంఖ్యలో వీగిపోయినాయి. పదే పదే గవర్నరు జనరల్ అతని సర్టిఫికేషన్ అధికారాన్ని వినియోగించవలసి వచ్చింది. ప్రజాభిప్రాయాని కంటె అతని నిరంకుశత్వమే పరిపాలనకు ఆధారంగా పరిణమించింది.

ఈ వాతావరణంలో బ్రిటిష్ ప్రభుత్వం 1935 చట్టాన్ని నిర్మాణం చేసింది. ఇది భారతీయులకు ఎంతమాత్రము ప్రయోజనకారి కాదనీ, వారు వాంఛించే స్వాతంత్ర్యాన్ని సాధించు టకు ఇందులో ఏలాటి అవకాశం లేదనీ, ఇది 1919 చట్టానికంటె మరింత అధ్వాన్నమైనట్టిదని కాంగ్రెసు. జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగు, లిబరల్ పక్షం, హిందూ మహాసభ మొదలైనవి వాటి సమావేశాలలో తీర్మానాలు గావించాయి. దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం ఒక పక్షం గాను. ప్రజాదరణకు పాత్రములైన పార్టీలన్నీ దానిని ప్రతిఘటించే ప్రతి పక్షాలుగాను ఏర్పడి నాయి. రెండు పక్షాలు సన్నిహితములయ్యే అవకాశం పూర్తిగా లోపించింది.

ఇదేకాలంలో కాంగ్రెసులో కమ్యూనిస్టు సోషలిస్టు సిద్ధాంతాలచే ప్రభావితమైన వామ పక్షం ప్రాబల్యం గాంచింది. 1929 తర్వాత ప్రపంచంలో ఏర్పడిన ఆర్థికమాంద్యం కారణంగా కర్షకులయొక్కయు కార్మికులయొక్కయు పరిస్థితులు దిగజారి పోయినవి. వారు అనుభవించే దారిద్ర్యం దుర్భరమై పోయింది. వారి రక్షణకు ప్రభుత్వం ఏలాటి ప్రయత్నాలు చేయలేదు. వీరిలోను. విద్యార్థులలోను నూతన చైతన్యం నాటుకొన్నది. ఒక అఖిలభారత కిసాన్ సభ, ఒక అఖిలభారత విద్యార్థి సమాఖ్య, ఒక అఖిలభారత కార్మిక కాంగ్రెసు (All-India Trade union congress), ఒక అభ్యుదయ రచయితుల మహాసభ ఏర్పడినవి. ఈలాటి మహాసభల ఆశయాలను కాంగ్రెసులోని యువకతరం వారు సాధించదలచారు. వీరికి జవహర్‌లాల్ నెహ్రూ సుభాష్‌చంద్రబోసు నాయకులయ్యారు. ఆ రోజులలో ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించి నందున దానికి చెందినవారు కాంగ్రెసులో సభ్యులై వామపక్షాన్ని బలపరచారు. వీటన్నిటి ఫలితంగా పరాయి పరిపాలనను నిర్మూలించినగాని ప్రజల ఆర్థిక పరిస్థితులు చక్కబడజాలవనే భావం మరింత తీవ్రరూపాన్ని ధరించింది. స్వాతంత్ర్య సంపాదనపట్ల కాంగ్రెసువారి దీక్ష బల పడింది. రాజకీయ పరిస్థితులు ఆర్థిక పరిస్థితులు పరస్పరాశ్రయాలని ఈ పరిణామం స్పష్టం చేసింది.

1935లో కాంగ్రెసు సమావేశం జరగలేదు. 1936 ఏప్రిలులో లక్నోలో జరిగిన సమావేశానికి జవహర్‌లాల్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రశంసిస్తూ అధ్యక్షపీఠాన నుండి గంభీరోపన్యాసం చేశాడు. కాని అప్పట్లో కమ్యూనిస్టు సిద్ధాంతాలకు, అవి ప్రతిపాదించిన వర్గపోరాటానికి విముఖుడైన గాంధీ ప్రభావమే కాంగ్రెసులో ఎక్కువగా ఉండినది. స్వాతంత్ర్యాన్ని సంపాదించడంలోనే కాంగ్రెసు తన దృష్టిని కేంద్రీక

రించవలసిందిగా ఆయన వ్యక్తపరచిన అభిప్రాయంతోనే కాంగ్రెసు ఏకీభవించింది. జవహర్‌లాల్ నెహ్రూ కూడా క్రమక్రమంగా దీనిచే ప్రభావితుడైనాడు. 1936 లో మహారాష్ట్రంలోని ఫైజపూరులో కాంగ్రెసు రెండవ పర్యాయం సమావేశమైంది. దానికి కూడా జవహర్‌లాల్ అధ్యక్షుడు. కాని అధ్యక్షోపన్యాసంలో కమ్యూనిస్టు సిద్ధాంతాలను ఎక్కువగా ప్రశంసించలేదు.

1935 చట్టం 1937 ఏప్రిలులో అమలులోకి రావలసినట్లు ప్రభుత్వం నిర్ణయించింది. అందుకుగాను 1937 ప్రారంభాన ఎన్నికలు జరగవలసి ఉండినవి. సంస్థానాధీశులు సమాఖ్యలో చేరే విషయంలో జేసిసారాలకు దిగిన కారణంగా కేంద్రంలో 1935 చట్టప్రకారం జరగవలసిన మార్పులు వాయిదా వేయబడినవి. అందుచేత రాష్ట్ర శాసనసభలకు మాత్రమే ఎన్నికలు జరిగాయి.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు ఘన విజయాన్ని సాధించింది. వివిధ రాష్ట్రాలలో అది గెలిచిన స్థానాలు ఈ క్రింది విధంగా ఉండినవి.

| రాష్ట్రం | మొత్తం సభ్యులు | కాంగ్రెసు గెలిచిన స్థానాలు | శాతం |
|---|---|---|---|
| 1. మద్రాసు | 215 | 159 | 74 |
| 2. బీహారు | 152 | 95 | 65 |
| 3. మధ్యప్రదేశ్ | 112 | 70 | 62.5 |
| 4. ఉత్తరప్రదేశ్ | 228 | 133 | 59 |
| 5. ఒరిస్సా | 60 | 36 | 60 |
| 6. బొంబాయి | 175 | 86 | 49 |
| 7. వాయవ్య సరిహద్దు | 50 | 19 | 38 |
| 8. అసాం | 108 | 33 | 30.5 |
| 9. బెంగాలు | 250 | 60 | 24 |

పై అంకెలబట్టి మొదటి అయిదు రాష్ట్రాలలో దానికి మెజారిటీ బలం లభించిందని, అందుచేత మంత్రి వర్గాలను నిర్మాణం చేసి అధికారంలోకి రాగల అవకాశం కలిగిందని స్పష్టం అవుతున్నది. తర్వాత నాలుగు రాష్ట్రాలలో దానికి మెజారిటీ బలం లభించక పోయినా ఇతర పార్టీలలో దేనికీ లభించని సంఖ్యాబలం దానికి లభించింది. సింధు, పంజాబులలో మాత్రం అది గెలిచిన స్థానాలు చాలా స్వల్పం. జనాభాలో ముస్లింలు అధిక సంఖ్యలో ఉండిన రాష్ట్రాలలో (అనగా పంజాబు, సింధు, వాయవ్య సరిహద్దు బెంగాలులో) దాని పలుకుబడి తక్కువ స్థాయిలో ఉండినది. అన్ని రాష్ట్రాలలో ముస్లింలు ప్రత్యేక నియోజక వర్గాలద్వారా వోటు చేయడంచేత వారిపై కాంగ్రెసు ఏలాటి ప్రభావం వహించలేక పోయింది. వారు కొన్ని మినహాయింపులకు లోబడి ఏదో ఒక ముస్లిం పార్టీలకు మాత్రమే వోటు చేశారు. ఈలాటి ఫలితాన్ని ఆశించియే, బ్రిటిష్ ప్రభుత్వం ప్రత్యేక నియోజక వర్గాలను నిర్మాణం చేసింది. దాని ఆశయం పూర్తిగా సిద్ధించింది.

ఎన్నికలలో అనేక రాష్ట్రాలలో కాంగ్రెసు ఘన విజయాన్ని సాధించడం మొదటి విశేషం. ముస్లింలీగు ముస్లింలకు కేటాయించిన స్థానాలలో ఎక్కువ స్థానాలను సంపాదించలేక పోవడం రెండవ విశేషం. ముస్లిం మెజారటి రాష్ట్రాలలో ఒక్కొక్క దానిలో రాష్ట్రీయ ముస్లిం

పార్టీలు ఏర్పడి వోటర్లపై ఎక్కువ ప్రభావాన్ని వహించాయి. అక్కడి ముస్లింలకు శాసన సభలలో మెజారటీ స్థానాలు తప్పక లభించే అవకాశం ఉండినది. తక్కిన రాష్ట్రాలలోని ముస్లింల పరిస్థితులు సమస్యలు వీరి సమస్యకంటె భిన్నములైనవి. హిందువులు అధికారం లోకి రాగలరనే భయం గాని, అధికారాన్ని వారితో పంచుకొనవలసిన అవసరం గాని వీరికి లేదు. అందుచేత వీరు అఖిలభారత ముస్లింలీగుతో గాని, దాని నాయకుడైన జిన్నాతో గాని ఎక్కువ సంబంధాలు పెట్టుకొనలేదు. ఇదిగాక ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా ఉండిన ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రాలలో కూడా ముస్లింలు లీగు నాయకత్వాన్ని అంగీకరించలేదు. జిన్నా సామాన్య ప్రజలపట్ల ఎక్కువ శ్రద్ధ వహించినవాడు. జమీందార్లు, ఇతర భూస్వాములు, ధనిక వర్గానికి చెందినవారు అతని ప్రజాస్వామిక దృక్పథాన్ని నిరసించారు. అలాటివారు కొందరు ప్రత్యేక పార్టీలు నిర్మాణం చేసుకొని వాటి తరఫున ఎన్నికలలో పాల్గొన్నారు; మరికొందరు స్వతంత్రులుగా పాల్గొన్నారు. ఈ కారణాల ఫలితంగా జిన్నా సమర్థించిన లీగుకు ఎన్నికలలో ఎక్కువ స్థానాలు లభించలేదు. పంజాబులో ముస్లింలకు కేటాయించిన స్థానాలలో రెండు మాత్రమే దానికి లభించింది; సింధు. వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో ఒక స్థానం కూడా లభించలేదు. బెంగాలులో 119 స్థానాలలో 40 స్థానాలను గెలుచుకొన్నది. ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా ఉండిన రాష్ట్రాలలో అది కొంత చెప్పుకొనదగిన విజయాన్ని సాధించింది. ఉత్తరప్రదేశ్‌లో 64 స్థానాలలో 27, బొంబాయిలో 29 స్థానాలలో 20, మద్రాసులో 28 స్థానాలలో 11 దానికి లభించాయి. అఖిలభారత దృష్ట్యా ముస్లింలకు కేటాయించిన మొత్తం స్థానాలలో నాల్గవ వంతుకంటె తక్కువ స్థానాలు అది సంపాదించుకో కలిగింది. దేశంలోని ముస్లింలు అందరికి అది ప్రాతినిధ్యం వహించే సంస్థ అని అది చెప్పుకొనలేక పోయింది. ఇది జిన్నాకు చాలా ఆశాభంగాన్ని కలిగించింది. అలాగు చెప్పుకొనగల హక్కును సంపాదించడం అతని ప్రధాన లక్ష్యమైంది. దానిని 1940 నాటికి సాధించగలిగాడు. ఇదే అతనిలోని విశిష్టత.

## 4

1935 చట్టం రాష్ట్రాల పరిపాలనను శాసనసభలకు బాధ్యత వహించిన మంత్రుల వశంలోకి తెచ్చింది. దేశ పరిపాలనలో భారతీయులకు భాగస్వామ్యం ఉండవలెనని 1858 తర్వాత జాతీయవాదులు వ్యక్తంచేస్తూ వచ్చిన అభిప్రాయం కొంతవరకు ఆచరణ సాధ్యమైంది. 1937లో ఎన్నికలు జరిగినతర్వాత కాంగ్రెసు మంత్రి పదవులను స్వీకరించి అధికారంలోకివచ్చి రాష్ట్ర పరిపాలనను సాగించే విషయంలో నాయకులమధ్య ఏకీభావం కుదరలేదు. జవహర్‌లాల్ నెహ్రూ 1936 ఫైజుపూరులో జరిగిన కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహించి, తన ఉపన్యాసంలో మంత్రి పదవులను స్వీకరించరాదని ఉద్ఘాటించాడు. 1935 చట్టాన్ని పూర్తిగా ఖండించిన కాంగ్రెసువారు అదే చట్టానుసారం అధికారంలోకి రావడం గౌరవప్రదం కాదని, ఆ చట్టం మూలంగా మంత్రులకు లభించిన అధికారం చాలా స్వల్పమనీ, వాస్తవాధికారమంతా గవర్నరులదే అని, అలాటి అధికారాన్ని చెలాయించడం మూలాన ప్రజల స్థితిగతులను చక్కపరచడం సాధ్యం కాదని, ఇంతేగాక అప్పటివరకు పరాయి ప్రభుత్వం రూపొందించిన శాసనాలను అమలుపరచి స్వాతంత్ర్యప్రియులను నిర్బంధించడంలో మంత్రులు పాల్గొనడం తప్పదని ఇది కాంగ్రెసు ఆశయాలకు పరమ విరుద్ధమని ఆయన అభిప్రాయ పడినాడు. కాని కాంగ్రెసులోని అధిక సంఖ్యాకులు ఆయనతో ఏకీభవించలేదు. 1935 చట్టప్రకారం ఎన్నికలలో పాల్గొని

శాసనసభలలో ప్రవేశించడం సముచితమైనప్పుడు ఆ చట్టప్రకారం మంత్రి పదవులను స్వీకరించడం కూడా సముచితమే అని, దీని మూలంగా కొంతవరకైనా ప్రజల స్థితిగతులను చక్కబరచే అవకాశం ఉన్నదని, పరిస్థితులు అనుకూలించని తర్వాత పదవులను విసర్జించి స్వాతంత్ర్య సమరాన్ని ఇంకొక పర్యాయం సాగించుటకు ఈ విధానం ప్రతిబంధకం కాదని. అందుచేత ప్రస్తుత పరిస్థితులలో మంత్రి పదవులను స్వీకరించి పరిపాలనాధికారం హస్తగతం చేసుకోవడమే ప్రాజ్ఞత అని వీరు వాదించారు. కొనకు వీరి వాదమే నెగ్గింది.

దీనిని గురించి తుది నిర్ణయం తీసుకొనుటకు అఖిలభారత కాంగ్రెసు కమిటీ మార్చి 17, 18 లలో సమావేశమై 1935 చట్టం ద్వారా మంత్రులకు లభించిన అధికారాలను చెలాయించడంలో గవర్నరులు జోక్యం కలిగించుకొనక ఉంటునట్లు హామీ ఇచ్చిన పక్షంలో కాంగ్రెసుకు మెజారిటీ లభించిన రాష్ట్రాలలో మంత్రివర్గాలు అధికారం వహించవచ్చునని తీర్మానించింది. కాని ఈలాటి హామీ ఇచ్చుటకు గవర్నరులు అంగీకరించలేదు. దీని మూలంగా శాసనసభలకు బాధ్యత వహించిన మంత్రివర్గాలు నిర్మాణం కాక, పరిపాలనలో ప్రతిష్టంభన ఏర్పడి, ఎనిమిది సంవత్సరాల కాలం ఎంతో కష్టపడి రూపొందించిన 1935 చట్టం నిరర్థకమయ్యే పరిస్థితి పొడసూపింది. ఈ కారణంచేత వైస్రాయి విషయాన్ని గురించి సమగ్రంగా ఆలోచించి చట్టానుసారం మంత్రులకు లభించిన అధికారాలలో గవర్నరులు జోక్యం కలిగించుకొనడం జరగదనే హామీ ఇచ్చాడు. అటుపిమ్మట కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం సమావేశమై మంత్రి వర్గాలను నిర్మాణం చేసి పదవులను స్వీకరించవచ్చునని తీర్మానించింది. దీనిమేరకు కాంగ్రెసువారు మంత్రి పదవుల నధిష్ఠించి జూలై 7న అధికారంలోకి వచ్చారు.

కాని మంత్రివర్గాల నిర్మాణంలో ఇంతకంటె గడ్డు సమస్య నింకొక దానిని కాంగ్రెసు ఎదుర్కొనవలసి వచ్చింది. దానికి పరిష్కారం కుదరక భవిష్యత్తులో విషాదకరములైన పరిణామాలు సంభవించినవి.

1935 చట్టానుసారం ఏర్పడే మంత్రివర్గాలన్నిటిలో అల్ప సంఖ్యాకవర్గాల వారికి సముచితమైన ప్రాతినిధ్యం ఉండవలెనని బ్రిటిష్ ప్రభుత్వం గవర్నరులకు ఆదేశాలను జారీ చేసింది. కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడిన రాష్ట్రాలలోని అల్ప సంఖ్యాకులలో ముస్లింలు ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించారు. ఇంతేగాక, ముస్లిం పార్టీలన్నిటిలో జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగు అగ్రస్థానంలో ఉండినది. కాంగ్రెసు మంత్రివర్గంలో చేర్చుకొనదగిన ముస్లిం, కాంగ్రెసుపార్టీకి చెందినవాడుగా ఉండవలెనా లేక ముస్లిం ప్రత్యేక నియోజకవర్గాలు ఎన్నుకొన్న ముస్లింగా ఉండవలెనా అనే సమస్య బయలుదేరింది. కాంగ్రెసు పక్షంలో చేరినవాడుగానే ఉండడం అవసరమని కాంగ్రెసువారు భావించారు. మంత్రులు కాంగ్రెసు నిర్ణయించిన కార్యక్రమాలను అమలు పెట్టగలవారుగా ఉండవలెనని, కాంగ్రెసు పక్షంలోని ముస్లింలే అలాటివారని కాంగ్రెసు అభిప్రాయ పడింది. ఇంతేగాక, బాధ్యతాయుత విధానంలో మంత్రివర్గం సమిష్టి బాధ్యతను నిర్వహించవలసి ఉన్నది. మంత్రులందరు ఒకే భావం కలవారై ఒకే లక్ష్యం పట్లనూ ఒకే కార్యక్రమం పట్లనూ విశ్వాసం కలవారైనప్పుడే సమిష్టి బాధ్యత ఆచరణ సాధ్యం అవుతుంది. కాంగ్రెసు పక్షానికి చెందనివారి ఆశయాలు కార్యక్రమాలు భిన్నంగా ఉండడంచేత అలాటివారు మంత్రివర్గంలో చేరిన పక్షంలో సమిష్టి బాధ్యత సూత్రానుసారం మంత్రివర్గం

కృషి చేయడం సాధ్యం కాదు. ఈలాటి కారణాలను పురస్కరించుకొని కాంగ్రెసు పక్షానికి చెందిన ముస్లింలను మాత్రమే మంత్రివర్గంలో చేర్చుకొనడం వాంఛితమని కాంగ్రెసు నిర్ణయించింది. ముస్లింలు కాంగ్రెసులో లేని పక్షంలో, శాసన సభ్యులలోని ఇతర ముస్లింలు ఎవరైనా కాంగ్రెసులో చేరుటకు సమ్మతించిన పక్షంలో వారిని మంత్రులుగా నియమించుటకు కాంగ్రెసు అంగీకరించినది.

జిన్నాకు ఇది ఎంతమాత్రము ఆమోదయోగ్యం కాలేదు. కాంగ్రెసు పక్షానికి చెందిన ముస్లింలు ముస్లింలచే ఎన్నుకొనబడినవారు కారు. అందుచేత వారు ముస్లింలకు విశ్వాస పాత్రులు కాజాలరు. ముస్లింల అవసరాలను ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని వారు వ్యవహరించ జాలరు. ముస్లింల ప్రత్యేక నియోజక వర్గాలు ఎన్నుకొన్నవారే ముస్లింలకు విశ్వాస పాత్రులు. అందుచేత మంత్రివర్గాలలో చేర్చుకొనదగిన వారు ఆలాటి వారే. ఇంతేగాక ముస్లిం పార్టీలన్నిటిలో లీగు అగ్రస్థానంలో ఉన్నట్టిది. అందుచేత లీగు సభ్యులే మంత్రి పదవులకు అర్హులు అని అతడు వాదించాడు.

ఉత్తరప్రదేశ్ మంత్రివర్గ నిర్మాణ సందర్భంలో ఈ వాదోప వాదాలు తీవ్రరూపం ధరించాయి. ఆ రాష్ట్రంలోని శాసనసభకు 64 ముస్లింలు ప్రత్యేక నియోజక వర్గాలద్వారా ఎన్నుకొనబడినారు. వారిలో 27 రు ముస్లింలీగుకు చెందినవారు. అదియే ప్రధానమైన పార్టీ. ముస్లింలకు కేటాయించిన స్థానాలలో ఒకదానిని మాత్రమే కాంగ్రెసు గెలిచింది. కాంగ్రెసుపట్ల ముస్లింలకు విశ్వాసం లేదని ఇది రుజువు చేసింది. ఈ పరిస్థితులలో కాంగ్రెసూ లీగూ కలిపి ఒక సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పరచవలసిందిగా జిన్నా కోరాడు.

జిన్నా కొన్ని షరత్తులకు అంగీకరించిన పక్షంలోనే ఇది సాధ్యం కాగలదని కాంగ్రెసు అధిష్ఠాన వర్గం తెలియజేసింది. ఈ షరత్తులలో మొదటిది ముస్లింలీగు శాసనసభలో ఒక ప్రత్యేక పార్టీగా ఉండరాదు; రెండవది లీగు సభ్యులందరు కాంగ్రెసులో లీనమై పోవలెను; మూడవది ఎన్నికల సమయంలో లీగు ఏర్పరచిన ఎన్నికల బోర్డు రద్దు కావలెను; నాల్గవది భవిష్యత్తులో జరిగే ఉప ఎన్నికలలో లీగు అభ్యర్థులను ప్రత్యేకంగా నిలబెట్టరాదు. ఈ షరత్తులకు అంగీకరించడం ముస్లింలీగు ఆత్మహత్య చేసుకొని దాని వ్యక్తిత్వాన్ని కోల్పోవడమే అని జిన్నా భావించాడు. ముస్లింలీగు ఒక ప్రత్యేక పార్టీగా 1905 నుండి వ్యవహరిస్తుండినది. అది ముస్లింలలో అనేకుల అభిమానానికి పాత్రమైనట్టిది. దానికి నాయకుడైనందుననే జిన్నా రాజకీయ రంగంలో ప్రాధాన్యాన్ని వహించాడు. ఈలాటి పరిస్థితులలో లీగు తన వ్యక్తిత్వాన్ని వదలుకొని, కాంగ్రెసులో లీనమైపోవడం అతనికి ఏమాత్రం రుచించలేదు. దేశంలో ముస్లింలు ఒక ప్రత్యేక వర్గానికి చెందినవారు. లీగు వారికి ప్రాతినిధ్యం వహించే సంస్థ. ఆలాటి సంస్థ రద్దయి. కాంగ్రెసుతో కలిసిపోవలెనని కోరడం ముస్లింలు తమ ప్రత్యేకతను వ్యక్తిత్వాన్ని కోల్పోవలసినదిగా కోరడమే. ఒకటి రెండు మంత్రిపదవులకుగాను ఈలాటి కోరికకు లొంగడం ముస్లింలకు గౌరవకరం కాజాలదు. వారు ఎన్నడూ తమ వ్యక్తిత్వాన్ని వదలుకొనరు అని జిన్నా ఉద్ఘాటించాడు.

ఇంతేగాక 1937 లోని ముస్లింలీగు 1905 లోని ముస్లింలీగు వంటిది కాదు. దాని ఆశయాలకు కాంగ్రెసు ఆశయాలకు ఎలాటి భేదం లేదు. అదికూడా దేశానికి సంపూర్ణ బాధ్యతా

యుత పరిపాలన విధానాన్ని కోరుతూ ఉంది. అదివరలో జమీందార్లు భూస్వాములు లీగులో ప్రాధాన్యం వహించి ఉండినారు. 1937 నాటికి వారి ప్రాధాన్యం తొలగి, కాంగ్రెసువలెనే అది విద్యాధికులైన మధ్యతరగతి వారి సంస్థగా రూపొందింది. దాని లక్ష్యం కూడా కర్షకుల యొక్కయు, కార్మికుల యొక్కయు, సామాన్య ప్రజానీకం యొక్కయు ప్రయోజనాలకు పాటు బడడమే. ఈ పరిస్థితులలో కాంగ్రెసు లీగు కలిసి సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పరచుకొని వ్యవహరించడంలో సమిష్టి బాధ్యతానుసారం పరిపాలనను సాగించడంలో ఏలాటి ఇబ్బందులూ ఉండవు. లీగు యొక్క ప్రత్యేకతను, ప్రాధాన్యాన్ని గుర్తించి, రాష్ట్ర పరిపాలనలో దానికి భాగస్వామ్యం కల్పించడం ఉభయవర్గాలకు శ్రేయస్కరం—అని జిన్నా వాదించారు.

కాని కాంగ్రెసు ఇందుకు సమ్మతించలేదు. దీని ఫలితంగా జిన్నా ఆగ్రహపరవశుడై కాంగ్రెసు ముస్లింలపై ద్వేషభావంగల సంస్థ అని, అది హిందువుల ప్రయోజనాలకు మాత్రమే పాటుబడునట్టిదనే నిర్ణయానికి వచ్చి దానిపై పగ తీర్చుకొనుటకు సిద్ధపడ్డాడు. ఇది క్రమ క్రమంగా పెరిగి, పాకిస్థాన్ ఉద్యమానికి అతనిని నాయకునిగా చేసింది. దేశవిభజన అనివార్యమై పోయింది. ఉత్తరప్రదేశ్‌లో మంత్రివర్గ నిర్మాణం ఈలాటి విషాదకరమైన పరిణామానికి దారి తీసింది. అందుచేతనే దానిని గురించి కొంత విపులంగా వివరించవలసి వచ్చింది.

## 5

1937 జూలై 7 న మద్రాసు, ఒరిస్సా, బీహారు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బొంబాయి వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో కాంగ్రెసుమంత్రి వర్గాలు అధికారంలోకి వచ్చాయి. తక్కిన నాలుగు రాష్ట్రాలలో—అనగా బెంగాలు, అసాం, పంజాబు, సింధు రాష్ట్రాలలో—కాంగ్రెసేతర పార్టీలకు చెందిన మంత్రివర్గాలు ఏప్రిలు నుండి అధికారం వహించాయి. 100, 150 సంవత్సరాల తర్వాత రాష్ట్రస్థాయిలో భారతీయులు పరిపాలనాధికారాన్ని చేపట్టి రాజకీయరంగంలో తమ శక్తి సామర్థ్యాలను ప్రదర్శించే అవకాశం లభించింది. ఇది వారు ఆశించిన స్వరాజ్యం కాకపోయినా స్వరాజ్యసోపానాన్ని అధిరోహించడంలో ఒక ప్రధానమైనట్టి మెట్టుగా గుర్తించదగినది.

పరిపాలనను సాగించడంలో 1935 చట్టం రాష్ట్రగవర్నరులకు కొన్ని ప్రత్యేక అధికారాలను కల్పించింది. వాటిని ఆధారంచేసుకొని వారు మంత్రివర్గాల స్వాతంత్ర్యానికి భంగం కలిగించెదరేమో అనే అనుమానంతో మంత్రివర్గాలు అధికారాన్ని చేపట్టాయి. కాని మొత్తం మీద—ఏవో రెండుమూడు సంఘటనలు మినహా—గవర్నరులు మంత్రుల స్వాతంత్ర్యానికి ఏలాటి అవరోధాలను కల్పించక వారితో సహకరించారు. ఇదే విధంగా ఉన్నత ఉద్యోగవర్గానికి చెందిన యూరోపియన్లు మంత్రులకు పూర్తిగా లోబడవలసినవారు కాకపోయినా, వారితో సహకరించారు. పరిపాలనకు మంత్రులు కొత్తవారైనా ఈలాటి సహకారం లభించడంచేత వారు వారి బాధ్యతలను సౌష్టవంగా నిర్వహించగలిగారు.

కాంగ్రెసు మంత్రివర్గాలు కాంగ్రెసు లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించడమనే విషయాన్ని విస్మరించి వారివారి రాష్ట్రాల పరిపాలనలో పూర్తిగా నిమగ్నులయ్యే ప్రమాదమూ, తమ రాష్ట్రాలపట్ల ఎక్కువ అభిమానంకలవారై, దేశమంతటి విషయంలోను ఇతర రాష్ట్రాల విషయంలోను సంకుచితమనస్తత్వంతో ప్రవర్తించే ప్రమాదమూ ఏర్పడవచ్చు. అది

అలాటి ప్రమాదాలకు లోబడక వాటిని అదుపులో ఉంచుటకు కాంగ్రెసు అధిష్ఠానవర్గమూ, ఎన్నికల కాలంలో నియమింపబడిన కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు వాటిపై అధికారాన్ని వహించాయి. ఇందులో జవహర్‌లాల్, రాజేంద్రప్రసాద్, ఆజాద్, వల్లభాయిపటేల్, రాజగోపాలాచారివంటి ప్రముఖులు సభ్యులుగా ఉండినారు. వీరందరిపై గాంధీ పూర్తి అధికారాన్ని వహించినాడు. ఆయన 1934 నుండి కాంగ్రెసునుండి విడిపోయినా (సభ్యత్వాన్నికూడా వదలుకొన్నాడు) నాయకులందరు ఆయన ఆదేశాలను అనుసరించే అన్ని కార్యక్రమాలను సాగిస్తూ వచ్చారు. ఆయన అధ్వర్యంలో పనిచేయడంచేత అధిష్ఠాన వర్గం, పార్లమెంటరీ బోర్డులు మంత్రివర్గాలన్నీ ఒకత్రాటి పైన నడవగలిగాయి. చట్టరీత్యా మంత్రివర్గాలకు స్వాతంత్ర్యం లభించినా అవి కాంగ్రెసులోని కేంద్ర సంస్థలకు లోబడి వ్యవహరించడం గుర్తించవలసిన విషయం. ఆనాడు ఏర్పడిన ఈ సంప్రదాయం స్వరాజ్యం లభించిన తర్వాతకూడా—ఇప్పటివరకు—దేశపరిపాలన విధానంలో ఒక శాశ్వత స్థానాన్ని కల్పించుకొన్నది.

ప్రజాప్రతినిధులు అధికారంలోకి వచ్చినందున ప్రజల ఆభీష్టాలు నెరవేరగలవని అందరు ఆశించారు. చాలావరకు మంత్రివర్గాలు దీనికి అనుగుణంగానే ప్రవర్తించినట్లు చెప్పవచ్చు.

దీనికి మొదటిమెట్టుగా వారు డిటెన్యూలుగాను, శిక్షితులుగాను నిర్బంధంలో ఉండిన వారిలో అనేకులను విడుదల చేశారు. ఈ విషయంలో ఉత్తరప్రదేశ్‌లోను బీహారులోను గవర్నరులు మంత్రులతో సహకరించని కారణంగా మంత్రులు రాజీనామా చేశారు. అటుపైన వైస్రాయీ గవర్నరులూ ఈ విషయాన్ని గురించి పునరాలోచించి కాంగ్రెసుతో ఒక రాజీకి వచ్చారు. మంత్రులు వారి రాజీనామాలను ఉపసంహరించుకొని, అధికారంలోకివచ్చి, క్రమక్రమంగా విడుదల కార్యక్రమాన్ని చాలావరకు పూర్తి చేసుకొనగలిగారు.

శాసనోల్లంఘన కార్యక్రమాలను సాగించినట్టివీ, అహింసాతత్వంలో విశ్వాసం కలిగినట్టివీ కాంగ్రెసువారు చట్టవిరుద్ధంగా ప్రవర్తించి నేరస్థులుగా పరిగణించవలసిన వారిని శిక్షించి, శాంతిభద్రతలను రక్షించగలరా అనే సందేహం బ్రిటిష్‌వారికి ఉండినది. కాని ఈ సందేహం నిరాధారమని, అధికారంలోకి వచ్చిన తర్వాత కాంగ్రెసుమంత్రులు శాంతి భద్రతలను రక్షించడంలో అవసరమైన చర్యలను తీసుకొని, పరిపాలనను సౌష్టవంగా జరిపే సామర్థ్యం తమకు కలదని రుజువు చేయగలిగారు.

ఈ సందర్భంలో వారు కొన్ని ప్రత్యేక సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. ఎన్నికల ప్రణాళికలో వారు ప్రజలకు అనేక వాగ్దానాలను చేశారు. దారిద్ర్య పీడితులైన రైతులకు కార్మికులకు విముక్తి కలిగించడం తమ ప్రథమ కర్తవ్యమని ఉద్ఘాటించారు. ఈ వాగ్దాలన్నిటినీ కాంగ్రెసు మంత్రులు వెంటనే చెల్లించగలరని ప్రజలు భావించారు. అది కొంత ఆలస్యంతోకూడిన కార్యక్రమమనీ, అనేక క్లిష్టవిషయాలను గురించి సమగ్రంగా ఆలోచించిన తర్వాతగాని, అవసరమైన శాసనాలను రూపొందించడం సాధ్యం కాజాలదని సామాన్య ప్రజానీకం గ్రహించలేక పొయ్యారు. ఈ కారణంగా ఉత్తరప్రదేశ్, బీహారు మొదలైన రాష్ట్రాలలోని కర్షకులు జమీందార్లపైన భూస్వాములపైన ఒక విధమైన తిరుగుబాటుచేసి, ఆస్తికి ప్రాణాలకు గొప్ప నష్టాన్ని కలిగించారు. మంత్రులు సకాలంలో చర్యలు తీసుకొని, అవసరమైన

బలప్రయోగంచేసి, ఈ అల్లరులను అణచివేశారు. నేరం చేసిన వారిని చట్టానుసారం శిక్షించ వలసినదేనని, అందులో హింస ఏలాటిదీ లేదని, గాంధీ ఆదేశించి మంత్రుల చర్యలను సమర్థించాడు. ఈలాటి చర్యలతోపాటు మంత్రివర్గాలు కౌలుదార్ల రక్షణార్థం కొన్ని సంస్కరణలను క్రమక్రమంగా ప్రవేశపెట్టి రైతులకు కొంత తృప్తిని కలిగించారు.

ఆ రోజులలో మిల్లులలోను ఇతర ఫ్యాక్టరీలలోను పనిచేసే కార్మికులు కూడా అనేక బాధలను అనుభవిస్తూ వచ్చారు. వారుకూడా బొంబాయి, అహమ్మదాబాదు, కాన్‌పూరు వంటి నగరాలలో సమ్మెలుచేసి దౌర్జన్య చర్యలలోకి దిగారు. మంత్రివర్గాలు వారిపైనకూడా కఠిన చర్యలను తీసుకొనడం తప్పిందికాదు. కాని శాంతి భద్రతలను రక్షించుటకు ఇది అవసరమని గ్రహించారు.

ఈ కాలంలో హిందువులు ముస్లింలు మధ్య మతకలహాలు కొట్లాటలు మరింత తీవ్ర రూపాన్ని ధరించాయి. మంత్రివర్గాల నిర్మాణంలో కాంగ్రెసు ముస్లింలీగుల మధ్య ఏర్పడిన విభేదాలు దీనికి ప్రధాన కారణం. కాంగ్రెసు ప్రభుత్వాలు హిందూ ప్రభుత్వాలని, వాటిమూలంగా ముస్లింలకు ఏలాటి న్యాయం లభించదని, లీగు నాయకులు ప్రచారం సాగించారు. ఇందులో మత దురభిమానంగల ముల్లాలు గొప్ప పాత్రను వహించారు. వీరికి గ్రామప్రాంతాలలో నివసించే ముస్లింలపై ఎక్కువ ప్రభావం ఉండేది వీటి అన్నిటి ఫలితంగా ఉత్తరప్రదేశ్, బీహారు, బొంబాయి మొదలైన రాష్ట్రాలలో ఉభయ మతవర్గాలమధ్య కొట్లాటలు సంభవించి అపార నష్టానికి దారి తీశాయి. వీటిని అణచడంలో మంత్రివర్గాలు ఏలాటి గొంకు జంకు లేక తీసుకొనవలసిన కఠిన చర్యల నన్నిటినీ తీసుకొన్నాయి. అయినా వీటిలో 130 మంది ప్రాణాలను కోల్పోయ్యారు; 1564 రు గాయపడినారు; ఆస్తికి అపార నష్టం కలిగింది.

దౌర్జన్య కార్యక్రమాలలో పాల్గొన్న కర్షకులను, కార్మికులను, మతోన్మాదులను అణచడంలో పరిపాలన బాధ్యతను వహించిన భారతీయులు ఏ మాత్రమూ వెనుదీయరని, సమర్థతతో వారు శాంతిభద్రతలను రక్షించగలరని పై ఉదంతాలు స్పష్టం చేశాయి.

కాని పరిపాలకుల లక్ష్యం శాంతి భద్రతలను రక్షించడం మాత్రమేకాదు. ప్రజలు అనుభవించే దారిద్ర్యాన్ని ఇతర బాధలను తొలగించి, వారి అభ్యుదయానికి కృషి చేయడం ఇంతకంటె ప్రధానమైన కర్తవ్యం. ఇందుకుగాను కూడా మంత్రివర్గాలు అనేక కార్యక్రమాలను సాగించాయి. అవసరమైన ఆర్థిక వనరులు లభించని కారణంగాను, అలాటి సమపాయాలుగల కేంద్రప్రభుత్వంపై వారికి ఏలాటి పలుకుబడి లేనందునను, వారు 27 నెలలు మాత్రమే అధికారంలో ఉండడంచేతను, ఈ కార్యక్రమాల విషయంలో ఎక్కువ విజయాన్ని సాధించలేక పోయినారు.

రైతుల స్థితిగతులను మెరుగుపరచే ఉద్దేశంతో మద్రాసు రాష్ట్రంలో రెవిన్యూమంత్రిగా ఉండిన ప్రకాశం అధ్యక్షతను జమీందారీ విధానాన్ని సమగ్రంగా పరిశీలించుటకు ఒక కమిటీని నియమించారు. ఒరిస్సాలో రైతులు చెల్లించవలసిన శిస్తులను తగ్గించుటకు ఒక బిల్లు ప్యాసు చేశారు. కాని అది చట్టరూపం ధరించుటకు ముందు కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామాచేసింది. గవర్నరు జనరలు ఆ బిల్లును ఆమోదించలేదు. ఉత్తరప్రదేశ్‌లో జమీందారీ విధానంలో అనేక మార్పులు చేయబడినవి. తక్కిన రాష్ట్రాలలోకూడా భూ సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి.

రైతుల ఋణబాధలను తగ్గించుటకుకూడా కొన్ని చర్యలు తీసుకొనబడినవి. పరిశ్రమలను వృద్ధి చేసే ఉద్దేశంతో 1939 లో కాంగ్రెసు జవహర్‌లాల్ అధ్యక్షతన ఒక ప్రణాళికా సంఘాన్ని నియమించింది. దాని పని పూర్తికాకముందే కాంగ్రెసు మంత్రివర్గాలన్నీ రాజీనామా చేయడం చేత దానిమూలంగా ఏలాటి ఫలితాలు లభించలేదు.

విద్యాభివృద్ధికై మంత్రివర్గాలు అనేక కార్యక్రమాలను సాగించాయి. కొన్ని ప్రాంతాలలో ప్రాథమిక విద్యను ఉచితంగాను నిర్బంధంగాను ప్రవేశపెట్టినారు. గాంధీ ప్రతిపాదించిన బేసిక్ విద్యావిధానం కూడా ప్రయోగాత్మకంగా అన్ని కాంగ్రెసు రాష్ట్రాలలో ప్రవేశపెట్టారు. 'వయోజన విద్యకై కొంత కృషి జరిగింది.

గాంధీ ఉద్దేశాల ననుసరించి హరిజనోద్ధరణకై కొన్ని కార్యక్రమాలను సాగించారు. వారికి దేవాలయాలలో ప్రవేశం లభించింది. వారి విద్యకు, గృహవసతులకు, అనేక చర్యలను తీసుకొన్నారు.

మద్యపాన నిషేధాన్ని కొన్ని జిల్లాలలో ప్రవేశపెట్టారు.

ఈ విధంగా కాంగ్రెసు మంత్రివర్గాలు సంఘసంక్షేమ కార్యక్రమాలను ప్రారంభించి కాంగ్రెసు లక్ష్యం అధికారాన్ని సంపాదించడం మాత్రమేకాదని, దానిని ప్రజల సర్వతోముఖాభివృద్ధికి వినియోగించడమని స్పష్టం చేశారు.

## 6

కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంలో ఉండిన కాలంలో (1937-39) కాంగ్రెసు అంతరంగిక వ్యవహారాలలో కొన్ని మార్పులు సంభవించాయి. ఇవి స్వాతంత్ర్యోద్యమంపై ప్రభావం వహించిన కారణంగా వాటిని గురించి తెలుసుకొనవలసి ఉంది. వీనిలో ఒకటి స్వదేశ సంస్థానాలపట్ల కాంగ్రెసు అనుసరించదగిన విధానానికి సంబంధించినట్టిది; రెండవది వామపక్ష నాయకులలో ఒకడైన సుభాష్‌చంద్రబోసుకు సంబంధించినట్టిది.

(1) మొదటి నుండి కాంగ్రెసు సంస్థ స్వదేశ సంస్థానాల వ్యవహారాలలో ఏలాటి జోక్యమూ కలిగించుకొనలేదు. బ్రిటిష్ పరిపాలనలో ఉండిన భారతదేశ స్వాతంత్ర్యంపట్లనే అది శ్రద్ధ వహించింది. కాని 1935 చట్టం సంస్థానాలు బ్రిటిష్ పరిపాలనలోని రాష్ట్రాలు కలిపి ఒక సమాఖ్యగా ఏర్పడవలెనని. అది ఏర్పడిననాడే కేంద్రంలో కొంత వరకైనా బాధ్యతాయుత ప్రభుత్వం ప్రవేశపెట్టడం సాధ్యం కాగలదని నిర్ణయించింది. ఆ సేతు హిమాచల పర్యంతం వ్యాపించిన భారతదేశం ఒకే ప్రభుత్వ పరిపాలనకు లోబడి ఉండడం వాంఛనీయమైనా నిరంకుశపరిపాలకులకు లోబడినట్టిన్నీ, బ్రిటిష్ సార్వభౌమాధికారానికి లోబడినట్టిన్నీ సంస్థానాలు రాష్ట్రాలతో కలసిన పక్షంలో స్వాతంత్ర్యోద్యమము ప్రజాస్వామిక విధానము—ఈ రెండూ—దెబ్బతినగలవనే భావం కాంగ్రెసు వారిలో అనేకులకు కలిగింది. సంస్థానాలు బ్రిటిషు పరిపాలకులతో చేసుకొన్న ఒడంబడికల ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వానికి సంస్థానాలపై పూర్తి అధికారం లభించింది. ఒక్కొక సంస్థానంలో రెసిడెంటు అనే పేరుగల ఒక బ్రిటిష్ అధికారి ఉండేవాడు. ఇతని సలహాలకు ఆదేశాలకు లోబడి సంస్థానాధీశులు వారి పరిపాలనను సాగిస్తూ ఉండేవారు. బ్రిటిష్ ప్రభుత్వాన్నికాదని ఏ విషయంలోకూడా స్వతంత్రంగా వారు వ్యవహరించే అవకాశం ఎంతమాత్రమూ లేదు.

అలాటివారు సమాఖ్యలో కలియడంచేత బ్రిటిష్ వారి నిరంకుశత్వానికి మరింత బలం చేకూరి వారి సహాయంతో స్వాతంత్ర్యోద్యమం దెబ్బ తినగలదనే నిర్ణయానికి కాంగ్రెసు వచ్చింది. రాష్ట్రాలలోని ప్రజల ఉద్యమాలను అణచడంలో బ్రిటిషువారి విధానాలు మరింత సులభసాధ్యం అయ్యే ప్రమాదం ఏర్పడింది.

ఇంతేగాక ఈలాటి సమాఖ్య మూలంగా దేశంలోని ప్రజాస్వామిక విధానం బల హీనతగాంచగలదనే భావంకూడా కాంగ్రెసు వారికి కలిగింది. సంస్థానాధీశులందరు నిరంకుశంగా పాలించేవారు. ప్రజాస్వామికం వారికి ఎంతమాత్రము గిట్టదు. ఈ విషయంలో వారి అభిప్రాయాలు బ్రిటిష ప్రభుత్వ అభిప్రాయాల వంటివే. సమాఖ్య శాసన సభలకు వారు పంపే ప్రతినిధులు నిరంకుశత్వాన్ని సమర్థించేవారుగా ఉంటారు. కేంద్ర ప్రభుత్వంలో నియమింపబడే సభ్యులలో (Members of the Executive Council) ఈలాటివారు ఉంటారు. బ్రిటిష్ అధికారులు వీరూ కలిపి ప్రజాపరిపాలనాభివృద్ధికి తప్పకుండా ఆటంకాలు కలిగిస్తారు. దేశంలో సంపూర్ణమైన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడవలెననేది కాంగ్రెసువారి ఆశయం. బాధ్యతాయుత ప్రభుత్వం అంటే ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులతో కూడిన శాసన సభలకు బాధ్యత వహించిన ప్రభుత్వం. సంస్థానాలలో ఈలాంటి ప్రభుత్వాలు లేనందున, సంస్థానాలనుండి సమాఖ్య శాసన సభలకు, కార్యనిర్వాహక వర్గానికివచ్చే వారందరు ప్రజాప్రతినిధులుగాక, నిరంకుశ పరిపాలకులు నియమించినవారుగా ఉంటారు. ప్రజాస్వామికంపట్లవారు అభిమానం లేనివారు కావడంచేత కాంగ్రెసు ఆశించిన సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలన విధానం నిరవధికంగా వాయిదావేయబడడం తప్పదని కాంగ్రెసువారు భావించారు. అందుచేతనే వారు సమాఖ్యపట్ల విరోధభావం కలవారయ్యారు.

కాని, సంస్థానాలు రాష్ట్రాలు వేర్వేరుగా ఉండడం వాంఛనీయంకాదు. దేశమంతా ఒకే ప్రభుత్వం క్రిందికి రావడమే వాంఛించతగినది. సమాఖ్యా విధానంపట్ల విరోధం వహించడం ఈలాటి ఐక్యత లక్ష్యాన్ని విరోధించడమే. ఈ పరిస్థితులలో కాంగ్రెసు కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకొనవలసిన అవసరం ఏర్పడింది. ఇంతవరకు కాంగ్రెసు సంస్థానాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనకుండా ఉదాసీన భావంతో ప్రవర్తించింది. ఇకమీదట అలాగు కాక, సంస్థానాలలోకూడా ప్రజాపరిపాలన విధానం ఏర్పడుటకు తగిన ఉద్యమాలను లేవదీసి, అవి విజయవంతం అయ్యేటట్లు వాటిని సాగించిన పక్షంలో సంస్థానాలలోని ప్రజలు రాష్ట్రాలలోని ప్రజలు కలిసి బ్రిటిష్‌వారిని ఎదుర్కొనడం సాధ్యం కాగలదు. ఇది ఒక్కటె కాంగ్రెసు అనుసరించదగిన విధానమనే భావం యువకతరం వారికి కలిగింది.

ఇదే కాలంలో రాష్ట్రాలలోని ప్రజలు సాగిస్తున్న ఉద్యమాలు సంస్థానాలలోని ప్రజలపై అత్యంత ప్రభావాన్ని వహించాయి. అనాదిగా యీ రెండు ప్రాంతాలలోని ప్రజలు సన్నిహిత సంబంధం కలవారు. బ్రిటిష్ పరిపాలన కాలంలో వారు ఒకవిధమైన పరిపాలనకు, రాష్ట్రాల ప్రజలు ఇంకొకవిధమైన పరిపాలనకు లోబడినా, ప్రాచీనకాలపు సంబంధంలో ఏలాటి మార్పూ కలగలేదు. రాష్ట్రాలలోని ప్రజలు సాగిస్తున్న ఉద్యమాల ఫలితంగా అనేక సంస్థానాలలోని ప్రజలు ప్రజామండలులు అనే సంఘాలను స్థాపించుకొని, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టవలసిందిగా సంస్థాన పరిపాలకులను ఒత్తిడి చేయసాగారు. కొన్ని సంస్థానాలలో

తీవ్రమైన ఆందోళనలు సంభవించాయి. అవి మైసూరు సంస్థానంలో తీవ్రరూపం ధరించగా సంస్థాన ప్రభుత్వం దమన విధానాన్ని అనుసరించి దానిని అణచివేయసాగింది. ప్రజానాయకులు అనేక నిర్బంధాలకు గురిఅయ్యారు.

ఇది 1937 అక్టోబరులో కలకత్తాలో సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు కమిటీ దృష్టిని ఆకర్షించింది. సంస్థాన ప్రజలకు కాంగ్రెసు ప్రత్యక్షంగాసహాయం చేయడమా, మానడమా అనే ప్రశ్న బయలుదేరింది. ఏకకాలంలో బ్రిటిష్‌వారితోను సంస్థానాధీశులతోను సమరాన్ని సాగించడం ప్రాజ్ఞతకాదని గాంధీవంటి వారు భావించారు. బ్రిటిష్ పరిపాలన నిర్మూలనమైన పక్షంలో దాని ఆసరాతో అధికారాన్ని వహించిన సంస్థానాధీశుల అధికారం కూడ వెంటనే నిర్మూలం కాగలదని కాంగ్రెసు వారిలో అనేకులు భావించారు. కాని యువకతరంవారు పట్టు పట్టడంవల్ల సంస్థాన ప్రజలు సాగిస్తున్న ఉద్యమాలపట్ల సానుభూతిని ప్రదర్శిస్తూ, మైసూరు ప్రభుత్వం అనుసరించిన దమన విధానాన్ని ఖండిస్తూ, తక్కిన సంస్థానాలలోని ప్రజలు రాష్ట్రాల లోని వారు యథాశక్తి మైసూరు ప్రజలకు సహాయపడవలసిందిగా కోరుతూ తీర్మానం చేసింది. చాలాకాలాన నుండి సంస్థానాలపట్ల కాంగ్రెసు అనుసరిస్తూ వచ్చిన ఉదాసీన విధానం దీనితో అంతరించింది. సంస్థానాల ప్రజలు రాష్ట్రాల ప్రజలకంటె భిన్నులుకారని, అందరూ కలిపి భారతీయులని. వారు ఒకేవిధమైన సమస్యలను ఎదుర్కొనేవారని, కాంగ్రెసు భావించ ప్రారంభించింది.

1938 లో కాంగ్రెసు కమిటీలు కొన్ని సంస్థానాలలో ఏర్పడినాయి. ఆ సంవత్సరం హరిపురాలో సుభాష్‌చంద్రబోసు అధ్యక్షతన సమావేశమైన కాంగ్రెసులో ఈ కమిటీలు ప్రజల ఆందోళనలో పాల్గొనడమా అనే విషయం చర్చలోకి వచ్చింది. యువకతరం పై ఖరికి గాంధీ నాయకత్వంలోని వృద్ధతరం పై ఖరికి అభిప్రాయభేదాలు ఉత్పన్నములైనాయి. తుదకు రెండు వర్గాలు ఒక రాజీకివచ్చి, సంస్థానాలలోని కాంగ్రెసు కమిటీలు కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘానికి లోబడి తమ కార్యక్రమాలను సాగించవలెనని, కాని తిరుగుబాటు ఉద్యమాలలో పాల్గొనరాదని. అలాటి ఉద్యమాలు సాగించుటకు ప్రత్యేక సంఘాలు ఏర్పడవలసినదని, ఇష్టమున్న కాంగ్రెసువారు వ్యక్తిగతంగా వీటిలో పాల్గొనవచ్చునని తీర్మానంచేసింది. అప్పుడు కూడా కాంగ్రెసు ప్రత్యక్షంగా సంస్థానప్రజలకు తోడ్పడడానికి సిద్ధంగాఉండలేదు.

సంస్థానాలలోని ప్రజామండలుల తోపాటు, అఖిలభారత సంస్థానప్రజల సమావేశం (Conference of All-India state people) ఒకటి ఏర్పడింది. 1939 ఫిబ్రవరిలో ఇది జవహర్‌లాల్ అధ్యక్షతన సమావేశమై కాంగ్రెసు సంస్థానప్రజల ఉద్యమాలలో తోడ్పడం అవసరమని తీర్మానించింది.

ఇదే కాలంలో గాంధీ పుట్టిపెరిగిన రాజకోట సంస్థానంలో ఒక సంఘటన జరిగి భారతీయులందరి దృష్టిని ఆకర్షించింది. అక్కడిప్రజలు సంస్కరణలను ప్రవేశపెట్టవలసిందిగా ఆందోళన జరపసాగారు. అందులో వల్లభాయిపటేల్ జోక్యం కలిగించుకొని, సంస్థానాధీశునితో ఒక రాజీ ఒడంబడికను చేసుకొన్నాడు. కాని మహారాజు ఒడంబడికలోని షరతులను ఉల్లంఘించగా గాంధీ రాజకోటకు వెళ్ళి ఉపవాసవ్రతాన్ని చేపట్టాడు. అయినా సంస్థానాధీశుడు లొంగలేదు. ఉపవాసం వ్యర్థమైనట్లే భావించి గాంధీ వెనుకకు మరలివచ్చాడు.

తాను చేసుకొన్న ఒడంబడిక షరత్తులను సంస్థానాధీశుడు బహిరంగంగా ఉల్లంఘించలేదు. బ్రిటిష్‌ప్రభుత్వం అతనిని ఒత్తిడిచేయనందుచేత. విధిలేక. అలాగు ప్రవర్తించాడు. సంస్థానాలలో కాంగ్రెసునాయకులు ప్రవేశించి, ప్రజల ఉద్యమాలలో జోక్యం కలిగించుకొనడం ప్రభుత్వం ఏమాత్రమూ ఇష్టపడలేదు. సంస్థానాధీశులు కాంగ్రెసునాయకుల ప్రభావానికి లోబడి. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టిన పక్షంలో అలాటి ప్రజాప్రభుత్వాలు తమ అదుపు ఆజ్ఞలలో ఉండవనే భయం బ్రిటిష్‌వారికి కలిగింది. అందుచేత వారు సంస్థానాధీశుల నిరంకుశత్వాన్ని తెరవెనుకనుండి సమర్థించి బలపరచారు. దీనిని క్రమ క్రమంగా సంస్థానప్రజలు కాంగ్రెసు నాయకులు గ్రహించారు. వారు అలా గ్రహించేవరకు. కాంగ్రెసు సంస్థానాలపట్ల తనవైఖరిని మార్చుకొన్నా ప్రజలకు ప్రత్యక్షంగా సహాయంచేయడానికి పూనుకొనలేదు. కాని ఈ కాలంలో దానివైఖరి మారడం గుర్తించదగిన విషయం.

(2) సుభాస్‌చంద్రబోసు వామపక్ష నాయకులలో అగ్రశ్రేణికి చెందినవాడు. ఐ. సి. యస్. పరీక్షలో ఉత్తీర్ణుడై ఉన్నత ఉద్యోగివర్గానికి చెందినవాడైనా సహాయనిరాకరణ ఉద్యమకాలంలో ఉద్యోగానికి రాజీనామాచేసి. చిత్తరంజనదాసుకు శిష్యుడై. అనేక పర్యాయాలు కారాగారశిక్షను అనుభవించడమేగాక. కొంతకాలం విదేశాలలో కాలం గడపవలసినవాడయ్యాడు. గాంధీ శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించినప్పుడు యూరప్‌ఖండంలో వియన్నా నగరంలో ఉండి విఠల్‌భాయి పటేల్‌తో కలిసి ఆయనను ఖండిస్తూ. స్వాతంత్ర్యోద్యమంపై నాయకత్వం వహించుటను ఆయన అర్హుడుకాడనే అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు. అప్పుడే "భారతదేశ స్వాతంత్ర్య పోరాటం" (India's struggle for freedom) అనే గ్రంథాన్ని వ్రాసి. యూరప్‌లో ప్రకటించాడు. దానిని భారతదేశ ప్రభుత్వం నిషేధించింది. ఆయన తిరిగి స్వదేశానికి రాగానే నిర్బంధంలో ఉంచింది. విడుదలకాగానే సోషలిస్టుసిద్ధాంతాలను ప్రచారం చేయసాగాడు.

ఆయన దేశాభిమానం. ఆయన చేసిన త్యాగాలు ప్రజలదృష్టిని ఆకర్షించింది. వారి ఆదరణకు ఆయన పాత్రుడైనాడు. దాని ఫలితంగా 1938 లో హరిపురాలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు. అప్పటికి యూరప్‌లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యే సూచనలు కనుపించాయి ఈ యుద్ధంలో భారతీయులు బ్రిటిష్‌వారికి ఏలాటి సహాయం చేయరాదని. యుద్ధకాలంలో సత్యాగ్రహ ఉద్యమాన్ని సాగించి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు ప్రజలు సిద్ధపడవలెనని అధ్యక్షోపన్యాసంలో ఉద్ఘాటించాడు. సమావేశం ముగిసిన తరువాత ఒక ప్రణాళిక సంఘాన్ని జవహర్‌లాల్ అధ్యక్షతన నియమించి. దేశంలోని భారీపరిశ్రమలను స్థాపించుటకు తగినట్లు ఒక ప్రణాళికను తయారుచేయవలసిందిగా కోరాడు. కుటీరపరిశ్రమలను మాత్రమే స్థాపించడంపట్ల పట్టుదలగల గాంధీకి ఇది ఎంత మాత్రమూ నచ్చలేదు. క్రమక్రమంగా బోసుకు గాంధీకి మధ్య అభిప్రాయభేదాలు పెరిగాయి. ఇవి ప్రధానంగా సోషలిజానికి, యుద్ధకాలంలో భారతీయులను సరించవలసిన విధానాలకు, భారీపరిశ్రమలకు సంబంధించినట్టివి.

ఈ పరిస్థితులలో 1939 లో త్రిపురాలో జరగనున్న కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుని ఎన్నుకొనవలసి వచ్చింది. దానికి బోసు అభ్యర్థిగా నిలబడినాడు. గాంధీ అతనికి ప్రత్యర్థిగా ఆజాద్ నిలబడవలసినదిగా కోరాడు. కాని అతడు దానికి ఇష్టపడకపోగా పట్టాభి

సీతారామయ్యను పోటీ చేయవలసిందిగా కోరాడు. బోసు పట్టాభిలమధ్య పోటీజరిగి అందులో బోసు విజయాన్ని సాధించాడు. గాంధీ దీనిని హర్షించక, పట్టాభిపరాజయం తనకు సంభవించిన పరాజయమే అని ఒక ప్రకటనచేశాడు. ఇది కాంగ్రెసు వర్గాలలో గొప్ప సంచలనం కలుగ జేసింది. బోసుకు వోటుచేసినవారిలో అనేకులు తాము గాంధీకి అపచారముచేసి, మనోవ్యధను కలిగించినట్లుగా భావించారు. తాము తొందరపాటుతో ప్రవర్తించినందుకు విచారపడి, కాంగ్రెసు సమావేశకాలంలో గాంధీపట్ల తమకు పూర్తివిశ్వాసం ఉన్నట్లు రుజువుచేయ నిశ్చయించు కొన్నారు.

త్రిపురాలో కాంగ్రెసు సమావేశమైంది. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభంకాగానే కాంగ్రెసు ఆరునెలలలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసిందని, అలాగు ప్రసాదించని పక్షంలో సత్యాగ్రహసమరం ప్రారంభం కాగలదని ప్రభుత్వానికి తెలియపరచడం అవసరమని బోసు ఉద్ఘాటించాడు. కాని దీనికి అనుగుణంగా ప్రవేశపెట్టబడిన తీర్మానం సమావేశంలో వీగి పోయింది. కాంగ్రెసువారు తమకు బోసులో విశ్వాసంలేదని, గాంధీలోనే విశ్వాసం ఉన్నదనీ ఈ విధంగా ప్రకటించారు. ఇంతేగాక బోసు కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులను నియమించ డంలో గాంధీ సూచించినవారినే నియమించవలసిందిగా ఇంకొక తీర్మానాన్ని కాంగ్రెసుచేసింది, ఈ సభ్యులను నియమించే హక్కు కాంగ్రెసు అధ్యక్షునికి మాత్రమే ఇదివరలో ఉండేది. దానికి అన్యథాగా ఈ తీర్మానం చేయబడింది. బోసుకు ఇది అంగీకారయోగ్యంకాకపోయినా, తీర్మానం మేరకు సభ్యులను పేర్కొనడంలో గాంధీ సహాయం అర్థించాడు. కాని గాంధీ సహాయపడుటకు నిరాకరించాడు. కాంగ్రెసు ఆదరణకు ప్రజల ఆదరణకు పాత్రుడైన గాంధీ విశ్వాసం తనకు లభించని పరిస్థితులలో కాంగ్రెసు అధ్యక్షుడుగా వ్యవహరించడం సాధ్యంకాజాలదని ఏప్రిలు 29 న బోసు రాజీనామాచేశాడు. వెంటనే ఆయన స్థానంలో రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడుగా ఎన్నుకొన బడినాడు. గాంధీ సలహానుసారం ఆయన కార్యనిర్వాహక సభ్యులను ఎన్నికచేశాడు.

ఈ ఉదంతం ఇంతటితో పూర్తికాలేదు. అధ్యక్షపదవికి రాజీనామాచేసిన తరువాత బోసు వామపక్షాలకు చెందిన యువతరం వారి సిద్ధాంతాలను ప్రచారంచేయుటకు కాంగ్రెసులోనే "ఫార్వర్డుబ్లాక్" అనే పార్టీ నొకదానిని నిర్మాణంచేసి, దానితరపున ప్రచారం సాగించదొడగాడు. ఇంతేగాక బెంగాలురైతుల ఇక్కట్టులను తొలగించుటకు ఒక సత్యాగ్రహసమరాన్ని ప్రారం భించ సంకల్పించాడు. కాంగ్రెసు మంత్రివర్గాలకు రాష్ట్రంలోని కాంగ్రెసు కమిటీలకు ఉండ వలసిన సంబంధాల గురించి కార్యనిర్వాహకసంఘం చేసిన తీర్మానాలను ప్రతిఘటిస్తూ బహిరంగ ప్రచారాన్ని సాగించాడు. ఇది కాంగ్రెసు క్రమశిక్షణకు విరుద్ధమనే భావంతో కార్యనిర్వాహక వర్గం మూడు సంవత్సరాలపాటు బోసును కాంగ్రెసునుండి తొలగించింది. దీనిఫలితంగా బోసు తన ఫార్వర్డుబ్లాకుతో కాంగ్రెసునుండి నిష్క్రమించాడు.

ఈ నిష్క్రమణ మూలంగా బోసు ఆశయాలకు గాంధీ నాయకత్వంలోని కాంగ్రెసు ఆశయాలకు మధ్య అఘాతం ఏర్పడింది. తుదకు రెండవ ప్రపంచయుద్ధకాలంలో బోసు జపాను

వారి సహాయంతో భారతజాతీయ సైన్యాన్ని నిర్మాణంచేసి దేశస్వాతంత్ర్యానికై బ్రిటిష్‌వారితో సాయుధపోరాటాన్ని జరిపారు. 1938.39 లో కాంగ్రెసుకూ అతనికీ మధ్య సంభవించిన కలతలు ఈ పరిణామానికి దారితీయడంచేత వాటిని గురించి వివరంగా తెలియజేయవలసి వచ్చింది.

చదువదగిన గ్రంథములు :

Bhavan: Vol. xi
Tarachand : Vol iv
R. C. Mazumdar: History of the Freedom Movement in India: Vol iii

# అధ్యాయము-13

## యుద్ధకాలంలోని పరిణామాలు

## 1939-1942

## 1

దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు ప్రజలు 1920-22 లో సహాయనిరాకరణ ఉద్యమాన్ని, 1930-31 లో ఉప్పు సత్యాగ్రహాన్ని 1932-34 లో శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించారు. ఇతరదేశాలలో పరాయిప్రభుత్వాన్ని తొలగించి, స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు ప్రజలు సాయుధపోరాటాలను జరపడం చరిత్రప్రసిద్ధం. కాని సత్యాహింసలకు కట్టుబడిన గాంధీ భారతీయుల ఆదరాభిమానాలకు పాత్రుడై . స్వాతంత్ర్య సమరంలో వారికి నాయకుడు కావడంచేత వారు సాగించిన ఉద్యమాలన్నీ దౌర్జన్యరహితమైనవి. పోరాటం సాయుధమైనా, దౌర్జన్యరహితమైనా దానికి పరాయిప్రభుత్వానికి సహించరాని ఒత్తిడి కలిగించి, దానిని లొంగదీసి దేశానుండి వెళ్ళిపొయ్యేటట్లు చేయడమే లక్షణము. కాని భారతీయులు ధైర్యసాహసాలతో తమ దౌర్జన్యరహితమైన పోరాటాన్ని సాగించి, దేశస్వాతంత్ర్యంపట్ల తమకుగల పట్టుదలను, దానిని సంపాదించడంలో సమస్త త్యాగాలను చేయుటపట్ల సంసిద్ధతను ప్రదర్శించినా వారు పరాయిప్రభుత్వాన్ని పూర్తిగా లొంగదీయలేక పోయినారు. ఈ ప్రభుత్వం నిరాయుధులై పోరాటాన్ని సాగించే ప్రజలపై సాయుధపోలీసులను సైనికులను వినియోగించి, వారిని నానాబాధలకు గురిచేసి, భేదోపాయాన్ని అనుసరించి వారిలో చీలికలను లేవదీసి వారు సాగించిన ఉద్యమాలను చాలావరకు ప్రతిఘటించింది. కాని ప్రజాశక్తి వెంటనేకాకపోయినా కాలక్రమాన వృద్ధిగాంచి విజయాన్ని సాధించగలదనే సత్యాన్ని ప్రభుత్వం గ్రహించి, కొంతవరకైనా వారిని తృప్తిపరచడం అవసరమని భావించి 1935 లో భారతప్రభుత్వ చట్టాన్నిచేసి, 1937 తో దానిని ప్రవేశపెట్టింది. స్వాతంత్ర్య ఉద్యమాలు పూర్తిగా ఫలించకపోయినా పాక్షికంగానైనా ఫలించినట్లు ఇది రుజువుచేసింది.

ఈ చట్టంఫలితంగా రాష్ట్రాలకు చాలావరకు స్వాతంత్ర్యం లభించింది. పరిపాలనమంతా శాసనసభలకు బాధ్యతవహించిన మంత్రులవశంలోకి వచ్చింది. గవర్నరులకు కొన్ని ప్రత్యేకాధికారాలు ఉండినా వాటిని మంత్రులకు రాజ్యాంగరీత్యా లభించిన అధికారాలకు భంగకరంగా వినియోగించడం జరగదని వారు హామీఇచ్చారు. ఇదిగాక 1935 చట్టం కేంద్రంలో సమాఖ్యవిధానాన్ని ప్రవేశపెట్టుటకు, అది జరిగిన తర్వాత పాక్షికంగా బాధ్యతాయుత పరిపాలనా విధానాన్ని ప్రవేశపెట్టుటకు ఉద్దేశింపబడింది. చట్టం రూపొందించిన సమాఖ్యవిధానం ఏ రాజకీయపార్టీలకు తృప్తి కలిగించకపోయినా, కేంద్రంలో పాక్షికంగానైనా బాధ్యతాయుత పరిపాలనను ప్రవేశపెట్టుటకు ప్రభుత్వం అంగీకరించడం ప్రజాశక్తిని పూర్తిగా ఎదుర్కొనడం తమకు సాధ్యంకాదనే భావం బ్రిటిష్‌వారికి కలిగినట్లు స్పష్టంచేసింది. కాని సంస్థానాధీశులు

సమాఖ్యనుగురించి బేరసారాలలోకి దిగడంచేత సమాఖ్యవిధానం 1939 సెప్టంబరు వరకు ఆచరణ సాధ్యంకాలేదు. సెప్టంబరులో రెండవ ప్రపంచసంగ్రామం ప్రారంభమైంది. యుద్ధ కాలంలో కేంద్రంలో ఏలాటి మార్పులూ జరగరాదనే భావంతో కేంద్రానికి సంబంధించి 1935 చట్టంచేసిన మార్పులు నిరవధికంగా వాయిదా వేయబడినాయి. దీనితో కేంద్రంలో ప్రవేశపెట్ట వలసిన పాక్షిక బాధ్యతాయుతప్రభుత్వం ఆచరణలోకి రాలేదు. ప్రజలు రాష్ట్రస్వాతంత్ర్యంతో మాత్రమే తృప్తిపడవలసి వచ్చింది.

తాము సాగించిన ఉద్యమాలు పూర్తిగా ఫలించకపోయినా ప్రజలుగాని వారి నాయకులుగాని ఆశాభంగాన్ని పొందలేదు. స్వాతంత్ర్య సంపాదన పట్ల వారికిగల శ్రద్ధ మరింత బలపడింది. బ్రిటిషువారు ఒత్తిడికిగాని లొంగరని. పరిస్థితులు అనుకూలించినప్పుడు వారిపై ఇంకొక పోరాటాన్ని సాగించే ఉద్దేశంతో ప్రజలు ఉండినారు. 1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో అలాటి అనుకూల పరిస్థితులు ఏర్పడినవి. యుద్ధ కాలంలో శత్రుసైన్యాలు బ్రిటిష్‌వారిని పీల్చి పిప్పిచేశాయి. వారిపై స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించుటకు అది తగిన సమయమని ప్రజలలో అనేకులు నాయకులు కొందరు భావించారు. కాని శత్రువు కష్టదశలోఉన్నప్పుడు అతనిపై సమరాన్ని సాగించడం ధర్మమాఅనే మీమాంసలో గాంధీ నెహ్రూ మొదలైన నాయకులు పడ్డారు. సంప్రతింపులద్వారా తమ లక్ష్యాన్నిసాధించడం సాధ్యమనేభావం వారికి కలిగింది. సంప్రతింపులు విఫలములని వారు తెలుసుకొనుటకు మూడు సంవత్సరాలు పట్టింది. 1942 ఆగస్టులోగాని వారు దీనిని పూర్తిగా గ్రహించలేదు. అప్పటికి వారు దానిని గ్రహించి "క్విట్ ఇండియా" ఉద్యమంఅనే పేరుతో చరిత్రలో ప్రసిద్ధి గాంచిన ఉద్యమాన్ని ప్రారంభించారు.

కాని ఈ మూడు సంవత్సరాలలో దేశంలో ఇతర పరిణామాలుఅనేకం సంభవించాయి. అవిఆసన్న స్వాతంత్ర్య పోరాటంపైనా. "క్విట్ ఇండియా" ఉద్యమంపైనా గొప్ప ప్రభావాన్ని వహించాయి. వాటిలో కొన్ని "క్విట్ ఇండియా" ఉద్యమానికి జన్మస్థానములైనాయి. వాటిని గురించి మనం తెలుసుకోవడం అవసరం.

## 2

రెండవ ప్రపంచయుద్ధం ఒకపక్షాన బ్రిటన్, ఫ్రాన్సు. పోలెండులతోను, ఇంకొక పక్షాన జర్మనీతోను 1939 సెప్టంబరు 3 న ప్రారంభమైంది. క్రమక్రమంగా రష్యా అమెరికాలు బ్రిటన్ పక్షాన్ని, ఇటలీ జపానులు జర్మనీపక్షాన్ని వహించాయి. ప్రథమంలో యూరపుకు మాత్రమే పరిమితమై ఉండిన యుద్ధం అమెరికా జపానులు అందులో చేరడంచేత ప్రపంచ వ్యాప్తమై. ప్రపంచ సంగ్రామం అనే పేరునకు అర్హమైంది.

16 వ శతాబ్దాన నుండి విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలలోను, యుద్ధ విద్యలోను, యుద్ధ పరికరాలను తయారు చేయుటలోను, ప్రగతిని సాధించిన యూరపు ఖండంలోని పోర్చుగల్, స్పెయిన్, హాలెండ్, బ్రిటన్, ఫ్రాన్సు దేశాలు ఆఫ్రికా, ఏషియా, అమెరికా ఖండాలలో పై విద్యలయందు వెనుకబడి ఉండిన దేశాలను జయించి వశపరచుకొని తమ సామ్రాజ్యాన్ని వ్యాపింపజేసుకొని, గొప్ప లాభాలను సంపాదించుటకు ప్రయత్నాన్ని ప్రారంభించి విజయవంతంగా నాలుగు శతాబ్దాలకాలం దానిని సాగించారు. పాశ్చాత్యుల పరిపాలనాధికారం ప్రపంచ

మందంతటా వ్యాపించడం ఆధునికయుగ చరిత్రకు ప్రధానలక్షణమైంది. కాని ఈ ప్రయత్నాన్ని సాగించుటలో పై దేశాలవారి మధ్య విపరీతమైన పోటీ ప్రారంభమై అన్ని ఖండాలలో వారి మధ్య గొప్ప యుద్ధాలు సంభవించాయి. వీటిలో ఎక్కువ విజయాన్ని సంపాదించినవారే ఎక్కువ విస్తీర్ణతతో కూడిన సామ్రాజ్యాన్ని స్థాపించగలిగారు. ఒక విధంగా ఇవికూడా ప్రపంచ సంగ్రామాలే.

ఖండాంతరాలలోని దేశాలు ఆ దేశాలలో జరిగిన యుద్ధాలమూలంగా మాత్రమే యూరపుఖండంలోని దేశాల పరిపాలనలోకి రాలేదు. వాటిని జయించేనిమిత్తం పాశ్చాత్య దేశాల మధ్య యూరపు. అమెరికా మొదలైన ఖండాలలో జరిగిన యుద్ధాల ఫలితంగా కొందరి పరిపాలనలోకి కొన్నిదేశాలు మరి కొందరి పరిపాలనలోకి మరికొన్ని దేశాలు వచ్చాయి. ఉదాహరణకు—18 వ శతాబ్దంలో భారతదేశాన్ని జయించే ఉద్దేశంలో బ్రిటన్ ఫ్రాన్సు దేశంతో యూరపు, ఉత్తర అమెరికా, ఆఫ్రికా ఖండాలలో యుద్ధాలను సాగించింది. భారతదేశంలో జరిగిన యుద్ధాలు వాటిలో ఒక స్వల్పభాగమే. ఇందులో ఫ్రెంచివారు ఓడిపోవడం, బ్రిటిష్‌వారు విజయాన్ని సాధించడం జరిగింది. దీనిఫలితంగా భారతదేశం ఫ్రెంచివారి పరిపాలనలోకి వచ్చుటకు బదులు బ్రిటిష్‌వారి పరిపాలనలోకి వచ్చింది. దేశానికి అవలి ప్రపంచంలో జరిగినయుద్ధాలు ఈ పరిణామానికి దారితీసినదనే విషయాన్ని గుర్తించడం అవసరం. ఫ్రెంచివారిని ఖండాంతరాలలో ఓడించినతర్వాత దేశంలోని మహారాష్ట్రులను. మైసూరు సుల్తానులను. శిక్కులు మొదలైన వారిని జయించడం బ్రిటిష్‌వారికి సులభసాధ్యమైంది.

18, 19 శతాబ్దాలలో ప్రపంచ సామ్రాజ్యాన్ని సంపాదించుటకు ప్రధానంగా యూరపులోని ఫ్రాన్సు, బ్రిటన్. రషియా దేశాలవారు పోటీవేశారు. ఈ శతాబ్దాలలో జరిగిన యుద్ధాలకు చాలావరకు ఈ పోటీయే కారణం. 20 వ శతాబ్దంలో జర్మనీ ఈ పోటీలోకి దిగింది. అందులో విజయాన్ని సాధించుటకు 1914-18 లో బ్రిటన్, ఫ్రాన్సు, రషియాలలో మొదటి ప్రపంచ సంగ్రామాన్ని సాగించి ఓడిపోయింది. ఈ యుద్ధాన్ని సాగించడంలో ఆ నాడు బ్రిటన్, ఫ్రాన్సు, రషియా దేశాల పరిపాలనలో ఉండిన దేశాలను తనవశంలోకి తెచ్చుకొనుటకు జర్మనీ ప్రయత్నించింది కాని ఈ యుద్ధంలో ఆ దేశం పూర్తిగా ఓడిపోయింది. అమెరికా బ్రిటన్ ఫ్రాన్సులు కలిపి యుద్ధంలో పాల్గొనడమే ఈ ఓటమికి ప్రధాన కారణం.

యుద్ధం ముగిసిన తర్వాత జర్మనీ తిరిగీ తలఎత్తకుండా చేసే ఉద్దేశంతో విజేతలు దానిపై అనేక ఆంక్షలు విధించారు. కాని వాటికి లోబడడం జర్మనులకు ఏమాత్రం అంగీకారయోగ్యం కాలేదు. తిరిగీ తమ బలాలను సమకూర్చుకొని, ఇంకొకపర్యాయం భారీఎత్తున పై దేశాలతో యుద్ధం సాగించే మనస్తత్వం వారిలో ప్రబలింది. 1933 లో హిట్లరు దేశానికి నియంత అయినాడు. అతడు జర్మనీపై విధించబడిన ఆంక్షలను ప్రతిఘటించి, జర్మనీని ఒక యుద్ధశిబిరంగా మార్చి, నిర్బంధ సైనిక విధానాన్ని ప్రవేశపెట్టి. సైనికబలాన్ని నౌకాబలాన్ని, విమానబలాన్ని అత్యధికంగా పెంపొందించ గలిగాడు. 1918 లో మొదటి ప్రపంచ యుద్ధానంతరం జరిగిన సంధి ఒడంబడికలకు ఇవి విరుద్ధమైనా ఫ్రాన్సుగాని బ్రిటన్‌గాని సకాలంలో అతనిపై ఏలాటిచర్యలను తీసుకొనలేదు. అతని ఉద్దేశం రషియాను జయించడమనే భావంతో బ్రిటన్ అతనికి కొంత సహాయాన్ని కూడా చేసింది. అప్పటికి ఫ్రాన్సు తన బలాన్ని చాలావరకు

కోల్పోయింది. జర్మనీని ఒంటరిగా ఎదుర్కొనగల శక్తిని చాలాకాలం క్రిందటనే అది పోగొట్టుకొన్నది. ఈ పరిస్థితులు హిట్లరుకు అనుకూలంగా ఏర్పడినాయి. అదేకాలంలో ముసోలినీ అనే మరియొక నియంత ఇటలీకి పరిపాలకుడై సామ్రాజ్య కాంక్షతో హిట్లరుకు సన్నిహితుడైనాడు.

వివిధ బలాలను సమకూర్చుకొని, హిట్లరు 1939 నాటికి ఆస్ట్రియాను జెకోస్లోవేకియాను పోలెండులోని కొన్ని భూభాగాలను తన పరిపాలనలోకి తెచ్చుకొనగలిగాడు. ఇంతేగాక రష్యాతో ఒక ఒడంబడికను చేసుకొని సెప్టెంబరు 1 న రష్యా అనుమతితో పోలెండుపై దండెత్తి వెళ్ళినాడు. సెప్టెంబరు 3 న పోలెండుకు సహాయంచేసే ఉద్దేశంతో బ్రిటన్ ఫ్రాన్సులు జర్మనీపై యుద్ధాన్ని ప్రకటించాయి. దీనితో రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది.

ఖండాంతరాలలోని దేశాలపై సామ్రాజ్యాధిపత్యాన్ని సంపాదించుటకు 16 వ శతాబ్దాది నుండి యూరపు ఖండంలోని దేశాలమధ్య జరిగిన యుద్ధాలలో ఈ రెండవ ప్రపంచయుద్ధం ఒక భాగం అని నిరూపించుటకు పై వివరాలన్నీ ఇక్కడ పొందుపరచడం అవసరమైంది. 18 శతాబ్దంలోను 19 శతాబ్ది ప్రారంభంలోను బ్రిటన్ ఫ్రాన్సుల మధ్యజరిగిన యుద్ధాలఫలితంగా బ్రిటిష్‌వారు భారతదేశ పరిపాలకులు అయ్యారు. 19 శతాబ్దంలో బ్రిటన్ ఈలాటి యుద్ధాలు కొన్నిటిని రష్యాతో చేసి, రష్యా ఆధిపత్యం భారతదేశం పై వ్యాపించడాన్ని అరికట్టింది. 20 వ శతాబ్దంలో సామ్రాజ్యాధిపత్యానికై బ్రిటన్‌తో జర్మనీ పోటీకిదిగి రెండుయుద్ధాలను సాగించింది. ఈ రెండింటిలో బ్రిటన్‌కు విజయం లభించినా అది నామమాత్ర విజయం మాత్రమే. ప్రధానంగా రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ దానిని పీల్చి పిప్పిచేసింది. అమెరికా సహాయం లభించడం మూలాననే అది ఏదోవిధంగా గండాన్ని తప్పించుకొన్నది. యూరపు ఖండంలో జర్మనీ మూలంగా కలిగిన ప్రమాదంవంటి ప్రమాదమే ఏషియాలో జపాన్‌మూలంగా కలిగింది. ఇందులో కూడా అమెరికావారి సహాయం లభించినందుననే ఏదో విధంగా దాన్ని తప్పించుకొని బయటపడింది. కాని యుద్ధఫలితంగా అది తనకాళ్ళపైన తాను నిలవగల స్థితిని కోల్పోయింది. అమెరికాకు ఒక ఉపగ్రహంగా మారింది. దాని సైనికబలానికి నౌకాబలానికి విమానబలానికి అపారనష్టం సంభవించింది. 1939 కి పూర్వం ఇతరదేశాలకు ఋణాలు ఇయ్యగల దేశాలలో అగ్రస్థానం వహించినట్టిది యుద్ధం ముగిసే నాటికి ఋణగ్రస్తమైపోయింది. ఈ పరిస్థితులలో ప్రజలను ప్రతిఘటించి భారతదేశాన్ని పాలించడం సాధ్యం కాదనే భావం ఏర్పడింది. 1942-44 లో ప్రజలు సాగించిన క్విట్ ఇండియా తిరుగుబాటు ఈ భావాన్ని బలపరచింది. ఇదే కాలంలో సుభాష్ చంద్రబోసు జపాన్‌కు ఖైదీలుగా సింగపూరు మలయాలలో పట్టుబడిన భారత సైనికులను ఒక "భారతజాతీయ సైన్యం"గా నిర్మాణంచేసి, జపాన్‌వారితో కలిసి బర్మామీదుగా భారతదేశాన్ని ప్రవేశించి, దేశవిముక్తికై సాయుధసమరాన్ని సాగించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి మొదటినుండి సిపాయీల సైన్యం మూలస్తంభంగా ఉండినది. వారు జాతీయభావాలచే ప్రభావితులు కాక ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలతో ప్రవర్తించబట్టే బ్రిటిష్‌వారు దేశాన్ని జయించి పాలించడం సాధ్యమైంది. బోసు నిర్మాణంచేసిన జాతీయసైన్యం సిపాయీలలోకూడా జాతీయ భావం నాటుకొన్న విషయాన్ని స్పష్టంచేసింది. దీనిమూలంగా సిపాయీలసైన్యం అనే బ్రిటిష్ ప్రభుత్వ మూలస్తంభం పడిపోయే ప్రమాదం సంభవించినట్లు అధికారులు భావించారు. దీనికి తోడు 1946 లో కొన్ని నౌకాదళాలు కూడా తిరుగుబాటు చేశాయి. ఈ విధంగా 1942 తర్వాత క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రజాశక్తి విజృంభించడం, సైనికదళాల యొక్కయు నౌకాదళాల

యొక్కయు ప్రభుశక్తి సందేహాస్పదం కావడం, రెండవ ప్రపంచ సంగ్రామ ఫలితంగా అంగ బలాన్ని అర్థబలాన్ని పూర్తిగా కోల్పోయిన బ్రిటిష్‌వారిపై అత్యంత ప్రభావాన్ని వహించాయి.

ఈ పరిస్థితులలో ప్రజాశక్తిని ప్రతిఘటించుటకు కావలసినబలం తమకు లేదని వారు గ్రహించారు. అప్పటికి అరవై సంవత్సరాలుగా ప్రజలపై నాయకత్వాన్ని వహించి కాంగ్రెసు పదేపదే స్వాతంత్ర్య సమరాన్ని సాగించి అద్వితీయమైన పలుకుబడిని సంపాదించ గలిగింది. యుద్ధకాలంలో కొన్ని ప్రత్యేక అనుకూలాలు లభించడంచేత ముస్లింలలో అధికసంఖ్యాకులపై ముస్లింలీగు నాయకత్వం వహించగలిగింది. 1945 నాటికి—అనగా రెండవ ప్రపంచయుద్ధం ముగియునాటికి దేశంలోని కాంగ్రెసు లీగులు ప్రధాన రాజకీయ పార్టీలుగా రూపొందినాయి. దేశాన్ని పాలించగల బలాన్ని కోల్పోయిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ రెండు సంస్థలతో సంప్రతింపులు సాగించి, దేశాన్ని రెండు స్వతంత్రరాజ్యాలుగా విభాగంచేసి, ఒక భాగంపై పరిపాలనాధికారాన్ని కాంగ్రెసుకు, ఇంకొక భాగంపై పరిపాలనాధికారాన్ని లీగుకు ఒప్పగించి, రెండు వందల సంవత్సరాల కాలం సాగించిన అధికారాన్ని వదలుకొని దేశాననుండి వెళ్ళిపోయింది.

ఈ విధంగా రెండవ ప్రపంచయుద్ధం, యుద్ధకాలంలో సంభవించిన పరిణామాలు క్విట్ ఇండియా ఉద్యమం, ఇతర సంఘటనలు—ఇవి అన్నీ కలిపి 1947 ఆగస్టు 15 న దేశ విముక్తికి స్వరాజ్య సంస్థాపనకు దారితీశాయి. యుద్ధకాలంలో సంభవించిన పరిణామాలగురించి, ఉద్యమాల గురించి, ఇతర సంఘటనల గురించి మనం ఇప్పుడు తెలుసుకొనవలసి ఉన్నది.

## 3

హిట్లర్ జర్మనీలో అధికారాన్ని చేపట్టినప్పటినుండి రెండవ ప్రపంచ సంగ్రామం తప్పదనే భావం అన్ని ఖండాలలో వ్యాపించింది. అది సంభవించిన పక్షంలో దానిపట్లను అందులో పాల్గొనే బ్రిటన్‌పట్లను భారతీయులు ఏలాటి వైఖరిని అనుసరించడం అనేది ఒక గొప్ప సమస్యగా రూపొందింది.

1936 ఏప్రిలులో లక్నోలోను, సంవత్సరాంతాన పైజుపూరులోను కాంగ్రెసు సమావేశ మైనప్పుడు అధ్యక్షతను వహించిన నెహ్రూ యూరపు ఖండములోని దేశాలమధ్య సంభవించే యుద్ధాలన్నిటికి సామ్రాజ్యకాంక్ష మూలకారణం కావడంచేతను సామ్రాజ్యతత్వంచేత భారతీయులు నా నా బాధలు అనుభవించేవారు కావడంచేతను అలాటి యుద్ధాలలో వారు పాల్గొన రాదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. ఇది ఆయన వ్యక్తిగత అభిప్రాయం మాత్రమే కాదని, కాంగ్రెసుయొక్క సమిష్టి అభిప్రాయమని 1935 ఆగస్టులో కాంగ్రెసు ప్రకటించిన ఎన్నికల ప్రణాళిక స్పష్టంచేసింది. ఎన్నికలలో ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసుకు ఘన విజయం లభించ డంచేత ప్రజలుకూడా ఈ అభిప్రాయంతో ఏకీభవించినవారని రుజువైంది. 1938 లో కాంగ్రెసు హరిపురాలో సుభాష్‌బోసు అధ్యక్షతను సమావేశమై యూరోపులో యుద్ధం సంభవించే సూచనలను సమీక్షించి, "అలాటి సామ్రాజ్య తత్వాధారమైన యుద్ధంలో భారతదేశం పాల్గొనరాదని, బ్రిటిష్ సామ్రాజ్య ప్రయోజనాలకై భారతీయుల అంగబలాన్ని అర్థబలాన్ని వినియోగించడం వారికి ఆమోదయోగ్యం కాజాలదని, దానిని వారు ప్రతిఘటించుటకు సిద్ధంగా ఉన్నారని" తీర్మానం చేసింది. మరుసటి సంవత్సరం మార్చిలో బోసు అధ్యక్షతను త్రిపురాలో కాంగ్రెసు సమావేశమై "కాంగ్రెసు సామ్రాజ్యతత్వంతో

సమానంగా ఫాసిస్టుతత్వాన్ని కూడా ఎదిరించే సంస్థ. ప్రపంచ శాంతికి ఈ రెండుతత్వాలు అంతరించడం ఎంతైనా అవసరం. భారతదేశం ఈ రెండింటితో ఎలాటి సంబంధాన్ని పెట్టుకొనక స్వతంత్రంగా తన వైదేశిక విధానాన్ని రూపొందించుకొనడం వాంఛనీయ"మని తీర్మానించింది. 1936 నుండి 1939 వరకూ కాంగ్రెసు చేసిన తీర్మానాలన్నీ సామ్రాజ్య కాంక్షను తీర్చుకొనే ఉద్దేశంతో జరిగే యుద్ధంలో భారతదేశం పాల్గొనరాదనే భావాన్ని వ్యక్తం చేశాయి.

త్రిపురా సమావేశం జరిగినతర్వాత ప్రపంచ పరిస్థితులు మరింత క్లిష్టరూపాన్ని ధరించాయి. వాటిని ఎదుర్కొనే ఉద్దేశంతో యుద్ధకాలంలో రాష్ట్రప్రభుత్వాలపై కేంద్ర ప్రభుత్వానికి గల అధికారాలను విస్తృతపరుస్తూ పార్లమెంటు 1935 చట్టాన్ని సవరించింది. దీని ఫలితంగా రాష్ట్రాలను పాలిస్తుండిన మంత్రివర్గాల అధికారాలు చాలావరకు సన్నగిల్లాయి. కేంద్ర ప్రభుత్వ ఆదేశాలను అనుసరించి వారు యుద్ధ కార్యక్రమాలలో పాల్గొనవలసిన అవసరం ఏర్పడింది. కాంగ్రెసుతో గాని, కాంగ్రెసు మంత్రివర్గాలతోగాని, లేశమాత్రంకూడా సంప్రతించక ఈలాటి సంస్కరణను ప్రవేశపెట్టడం కాంగ్రెసువారు నిరసించారు.

1939 ఆగస్టులో కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ వార్ధాలో సమావేశమై ఈ నిరసనను వ్యక్తంచేస్తూ, ప్రజాస్వామిక విధానాన్ని భారతదేశంలో ప్రవేశపెట్టనంతవరకు ప్రపంచంలో అలాటి విధానాన్ని బలపరచుటకు ఉద్దేశించిన యుద్ధంతో భారతీయులు ఏలాటి సంబంధం పెట్టుకొనరాదని. రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు యుద్ధ కార్యక్రమాలలో సహకరించరాదని ఒక తీర్మానాన్ని చేసింది. తన అభీష్టాలను నెరవేర్చినగాని భారతదేశం బ్రిటన్‌కు సహాయం చేయజాలదని ఈ తీర్మానంద్వారా కాంగ్రెసు బ్రిటన్‌కు హెచ్చరిక చేసింది.

1939 సెప్టెంబరు 3 న యూరపులో యుద్ధం ప్రారంభమైంది. బ్రిటిషు సామ్రాజ్యంలో చేరిన కెనడా. ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా దేశాలు డుమినియన్ ప్రతిపత్తి కలిగి, స్వతంత్రంగా వ్యవహరించే దేశాలు కావడంచేత అవి నిర్బంధంగా యుద్ధంలో పాల్గొనవలసినట్లు నిర్ణయించే అధికారం బ్రిటిష్ ప్రభుత్వానికి ఉండినది కాదు. ఆయాదేశాల ప్రభుత్వాలూ పార్లమెంటులూ అనుమతించిన తర్వాతనే అవి బ్రిటిష్‌పక్షాన్ని వహించి యుద్ధంలో పాల్గొనడం జరిగింది. భారతదేశం డుమినియన్ ప్రతిపత్తిలేని దేశం కావడంచేత ప్రజాభిప్రాయంతో గాని, కేంద్ర శాసనసభ ఆమోదంతో గాని. రాష్ట్రాలను పాలించే మంత్రివర్గాల అభిప్రాయంతో గాని నిమిత్తంలేకుండా భారతదేశం బ్రిటిష్‌పక్షం వహించి యుద్ధంలో పాల్గొనవలసినట్లును, ప్రజలందరుయుద్ధంలో బ్రిటన్‌కు సహాయపడవలసినట్లును, వైస్రాయి ఒక ప్రకటనను చేశాడు. విస్తీర్ణంలోను జనసంఖ్యలోను డుమినియన్‌ల కంటె భారతదేశం ఎంతో పెద్దది. యుద్ధంలో బ్రిటన్‌కు ఎక్కువ సైనిక సహాయాన్ని, ఆర్థికసహాయాన్ని చేయగలస్థితిలో ఉండినట్టిది. కాని దీనినంతా విస్మరించి, ప్రజాభిప్రాయంపట్ల పూర్తిగా నిర్లక్ష్యభావాన్ని వహించి, వైస్రాయి ఏకపక్షీయంగా ప్రకటన చేయడం కాంగ్రెసు ఆగ్రహానికి కారణమైంది. ఇది దేశాన్ని కించపరచడమే అనే భావం కాంగ్రెసు వర్గాలలో వ్యాపించింది.

కాని వైస్రాయి ప్రకటన జరిగినవెంటనే సంస్థానాధీశులు, లిబరల్ పక్షానికి హిందూ మహాసభకు జస్టిసుపక్షాలకు చెందినవారు డాక్టరు అంబేద్కరు నాయకత్వంలోని హరిజనులు, బెంగాలు, పంజాబు, సింధురాష్ట్రాలను పాలిస్తూ ఉండిన ముస్లిం మంత్రివర్గాలవారు యుద్ధంలో

బ్రిటన్‌కు సర్వవిధాలా సహాయపడవలసిందిగా తీర్మానించారు. సుభాష్‌బోసు నాయకత్వంలోని "ఫార్వర్డ్‌బ్లాక్" (Forward Block) పార్టీమాత్రం యుద్ధంలో ఏలాటి సహాయాన్ని బ్రిటన్‌కు చేయరాదని, శాసనోల్లంఘనం ద్వారా దానిని ప్రతిఘటించడమే దేశప్రజల కర్తవ్యం అని, బ్రిటిషు సామ్రాజ్య విచ్ఛిత్తి జరిగితేనేగాని భారతదేశానికి విముక్తి లభించదనే అభిప్రాయాన్ని ప్రకటించింది. ఈ అభిప్రాయాన్ని అనుసరించి, బోసు దేశమందు పర్యటనను గావించి, అనేక సమావేశాలు జరపడమే గాక అక్కడక్కడ కొన్ని శాసనోల్లంఘన కార్యక్రమాలను సాగించాడు. దీని ఫలితంగా ఆయన అనుచరులనేకులు జైలుశిక్షకు పాత్రులయ్యారు. తుదకు ఆయనకూడా నిర్బంధింపబడినాడు. కాని ఆయన ఏదోవిధంగా నిర్బంధంలోనుంచి బయటపడి, ప్రథమంలో జర్మనీకి, అటు తర్వాత హిట్లరు సహాయంతో జపాన్‌కు వెళ్ళి, సింగపూరు, మలయాలలో జపాన్‌వారికి ఖైదీలుగా పట్టుబడిన భారతీయ సైనికులను సమీకరించి, భారత జాతీయసైన్యాన్ని (Indian National Army) నిర్మాణం చేసి, బర్మామీదుగా భారత దేశాన్ని ప్రవేశించి, కొన్ని వారాలపాటు సాయుధ పోరాటాన్ని 1942 లో సాగించిన ఉదంతాన్ని మనం క్రమక్రమంగా తెలుసుకొనగలము.

సంస్థానాధీశులు మొదలైనవారు బ్రిటన్‌కు పూర్తిగా సహకారాన్ని అందజేయవలసినదిగాను, ఫార్వర్డ్‌బ్లాకు వారు బ్రిటన్‌ను పూర్తిగా ప్రతిఘటించవలసిందిగాను నిర్ణయించుకొన్నారు. యుద్ధం ప్రారంభమైన కొత్తలో కొంతకాలంవరకూ కాంగ్రెసువారు ఏ నిర్ణయానికి రాలేకపోయినారు. నాయకులలో అభిప్రాయ భేదాలు ఏర్పడడమే దీనికి కారణం.

అహింసకు పూర్తిగా కట్టుబడిన గాంధీ భారతీయులు యుద్ధంలో పాల్గొనరాదని అభిప్రాయపడడం సహజం. ఇదిగాక యుద్ధకాలంలో బ్రిటన్‌ను ప్రతిఘటించడం ఆయనకు ఆమోదయోగ్యం కాలేదు. శత్రువు క్లిష్టపరిస్థితులలో ఉన్నప్పుడు అతనిపై సమరాన్ని సాగించడం సత్యాగ్రహ సిద్ధాంతానికి విరుద్ధమనుకొన్నాడు. యుద్ధంలో బ్రిటన్ ఓడిపోవడం వాంఛనీయం కాదని ఆయన భావించాడు. భారతీయులు యుద్ధంలో పాల్గొనకపోయినా, బ్రిటన్‌కు నష్టం కలిగించే కార్యక్రమాలలో వారు పాల్గొనరాదనేది ఆయన మతం.

నెహ్రూ అభిప్రాయాలు వీటికంటే భిన్నంగా ఉండినవి. ప్రపంచ పరిణామాల దృష్ట్యా ప్రజాస్వామికాన్ని వ్యక్తి స్వేచ్ఛను సమర్థించే బ్రిటన్ విజయాన్ని సాధించడమూ, నియంతృత్వాన్ని, జాత్యహంకారాన్ని, సామ్రాజ్యతత్వాన్ని సమర్థించే జర్మనీ ఓడిపోవడము వాంఛనీయమని, అందుచేత భారతీయులు బ్రిటన్‌తో సహకరించడమే ఉత్తమవిధానమని నెహ్రూ అభిప్రాయపడినాడు.

కాని కాంగ్రెసువర్గాలలో అధిక సంఖ్యాకుల అభిప్రాయం అన్యథాగా ఉండడంచేత గాంధీ నెహ్రూలు—ప్రధానంగా నెహ్రూ-వారి అభిప్రాయాలను కొంతవరకు మార్చుకోవలసివచ్చింది. కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సెప్టెంబరు 15 న సమావేశమై కాంగ్రెసు నాయకులతో సంప్రతించక ఏకపక్షీయంగా వైస్రాయి ప్రకటన చేయడం అనుచితమని, కాని, తుదినిర్ణయం తీసుకొనుటకు ముందు బ్రిటీషు ప్రభుత్వం ఏలాటి ఉద్దేశాలను సాధించుటకు యుద్ధంలో ప్రవేశించినది, సామ్రాజ్యతత్వం పట్ల దానివైఖరి ఏలాటిదైనదీ, ప్రజాస్వామిక విధానాన్ని భారతదేశంలో ప్రవేశపెట్టడంపట్ల దానిఉద్దేశం ఏలాటిదైనదీ తెలుసుకొనడం అవసరమని, ఈ విషయా

లన్నిటినీ స్పష్టపరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేసింది. అఖిల భారత కాంగ్రెసు కమిటీ అక్టోబరు 10 న సమావేశమై పై తీర్మానాన్ని ఆమోదించడమేగాక, "భారత దేశం ఒక స్వతంత్రదేశమని ప్రకటన చేయవలసిందిగాను, దీనికి అనుగుణంగా సాధ్యమైన చర్యల నన్నిటినీ వెంటనే తీసుకొనవలసిందిగాను" ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది.

జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగు సెప్టెంబరు 18 న సమావేశమై దాని అనుమతి లేక ఏలాటి రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టకుండునట్లును ముస్లింల తరఫున ప్రాతినిధ్యం వహించిన సంస్థ లీగు ఒక్కటే అని గుర్తించిన పక్షంలోను యుద్ధంలో ప్రభుత్వానికి పూర్తి సహకారాన్ని అందజేయుటకు సిద్ధంగా ఉన్నట్లు తీర్మానించింది. లీగు దేశ స్వాతంత్ర్యాన్ని కోరలేదు. అధిక సంఖ్యాకుల అభిప్రాయాలతో నిమిత్తంలేకుండా దాని అనుమతితో పరిపాలన విధానాన్ని రూపొందించడమే అది కోరింది.

ఈ మధ్యకాలంలో సుమారు 50 భారతీయ ప్రముఖులతో పరిపాలన విషయాల గురించి వైస్రాయి లిన్‌లిత్‌గో చర్చలు జరిపారు. అటుతర్వాత అక్టోబరు 17న కాంగ్రెసు లీగుల తీర్మానాలకు జవాబుగా ఒక ప్రకటన చేస్తూ (1) భారతదేశానికి డుమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించడం బ్రిటన్‌యొక్క తుది లక్ష్యమని, (2) కాని యుద్ధకాలంలో దానిని ప్రవేశపెట్టడం సాధ్యం కాదని, (3) యుద్ధం ముగిసేవరకు 1935 చట్టప్రకారం పరిపాలన సాగడం తప్పదని, (4) యుద్ధానంతరం భారతీయ ప్రజల ప్రతినిధులతోను, అల్పసంఖ్యాకులైన ముస్లింల ప్రతినిధులతోను చర్చలు జరిపి, వారి అభిప్రాయాలను లెక్కలోకి తీసుకొని రాజ్యాంగం సవరింపబడుతుందని, (5) యుద్ధ కార్యక్రమాలలో ప్రభుత్వానికి సలహా ఇచ్చుటకు బ్రిటిష్ ఇండియాలోని ప్రధాన పార్టీల యొక్కయు సంస్థానాధీశుల యొక్కయు ప్రతినిధులతో కూడిన ఒక సలహా సంఘాన్ని ఏర్పరచుటకు ప్రభుత్వం నిశ్చయించినట్లును తెలియపరిచారు. ఇందులో కాంగ్రెసు కమిటీ స్పష్టపరచమని కోరిన విషయాల గురించి గాని అఖిలభారత కాంగ్రెసు కమిటీ చేసిన సూచనలను గురించి గాని ఏలాటి ప్రసక్తి లేకపోవడం కాంగ్రెసు వర్గాలకు చాలా ఆశాభంగాన్ని కలిగించింది.

యుద్ధవిషయంలో తుది నిర్ణయం తీసుకొనుటకు అక్టోబరుకు 22న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సమావేశమై బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో ఏలాటి మార్పు రాలేదని, సామ్రాజ్యాధికారాన్ని సడలించే ఉద్దేశం దానికి లేశమాత్రంకూడా లేదని. ఈ పరిస్థితులలో రాష్ట్రాలలో అధికారంలో ఉండే మంత్రివర్గాలు సామ్రాజ్యాధికారాన్ని బలపరచే యుద్ధ కార్యక్రమాలలో పాల్గొనడం తప్పదని, అది దేశ స్వాతంత్ర్యాన్ని భంగకరం కాగలదని, అందుచేత వారు రాజీనామా చేసి, అధికారాన్ని వదలుకొనవలసిందిగా ఆదేశించింది. ఈ ఆదేశానుసారం నవంబరు 15 నాటికి ఎనిమిది రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేశాయి. 27 నెలలుగా పరిపాలనాధికారాన్ని వహించిన కాంగ్రెసు అధికారాన్ని వదలుకొన్నది.

ఈ విధంగా మంత్రివర్గాలు రాజీనామా చేయడం దేశభవిష్యత్తు దృష్ట్యా చాలా హానికరంగా పరిణమించిందని స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచించిన చరిత్రకారులనేకులు అభిప్రాయపడినారు. ఈ అభిప్రాయంలో చాలా సత్యం ఉన్నట్లు చెప్పవచ్చు.

మంత్రివర్గాలు అధికారంలో ఉండిన పక్షంలో యుద్ధ కార్యక్రమాలను సాగించడంలో వారి సహాయం అవసరం కావడంచేత కొంతవరకైనా ప్రభుత్వం కాంగ్రెసు అభిప్రాయాలను లెక్కలోకి తీసుకొనే అవకాశం ఉండేది. అధికారంలో ఉన్నవారికి పలుకుబడి లభించడం సహజం. కాంగ్రెసువారు అధికారాన్ని వదలుకొన్నతర్వాత కాంగ్రెసుపట్ల ప్రభుత్వం వహించిన విరోధభావం మరింత బలపడింది. దానితో సంప్రతించవలసిన అవసరం లేదనే తత్వంలోకి వారు వచ్చారు. ఇంతే కాదు. ఇది మొదలు ప్రభుత్వం జిన్నాకు ముస్లింలీగుకు పూర్తిగా లోబడి పోయింది. కాంగ్రెసు సహకారం లభించదని మంత్రివర్గాల రాజీనామా రుజావు చేసింది. కాని ప్రజల సహకారం కొంతవరకైనా లేనిదే దేశాన్ని పాలించడం సాధ్యం కాదు. ఒక సైనిక బలాన్ని మాత్రం ఆధారం చేసుకొని దేశాన్ని పాలించడం ఏ ప్రభుత్వానికీ కష్టసాధ్యం. పరాయి ప్రభుత్వానికి యుద్ధకాలంలో అది మరీ కష్టసాధ్యం. దేశ ప్రజలలో ముస్లింలు ఒక ప్రధాన భాగం. కాంగ్రెసు సహకారం లభించదని స్పష్టమైనతర్వాత ప్రభుత్వం ముస్లింలీగుకు సన్నిహితమై, అది దేనిని కోరితే దానిని ప్రసాదించుటకు సిద్ధపడింది. కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేసినతర్వాత నాలుగు నెలలు గడవక పూర్వమే 1940 మార్చిలో ముస్లింలీగు లాహోరులో సమావేశమై ముస్లింల శ్రేయస్సుదృష్ట్యా భారతదేశం రెండు రాజ్యాలుగా విడిపోయి, ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే రాష్ట్రాలన్నీ కలిపి పాకిస్థాన్ అనే ప్రత్యేక రాజ్యంగా ఏర్పడవలెనని తీర్మానించింది. ఇదిమొదలు లీగు రాజకీయాలలో ఈ తీర్మానం కీలక స్థానం వహించింది. లీగు సహాయాన్ని సంపాదించే నిమిత్తం దీనికికూడా ప్రభుత్వం క్రమ క్రమంగా అంగీకరించింది. మంత్రివర్గాల రాజీనామా పాకిస్థాన్ స్థాపనకు దారి తీసింది. రాజీనామా దేశానికి హానికరంగా పరిణమించిందని భావించుటకు ఇది ప్రధాన కారణం. *

కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామా ప్రభుత్వానికి ఏలాటి విచారాన్ని కలిగించలేదు. వాటి అధికారం తొలగినతర్వాత గవర్నరులు రాష్ట్రాలకు పరిపాలకులై యధేచ్ఛగా ఏలాటి ఆటంకం లేకుండా యుద్ధ కార్యక్రమాలను సాగించగలిగారు. కాంగ్రెసు బెడద తప్పిందని వారు సంతోషించారు.

## 4

కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేసినతర్వాత దేశ రాజకీయాలలో రెండు సంవత్సరాల కాలం ఒక మోస్తరు ప్రతిష్ఠంభన ఏర్పడింది. కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని, కేంద్రంలో బాధ్యతాయుత జాతీయ ప్రభుత్వాన్ని వెంటనే ప్రవేశపెట్టవలసిందిగా కోరుతూ తీర్మానాలను చేయడం, ప్రభుత్వం దానికి జవాబుగా కాంగ్రెసుకు తృప్తి కలిగించని ప్రకటనలను చేయడం పరిపాటి అయింది. దీని ఫలితంగా కాంగ్రెసు, ప్రభుత్వమూ సన్నిహితమయ్యే అవకాశం లేకపోయింది.

మంత్రివర్గాలు రాజీనామా చేసినతర్వాత కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించగలదని ఫార్వర్డుబ్లాకు వారు వామపక్షాలకు చెందిన తదితరులు భావించారు. 1940 మార్చిలో అజాద్ అధ్యక్షతన కాంగ్రెసు రామగర్‌లో సమావేశమై సంపూర్ణ స్వాతంత్ర్యం

* ఈ పరిణామాన్ని గురించి వి. పి. మీనన్ Transfer of Power అనే గ్రంథంలో విపులంగా వ్రాశాడు. అది చదువదగిన గ్రంథం.

తప్ప ఇంకొక పరిపాలన విధానం భారతీయులకు ఆమోదయోగ్యం కాజాలదని. భావి రాజ్యాంగాన్ని రూపొందించే హక్కు వారికి మాత్రమే కలదని ఈ ఆశయాలకు అనుగుణంగా వెంటనే ప్రభుత్వం చర్యలను తీసుకోనని పక్షంలో శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించవలసివస్తుందని తీర్మానం చేసింది. ఇది వామపక్షం వారికి కొంత ఆశాజనకమైంది. కాని ఆనాడు అలాటి ఉద్యమాన్ని సాగించుటకు కాంగ్రెసు సిద్ధంగా ఉండినది కాదు.

ఉద్యమానికి గాంధీ విముఖుడుగా ఉండడమే దీనికి ప్రధాన కారణం. బ్రిటన్ కష్ట దశలో ఉన్నప్పుడు దానిపై తిరుగుబాటు చేయడం సత్యాగ్రహ సిద్ధాంతానికి విరుద్ధమని ఆయన మొదటినుండి భావించాడు. ఇదిగాక శాసనోల్లంఘన ఉద్యమం మూలంగా ప్రజలు అనేక నిర్బంధాలకు నష్టాలకు గురి కాగలరు. సంప్రతింపులన్నీ విఫలమై మార్గాంతరం లేదని స్పష్టమైన తర్వాతనే దానికి పూనుకొనడం ప్రాజ్ఞత. బ్రిటిష్ ప్రభుత్వం సంప్రతింపుల ద్వారా కాంగ్రెసుతో ఏదో ఒక విధమైన రాజీకి రాగలదని ఆయనేగాక మరికొందరు నాయకులుకూడా విశ్వసించారు. అలాటి సందర్భంలో తొందరపడి శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించడం సంప్రతింపులను భగ్నపరచడమే. ఇంతేగాక దేశంలోని ప్రజలు పూర్తిగా అహింసకు కట్టుబడి దౌర్జన్యాలలోకి దిగకుండా ఉద్యమాన్ని సాగించగలరనే విశ్వాసం ఆనాడు ఆయనకు కుదరలేదు. దీనికి తోడు ముస్లింలు ఉద్యమానికి విరుద్ధులు. ముస్లింలీగు కాంగ్రెసును పూర్తిగా ద్వేషించే సంస్థగా మారిపోయింది. ఈ పరిస్థితులలో కాంగ్రెసు సత్యాగ్రహోద్యమాన్ని సాగించినయెడల దేశంలో హిందూ ముస్లిం కొట్లాటలు సంఘర్షణలు తప్పవు. ఇది చాలా అవాంఛనీయమైన పరిణామం. అందుచేత రామగర్ కాంగ్రెసు శాసనోల్లంఘన ఉద్యమంపట్ల సుముఖత్వాన్ని ప్రదర్శించినా అది ఆచరణసాధ్యం కాదని గాంధీ నిర్ణయించాడు. గాంధీ అనుమతి లేక అలాటి ఉద్యమంలోకి దిగడం కాంగ్రెసు వారెవరికీ ఆమోదయోగ్యం కాలేదు. నెహ్రూ కూడా బ్రిటన్ కష్ట కాలంలో ఉన్నప్పుడు దానిపై తిరుగుబాటు చేయడం భారతజాతికి గౌరవప్రదం కాదని అభిప్రాయ పడినాడు.

1940 ఏప్రిలు తర్వాత యూరపులోని యుద్ధపరిస్థితులు బ్రిటిష్ వారికిన్మష్ట్యా పూర్తిగా విషమించాయి. ఇదికూడా కాంగ్రెసు వైఖరిపై గొప్ప ప్రభావాన్ని వహించింది. హిట్లరు పోలెండులో చాలా భాగాన్ని జయించి, ఆటుతర్వాత డెన్మార్కు, నార్వే, హాలెండు, బెల్జియం దేశాలనేగాక ఫ్రాన్సును కూడా వశపరచుకొని బ్రిటన్‌పై దండయాత్రను సాగించుటకు సిద్ధంగా ఉండినాడు. అతని విమానాలు బ్రిటన్‌లోని నగరాలపై బాంబుల వర్షాన్ని కురిపించగలిగాయి. అతని జలాంతర్గాములు అట్లాంటిక్ మహా సముద్రంలో ప్రయాణం చేసే బ్రిటిష్ నౌకలను ముంచివేయడం మామూలైంది. బ్రిటన్ దాని ఆహార పదార్థాలకు, పరిశ్రమలకు కావలసిన ముడి సరుకులకు విదేశాలపైన పూర్తిగా ఆధారపడిన దేశం. నౌకలకు నష్టం కలగడంమూలాన బ్రిటిష్ ప్రజలు పస్తుండవలసిన ప్రమాదం కూడా సంభవించింది. ఈలాటి పరిస్థితుల మూలంగా బ్రిటన్‌కూడా హిట్లరు వశంలోకి రావడం తప్పదనే భావం వ్యాపించింది. బ్రిటన్‌లోని అధికారులు కూడా అలాగే భావించి భారత దేశంపై ఇండియా మంత్రికి గల అధికారాలను వైస్రాయి పరం చేస్తూ 1935 చట్టాన్ని సవరించారు.

ఈ పరిణామాలు కాంగ్రెసుపై ప్రభావం వహించాయి. వీటి ఫలితంగా బ్రిటన్ కాంగ్రెసుతో సంప్రతింపులు జరిపి కాంగ్రెసు వాంఛలను తీర్చగలదనే విశ్వాసం నాయకు లనే

కులలో ఏర్పడింది. ఇంతేగాక బ్రిటన్ క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటున్నప్పుడు యుద్ధంలో దానికి పూర్తిగా సహాయ పడడం ఉచితమని దానికి తగినట్లుగా కాంగ్రెసు విధానాలను మార్చుకొనడం అవసరమని వారిలో అనేకులు భావించారు.

యుద్ధం సామ్రాజ్య తత్వాన్ని బలపరిచేది కావడంచేత యుద్ధ కార్యక్రమాలలో పాల్గొనరాదని ఇంతవరకు కాంగ్రెసు నాయకులు అభిప్రాయ పడినారు. అందుచేతనే కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామా చేయడం జరిగింది. కాని యూరపులో సంభవించిన పరిణామాల దృష్ట్యా యుద్ధంలో బ్రిటన్‌కు తోడ్పడమే తమ కర్తవ్యం అని కాంగ్రెసు నాయకు లనేకులు భావించసాగారు. అహింసా విధానానికి పూర్తిగా కట్టుబడిన గాంధీ తత్వానికి ఇది పరమ విరుద్ధమని వారికి తెలిసినా ఆయన అభిప్రాయాలతో గాని, తుదకు ఆయన నాయకత్వంతో గాని నిమిత్తం లేకుండా వారు స్వతంత్రంగా వ్యవహరించుటకు సిద్ధ పడ్డారు.

దీనిఫలితంగా కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ 1940 జులైలో ఢిల్లీలో సమావేశమై సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రవేశపెట్టడం తమ లక్ష్యం అని ప్రభుత్వం వెంటనే ఒక ప్రకటనను చేయవలసిందిగాను, దీనికి అనుగుణంగా కేంద్రంలో శాసనసభకు బాధ్యత వహించిన జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచవలసిందిగాను కోరుతూ, ఈ రెండు కోరికలను ప్రభుత్వం చెల్లించిన పక్షంలో కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వంలో పాల్గొనడమేగాక రాష్ట్రాలలో కూడా తిరిగి అధికారాన్ని చేపట్టి యుద్ధకార్యక్రమాలను సాగించడంలో ప్రభుత్వానికి పూర్తి సహకారాన్ని అందజేయుటకు సిద్ధంగా ఉన్నట్లు తీర్మానించింది. కొన్నిరోజులైన తర్వాత అఖిల భారత కాంగ్రెసు కమిటీ పూనాలో సమావేశమై ఈ తీర్మానాన్ని ఆమోదించింది. కాంగ్రెసు యుద్ధకార్యక్రమాలలో పాల్గొనడం గాంధీకి ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత ఆయన కాంగ్రెసు నాయకత్వాన్ని వదలుకొన్నాడు.

ఈ తీర్మానానికి జవాబుగా వైస్రాయి ఆగస్టు 8న (1) మరికొందరు భారతీయులను కేంద్ర ప్రభుత్వంలో చేర్చుకొనుటకు, (2, వెంటనే యుద్ధ కార్యక్రమాల సలహా సంఘాన్ని ఏర్పరుచుటకు (3) అల్పసంఖ్యాకులు—అనగా ప్రధానంగా ముస్లింల—అనుమతి పొందని రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టకుండుటకు. (4) యుద్ధానంతరం భారత ప్రతినిధులతో కూడిన రాజ్యాంగ పరిషత్తు సాధనాన రాజ్యాంగాన్ని రూపొందించుటకు ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్లు ఒక ప్రకటన చేశాడు.

కాని ఈ ప్రకటన కాంగ్రెసు నాయకులకు ఎంతమాత్రం తృప్తికరంగా లేకపోయింది. కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడవలసిందిగా వారు కోరారు. కాని దీనికి బదులు 1935 చట్టానుసారం వైస్రాయికి బాధ్యతవహించిన ప్రభుత్వంలో మరికొందరు భారతీయులను చేర్చుకొనుటకు మాత్రమే ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్లు వైస్రాయి ప్రకటించారు. దీనిమూలంగా ప్రజాభిప్రాయానుసారం కేంద్ర ప్రభుత్వం పరిపాలన సాగించే అవకాశం లేకపోయింది. వైస్రాయి నిరంకుశత్వంలో ఏలాటిమార్పు రాలేదు. ప్రకటనలోని నాల్గవ ప్రతిపాదన కాంగ్రెసు కోరికలకు అనుగుణంగా ఉండినా మూడవ ప్రతిపాదన దీనికి విరుద్ధంగా పరిణమించింది. ముస్లింల అనుమతి పొందని రాజ్యాంగాన్ని ప్రవేశపెట్టే ఉద్దేశం ప్రభుత్వానికి లేనప్పుడు రాజ్యాంగ పరిషత్తు రూపొందించే రాజ్యాంగం ఏనాటికీ ఆచరణలోకి

రాజాలదు. జనాభాలో నాలుగోవంతు వారికి జనాభాలో ముప్పాతిక వంతు ప్రజల అభిమతాలను ఆటంకపరిచే హక్కును ప్రసాదించడం బ్రిటిష్ ప్రభుత్వంయొక్క పక్షపాతవృత్తిని రుజువుచేయుడంతప్ప ఇంకొకటికాదు. ఇది హిందువుల ముస్లింలమధ్య బ్రిటిష్‌వారి ప్రోత్సాహంతో ఏర్పడిన విభేదాలను మరింత బలపరచడమేగాని ఇంకొకటికాదు. హక్కులన్నీ అల్పసంఖ్యాకులకు మాత్రమే ఉన్నదని, అధికసంఖ్యాకులకు ఏలాటిహక్కులూ లేదనే బ్రిటిష్‌వాదం ప్రపంచంలో ఏదేశంలోను ఆచరణలోలేని వాదం. కాని తుదవరకూ ఈ వాదాన్ని ఆధారం చేసుకొనే బ్రిటిష్‌వారు భారత దేశాన్ని పాలించారు. వైస్రాయి ప్రకటన ముస్లింలీగుకు మాత్రమే తృప్తి కలిగించింది. కాంగ్రెసు నాయకులు పూర్తిగా ఆశాభంగాన్ని పొందినారు.

గాంధీ నాయకత్వాన్ని కూడా త్యజించి యుద్ధంలో బ్రిటిష్ ప్రభుత్వానికి పూర్తి సహకారాన్ని అందజేయుటకు కాంగ్రెసు సిద్ధపడినా ప్రభుత్వం కాంగ్రెసు సహకారాన్ని తిరస్కరించింది. అధికారాన్ని లేశమాత్రంకూడా వదలుకొనే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని వైస్రాయి ప్రకటన స్పష్టం చేసింది.

దీని ఫలితంగా కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ ఆగస్టు 18–22న సమావేశమై జూలైలో చేసిన తీర్మానాన్ని రద్దుచేసి గాంధీని నాయకత్వం వహించవలసిందిగా అర్థించింది. ఆయన దానికి అంగీకరించి తాత్కాలికంగా విరమించిన నాయకత్వాన్ని తిరిగి చేపట్టాడు. అప్పటికి సంప్రతింపుల చక్రం తిరిగి తిరిగి యథాస్థానం చేరింది.

రాజీమార్గం విఫలమైన తర్వాత రామగర్ కాంగ్రెసు తీర్మానానుసారం శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించడంతప్ప కాంగ్రెసుకు మార్గాంతరం లేకపోయింది. కాని సమష్టి శాసనోల్లంఘనం వాంఛనీయం కాదనే భావాన్ని గాంధీ వదలుకొనలేదు. అలాంటి ఉద్యమం ద్వారా బ్రిటన్‌కు హానికలిగించడం ఆయనకు ఆమోదయోగ్యంకాలేదు. అది ఆయన తత్వానికే విరుద్ధమైనట్టిది. ఇంతేగాక ప్రజలలో అహింసా తత్వం బలపడలేదని, వారు సమష్టిగా సాగించే ఉద్యమం దౌర్జన్యానికి దారితీయడం తప్పదనే భావం ఆయనలో అనాటికి జీర్ణించుకొనిపోయింది. ఈ పరిస్థితులలో ఆయన శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించినా అది ఒక పరిమితమైన ఉద్యమంగా రూపొందింది.

అది రెండు విధాలుగా పరిమితరూపం ధరించింది. అందులో ఎవరంటేవారు పాల్గొనరాదని. అహింసకు పూర్తిగా కట్టుబడినవారే అందులో పాల్గొనవలసినదిగా ఆయన నిర్ణయించాడు. ఆయన అనుజ్ఞలేనిదీ ఎవరూ ఇందులో పాల్గొనరాదని ఆదేశించాడు. అందువలననే దీనికి వ్యక్తి సత్యాగ్రహం అనే పేరు లభించింది. ఇదిగాక దీని ఉద్దేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించడంకాదు. అది కాలక్రమాన ప్రజలు దానికి అర్హులైనప్పుడు వచ్చి తీరుతుంది. ఈ సత్యాగ్రహ ఉద్దేశం వాక్స్వాతంత్ర్యాన్ని ప్రకటించడం మాత్రమే. ఇందులో పాల్గొనేవారు బ్రిటిష్‌వారు చేస్తున్న యుద్ధం అధర్మ యుద్ధం అని. అందులో భారతీయులైనవారు పాల్గొనరాదని బహిరంగంగా చెప్పడమే. సత్యాగ్రహులు చేయవలసిన ఈలాటి పరిమిత ఉద్దేశంతో ఆయన ఈ ఉద్యమాన్ని సాగించాడు. ఆయన వైస్రాయిని సెప్టెంబరు 27న కలుసుకొని తాను కోరిన వాక్స్వాతంత్ర్యానికి అంగీకరించవలసిందిగా అర్థించాడు. కాని వైస్రాయి ఆ కోరికను నిరాకరించాడు. అక్టోబరు 11న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సమావేశమై వ్యక్తి సత్యాగ్రహాన్ని

ప్రారంభించవలసిందిగా తీర్మానించింది. దాని మేరకు వినోబాభావేని మొదటి సత్యాగ్రహిగా గాంధీ ఎన్నుకొన్నాడు. వెంటనే ఆయనకు ప్రభుత్వం జైలుశిక్ష విధించింది. మొదటిదశలో గాంధీ ఈలాంటి వారినే ఎన్నుకొన్నాడు. నవంబరు 15న ప్రారంభమైన రెండవ దశలో కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ, అఖిలభారత కాంగ్రెసు కమిటీ, కేంద్రకమిటీ, కేంద్ర రాష్ట్రశాసన సభలలోని సభ్యులను సత్యాగ్రహులుగా ఎన్నిక చేయడం జరిగింది. నెహ్రూ మొదటిదశలోనే నిర్బంధించబడినాడు. రెండవదశలో పటేల్, రాజగోపాలాచారి, అజాదులతో సహా కార్యనిర్వాహక కమిటీ సభ్యులు 11 గురు, అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు 196 గురు, 400 శాసన సభ్యులు జైలుశిక్షకు పాత్రులయ్యారు. 1941 జనవరి నుండి ఏప్రిలు వరకూ రాష్ట్రకాంగ్రెసు కమిటీలు ఎన్నుకొన్న 2200 మంది జైలుశిక్షను అనుభవించారు. ఇది ఉద్యమంలో మూడవదశ. నాలుగవ దశలో కాంగ్రెసులో సామాన్య సభ్యులుగా ఉండినవారు కూడా ఎన్నికయ్యారు. 1941 డిసంబరు నాటికి 25, 000 మంది జైళ్ళలో నిర్బంధించబడినారు.

"బ్రిటన్ సాగిస్తూ ఉన్న యుద్ధం అధర్మయుద్ధం అని, అందులో భారతీయులు పాల్గొనరాదని" బహిరంగంగా చెప్పడం ఒక నేరంగా భావించి 25. 000 మందిని జైళ్ళలో నిర్బంధించడం నాగరికతకు ప్రసిద్ధిచెందిన బ్రిటన్ దేశం అనుసరించదగిన విధానం కాదని విశ్వకవి రవీంద్రనాథుడు తన విచారాన్ని వ్యక్తం చేశాడు.

"దేశపరిపాలనకు బలప్రయోగం మాత్రమే సాధనమని భావించి మానవ స్వాతంత్ర్యంపట్ల ఎలాంటి విశ్వాసంలేని ప్రభుత్వాన్ని గౌరవించడం నావంటి వారికి సాధ్యంకాదు" అని తనలోని ఆవేదనను వ్యక్తం చేశాడు. భారతీయులనేకులలో ఆనాడు ఈభావమే ప్రాబల్యం వహించింది. తాను సాగించుచున్న వ్యక్తి సత్యాగ్రహం ప్రయోజన రహితమని విమర్శించిన వారందరికి రవీంద్రుని వాక్యమే తగిన జవాబని గాంధీ ఉద్ఘాటించాడు.

ఈ ఉద్యమం ప్రభుత్వంపైన ఏలాటి ప్రభావాన్ని వహించలేదు. అధికారుల వైఖరిలో ఎలాంటి మార్పురాలేదు. 1940 ఆగస్టు 8న వైస్రాయి చేసిన ప్రకటన ప్రకారం 1941 జూలైలో మరికొందరు భారతీయులను కేంద్రప్రభుత్వంలో చేర్చుకొనడము, యుద్ధసలహా సంఘం ఒక దానిని ఏర్పాటుచేయడం మాత్రం జరిగింది. వీటిమూలంగా నిరంకుశ పరిపాలన విధానంలో ఏలాంటి మార్పురాలేదు.

భారతదేశంపై తమకు లభించిన సామ్రాజ్యాధికారాన్ని లేశమాత్రంకూడా వదలుకొనుట బ్రిటిష్ ప్రభుత్వానికి ఆమోదయోగ్యం కాలేదని ఇంకొక ఉదంతం కూడా స్పష్టంచేసింది. 1941 ఆగష్టులో బ్రిటిష్ ప్రధాని చర్చిల్ అమెరికా అధ్యక్షుడు రూసువెల్టు కలిసి "అట్లాంటిక్ చార్టర్" (Atlantic charter) అని ప్రఖ్యాతిగాంచిన ఒక సంయుక్త ప్రకటనను విడుదల చేశారు. ఈ ప్రకటనలో ప్రతిజాతికి దాని పరిపాలన విధానాన్ని రూపొందించుకొనే హక్కు ఉన్నదని ఇతరుల బలప్రయోగంద్వారా తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన ప్రజలందరికి స్వపరిపాలనను అందజేయడం తమ లక్ష్యమని ఉద్ఘాటించారు. ఈ అభిప్రాయానుసారం చర్చిల్ భారతదేశానికి స్వపరిపాలనను ప్రసాదించగలడనే ఆశ భారతీయులకు కలిగినది.కాని అతడుబ్రిటిష్‌పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబుచెప్తూ అట్లాంటిక్ ఛార్టరు జర్మనుల పరిపాలనలోని ప్రజలకు మాత్రమే వర్తిస్తుందని, బ్రిటిష్ పరిపాలనలోఉండే భారతదేశానికి వర్తించదని నిర్మొగమాటంగా ప్రకటిం

చాడు చర్చిల్ పార్లమెంటులో చేసిన ఈ ప్రసంగం భారతదేశంలోని అన్ని వర్గాలకు ఒక కను విప్పుగా పనిచేసింది. యుద్ధంలో బ్రిటన్‌కు తాము ఎంతగా సహాయంచేసినా తమ స్థితిగతులలో ఏలాటి మార్పు రాజాలదనే భావం వారిలో నాటుకొన్నది ఇది కాంగ్రెసువారికేగాక అందరికీ ఆశా భంగాన్ని కలిగించింది. భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తిని కల్పించడం తమ తుదిలక్ష్యమని బ్రిటిష్ వారు పదేపదే చెప్పే మాటలు వట్టి బూటకమని, ఏనాటికీ వారు ఇష్టపూర్వకంగా తమ అధికారాన్ని వదలుకొనజాలరనే భావం భారతీయులలో దృఢపడింది. ఏమార్పు జరిగినా అది వెంటనే జరగవలసినదిగాను, భవిష్యత్తును ఉద్దేశించి బ్రిటిష్‌వారు చేసే వాగ్దానాలు నమ్మదగినవి కావని భారతీయులు గ్రహించారు. యుద్ధపరిస్థితులు విషమించిన తర్వాత బ్రిటిష్ ప్రధాని భారత దేశానికి పంపిన క్రిప్సు రాయబారం విఫలం కావడానికి ఇదే ప్రధానకారణం

వ్యక్తిసత్యాగ్రహం ప్రభుత్వంపై ఏలాటి ప్రభావాన్ని వహించని కారణంచేత దానిపట్ల క్రమక్రమంగా కాంగ్రెసువారు ఉత్సాహాన్ని కోల్పోయ్యారు. ఇదిగాక యుద్ధపరిస్థితులు పూర్తిగా విషమించిన కారణంచేత కాంగ్రెసుతో కొంత రాజీచేసుకొనే అవసరం కలిగినట్లు ప్రభుత్వం భావించి 1941 డిసెంబరులో జైలుశిక్షను అనుభవిస్తున్న సత్యాగ్రహులందరిని విడుదలచేసింది. దీనితో ఒక సంవత్సరంపైగా సాగిన వ్యక్తిసత్యాగ్రహ ఉద్యమం డిసెంబరు ఆఖరుకు ముగిసింది.

## 5

ఇదివరకు రెండవ ప్రపంచసంగ్రామం కాంగ్రెసు రాజకీయాలపై ఏలాటి ప్రభావాన్ని వహించిందీ తెలుసుకొన్నాము. ఇప్పుడు ఆ సంగ్రామం జిన్నాపైన, అతని నాయకత్వంలోని ముస్లింలీగుపైన ఏలాటి ప్రభావాన్ని వహించిందీ తెలుసుకొనవలసి ఉంది.

1937 లో ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెసులీగు కలిపి సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయవలసిందిగా జిన్నా కాంగ్రెసును అర్థించాడు. దానిమూలంగా కాంగ్రెసు లీగులు కలసి దేశ స్వాతంత్ర్యానికి పోరాటాన్ని సాగించే అవకాశం ఉంటుందని ఉద్ఘాటించాడు. కాని కాంగ్రెసు జిన్నాకోరికను నిరాకరించింది. దానితో కాంగ్రెసుపట్లను హిందువులపట్లను జిన్నావైఖరి పూర్తిగా మారింది. ఈ మార్పు 1947 లో దేశ స్వాతంత్ర్యం లభించేవరకు ముస్లిం రాజకీయాల పైన భారతరాజకీయాలపైన అత్యంత ప్రాధాన్యాన్ని వహించింది. ఇది భారతదేశ భవిష్యత్తు నంతా పూర్తిగా మార్చిందనే చెప్పవచ్చు.

ఉత్తరప్రదేశ్ మంత్రివర్గం నిర్మాణమైన తర్వాత మూడునెలలకు—అనగా 1937 అక్టోబరులో—లక్నోలో అఖిలభారత ముస్లింలీగు సమావేశమైంది. ఈ మధ్యకాలంలో కాంగ్రెసు నాయకులు సామాన్య ముస్లింప్రజలను కాంగ్రెసువైపు ఆకర్షించుటకు గొప్పప్రచారం సాగించారు. ఇందులో విజయాన్ని సాధించినపక్షంలో మధ్య తరగతికి చెందిన జిన్నా యొక్కయు లీగుయొక్కయు ఆటను చాలావరకు కట్టిపెట్టవచ్చునని వారు భావించారు. ఇది జిన్నాకు మరింత ఆగ్రహకారణమైనది. ముస్లింలపై కాంగ్రెసుప్రభావము ఉండరాదనేది అతని దృఢవిశ్వాసము. లక్నోలో లీగు సమావేశమైనప్పుడు అధ్యక్షస్థానానుండి కాంగ్రెసు పూర్తిగా హిందువుల సంస్థ అని, అది అధికారంలో ఉన్నంతకాలం ముస్లింలకు నష్టమేగాని ఏలాటి లాభం చేకూరదని, మంత్రివర్గాల నిర్మాణవిషయంలో వైస్రాయి గవర్నరులు కాంగ్రెసుతో

చేతులుకలిపి ముస్లింలకు అన్యాయం చేశారని, ఇది 1935 చట్టానికి విరుద్ధమైన విధానం అని, ఈ పరిస్థితులలో ముస్లింలందరు లీగులో సభ్యులై, అది ఒక్కటే వారితరపున కృషిచేయగల పార్టీ అని గుర్తించవలసిన అవసరం ఏర్పడినదని, ఉద్ఘాటించాడు. ముస్లింలకు కావలసింది ప్రాథమిక హక్కులుకావు; ప్రత్యేక రక్షణలుకావు. వారికి కావలసింది పరిపాలనలో భాగస్వామ్యం. సంకీర్ణ మంత్రివర్గాలకు అంగీకరించకపోవడం మూలంగా కాంగ్రెసు ఈ భాగస్వామ్యంపట్ల విముఖత్వాన్ని వ్యక్తంచేసింది. ఇదిమొదలు ముస్లింలు సుసంఘటితులై కాంగ్రెసుతో సమానప్రతిపత్తిని సంపాదించి, 50-50 దామాషాన అన్ని అధికారపదవులను పొందగలవారు కావలెను. అది సాధ్యంకానినాడు భాగస్వామ్య సంపాదనకు మార్గాంతరాలను అన్వేషించడం ముస్లింలకర్తవ్యం అని గంభీరంగా ఉపన్యసించాడు.

ఈ ఉపన్యాసం దేశంలో ముస్లింలు అందరిపై గొప్ప ప్రభావాన్ని వహించింది. పంజాబు, బెంగాలు, అసాం ముఖ్యమంత్రులు ఇదివరలో లీగులోచేరక, ప్రత్యేకపార్టీలకు నాయకులుగా ఉండినారు. ఇప్పుడువారు లీగులోచేరడమేగాక వారి అనుచరులను లీగులో చేరవలసిందిగా కోరారు. అనతికాలంలోనే లీగు పంజాబులో 40 శాఖలను, ఉత్తరప్రదేశ్‌లో 90 శాఖలను స్థాపించగలిగింది. ఉత్తరప్రదేశ్‌లో అదనంగా ఒక లక్ష ముస్లింలు లీగులో సభ్యులయ్యారు. ఆ రాష్ట్రంలో జరిగిన మూడు ఉపఎన్నికలలో లీగు అభ్యర్థులు గెలిచారు. గ్రామీణప్రాంతాలలో ముల్లాలనే మతప్రచారకులు ప్రచారాన్ని సాగించి, సామాన్యప్రజలను ఆకర్షించుటకు కాంగ్రెసుచేయసాగిన ప్రయత్నాలన్నిటిని ప్రతిఘటించారు. ఇదివరకే జిన్నా అఖిలభారతస్థాయికి చెందిన ముస్లింనాయకుడుగా ఉండినాడు. ఈ పరిణామాల ఫలితంగా అతని నాయకత్వం బలపడింది. లీగు ముస్లింప్రజల ఆదరణకు ఎక్కువగా పాత్రమైంది. లక్నో సమావేశం మూలాన ఈ ఫలితాలన్నీ లభించడంచేత అది చరిత్రాత్మకమైన పరిణామంగా ప్రఖ్యాతిగాంచింది.

కాంగ్రెసు నిర్వాహక కమిటీ అక్టోబరు ఆఖరున సమావేశమై స్వతంత్ర భారత దేశంలో అధికసంఖ్యాకులు అల్పసంఖ్యాకులు అనే వివక్షణలేక, అందరికి సమానమైన హక్కులు రక్షణలు లభించగలవని, అన్ని మార్పులూ ముస్లింలనలహా సంప్రతింపులతో చేయబడునని హామీఇచ్చింది. ఇది అతని వైఖరిని ఏవిధంగాను మార్చలేదు.

అనేక సంవత్సరాలు కాంగ్రెసు ప్రధాననాయకులలో ఒకడై, జాతీయదృక్పథంతో కృషిచేసి, హిందువులు ముస్లింలమధ్య సమైక్యతను కూర్చుటకు పాటుపడిన జిన్నా ఇదిమొదలు కాంగ్రెసుపట్ల ద్వేషభావాన్ని వహించి, ముస్లింలప్రత్యేక ప్రయోజనాలకు మాత్రమే కృషిచేసే వాడుకావడం చాలా విషాదకరమైన విషయం.

1938 లో కాంగ్రెసునాయకులు జిన్నాతో సంప్రతింపులు జరుపుటకు సిద్ధంగా ఉన్నప్పుడు అతడు రెండు షరతులను విధించాడు. వాటిలో మొదటిది కాంగ్రెసు హిందువుల తరఫున మాట్లాడుటకు మాత్రమే అర్హతగలసంస్థ అని కాంగ్రెసు నాయకులు అంగీకరించుట; రెండవది కాంగ్రెసుతరఫున సంప్రతింపులు జరిపే కమిటీలలో ముస్లింలు ఎవరూ ఉండరాదనేది. కాని వీటికి కాంగ్రెసు ఎంతమాత్రము అంగీకరించలేదు. మొదటినుండి కాంగ్రెసు జాతీయ సంస్థగా కృషిచేసింది. దానిలో హిందువులతోపాటు, ముస్లింలు, శిక్కులు, క్రైస్తవులు,

పార్సీలు, తదితర మతాలవారు. కులాలవారు సభ్యులుగా ఉంటూ వచ్చారు. అది భారతీయు లందరి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని కృషిచేస్తూ వచ్చింది. అలాటి సంస్థ ఈనాడు హిందువులకు మాత్రమే ప్రాతినిధ్యం వహించేసంస్థ అనిన్నీ, కాంగ్రెసుతరఫున అజాద్‌వంటి ముస్లింప్రముఖులు సంప్రతింపులలో పాల్గొనరాదనే షరత్తులకు అంగీకరించడం ఆత్మహత్యకు సిద్ధపడడమే అని కాంగ్రెసునాయకులు భావించి. వాటికి ఎంతమాత్రమూ అంగీకరించలేదు. కాని "భేదించు పాలించు" అనే చాణక్యనీతికి పూర్తిగా కట్టుబడిన ప్రభుత్వం వీటికి అంగీక రించి, జిన్నాను సన్నిహితునిగా చేసుకోగలిగింది.

ఈ షరత్తులను విధించడమేగాక కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారంలో ఉండిన రాష్ట్రాలలో ముస్లింలు ఎన్నో బాధలకు నష్టాలకు గురి అయినారని, వాటిని విచారణచేసి ఒక నివేదికను సమర్పించవలసిందిగా లీగు కార్యనిర్వాహకవర్గం పీర్పూరురాజాను నియమించింది. ఆయన విచారణచేసి ఒక దీర్ఘనివేదికను సమర్పించారు. ఇందులో కాంగ్రెసు మంత్రివర్గాలపట్ల ఆయనచేసిన ఆరోపణలన్నీ నిరాధారాలని మంత్రివర్గాలవారు రుజువుచేశారు. అంతేకాదు. వాటిని గురించి పెడరల్‌కోర్టు ప్రధానన్యాయమూర్తి విచారణచేయుటకు జిన్నా అంగీకరించవలసిందిగా కోరారు. కాని అలాటి నిష్పాక్షిక విచారణ అతనికి రుచించలేదు. అనేక రాష్ట్రాల గవర్నరులు తమ రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ముస్లింలపట్ల నిష్పక్షపాతంగా వ్యవహరించారని చెప్పినా జిన్నా వారి మాటలను పట్టించుకొనలేదు. కాంగ్రెసుపై నిందారోపణ చేయడమూ. దానినిగురించి ముస్లింలలో ప్రచారము గావించడమూ అతని ఏకైకలక్ష్యంగా రూపొందింది. ఇందులో గొప్పవిజయాన్ని సాధించాడు.

ఆ రోజులలో హిందూమహాసభ సావర్కారు అధ్యక్షతన కొంత కృషిచేసి, దేశంలో ప్రాధాన్యాన్ని సంపాదించుటకు ప్రయత్నిస్తూ వచ్చింది భారతదేశం హిందువులదేశం అని, ముస్లింలు ఒక అల్పసంఖ్యాకవర్గమని, అన్ని దేశాలలో అల్పసంఖ్యాకులకు లభించే హక్కులూ రక్షణలు వారికి భారతదేశంలో లభించడం న్యాయమని అంతకు మించి వారుకోరే సమాన ప్రతిపత్తివంటివి వారికి అందజేయవలసిన అవసరంలేదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ వచ్చింది హిందూమహాసభ అభిప్రాయమే హిందువులందరి అభిప్రాయమని జిన్నా భావించాడు. కాని ఇది గొప్ప పొరపాటు. హిందూమహాసభకు దేశంలో ఆనాడుగాని తర్వాత గాని ఏలాటిపలుకుబడిలేదు. ఎన్నికలలో అది చెప్పుకొనదగిన విజయాన్ని సాధించలేదు. హిందు వులలో రాజకీయచైతన్యంగలవారిలో అధికసంఖ్యాకులు కాంగ్రెసులో చేరినారు—కాంగ్రెసు అభిమతాలే వారి అభిమతాలు: అలాటి సందర్భంలో హిందూమహాసభయొక్క అభిప్రాయాలను ఆధారంచేసుకొని హిందువులందరు ముస్లింలపట్ల ద్వేషభావాన్ని వహించినట్లు ప్రచారంచేయడం అర్థరహితమైన పని. కాని జిన్నా అందులోకి దిగాడు.

1938 డిసంబరులో లీగు పాట్నాలో సమావేశమైనప్పుడు జిన్నా అధ్యక్షస్థానాన నుండి తన లక్ష్యాలను పునరుద్ఘాటించడమేగాక, కాంగ్రెసూ ప్రభుత్వమూ వాటికి లొంగని పక్షంలో ముస్లింలు చట్టబద్ధమైన ఆందోళనను మాని ప్రత్యక్షచర్య(Direct action) లోకి దిగడం తప్పదని బెదిరించాడు. సహాయనిరాకరణ ఉద్యమంవంటి ప్రత్యక్షచర్యలలోకి కాంగ్రెసు దిగిన కారణంగా ఆ సంస్థనుండి విడిపోయిన జిన్నా ఈనాడు ప్రత్యక్షచర్యను ప్రశంసించడం గుర్తించదగిన విషయం. కాని ప్రభుత్వం అతని లక్ష్యాలకు విధానాలకు అను

కూలంగా ఉండడంచేతను, 1939 లో కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామాచేయడంచేతను ప్రత్యక్ష చర్యలోకి దిగడం అవసరంలేకపోయింది.

కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామాచేయగానే హిందువుల పరిపాలననుండి ముస్లింలకు విముక్తికలిగిందని, అది వారికి సంపూర్ణ సంతోషాన్ని కలిగించే విషయమని, ఆ సంతోషాన్ని వ్యక్తపరచుటకు వారు "విముక్తి ఉత్సవాన్ని" ఒకరోజున జరుపుకొనవలసినదని ఆదేశించాడు. ఆ ఆదేశానుసారం దేశంలో అనేకకేంద్రాలలో ముస్లింలు అలాటి ఉత్సవాన్ని జరుపుకొన్నారు. కాంగ్రెసుపట్ల హిందువులపట్ల జిన్నాలో ఉత్పన్నమైన ద్వేషం అన్ని హద్దు లను అతిక్రమించింది.

రెండు సంవత్సరాల కృషి ఫలితంగా లీగును ముస్లింల ఏకైక రాజకీయసంస్థగా ప్రభుత్వం గుర్తించగల పరిస్థితులను జిన్నా కల్పించాడు. అహిరార్ సభ- జమీయత్-ఉల్-ఉలేమా, షియామహాసభ, మోమిన్‌ల సభ మొదలైన సంస్థలు ఉండినా ప్రభుత్వం వాటిని లెక్కలోకి తీసు కొనక ముస్లింలకు సంబంధించిన వ్యవహారా లన్నిటిని గురించి ముస్లింలీగు తరఫున జిన్నాతో మాత్రమే సంప్రతించుటకు నిశ్చయించింది. జిన్నా సాధించదలచిన లక్ష్యాలలో ఇది మొదటిది. ఆటుతర్వాత దేశ పరిపాలనలో భాగస్వామ్యాన్ని సంపాదించడమనే రెండవ లక్ష్యాన్ని సాధించుటకు కృతనిశ్చయు డైనాడు.

కాంగ్రెస్ లీగుతో కలిన సంకీర్ణ మంత్రివర్గాల స్థాపనకు సుముఖంగా లేనికారణాన రాష్ట్రాలలో ఆలాటి భాగస్వామ్యాన్ని సంపాదించే అవకాశంలేనట్లు అతడు గ్రహించాడు. మరి కేంద్ర ప్రభుత్వంలో ఎప్పటికైనా బాధ్యతాయుత పరిపాలన ప్రవేశపెట్టినా శాసన సభకు జరిగే ఎన్నికలలో కాంగ్రెసు విజయాన్ని సాధించడం తథ్యం. అందుచేత కాంగ్రెసు మంత్రివర్గమే ఏర్పడుతుంది. అలాటి పరిస్థితులలో కేంద్రంలోకూడా భాగ స్వామ్యం లభించడం కష్టసాధ్యం. అనగా ముస్లింలు అల్పసంఖ్యాకులుగా ఉండే రాష్ట్రాలలోను, దేశం మొత్తంలోను హిందువులకు సంఖ్యాబలం ఉండుటచేత పరిపాలనాధికార మంతా వారివశంలోకి రావడము, ముస్లింలు వారికిలోబడి, జీవితాన్ని సాగించడము తప్పదు. అందుచేత భాగస్వామ్యాన్ని సంపాదించుటకు ఇంకొకమార్గాన్ని అన్వేషించడం అవసరమనే నిర్ణయానికి జిన్నా వచ్చాడు.

ఇతడేకాదు. ఆ రోజులలో ముస్లింనాయకు లనేకులు ఈ అన్వేషణ కార్యక్రమాన్ని పూనుకొని అనేక మార్గాలను సూచించారు. ప్రపంచంలోని ఇతరదేశాలలో కూడా ఒక మత వర్గం అధికసంఖ్యలో ఉండడం, ఇంకొక మతవర్గం అల్పసంఖ్యలో ఉండడం కనుపిస్తూనే ఉన్నది. అలాటి దేశాలలో సమాఖ్య పరిపాలన విధానాన్ని స్థాపించి, అల్పసంఖ్యాకులు నివసించే ప్రాంతాలలోని ప్రభుత్వాలకు ఎక్కువ అధికారాలను కల్పించడము, కేంద్రంలోని సమాఖ్య ప్రభుత్వానికి కొన్ని ప్రధాన విషయాలలో మాత్రము అధికారాలను ఒప్పగించడము జరగడం చరిత్ర ప్రసిద్ధం, స్విట్జర్లాండు, కనడా, జెకోస్లోవేకియా, యూగోస్లోవియా మొదలైన దేశాలు ఈలాటివి. దీనిమూలంగా విభిన్నమతాలకు చెందినవారు, విభిన్నభాషలను మాట్లాడేవారు, విభిన్న జాతులవారు ఒకే రాజ్యంలో జీవితాన్ని సాగించడం పరిపాటి. ఈలాంటి సమాఖ్య విధానాన్ని అల్పసంఖ్యాకుల దృష్ట్యా అవసరమైనప్పుడు మరికొన్ని మార్పులతో సహా భారతదేశంలో

ప్రవేశపెట్టడం హిందూ ముస్లిం సమస్యకు పరిష్కారమార్గంగా ముస్లిం నాయకు లనేకులు భావించి, అలాంటి పథకాలను రూపొందించారు. కొందరు కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు మాత్రమే కాక, ఈ రెండింటికి మధ్య మూడవ ప్రభుత్వం కూడా ఉండవలెనని సూచించారు. పంజాబుకు 1939-42 లో ముఖ్యమంత్రిగా ఉండిన సికందరు హయత్‌ఖాన్ అలాటి పథకాన్ని రూపొందించిన వారిలో ప్రముఖుడు.

కాని సమాఖ్య ప్రభుత్వం ఎలాటిదైనా హిందువులు అధికసంఖ్యలో కేంద్ర మంత్రి వర్గాలలో ఉండడం తప్పదు. వారిది పైచెయ్యిగాను, ముస్లిందీ క్రిందిచెయ్యిగాను ఉండడం అనివార్యం. మంత్రి పదవులను, ఇతర అధికార పదవులను 50-50 దామాషాలో పంచు కొనడం జరిగినప్పుడు వాస్తవమైన భాగస్వామ్యం ముస్లింలకు లభించగలదని జిన్నాతో సహా కొందరు సూచించారు. కాని ఇది హిందువులకు ఎన్నడూ ఆమోదయోగ్యం కాగల విధానం కాజాలదు. దేశ జనసంఖ్యలో 75 శాతంగా ఉండిన హిందువులు 24 శాతంగా ఉండిన ముస్లిం లతో సమాన ప్రతిపత్తితో మాత్రమే తృప్తిపడడంలో ఏలాటి న్యాయంగాని ధర్మంగాని లేదు. ఇది అల్పసంఖ్యాకులు దేశాన్ని పాలించడమే. అందులోను ప్రజాస్వామిక విధానాన్ని కాంక్షించే హిందువులు, తదితరులు ఈలాటి అసమానత్వానికి ఎన్నడూ అంగీకరించే అవకాశం లేదు.

ఈలాటి మార్గాలన్నీ ఉభయవర్గాలకు రుచించేవి కావని తేలినతర్వాత జిన్నాకు మిగి లింది దేశ విభజన; తద్వారా పాకిస్థాన్ అనే ప్రత్యేక స్వతంత్రరాజ్యాన్ని స్థాపించే ప్రతిపాదన మాత్రమే.

1924 లో ప్రముఖ హిందూ నాయకుడైన లజపతిరాయి వాయవ్య ప్రాంతంలో ముస్లింలు అధిక సంఖ్యలో ఉన్నవాటిని దేశంనుండి విడదీసి ప్రత్యేక రాజ్యంగా రూపొందిం చడమే హిందూ ముస్లిం సమస్యకు పరిష్కారమార్గం అని ప్రప్రథమంగా సూచించాడు. కాని అప్పట్లో ఎవరుకూడా ఈ సూచనను గురించి ఆలోచించలేదు. అతడుకూడా సూచనను చేశాడే గాని, దానిపట్ల శ్రద్ధ వహించి, దానిని గురించి ఏలాటి ప్రచారమూ చేయలేదు.

ఆటుతర్వాత 1930 లో ముస్లిం తత్వవేత్త ఇక్బల్ ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే రాష్ట్రాలన్నీ కలిసి ఒక రాజ్యంగా ఏర్పడడమే ముస్లింల శ్రేయస్సుకు సాధనమని ప్రతి పాదించాడు. ఇది అనేకుల దృష్టిని ఆకర్షించింది. అప్పటికే అనేక పరిణామాల ఫలితంగా కాంగ్రెసు లీగుల మధ్య, హిందువులు ముస్లింల మధ్య విభేదాలు ప్రాబల్యం గాంచినట్లు మనం ఇదివరకే తెలుసుకొన్నాము. కాంగ్రెసు స్వరాజ్య సంపాదనార్థం సామాన్య ప్రజల సహాయంతో 1920-22 లోను, 1930-31 లోను శాసనోల్లంఘన ఉద్యమాలను సాగించి ప్రజాశక్తిని ఎదు ర్కొనడం పరాయి ప్రభుత్వానికి కష్టసాధ్యం అని రుజువు చేసింది. తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొనుటకు పటిష్ఠ సాధనాలను రూపొందించుకొనవలసిన అవసరం బ్రిటిష్ వారికి కలిగింది. అందుకుగాను వారు 1860 నుండి "విభించు—పాలించు" అనే భేదోపాయాన్ని ఆధారం చేసు కొని అన్నివిధాలా ముస్లింలను హిందువులనుండి వేరుపరచుటకు పరిపాలనలో ప్రత్యేక నియోజక వర్గాలు మొదలైన విధానాలను ప్రవేశపెట్టినారని మనమిదివరకే తెలుసుకొన్నాము. కాని వారిని దేశవిభజన అనే సాధనం ఎంతమాత్రము ఆకర్షించలేదు. 1930 లో రౌండుటేబిల్ సమావేశం జరుగుతున్న రోజులలో అలహాబాదులో హైకోర్టు జడ్జిగా ఉండిన షైాడన్‌ను ఇది ఆకర్షించి,

భారతదేశాన్ని హిందూ ప్రాంతమని ముస్లిం ప్రాంతమని రెండు ప్రాంతాలుగా విభాగం చేయడం ముస్లింలకు తృప్తికరంగా ఉండగలదని, హిందువులనుండి వారిని వేరుచేయడంలో ఇది ఉత్తమసాధనం కాగలదని, దీనిమూలంగా బ్రిటిష్ అధికారం ఏ విధంగాకూడా లోపించదని, దేశంలో ఒక బ్రిటిష్ ప్రభుత్వం ఉండుటకు బదులు రెండు బ్రిటిష్ ప్రభుత్వాలు ఏర్పడినా బ్రిటిష్‌వారి సామ్రాజ్యాధిపత్యానికి ఏలాటి ప్రమాదం లభించదని ఒక నివేదికను తయారుచేసి, బ్రిటన్‌లో కాన్సర్వేటివ్ పక్షానికి చెందిన చర్చిల్‌వంటి నాయకులకు సమర్పించాడు. అది వారిపై ఎక్కువ ప్రభావాన్ని వహించింది.

అదే సమయంలో ఇంగ్లండులో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉండిన చౌదరి రహమతాలీ (Chowdry Rahmat Ali) భారతదేశంలో ముస్లింలు అధిక సంఖ్యాకంగా ఉండే రాష్ట్రాలను కలిపి, పాకిస్థాన్ అనే పేరుతో ఒక ప్రత్యేక రాజ్యంగా ఏర్పాటు చేయడమే ముస్లిం సమస్యకు పరిష్కార మార్గమని సూచించడమే గాక, దానిని గురించి రెండు కరపత్రాలను ప్రకటించాడు. అప్పటికే బ్రిటిష్ ప్రముఖులలో కొందరికి ఈ దేశవిభజన ఆకర్షణీయమైంది. అందుచేత వారు అతనికి ధనసహాయం చేసి, అతని ప్రతిపాదనను గురించి పంజాబు మొదలైన రాష్ట్రాలలో ప్రచారాన్ని సాగించడంలో సహకరించారు. దీని ప్రచారార్థం వారు ఆర్థిక సహాయం చేయడం గుర్తించదగిన విషయం. విద్యార్థిగా ఉన్నవాడు స్వయంగా ఈ సూచనను చేసినాడా లేక ఇతరుల ప్రోత్సాహంతో దానిని చేసినాడా అనే విషయాన్ని గురించి కొందరు సందేహిస్తున్నారు. కాని కరపత్రాల ప్రకటన, ప్రచారము అతని పేరటనే జరిగినది.

ఇది మొదలు దేశంలోని వార్తాపత్రికలు కొన్ని పాకిస్థాన్ గురించి వ్యాఖ్యానించ సాగినాయి. ముస్లిం నాయకులెవరు దానిపట్ల సుముఖులుగా ఉండలేదు. జిన్నాకూడా దానిని ఎక్కువగా పట్టించుకొనలేదు—కాని ఉత్తర ప్రదేశ్‌లోని ముస్లిం నాయకులలో ప్రముఖుడైన ఖలీకుజ్జమాన్ దానిచే ప్రభావితుడైనాడు. ఇంగ్లండుకు వెళ్ళినప్పుడు ఇండియా మంత్రి జెట్లాండుతో దానిని గురించి చర్చలు జరిపాడు. జెట్లాండు దానిపట్ల సుముఖుడుగా ఉన్నట్లు గ్రహించాడు. అటుతర్వాత భారతదేశానికి రాగానే దానిని గురించి జిన్నాతో చర్చలు సాగించి, అతనిని పాకిస్థాన్ ప్రతిపాదన పట్ల సుముఖునిగా మార్చగలిగాడు. హిందువుల యొక్కగాని కాంగ్రెసు యొక్కగాని బెడదలేక పరిపాలనాధికారాన్ని చేపట్టి అనుభవించుటకు పాకిస్థాన్ రాజ్యాన్ని నిర్మాణం చేయడం ఒక్కటే సాధనమనే నిర్ణయానికి వచ్చాడు. ఇతరుల అభిప్రాయంతో నిమిత్తం లేకుండా ఆ నిర్ణయం అది మొదలు అతనిలో దృఢపడి పోయింది.

అటుతర్వాత కొద్దికాలంలోనే ముస్లింలీగు 1940 మార్చి 24 న లాహోరు నగరంలో అతని అధ్యక్షతన సమావేశమై చరిత్రాత్మకమైన పాకిస్థాన్ తీర్మానాన్ని చేసింది. "దేశంలో ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే వాయవ్య ఈశాన్య ప్రాంతాలను స్వతంత్ర రాజ్యాలుగా రూపొందించే రాజ్యాంగ ప్రణాళిక మాత్రమే ముస్లింలకు ఆమోదయోగ్యంగాను ఆచరణ సాధ్యంగాను ఉండగలదు." అనేది తీర్మానంలోని ప్రధాన భాగం. వాయవ్య ప్రాంతం ఒక స్వతంత్ర రాజ్యంగాను, ఈశాన్య ప్రాంతం ఇంకొక స్వతంత్రరాజ్యంగాను ఏర్పడడమా, లేక రెండు ప్రాంతాలు కలిపి ఒకే రాజ్యంగా ఏర్పడడమా అనే విషయం స్పష్టపరచలేదు. 1946 లో గాని ఇది ఒకే రాజ్యంగా ఉండవలెననే నిర్ణయం జరగలేదు.

ఈ తీర్మానం ముస్లింలు అధిక సంఖ్యలో ఉండిన రాష్ట్రాల గురించి మాత్రమే శ్రద్ధ వహించింది. ఉత్తర ప్రదేశ్, బీహారు, బొంబాయి, మద్రాసు మొదలైన రాష్ట్రాలలో వారు అల్ప సంఖ్యాకులుగా ఉండినారు. పాకిస్థాన్ ఏర్పడడం మూలాన వారి స్థితిగతులలో ఏలాటి మార్పూ సంభవించదు. స్వరాజ్యం లభించిన పక్షంలో అధిక సంఖ్యాకులతో సమానంగా అల్ప సంఖ్యాకులైన ముస్లింలకు ప్రాథమిక హక్కులు, వారి మతానికి కావలసిన ప్రత్యేక రక్షణలు రాజ్యాంగం ద్వారా కల్పించబడునని, అధికసంఖ్యాకులు అల్పసంఖ్యాకుల మధ్య ఏలాటి వివక్షణ ఉండదని కాంగ్రెసు పదేపదే ఉద్ఘాటించింది. పాకిస్థాన్ నిర్మాణం కావడం మూలంగా ఇంతకు మించి వీరికి ఏలాటి లాభమూ చేకూరే అవకాశంలేదు. హిందువులు ముస్లింలు విభిన్న జాతులకు చెందినవారని, వారు ఒకే రాజ్యంలో పౌరులుగా ఉండడం పొసగదనే భావంతో ముస్లింలకు ప్రత్యేక పాకిస్థాన్ రాజ్యం ఉండవలెనని జిన్నా పట్టుబట్టాడు. కాని పాకిస్థాన్‌లో చేరని రాష్ట్రాలలో ముస్లింలు హిందువులతో కలిసి పౌరులుగా జీవించడం తప్పదనే విషయాన్ని అతడు విస్మరించాడు. పాకిస్థాన్ గురించి 1940 లో ముస్లింలీగు చేసిన తీర్మానం ఈ దృష్ట్యా చాలా లోపభూయిష్టమైనట్టిది.

ఇంతేకాదు. పాకిస్థాన్‌లో హిందువులు, సిక్కులు, ఇతర మతాలవారు ముస్లింలతో కలిసి పౌరులుగా ఉండడం తప్పిందికాదు. వారి స్థితిగతులు ఏలాటివిగా ఉండవలెననే విషయాన్ని గురించికూడా లాహోరు సమావేశ తీర్మానం ఎక్కువగా పట్టించుకొనలేదు. అందుచేతనే ఇది హిందూ ముస్లిం సమస్య పరిష్కారానికి సాధనం కాదనే చెప్పవలసి వస్తుంది.

దీనిని గ్రహించినవారు కావడం చేతనే 1939-42 లో పంజాబుకు ముఖ్య మంత్రిగా ఉండిన సికందర్‌హయత్‌ఖాన్, బెంగాలు ముఖ్యమంత్రి ఫజలుల్‌హక్ ఈ తీర్మానంపట్ల ఉత్సాహాన్ని ప్రదర్శించరైరి. ముఖ్యంగా పంజాబులోని ముస్లింలు ముస్లింలుకాని వారిమధ్య హత్యాకాండలకు గురి తీయగలదని హయత్‌ఖాన్ భావించాడు. 1946-47 లో అలాగే జరిగింది. సింధు రాష్ట్ర ప్రధాని, వాయువ్య సరిహద్దు రాష్ట్ర నాయకులు తీర్మానాన్ని పూర్తిగా తిరస్కరించారు. జాతీయభావంగల ముస్లింలు ఢిల్లీలో సమావేశమై దీనిని ఖండించి, హిందువులతో కలిసి ముస్లింలు దేశస్వాతంత్ర్యానికి బ్రిటిష్‌వారితో పోరాటం సాగించి, విజయాన్ని సాధించిన తర్వాతనే మత వర్గాలమధ్య ఏర్పడిన విభేదాలు అంతరించే అవకాశం ఉన్నదని, బ్రిటిష్ పరిపాలనలో ఇది అంతరించ జాలదని ఉద్ఘాటించారు. రాష్ట్రాలను పాలించే అధికారం తమకు పూర్తిగా ఉన్నదనే భావంతో అధిక సంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలోని ముస్లింలు పాకిస్థాన్ పట్ల ఎక్కువ ఉత్సాహాన్ని ప్రదర్శించలేదు. అల్పసంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలోని ముస్లింలు పాకిస్థాన్ మూలంగా తమ స్థితిగతులలో ఏలాటి మార్పు రాజాలదని, హిందువులతో సోదర భావంతో ప్రవర్తించడమే తమ శ్రేయస్సుకు ఏకైక సాధనమని భావించారు.

ఈలాటి పరిస్థితులలో పాకిస్థాన్‌పట్ల క్రమక్రమంగా ముస్లింలలో అధిక సంఖ్యాకులు సుముఖులు కావడం, 1946-47లో అది అవశ్య సాధ్యం కావడం ఆశ్చర్యకరమైన విషయమే. దీనికి ప్రధాన కారణాలు రెండు ఉన్నట్లు చెప్పవచ్చు. ఉద్యోగాపేక్షగల మధ్యతరగతికి చెందిన విద్యాధికులు హిందువులతో పోటీ చేయవలసిన అవసరం లేకుండా స్వతంత్ర పాకిస్థాన్‌లో తమకు సులభంగా ఉద్యోగాలు లభించగలవనే ఆశ ఈ కారణాలలో మొదటిది. బ్రిటిష్ ప్రభుత్వం దీనిపట్ల పూర్తిగా అభిమానం వహించడం రెండవ కారణం. మొదటిది దానికంటె రెండవది

ఎక్కువ ప్రాబల్యం వహించింది. తమపై తిరుగుబాటు చేసినవారు హిందువులని, వారికి బుద్ధి చెప్పుటకు దేశాన్ని విభజించి పాకిస్థాన్‌ను నిర్మాణం చేయడమే పటిష్ట సాధనంగా బ్రిటిష్‌వారు భావించారు. 1940 లో కాంగ్రెసు సాగించిన వ్యక్తి శాసనోల్లంఘన ఉద్యమం, 1942లో అది సాగించిన క్విట్ ఇండియా ఉద్యమం ఈ భావాన్ని బలపరచింది. 1942 లో యుద్ధ పరిస్థితులు విషమించిన కారణంగా దేశంలోని ప్రధాన పార్టీలతో రాయబారాలను జరిపి, యుద్ధంలో వాటి పూర్తి సహాయాన్ని సంపాదించుటకు బ్రిటిష్ ప్రభుత్వం తరపున దేశానికి వచ్చిన క్రిప్సు ప్రతిపాదనలలో దేశంలో ఒక స్వతంత్ర డుమినియన్ బదులు అనేక డుమినియన్‌లు ఏర్పడుటకు అవకాశం కల్పించే ప్రతిపాదన ప్రాధాన్యం వహించింది. ఆనాటికి దేశవిభజనను ఆచరణలో పెట్టుటకు బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించుకొన్నట్లు ఇది స్పష్టం చేస్తున్నది. పాకిస్థాన్ ఏర్పడుటకు ఈ నిర్ణయమే ప్రధాన కారణం. "చీలించి పాలించు" అనే తత్వం దీని మూలంగా తుది స్థాయిని అందుకున్నది.

## 7

కాంగ్రెసు విధానాలలోను లీగు విధానాలలోను పైన వివరించిన మార్పులు సంభవించుచున్న కాలంలో యుద్ధగతి బ్రిటన్‌దృష్ట్యా మరింత ప్రమాదకరంగా పరిణమించింది. హిట్లరు బ్రిటన్‌పై దండయాత్రను సాగించడంలో విఫలుడైన తర్వాత ఇటలీనియంత ముసొలినీతో కలిపి ఉత్తర ఆఫ్రికాపై దండయాత్ర సాగించి, ఈజిప్టు దేశాన్ని ఆక్రమించి, బ్రిటన్ భారతదేశాల మధ్య సూయజ్‌కాలువ మీదుగా జరిగే రాకపోకలకు అంతరాయం కలిగించే ప్రయత్నంలోకి దిగాడు. బ్రిటిష్‌వారు వశపరచుకొన్న క్రీటు ద్వీపాన్ని, గ్రీసుదేశాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకొనగలిగాడు. హంగేరి, రుమేనియా, యూగోస్లావియా దేశాలను వశపరచుకొని, బల్గేరియాను తనపక్షం వహించేటట్లు చేసుకొనగలిగాడు. తన సరిహద్దులలోనున్న దేశాలన్నీ హిట్లరు వశపరచుకొన్న కారణాన రషియా జర్మనీపై యుద్ధం సాగించే ప్రమాదం ఉన్నదని భావించి 1941 జూన్ 22న యుద్ధప్రకటన చేయక, అకస్మాత్తుగా రషియాపై దండెత్తి ఉత్తర దక్షిణ ప్రాంతాలలో చాలా భాగాన్ని ఆక్రమించి ఆరునెలల కాలంలో ప్రధాన నగరమైన మాస్కోను సమీపించ గలిగాడు. అప్పటికి దుర్భరమైన శీతాకాలం ప్రారంభమైనందున అతడు పురోగమించలేకపోయినాడు. కాని అతడు అప్పటికే రషియాపై ఘనవిజయాన్ని సాధించడం గుర్తించవలసిన విషయం. దీని ఫలితంగా రషియా బ్రిటన్‌తో సంధిచేసుకొని మిత్రమండలితో కలిసి హిట్లరుతో యుద్ధం చేయసాగింది. విశాలమైనట్టి రషియాదేశంపై దండెత్తి దానిని వశపరచుకొన సంకల్పించడం హిట్లరు చేసిన పొరబాటులలో అగ్రస్థానం వహిస్తున్నది. ఇది అలాటి పొరబాటుని అతడు వెంటనే గ్రహించలేదు. శీతాకాలం గడచినతర్వాత తాను యథాప్రకారం పురోగమించి, పశ్చిమ ఏషియా పర్షియా దేశాలమీదుగా భారతదేశంపై దండెత్తి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయవచ్చుననే ఆశ అతనిలో జన్మించినది. రషియాలో అతడు సాధించిన విజయ పరంపరలు బ్రిటిషువారి పరిస్థితిని మరింత క్లిష్టతరం చేసినవి.

ఇదేకాలంలో ఇంతకంటె గొప్ప ప్రమాదాన్ని ఏషియా ఖండంలో బ్రిటిష్‌వారు ఎదుర్కొనవలసి వచ్చింది. పాశ్చాత్యదేశాలు గొప్ప సామ్రాజ్యాన్ని సంపాదించినట్లే తాను కూడా విశాల సామ్రాజ్యాన్ని సంపాదించదలచి 1936 నుండి జపాన్‌దేశం చైనాపై దండెత్తి

అనేక ప్రాంతాలను వశపరచుకొన గలిగింది. చైనావియంత చాంగియాషేకు ప్రధాననగరాన్ని శాంఘై, పీకింగులు వారి వశమైపోవడంతో పెకింగుకు చాలాదూరములో నైరుతి ప్రాంతంలోని చుంకింగు నగరాన్ని ప్రధాన నగరంగా చేసుకొని దేశాన్ని పాలించవలసి వచ్చింది. జపాన్ చైనాపైన మాత్రమే గాక ఫ్రెంచివారి వశంలో ఉండిన ఇండో-చైనాపై కూడా దండెత్తి వెళ్ళింది. అక్కడ అదివరకే కొంత పలుకుబడిని సంపాదించిన అమెరికన్లకు ఇది ఎంతమాత్రం నచ్చలేదు. అందుచేత జపాన్‌వారు ఒకవైపు సంప్రతింపులు జరుపుతూనే ఇంకొకవైపు పసిఫిక్ మహాసముద్రంలో అమెరికన్‌ల ప్రధాన నౌకాశ్రయమైన పెరల్‌హార్బరుపై 1941 డిసెంబరు 7 న దాడిచేసి, అమెరికా యుద్ధ నౌకల నన్నిటిని ధ్వంసంచేసి, అమెరికాపై యుద్ధాన్ని ప్రకటించింది. హిట్లరు ముసొలినీల పక్షం వహించింది. దీని ఫలితంగా అమెరికా యుద్ధంలో బ్రిటన్ రష్యాలపక్షంలో చేరి. జపాన్, జర్మనీ, ఇటలీలపై యుద్ధాన్ని ప్రకటించింది. అంతటితో దక్షిణ అమెరికాలో అమెరికాకు సన్నిహితంగా ఉండిన దేశాలన్నీ దానిపక్షం వహించి యుద్ధంలో పాల్గొన్నవి. అదివరకు యూరపుఖండానికి ఉత్తర ఆఫ్రికాకు పరిమితంగా ఉండిన యుద్ధం ప్రపంచ సంగ్రామంగా మారి పోయింది

అమెరికా దాని సైన్యాలను నౌకాబలాలను విమాన బలాలను సమకూర్చుకొనుటకు కొంతకాలం పట్టింది. ఈ మధ్యకాలంలో మెరుపులీగ వేగంతో జపాన్ బలాలు క్రమ క్రమంగా ఇండో - చైనాను, డచ్చివారివశంలో ఉండిన ఇండొనేషియాను. అమెరికా వశం లోని ఫిలిప్పైన్ ద్వీపాలను, బ్రిటిషువారివశంలోని హాంగ్‌కాంగు. సింగపూరు, మలయాలను వశపరచుకొని. సింగపూరు నౌకాశ్రయంలోని బ్రిటిష్‌వారి గొప్ప యుద్ధనౌకలను ముంచివేసి, బర్మాపై దండెత్తి, మార్చి 15 నాటికి రంగూనును వశపరచుకొన గలిగాయి. ఆ నగరంలో అనేక సంవత్సరాలుగా నివసిస్తూఉండిన లక్షలాది భారతీయులు ఏలాటి రక్షణలేక, అడవులలోను కొండలలోను నానాబాధలకు గురియై అనేకులు ప్రాణాలను కోల్పోయ్యారు. కొందరుమాత్రం అసాంమీదుగ భారతదేశాన్ని చేరగలిగారు.

అప్పటికి బర్మానుండి కొద్దికాలంలోనే జపాన్‌వారు భారతదేశంపై దండెత్తి రాగల రనే అభిప్రాయం బ్రిటిష్‌వారిలోను భారతీయులలోను వ్యాపించింది. జపాన్‌వారినౌకలు ఆకాశ విమానాలు బంగాళాఖాతాన్ని అప్పటికే ప్రవేశించాయి. 1942 ఏప్రిలు 6న వారు విశాఖపట్నంపై బాంబులవర్షాన్ని కురిపించారు. ఆటుతర్వాత అండమాన్ ద్వీపాలను వశపరచుకొన్నారు. డిసంబరు 20 న కలకత్తా నగరంపై బాంబులను ప్రేల్చారు. ప్రజలు భీతావహులై దారి తెన్ను లేక నలుదిక్కులా పారిపోసాగారు.

1942 ప్రారంభాన నుండి జపాన్‌వారు భారతదేశంపై దండెత్తడం తప్పదనేభావం ప్రజలలోను—వారిలో ప్రధానంగా కాంగ్రెసు వర్గాలలోను వ్యాపించింది. అది జరిగినపక్షంలో వారిపట్లను. బ్రిటిష్ ప్రభుత్వంపట్లను ఏలాటి వైఖరిని అనుసరించవ లసినేది గడ్డు సమస్యగా రూపొందింది. బ్రిటిష్ పరిపాలనమూలంగా ఎన్ని అనర్థాలు సంభవించినా పరాయివారి దండ యాత్రలనుండి వారు దేశాన్ని రక్షింపగలగడం ఒక గొప్పలాభంగా నూరు సంవత్సరాలనుంచి ప్రజలు పరిగణించారు. కాని జపాన్‌వారిని ఎదుర్కొనలేక సింగపూరు. మలయా, బర్మాలనుండి బ్రిటిష్‌వారు పారిపోవడం ప్రజలకు ఎంతో ఆశాభంగాన్ని కలిగించింది. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని కూడా రక్షించలేక ప్రజలను వారి కర్మానికి వదలి పారిపోయే ప్రమాదం ఉన్న

అనే భావం వ్యాపించింది. వారిపట్ల విశ్వాసం సన్నగిల్లింది. జపాన్‌వారి దండయాత్రనుండి దేశాన్ని రక్షించడం ఎలాగు అనే ప్రశ్నకు కాంగ్రెసు నాయకులతో సహా నాయకులందరు సమాధానాన్ని అన్వేషించ సాగారు.

జపాన్‌వారిదాడి నుండి దేశాన్ని రక్షించడం ప్రజల కర్తవ్యమేగాని అందుకుగాను వారు బ్రిటిష్ ప్రభుత్వంతో కలిసి సాయుధ పోరాటాన్ని జరపరాదని, శాంతియుతంగా అహింస ధర్మానికి కట్టుబడి సత్యాగ్రహ సమరాన్ని మాత్రమే సాగించవలసిందిగా గాంధీ అభిప్రాయపడినాడు. కాని ఇది ఇతర కాంగ్రెసు నాయకులకు నచ్చింది కాదు. ఈలాటి అభిప్రాయ భేదం గతంలో 1940 లో కలిగిందని, ఆయన నాయకత్వంతో నిమిత్తం లేకుండా యుద్ధంలో బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించవలసిందిగా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం అఖిల భారత కాంగ్రెసు కమిటీలు తీర్మానించినట్లు మనం ఇదివరకే తెలుసుకొన్నాము. ఇప్పుడుకూడా కాంగ్రెసు నాయకులు ఇదేవిధంగా ప్రవర్తించారు. 1941 డిసంబరు 23 న బార్డోలిలో సమావేశమై అహింసా తత్వంతోగాని గాంధీ నాయకత్వంతో గాని నిమిత్తం లేకుండా, మొదటినుండి కాంగ్రెసు కోరిన షరత్తులకు బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిన పక్షంలో సాయుధ పోరాటంలో పూర్తిగా ప్రభుత్వంతో సహకరించుటకు కాంగ్రెసు సిద్ధంగా ఉన్నట్లు తీర్మానించింది. ఈ తీర్మానాన్ని అఖిలభారత కాంగ్రెసు కమిటీ జనవరిలో ఆమోదించింది. ఈ షరత్తులలో మొదటిది భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడం తమ లక్ష్యమని ప్రభుత్వం ప్రకటించడం; రెండవది వెంటనే అన్నిపార్టీల ప్రతినిధులతో కూడిన ఒక జాతీయ ప్రభుత్వానికి (National Government) దేశరక్షణతో సహా అన్ని పరిపాలన శాఖలను ఒప్పగించడం. అప్పుడుగాని భారతీయులు ఉత్సాహంతో యుద్ధ కార్యక్రమాలలో పాల్గొనడం జరగదని, దేశం తమదే అనే భావం వారిలో కలిగినప్పుడే ఇది జరగగలదని, బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని శాశ్వతపరచే యుద్ధంలో పాల్గొనడం ప్రజల అభిమతం కాదని వారు పునరుద్ఘాటించారు.

జనవరి 2 న ప్రజలందరికి గౌరవ పాత్రుడైన సప్రూ మరి పండ్రెండుగురు ప్రసిద్ధ నాయకులతో కలిసి, జపాన్‌వారి విజయ పరంపరల దృష్ట్యా ప్రజలను తృప్తిపరచి, జపాన్‌వారి దండయాత్రను ఎదుర్కోవడంలో వారి సహకారాన్ని సంపాదించడం అవసరమని, అందుకుగాను కేంద్రంలో శాసనసభకు బాధ్యత వహించిన జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించడం సాధనమని బ్రిటిష్‌ప్రధాని చర్చిల్‌కు ఒక తంతివార్తను పంపినాడు. కాంగ్రెసు కమిటీ తీర్మానంగాని సప్రూ తంతివార్తగాని చర్చిల్‌పై ఆ నాడు ఏలాటి ప్రభావాన్ని వహించలేదు. మార్చినాటికిగాని జపాన్‌వారి మూలంగా సంభవించనున్న ప్రమాదంయొక్క పూర్తి స్వరూపం బ్రిటిష్ ప్రభుత్వానికి గోచరం కాలేదు.

ఈ మధ్యకాలంలో బ్రిటిష్‌వారు దేశాన్ని రక్షించగలరనే విశ్వాసం ప్రజలలో మరింత తగ్గింది. తమదేశం స్వతంత్రం లేక బ్రిటిష్ సామ్రాజ్యానికి పూర్తిగా లోబడిన దేశం కావడంచేతనే జపానువారు దానిపై దండెత్తే ప్రమాదం ఉన్నదని, అలాగుకాక అది స్వతంత్ర దేశమైనపక్షంలో ఆ ప్రమాదం తప్పుతుందనే భావంకూడా వ్యాపించసాగింది. దేశ స్వాతంత్ర్యంపట్ల ప్రజల అభిమానమూ, బ్రిటిష్ పరిపాలనపట్ల ద్వేషమూ బలపడినాయి. దేశంపై జపాన్‌వారు దండెత్తి వచ్చినపక్షంలో ప్రభుత్వం ప్రజలను రక్షించగలదనే విశ్వాసం సన్నగిల్లింది. సింగపూరు, మలయా, బర్మాలనుండి బ్రిటిష్ సైన్యాలు పారిపోయినట్లే భారతదేశానుండి

పారిపోవడం తప్పదనే భావంకూడా అనేకులలో వ్యాపించింది. అలాటి పరిస్థితులలో దేశ రక్షణార్థం ప్రజాసంఘాలద్వారా చర్యలను తీసుకోవలసినట్లుగా కాంగ్రెసు తీర్మానించి, అలాటి సంఘాలను స్థాపించుటకు ప్రయత్నాలు చేసింది.

ప్రజల అభిప్రాయాలు కార్యక్రమాలు ఈ విధంగా మారుతూఉండినా, వైస్రాయి, ఇండియా మంత్రి, చర్చిల్ అభిప్రాయాలలో ఎలాటి మార్పూ రాలేదు. 1940 ఆగస్టు 8 న వైస్రాయి చేసిన ప్రకటనలోని ప్రతిపాదనలకు మించి కొత్త ప్రతిపాదనలను చేసి ప్రభుత్వాన్ని కాంగ్రెసుకు ఒప్పగించడం ప్రమాదకరమనే భావం వారిలో బలపడిపోయింది. సామ్రాజ్యాధికారం లేశంకూడా తగ్గడం వాంఛితం కాదని వారు పట్టుపట్టారు.

ఆ నాడు చైనాను పాలిస్తున్న చియాంగ్‌షేక్‌కు భారతదేశంలోని పరిస్థితులు విషమించడం ఎంతమాత్రం అంగీకారయోగ్యం కాలేదు. జపాన్‌తో అతడు బ్రిటన్, అమెరికాల సహాయంతో యుద్ధంచేస్తూ ఉండినవాడు. జపాన్‌వారి విజయపరంపరలు అతనికి ఆఘాతాన్ని కలిగించింది. బర్మా జపాన్ వారివశంలోకి వచ్చిన పక్షంలో భారతదేశంనుంచి అతని సహాయార్థం వచ్చే యుద్ధ సామగ్రికి ఆటంకం కలగడం తప్పదు. జపాన్ భారతదేశంపై దండెత్తిన పక్షంలో ప్రజలసహకారం లేనిదే బ్రిటిష్ ప్రభుత్వం వారిని ఎదుర్కొనడం సాధ్యం కాదు. వారి సహకారాన్ని సంపాదించుటకు కాంగ్రెసును తృప్తిపరచడం అవసరం అనే భావం అతనికి కలిగింది. అందుచేత అతను భారతదేశానికి 1942 ఫిబ్రవరిలో వచ్చి ప్రభుత్వంతోను గాంధీ నెహ్రూ అజాద్ మొదలైన కాంగ్రెసు నాయకులతోను చర్చలు సాగించి దేశంలోని వాస్తవ పరిస్థితులను తెలుసుకొని, భారత ప్రభుత్వం జపానును ఎదుర్కొనగల స్థితిలో లేదని, ప్రజల సహకారంలేనిది వారు ఎదుర్కొనడం సాధ్యంకాదని, కాంగ్రెసుతో రాజీచేసుకొని అలాటి సహకారం సంపాదించడం ప్రభుత్వ కర్తవ్యమని చర్చిల్‌కు నివేదించాడు. అట్లాంటికు చార్టరు భారతదేశానికి వర్తించదని ప్రకటించిన చర్చిల్ చియాంగు సలహాను చెడచెవిని పెట్టడంలో ఆశ్చర్యపడవలసిందిలేదు.

కాని త్వరలోనే రూసువెల్టు కూడా అవే అభిప్రాయాలను వ్యక్తం చేశాడు. అతని దృష్టిలో హిట్లరు ముసోలినీలకంటె జపాన్‌వారే ప్రపంచ శాంతికి ఎక్కువ ప్రమాదాన్ని కలిగించే శత్రువులు. వారిని అణచివేయడం మిత్రమండలివారి ప్రథమ కర్తవ్యం. ఇందుకో భారతదేశపు సహాయం ఎంతైనా అవసరం. ఈ దేశానికి అపార సైనికబలం ఉన్నది. లక్షలాది సైనికులను సమకూర్చగల శక్తి దీనికి కలదు. దీనికితోడు యుద్ధసామగ్రిని తయారుచేసి యుద్ధరంగాలకు తరలించుటకు దీనికిగల సదుపాయాలు మరి ఏదేశానికిలేదు. ఇది జపాన్‌వారికి వశపడడం, ఈ సైనిక బలాన్ని యుద్ధసామగ్రిని ఇతర సదుపాయాలను వినియోగించగల అవకాశాలను మిత్రమండలివారు పోగొట్టుకొనడం ఏ పరిస్థితులలోనూ కూడా వాంఛనీయం కాజాలదు. కాని ఈ అవకాశాలను పూర్తిగా వినియోగించుకొనుటకు ప్రజల సహకారం ఎంతైనా అవసరం. ప్రస్తుతం ఆ సహకారం లభించడంలేదు. బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెసుతో రాజీ చేసుకొని దాని వాంఛలను తీర్చినగాని ఈ సహకారం లభించదు. అందుచేత వెంటనే ఇందుకుగాను ఉచితములైన చర్యలను తీసుకొనవలసిందిగా రూసువెల్టు చర్చిల్‌కు ఒక ఉత్తరంవ్రాసి, లండన్‌లోని తన రాయబారులు దీనిని గురించి చర్చిల్‌తో సంప్రదించవలసిందిగా ఆదేశించాడు.

ఆనాడు అమెరికావారి సహాయంలేక యుద్ధాన్ని సాగించేస్థితిలో బ్రిటన్‌లేదు. అప్పటికే అది తన బలాన్ని చాలావరకు కోల్పోయింది. కాంగ్రెసు తీర్మానాలను, సప్రూలేఖను, చియాంగ్ సలహాను త్రోసిపేసినట్లు రూసువెల్టు మాటలను తిరస్కరించడం ఆత్మహత్య చేసుకొనడమే అని చర్చిల్ బ్రిటిష్ మంత్రివర్గాలవారు గ్రహించారు. ఇంతకు కొంచెం పూర్వమే మంత్రివర్గంలో లేబరు పక్షానికి చెందిన అట్లీ రూసువెల్టు వ్యక్తంచేసిన అభిప్రాయాలవంటి అభిప్రాయాలనే వ్యక్తంచేసి కాంగ్రెసుతో రాజీ చేసుకొనవలసిందిగా చర్చిల్‌ను కోరాడు. ఈ పరిస్థితులలో చర్చిల్ కాంగ్రెసుతోను తక్కిన ప్రముఖ భారతీయ పార్టీలతోను రాయబారాలు జరపడం అని వార్యమైంది.

కాని అప్పటికి కూడా భారతదేశ సైనిక బలాన్ని గురించి ఏవో కొన్ని అసత్యాలు పలికి రూసువెల్టు చేసిన సలహాను ఆచరణ సాధ్యం కాకుండా చేయ ప్రయత్నించాడు. భారత సైన్యంలో ముస్లింలు 75 శాతం ఉన్నారని వారు కాంగ్రెసుకోరే స్వాతంత్ర్యానికి విరోధులని, వారికి అతృప్తిని కలిగించడం సైనిక బలాన్ని కోల్పోవడమేనని చర్చిల్ రూసువెల్టుకు తెలియ పరిచాడు. కాని ఇందులో ఏలాటి సత్యమూలేదు. వాస్తవంలో సైనికబలంలో 34 శాతం మాత్రమే ముస్లింలు. తక్కిన 66 శాతం శిక్కులు, రాజపుత్రులు, ఘూర్కాలు మొదలైన హిందువులతో కూడినట్టిది. ఈ విషయం రూసువెల్టుకు తెలియనట్టిదికాదు. అందుచేత అతనిని మభ్యపెట్టుటకు చర్చిల్ చేసిన ప్రయత్నాలు ఫలప్రదంకాలేదు. భారతదేశ పరిపాలన విధానాన్ని మార్చుటకు ప్రధాన రాజకీయపార్టీలతో సంప్రతింపులలోకి దిగడం తప్పిందికాదు.

ఈ సంప్రతింపులు సాగించుటకు ఆధారంగా కొన్ని ప్రతిపాదనలుచేసి, వాటిలో మంత్రివర్గంలో ప్రధానస్థానంలో ఉన్నట్టిన్ని నెహ్రూవంటివారితో పరిచయం కలిగినట్టిన్ని క్రిప్సు మార్చి 23న భారతదేశానికివచ్చి ఏప్రిలు 12 వరకు రాయబారాలను జరిపినాడు.

ఈ ప్రతిపాదనలలో ఒక భాగం యుద్ధానంతరం భవిష్యత్తులో జరగవలసిన మార్పులకు సంబంధించినట్టిది; రెండవ భాగం యుద్ధకాలంలో వెంటనే జరగవలసిన మార్పులకు సంబంధించినట్టిది. ఆ ప్రతిపాదనలు ఈ క్రింది విధంగా ఉండినవి.

(1) యుద్ధం ముగిసిన వెంటనే భారతదేశానికి డుమినియన్ ప్రతిపత్తి లభిస్తుంది. ఇష్టం ఉంటే బ్రిటన్‌తో సంబంధం పెట్టుకోవచ్చు; ఇష్టంలేని పక్షంలో బ్రిటన్‌నుండి విడిపోవచ్చు.

(2) ఒక రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచి డుమినియన్ ప్రతిపత్తికి అనుగుణమైన రాజ్యాంగాన్ని రూపొందించడం జరుగుతుంది.

(3) ఈ రాజ్యాంగాన్ని బ్రిటన్ అమలుపరుస్తుంది. కాని ఈ రాజ్యాంగానికి కట్టుబడుటకు ఇష్టంలేని రాష్ట్రాలుగాని ప్రాంతాలుగాని భారత డుమినియన్‌లో చేరవలసిన అవసరంలేక ప్రత్యేక డుమినియన్‌లుగా ఏర్పడవచ్చును-ఇదే విధంగా స్వదేశ సంస్థానాలు ఇష్టం ఉంటే భారత డుమినియన్‌లో చేరవచ్చు; ఇష్టంలేని పక్షంలో స్వతంత్ర రాజ్యాలుగా ఉండవచ్చు.

(4) ఈలాగు ఏర్పడే డుమినియన్‌లు అల్పసంఖ్యాకుల రక్షణార్థం ఇదివరలో బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన హామీలకు అనుగుణంగా బ్రిటిష్ ప్రభుత్వంతో ఒక ఒడంబడికను చేసుకొనవలెను.

(5) కొత్త రాజ్యాంగం ఏర్పడేవరకూ యుద్ధకార్యక్రమాలను పటిష్ఠంగా సాగించే అధికారం బ్రిటిష్ ప్రభుత్వానికి ఉండవలెను. కాని దేశరక్షణకు సంబంధించిన కార్యక్రమాలను అమలుపరచే బాధ్యతను భారత ప్రభుత్వం భారతీయుల సహాయంతో నిర్వహిస్తుంది. ఇది ఆచరణ సాధ్యం కావడంలో భారతీయ నాయకులందరి సలహాలను లెక్కలోకి తీసుకొంటుంది.

పై ప్రతిపాదనలలో 1—4లు భవిష్యత్తుకు సంబంధించినట్టివి: 5 వెంటనే జరగ వలసిన మార్పుకు సంబంధించినట్టిది.

భవిష్యత్తుకు సంబంధించిన ప్రతిపాదనలు కాంగ్రెసు లీగు వాంఛలకూ చాలా వరకూ అనుగుణంగా ఉండినా వాటిని ఈ రెండు సంస్థలు తిరస్కరించాయి. నాల్గవ ప్రతిపాదన దేశ విచ్ఛిత్తికి దారితీసి మొగలాయి సామ్రాజ్య పతనం జరిగిన తర్వాత ఏర్పడినట్లే అనేక స్వతంత్ర రాజ్యాలు ఏర్పడడం, వాటిమధ్య యుద్ధాలు సంభవించడం. వాని ఫలితంగా పరాయి వారైన బ్రిటిష్‌వారి పరిపాలన స్థాపించబడినట్టి పరిస్థితులకు దారితీయడం జరుగుతుందని కాంగ్రెసు అభిప్రాయ పడింది. దేశ విభజనకు అనుగుణంగా నాల్గవ ప్రతిపాదన ఉండడం లీగుకు తృప్తి కలిగించినా పాకిస్థాన్ ఉద్యమాన్ని పూర్తిగాను స్పష్టంగాను ఆమోదించలేదని ఈ ప్రతిపాదనలను లీగు తిరస్కరించింది.

ఇంతేకాదు. ఈ తిరస్కారానికి ఇంతకంటె ప్రబల కారణాలు ఉండినవి. 1858 నుండి బ్రిటిష్‌వారు ఎన్నో వాగ్దానాలను చేసినారు. కాని వాటిని చెల్లించడంలో ఏలాటి ఉత్సాహాన్ని ప్రదర్శించలేదు. ఈ ప్రతిపాదనలను చెల్లించగలరని విశ్వసించడం ఎలాగు? అనే సందేహం కాంగ్రెసుకు ఇతరపార్టీలకు కలిగినది. ఇదిగాక యుద్ధంలో బ్రిటన్‌కు తప్పకుండా విజయం లభిస్తుందనే నమ్మకం ఎవరికీ ఆనాడు కలుగలేదు. అందుచేత భవిష్యత్తుకు సంబంధించిన ప్రతిపాదనల గురించి వారు ఎక్కువగా పట్టించుకొనలేదు. దీని ఫలితంగా క్రిప్సుతో వారు చేసిన చర్చలలో చాలా భాగం 5వ ప్రతిపాదనకు సంబంధించినట్టివిగా ఉండినవి. కాంగ్రెసు వెంటనే కేంద్రంలో అన్ని ప్రముఖ పార్టీల ప్రతినిధులతో కూడిన ఒక జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించవలసిందిగాను. దేశరక్షణ శాఖతోసహా అన్ని పరిపాలన శాఖలను దాని అధీనంలోకి రావలసినట్లును. బ్రిటన్‌లో రాజు మోస్తరుగానే భారతదేశంతో వైస్రాయి నామ మాత్రాధికారాలు కలవాడై జాతీయ ప్రభుత్వ సలహాలకు కట్టుబడి ఉండవలసిందిగాను కోరింది. ప్రభుత్వమంతా భారతీయుల వశంలోకి వచ్చినప్పుడే యుద్ధకార్యక్రమా లన్నిటిలోను దేశరక్షణ విషయంలోను ఉత్సాహంతో ప్రజలు పాల్గొనడం జరుగుతుందని. బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని సుస్థిరంచేసే ఉద్దేశం వారికి లేదని, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం వెంటనే లభించే అవకాశం ఉన్నప్పుడే ప్రజలకు వాస్తవమైన ఉత్సాహం కలుగడం, వారు రక్షణ కార్యక్రమాలలో పాల్గొనడం సులభసాధ్యం కాగలదని వారు క్రిప్సుతో వాదించారు.

అతడు చాలావరకు వారితో ఏకీభవించాడు. ఈ చర్చలు జరిగే సందర్భంలో రూసువెల్టు ప్రతినిధి లూయిజాన్‌సన్ భారతదేశానికివచ్చి కాంగ్రెసు నాయకుల తరపున క్రిప్సుతో సంప్రతింపులు జరిపి రెండుపక్షాల మధ్య సామరస్యం కుదురడంలో చాలా కృషి చేశాడు. ఈ చర్చలన్నిటి ఫలితంగా కేంద్రంలో ఏర్పడే ప్రభుత్వం ఒక జాతీయ ప్రభుత్వంగా కృషిచేయ

గలవనే హామీని క్రిప్సు కాంగ్రెసు నాయకులకు ఇచ్చాడు. రక్షణశాఖకు సంబంధించిన కార్య క్రమాలగురించిన అభిప్రాయ భేదాలు తొలగి రెండు పక్షాలమధ్య సామరస్యం కుదిరింది.

కాని ఈ చర్చలను సాగించడంలో క్రిప్సు వైస్రాయి సలహానుగాని, వైస్రాయి కార్యనిర్వాహక వర్గంయొక్క సలహానుగాని తీసుకొనలేదు. స్వతంత్రంగా స్వంత బాధ్యతపైన వ్యవహారాలన్నీ జరిపాడు. ఇది వైస్రాయికి ఆగ్రహాన్ని కలిగించింది. తన అనుమతి లేకుండా తనకు చట్టరీత్యా లభించిన అధికారాలన్నిటిని వదలుకొని, బ్రిటన్‌లోని రాజువలె నామ మాత్రాధికారంతో వ్యవహరించుటకు అతడు ఎంతమాత్రమూ అంగీకరించక, చర్చిల్‌కు బ్రిటిష్ మంత్రి వర్గానికి తన నిరసనను తెలియపరచాడు. తాము క్రిప్సుద్వారా పంపిన 5వ ప్రతిపాదనకు క్రిప్సుచేసిన ప్రతిపాదనలు విరుద్ధంగా ఉన్నట్లుగా కూడా వారు భావించి క్రిప్సు కాంగ్రెసు నాయకులకు ఇచ్చిన హామీని తిరస్కరించారు.

అంతటితో క్రిప్సు తాను ఇచ్చిన హామీని ఉపసంహరించుకొనడం తప్పిందికాదు. వాస్తవమైన పరిపాలనాధికారం లభించగలదనే ఆశతో కాంగ్రెసు నాయకులు ఉండినారు. అధికారంలేని పదవులు వారిని ఆకర్షించలేదు. అందుచేత వారు బ్రిటిష్ మంత్రివర్గపు ఆదేశాల దృష్ట్యా క్రిప్సు చేసిన క్రొత్త ప్రతిపాదనలను తిరస్కరించారు. అతడు వారికి చేసిన వాగ్దాలను చెల్లించలేకపోయినాడు. లూయీజాన్‌సన్ సారథ్యంకూడా అతనిపైనగాని, బ్రిటిష్ మంత్రివర్గం పైనగాని ఎలాటి ప్రభావాన్ని వహించకపోయినది. మరి భారతదేశంలో ఉండడం నిష్ప్రయోజనమని, కాంగ్రెసు నాయకుల మొండిపట్టు కారణంగానూ, గాంధీయొక్క అహింసాతత్వం కారణంగాను తన రాయభారం విఫలమైనట్లు ఒక అసత్య ప్రకటనను చేసి క్రిప్సు ఏప్రిలు 12న స్వదేశానికి వెళ్ళిపోయినాడు.

అతడు వెళ్ళిపోవుటకు సిద్ధంగాఉన్న విషయం తెలియగానే రూసువెల్టు అతని ప్రయాణాన్ని ఆపి, కాంగ్రెసువారితో సంప్రతింపులు కొనసాగించవలసిందిగా చర్చిల్‌కు తెలియ పరచినాడు. కాని అప్పటికే క్రిప్సు భారతదేశాన్ని వదలినాడని, అతని రాయభారం విఫలమగు టకు గాంధీ అహింసా తత్వమే ప్రధానకారణమని చర్చిల్ రూసువెల్టుకు వాస్తవానికి విరుద్ధంగా సమాధానాన్ని చెప్పాడు. సైన్యంలో ముస్లింల శాతం 75 అనే అసత్యానికి పాల్పడినవాడు రాయభారం విఫలమగుటకు గాంధీ కారణమనే ఇంకొక అసత్యాన్ని పలుకుటకు సిద్ధపడడంలో ఏలాటి ఆశ్చర్యంలేదు. నిజానికి క్రిప్సుతో కాంగ్రెసునాయకులు చర్చలు సాగించిన కాలంలో గాంధీ ఢిల్లీలో లేనేలేడు. ప్రథమంలో ఒక పర్యాయం క్రిప్సును కలుసుకొని, వెంటనే వార్ధాకు వెళ్ళిపోయినాడు. అటు తర్వాత ఆయనకూ కాంగ్రెసునాయకులకూ మధ్య ఏలాటి ఉత్తర ప్రత్యుత్తరాలుగాని సంప్రతింపులుగాని జరగలేదు. రాయబార వైఫల్యానికి ఆయన కారణమని భావించుటకు ఏలాటి ఆధారాలూ లేవు.

చర్చిల్ ఈలాటి అసత్యప్రచారంలోకి దిగినా అతనిని ఒత్తిడిచేయడం ప్రాజ్ఞత కాదనే భావంతో రూసువెల్టు ఈ విషయాల్ని గురించి చర్చించడం మానుకొన్నాడు. కాని ఇందులో అతడు గొప్ప పాత్రను వహించి కాంగ్రెసు ఆశయాలను సమర్థించడం గుర్తించ వలసిన విషయం.

భారతదేశంపై తమకుగల అధికారాన్ని లేశమాత్రంకూడా వదలుకొనుటకు బ్రిటిష్ ప్రభుత్వం సిద్దంగా లేకపోవడమే క్రిప్సు రాయబార వైఫల్యానికి ప్రధాన కారణం.

అతడు వెళ్ళిపోయిన తర్వాత పైగ్రాయి ఇండియా మంత్రికి ఒకలేఖను వ్రాస్తూ అందులో "భారతదేశము బర్మాలకు సామ్రాజ్యంతో సహజమైన సంబంధం ఏలాటిదీ లేదు. దానితో వాటికి జాతి, చరిత్ర, మతములబట్టి ఏలాటి అనుబంధాలులేవు. దానితో వాటికి ప్రకృతి సిద్ధమైన అభిమానం ఏలాటిదీలేదు. మనం వారిని జయించిన కారణానను. వారిపై బల ప్రయోగంచేసిన కారణానను, బలప్రయోగంద్వారా వాటిని మన అధీనంలో ఉంచుకొన్న కారణానను మన రక్షణ తమకు అనవసరమని అవి ఇంతవరకు భావించిన కారణానను అవి సామ్రాజ్యంలో ఉంటున్నవి." అనే అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు. బలప్రయోగం లేనిదీ భారతదేశాన్ని తమ వశంలో ఉంచుకొనడం సాధ్యం కాదనే అభిప్రాయాన్ని మొదటినుండి బ్రిటన్‌లోని ప్రముఖవర్గాలవారు వ్యక్తంచేస్తూ ఉండినారు. 1942 లో కూడా ఈ అభిప్రాయంలో ఏవిధమైన మార్పు రాలేదు. ప్రజలు తిరుగుబాటుచేసిన పక్షంలో వారిని అణచివేయుటకు కావలసిన సైనికబలం తమకు ఉండడంచేత సంస్కరణలద్వారా వారి అభిమానాన్ని సంపాదించుటకు ప్రయత్నించడం వ్యర్థం అనే భావం వారిలో స్థిరపడిపోయినది. ఈ పరిస్థితులలో క్రిప్సు రాయబారం రూజువెల్టును సమ్మపెట్టుటకు ఉద్దేశింపబడినదేగాని దేశ స్వాతంత్ర్య ప్రియులకు తృప్తికలిగించుటకు ఉద్దేశింపబడినది కాదు

పఠనపదగిన గ్రంథములు :

Bhavan: Vol. xi
Tarachand : Vol. iv
V. P. Menon : Transfer of Power

# అధ్యాయము-14

## నిష్క్రమణ ఉద్యమము (Quit India movement)

### 1

క్రిప్సు రాయబారం విఫలమగుట మూలంగా బ్రిటిష్ పరిపాలనవలన దేశంలో ఏర్పడిన పరిస్థితులలోని విపరీతం కాంగ్రెసువారికి కండ్లకు కట్టినట్లు స్పష్టమైంది. బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, రషియా, చైనా, జపాన్ దేశాలలోని సైనికులు తమతమ దేశాల స్వాతంత్ర్య పరిరక్షణార్థము, వాటివాటి ప్రత్యేక ప్రయోజనాలను సాధించే నిమిత్తము యుద్ధంలో పాల్గొనడం జరుగుతూఉండగా భారతీయసైనికులు తమ దేశస్వాతంత్ర్య రక్షణార్థంకాక దాని రాజకీయ దాస్యానికీ తత్ఫలితంగా ఏర్పడిన అనర్థాలకు కారణభూతమైన పరాయి పాలనను మరింత బలపరచుటకు యుద్ధంలో పాల్గొనవలసిన వారయ్యారు. సుమారు వంద సంవత్సరాలుగా జాతీయ భావంచేత ప్రభావితులైన భారతీయులకు ఇది ఒక విపరీతంగా తోచడంలో ఆశ్చర్యపడవలసినది ఏదీలేదు.

ఈలాటి విపరీత పరిస్థితులను తొలగించి, దేశస్వాతంత్ర్యాన్ని వెంటనే సంపాదించడం తమ కర్తవ్యంగా గాంధీతోసహా కాంగ్రెసు నాయకులందరు భావించారు. ఈ విషయంలో కాలయాపన జరిగినపక్షంలో అవాంఛనీయములైన పరిణామాలు ఎన్నెన్నో సంభవించవచ్చు. క్రిప్సు ప్రతిపాదనలలో నాల్గవది 1942 నాటికే దేశవిచ్ఛిత్తిపట్ల బ్రిటిష్ అధికారులు సుముఖులై పాకిస్థాన్‌ను మాత్రమేగాక మరికొన్ని డుమినియన్‌లను దేశంలో స్థాపించుటకు బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించినట్లు స్పష్టమైనది. బ్రిటిష్ పరిపాలన మూలంగా లభించిన లాభాలలో దేశమంతా ఒక కేంద్ర ప్రభుత్వానికి లోబడిన రాజ్యంగా ఏర్పడడం అగ్రస్థానం వహించింది. ఇది అంతకు పూర్వం హిందూ చక్రవర్తుల కాలంలోగాని, ఢిల్లీ సుల్తానులకాలంలోగాని, మొగలాయి చక్రవర్తులకాలంలోగాని సాధ్యంకాలేదు. బ్రిటిష్‌వారు దానిని సాధించారు. దీనిని సాధించినందుకు వారు ఇంతవరకూ గర్విస్తూ వచ్చారు. కాని జాతీయ ఉద్యమంపట్ల, కాంగ్రెసుపట్ల వారిలో ఉదయించిన ద్వేషం ఫలితంగా దేశసమైక్యతను భంగపరచుటకు సిద్ధపడినారు. బ్రిటిష్ పరిపాలన మరికొంతకాలం సాగినపక్షంలో ఈలాటి అనర్థాలు కొన్ని సంభవించవచ్చు. అందుచేత దానిని వెంటనే నిర్మూలించడం అవసరమనే భావం స్వాతంత్ర్య ప్రియులలో బలపడింది.

కేంద్రంలో జాతీయప్రభుత్వాన్ని స్థాపించుటకు తాను సంకల్పించినా సర్వాధికారాన్ని తామే వహించవలెనని కాంగ్రెసునాయకులు భావించడంచేతను, దీని మూలంగా ముస్లింలవంటి అల్పసంఖ్యాకులు హిందువుల నిరంకుశపరిపాలనకు లోబడవలసిన ప్రమాదం ఏర్పడడంచేతను, అది ముస్లింలకు ఎంతమాత్రము ఆమోదయోగ్యం కాకపోవడంచేతను, అల్పసంఖ్యాకుల హక్కులను ప్రయోజనాలను రక్షించడం బ్రిటిష్‌వారి విధికావడంచేతను కాంగ్రెసునాయకులు చేసిన ప్రతిపాదనలను తిరస్కరించవలసి వచ్చిందని క్రిప్సు అసత్య ప్రచారంలోకి దిగడము,

తన రాయబారం విఫలమగుటకు గాంధీ అహింసాతత్వం ప్రధానకారణమని ప్రచారం చేయు టము, ఈలాటి ప్రచారంలో ఇండియామంత్రి, బ్రిటిష్‌ప్రధాని చర్చిల్, ఇతర మంత్రులు, అధి కారులు గొప్పపాత్రను వహించడము కాంగ్రెసునాయకులకు ఎంతో విచారాన్ని కలిగించింది. అమెరికా, చైనాలలోని ప్రజలకు కాంగ్రెసుపట్ల ద్వేషభావాన్ని వృష్టిచేయుటకు ఈలాటి అసత్య ప్రచారంలోకి వారు దిగడం సహించదగిన విషయంకాదు.

క్రిప్సు వైస్రాయియొక్కయు, బ్రిటిష్ ప్రధానియొక్కయు ప్రతిఘటన మూలంగా ప్రథమంలో కాంగ్రెసునాయకులకు చేసిన వాగ్దానాలను ఉపసంహరించుకొన్నాడు. అతడు వాటిని ఉపసంహరించుకొనుటకు ముందే కాంగ్రెసు కార్యనిర్వాహకకమిటీ ఏప్రిలు 10 న సమావేశమై కేంద్రంలో ఏర్పడే ప్రభుత్వంలో అన్ని పార్టీల ప్రతినిధులు ఉండవలసినట్లుగాను, అది సంకీర్ణ ప్రభుత్వంగా ఉండవలసినట్లుగాను తీర్మానించింది. 1937లో సంకీర్ణ ప్రభుత్వాలగురించి దాని అభిప్రాయం ఏలాటిదైనా 1942 నాటికి అది పూర్తిగా మారింది. ఈ తీర్మానస్వరూపం తెలిసీకూడా క్రిప్సు కేంద్రంలో తన నిరంకుశ ప్రభుత్వాన్ని స్థాపించుటకు తలపెట్టినట్లు కాంగ్రెసుపై నిందారోపణచేశాడు. రాజకీయాలలో సత్యానికి స్థానంలేదని అతడు రుజావు చేశాడు.

క్రిప్సు ఏప్రిలు 12 న దేశాననుండి వెళ్ళిపోయినాడు. అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఏప్రిలు 29 నుండి మే 2 వరకు సమావేశమై భవిష్యత్తులో అనుసరించదగిన విధానాన్ని గురించి చర్చలుజరిపి, "భారతదేశ ప్రయోజనాలదృష్ట్యా మాత్రమేగాక, బ్రిటిష్ భద్రతదృష్ట్యాను ప్రపంచ శాంతిదృష్ట్యాను భారతదేశంపై బ్రిటన్ వహించిన పరిపాలనాధికారాన్ని వదులు కొనడం అవసరం. సంపూర్ణస్వాతంత్ర్య ప్రతిపత్తిని ఆధారంచేసుకొని మాత్రమే భారతదేశం బ్రిటన్‌తోగాని ఇతర జాతులతోగాని వ్యవహరించడం సాధ్యం" అని తీర్మానించింది. ఇదిగాక (జపాన్ వారివంటి) పరాయివారెవరైనా దేశంపై దండెత్తిన పక్షంలో వారిని పూర్తిగా ఎది రించడం ప్రజల కర్తవ్యం. కాని అది అహింసాపూర్వకమైన సహాయనిరాకరణంగా ఉండడం తప్పదు" అని కూడా తీర్మానించింది. కాంగ్రెసు జపాన్‌తో కలిసి బ్రిటన్‌తో యుద్ధం చేసే సంకల్పంతో ఉన్నదని అధికారులు చేయుచుండిన దుష్ప్రచారానికి ఇది జవాబుగా ఉద్దే శింపబడినది. ఈ సమావేశంలో సుప్రసిద్ధనాయకుడు చక్రవర్తుల రాజగోపాలాచారి పాకిస్థాన్ స్థాపనను అంగీకరిస్తూ జిన్నాతో కాంగ్రెసు ఒడంబడిక చేసుకొనవలసిందిగా ఒక ప్రతిపాదనను ప్రవేశపెట్టాడు. కాని అది వీగిపోయింది. తత్ఫలితంగా ఆయన కాంగ్రెసునుండి రాజీనామాచేసి స్వతంత్రంగా తన అభిప్రాయాన్నిగురించి ప్రచారం చేయసాగాడు. జూలై 14 వరకు కాంగ్రెసు కమిటీ తిరిగి సమావేశంకాలేదు.

ఏప్రిలు మధ్యభాగాననుండి గాంధీ తన హరిజన్ వారపత్రికలో "వెంటనే భారత దేశాన్ని వదలి బ్రిటన్ వెళ్ళిపోవలెననే శీర్షికతో (Quit India) అనేక వ్యాసాలు వ్రాశాడు. ఇది కాంగ్రెసు నాయకులపై గొప్ప ప్రభావాన్ని వహించి తుదకు "విష్క్రమణ ఉద్యమం" అని, "Quit India" ఉద్యమం అని స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రసిద్ధిగాంచిన విప్లవ ఉద్యమానికి దారితీసింది. ఈ వ్యాసాల సారాంశం ఈ క్రింది విధంగా ఉండినది.

(1) బ్రిటిష్‌వారు వెంటనే వారి అధికారాన్ని వదలుకొని భారతదేశాననుండి వెళ్ళిపోవలెను. దేశం భారతీయులదే గాని బ్రిటిష్‌వారిది కాదు. దానిపై పరిపాలనాధికారాన్ని వహించే హక్కు వారికి ఎంతమాత్రమూ లేదు.

(2) భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యానికి లోబడి ఉండడంచేతనే జపాన్‌వారు దానిపై దండెత్త సంకల్పించినారు. బ్రిటిష్‌వారు వెళ్ళిపోయి దేశం స్వతంత్రరాజ్యమైన పక్షంలో వారు దండెత్తే ప్రమాదం ఉండదు.

(3) కాని ఒకవేళ వారు స్వతంత్రభారతంపైన కూడా దండెత్తివచ్చినపక్షంలో భారతీయులు వారిని తప్పకుండా ప్రతిఘటిస్తారు. ఇది వారి కర్తవ్యం. తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకు లక్షలాది జనం తమ ప్రాణాలతోసహా సమస్తత్యాగాలను చేయుటకు సిద్ధపడడంలో ఏలాటి సందేహంలేదు. లక్షలాది సత్యాగ్రహులను ఎదుర్కొని భారతదేశంవంటి విశాలదేశాన్ని వశపరచుకొనడం జపాన్ శక్తికి మించినట్టిపని.

(4) బ్రిటిష్‌వారు కాంగ్రెసు కోరినట్లు ఇచ్ఛికంగా వెళ్ళకపోయినా, జపాన్‌వారి సహాయంతో వారిని వెళ్ళగొట్టే ప్రసక్తి ఏలాటిది లేదు. బ్రిటిష్‌వారివలెనే జపాన్ వారుకూడా సామ్రాజ్య తత్వానికి దాసులని కాంగ్రెసుకు తెలుసు.

(5) జపాన్‌వారితో ఏషియా ఖండంలోని ఇతర ప్రాంతాలలో యుద్ధం చేయవలసిన అవసరం బ్రిటన్‌కు అమెరికాకు ఎంతైనా ఉన్నది. భారతదేశంలో వాటి సైన్యాలను ఉంచుకొనడం ఈ యుద్ధాన్ని సాగించడంలో చాలా అవసరం. కాంగ్రెసువారు ఈ అవసరాన్ని విస్మరించడం లేదు. భారతదేశాన్ని స్వతంత్రదేశంగా బ్రిటిష్‌వారు ప్రకటించిన వెంటనే ఈ అవసరం తీరుటకు భారతదేశ ప్రభుత్వం బ్రిటన్‌తో ఒక ఒడంబడిక చేసుకొనుటకు సిద్ధంగా ఉంటుంది. అందుచేత భారతదేశ స్వాతంత్ర్యం జపాన్‌వారితో బ్రిటిష్‌వారు యుద్ధాన్ని సాగించడంలో ప్రతిబంధకంగా ఉండదు. యుద్ధంలో బ్రిటిష్‌వారు గాని, అమెరికావారు గాని, చైనావారు గాని ఓడిపోవడం కాంగ్రెసు అభిమతం కాదు.

(7) బ్రిటిష్‌వారు వెళ్ళిపోయిన పక్షంలో దేశంలో ప్రభుత్వం అనేది లేక అరాచకం వ్యాపించే ప్రమాదం ఉన్నట్లు కొందరు భావిస్తున్నారు. కాని ఈలాటి భావానికి ఆధారం లేదు. సక్రమమైన ప్రభుత్వాన్ని స్థాపించి శాంతిభద్రతలను కాపాడగలశక్తి ప్రజలకు వారి నాయకులకు ఉన్నది. ఒకవేళ అరాచకం వ్యాపించినా అది బ్రిటిష్‌వారి పరిపాలనకంటె ఉత్తమం. ఇంతేగాక అది చాలాకాలం ఉండదు.

బ్రిటిష్‌వారు వెంటనే దేశాననుండి నిష్క్రమించి వెళ్ళిపోవడం అవసరమని పై విధంగా గాంధీ అనేక వ్యాసాలు వ్రాశాడు. ఆయనతో చర్చలు జరిపిన విదేశీయులకు కూడా ఉచితమైన సమాధానాలు చెప్పగలిగాడు.

ఈ విధంగా మూడు నెలల కాలం "నిష్క్రమణ" గురించి ప్రచారం సాగినతర్వాత కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటి జూలై 14 న వార్ధాలో సమావేశమై ఈ క్రింది విధంగా నిష్క్రమణ ఉద్యమాన్ని ఆమోదిస్తూ తీర్మానాలు చేసింది.

(1) దేశంలో బ్రిటిష్ పరిపాలన వెంటనే రద్దు కావలెను. భారతదేశ ప్రయోజనాల దృష్ట్యా మాత్రమే గాక, ప్రపంచ భద్రత దృష్ట్యాను, నాజీ తత్వం, ఫాసిస్టు తత్వం, సైనిక

నియంతృత్వం, ఇతర రకములైన సామ్రాజ్య తత్వాలు. ఒక దేశంపై ఇంకొక దేశం చేసే దురాక్రమణలు—ఇవి అన్నీ అంతరించవలసిన దృష్ట్యాకూడా భారతదేశానికి వెంటనే స్వాతంత్ర్యం లభించడం ఎంతైనా అవసరం.

(2) "చీలించు పాలించు" అనే విధానాన్ని ఆధారం చేసుకొన్న పరాయి ప్రభుత్వం దేశంలో ఉన్నంతకాలం హిందువులు, ముస్లింల మధ్య ఏర్పడిన విభేదాలు ఇతర సాంఘిక సమస్యలు పరిష్కారం కాజాలవు. పరాయి ప్రభుత్వం తొలగిన తర్వాతనే వాటిని పరిష్కరించడం సాధ్యం.

(3) బ్రిటిష్‌వారు వెళ్ళిపోయిన వెంటనే బాధ్యతగల పురుషులు స్త్రీలు సమావేశమై అన్ని పార్టీల ప్రతినిధులతో కూడిన ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని నెలకొల్పుతారు. ఆ ప్రభుత్వం కాలక్రమాన అన్ని పార్టీల ప్రతినిధులతో కూడిన ఒక రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచి, అన్ని వర్గాలవారి ఆమోదాన్ని పొందగల ఒక రాజ్యాంగాన్ని రూపొందిస్తుంది. దీనికి తోడు స్వతంత్ర భారతదేశం యొక్కయు, బ్రిటన్ యొక్కయు ప్రతినిధులు కలిసి ఉభయదేశాల మిత్రత్వం ఆధారంగా భవిష్యత్తులో వాటిమధ్య ఉండదగిన సంబంధాల గురించి, దురాక్రమణను ఎదుర్కొనుటకు అవసరమైన చర్యల గురించి ఒక ఒప్పందం కుదుర్చుకొంటారు. పరాయివారి దురాక్రమణను ఎదుర్కొనుటకు ప్రజల సమిష్టి ఇచ్ఛను శక్తిని చక్కగా వినియోగించడమే కాంగ్రెసు ఆశయం.

(4) బ్రిటిష్ పరిపాలనాధికారం వెంటనే రద్దు కావలసిందిగా కోరడంలో బ్రిటన్ యొక్కగాని మిత్రమండలి యొక్కగాని యుద్ధ కార్యక్రమాలకు భంగం కలిగించడం కాంగ్రెసు ఉద్దేశం కాదు. భారతదేశంపై జపాన్ దురాక్రమణను ప్రోత్సహించడంగాని, చైనాపై జపాన్ దురాక్రమణను బలపరచడంగాని కాంగ్రెసు ఉద్దేశం కాదు. జపాన్‌వారి యొక్కగాని, తదితరుల యొక్కగాని దురాక్రమణను నివారించుటకున్నూ చైనాను రక్షించుటకున్నూ మిత్రమండలివారు వారి సైనిక దళాలను భారతదేశంలో ఉంచుటకు కాంగ్రెసు సుముఖంగా ఉన్నది.

(5) అందుచేత పైన పేర్కొన్న ప్రతిపాదనలకు బ్రిటన్ సమ్మతించవలసిందిగా కాంగ్రెసు కోరుతున్నది.

(6) పైన చేయబడిన సహేతుకములైన ప్రతిపాదనలను బ్రిటిష్ ప్రభుత్వం పెడచెవిని పెట్టిన పక్షంలో దేశంలో విపరీత పరిస్థితులు ఏర్పడడం తప్పదు. 1920 నుండి అహింసా పద్ధతి మూలంగా కాంగ్రెసు ఆర్జించిన శక్తినంతను భారతదేశ హక్కులను స్వాతంత్ర్యాన్ని సంపాదించి రక్షించుటకు వినియోగించడం అనివార్యమౌతుంది. అందు నిమిత్తం పోరాటాన్ని సాగించడంలో గాంధీ నాయకత్వం కూడా తప్పదు. కాని ఈ తీర్మానాలలోని విషయాలు అత్యంత ప్రాధాన్యాన్ని వహించేవి కావడంచేత వాటిని గురించి తుది నిర్ణయం అఖిలభారత కాంగ్రెసు కమిటీ తీసుకొనడం ఉచితం. అందుకుగాను ఆ కమిటీ ఆగస్టు 7న బొంబాయిలో సమావేశం కాగలదు.

ఈ తీర్మానంలోని ప్రతిపాదనలలో ఆక్షేపించతగ్గవి ఏవీ లేవనే దానిని గుర్తించడం చాలా అవసరం. దేశ స్వాతంత్ర్యం ప్రజల జన్మహక్కు అనే భావం కొత్తది కాదు. 1900 నుండి అది ప్రజల ఉద్యమాలన్నిటికి ఆధారంగా రూపొందింది. దానిచే ప్రభావితులై ప్రజలు

1920-22 లోను, 1930-31 లోను, 1932-34 లోను మూడు ఉద్యమాలను శాంతియుతంగా సాగించి అన్ని త్యాగాలను చేశారు. పశుబలాన్ని ఆధారం చేసుకొన్న పరాయి ప్రభుత్వం వీటిని తాత్కాలికంగా అణచగలిగినా దీని ఫలితంగా ప్రజలలోని స్వాతంత్ర్యాభిమానం, దానిని సంపాదించడంవల్ల ఉత్సాహం పట్టుదల బలపడినవే గాని ఏ మాత్రం తగ్గలేదు. పరాయి ప్రభుత్వానికి భారతదేశాన్ని పరిపాలించే అధికారం ఉండడం మూలంగా దేశ సంపదలను హరించి అనుభవించుటకు దానికి అవకాశం లభించింది. ప్రపంచంలో దానికిగల పలుకుబడి, పేరు ప్రతిష్ఠలు వృద్ధిగాంచాయి. అందుచేత అది దాని అధికారాన్ని ఏపరిస్థితులలో కూడా వదలుకొనే ఇష్టం లేదనేది పూర్తిగా రుజువైంది. భారతీయులకు తమ దేశాన్ని పాలించుకొనుటకు కావలసిన శక్తి సామర్థ్యాలులేవని, బ్రిటిష్‌వారు వెళ్ళిపోయిన పక్షంలో ఇంకొక దేశం దానిని జయించి వశపరచుకొనడం తప్పదని, దేశానికి స్వాతంత్ర్యం లభించిన పక్షంలో అధిక సంఖ్యాకులైన హిందువులు పరిపాలకులు కాగలరని, అల్పసంఖ్యాకులైన ముస్లింలకు అది అంగీకారం కాదని ఏవేవో సాకులుచెప్పి తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొనడమే బ్రిటిష్‌వారి లక్ష్యమైంది. అందుచేత వారు ఇచ్ఛికంగా తమ అధికారాన్ని వదలుకొని వెళ్ళిపోవడం జరుగదు. వారిపై ఒత్తిడి సాగించి, లొంగదీయడం ప్రజలకు ఎంతైనా అవసరం. శాంతియుత సహాయ నిరాకరణోద్యమం ఒక్కటే ఆ అవసరాన్ని తీర్చగలదనే విశ్వాసం గాంధీ నాయకత్వం మూలంగా ప్రజలకు కలిగింది. దానిని మూడు పర్యాయాలు ఇంతకు పూర్వం వినియోగించారు. దానిని తిరిగీ వినియోగించుటకు ఇప్పుడు సిద్ధపడినారు.

కాని యుద్ధకాలంలో దీనిని వినియోగించి, బ్రిటిష్‌వారికి నష్టం కలిగించడం కాంగ్రెసువారి ఉద్దేశంకాదు. పై తీర్మానం దానిని స్పష్టం చేసింది. యుద్ధకాలంలో బ్రిటిష్ సైన్యాలు అమెరికన్ సైన్యాలు భారతదేశంలోని శిబిరాలను ఆధారం చేసుకొని జపాన్‌వారితో నిరాటంకంగా యుద్ధాన్ని సాగించవచ్చునని కాంగ్రెసు హామీ ఇచ్చింది. దేశంపై జపాన్‌వారు దురాక్రమణ చేసిన పక్షంలో వారిని ప్రతిఘటించుటకు ప్రజలు సంసిద్ధులుగా ఉన్నట్లు తెలియపరచింది. ప్రపంచశాంతికి భద్రతకు ప్రపంచంలో ప్రజాస్వామికాన్ని బలపరచుటకు బ్రిటన్ అమెరికా మొదలైన దేశాలవారు చేసే యుద్ధంలో భారతదేశ ప్రజలు ఇచ్ఛికంగా పాల్గొనవలచే దేశ స్వాతంత్ర్యాన్ని వారు కోరుతున్నారని, తాము రాజకీయ దాస్యాన్ని అనుభవిస్తూ ఇతర దేశాలవారి స్వాతంత్ర్యానికి తాము సహాయపడడం సమర్థనీయం కాజాలదనేదే కాంగ్రెసువారి వాదం. దీనికి అంగీకరించని పక్షంలోనే శాసనోల్లంఘనంద్వారా శాంతి యుతంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కొనవలసి వస్తుందని మాత్రమే కాంగ్రెసు తీర్మానం చేసింది.

కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ తీర్మానానుసారం అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఆగస్టు 7న బొంబాయిలో సమావేశమై 8న కార్యనిర్వాహక కమిటీ చేసిన తీర్మానాలను ఆమోదించింది. కాని అప్పుడుకూడా వైస్రాయితో సంప్రతింపులు జరిపి, అవి విఫలమైన తర్వాతనే శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించడం ఉచితమని సమావేశంలో గాంధీ స్పష్టంచేశాడు. సంప్రతింపులు పూర్తికావడానికి రెండుమూడు వారాలు పట్టవచ్చునని, అటు తర్వాతనే ఉద్యమం ప్రారంభం కాగలదని ఆయన తెలియపరచాడు. సంప్రతింపులు విఫలములై ఉద్యమాన్ని సాగించడం అనివార్యమైన పక్షంలో ఈ మధ్య కాలంలో దానిని ఏవిధంగా సాగించవలసింది

ప్రజలకు తాను తెలియపరచే అవకాశం ఉన్నదని, ఆయన స్పష్టం చేశాడు. బొంబాయిలో తీర్మానం జరిగిన వెంటనే ఉద్యమాన్ని ప్రారంభించడం ఆయన ఉద్దేశంకాదు.

కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ జూలై 14న తీర్మానం చేసినప్పటినుండి వైస్రాయి గాంధీని కాంగ్రెసు నాయకులను నిర్బంధించి ఉద్యమాన్ని అణచివేయ నిర్ణయించు కొన్నాడు. నాయకులను నిర్బంధించిన పక్షంలో ప్రజలు తమంతట తాము ఉద్యమాన్ని ప్రారంభించి సాగించే ప్రమాదం ఉండదని అధికారులు భావించారు. అందుకుగాను ఏమే చర్యలను తీసుకొన వలసిందీ వారు నిశ్చయించుకొన్నారు. గాంధీ ఉద్యమాన్ని గురించి ఏలాటి సంప్రతింపు లలోకి దిగే అభిప్రాయం అధికారులకు లేదు. యుద్ధకాలంలో తిరుగుబాటు ఉద్యమానికి సిద్ధపడిన గాంధీతో సంప్రతింపులు జరపడం ప్రభుత్వ గౌరవానికి భంగకరమని వైస్రాయి భావించాడు. బ్రిటన్‌లోని అధికారులు ఈ విషయంలో అతనితో పూర్తిగా సహకరించారు.

అందుచేత ఆగస్టు 9 ఉదయించక పూర్వమే పోలీసులు గాంధీని, బొంబాయిలో ఉండిన కాంగ్రెసు నాయకులందరిని—అజాద్, నెహ్రూ, పటేల్ మొదలైన వారి నందరిని- అరెస్టుచేసి, నిర్బంధించారు. రెండు మూడు రోజులలో రాష్ట్రాలలోని నాయకులను జిల్లా తాలూకా కేంద్రాలలోని నాయకులను ఇదే విధంగా నిర్బంధంలోకి తీసుకొన్నారు. కాంగ్రెసు సంఘాలన్నిటినీ అక్రమ సంఘాలుగా ప్రకటించారు. ఈ చర్యల ఫలితంగా ఉద్యమం తల ఎత్తదని వారు భావించారు. కాని దేశ స్వాతంత్ర్యం సంపాదనంపట్ల పట్టుదల, పరాయి ప్రభుత్వంపట్ల ద్వేషమూ ప్రజలలో ఏనాడో నాటుకొన్న కారణంగా నాయకులతో నిమిత్తం లేకుండా ప్రజలు తమంతట తాము తిరుగుబాటు ఉద్యమాన్ని ప్రారంభించి సాగించారు. ఈ విధంగా ఆగస్టు 9న క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది.

కాంగ్రెసు కార్య నిర్వాహక కమిటీ జూలై 14న ఉద్యమాన్ని ప్రారంభించ వలసిం దిగా తీర్మానాలు చేసిన వెంటనే ముస్లిం లీగు నాయకుడైన జిన్నా "ప్రభుత్వంపై తిరుగుబాటు చేసి, ఏదో విధంగా కాంగ్రెసు దేశంలో హిందువుల రాజ్యాన్ని స్థాపించుటకు సంకల్పించింది. దీని మూలంగా ముస్లింలవంటి అల్పసంఖ్యాకులు అన్నివిధాలుగా నష్టపడడం తప్పదు." అని తీర్మానాలను ఖండించారు. కాంగ్రెసుపట్ల ఇతర కారణాల మూలంగా ద్వేషాన్ని వహించిన హిందూమహాసభ నాయకుడు సావర్కారు, లిబరల్ పార్టీకి చెందిన సప్రూ మొదలైనవారు, మరికొన్ని పార్టీలవారు కాంగ్రెసు తలపెట్టిన ఉద్యమాన్ని ఇదేవిధంగా ఖండించారు. ఇందరి సహాయం తమకు లభించడం చేతను, బలప్రయోగ సాధనాలు అపరిమితంగా తమ వశంలో ఉండడంచేతను ఉద్యమాన్ని సులభంగా అణచివేయవచ్చుననే ధైర్యం ప్రభుత్వానికి కలిగింది. గాంధీతోగాని కాంగ్రెసుతోగాని ఎలాటి సంప్రతింపులు అవసరంలేదనే భావంతో అది ఉద్యమాన్ని అణచుటకు కావలసిన చర్యలనన్నిటిని న్యాయన్యాయాలతోగాని దయాదాక్షిణ్యాలతోగాని నిమిత్తం లేకుండా తీసుకొన్నది. 1857-58 తిరుగుబాటును అణచుటకు బ్రిటిష్ సైనికులు తీసుకొన్న చర్యలు పునరావృతములైనవి.

## 2

క్విట్ ఇండియా ఉద్యమానికి గాంధీ పితామహుడైనా జూలై 14న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ చేసిన తీర్మానము, అగస్టు 8న అఖిలభారత కాంగ్రెసు కమిటీ చేసిన

తీర్మానము ఉద్యమానికి జన్మస్థానములైనా అది అంతకు పూర్వం 1920-22లోను, 1930-31 లోను, 1932-34లోను గాంధీ నాయకత్వాన సాగిన స్వాతంత్ర్యోద్యమములవంటిదికాదు. వాటికి దీనికి అనేక విషయాలలో భేదం ఉండినది.

(1) ఉద్యమంలో కాంగ్రెసువారేగాక కాంగ్రెసేతరులుకూడా అధిక సంఖ్యలో పాల్గొన్నారు. దేశస్వాతంత్ర్య సంపాదనపట్ల అభిమానం కలవారందరు ఇందులో పాల్గొన వలసినదిగా ఆగస్టు 8 న ఆయనచేసిన ఉపన్యాసంలో గాంధీ కోరాడు. స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రపంచ సంగ్రామం ప్రారంభంకాగానే సాగించవలసిందిగా అనేకులు ఆందోళన లేవదీశారు. అలాటి వారిలో సుభాషచంద్రబోసు అగ్రస్థానాన్ని వహించినవాడు. కాని అప్పట్లో గాంధీగాని నెహ్రూగాని ఇతర కాంగ్రెసు నాయకులుగాని యుద్ధకాలంలో బ్రిటిషు ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించడం ఇష్టంలేక అలాటి ఉద్యమాన్ని ప్రారంభించలేదు. బోసునిర్మాణం చేసిన "ఫార్వర్డు బ్లాక్" పార్టీ మాత్రమే గాక 1905 నుండి బెంగాలులోను ఇతర రాష్ట్రాలలోను ఏర్పడిన విప్లవ ఉద్యమానికి చెందిన వారుకూడా తిరుగుబాటు ఉద్యమంపట్ల తమకుగల ఉత్సాహాన్ని పట్టుదలను వదలలేదు. అహింసా తత్వాన్ని ఆధారంచేసుకొని గాంధీ జరిపిన ఉద్యమాలన్నిటిలో వారిలో అనేకులు పాల్గొన్నారు. ఆయన ప్రతిపాదించిన అహింసాపద్ధతి ఎంతవరకు ఫలప్రదంకాగలదో తెలుసుకొనుటకు వారు ఈలాగు ప్రవర్తించారు. కాని అవి ఫలప్రదం కాకపోవడంతో వారు అహింసా విధానంలో విశ్వాసం కోల్పోయి తిరిగీ హింసతోకూడిన విప్లవ విధానాన్ని ప్రారంభించడంపట్ల అత్యంత ఆసక్తిగల వారయ్యారు. వారిపై భగత్‌సింగు వంటివారి ప్రభావం అపరిమితంగా వహించింది. ఆగస్టు 8 న క్విట్‌ఇండియా ఉద్యమాన్ని ప్రారంభించవలసిందిగా కాంగ్రెసు కమిటీ తీర్మానంచేయడం వారికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. వారు కూడా ఉద్యమంలో పాల్గొనుటకు సిద్ధపడ్డారు.

ఇదిగాక జయప్రకాశ్ నారాయణ నాయకత్వంలోని సోషలిస్టుపార్టీవారు కూడా ఉద్యమంలో పాల్గొన్నారు. ఇతర వామపక్షాలవారు వీరితో కలిశారు. ఒక కమ్యూనిస్టుపార్టీవారు మాత్రం ఉద్యమంలో చేరరాదని తీర్మానించుకొన్నారు. అప్పటికే రషియాపై జర్మనీ దండెత్తి, దేశంలో చాలాభాగాన్ని వశపరచుకొన్నది. బ్రిటన్ రషియా పక్షం వహించింది. రెండవప్రపంచ సంగ్రామంలో రషియా సంపూర్ణ విజయాన్ని సాధించడం కమ్యూనిస్టుల లక్ష్యం. అందుచేత భారతీయులు బ్రిటన్‌పై తిరుగుబాటు చేయుటకు బదులు దానితో సహకరించడం ఉత్తమ విధానంగా వారు భావించారు. దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించి, ఒక జాతీయప్రభుత్వం ఏర్పడే అవకాశాన్ని కల్పించిన పక్షంలో యుద్ధకార్యక్రమాలలో బ్రిటన్‌కు సహాయం చేయుటకు అలాటి జాతీయ ప్రభుత్వం సిద్ధపడగలదని కాంగ్రెసు హామీఇచ్చిన విషయాన్ని కమ్యూనిస్టులు విస్మరించారు. ఉద్యమం యుద్ధకార్యక్రమాలకు భంగకరంగా పరిణమించగలదనే భావంతో వారు అందులో పాల్గొన నిరాకరించారు. కాని తక్కిన వామపక్షాలన్నీ అందులో పాల్గొన్నాయి.

కాంగ్రెసు వారేగాక ఇతర పక్షాలకు చెందినవారు ఉద్యమంలో పాల్గొనడంచేత అది ఇంతకు పూర్వంసాగిన ఉద్యమాలకంటె ప్రజల ఉద్యమం అని చెప్పుటకు ఎక్కువ అర్హత కలదిగా భావించవచ్చు. ఇంతేకాదు. నాయకులందరు నిర్బంధింపబడినా ప్రజలు ఉత్సాహాన్ని కోల్పోక తమంతట తాము ఉద్యమంలోచేరి దానిని సాగించడం మూలంగాకూడా ఇది ప్రజల ఉద్యమం అని పేర్కొనుటకు ఎక్కువ అర్హతకలది అని భావించవచ్చు.

(2) ఉద్యమంలో పాల్గొన్నవారిలో అధిక సంఖ్యాకులు అహింసా తత్వంలో విశ్వాసంలేనివారు. దేశస్వాతంత్ర్యం అత్యున్నతమైన లక్ష్యం కావడంచేత దానిని సాధించడంలో హింస, అహింస అనేవాటి మధ్య విచక్షణ చేయవలసిన అవసరంలేదని, దౌర్జన్యంతో కూడిన కార్యక్రమాలద్వారా దానిని సాధించుటకు ఎక్కువ అవకాశం ఉన్నప్పుడు అలాటి కార్యక్రమాలను సాగించడమే ప్రాజ్ఞత అని భావించినవారు. 1805 నుండి విప్లవ ఉద్యమాన్ని సాగించిన వారిలో ఈ భావం జీర్ణించుకొనిపోయింది. బోసుపార్టీకి చెందినవారి భావంకూడా ఈలాంటిదే. జయప్రకాశ్‌నారాయణకూడా ఈలాటి నిర్ణయానికే వచ్చాడు. ఇది గాంధీ తత్వానికి విరుద్ధంకాదని జైలునుండి తప్పించుకొని విప్లవ కార్యక్రమాలలో పాల్గొనినప్పుడు ప్రకటించాడు. దేశంలో స్వతంత్ర ప్రభుత్వం ఏర్పడిన పక్షంలో జపాన్‌వారి దురాక్రమణను సాయుధపోరాట సాధనాన ఎదుర్కొనుటకు కాంగ్రెసు తీర్మానించిందని, దేశంపై దురాక్రమణచేసి దానిని వశపరచుకొనిన వారిలో బ్రిటిష్‌వారు అగ్రస్థానం వహిస్తున్నారని, అందుచేత వారిపై సాయుధపోరాటాన్ని సాగించడం కాంగ్రెసు తీర్మానాలకు విరుద్ధంకాదని ఆయన తనవాదాన్ని సమర్థించాడు. ఆగస్టు 8 నుండి ప్రతి భారతీయుడు స్వతంత్రుడనే భావంతో వ్యవహరించవలసిందిగా గాంధీ కోరడంచేత స్వతంత్ర ప్రభుత్వం అనుసరించవలసిన విధానాలను ప్రతిభారతీయుడు అనుసరించడం కాంగ్రెసు తీర్మానానికి అనుగుణమైనట్టిదే అనికూడా ఆయన ఉద్ఘాటించాడు.

ఇంతేగాక 1942 నాటికి కాంగ్రెసు వారిలోకూడా అహింసతత్వంపట్ల విశ్వాసం చాలా వరకు తగ్గింది. అహింసను ఒక మతధర్మంగా గాంధీ భావించాడు. కాని నెహ్రూ ఆజాద్ మొదలైన వారిలో అలాటి భావంలేదు. అందుచేతనే కాంగ్రెసు షరత్తులకు బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిన పక్షంలో యుద్ధకార్యక్రమాలలో గాంధీతోగాని అహింసాతత్వంతోగాని నిమిత్తం లేకుండా బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయపడుటకు సిద్ధంగా ఉన్నట్లు 1940, 1941 లో రెండు పర్యాయాలు కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ తీర్మానాలు చేసిందని మనం ఇదివరకే తెలుసుకొని ఉన్నాము.

ఈలాటి పరిస్థితులన్నీ కారణంగా క్విట్ ఇండియా ఉద్యమం అంతకుపూర్వం జరిగిన ఉద్యమాల మాదిరిగా అహింసాతత్వాన్ని ఆధారం చేసుకొని సాగలేదు. విధ్వంసక కార్యక్రమాలలోను అధికారుల హత్యలతోను విశ్వాసం కలిగినవారు ఇందులో విశేషంగా పాల్గొన్నారు.

ఉద్యమం సాగవలసిన విధానాన్ని గురించిగాని, అందులో ఏలాటి కార్యక్రమాలను సాగించదగినవో వాటిని గురించిగాని గాంధీ ఎట్టి ఆదేశాలను సలహాలను ప్రకటించలేదు. అందులో పాల్గొనేవారు విజయాన్ని సాధించనైనా సాధించవలెను లేదా ప్రాణత్యాగమైనా చేయవలెను (Do or Die) అనే మంత్రాన్ని మాత్రం ఉపదేశించి దానికి వారు కట్టుబడవలసిందిగా మాత్రమే ఆదేశించాడు. ఉద్యమాన్ని నడిపించుటకు నాయకులుండరని, అందుచేత ఎవరికి వారే నాయకుడుగా వ్యవహరించి, తనకు తోచిన విధంగా కార్యకలాపాలను సాగించవలసిందిగా ఆదేశించాడు. సామాన్యప్రజలు హింసా హింసల మధ్య విచక్షణతో నిమిత్తం లేకుండా విధ్వంసక చర్యలలోను దహనకాండలలోను, అధికారుల హత్యలలోను పాల్గొన్నారు. 1922 లో దేశంలో ఏదో మారుమూలలో ఉండిన చౌరిచౌరాలో కాంగ్రెసువారు పోలీసు వారిని హత్యజేసిన కారణంగా గాంధీ, సహాయనిరాకరణ ఉద్యమాన్ని ఉపసంహరించి దాసు నెహ్రూవంటి వారి

విమర్శలకు ఖండనలకు పాత్రుడయ్యాడు. కాని 1942-43 లో ఆలాటి హత్యలు అనేకం జరిగినా వాటిని ఖండించే నాయకులెవ్వరు లేకపొయ్యారు. విప్లవవాదులు, అహింసలో విశ్వాసం లేని పార్టీలవారు, ఉద్యమంలో పాల్గొనడంచేతను కాంగ్రెసువారిలోకూడా అహింసాతత్వంపట్ల విశ్వాసం సన్నగిల్లడంచేతను ఉద్యమం శాంతియుతంగాను దౌర్జన్యరహితంగాను జరగక పోవడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు. ఇంతకుపూర్వం జరిగిన ఉద్యమాలకు దీనికి ఇందులోకూడా గొప్పభేదం ఏర్పడింది.

(3) ఉద్యమంలో పాల్గొన్నవారు అహింసాతత్వానికి లోబడక విధ్వంసక కార్యక్రమాలను సాగించుటకు ఇంతకంటె ప్రబలకారణం ఇంకొకటి ఉండినది. ఆగస్టు 9, 10 న ప్రజలు శాంతియుతంగా హర్తాలులు నిరసన ఊరేగింపులు జరిపారు. కాని అధికారులు బల ప్రయోగంచేసి దుకాణాలను తెరవవలసిందిగా నిర్బంధించారు. ఇదిగాక ఊరేగింపులను లాటీ దెబ్బలతో మాత్రమేగాక తుపాకీ కాల్పులతో చెదరగొట్టారు. దీనిఫలితంగా అనేకులు మరణించారు; అనేకులు గాయపడినారు. శాంతియుతంగా తాము ప్రవర్తించినా పోలీసువారు తమపై దౌర్జన్యచర్యలకు పూనుకొనడం ప్రజలను ఆగ్రహపరవశుల చేసింది. దానిఫలితంగా వారుకూడా హింసాకాండలకు పూనుకొన్నారు. అటుపిమ్మట పోలీసులు సైనికులు ప్రజలపై అనేక రాక్షస కృత్యాలను గావించారు. ప్రజలుకూడా వారికి బుద్ధి చెప్పుటకు వారిపై ఈలాటి కృత్యాలు జరపడం తప్ప సాధనాంతరం లేదనే నిర్ణయానికి వచ్చారు. ఈ హింసాకాండ ఒక విషవలయంగా రూపొందింది. అధికారులు ప్రథమంలో కొంత సహనంతో ప్రాజ్ఞతతోను ప్రవర్తించి ఉండిన పక్షంలో ఇంతటి ఘోరం జరిగిఉండేదికాదు. తమపై తిరుగుబాటు చేయుటకు సాహసించిన వారిపై రాక్షసకృత్యాలు జరిపి మరి తలఎత్తకుండా అణచివేయడం అవసరమనే భావంతో అధికారులు ప్రవర్తించారు.

(4) ఉద్యమం ఏలాగు జరగవలెననే విషయాన్ని గురించి గాంధి గాని కాంగ్రెసు అధిష్ఠాన వర్గంగాని ఆదేశాలను అందించని కారణంగా కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసుకమిటీవారు వారికి తోచిన విధంగా ఒక కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది. ఈ సందర్భంలో ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసుకమిటీ పేరట విడుదలైనట్టిన్నీ, "ఆంధ్రా సర్క్యులర్" అనే పేరుతో ప్రభుత్వ నివేదికలలోను చరిత్ర గ్రంథాలలోను ప్రఖ్యాతిగాంచినట్టిన్నీ ఒక కార్యక్రమాన్ని ఉదాహరణంగా తీసుకొనవచ్చును. ఉద్యమం ప్రారంభం కాకముందే రాష్ట్రకాంగ్రెసు కమిటీ సభ్యులు దీనిని తయారుచేసినట్లు కనుపిస్తుంది. కర్నూలుజిల్లా కాంగ్రెసు కమిటివారు దీనిని ఆధారం చేసుకొని కాంగ్రెసు కార్యకర్తలందరికి ఒక ఆదేశాన్ని పంపినారు.

ఉద్యమందశల వారీగా సాగవలసి ఉన్నదని ఒక్కొక దశలో ఒకరకమైన కార్యక్రమాలను సాగించవలసినదని ఆ ఆదేశంద్వారా వారు తెలియపరచారు.

(1) నిషిద్ధ ఉత్తరువులను ఉల్లంఘించుట, ఉప్పును తయారుచేయుట, అక్రమ సంఘాలుగా తమ సంఘాలు పేర్కొనబడినా స్వేచ్ఛగాను బహిరంగంగాను సభ్యుల హోదాలో తిరుగుట—ఇవి మొదటి దశలోని కార్యక్రమాలు; (2) న్యాయవాదులు వారివృత్తులను మాను కొనుట, విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరించుట, జ్యూరర్లు అసెసర్లు ప్రభుత్వం జారీ చేసిన సమ్మన్‌లను నిరాకరించుట, ఉద్యోగులు గ్రామాధికారులు వారి ఉద్యోగాలకు రాజీనామా చేయుట—ఇవి రెండవదశలోని కార్యక్రమాలు; (3) రైల్వేలలోను ఫ్యాక్టరీలలోను సమ్మెలను

లేవదీయడం మూడవదశలోని కార్యక్రమం (4) విదేశవస్త్రాలను విక్రయించే దుకాణాలవద్దను, కల్లుపాకలవద్దను, విదేశకంపెనీల ఎదటను పికెటింగు—ఇవి నాల్గవదశలోని కార్యక్రమాలు: (5) రైలుపెట్టెలలోని గొలుసులనులాగి రైలుబండ్లను ఆపివేయడం, ప్రయాణీకులు టిక్కెట్లు లేక ప్రయాణం చేయవలసిందిగా ప్రోత్సహించడం ఈత చెట్లను తాటి చెట్లను పడగొట్టడం. అటవీ సత్యాగ్రహంద్వారా అడవులలోని చెట్లను నరికివేయడం. బ్యాంకీలలో దాచుకొన్న సొమ్మును అందరు ఏకకాలంలో చెల్లించవలసిందిగా కోరడం. తంతి తీగెలను టెలిఫోన్ తీగెలను త్రెంపివేయడం, (రైలుపట్టాలను తొలగించరాదు, రైలు మార్గాలకుగాని వంతెనలకు గాని ప్రమాదం కలిగించరాదు, ప్రాణనష్టాన్ని కలిగించరాదు—)ఇవి అయిదవదశలోని కార్యక్రమాలు; (6) మునిసిపల్ పన్నులు మినహాగా తక్కిన పన్నులను నిరాకరించడం. సిపాయీలను సైన్యంలో చేర్చుకొనే కార్యాలయాలఎదట పికెటింగుచేయడం, సిపాయిదళాల ఎదట పికెటింగుచేసి, వారి ఎదట ఉపన్యాసాలుచేయడం, విజయచిహ్నంగా ప్రభుత్వ భవనాలన్నిటి పైన జాతీయ జెండాను ప్రతిష్ఠించడం—ఇవి ఆరవదశలో జరగవలసిన కార్యక్రమాలు. ఇదియే ఆఖరు దశ. ఇదిగాక జైళ్ళలో నిర్బంధించబడినవారు జైలు నియమాలను ఉల్లంఘించవలెను. అధికారుల ఆజ్ఞలకు లోబడరాదు....వారు నిరాహారదీక్షను వహించవచ్చును.

ఈ ఆదేశాలలో చాలాభాగం ఇంతకుపూర్వం జరిగిన ఉద్యమాలలోని వంటివే. తంతి తీగెలను టెలిఫోన్ తీగెలను త్రెంపి వేయడము, రైళ్ళను ఆపడము, బుద్ధిపూర్వకంగా జైలు నియమాలను ఉల్లంఘించడం మాత్రమే వీటిలో క్రొత్త. అయినా సమాచార సౌకర్యాలకు ఆటంకం కలిగించే ఆదేశం ప్రత్యేకంగా గుర్తించతగ్గది.

బీహారు రాష్ట్రకాంగ్రెసు కమిటీకూడ ప్రథమంలో అహింసా సిద్ధాంతానికి కట్టుబడి ఉద్యమాన్ని సాగించ సంకల్పించింది. కాని పోలీసులు అనవసరంగా కాల్పులు జరిపి విద్యార్థులు కొందరికి ప్రాణనష్టాన్ని కల్పించిన కారణంగా వారి విధానాన్ని మార్చుకొని (1) రైలుమార్గాలను తంతి టెలిఫోన్ తీగెలను త్రెంచి ప్రయాణ సౌకర్యాలకు సమాచార సౌకర్యాలకు అంతరాయం కలిగించవలసిందిగాను. (2) పోలీసు స్టేషన్‌లను, కోర్టులను, జైళ్ళను, ఇతర ప్రభుత్వ సంస్థలను వశపరుచుకొని, వాటిలోని రికార్డులను నాశనం చేయవలసిందిగాను. (3) ఈలాటి విధ్వంసక చర్యలను మరికొన్నిటిని తీసుకొనవలసిందిగాను నిర్ణయించింది.

జయప్రకాశ్‌నారాయణ నాయకత్వంలోని సోషలిస్టుపార్టీకూడా బ్రిటిష్ పరిపాలనను నిర్మూలించడంలో సాయుధపోరాటాన్ని దౌర్జన్యాన్ని వినియోగించడంలో ఏలాటి అధర్మంలేదని ప్రచారంచేయడమే గాక. ఇందుకుగాను ఒక రహస్య కార్యానిర్వాహక సంఘాన్ని స్థాపించింది. అనేక రాష్ట్రాలలో దానిశాఖలు ఏర్పడినవి. గోవా మొదలైన ప్రాంతాలనుండి ఆయుధాలను సేకరించడం.బాంబులు మొదలైన ప్రేలుడు సాధనాలను తయారుచేసి ఉపయోగించడం. రవాణా సౌకర్యాలను సమాచార సౌకర్యాలను ధ్వంసం చేయడం.పెట్రోలు టాంకులను (Petrol Tanks) దగ్ధం చేయడం, మొదలైన కార్యక్రమాలను సాగించుటకు అతని ఆధ్వర్యంలో ఏర్పాటులు జరిగినవి. విప్లవ ఉద్యమానికి చెందినవారి సంస్థలనేకం రహస్యంగా వాటి కార్యక్రమాలను మరింత ఉద్ధృతంగా సాగించినవి. ఉద్యమంలో ఈలాటి శక్తులన్నీ ప్రవేశించడంచేత అహింసా సిద్ధాంతాన్ని విస్మరించి ప్రపంచంలో విప్లవాలన్నీ జరిగినట్లే చాలవరకు క్విట్ ఇండియా ఉద్యమం దౌర్జన్య సహితంగా సాగింది.

ఉద్యమంలో పాల్గొన్నవారు పరిపాలన యంత్రాంగాన్ని స్తంభింపజేయడం తమ లక్ష్యంగా పెట్టుకొన్నారు. యంత్రాంగం సక్రమంగా పనిచేయుటకు రైళ్ళవంటి ప్రయాణసౌకర్యాలు, తంతి తపాలాల వంటి సమాచారసౌకర్యాలు ప్రధాన సాధనాలు. వీటికి భంగం కలిగించిన పక్షంలో ఉద్యమాన్ని అణచుటకు ఒక ప్రదేశాననుండి ఇంకొక ప్రదేశానికి పోలీసు దళాలను సైనిక దళాలను వేగంగా పంపించడం కష్టసాధ్యం కాగలదు. అందుచేత ప్రజలు వేలాది సంఖ్యలో రైలుస్టేషన్‌లపై దాడిచేసి, వాటిలోని పరికరాలను నాశనం చేశారు; సిగ్నల్ స్తంభాలను నిర్మూలించారు. రైలుపట్టాలను తొలగించారు; స్టేషన్‌లకు వచ్చిన రైలుబండ్ల నుండి ప్రయాణీకులను దింపి, పెట్టెలను అగ్నిహోత్రునిపాలు చేశారు. రోడ్లపై గోతులు త్రవ్వి, బస్సులు కార్లు మొదలైన వాహనాల రాకపోకలకు అవరోధం కల్పించారు. అనేక ప్రాంతాలలో రైళ్ళ రాకపోకలు ఆగిపోయినవి. ఉదాహరణకు—ఆంధ్రలో చిత్రగుంట విజయవాడల మధ్య కొన్ని రోజులపాటు రైళ్ళు నడవలేదు. జపాన్‌వారి దండయాత్రకు లక్ష్యమైన ఈశాన్య ప్రాంతంలో పరిస్థితులు మరింత ప్రమాదరూపం ధరించాయి. రైళ్ళరాకపోకలు ఆగిపోవడంచేత కొన్ని వారాలపాటు బెంగాలు రాష్ట్రానికి ఇతర రాష్ట్రాలతోటి సంబంధం తెగిపోయింది.

ఉద్యమం అన్ని రాష్ట్రాలలో సాగినా అది ఉత్తర ప్రదేశ్‌లోని తూర్పు ప్రాంతంలోను, బీహారు రాష్ట్రంలోను, బెంగాలులోని మిడ్నాపూరు జిల్లాలోను తీవ్రరూపం ధరించింది. ఇక్కడి ప్రజలు విధ్వంసక కార్యక్రమాలలో పాల్గొనడమే కాక పరాయి పరిపాలన స్థానంలో స్వరాజ్యాన్ని స్థాపించి, కొన్ని ప్రదేశాలలో పరిపాలన దక్షతను ప్రదర్శించారు. మిడ్నాపూరు జిల్లాలో స్థాపింపబడిన జాతీయ ప్రభుత్వం 1942 డిసంబరు 17 నుండి 1944 ఆగస్టు 8 వరకు అధికారంలో ఉండినది. బీహారు రాష్ట్రంలో ఉత్తర భగల్పూరు జిల్లాలోను, మరికొన్ని కేంద్రాలలోను, ఉత్తర ప్రదేశ్‌లోని బాలియా జిల్లాలోను ఈలాటి ప్రభుత్వాలు స్థాపింపబడినవి కాని అవి కొన్ని రోజుల వరకే అధికారంలో ఉండినవి. మొత్తంమీద దేశంలో ఈ విధంగా స్వరాజ్యాన్ని స్థాపించిన కేంద్రాలు చాలా తక్కువ. ఉద్యమంలో పాల్గొనినవారు విధ్వంసక కార్యక్రమాలలో ప్రదర్శించిన శక్తిసామర్థ్యాలను నిర్మాణ కార్యక్రమాలలో ప్రదర్శించలేకపోయినారు. అందులో అనుభవాన్ని నైపుణ్యాన్ని సంపాదించిన నాయకులు లేకపోవడమే దీనికి ప్రధాన కారణం.

ఉద్యమాన్ని అణచడంలో ప్రభుత్వం ఏలాటి దయాదాక్షిణ్యాలను చూపక, అన్ని రకములైన రాక్షస చర్యలను తీసుకొన్నది. ప్రజలను భీతావహుల గావించి, తిరిగీ తల ఎత్తనీయకుండా చేయడమే దాని ఏకైక లక్ష్యంగా పరిణమించింది. అధికారులు ఊరేగింపులను చెదరగొట్టుటకు లాఠీలనే గాక తుపాకీ కాల్పులను వినియోగించి అనేకులకు ప్రాణ నష్టాన్ని కలిగించారు. కొరడాదెబ్బలు సర్వసాధారణమైనాయి. విచారణకాలంలో జైళ్ళలో నిర్బంధింపబడిన వారిని పస్తు పెట్టారు. నిద్రించుటకు కూడా అవకాశం లేకుండా చేశారు. గుహ్యాంగాలను నలిపివేశారు. వారిని కొట్టడం, దుర్భాషలాడడం, పరిపరి విధాలుగా అవమానించడం, పరిపాటి అయింది. స్త్రీలను దిగంబరుల గావించి, కొట్టి, మానభంగం చేశారు. పోలీసుల యొక్కయు సైనికుల యొక్కయు అత్యాచారాల మూలంగా ఎందరో ప్రాణాలను కోల్పోయ్యారు. పసిపిల్లల పట్లకూడా కనికరం లేక తల్లితండ్రుల సమక్షంలో హత్య జేశారు. అనేక ప్రదేశాలలో కంటికి కనుపించిన వారిని తలక్రిందులుగా చెట్లకొమ్మలకు వేలాడగట్టి కొట్టారు. గ్రామీణ ప్రాంతాలలో

ఇండ్లను నేలమట్టం చేశారు; అనేక ఇండ్లను దగ్ధం చేశారు. దోపిడీలు గావించారు. అనేక గ్రామాలపై సమిష్టి జరిమానాలు విధించి వసూలు చేశారు. కొన్ని నగరాలపై విమానాలనుండి బాంబులు ప్రయోగించి ఎంతో నష్టాన్ని కలిగించారు. ఈ విధంగా ప్రజలు లెక్కలేని బాధలకు గురి అయినారు. భారతదేశాన్ని ఒక శత్రు దేశంగా పరిగణించి ప్రభుత్వం ఈలాటి చర్యలకు పూనుకొన్నది. ఈ సందర్భంలో బ్రిటిష్ ప్రధాని చర్చిల్ పార్లమెంటులో 1942 సెప్టంబరు 10న ప్రసంగిస్తూ, "ప్రభుత్వానికిఉన్న బలాన్ని పూర్తిగా వినియోగించి తిరుగుబాటును అణచి వేయ గలిగాము. అదనపు సైనిక దళాలను అక్కడికి పంపినాము. బ్రిటిష్ పరిపాలన కాలంలో ఇంతకు పూర్వం ఎన్నడూ లేని దానికంటె ఇప్పుడు భారతదేశంలో తెల్లజాతి సైనికులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు" అని సగర్వంగా పలికినాడు. శత్రు దేశంలోని ప్రజలను అణచినట్లే తాను భారతీయులను అణచగలిగినట్లు భావించాడు.

ప్రభుత్వం తీసుకొన్న ఘాతుకచర్యల ఫలితంగా బహిరంగమైన తిరుగుబాటు 1942 సెప్టంబరు ఆఖరుకు ఆగిపోయినా, తర్వాతకూడా కొన్ని నెలల పర్యంతం జయప్రకాశ్ పార్టీకి చెందినవారు, విప్లవ ఉద్యమాన్ని సాగిస్తూ వచ్చిన బీహారు రాష్ట్రంలోని సియారాం దళం. పరశురాం దళం, ఉత్తర ప్రదేశ్‌లోని హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ సైన్యానికి చెందిన వారు, బెంగాలులోని అనుశీలన సమితికి జుగాంతర్ బృందానికి చెందినవారు వారి రహస్య కార్యక్రమాలను జరుపుతూనే వచ్చారు. కాని క్రమక్రమంగా వీరుకూడా తమ ప్రయత్నాలు మానుకొన్నారు.

ఉద్యమంలో అన్ని రాష్ట్రాలలో యువక విద్యార్థులు ప్రధాన పాత్ర వహించారు. వేల సంఖ్యలో వారు విద్యాలయాలను బహిష్కరించి విసుగు వేసటలు లేక ఉత్సాహంతోను పట్టుదలతోను ఉద్యమానికి సంబంధించిన కార్యక్రమాలన్నిటిలో పాల్గొని శాశ్వతకీర్తిని సంపా దించగలిగారు. వీరితోపాటు స్త్రీలుకూడా గొప్ప పాత్రను వహించారు. పోలీసులను సైనికులను అత్యంత ధైర్యసాహసాలతో ఎదుర్కొని ప్రాణం ఉన్నంతవరకు జాతీయ జెండాను చేతులలో ధరించి పోరాడారు. వీరితోపాటు రైతులు, క్రిందిస్థాయికి చెందిన మధ్యతరగతివారు (Lower Middle class) ఉద్యమంలో గొప్ప పాత్రను వహించారు.

ఉద్యమం మూలాన దేశంలో ఎందరు ప్రాణాలను కోల్పోయినది. ఎందరు గాయ పడినది, ఎందరు జైళ్ళలో నిర్బంధించబడినది. ఎందరు ఇతర నష్టాలకు గురియైనది సమగ్రంగా తెలుసుకొనుటకు ఆధారాలు లేకపోవడం విచారకరం. ఒక ప్రభుత్వ నివేదిక ప్రకారం 1942 ఆగస్టు 9 నుండి డిసంబరు ఆఖరు వరకు అరెస్టైన వారి సంఖ్య 60,229. శిక్షితులైన వారిసంఖ్య 26,000. విచారణ లేక నిర్బంధింపబడిన వారిసంఖ్య 18,000, మరణించిన వారిసంఖ్య 1028 గాయపడినవారి సంఖ్య 3200. కాని ప్రభుత్వం ప్రకటించిన సంఖ్యలలో సత్యం లేదని, 10,000 కు తక్కువ కాకుండా మరణించి ఉంటారని నెహ్రూ అభిప్రాయ పడినాడు.

1943 డిసంబరు ఆఖరుకు ప్రభుత్వానికి ప్రజలకు కలిగిన నష్టాల గురించి ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. దాని ప్రకారం—

ఎ. ప్రభుత్వ చర్యలు :

| | | |
|---|---|---|
| 1. | పోలీసు కాల్పుల సంఖ్య | 601 |
| 2. | వాటిలో చనిపోయిన వారు | 763 |
| 3. | గాయపడిన వారు | 1941 |

బి. ప్రజల చర్యలు :

| | | |
|---|---|---|
| 1. | నాశనం చేయబడిన పోలీసు స్టేషన్‌లు | 208 |
| 2. | నాశనం చేయబడిన ప్రభుత్వ భవనాలు | 749 |
| 3. | నాశనం చేయబడిన పబ్లిక్ భవనాలు | 525 |
| 4. | నాశనం చేయబడిన ప్రైవేటు భవనాలు | 273 |
| 5. | ప్రభుత్వానికి కలిగిన నష్టం | రు. 27,35,125 లు |
| 6. | ఇతరులకు కలిగిన నష్టం | రు. 30,07,224 లు |

సి. విధ్వంసక చర్యలు (Sabotage) :

| | | |
|---|---|---|
| 1. | బాంబు ప్రేలుడులు | 664 |
| 2. | రోడ్లకు నష్టం కలిగించిన స్థలాలు | 474 |

డి. ప్రభుత్వం తీసుకొన్న ప్రతీకార చర్యలు :

| | | |
|---|---|---|
| 1. | సమిష్టి జరిమానాల సంఖ్య | 173 |
| 2. | జరిమానాల మొత్తం | రు. 90,07,382 లు |
| 3. | కొరడా దెబ్బలకు గురి అయినవారు | 2562 |
| 4. | అరెస్టుల సంఖ్య | 9,836 |
| 5. | అధికారాన నుండి తొలగింపబడిన స్థానిక సంస్థలు | 108 |

ఇ. రైల్వేలు :

| | | |
|---|---|---|
| 1. | నాశనం చేయబడిన స్టేషన్‌లు | 382 |
| 2. | నష్టపడిన రైలు మార్గాలు (1942 అక్టోబరు తర్వాత) | 411 |
| 3. | రైలుబండ్లు వగైరాకు నష్టం | 268 |
| 4. | పట్టాలు తప్పడం వంటి ప్రమాదాలు | 66 |
| 5. | రైల్వే ఆస్తికి నష్టం | రు. 52 లక్షలు |

యఫ్. తంతి తపాలాశాఖ :

| | | |
|---|---|---|
| 1. | నాశనం చేయబడిన కార్యలయాలు | 945 |
| 2. | ఇతర విధములైన నష్టాలు | 12,286 |

జి. సైనిక చర్యలు :

| | | |
|---|---|---|
| 1. | కాల్పుల సంఘటనలు | 68 |
| 2. | మరణించిన వారు | 297 |
| 3. | గాయపడిన వారు | 238 |
| 4. | విమానాల నుండి కాల్పులు | 5 |

ఈలాటి ఘాతుక చర్యలను ఎదుర్కొనడంలో మిత్రుల సహాయంతో బొంబాయిలో ఉషామెహతా (ఈమె ప్రస్తుతం బొంబాయి విశ్వ విద్యాలయం రాజనీతి శాఖలో ప్రధానాచార్య పదవిలో ఉన్నది) సాగించిన రహస్య రేడియో ప్రచారం, నానాపటేల్ సతారాజిల్లాలో స్థాపించిన జాతీయ ప్రభుత్వం, బలియా, మిద్నాపూరు జిల్లాలలో స్థాపింపబడిన స్వరాజ్య ప్రభుత్వాలు చాలా ప్రఖ్యాతి గాంచాయి.

ఉద్యమాన్ని సాగించడంలో ప్రజలు అత్యంత ధైర్యసాహసాలను ప్రదర్శించి, ప్రాణంతో సహా అన్ని త్యాగాలు చేసినా, తుదకు ఉద్యమం ఫలప్రదం కాకపోవడం చాలా విచారకరమైన విషయం. ప్రభుత్వానికి ఉండిన కేంద్రీకృత యంత్రాంగం, సైనిక బలం ప్రజలకు లేకపోవడం ఈ వైఫల్యానికి ప్రధాన కారణం. ఒక్కొక ప్రదేశంలో ప్రజలు అధికారులను ఎదుర్కొని విజయాన్ని సాధించినా వారిమధ్య సమన్వయం లేకపోయింది. ఒక ప్రదేశంలోని వారికి ఇంకొక ప్రదేశంలో ఏమి జరిగినది తెలియపరచే సౌకర్యాలు లేకపోయినవి. ఇదిగాక స్థానిక అధికారులను తొలగించినతర్వాత ఏలాటి నిర్మాణ కార్యక్రమం చేపట్టవలసినదీ ఉద్యమ కర్తలకు తెలిసినట్టిది కాదు. తాత్కాలికంగా తమకు లభించిన విజయాన్ని స్థిరపరచుకొనుటకు వారు ఏలాటి కార్యక్రమాలను చేపట్టరైరి. అందుచేత వారిని అణచుటకు పంపబడిన సాయుధ పోలీసులను సైనిక దళాలను ఎదుర్కొగల శక్తి వారికి లేకపోయింది. ఇదిగాక ఉద్యమంలో విద్యార్థులు, ప్రపంచం జ్ఞానం లేని చిన్నకారు రైతులు, క్రింది స్థాయికి చెందిన మధ్యతరగతి వారు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. వారిపై నాయకత్వం వహించదగిన మేధావులు ఉన్నత శ్రేణికి చెందిన మధ్యతరగతి వారు లేకపోవడం మూలాన కూడా ఉద్యమం విఫలమైంది. కార్మికులు భారీ ఎత్తున సమ్మెలలోకి దిగి ఆర్థిక ప్రతిష్టంభన కలిగించెదరని ప్రభుత్వం భయ పడింది. కాని వారిపై కమ్యూనిస్టుల ప్రభావం ఎక్కువగా ఉండడంచేత రెండు మూడు ప్రదే శాలలో తప్ప తక్కిన ప్రదేశాలలో సమ్మెలు జరగలేదు. ఈ పరిస్థితులన్నీ ప్రభుత్వానికి అను కూలంగా పరిణమించాయి.

కాని ఉద్యమం పూర్తిగా విఫలమైనట్లు భావించరాదు. ప్రభుత్వ సైనికబలాన్ని ఎదు ర్కొనడంలో ప్రజలు ప్రదర్శించిన ధైర్య సాహసాలు, చేసిన త్యాగాలు ప్రభుత్వానికి ఒక గుణపాఠాన్ని నేర్పింది. ఈ ఉద్యమం విఫలమైనా ప్రజలు తిరిగి ఈలాటి ఉద్యమాన్ని లేవ దీయుటకు సంసిద్ధులుగా ఉన్నారని, దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటలో వారికిగల పట్టుదల బలపడిందే గాని ఏమాత్రం తగ్గలేదని వారు గ్రహించారు. ఇంతకంటే ప్రధానమైన గుణ పాఠాన్ని కూడా వారు నేర్చుకొన్నారు. తిరుగుబాటు ఉద్యమం అహింస సిద్ధాంతానికి కట్టుబడి జరగదని, విజయాన్ని సాధించుటకు ప్రజలు బలప్రయోగ సాధనాన్ని, అవసరమైన పక్షంలో గొరిల్లా యుద్ధాన్ని వినియోగించుటకు సిద్ధంగా ఉండడం వారు గ్రహించారు. లక్షలాది ప్రజలు బలప్రయోగానికి పూనుకొనిన పక్షంలో వారిని అణచడం కష్టసాధ్యం కాగలదని గ్రహించారు. అందుచేతనే 1944 నుండి బలప్రయోగం ద్వారా ప్రజలను, కాంగ్రెసును ఎదుర్కొనుటకు బదులు సంప్రతింపులలోకి దిగి తుదకు దేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడం తప్పదనే నిర్ణ యానికి వచ్చారు. వారు ఈ నిర్ణయానికిరావడంలో క్విట్ ఇండియా ఉద్యమం ఒక ప్రధాన కారణం. ఈ దృష్ట్యా ఉద్యమంవిఫలం కాలేదని చెప్పదగియున్నది.

## 3

ఉద్యమం రెండు నెలల కాలంలో అణచివేయబడినా ప్రభుత్వం గాంధీని ఇతర కాంగ్రెసు నాయకులను విడుదల చేయకపోవడమే గాక ఉద్యమానికి ఉద్యమంలోని దౌర్జన్య చర్యలకు గాంధీ కారణభూతుడని, అహింస అనేది ఆయన ధరించిన ఒక ముసుగు మాత్రమే అని, దాని వెనుక ఆయన, ఆయన నాయకత్వంలోని కాంగ్రెసూ విధ్వంస కార్యక్రమాలను ప్రోత్సహించినట్లు బహిరంగంగా నిందారోపణ చేసింది. దీనిని ప్రతిఘటిస్తూ గాంధీ వైస్రాయికి అనేక ఉత్తరాలు ప్రత్యుత్తరాలు వ్రాశాడు. అందులో కాంగ్రెసు ఉద్దేశం ఏలాటిదో పూర్తిగా స్పష్టం చేశాడు.

(1) ఉద్యమం కాంగ్రెసు తలపెట్టినది కాదు. ఆగస్టు 9 న దానిని ప్రారంభించవలసిందిగా తాను గాని కాంగ్రెసు గాని ప్రజలను ఆదేశించలేదు. వైస్రాయితో సంప్రతింపులు జరిపి, అవి విఫలములైన తర్వాతనే ఉద్యమాన్ని ప్రారంభించవలసిందిగా తాను ప్రజలను కోరాడు. సంప్రతింపులకు అవకాశం లభించిన పక్షంలో కాంగ్రెసు ఉద్దేశాలు సహేతుకములని, వాటికి అనుగుణంగా ప్రభుత్వం ప్రవర్తించడం అందరికీ లాభకరం కాగలదని తాను వైస్రాయికి నచ్చచెప్ప సంకల్పించాడు. కాని సంప్రతింపులకు ఏలాటి అవకాశం లేకుండా వైస్రాయి తన్నూ కాంగ్రెసు నాయకులను నిర్బంధించడం చేత ప్రజలు తమంతట తాము ఉద్యమాన్ని ప్రారంభించి సాగించారు. ఈ పరిస్థితులలో ఉద్యమానికీ, ఉద్యమంలోని దౌర్జన్య చర్యలకూ కాంగ్రెసువారు గాని తాను గాని బాధ్యులని చెప్పుటకు ఏలాటి ఆధారం లేదు. ఉద్యమంలో పాల్గొన్న వారందరు కాంగ్రెసువారని భావించడం కూడా పొరబాటు. ఉద్యమం ప్రారంభించవలసిన పక్షంలో ఇదివరకు జరిగిన ఉద్యమాలవలెనే దానిని అహింసా పద్ధతులలో నడిపించడమే తన లక్ష్యమని, ప్రజలు దానికి అన్యధా ప్రవర్తిస్తే దానిని ఉపసంహరించే వాడని, కాని తన్ను నిర్బంధించడం చేత తనకు అలాటి అవకాశం లభించలేదని, ఈ పరిస్థితులన్నీ తెలిసీ కూడా ఉద్యమాన్ని కాంగ్రెసు ప్రారంభించి సాగించినట్టిదిగాను, అందులో జరిగిన దౌర్జన్యాలన్నిటికి కాంగ్రెసు బాధ్యత వహించవలసినదిగాను ప్రచారం చేయడం అసత్య ప్రచారాన్ని చేయడమే. భారతదేశ స్వాతంత్ర్యం పట్ల సానుభూతిని ప్రదర్శించిన అమెరికా వంటి దేశాల వైఖరిని మార్చే దురుద్దేశంతో ఈలాటి నిందారోపణ చేయడం జరిగింది.

(2) ఇదిగాక యుద్ధంలో బ్రిటన్‌గాని మిత్రమండలిగాని ఓడిపోవడం కాంగ్రెసు ఉద్దేశంకాదు. వెంటనే దేశానికి సంపూర్ణస్వాతంత్ర్యాన్ని ప్రసాదించి, ఒక జాతీయప్రభుత్వాన్ని స్థాపించినపక్షంలో ప్రజలకు దానిపట్ల పూర్తివిశ్వాసం ఉండగలదని, యుద్ధకార్యక్రమాలన్నిటిలో మరింతఉత్సాహంతో ప్రజలు సహకరించగలరని,అలాటి పరిస్థితులలో మిత్రమండలికి విజయం లభించడంలో ఏలాటి సందేహం ఉండదనే భావంతోనే కాంగ్రెసు సంపూర్ణస్వాతంత్ర్యాన్ని వెంటనే ప్రసాదించవలసిందిగా కోరింది. ఇంతేగాక జపాన్‌వారు దేశంపై దండెత్తిన పక్షంలో వారిని పూర్తిగా ప్రతిఘటించుటకు సిద్ధంగాఉన్నట్లును, మిత్రమండలివారు వారి రక్షణ బలాలను భారతదేశంలో ఉంచుకొని, జపాన్‌వారితో యుద్ధంచేసి విజయాన్ని సంపాదించవచ్చునని కాంగ్రెసు స్పష్టంచేసింది. ఇది స్పష్టమైన తర్వాతకూడా యుద్ధంలో బ్రిటన్ మిత్రమండలివారు ఓడిపోవుటకు సాధనంగా కాంగ్రెసు ఉద్యమాన్ని లేవదీసినట్లు ప్రచారంచేయడం అసత్య ప్రచారంతప్ప ఇంకొకటికాదు.

(3) ఇంతకూ, వెంటనే దేశాన్ని వదలి పరిపాలనాధికారాన్ని ప్రజలకు ఒప్పగించవలెనని కోరడం ఆక్షేపణీయం కాజాలదు. ప్రపంచంలో పీడితజాతుల విముక్తికిగాను, అన్ని దేశాలలో ప్రజాస్వామికాన్ని స్థాపించుటకున్నూ యుద్ధాన్ని సాగిస్తున్నట్లు బ్రిటిష్ ప్రభుత్వం పదే పదే చాటించడం అందరికీ తెలిసిన విషయమే. కాంగ్రెసు కోరిక దీనికి అనుగుణమైనట్టిది. యుద్ధానికిపూర్వం ఎన్నో సంవత్సరాలనుండి దీనిని కోరుతూ ఉంది. దేశంలో శాంతిపరిస్థితులు నెలకొనినప్పుడు ప్రభుత్వం దీనిని నిరాకరించింది. యుద్ధకాలంలో పరిపాలన విధానంలో ఏలాటిమార్పు జరగరాదని ఇప్పుడు దీనిని నిరాకరిస్తున్నది. ఎప్పటికీ తన అధికారాన్ని వదులుకొనే ఉద్దేశం ప్రభుత్వానికి లేకపోవడమే దీనికి కారణం.

కాని ఎన్ని చెప్పినా వైస్రాయి వైఖరిలోగాని, బ్రిటన్‌లో ప్రధాని, ఇండియామంత్రి లేబరుపక్షానికి చెందినవారి వైఖరిలోగాని ఏలాటి మార్పూ రాలేదు. పార్లమెంటులోను, కేంద్ర శాసనసభలోను వారు చేసిన ప్రసంగాలన్నిటిలో పాతపాటనే పాడసాగారు. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ భారతదేశంలో 39 కోట్ల ప్రజలు ఉన్నారని, వారిలో 9 కోట్లు ముస్లింలు, 5 కోట్లు అస్పృశ్యులు, 9 కోట్లు సంస్థానప్రజలు, తక్కినవారిలో కొన్నికోట్లు—అనగా సుమారు 25 కోట్ల ప్రజలు—బ్రిటిష్‌ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలు కలవారని, కాంగ్రెసుకోరిన సంపూర్ణ స్వాతంత్ర్యం వారికి ఆమోదయోగ్యంకాదని, కాంగ్రెసు స్వల్పసంఖ్యాకుల తరఫునే మాట్లాడుచున్నదని, దాని కోరిక మన్నించడం తక్కిన వర్గాలవారికి అన్యాయం చేయడమే అని 1942 సెప్టెంబరు 10 న పార్లమెంటులో బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క అభిప్రాయాన్ని స్పష్టంచేశారు. ఇండియామంత్రి ఈ విధంగానే మాట్లాడారు. లేబరుపక్ష నాయకుడు అట్లీకూడా దేశంలోని వివిధ వర్గాలమధ్య ఐకమత్యంలేదని, వారందరు కలసి ఒక జాతికిచెందినవారు కారని, భారతదేశంలో ప్రజాస్వామికాన్ని ప్రవేశపెట్టడం ముస్లింలు మొదలైన ఉన్నతవర్గాలకు ఆమోదం కాదని, అన్ని వర్గాలమధ్య ఏకాభిప్రాయం కుదిరేవరకూ బ్రిటిష్ పరిపాలన సాగడమే దేశానికి శ్రేయస్కరమని ఉద్ఘాటించారు. వివిధ వర్గాలమధ్య సామరస్యం కుదరకపోవుటకు బ్రిటిష్ పరిపాలకులు, వారి భేదోపాయం కారణమని విస్మరించారు. యుద్ధానంతరం దేశానికి డొమినియన్ ప్రతిపత్తిని ప్రసాదించడం తమ లక్ష్యమని బ్రిటిష్‌ప్రభుత్వం క్రిప్సుద్వారా పంపిన సందేశం వట్టి బూటకమని పై ప్రసంగాలు రుజువుచేస్తున్నవి.

ఈలాటి వైఖరిని ప్రదర్శించినవారు క్విట్ ఇండియా ఉద్యమానికి, ఉద్యమకాలంలో జరిగిన దౌర్జన్యాలకు గాంధీని, కాంగ్రెసును కారణభూతులుగా చేయడంలో ఆశ్చర్యపడవలసిందిలేదు. ఎన్ని ఉత్తరాలో ఆయన వైస్రాయికి వ్రాసినా అతని వైఖరిలో ఏలాటి మార్పూ రాలేదు. నిర్దోషిని దోషిగా ప్రకటించడం సహించరాదనే భావంతో గాంధీ 1943 ఫిబ్రవరి 10 మొదలు మార్చి 3 వరకు నిరాహారదీక్షను సాగించారు. ఇది దేశంలోని ప్రజలందరికీ ఆందోళనను కలిగించింది. ఒక ముస్లింలీగుతప్ప తక్కిన పార్టీలవారందరు ఆయనను విడుదలచేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరారు. అమెరికా మొదలైన దేశాలలోని ప్రముఖులు ఈ అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు. కాని ప్రభుత్వం అందరి మాటలను పెడచెవినిపెట్టింది. దీనికి నిరసనగా వైస్రాయి కార్యనిర్వాహక సభనుండి (Executive council) ముగ్గురు సభ్యులు రాజీనామా చేశారు.

కాని అదృష్టవశాత్తు ఉపవాసదీక్ష గాంధీకి ప్రాణభంగాన్ని కలిగించలేదు. తర్వాత కొన్ని నెలలలో ఆయన సతీమణి కస్తూరిబాయి, అంతకు కొంచెంముందు అతని కార్యదర్శి పుత్రసమానుడై 25 సంవత్సరాలు అతనికి సేవచేసిన మహదేవదేశాయి మరణించారు. అలాటి ఆపత్సమయంలో కూడా ప్రభుత్వం ఆయనను విడుదల చేయలేదు. కాని 1944 మే 5న ఆయన ఆరోగ్యం పూర్తిగా చెడినట్లు తెలియగానే ప్రభుత్వం ఆయనను విడుదలచేసింది. అప్పటికి యుద్ధపరిస్థితులు బ్రిటన్‌కు మిత్రమండలివారికి అనుకూలంగా పరిణమించాయి. ఆయన విడుదలకు ఇదికూడా ఒక కారణం. క్విట్ఇండియా తీర్మానం కారణంగా నిర్బంధింపబడిన గాంధీకి విముక్తి కలగడంతో ఉద్యమం పూర్తిగా ముగిసినట్లు భావించవచ్చు.

చదువదగిన గ్రంథాలు:

Bhavan: Vol. xi

Tarachand: Vol. iv

R. C. Mazumdar: Vol iii

Manmathanath Gupta: History of the Indian Revolutionary Movement; Somaiya Publications

R. C. Majumdar - Three phases of India's Freedom struggle

M. Venkatarangaiya: History of the Freedom struggle in Andhra Pradesh - Andhra : Vol iv

# అధ్యాయము-15

## క్విట్‌ఇండియా ఉద్యమకాలంలో ఇతర పరిణామాలు

## 1

క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైననాటికి యుద్ధరంగాలన్నిటిలో బ్రిటన్ క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటూ ఉండినది. హిట్లరు రషియాపై దండెత్తి ఘనవిజయాలను సాధించడమేగాక ఆగ్నేయయూరపులోని దేశాలన్నిటిని తనవశంలోకి తెచ్చుకోగలిగాడు. అతని మిత్రుడైన ముసొలినీ ఉత్తర ఆఫ్రికాపై దండెత్తి ఈజిప్టును జయించి, బ్రిటన్ ఇండియాలమధ్య రాకపోకలను స్తంభింపజేయుటకు సమకట్టాడు. ఏషియాఖండంలో జపాన్‌వారి మూలంగా ఎక్కువ ప్రమాదాలు సంభవించే పరిస్థితులు ఏర్పడినవి. తమ ఏలుబడిన ఉండిన ప్రజలకు ఏలాటి సంరక్షణ కల్పించక సింగపూరు, మలయా, బర్మాలనుండి బ్రిటిష్‌వారు పారిపోవలసి వచ్చింది. బర్మానుండి జపాన్‌వారు భారతదేశంపై దండెత్తుటకు సన్నాహాలు చేస్తూ వచ్చారు.

ఆలాగు వారు దండెత్తినపక్షంలో బ్రిటిష్‌వారు వారిని ఎదుర్కొనే స్థితిలో లేరని, సింగపూరు, మలయా, బర్మాలలో జరిగినట్లే ప్రజలకు ఏలాటి రక్షణ కల్పించక పారిపోవుటకు సిద్ధంగా వున్నారనే భావం ప్రజలలో వ్యాపించింది. ఆలాటి పరిస్థితులు ఏర్పడకపూర్వమే వారు పరిపాలనాధికారాన్ని ఒక జాతీయ ప్రభుత్వానికి ఒప్పగించి, దేశాననుండి వెళ్ళిపోయినపక్షంలో ప్రజల విశ్వాసానికి పాత్రమైన జాతీయప్రభుత్వం దేశరక్షణకు కావలసిన చర్యలన్నిటిని తీసుకొనుటకు ఎక్కువ అవకాశం ఉండగలదనే భావంతో కాంగ్రెసు కార్యనిర్వాహకకమిటీ, అఖిల భారత కాంగ్రెసుకమిటీ, దానికి అనుగుణంగా తీర్మానాలు చేసినట్లు మనం ఇదివరకే తెలుసుకొన్నాము. ఆ తీర్మానాలగురించి కాంగ్రెసునాయకులతో చర్చలుకూడా జరుపక వారిని నిర్బంధించిన కారణంగా క్విట్‌ఇండియా ఉద్యమం ప్రారంభమైనట్లు కూడా మనం ఇదివరకే తెలుసుకొన్నాము.

జపాన్ భారతదేశంపై దండెత్తిన పక్షంలో వారిని ఎదుర్కొనగల శక్తిగాని ఆసక్తిగాని బ్రిటిష్‌వారికి లేదని భావించినవారు భారతీయులుమాత్రమేకాదు. ఆనాడును క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైన తర్వాతను అమెరికా అధ్యక్షుడు రూసువెల్టు తరపున ప్రత్యేక ప్రతినిధులుగా భారతదేశానికి వచ్చిన జాన్‌సన్, ఫిలిప్సు, హెరింగ్టన్ మొదలైనవారు వారి నివేదికలలో ఈలాటి అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు. వారి నివేదికల సారాంశం ఈ క్రింది విధంగా నుండినది.

(1) దేశరక్షణకు కావలసినంత సైనికబలం బ్రిటిష్‌వారికిలేదు. భారతసైన్యంలో చాలాభాగాన్ని వారు ఉత్తర ఆఫ్రికాకు ఇతర యుద్ధరంగాలకు తరలింపడమే దీనికి కారణం.

(2) బ్రిటిష్‌వారి సైనికబలం జపాన్‌వారిని ఎదుర్కొనుటకు శక్తిలేనట్టిది. అందులోని సిపాయీలకు బ్రిటిష్‌వారిపట్ల గాని భారతదేశంపట్లగాని అభిమానంలేదు. వారు కూలిడబ్బులకు ఆశపడి యుద్ధంచేసేవారు.

(3) వారిపై ఆధిపత్యం వహించిన బ్రిటిష్ సేనానులు యుద్ధవిద్యలోను నైపుణ్యం లోను అగ్రశ్రేణికి చెందినవారుకారు. యూరపుఖండంలోను, ఆఫ్రికాలోను సైన్యాధిపత్యాన్ని వహించుటకు సామర్థ్యంలేనివారు భారతదేశ సైన్యానికి అధిపతులు. అత్యధికబలంతో దేశంపై దండెత్తదలచిన జపాన్‌వారిని ఎదుర్కొనగల సామర్థ్యం వారికిలేదు.

(4) భారతదేశ సైన్యానికి అధిపతి అయిన వేవల్ జవసత్వాలు కోల్పోయి సైనిక చర్యలదృష్ట్యా వృద్ధుడైనవాడు.

(5) దేశరక్షణకు కావలసిన సామర్థ్యం సైన్యాలకు లేకపోవడమేగాక, జపాన్‌వారిని ఎదుర్కొనుటలో వారికి ఆసక్తికూడా లేదు. అమెరికావారి సైనికబలం, నౌకాబలం, విమాన బలం యుద్ధంలో పాల్గొంటూ ఉన్నవి. దానిఫలితంగా తుదకు జపాన్‌వారు ఓడిపోవడం తథ్యం. తాము భారతదేశాన్ని రక్షించలేక పారిపోయినా యుద్ధానంతరం అమెరికావారు సింగపూరు, మలయా, బర్మా, భారతదేశాలను తమకు తిరిగి ఇచ్చివేయగలరు. ఈలాటి మనోవైఖరి బ్రిటిష్ వారిలో పూర్తిగా ఏర్పడి ఉన్నది. అందుచేత నిలబడి జపాన్‌వారిని ఎదుర్కొనడంలో వారికి ఎక్కువ ఆసక్తిలేదు. వారు అమెరికాకు నామమాత్రంగా మాత్రమే సహాయం చేయదలచి యున్నారు. అందుచేత అమెరికా రక్షణబలాలు—వాటిలో ప్రధానంగా విమానబలం-అధిక సంఖ్యలో భారతదేశానికి పంపడం అవసరం. రక్షణ విషయంలో బ్రిటిష్‌వారిపై ఎక్కువగా ఆధారపడడం ప్రాజ్ఞతకాదు.

(6) భారతీయులకు బ్రిటిష్ వాగ్దానాలపట్ల విశ్వాసంలేదు. యుద్ధంలో వారికి సహాయం చేయుటకు వారు ముందుకు రావడంలేదు. అమెరికావారు పరిపాలనా విషయంలో జోక్యం కలిగించుకొని, యుద్ధానంతరం దేశానికి స్వాతంత్ర్యం లభించగలదని హామీఇచ్చినపక్షంలో ప్రజల సహకారం లభిస్తుంది. ప్రజల సహకారం లేనిదే దేశంలో యుద్ధాన్ని సాగించడం సాధ్యంకాదు. యుద్ధంమూలంగా దేశంలో ధరలు విపరీతంగా పెరిగినవి. అనేక ప్రాంతాలలో క్షామపరిస్థితులు ఏర్పడినవి. ఈలాటి స్థితిలో వారు బ్రిటిష్‌ప్రభుత్వానికి సహాయంచేయడం కల్ల.

పై విధంగా రూసువెల్టు ప్రతినిధులు భారతదేశంలో ఏర్పడిన ప్రమాదకరములైన పరిస్థితుల గురించి ఏలాటి దాపరికము లేక అతనికి నివేదించినారు. బ్రిటిష్ అధికారులు పార్ల మెంటులోను భారత శాసనసభలలోను ఉపన్యాసాలద్వారా చేసిన ప్రచారం సత్యదూరమనిన్నీ, వారు కాంగ్రెసుతో రాజీచేసుకొని ప్రజల సహకారాన్ని సంపాదించడం అవసరమని అతడూ అమెరికాలోని ఇతర ప్రముఖులూ గ్రహించారు. రాజీవిషయంలో ఎంతటి ప్రయత్నం సాధ్యమో అంతటి ప్రయత్నం చేశారు. కాని యుద్ధకాలంలో ఇందుకుగాను చర్చిల్ ప్రధానిని ఎక్కువగా ఒత్తిడిచేయడం రెండుదేశాల మధ్య చీలికలకు దారితీయవచ్చునని భయపడి తమ ప్రయత్నాన్ని విరమించుకొన్నారు. దేశరక్షణార్థం తమ బలాలను అధిక సంఖ్యలో భారతదేశానికి పంపడంతో తృప్తిపడినారు. కాని దేశరక్షణకు కావలసిన శక్తిసామర్థ్యాలుగాని ఆసక్తిగాని, బ్రిటిష్‌వారికి లేదని వారు గ్రహించడం 1942-44 మధ్య సంభవించిన పరిణామాలలో ప్రాధాన్యం వహిస్తున్నది.

## 2

ఇదేకాలంలో దేశంలోని ఆర్థిక పరిస్థితులు మరింత దిగజారి 1943-44లో బెంగాలు రాష్ట్రంలో అంతకుపూర్వం ఎన్నడూ సంభవించని క్షామానికి దారితీసింది. ధరలు విపరీతంగా పెరిగినవి. అవసర పదార్థాలకు—వాటిలో ముఖ్యంగా తిండి గింజలకు—కొరత ఏర్పడింది. పన్నులభారం పెరిగింది.

యుద్ధానికి పూర్వం కొన్ని సంవత్సరాల నుండి ఆహారపదార్థాలకు కొరత ఏర్పడ సాగింది. జనాభా పెరుగుదలకు తగినట్లుగా ధాన్యాలఉత్పత్తి పెరగలేదు. వ్యవసాయాభివృద్ధిపట్ల ప్రభుత్వం ఏలాటి శ్రద్ధను వహించలేదు. 1919 కు పూర్వం దేశం విదేశాలకు ఆహార ధాన్యాలను ఎగుమతి చేస్తూఉండేది. అటుతర్వాత క్రమక్రమంగా ఎగుమతులు తగ్గడమే గాక విదేశాల నుండి వాటిని దిగుమతి చేసుకొనవలసిన అవసరం ఏర్పడింది. 1935 నుండి ఏటేట 14 లక్షల టన్నుల ధాన్యాలను దిగుమతి చేసుకోవడం జరిగింది.

1942 లో జపాన్‌వారు బర్మాను ఆక్రమించిన కారణంగా అక్కడనుండి వచ్చే బియ్యం దిగుమతులు ఆగిపోయినవి. ఈ గడ్డుపరిస్థితిని ఎదుర్కొనుటకు ప్రభుత్వం ఏలాటి చర్యలను తీసుకొనలేదు. అది తీసుకొన్న చర్యలు పరిస్థితులను మరింత క్లిష్టంగా చేసినవి. బెంగాలు సరిహద్దు రాష్ట్రం కావడంచేతను, జపాన్‌వారి దండయాత్ర లక్ష్యం బెంగాలు కావడం చేతను ప్రభుత్వం అక్కడ అనేక కంట్రోళ్ళను విధించింది. 1941 నుండి ఏటేట పంటలకు చాలా నష్టం సంభవిస్తూ వచ్చింది. కంట్రోళ్ళ ఫలితంగా ఒక ప్రాంతాననుండి ఇంకొక ప్రాంతానికి ధాన్యాలరవాణా ఆగిపోయింది. లభించిన ధాన్యాలను సైనికుల నిమిత్తం ప్రభుత్వం కొనుగోలు చేయసాగింది. బర్మా, మలయా, సింగపూరుల నుండి కాందిశీకులు లక్షల సంఖ్యలో బెంగాలుకు రావడంచేత ధరలు విపరీతంగా పెరిగిపోయినవి.

దండెత్తి వచ్చే జపాన్‌వారికి ఏలాటి పదార్థాలు లభించకుండా చేయుటకు కొన్ని ప్రాంతాలలో పంటలను పండించరాదని, పండిన పంటలనుకూడా నాశనం చేయవలసిందని (Scorched earth Policy) ప్రభుత్వం ప్రజలను ఆదేశించింది. దీనిమూలంగా ప్రజలకు కలిగిన నష్టాన్ని భర్తీచేయుటకు ప్రభుత్వం ఏలాటి చర్యలను తీసుకొనలేదు. దీనికితోడు వారి పడవలను వశపరచుకొన్నది. తూర్పు బెంగాలు జలమయ ప్రదేశం కావడంచేత ప్రజలు పడవలలోనే నివసిస్తూ ఉండేవారు. పడవుల సాధనాన చేపలుపట్టి జీవిస్తూఉండేవారు. వాటిని ప్రభుత్వం వశపరచుకొనిన కారణంగా వారు నిరాశ్రయులై జీవితాన్ని సాగించలేకపోయినారు. గ్రామీణ ప్రజలు లక్షల సంఖ్యలో కలకత్తావంటి నగరాలకు వచ్చి తలదాచుకొన్నారు. దీనిఫలితంగా నగరాలలో ధరలు మరింత పెరిగినవి.

ఆ నాడు రాష్ట్రాన్ని పాలిస్తున్న ముస్లింలీగు ప్రభుత్వం తీసుకొన్న చర్యలు ప్రజల బాధలను మరింత వృద్ధి చేసినవి. ధాన్య వ్యాపారమంతా కొందరు ముస్లింవర్తకుల ఆధీనం చేసింది. వారు వారి గుత్తాధికారాన్ని స్వలాభంకొరకు వినియోగించారు. అవినీతిపరులైన ఉద్యోగులు వారికి సహాయపడినారు. వీటి అన్నిటి ఫలితంగా 1943 లో రాష్ట్రమంతటా క్షామం సంభవించింది. ప్రభుత్వ అంచనా ప్రకారం 1943 జూలై డిసెంబరుల మధ్య 15 లక్షల జనం మరణించారు. కాని వాస్తవంగా 30 లక్షల మంది మరణించినట్లు అనధికారుల అంచనా. ఇటీ

వలి కాలంలో ఇంతటి ఘోరమైన క్షామం బెంగాలులోగాని దేశంలో మరియొక ప్రాంతంలోగాని సంభవించలేదు. ఇంతటి ఘోరం జరిగినా కేంద్ర ప్రభుత్వం బ్రిటన్‌లోని ప్రభుత్వం దానిని గురించి పట్టించుకోలేదు.

రాజకీయ కారణాల మూలంగా బ్రిటిష్ ప్రభుత్వంపై 1939 నుండి ప్రజలు వహించిన ద్వేషభావం పై ఆర్థిక పరిస్థితులు కారణంగా మరింత పెరిగింది. యుద్ధాన్ని సాగించడంలో ప్రజల సహకారం సన్నగిల్లింది. 1942-44 లో ప్రభుత్వం ప్రకటించిన నివేదికలలో ఇది స్పష్టంగా కనుపిస్తున్నది. సామాన్యప్రజలే గాక మామూలుగా ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలను ప్రదర్శించే జమీందార్లు, గొప్ప భూస్వాములు విరోధభావం వహించారు. బెంగాలు గవర్నరు కేసి (Cassey) రాష్ట్రంలోని పరిస్థితులను సమీక్షిస్తూ 1944 లో విద్యాధికులైన హిందువు లెవ్వరు ప్రభుత్వంపట్ల సానుభూతిని చూపడంలేదని, విప్లవకారుల సంఖ్య తగ్గినా ప్రజలందరికి వారి పట్ల అభిమానం ఉన్నదని తన విచారాన్ని వెలిబుచ్చాడు. శాంతిభద్రతలకై ప్రభుత్వం తీసుకొన్న చర్యలను ఆమోదించేవా రెవ్వరు లేరని, మామూలుగా ప్రభుత్వానికి సహాయం చేసేవారు కూడా సహాయాన్ని మానుకొన్నారని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించింది. బొంబాయిరాష్ట్ర ప్రభుత్వం కూడా ఈలాటి అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది.

నూరు నూటయాభై సంవత్సరాల కాలం దేశాన్ని పాలించినవారిపై ప్రజలకు విశ్వాసం గాని అభిమానంగాని లేకపోవడం అధికారులకు కనువిప్పుగా పనిచేసింది. అలాటి ప్రజలను శాశ్వతంగా బలప్రయోగ సాధనాన అణచివేయడం సాధ్యంకాదనే భావం వారిలో బలపడింది. 1942-44 మధ్య సంభవించిన పరిణామాలలో ఇదికూడా గుర్తించ దగినట్టిది.

## 3

1942-44 మధ్య కాంగ్రెసుకు ప్రత్యర్థి అయిన జిన్నా తన లక్ష్యాలను సాధించుకొనడంలో గొప్ప విజయాన్ని సంపాదించ గలిగాడు. అతని మొదటిలక్ష్యం పాకిస్తాన్ నిర్మాణం. ఇది భవిష్యత్తుకు సంబంధించినట్టిది. అతని రెండవలక్ష్యం ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండిన రాష్ట్రాలలోను అసాంలోను ముస్లింలీగు మంత్రివర్గాలను స్థాపించి, వాటిపై పరిపాలనాధికారాన్ని సంపాదించడం. ఇది వర్తమాన కాలానికి సంబంధించినట్టిది. కాంగ్రెసు కోరిన దేశ స్వాతంత్ర్యాన్ని ప్రతిఘటించడంలో ప్రభుత్వానికి సహాయం చేయడం మూలంగాను, తన ఆశయాలను ప్రభుత్వం కొనసాగించని పక్షంలో కాంగ్రెసువలెనే ముస్లింలుకూడా ప్రత్యక్ష చర్యలోకి దిగేప్రమాదం ఉన్నదని, సైన్యంలోని ముస్లింసిపాయీలు తిరుగుబాటుచేసే ప్రమాదం ఉన్నదని ప్రభుత్వాన్ని భయపెట్టడం చేతను అతడు తన రెండు లక్ష్యాలను సాధించుకో గలిగినాడు.

ఈ లక్ష్యసాధనలో క్రిప్సు ప్రతిపాదనలు ఒక ప్రధానమైన మెట్టు. యుద్ధానంతరం రాజ్యాంగ పరిషత్తు రూపొందించే రాజ్యాంగానికి కట్టుబడుటకు ఇష్టంలేని రాష్ట్రాలు భారత సమాఖ్యనుండి విడిపోయి ప్రత్యేక డుమినియన్‌లుగా ఏర్పడవచ్చునని క్రిప్సు ప్రతిపాదనలు స్పష్టం చేశాయి. వీటిలో పాకిస్తాన్ ప్రత్యేకంగా పేర్కొనబడక పోయినా రాష్ట్రాలకు సమాఖ్య నుండి విడిపోయే హక్కు ఉన్నట్లు గుర్తించబడింది. పాకిస్తాన్‌కు ఇదియే ఆధారం. బ్రిటిష్ ప్రభుత్వం దీనిని గుర్తించడంచేత తన మొదటిలక్ష్యాన్ని సాధిండడంలో జిన్నాకు విజయం లభించింది.

ఈ సందర్భంలో మరికొన్ని విషయాలను గమనించడం అవసరం. క్రిప్సు రాయబారం నాటికి ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండిన రాష్ట్రాలలోని ప్రజలుగాని ముఖ్యమంత్రులుగాని పాకిస్తాన్ నిర్మాణంపట్ల ఎక్కువ అభిమానం కలవారు కారు. పంజాబు ముఖ్యమంత్రి సికందర్ హయత్‌ఖాన్ తనకు జిన్నా ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతంలో (హిందువులు ఒక జాతి, ముస్లింలు ఇంకొక జాతి అనేది ద్విజాతి సిద్ధాంతం) విశ్వాసం లేదని, హిందువులు ముస్లింల మధ్య సామరస్యం కుదరడం సాధ్యమని, పాకిస్తాన్ ఏర్పడిన పక్షంలో పంజాబులో హిందువులు. శిక్కులు అధికసంఖ్యాకులుగా ఉండే ప్రాంతాలు పంజాబునుండి విడిపోవడం తప్పదని, ఆ పరిస్థితులలో పంజాబుకు ప్రాధాన్యం తగ్గిపోగలదని. అందుచేత పాకిస్తాన్ నిర్మాణం వాంఛనీయం కాదని వైస్రాయికి తెలియపరచాడు. బెంగాలు ముఖ్యమంత్రి హక్ సింధురాష్ట్ర ముఖ్యమంత్రి అల్లాబక్షు ఈలాటి అభిప్రాయాలనే వ్యక్తంచేశారు. ఈ ముఖ్యమంత్రులు ముగ్గురు కలిసి, హిందువులు ముస్లింలు ఒక జాతివారనే భావంతో దేశ స్వాతంత్ర్యానికి పాటుబడడం కర్తవ్యమని ప్రకటనను చేశారు; కాని అధికారంలో ఉండిన ముఖ్యమంత్రుల అభిప్రాయాలను పెడచెవిని బెట్టి, ఏలాటి అధికారంలేని జిన్నాయొక్క అభిప్రాయాన్ని ప్రభుత్వం గుర్తించడం మూలాన రాజకీయాలలో జిన్నామాట మాత్రమే చెల్లగలదనే అభిప్రాయం ముస్లింలలో వ్యాపించింది. దీనిఫలితంగా అతడు వారికి ఏకైక నాయకుడైనాడు. అతని ఆధ్వర్యంలోని లీగు ముస్లింల అభిప్రాయాలను వ్యక్తంచేయగల ఏకైక సంస్థగా రూపొందింది. ఇది జిన్నాకు గొప్ప గర్వకారణమైంది.

కాని అధికారులందరు పాకిస్థాన్ నిర్మాణంపట్ల అభిమానం కలవారని అనుకొనడం పొరబాటు. యుద్ధకాలంలో ముస్లింల సహాయాన్ని సంపాదించుటకు అది ఒక సాధనంగా వారు వినియోగించినా, పాకిస్థాన్ నిర్మాణం మూలాన దేశభవిష్యత్తుకు భంగం కలుగుతుందని వైస్రాయి లింలిత్‌గో 1942 డిసెంబరులో ఒక ఉపన్యాసంలో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. భారతదేశం భౌగోళికంగా ఒక సమైక్యతగల దేశం అని, రాజకీయంగా దానిని విభాగం చేసిన పక్షంలో అంతర్జాతీయ రంగంలో దానికి ఉండదగిన ప్రాధాన్యం తగ్గిపోగలదని అతడు భావించాడు. ఆ నాడు సైన్యాధిపతిగా ఉండిన వేవల్ కూడా దేశంలో రెండురాజ్యాలు ఏర్పడిన పక్షంలో సైన్యంకూడా రెండు భాగాలుగా విడిపోయి, దేశరక్షణ కష్టసాధ్యం కాగలదని భావించాడు. అధికారులు కొందరిలో ఈలాటి అభిప్రాయాలు ఉండినా బ్రిటిష్ ప్రభుత్వం క్రిప్సు ప్రతిపాదనల ద్వారా పాకిస్తాన్ నిర్మాణానికి అంగీకరించడం విచారించదగిన విషయం. యుద్ధకాలంలో తాత్కాలిక ప్రయోజనాలు సంపాదించదలచి ఈలాటి అవాంఛనీయమైన దేశవిచ్ఛిత్తికి అంగీకరించింది.

జిన్నాయొక్క రెండవలక్ష్యం ముస్లింలు అధికసంఖ్యలో ఉండిన రాష్ట్రాలలోను ఆసాంలోను ముస్లింలీగు మంత్రివర్గాలను స్థాపించడం. ఇది కొనసాగుటకు ప్రభుత్వ సహకారం అవసరం. దానిని సంపాదించుటకు మొదటిమెట్టుగా కాంగ్రెసు కమిటీ బొంబాయిలో క్విట్ ఇండియా తీర్మానాన్ని చేసినవెంటనే దీనిఉద్దేశం దేశంలో హిందువుల అధికారాన్ని స్థాపించడమని, అది ముస్లింలకు ప్రమాదకరమని, అందుచేత తిరుగుబాటు ఉద్యమంలో ముస్లింలు పాల్గొనరాదని ఒక ప్రకటనను చేశాడు. ఇది ప్రభుత్వానికి సంతృప్తిని కలిగించింది. కాని

డిసెంబరులో పాకిస్థాన్ నిర్మాణాన్ని విమర్శిస్తూ వైస్రాయి చేసిన ప్రసంగం అతనికి ఆగ్రహాన్ని కలిగించింది. దానికిజవాబుగా ముస్లింలీగు కరాచీలో సమావేశమై వైస్రాయిఉపన్యాసాన్ని ఖండిస్తూ, పాకిస్తాన్ నిర్మాణం జరగనిపక్షంలో 10 కోట్ల ముస్లింలు ప్రత్యక్ష చర్యలోకి దిగే ప్రమాదం ఉన్నదని తీర్మానించింది. ఇంతేకాదు. భారత సైన్యంలో 64 శాతం ముస్లిం సిపాయీలు ఉన్నారని, వారందరు పాకిస్థాన్ నిర్మాణాన్ని కోరేవారని, ప్రభుత్వం ఆ కోరికను నిరాకరించిన పక్షంలో వారు కూడా తిరుగుబాటుచేసే ప్రమాదం ఉన్నదని జిన్నా బహిరంగ ప్రకటన చేశాడు. వాస్తవానికి సైన్యంలో ముస్లింల శాతం 34 మాత్రమే. ఇంతేగాక సైనికులలో రాజకీయాల పట్ల ఏలాటి ఆసక్తి లేదు. ఈలాటి పరిస్థితులలో జిన్నా బెదరింపులు అర్థరహితములని ప్రభుత్వానికి తెలిసినా తాత్కాలికంగా అతని రెండవ లక్ష్యాన్ని సాధించడంలో అతనికి సహాయం చేయ నిశ్చయించుకొన్నది.

బెంగాలు ముఖ్యమంత్రి హక్‌ను రాజీనామా చేయవలసిందిగా గవర్నరు నిర్బంధించి ముస్లిం లీగు మంత్రివర్గాన్ని 1943 మార్చిలో స్థాపించాడు. అసాంలో కాంగ్రెస్‌తోకలిసి ఒక సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటుకు కొందరు నాయకులు ప్రయత్నించగా శాసన సభలోని కాంగ్రెసు సభ్యులను నిర్బంధించి, ఆ ప్రయత్నం కొనసాగకుండా గవర్నర్ కుట్రలుపన్ని ముస్లింలీగు మంత్రివర్గాన్ని స్థాపించాడు. ఈ కుట్రలలో బెంగాలు అసాం శాసన సభలలోని యూరోపియన్ సభ్యులు గొప్ప పాత్రను వహించారు. సింధురాష్ట్రి ముఖ్యమంత్రి యుద్ధ కార్యక్రమాలలో ప్రభుత్వంతో పూర్తిగా సహకరించినా కాంగ్రెసు ఆశయాలపట్ల అభిమానాన్ని వ్యక్తంచేస్తూ, ప్రభుత్వం అనుసరించిన దమన విధానాన్ని ఖండించి, తన బిరుదులను త్యజించి నాడు. ఇది కారణంగా సింధు గవర్నరు అతనిని అధికారాననుండి తొలగించి ముస్లిం లీగు మంత్రివర్గాన్ని 1942 అక్టోబరులో స్థాపించాడు. వాయవ్య సరిహద్దు రాష్ట్రింలో అబ్దుల్ గఫర్‌ఖాన్ మొదలైన కాంగ్రెసువారు నిర్బంధంలో ఉంచబడిన కారణంగా ముస్లిం లీగు మంత్రివర్గం అధికారంలోకి రాగలిగింది. పంజాబులో 1942 డిసంబరులో సికందర్ హయత్ ఖాన్ మరణించాడు. అతని పార్టీకి చెందినవారు శాసనసభలో అధిక సంఖ్యాకులుగా ఉండినం దున ముస్లిం లీగు మంత్రివర్గం అధికారంలోకి రాలేకపోయింది. కాని క్రమ క్రమంగా ఆ పార్టీలోనివారు కొందరు లీగుపట్ల అభిమానం కలవారయ్యారు. దీని ఫలితంగా లీగు మంత్రి వర్గం అధికారంలోకి రాలేకపోయినా జిన్నా పలుకుబడి పెరిగింది. పంజాబు గవర్నరు లీగుకు సహకారం అందించుటకు సిద్ధపడ్డాడు.

ఈ విధంగా 1944 ప్రారంభం నాటికి బెంగాలు, అసాం, సింధు, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో లీగు మంత్రివర్గాలు ఏర్పడినవి. పంజాబులో లీగు మంత్రివర్గం ఏర్పడకపోయినా. దాని పలుకుబడి పెరిగింది. అందుచేత ఈ అయిదు రాష్ట్రాలలో జిన్నా తన అధికారాన్ని స్థాపించి, తన రెండవ లక్ష్యాన్ని కూడా సాధించగలిగినాడు. ఈ కాలంలో కాంగ్రెసు నాయకు లందరు నిర్బంధంలో ఉండడంచేత జిన్నాతో పోటీ చేయగలవారెవ్వరు లేకపోయినారు. ఇది కూడా అతని నాయకత్వాన్ని విధానాలను బలపరచడంలో ఒక సాధనమైంది. 1944 ఆఖరుకు ముస్లిం లీగు కాంగ్రెసుతో తులతూగగల సంస్థగా రూపొందింది. 1944 లోను అటు తర్వాతను దేశ భవిష్యత్తును నిర్ణయించడంలో ప్రభుత్వం సాగించిన సంప్రతింపులలో ఈ రెండు సంస్థలు మాత్రమే ప్రాధాన్యం వహించాయి. 1942-44 మధ్య సంభవించిన పరిణామాలలో లీగుకు ఈలాటి ప్రాధాన్యం లభించడం గుర్తించదగిన విషయం.

ఈ కాలంలో కాంగ్రెసు అరణ్యవాసంలో అజ్ఞాతంగా ఉండిన కారణంగా లీగు ఆశయాలను ప్రతిఘటించే అవకాశందానికి లేకపోయింది. కాని సావర్కార్ నాయకత్వంలోని హిందూమహాసభప్రతిఘటించే పాత్రను వహించింది. 1942 డిసెంబరులో అది సావర్కార్ అధ్యక్షతన కాన్‌పూరులో సమావేశమై ముస్లిములు ఒక జాతివారు కారని, వారు ఒక అల్ప సంఖ్యాక వర్గము మాత్రమే అని, అన్ని దేశాలలో అల్పసంఖ్యాకులకు ఉండే హక్కులకు మాత్రమే వారు అర్హులని, దేశ విభజనద్వారా పాకిస్థాన్‌ను కోరడం ఒక శక్తినాన్ని ఛేదించడంవంటిదని, హిందువులు అలాటి దేశద్రోహ చర్యలకు ఎన్నడు సమ్మతింపజాలరని తీర్మానించింది. కాని ఈ తీర్మానం లీగుపైనగాని ప్రభుత్వంపైనగాని ఏలాటి ప్రభావాన్ని వహించలేదు. దేశంలో హిందూ మహాసభకు ఎక్కువ పలుకుబడి లేదు. అది మాటలతో తృప్తిపడిన సంస్థ మాత్రమే. తన తీర్మానాలను ఆచరణలో పెట్టుటకు కావలసిన చేతలలోకి దిగినట్టిదికాదు.

## 4

అహింసా తత్వంలో విశ్వాసంలేనివారికి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనుటకు క్విట్ ఇండియా ఉద్యమం గొప్ప అవకాశాన్ని కల్పించింది. మొదటినుండి విప్లవ వర్గానికి చెందినవారికి రైళ్ళను ఆటకాయించడంలో ఎక్కువ అనుభవం ఉండేది. ఉద్యమంలోవారు పాల్గొనడం మూలంగా రాకపోకల సౌకర్యాలకు సమాచార సౌకర్యాలకు గొప్ప అవరోధం కలిగింది. ప్రభుత్వం అనుసరించిన హింసా విధానాన్ని హింసతో ప్రతిఘటించడం ఉత్తమ విధానమని వారు విశ్వసించారు.

సుభాష్ చంద్రబోసు ఈ వర్గానికి చెందినవాడు. ఇతడు సింగపూరు మలయాలలో జపాన్ వారి సహాయంతో ఒక భారత జాతీయ సైన్యాన్ని (Indian National Army) నిర్మాణంచేసి, దాని సాధనాన భారతదేశంలోని బ్రిటిష్ పరిపాలకులతో సాయుధ పోరాటాన్ని 1944-45 లో సాగించాడు. ఈ పోరాటం విఫలమైనా దేశ స్వాతంత్ర్యోద్యమంపై గొప్ప ప్రభావాన్ని వహించి 1947 లో బ్రిటిష్‌వారు అధికారాన్ని వదలుకొని దేశానునుండి వెళ్ళిపోవడంలో గొప్ప సాధనంగా పరిణమించింది. బోసు సాగించిన ఈ పోరాటాన్ని గురించి మనం ఇప్పుడు తెలుసుకొనడం అవసరం.

రెండవ ప్రపంచ యుద్ధం సంభవించడం తప్పదని, అది సంభవించగానే కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించవలసినదని బోసు 1939 మార్చిలో కాంగ్రెసు అధ్యక్ష పీఠాన నుండి ఉద్ఘాటించాడు. కాని కాంగ్రెసుపై గాంధీకి నెహ్రూకు గొప్ప ప్రభావం ఉండడం చేతను, వారు అతనితో ఏకీభవించని కారణం చేతను అతని అభిప్రాయాలకు అనుగుణంగా కాంగ్రెసు ఏలాటి తీర్మానాన్ని చేయలేదు. తర్వాత ఏర్పడిన మరికొన్ని పరిస్థితుల ఫలితంగా బోసు అధ్యక్ష పదవికి రాజీనామాచేసి, ఫార్వర్డ్ బ్లాకు అనే పార్టీనొకదానిని నిర్మాణం గావించి, యుద్ధం ప్రారంభం కాగానే దేశమంతటా సంచారంచేసి, సమావేశాలలో తన అభిప్రాయాలను ప్రకటించి, 1940 ఏప్రిలులో శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాడు. దీని ఫలితంగా ప్రభుత్వం అతనిని నిర్బంధించింది. నిర్బంధంలో తన జీవితాన్ని వ్యర్థపుచ్చడం ఆయన ఆశయంకాదు. విడుదలకై నవంబరు 29న ఉపవాసదీక్షను వహించాడు. డిసెంబరు 5న ప్రభుత్వం ఆయనను విడుదలచేసి స్వగృహంలోనుంచి బయటకు రాకూడదని ఆదేశించింది.

కాని 1941 జనవరి 17 న ఆయన ఇంటినుండి తప్పించుకొని, మారువేషంతో ప్రయాణంచేసి మొదట కాబూలుకు. తర్వాత మాస్కోకు వెళ్ళి, తుదకు మార్చి 28న జర్మన్ రాజధానియైన బెర్లిన్ చేరాడు.

జర్మన్ అధికారులు ఆయనను గౌరవించి, ఆయన చేసిన సూచనలలో రెంటికి అంగీకరించి. మూడవ సూచనను తిరస్కరించారు. బెర్లిన్ నుండి భారత ప్రజలను ఉద్దేశించి, బ్రిటిష్ పరిపాలకులకు విరుద్ధంగా రేడియో ప్రసారాలు చేయడం, జర్మన్ సైన్యాలకు ఖైదీలుగ వశపడిన భారత సైనికులను ఒక సైనిక దళంగా నిర్మాణంచేసి, భారత దేశంలోని వాయవ్య సరిహద్దులలో తిరుగుబాటు సాగించుటకు దానిని వినియోగించడం—ఈ రెండు సూచనలకు జర్మన్ అధికారులు అంగీకరించారు. కాని భారతదేశం స్వతంత్రదేశంగా రూపొందించడంలో సహాయం చేయుటకు—ఇది ఆయన చేసిన మూడవ సూచన—వారు అంగీకరించలేదు. ఆయన దృష్టిలో ఈ మూడవ సూచనే ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించినట్టిది. దీనికి వారు అంగీకరించక పోవడం ఆయనకు చాలా ఆశాభంగాన్ని కలిగించింది. అయినా కొన్ని నెలలపాటు బెర్లిన్ నుండి భారత ప్రజలకు రేడియో ప్రసారాలు చేశాడు. 3000 సైనికులతో కూడిన ఒక భారత సైనికదళాన్ని నిర్మాణం చేశాడు.

ఈమధ్యకాలంలో ప్రాచ్య, ఆగ్నేయ ఏషియాలలో జపాన్‌వారు అమెరికాతోనూ ఇతర పాశ్చాత్య దేశాలతోను యుద్ధాన్ని ప్రకటించి, వాటి వశంలో ఉండిన దేశాలను ఆక్రమించడం ఆయనకు తెలిసింది. ఈ పరిస్థితులలో జపాన్‌కు వెళ్ళి, జపాన్‌వారి సహాయంతో భారతదేశ విముక్తికై సాయుధ పోరాటాన్ని సాగించుటకు ఆయన నిశ్చయించు కొన్నాడు. ఆయన నిర్ణయం ఆచరణ సాధ్యంకావడంలో ఏషియాలో సంభవించిన మరికొన్ని పరిణామాలు ఆయనకు అనుకూలించినవి.

జపాన్ యుద్ధంలో ప్రవేశించి త్వరితగతిని అమెరికాను ఇతర పాశ్చాత్య దేశాలను ఓడించి, వారి వశంలో ఉండిన దేశాలలో అనేకాన్ని స్వాధీనపరచుకొనడం, ప్రాచ్య, ఆగ్నేయ ఏషియా దేశాలలో నివసిస్తూ ఉండిన 30 లక్షల భారతీయులపై గొప్ప ప్రభావాన్ని వహించింది. ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో విదేశాలలో నివసిస్తూ ఉండిన భారతీయులు గదర్‌పార్టీ అధ్వర్యాన జర్మన్‌ల సహాయంతో సాయుధ పోరాటాన్ని బ్రిటిష్‌వారితో సాగించుటకు చేసిన ప్రయత్నం వారి స్మృతిపథంలో మెలగ సాగింది. అదే విధంగా రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో జపాన్‌వారి సహాయంతో దేశవిముక్తికై సాయుధ పోరాటాన్ని సాగించడం తమ కర్తవ్యంగా వీరు భావించారు. వీరికి జపాన్‌లో నివసిస్తున్న రాష్‌బిహారీబోసు నాయకుడయ్యాడు. ఇతడు 1905 తర్వాత బెంగాలులోను ఉత్తర భారతంలోని ఇతర రాష్ట్రాలలోను సాగిన విప్లవ ఉద్యమంతో ఘనమైన పాత్రను వహించినవాడు. 1915 లో ఇతడు బ్రిటిష్ అధికారులకంటబడక తప్పించుకొని జపాన్‌కు వెళ్ళి, జపాన్ వనితను వివాహమాడి, జపాన్ పౌరుడుగా ఆదేశంలో స్థిరపడినాడు. కాని అతనిలోని దేశ స్వాతంత్ర్యాభిమానం ఎంతమాత్రం తగ్గలేదు. తన చిరకాలవాంఛ ఫలప్రదమగుటకు తగిన తరుణం ఆసన్నమైనదని భావించి. ఏషియా ఖండంలోని వివిధ దేశాలలో నివసిస్తున్న భారతీయుల ప్రతినిధులతో కూడిన ఒక సమావేశాన్ని మార్చి 28-30న టోకియోలో జరిపాడు. ఆ సమావేశం దేశవిముక్తికై

రాష్‌బిహారిబోసు నాయకత్వాన భారత స్వాతంత్ర్య సంఘం (Indian Independence League) అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించుటకు, సాయుధపోరాటాన్ని సాగించుటకు ఒక భారతీయ సైన్యాన్ని నిర్మాణంచేయుటకు తీర్మానించింది. అటు తర్వాత జూన్ 15-22 లో టోకియో సమావేశానికంటె గొప్ప సమావేశం బాంకాక్ నగరంలో జరిగింది. ఈ సమావేశం ఆనాడు జర్మనీలో ఉన్న సుభాష్ చంద్రబోసును ఆహ్వానించుటకును, స్వాతంత్ర్య సంఘానికి అతనిని అధ్యక్షునిగా చేయుటకును తీర్మానించింది. కాని ఆయన 1943 జూన్ 13కుగాని జర్మనీ నుండి టోకియోకి రాలేదు.

ఈ మధ్య కాలంలో జపాన్ సింగపూరు మలయాలను వశపరచుకొని బర్మాపై దండెత్తుటకు సిద్ధంగా ఉండినది. మలయాలోను సింగపూరులోను భారతసైన్యంలోని సిపాయీలు సుమారు 50,000 జపాన్ వారికి ఖైదీలుగా వశపడిపోయినారు. అలాగు వశపడినవారిలో సైన్యాధికారిగా కృషిచేసిన మోహన్‌సింగు ఒకడు. ఆయన స్వాతంత్ర్య సంఘ నిర్మాణం చేయదలచిన సైన్యాధిపతిగా ఉండుటకు అంగీకరించాడు. జపాన్‌వారు భారత ఖైదీలను అతని వశం చేశారు. ఆయన ప్రథమంలో వారినుండి 16000 మందిని ఎన్నుకొని జాతీయ సైన్యాన్ని నిర్మాణం చేశాడు. క్రమ క్రమంగా దానిని 40,000 కు పెంచదలచాడు; కాని జపాన్‌వారు ధానికి సమ్మతించలేదు. ఇతర విషయాలగురించికూడా ఆయనకు జపాన్ అధికారులతో అభిప్రాయభేదాలు పొడచూపినవి. ఇంతేగాక స్వాతంత్ర్య సంఘకార్యకర్తలుకూడ కొన్ని విషయాలలో ఆయనతో ఏకీభవించలేక పొయ్యారు. ఈ పరిస్థితులఫలితంగా సైన్యాధిపత్యా ననుండి ఆయన తొలగింప బడినాడు. సైన్యంనిర్మాణమైనా అది ఏలాటి కార్యక్రమాలను సాగించలేని స్థితికివచ్చింది.

సుభాష్ రాకతో పరిస్థితులన్నీ చక్కబడినవి. టోకియో చేరగానే ఆయన జపాన్ ప్రధాని టోజోను కలుసుకొన్నాడు. భారతదేశానుండి బ్రిటిష్‌వారిని తొలగించి, భారతీయులకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించడంలో జపాన్ సహాయపడగలదని ప్రధాని సుభాష్‌కు వాగ్దానం చేయడమేగాక జపాన్ శాసనసభలో బహిరంగ ప్రకటనచేశాడు. హిట్లరు సమ్మతించని ఆశయసిద్ధికి టోజో సమ్మతించడం సుభాష్‌కు ఎంతో సంతోషాన్ని కలిగించింది. తన ఉద్యమం సఫలంకాగలదనే విశ్వాసం సుభాష్‌కు కలిగింది.

ఆయనరాగానే రాషబిహారిబోసు తన అధ్యక్షపదవికి రాజీనామాచేశాడు. అతని స్థానంలో సుభాష్ స్వాతంత్ర్యసంఘానికి అధ్యక్షుడై, సింగపూరులో ఒక తాత్కాలిక భారత ప్రభుత్వాన్ని (Provisional Government) స్థాపించాడు. దీనిని జర్మనీ, ఇటలీ, జపాన్ మరికొన్ని దేశాలు గుర్తించినవి. పరిపాలనా కార్యక్రమాలు సౌష్ఠవంగా సాగుటకు ఒక మంత్రి మండలిని ఏర్పాటుచేశాడు. చాటర్జీ ఆర్థికశాఖపైన, అయ్యర్ ప్రచారశాఖపైన, లక్ష్మీస్వామి నాధన్ స్త్రీలశాఖపైన అధ్వర్యం వహించారు.

జాతీయ సైన్యాన్ని 40,000 కు పెంచుటకు జపాన్‌వారు అంగీకరించారు. దానికి సుభాష్ అధిపతి అయినాడు. సైనికదళాలలో ఒకదానికి గాంధీదళమని, ఇంకొకదానికి నెహ్రూ దళమని, మూడవదానికి అజాద్‌దళమని పేరుపెట్టాడు. త్రివర్ణపతాకం జాతీయపతాకంగా గుర్తించాడు. హిందూస్థానీభాషను అధికారభాషగా చేశాడు. కవాతులలో ఇంగ్లీషు మాటలకు

బదులు హిందూస్థానీ మాటలను వాడవలసిందిగా ఆదేశించాడు. "ఛలో ఢిల్లీ" (ఢిల్లీకి వెళ్ళండి) అనేది సైనిక నినాదంగా రూపొందింది.

సుభాష్‌ను తాత్కాలిక ప్రభుత్వానికి అధినేతగాను, సైన్యాధిపతిగాను గుర్తించి జపాన్ అధికారులు తాము అంతకుపూర్వం వశపరచుకొన్న అండమాన్‌నికోబార్ ద్వీపాలను అతని స్వాధీనంచేశారు. స్వతంత్ర భారతంలో ప్రధమంగా తాత్కాలిక ప్రభుత్వవశంలోకి వచ్చినప్రాంతం ఇదే.

జపాన్‌వారితో కలసి భారతదేశంలోని బ్రిటిష్ సైన్యాలను ఎదుర్కొనే ఉద్దేశంతో సుభాష్ పై సన్నాహాలన్నిటనీ చేసి, దానికి అనుగుణంగా సైనికశిక్షణకు ఏర్పాటులుచేశాడు. కాని ప్రధమంలో జాతీయసైన్యదళాలతోకలసి భారతదేశంపై తన దండయాత్రను సాగించుటకు జపాన్ అంగీకరించలేదు. జపాన్‌వారివలె భారతసైనికులు సౌష్టవంగాను నైపుణ్యంతోను యుద్ధంచేయలేరని, వందలాది సంవత్సరాలుగా బ్రిటిష్‌వారితో సహకరించినవారు వారిపై తిరుగుబాటుచేయుటకు సిద్ధపడరని భావించి తమ సైన్యాలుమాత్రమే దండయాత్రలో పాల్గొన వలసినట్లుగాను, తమ వశంలోకి వచ్చిన ప్రాంతాలను తాత్కాలిక ప్రభుత్వానికి స్వాధీనపరచ వలసినట్లుగాను వారు నిర్ణయించారు. కాని సుభాష్ దీనికి అంగీకరించలేదు. తన దేశ విముక్తికి తన సైన్యాలు పోరాడడంమాత్రమే గౌరవకరమని, జపాన్‌వారు అందులో సహాయపడవచ్చునే గాని, పోరాటమంటూ వారు సాగించడం భారతీయులను చిన్నపుచ్చడమే అని గట్టిగా వాదిం చాడు. కొసకు వారు వారి నిర్ణయాన్ని మార్చుకొని దండయాత్రలో భారతదళాలు పాల్గొనుటకు అంగీకరించారు.

1944 ఫిబ్రవరి 4 న దండయాత్రలో పాల్గొనవలసిన సైనికదళాలు రంగూన్‌ను వదలి, అనేకమైళ్ళు ప్రయాణంచేసి, మార్చి మధ్యన ఒక బ్రిటిష్‌దళాన్ని పూర్తిగా ఓడించి కలాడన్ నదీతీరాన్ని (Kala din) చేరారు. అక్కడినుండి జపాన్‌వారితో కలసి పాలెట్వా అనే స్థావరాన్ని చేరి, అక్కడ ఇంకొక బ్రిటిష్‌సైన్యాన్ని ఓడించి, దానిని వశపరచుకొన్నారు. తర్వాత క్రమక్రమంగా మరికొన్నిమైళ్ళు ప్రయాణంచేసి, భారతదేశాన్ని ప్రవేశించి, మే నెలలో మౌడక్ (Mowdok)అనే స్థావరాన్ని వశపరచుకొన్నారు. ఇక్కడ జరిగిన యుద్ధంలో బ్రిటిష్ సైనికులనేకులు మరణించారు, తక్కినవారు మందుగుండు సామానులను ఆయుధాలను వదలి పలాయితులైనారు. ఈ విధంగా విజయాన్ని సాధించి భారతదేశంలో జాతీయసైన్యం అడుగు పెట్టడం సైనికులకెంతో గర్వకారణమైంది.

కాని మౌడక్‌కు ఆయుధాలను ఆయుధసామాగ్రిని చేరవేయుట కష్టసాధ్యమైంది. అది కారణంగా జపాన్‌సైనికులు దానిని ఖాళీచేయవలసిందిగా నిర్ణయించుకొన్నారు. కాని భారత సైనికులు దానికంగీకరించలేదు. వారు సెప్టంబరువరకూ ఒకపటాళంతో దానిని రక్షించారు. దానికి అధిపత్యం వహించిన సురాజ్‌మల్‌క్రింద పనిచేయుటకు ఒక జపాన్‌పటాళంకూడా అంగీక రించింది. పరాయివారి ఆధిపత్యంలో జపాన్‌సైనికులు పనిచేయడం ఇదే మొదటిసారి. అప్పటికి జపాన్‌వారికి భారతసైనికుల యుద్ధకౌశలంలో విశ్వాసం కుదిరింది.

బర్మాలో ఉత్తరభాగాన ప్రయాణంచేస్తున్న తక్కిన భారతసైనికదళాలు జపాన్ వారితో కలిసి ఆసాంలో నాగప్రాంతానికి ప్రధానపట్టణమైన కొహిమా (Kohima)ను వశ

పరచుకొని అక్కడి కొండపైన జాతీయజండాను ప్రతిష్ఠించారు. ఇంకొకదళం మణిపూరులోని ఇంఫాల్ (Imphal) నగరాన్ని ముట్టడించింది. చుట్టుపక్కలా బ్రిటిష్ గొరిల్లాదళాలు యుద్ధాన్ని సాగిస్తూ వచ్చాయి. వాటిని ఎదుర్కొని గాంధీదళం గొప్పవిజయాన్ని సాధించింది.

కాని అప్పటికి యుద్ధపరిస్థితులు జపాన్‌వారికి ప్రమాదకరంగా పరిణమించాయి. అమెరికన్‌లు పసిఫిక్ సముద్రంలో జపాన్‌వారి వశంలో ఉండిన ప్రదేశాలన్నిటిపై దండెత్తి అనేకప్రదేశాలను వశపరచుకొన్నారు. భారతదేశంలోను బర్మాలోను ఉండిన జపాన్‌వారి విమానదళాలు పసిఫిక్ మహాసముద్ర ప్రాంతానికి వెళ్ళిపోయినవి. విమానదళాలులేక భారత దేశంలోని అమెరికన్‌సైన్యాలను బ్రిటిష్‌సైన్యాలను ఎదుర్కొనడం కష్టసాధ్యమైంది. భారత దేశంలో జూన్ 1944 వరకు వశపరచుకొన్న స్థావరాలకు యుద్ధసామాగ్రిని ఆయుధాలను చేర వేయడం సాధ్యంకాలేదు. అందుచేత ఆ స్థావరాలను ఖాళీచేసి, బర్మాకు వెళ్ళిపోవడం తప్పింది కాదు. యుద్ధపరిస్థితులు ఈ విధంగా మారడంచేత 1944 జూన్ వరకు జాతీయసైనికదళాలు సాధించిన విజయాలు నిరర్థకములైనవి.

1944-45 శీతాకాలంలో బ్రిటిష్‌వారు బర్మాపై దండెత్తగలిగినారు. మే 1945 లో వారు రంగూనును వశపరచుకొనడంతో అక్కడ సమీకరింపబడిన జాతీయ సైనికదళాలన్నీ వారికి లొంగిపోవలసి వచ్చింది. వారందరు తిరిగి ఖైదీలయ్యారు. ఇదివరలో (1942 లో) వారు జపాన్‌వారికి ఖైదీలుకాగా ఇప్పుడు వారు బ్రిటిష్‌వారికి ఖైదీలయ్యారు. ఇంతటితో సుబాష్ బోసు నాయకత్వంలో సాగిన భారత స్వాతంత్ర్య పోరాటం ముగిసింది.

కాని అప్పటికికూడా సుబాష్ నిరాశచెందలేదు. తన అనుచరులు కొందరితో టోకియోకివెళ్ళి, జపాన్‌వారి సహాయాన్ని సంపాదించదలచాడు. అతికష్టంమీద సైగాన్‌చేరి, ఒక జపాన్ విమానంలో తానూ ఇంకొక భారతీయుడూ టోకియోకు ప్రయాణం సాగించి ఆగస్టు 18 న ఫార్మోసా ద్వీపంలోని తైపేను (Taipei) చేరారు. అక్కడనుంచి రాత్రి 14-30 గంటలకు విమానం బయలుదేరింది. కాని వెంటనే అది మంటలపాలై కూలిపోయింది. సగం కాలిన శరీరంతో సుభాష్ బయటపడినాడు. వెంటనే ఆయనను ఆసుపత్రిలో చేర్చారు. కాని లాభంలేక పోయింది. ఆసుపత్రిలోనే ఆయన మరణించాడు. అధికారులు మృతదేహానికి దహన క్రియలు జరిపారు. కాని ఆయన మరణించలేదని, మంచూరియాలోని రషియన్‌లు ఆయనను వశపరచుకొని, ఆయన జర్మన్ పక్షపాతి కావడంచేత ఖైదీగా సైబీరియాకు పంపారని, ఇప్పటికి కూడా సజీవిగా ఉన్నాడని ఒక కట్టుకథ ప్రచారంలోకి వచ్చింది. స్వరాజ్యం లభించిన తర్వాత జాతీయప్రభుత్వం ఈ ఉదంతంలోని సత్యాసత్యాలను నిర్ణయించుటకు ఒక కమిటీని నియమిం చింది. కమిటీలోని అధికసంఖ్యాకులు ఆయన మరణించినట్లు నిర్ధారణ చేసినా కొందరు దీనితో ఏకీభవించలేదు. ఇప్పటికికూడా దీనిని గురించి వాదోపవాదాలు జరుగుతూనే ఉన్నవి.

ఆయన మరణాన్ని గురించి వాదోపవాదాలు జరుగుతూఉన్నా భారతస్వాతంత్ర్యో ద్యమ చరిత్రలో ఆయనయొక్కయు, ఆయన నిర్మాణంచేసిన భారతజాతీయ సైన్యంయొక్కయు పాత్ర ఘనమైనదని అందరు అంగీకరిస్తున్నారు. ఆయన దేశాభిమానం, నిర్మాణశక్తి, ధైర్య సాహసాలు, అందరి ప్రశంసలకు పాత్రములైనవి. స్వాతంత్ర్య యోధులలో ఆయన అగ్ర స్థాయికి చెందిన వాడనుటలో ఏలాటి సందేహంలేదు.

ఆయన సాగించిన పోరాటం పూర్తిగా విఫలమైనట్లు భావించరాదు. భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రధానంచేసి బ్రిటిష్‌వారు వెళ్ళిపోవుటకు అది ఒక ప్రధానకారణమైంది. ఈ సందర్భంలో రెండుమూడు విషయాలు గుర్తించడం అవసరం.

(1) 1920 నుండి గాంధీ నాయకత్వంలో సాగిన స్వాతంత్ర్య సమరం అహింసా సూత్రానికి కట్టుబడి సాగింది. అందుచేత దానిని అణచడం బ్రిటిష్‌వారికి సులభ సాధ్యమైంది. క్విట్ ఇండియా ఉద్యమంతో ఒక విధంగా గాంధీ యుగం ముగిసింది. అహింసా విధానంపట్ల ప్రజలకు విశ్వాసం తగ్గింది. దౌర్జన్యసాధనాన్ని వినియోగిస్తేనేగాని బ్రిటిష్‌వారు లొంగరనే భావం వ్యాపించింది. బోసు సాయుధపోరాటాన్ని సాగించడంతో ఈ భావం బలబడింది. ప్రజలు ఈలాటి పోరాటానికి సిద్ధపడిన పక్షంలో వారిని అణచడం కష్టసాధ్యమనే భావం బ్రిటిష్‌వారిలో బలపడింది. 1946-47 లో వారు దేశాననుండి వెళ్ళిపోవడంలో ఇది గొప్ప ప్రభావాన్ని వహించింది.

(2) రెండువందల సంవత్సరాలుగా వారి సైన్యంలో చేరిన సిపాయీల ప్రభుభక్తి వారి పరిపాలనకు ఆధారంగా ఉండినది. సిపాయీలు ఏలాటి దేశాభిమానంలేనివారు. సైన్యంలో వారు చేరినప్పుడు చేసిన రాజభక్తి ప్రమాణానికి కట్టుబడి ప్రవర్తిస్తూ వచ్చారు. కాని ఈ ప్రమాణానికి విరుద్ధంగా, 40.000 సిపాయీలు బోసు నిర్మాణంచేసిన జాతీయ సైన్యంలోచేరి, దేశాభిమానపూరితులై దేశస్వాతంత్ర్యానికై బ్రిటిష్‌వారితో యుద్ధాన్ని సాగించారు. సిపాయీల రాజభక్తిని ఆధారంచేసుకొని భారతదేశాన్ని పాలించడం భవిష్యత్తులో సాధ్యంకాదనే నిర్ణయానికి బ్రిటిష్‌వారు వచ్చారు. సిపాయీలకు బదులుగా బ్రిటిష్ సైనికులతోకూడిన సైన్యాన్ని నిర్మాణంచేసి భారతదేశాన్ని పాలించడం తమ తలకుమించినపని అని వారు గ్రహించారు. అది భరింపరాని ఖర్చుతో కూడుకొన్నట్టిది. అందుచేత యుద్ధానంతరం భారతదేశాననుండి వెళ్ళిపోవడమే ప్రాజ్ఞత అనే నిర్ణయానికివచ్చారు. ఈ నిర్ణయానికి ఇతర కారణాలుకూడా ఉండినా సిపాయీల వైఖరిలో మార్పు రావడం ఒక ప్రధానకారణమనుటలో అతిశయోక్తి లేదు.

(3) 1945 లో బర్మాను వశపరచుకొనుటకు బ్రిటిష్‌వారు సిపాయీలతో కూడిన తమ సైన్యాన్ని పంపినారు. వారు జాతీయ సైనికదళాలను ఓడించి, వారిని ఖైదీలుగా పట్టుకొన్నారు. కాని వారుకూడా జాతీయ సైన్యంపట్ల సానుభూతిగలవారై వారి దేశాభిమానాన్ని ప్రశంసించారు. సిపాయీల ప్రభుభక్తి సందేహాస్పదమైనట్టిదని అధికారులు దీనిమూలంగా కూడా గ్రహించారు.

(4) 1946లో భారతజాతీయ సైన్యంపై ఆధిపత్యం వహించిన ఒక హిందూసేనానిని, ఒక ముస్లింసేనానిని, ఒక శిక్కు సేనానిని సైనిక చట్టంక్రింద ప్రభుత్వం ఢిల్లీలోని ఎర్రకోటలో విచారణ చేసింది. సైన్యంలో చేరినప్పుడు వారు తీసుకొన్న రాజభక్తి ప్రమాణానికి విరుద్ధంగా బోసు సైన్యంలోచేరి రాజద్రోహానికి పాల్పడినారనే నేరం వారిపై ఆరోపణ చేయబడింది. కాని విచారణకాలంలో దేశంలోని ప్రజలు సేనానుల పట్లను జాతీయ సైన్యం పట్లను కనీ వినీ ఎరుగనంతటి ఆదరాభిమానాలను ప్రదర్శించి వారి దేశాభిమానాన్ని ప్రశంసిస్తూ బహిరంగసభలు జరిపారు. విచారణలో వారి సహాయార్థం ఉదారంగా విరాళాలను ఇచ్చారు. సప్రూ, భూలబాయ్ దేశాయి, నెహ్రూ కోర్టులో వారిపక్షాన వాదించారు. ముస్లింలీగువారుకూడా వారి దేశభక్తిని ప్రశం

పించారు. దేశవ్యాప్తమైన ఈ ప్రశంసలు ప్రభుత్వానికి ఒక కనువిప్పుగా పని చేసింది. 1857-58 లో ప్రభుత్వంపై తిరుగుబాటుచేసిన సిపాయీల ప్రవర్తనను దేశంలోని విద్యార్థులందరు, ఖండించారు. 1946 లో విద్యార్థులందరు సిపాయీల తిరుగుబాటును ప్రశంసించారు. ప్రజలలో ప్రభుత్వంపట్ల వైఖరి ఏ విధంగా మారిందో అధికారులు గ్రహించారు. ఈ పరిస్థితులలో సిపాయీల ప్రభుభక్తిని ఆధారం చేసుకొని దేశాన్ని పాలించడం సాధ్యంకాదనే భావం బల పడింది.

ఈ విధంగా బోసు సాగించిన సాయుధపోరాటం బ్రిటిష్‌వారి వైఖరిలో గొప్ప మార్పు తెచ్చింది. ఆ మార్పు మూలంగా వారు 1947 లో దేశాననుండి వెళ్ళిపోవడం జరిగింది. స్వాతంత్ర్యోద్యమం ఫలప్రదం కావడంలో బోసు సాగించిన పోరాటం ఘనమైన పాత్రను వహించింది.

చదువదగిన గ్రంథాలు :

Bhavan: Vol. xi
Tarachand : Vol. iv
R. C. Majumdar: History of the Freedom Movement Vol. iii
V. P. Menon: Transfer of Power

# అధ్యాయము-16

## సంప్రతింపులకాండ - యుద్ధకాలంలో సంప్రతింపులు

బ్రిటిష్ పరిపాలనను తొలగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు ప్రజలు 1905 తర్వాత సమరాన్ని సాగించారు. 1919లో గాంధీ నాయకుడైన తర్వాత అది తీవ్రరూపం ధరించింది. కాని క్విట్ ఇండియా ఉద్యమంతో సమరయుగం ముగిసింది. అటు తర్వాత సంప్రతింపులద్వారా స్వాతంత్ర్య సమస్యను పరిష్కరించుటకు అవకాశం ఏర్పడింది. 1944 లో సంప్రతింపులకాండ ప్రారంభమైంది. అది యుద్ధం ముగియుటకు ముందు ఒక దశలోను, యుద్ధం ముగిసిన తర్వాత ఇంకొక దశలోను సాగింది. వీటి ఫలితంగా 1947 ఆగస్టు 15న దేశాననుండి బ్రిటిష్‌వారు వెళ్ళిపోవడమూ, దేశానికి స్వాతంత్ర్యం లభించడమూ జరిగింది. 1944లో సంప్రతింపులు ప్రారంభమైనా అవి వెంటనే ఫలప్రదంకాలేదు. అవి ఫలప్రద మగుటకు మూడుసంవత్సరాలు పట్టినవి.

స్వాతంత్ర్యాన్ని సంపాదించడంలో రెండు సమస్యలు ఏర్పడినవి. వాటిలో మొదటిది బ్రిటిష్‌వారి అధికారాన్ని తొలగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించడం. రెండవది దేశ సమైక్య తను రక్షించడం. వీటిలో మొదటిది మాత్రమే ప్రజల ఆశయాలకు అనుగుణంగా పరిష్కార మైంది. రెండవదానికి పరిష్కారం కుదరక, దేశ విభజన అనివార్యమై 1947 లో ఒక స్వతంత్ర రాజ్యానికి బదులు రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినవి. ఈ రెండు పరిణామాలకు సంబంధిం చిన సంప్రతింపుల గురించి మనం ఇప్పుడు తెలుసుకొనవలసి ఉన్నది.

## 1

జైలులో గాంధీ ఆరోగ్యం పూర్తి దెబ్బతినిన కారణంగా 1944 మే 6 న ఏలాటి షరత్తులను విధించక ప్రభుత్వం ఆయనను విడుదల చేసింది. ఆరోగ్యాన్ని కోలుకొనేవరకు రాజకీయాలలో ప్రవేశించరాదనీ, కాంగ్రెసు నాయకులందరు నిర్బంధంలో ఉన్నప్పుడు వారితో సంప్రతించక ఏలాటి నిర్ణయాలను తీసుకొనడం అనుచితమనీ ఆయన భావించాడు. కాని రాజకీయాలలో ఏర్పడిన ప్రతిష్ఠంభన మూలంగాను, క్షామమూలంగాను, యుద్ధం సాగించడంలో ప్రభుత్వం అనుసరించిన విధానం మూలంగాను లక్షలాది ప్రజలు మృతిచెందడం, లక్షలాది ప్రజలు బాధలు అనుభవించడం ఆయన ఆందోళనకు కారణమైంది. ఈ పరిస్థితులను మార్చుట గురించి ఆయన ఆలోచించ సాగాడు.

ఈ విధంగా ఆయన ఆందోళనపడుచుండగా బ్రిటన్‌లోని న్యూస్‌క్రానికల్ (News chronicle) అనేప్రఖ్యాత పత్రికా విలేఖరి గెల్డర్ (Gelder) జూలై మొదటి వారంలో ఆయ నను కలుసుకొని ప్రతిష్ఠంభన తొలగుటకు ఆయన చేయదలచిన సూచనలను వివరించవలసిందిగా కోరాడు. ఆ కోరిక ననుసరించి ఆయన కొన్ని సూచనలను చేశాడు. వాటిని ఆ విలేఖరి పత్రిక

లలో ప్రకటించాడు. అవి ప్రభుత్వంపై ఏలాటి ప్రభావాన్ని వహించకపోయినా అన్ని రాజకీయ పార్టీలవారు వాటిని గురించి ఆలోచించ సాగారు.

ఈ పరిస్థితులలో ఆయన జూలై 27న వైస్రాయికి వాటిని గురించి ఒక లేఖవ్రాసి, వాటిని ఆధారం చేసుకొని తనతో చర్చలను జరుపుటకు అంగీకరించ వలసిందిగా కోరాడు. ఆ లేఖలోని అంశాలు ఈ క్రింది విధంగా ఉండినవి.

(1) వెంటనే దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తూ ప్రభుత్వం ఒక ప్రకటనను చేయవలెను.

(2) స్వాతంత్ర్యాన్ని ఆచరణ సాధ్యం చేయడంలో కొంత కాలయాపన జరిగినా వెంటనే శాసనసభకు బాధ్యత వహించిన ఒక జాతీయ ప్రభుత్వాన్ని కేంద్రంలో స్థాపించవలెను.

(3) యుద్ధం ముగిసేవరకు ఈ ప్రభుత్వం యుద్ధానికి దేశరక్షణకు సంబంధించిన కార్యక్రమాలలో ఏలాట జోక్యం కలిగించుకొనదు. వాటిని వైస్రాయి, సైన్యాధిపతి వారి యిష్టానుసారం సాగించవచ్చు. జాతీయ ప్రభుత్వం తక్కిన విషయాల గురించి మాత్రమే అధికారం వహిస్తుంది.

(4) యుద్ధ కార్యక్రమాల ఖర్చులన్నిటిని బ్రిటన్ భరించవలెను.

(5) ఈ సూచనలకు బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిన పక్షంలో 1942 ఆగస్టు 8 న అఖిలభారత కాంగ్రెసు కమిటీ సంకల్పించిన శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించు కొనవలసినదిగాను, యుద్ధ కార్యక్రమము లన్నిటిలో ప్రభుత్వానికి కాంగ్రెసు సహాయ పడవలసినదిగాను తాను కాంగ్రెసు కార్య నిర్వాహక కమిటీకి సలహా ఇచ్చుటకు సిద్ధంగా ఉన్నట్లు తెలియపరచాడు.

గాంధీ ఉత్తరంలోని (3), (5) సూచనల దృష్ట్యా ఆయనతో సంప్రతింపులు సాగించుటకు వైస్రాయి సుముఖుడుగా ఉండగలడని ఆయన భావించాడు. కాని వైస్రాయి సంప్రతింపులకు తగిన సమయం రాలేదని ఒక ప్రత్యుత్తరం వ్రాస్తూ అందులో ఈ క్రింది అభిప్రాయాలను వ్యక్తం చేశాడు.

(1) మీ ఉత్తరంలోని సూచనలు ప్రభుత్వానికి ఆమోదయోగ్యం కావు.

(2) యుద్ధానంతరం దేశంలోని అన్ని వర్గాల అంగీకారాన్ని పొందిన రాజ్యాంగాన్ని ప్రజా ప్రతినిధులు తయారు చేసిన పక్షంలోను, బ్రిటిష్ ప్రభుత్వం వాంఛించే ఒడంబడిక పట్ల వారు సుముఖులుగా ఉన్న పక్షంలోను, మీరు కోరిన సంపూర్ణ స్వాతంత్ర్యం సాధ్యమౌతుంది. లేని పక్షంలో అది సాధ్యం కాజాలదు.

(3) దేశంలో అల్ప సంఖ్యాకులైన మత వర్గాలు, అస్పృశ్యులు, సంస్థానాధీశులు మొదలైన వారి రక్షణార్థం ప్రభుత్వం కొన్ని హామీలు ఇచ్చి ఉన్నది. యుద్ధానంతరం ఏర్పడే రాజ్యాంగ పరిషత్తు ఈ హామీలను చెల్లించుటకు సిద్ధంగా ఉన్నట్లు ప్రభుత్వానికి విశ్వాసం కలిగిన తర్వాతనే సంపూర్ణ స్వాతంత్ర్యం క్రియారూపం ధరిస్తుంది.

(4) యుద్ధకాలంలో మీరు సూచించిన జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించడం సాధ్యం కాదు. యుద్ధకాలంలో 1919 చట్టప్రకారం పరిపాలన జరగవలసి ఉన్నది. యుద్ధానంతరం

కూడా, అన్ని వర్గాలు ఆమోదించిన ప్రభుత్వం ఏర్పడే వరకూ ఈలాటి పరిపాలనే జరుగుతుంది.

(5) యుద్ధం ముగిసినతర్వాత హిందువులు, ముస్లింలు ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారు 1935 చట్టం క్రింద ఒక తాత్కాలిక ప్రభుత్వంలో (Transitional Government) పాల్గొనుటకు అంగీకరించిన పక్షంలో ఆలాటి ప్రభుత్వాన్ని అప్పట్లో స్థాపించే అవకాశం ఉంటుంది. కాని ఆ ప్రభుత్వం సౌష్టవంగా పని చేయుటకు అన్ని వర్గాలవారిలో రాజ్యాంగ పరిషత్తు ఏ విధంగా నిర్మాణం కావలెనో దానిని గురించి ఏకీభావం అవసరం.

(6) ఈ పరిస్థితులలో ప్రస్తుతం మీరు సూచించిన విషయాల గురించి మీతో సంప్రతింపులు జరపడం ప్రయోజనకారి కాజాలదు.

ఈ ప్రత్యుత్తరం యుద్ధకాలంలోనే గాక యుద్ధానంతరం కూడా శాసనసభకు బాధ్యత వహించిన జాతీయ ప్రభుత్వ నిర్మాణం వైస్రాయికి గాని బ్రిటిష్ ప్రభుత్వానికిగాని ఇష్టం లేదని స్పష్టం చేసింది. ఇంతేగాక రాజ్యాంగ పరిషత్తు నిర్మాణ విధానానికి అది రూపొందించే రాజ్యాంగానికి అన్ని వర్గాల ఆమోదం అవసరమని కూడా తెలియజేసింది. 1937 తర్వాత ముస్లిం రాజకీయాల పరిణామ ఫలితంగా ఏ విషయంలో కూడా జిన్నా నాయకత్వంలోని ముస్లింలీగు కాంగ్రెసుతో ఏకీభవించజాలదని ఏర్పడింది. ఈ రెండు సంస్థలమధ్య విభేదాలను పెంచుటకు సయ్యద్ మహమ్మద్‌ఖాన్ కాలాననుండి బ్రిటిష్ ప్రభుత్వం తన శక్తినంతను వినియోగించింది. ఈ పరిస్థితులలో హిందువులు ముస్లింల మధ్య ఏకాభిప్రాయం కుదిరినప్పుడే రాజ్యాంగ పరిషత్తు నిర్మాణం కాగలదని, అది రూపొందించే రాజ్యాంగం ఆచరణసాధ్యం కాగలదని విధించడం ఏనాటికీ దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించజాలదని చెప్పడమే. ఏ దేశంలో గాని ఏ కాలంలో గాని అన్ని వర్గాలు ఆమోదించిన రాజ్యాంగం నిర్మాణం కాలేదు. ఆలాటి రాజ్యాంగం భారతదేశంలో ఏర్పడవలెనని, అది ఏర్పడిన తర్వాతనే బ్రిటిష్‌వారు వారి పరిపాలనాధికారాన్ని వదలుకొనడం జరుగుతుందని అనడం సర్వదా శాశ్వతంగా బ్రిటిష్ పరిపాలనకు దేశం లోబడి ఉండడం తప్పదని చెప్పడం గాక ఇంకొకటి కాదు. ఈలాటి భావం అధికారులలో నాటుకొనిన కారణం చేతనే గాంధీతో సంప్రతింపులు సాగించడం వైస్రాయికి అంగీకారం కాలేదు. రాజకీయ ప్రతిష్టంభనను తొలగించుటకు గాంధీ చేసిన ప్రయత్నం ఈ విధంగా ఫలప్రదం కాలేక పోయినది. కాని బ్రిటిష్‌వారి మనోవైఖరి ఏలాటిదో ఆ ప్రయత్నం మూలాన స్పష్టపడింది. యుద్ధకాలంలో గాని యుద్ధానంతరం గాని తమ పరిపాలనాధికారాన్ని వదలుకొనుట బ్రిటిష్‌వారికి ఇష్టం లేదని ఇంకొకమారు రుజువైంది.

## 2

వైస్రాయి వేవెల్‌తో సంప్రతింపుల ప్రయత్నం విఫలమైన తర్వాత హిందువులు ముస్లింలమధ్య ఏకాభిప్రాయం కుదిరినగాని బ్రిటిష్ ప్రభుత్వం దాని లక్ష్యాలను విధానాలను మార్చుకొన జాలదని, ఆలాటి ఏకాభిప్రాయం కుదురుటకు జిన్నాతో సంప్రతింపులు సాగించడం అవసరమనే నిర్ణయానికి గాంధీ వచ్చినాడు. ఇందుకుగాను జిన్నాతో సెప్టంబరు 9 నుండి 27 వరకు చర్చలు సాగించారు. కాని వారిమధ్య ఏకాభిప్రాయం ఏర్పడలేదు.

జిన్నాయొక్క ప్రధాన లక్ష్యం పాకిస్థాన్ నిర్మాణమని, దానికి అంగీకరించిన పక్షంలోనే అతడు ఇతర విషయాల గురించి ఏపైనా ఒక రాజీకి వచ్చే అవకాశం ఉన్నదని గాంధీకి తెలుసు. దేశ సమైక్యత, దేశ స్వాతంత్ర్య సంపాదనము కాంగ్రెసు లక్ష్యాలు. జిన్నా లక్ష్యం వీటికి భిన్నమైనట్టిది. కాని భిన్న లక్ష్యాలమధ్య ఒక సమన్వయం కుదర్చడం సాధ్యమనే సంకల్పంతో గాంధీ జిన్నాతో సంప్రతింపులు సాగించాడు. గాంధీ ఉద్దేశించిన సమన్వయం జిన్నాకు ఆమోదయోగ్యం కాలేదు. అందుచేత ఉభయ నాయకులమధ్య సాగిన సంప్రతింపులు ఫలప్రదం కాలేక పోయినవి.

సంప్రతింపులు ప్రారంభమగుటకు ముందు 1943 లో శ్రీ రాజగోపాలాచారి ఒక సమన్వయ పథకాన్ని (Formula) తయారుచేసి గాంధీకి సమర్పించాడు. ఇందులోని ప్రతిపాదనలు సముచితములైనట్లు గాంధీ భావించి, వాటిని ఆధారం చేసుకొని జిన్నాతో సంప్రతింపులు సాగించాడు. ఆ ప్రతిపాదనలు ఈ క్రింది రూపంలో ఉండినవి.

(1) దేశస్వాతంత్ర్య సంపాదనకై బ్రిటిష్ప్రభుత్వంతో సాగుతున్న సమరంలో కాంగ్రెసుకు ముస్లింలీగు పూర్తి సహకారాన్ని అందజేయవలెను. (దీని అంతరార్థం దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత మాత్రమే పాకిస్థాన్ నిర్మాణం జరగవలెననేది).

(2) దేశంలోని వాయవ్య ఈశాన్యభాగాలలో ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాలుమాత్రమే పాకిస్థాన్‌లో చేరవలెను. తూర్పుపంజాబులో హిందువులు శిక్కులు, పశ్చిమబెంగాలులో హిందువులు అధికసంఖ్యాకులుగా ఉన్న కారణంగా ఈ రెండు ప్రాంతాలు పాకిస్థాన్‌లో చేరరాదనేది ఈ ప్రతివాదనలోని భావం.

(3) ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండే ప్రాంతాలలోకూడా ప్రజలు—ముస్లింలు తదితరులు—వారి ఓటుద్వారా పాకిస్థాన్‌లో చేరుటకు సమ్మతించిన తర్వాతనే ఆ ప్రాంతాలను పాకిస్థాన్‌లో చేర్చవలెను. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ఏలాటి నిర్మాణం జరుగరాదు.

(4) పాకిస్థాన్, హిందూస్థాన్ అనే రాజ్యాలు ఏర్పడిన తర్వాతకూడా దేశరక్షణ, విదేశవ్యాపారము, రవాణాసౌకర్యాలు, సమాచారసౌకర్యాలు మొదలైన విషయాలగురించి రెండు రాజ్యాలు కలిపి కృషిచేయుటకు ఒక ఒడంబడిక జరగవలెను. ఆలాటి ఒడంబడిక జరగని పక్షంలో రెండు రాజ్యాలమధ్య యుద్ధాలు సంభవించేప్రమాదం ఏర్పడగలదు. ఈ భావంతో నాల్గవప్రతిపాదన చేర్చబడింది. ఇంతేగాక దేశసమైక్యత, దేశవిభజనమధ్య సమన్వయం కుదురుటకు ఇది సాధనంగా ఉంటుంది అనేది దీని భావం.

చర్చలకాలంలో పై ప్రతిపాదనలలో కొన్ని మార్పులనుచేసి గాంధీ జిన్నాతో సంప్రతింపులు జరిపాడు. కాని ఈ ప్రతిపాదనలు జిన్నాకు ఆమోదయోగ్యంకాలేదు. ఆమోదయోగ్యం కాకపోవుటకు ఈ క్రిందివి ప్రధానకారణాలని చెప్పవచ్చు.

(1) పాకిస్థాన్ నిర్మాణం మొదటి జరగవలెనని, అటుతర్వాతనే బ్రిటిష్‌వారు వెళ్ళిపోవడం, దేశానికి స్వాతంత్ర్యం లభించడం జరగవలెనని జిన్నా పట్టుపట్టాడు. దేశస్వాతంత్ర్యం లభించిన తర్వాత అధికసంఖ్యాకులైన హిందువులు పాకిస్థాన్‌నిర్మాణానికి అంగీకరించరనే భయసందేహాలు అతనికి కలిగింది. పాకిస్థాన్‌నిర్మాణం అయిన తర్వాత దేశస్వాతంత్ర్యం

సంపాదన విషయంలో ముస్లింలు కాంగ్రెసుతో సహకరించరనే సందేహం గాంధీకి కలిగింది. ఈ కారణంచేత ఉభయులమధ్య రాజీ కుదరలేదు.

(2) పాకిస్థాన్ నిర్మాణానికి అంగీకరించడంతోపాటు హిందువులు ఒక జాతివారని ముస్లింలు ఇంకొక జాతివారనే ద్విజాతి సిద్ధాంతాన్ని అంగీకరించవలసిందిగా జిన్నా గాంధీని కోరాడు. కాని గాంధీ దానికి సమ్మతించలేదు. మతానికి జాతికి ఏలాటి సంబంధం లేదనేది గాంధీ విశ్వాసం. నిన్నటివరకు హిందువుగావున్నవాడు ఈరోజు ముస్లిం మతంలో చేరినంతమాత్రాన అతడు ఇంకొకజాతికి సంబంధించినవాడు కావడం ప్రకృతివిరుద్ధం. పాకిస్థాన్ నిర్మాణం అయిన తర్వాతకూడా నాలుగైదు కోట్ల ముస్లింలు హిందుస్థానంలో ఉండడం తప్పదు. వారందరు ప్రత్యేకజాతికి సంబంధించినవారని భావించడంమూలాన ఉభయ మతవర్గాలమధ్య శాశ్వతంగా ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడే ప్రమాదం ఎంతైనా ఉంటుంది. అందుచేత ద్విజాతి సిద్ధాంతానికి తాను సమ్మతించడం ఎన్నటికీ జరుగదని గాంధీ ఉద్ఘాటించాడు.

(3) పంజాబు బెంగాలు రాష్ట్రాలలో ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండే ప్రాంతాలేగాక, హిందువులు శిక్కులు అధికసంఖ్యాకులుగా ఉండే ప్రాంతాలుకూడా పాకిస్థాన్‌లో చేరవలసిందిగా జిన్నా కోరాడు. ఇది న్యాయవిరుద్ధమని, 1940 లో లాహోరుసమావేశంలో పాకిస్థాన్ నిర్మాణాన్ని గురించి ముస్లింలీగుచేసిన తీర్మానానికి విరుద్ధమని గాంధీ స్పష్టంచేశాడు. కాని హిందూస్థానంలో ముస్లింలు ఉన్నట్లే పాకిస్థానంలో హిందువులు శిక్కులు ఉన్నప్పుడే హిందూస్థానంలోని ముస్లింలపట్ల విచక్షణారహితంగా హిందువులు ప్రవర్తించె దరని జిన్నా వాదించాడు. ఈవాదం గాంధీకి ఆమోదయోగ్యంకాలేదు. ద్విజాతిసిద్ధాంతాన్ని సమర్థించిన జిన్నా, ముస్లింజాతికి సంబంధించని హిందువులు శిక్కులు పాకిస్థాన్‌లో నివశించడం అవసరమని భావించడంలో ఏలాటి ధర్మంగాని న్యాయంగాని లేదు.

(4) ప్రజాభిప్రాయం ఓటుద్వారా తెలిసిన తర్వాతనే పాకిస్థాన్ నిర్మాణం జరగవలె ననే ప్రతిపాదన జిన్నాకు ఆమోదయోగ్యం కాలేదు. ఆనాడు ముస్లింలలో అనేకులకు పాకిస్థాన్ నిర్మాణం ఇష్టంలేదు. అలాటివారు ఆయా ప్రాంతాలలోని ముస్లింలు కానివారితో కలిసి అధిక సంఖ్యలో పాకిస్థాన్ నిర్మాణానికి విరుద్ధంగా ఓటుచేసే ప్రమాదం ఉన్నట్లు జిన్నా భావించాడు. ప్రజల అభిప్రాయంతో నిమిత్తంలేకుండా, నిర్బంధంగా ఆ ప్రాంతాలను పాకిస్థాన్‌లో చేర్చవల సిందిగా జిన్నా పట్టుబట్టాడు. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ప్రవర్తించడం గాంధీకి ఇష్టంలేదు.

(5) పాకిస్థాన్ హిందూస్థాన్ అనే స్వతంత్ర్య రాజ్యాలు ఏర్పడిన తర్వాతకూడా వీటిమధ్య దేశరక్షణ మొదలైన విషయాలలో సంబంధం ఏర్పడడం జిన్నాకు ఆమోదయోగ్యం కాలేదు. ఏలాటి సంబంధం లేనిపక్షంలో రెండు రాజ్యాల మధ్య యుద్ధాలు సంభవించే ప్రమాదం ఉన్నట్లు అతడు గ్రహించలేక పొయ్యాడు.

పై కారణాల మూలంగా గాంధీ జిన్నాతో సాగించిన సంప్రతింపులు ఫలప్రదం కాలేకపోయినవి. కాని గాంధీ పాకిస్థాన్ నిర్మాణావశ్యకతను గుర్తించి దానినిగురించి జిన్నాతో సంప్రతింపులు సాగించడం మూలంగా, ముస్లింవర్గాలలో జిన్నాకుగల పేరు ప్రతిష్ఠలు ఎంతగానో పెరిగినవి. అప్పటినుండి అతడు ముస్లింలకు ఏకైకనాయకు డైనాడు. అతనితో పోటీచేసి నిలబడగల ఇతరనాయకు లెవ్వరూ లేకపోయినారు.

# 3

గాంధీ జిన్నాల మధ్య జరిగిన సంప్రతింపులు విఫలమునై నా రెండు మత వర్గాల మధ్య సామరస్యాన్ని కుదుర్చుట 1945 లో మరికొన్ని ప్రయత్నాలు జరిగినవి. వాటిలో ఒకటి కేంద్రశాసన సభలో కాంగ్రెసుపార్టీకి నాయకుడైన భూలాభాయ్ దేశాయి, ముస్లిం లీగు పార్టీకి నాయకుడైన లియాఖత్ ఆలీఖాన్ కలిసిచేసిన ప్రయత్నం.

1945 బడ్జెట్ సమావేశంలో రెండుపార్టీలు కలిపి ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెటును తిరస్కరించారు. ఆటుతర్వాత ఇద్దరు నాయకులు కలిసి యుద్ధకాలంలో 1935 చట్టంక్రింద ఏర్పడదగిన ఒక జాతీయ ప్రభుత్వ నిర్మాణాన్ని గురించి ఈ క్రింది నిర్ణయానికి వచ్చారు.

(1) ఆ ప్రభుత్వంలో కాంగ్రెసు లీగు ప్రతినిధులు సమాన సంఖ్యలో ఉండవలెను. (ఇది కొంతకాలానుండి జిన్నా కోరిన సమానప్రతిపత్తికి అనుగుణమైనది. కాంగ్రెసు నాయకుడు దీనికి అనుమతించడం లీగు పార్టీవారు ఘనవిజయంగా భావించారు.)

(2) వీరుగాక ఒక శిక్కుల ప్రతినిధి. ఒక షెడ్యూల్డు కులాల ప్రతినిధి.

(3) సైన్యాధిపతి.

సైన్యాధిపతి తప్ప కేంద్ర ప్రభుత్వంలోని తక్కిన సభ్యులందరు భారతీయులుగా ఉండడం గుర్తించదగిన విషయం.

దేశాయి ఈ పథకాన్ని వైస్రాయి వేవల్‌కు చూపగా దానికి గాంధీ జిన్నాల ఆమోదాన్ని సంపాదించవలసిందిగా కోరాడు, గాంధీ దానికి సమ్మతించాడు: రెండు మతవర్గాల మధ్య సామరస్యం కుదరడమే ఆయనవాంఛించింది. కాని జిన్నా దానికి సమ్మతించలేదు. అది కారణంగా ఈ పథకం అమలులోకి రాలేదు. కాని ఇందులోని సూచనలన్నీ వేవల్‌పై గొప్ప ప్రభావాన్ని వహించాయి. తర్వాత అతడు సంకల్పించిన పథకంలో ఈ సూచనలను గ్రహించాడు.

ఇదేకాలంలో సప్రూ మతవర్గాల మధ్య సామరస్యం కుదురుటకు ఇంకొకప్రయత్నం చేసి, ఒక పథకాన్ని తయారుచేయుటకు కొందరి సహాయంతో ఒక కమిటీని నియమించాడు. ఆ కమిటీ కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసు లీగు ప్రతినిధులు సమానసంఖ్యలో ఉండవలెనని, రాజ్యాంగాన్ని రూపొందించుటకు ఉద్దేశింపబడిన రాజ్యాంగ పరిషత్తులో కూడా కాంగ్రెసు లీగు ప్రతినిధులు సమానసంఖ్యలో ఉండవలెనని, పరిషత్తులో తీర్మానాలన్నీ ¾ సభ్యుల ఆమోదంతో చేయబడవలెనని, దేశ విభజన జరుగరాదని, ప్రత్యేక నియోజక వర్గాలు రద్దుకావలెనని సూచించింది. జిన్నాకు ఇవి నచ్చలేదు. అందుచేత అవి ఫలప్రదం కాలేక పోయినవి.

1944-45 లో మతవర్గాల మధ్య సామరస్యాన్ని కుదుర్చుటకు పరిపరి విధానాలను ఆధారం చేసుకొని ప్రముఖులు అనేక ప్రయత్నాలు చేయడం గుర్తించదగిన విషయం. దేశ భవిష్యత్తుకు ఈలాటి సామరస్యం అవసరమని అందరూ భావించారు. జిన్నామాత్రం వీరితో ఏకీభవించలేదు.

# 4

ఈలాటిభావం వైస్రాయి వేవెల్‌కుకూడా కలిగింది. అతడు 1943 అక్టోబరు 20 న పదవీస్వీకారం చేశాడు. అప్పటి నుంచి యుద్ధకాలంలో ఏర్పడిన రాజకీయ ప్రతిష్ఠంభన గురించి,

దేశైక్యతకు భంగంగా జిన్నా ప్రతిపాదించిన పాకిస్థాన్ నిర్మాణాన్ని గురించి తీవ్రంగా ఆలోచించసాగాడు.

అతడు పదవీస్వీకారం చేసిన తర్వాత క్రమక్రమంగా యుద్ధపరిస్థితులు బ్రిటిష్‌వారి దృష్ట్యా మెరుగుపడినవి. రషియాలోను ఉత్తర ఆఫ్రికాలోను హిట్లరు సైన్యాలు పరాజయానికి గురియై వెనుకకు పారిపోవడం తప్పిందికాదు. ఉత్తర ఆఫ్రికాలోని ముసొలినీ సైన్యాలకుకూడా ఇదే గతిపట్టింది. మిత్రమండలి సైన్యాలు ఇటలీలో చాలాభాగాన్ని 1944 ఆక్రమించగలిగినవి. ఉత్తరఫ్రాన్సు తీరాననుండి జర్మనీపై దండెత్తుటకు బ్రిటిష్ అమెరికన్ సైన్యాలు చేసిన సన్నాహాలు ఫలప్రదం కాసాగినవి. ఏషియాలోకూడా జపాన్‌వారి ఓటమి ప్రారంభమైంది. 1944 లో భారతదేశంపై వారు సంకల్పించిన దండయాత్ర విఫలమైంది. బర్మాను ఆగ్నేయ ఏషియాలోని తక్కిన దేశాలను వారు ఖాళీచేయవలసి వచ్చింది.

ఈ విధంగా యుద్ధపరిస్థితులు అనుకూలంగా పరిణమించడం చేత 1939 నుండి దేశంలో ఏర్పడిన రాజకీయ ప్రతిష్ఠంభనను తొలగించడం మూలాన యుద్ధకార్యక్రమాలకు ఏలాటి ప్రమాదం సంభవించదనే భావం వేవెల్‌కు కలిగింది. ఇదిగాక 1944 నాటికి దేశంలోని ఆర్థికపరిస్థితులు చాలావరకు దిగజారిపోవడంకూడా వేవెల్ దృష్టిని ఆకర్షించింది. అప్పటికి ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. ఆహారాది అవసరపదార్థాలకుకూడా కొరత ఏర్పడింది. పన్నులభారాన్ని సామాన్యప్రజలు భరించలేక పోయినారు. బెంగాలువంటి రాష్ట్రాలలో క్షామ పరిస్థితులు ఏర్పడి లక్షలాది జనం మరణించారు. లక్షలాది జనం నిరాశ్రయులైనారు. బర్మా మొదలైన దేశాలనుండి లక్షల సంఖ్యలో కాందిశీకులు పారివచ్చి సమస్త బాధలకు గురి అయినారు. దిగజారుతున్న ఆర్థిక పరిస్థితుల మూలంగా దేశంలో రాజకీయ ఆందోళన సంభవించే ప్రమాదం ఏర్పడింది. ఇది సంభవించుటకు పూర్వమే ఆర్థికపరిస్థితులను చక్కబెట్టవలసిన అవసరాన్ని వేవెల్ గ్రహించాడు.

కాని ఇది విజయవంతంగా సాగుటకు రాజకీయనాయకుల సహకారం అవసరమని అతడు భావించాడు. రాజకీయ ప్రతిష్ఠంభనను తొలగించడం అలాటి సహకారాన్ని సంపాదించుటకు సాధనమనే నిర్ణయానికి అతడు వచ్చినాడు.

ఈ నిర్ణయాన్ని ఆచరణసాధ్యం చేసే ఉద్దేశంతో 1944 అక్టోబరునుండి అతడు బ్రిటన్‌లోని అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. కాంగ్రెసు లీగుల ప్రతినిధులతో కూడిన ప్రభుత్వాన్ని కేంద్రంలో నిర్మాణం చేసిన పక్షంలో రాజకీయ ప్రతిష్ఠంభన తొలగి ఆర్థిక పరిస్థితులను చక్కబెట్టడం సాధ్యం కాగలదనేది అతడు సంకల్పించిన విధానానికి ప్రధాన లక్షణం. దీనిమూలంగా ఇంకొక ప్రయోజనం కూడా లభించగలదని అతడు భావించాడు. అతడు వైస్రాయి కాకపూర్వం భారతదేశ సైన్యానికి అధిపతిగా ఉండినాడు. ఉత్తర ఆఫ్రికాలో యుద్ధంలో పాల్గొన్నాడు. ఈలాటి అనుభవాలను గడించినవాడు కావడంచేత దేశరక్షణ దృష్ట్యా జిన్నా ప్రతిపాదించిన పాకిస్థాన్ నిర్మాణం ప్రమాదకరం అనే భావం కలవాడయ్యాడు. భారత దేశంలో రెండు రాజ్యాలు ఏర్పడడం, సైన్యం రెండుగా చీలిపోవడం వాటిమధ్య విరోధభావం పెరగడం—ఈ పరిణామాలు భారతదేశ రక్షణకు ప్రమాదం కలిగించేటట్టివి అని అతడు భావించాడు. అలాటి ప్రమాదాననుండి దేశాన్ని రక్షించుటకు జిన్నా వైఖరిలో మార్పు రావడం

అవసరమని, కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసు లీగుల ప్రతినిధులు కలిపి కొంతకాలం దేశ పరిపాలనలో భాగస్వాములుగా పనిచేసిన పక్షంలో ఆ అవసరం తీరగలదని కూడా వేవెల్ విశ్వసించాడు.

కాని భారతదేశంలో ఏర్పడిన క్లిష్ట పరిస్థితుల స్వభావాన్ని బ్రిటన్‌లోని అధికారులు గ్రహించలేక పోయినారు. అంతేగాక వాటిని తొలగించుటకు కేంద్రంలో కాంగ్రెసు లీగుల ప్రతినిధులతో కూడిన ప్రభుత్వం సాధనమని వేవెల్ చేసిన ప్రతిపాదన వారికి రుచించలేదు. ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా వారి సమ్మతిని సంపాదించడం సాధ్యం కాదని వేవెల్ భావించి 1945 మార్చిలో బ్రిటన్‌కు వెళ్ళి మూడు నెలలపాటు వారితో ముఖాముఖీ చర్చలు సాగించి తన ప్రతిపాదనకు వారి అర్ధాంగీకారాన్ని సంపాదించి జూన్ 4 న భారత దేశానికి వచ్చి జూన్ 14 న ఒక బహిరంగ ప్రకటనను చేశాడు.

ఈ ప్రకటనలో జూన్ 25 న దేశంలోని ప్రధాన పార్టీల ప్రతినిధుల సమావేశం సిమ్లాలో జరగగలదని, అందులో ఈ క్రింది విషయాలు చర్చలోకి రాగలవని తెలియపరచాడు.

(1) రాజకీయ పురోభివృద్ధికి ఆటంకంగా పరిణమించిన సాంఘిక సమస్యకు (హిందువులు ముస్లింల మధ్య ఏర్పడిన విభేదాలకు) పరిష్కార మార్గము;

(2) ప్రజాభిప్రాయానికి అనుగుణంగా కేంద్రంలో ఒక ప్రభుత్వాన్ని 1935 చట్టం క్రింద పనిచేయుటకు ఏర్పాటు చేయుట. ఆ ప్రభుత్వంలో సైన్యాధిపతి వైస్రాయి తప్ప తక్కిన సభ్యులు భారతీయులుగా ఉంటారు. ఇదిగాక అందులో ముస్లిం సభ్యులు సవర్ణ హిందువుల (Caste Hindus) సభ్యుల సంఖ్యతో సమానంగా ఉంటారు. విదేశ వ్యవహారాల శాఖపై అధికారాన్ని కూడా భారతీయ సభ్యుడే వహిస్తాడు.

(3) యుద్ధాన్ని సాగించడము, దేశాన్ని పాలించడము, భవిష్యత్తులో దేశానికి ఉచితమైన రాజ్యాంగాన్ని ఏ విధంగా రూపొందించడమో నిర్ణయించడము—కేంద్రంలో ఏర్పడే కొత్త ప్రభుత్వం చేయవలసిన ప్రధానములైన పనులు.

ఇదిగాక 1942 ఆగస్టు 9 నుండి నిర్బంధంలో ఉన్న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సభ్యులను వెంటనే విడుదల చేయడం జరుగుతుందని కూడా వైస్రాయి ప్రకటించాడు. దీనిమేరకు జూన్ 15 న వారు విడుదల అయ్యారు. ఇంతకుపూర్వం 1942 ఆగస్టు 8 న అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానాన్ని రద్దు చేసి, క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రారంభించి నందుకు విచారాన్ని తెలియపరచి, దానిని పూర్తిగా ఉపసంహరించుకొనిన పక్షంలోనే నాయకుల విడుదల జరగగలదని ప్రభుత్వం పదేపదే చెప్తూ వచ్చింది. అలాటి షరత్తులలో నిమిత్తం లేకుండా ఇప్పుడు వారిని విడుదల చేయుటకు సిద్ధపడింది. రాజకీయ ప్రతిష్ఠంభనకు వారు కారకులు కారని, ప్రభుత్వం అనుసరించిన దమనవిధానమే దానికి కారణమని వారు ఆనాటికైనా గ్రహించడం గుర్తించదగిన విషయం.

కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ జూన్ 21, 22 లలో సమావేశమై సిమ్లా సమావేశంలో పాల్గొనవలసిందిగా తీర్మానం చేసింది. ముస్లింలీగు కూడా అలాటి తీర్మానాన్నే చేసింది.

జూన్ 25 న సిమ్లాలో సమావేశం ప్రారంభమైంది. వివిధ పార్టీలకు వర్గాలకు చెందిన 21 ప్రతినిధులు అందులో పాల్గొన్నారు.

కేంద్రంలో ఏర్పడవలసిన ప్రభుత్వంలో సభ్యులుగా ఉండదగిన వారి పేర్లను ఎనిమిదికి తగ్గకుండా పండ్రెండుకు మించకుండా తనకు తెలియపరచవలసిందిగా వైస్రాయి కాంగ్రెసు, లీగును వేర్వేరుగా కోరాడు. కాంగ్రెసు దానికి అంగీకరించి ఆ పేర్లను పంపించింది. లీగు తరఫున పేర్లను పంపుటకు జిన్నా నిరాకరించి, వైస్రాయి రెండు షరత్తులకు లోబడవలసిందిగా కోరాడు. వాటిలో మొదటిది ప్రభుత్వంలో చేరే ముస్లింలందరు ముస్లింలీగు సభ్యులుగా ఉండవలెను. కాంగ్రెసు అధ్యక్షుడైన ఆజాద్ కూడా ప్రభుత్వంలో సభ్యుడుగా ఉండరాదనేది దీనిభావం. షరత్తులలో రెండవది ముస్లిం ప్రయోజనాల రక్షణ విషయంలో ప్రభుత్వంలోని అధిక సంఖ్యాకుల (Majority) ఆమోదం ఆచరణలోకి రాగూడదు. అందుకుగాను ప్రత్యేకమైన మరియొక ఏర్పాటు జరుగ వలెను. 1935 చట్టం అల్పసంఖ్యాక వర్గాల ప్రయోజనాలను రక్షించుటకు వైస్రాయికి ప్రత్యేక అధికారాలను కల్పించింది. కొత్త ప్రభుత్వంఏర్పడినతర్వాత వైస్రాయి ఆ ప్రత్యేక అధికారాలను అమలుపరచడనే సందేహం జిన్నాకు కలిగి రెండవ షరత్తును కోరాడు.

కాని ఈ షరత్తులకు వైస్రాయి అంగీకరించలేదు. జిన్నా ఎవరిపేర్లను పంపని కారణంగా వైస్రాయి అర్హులని తనకు తోచిన ముస్లింల పేర్లతోకూడిన జాబితాను తయారు చేసి దానిని జిన్నాకు పంపినాడు. అందులో నలుగురు ముస్లింలీగు సభ్యులు, ఒకడు పంజాబు ముఖ్యమంత్రి ఖిజర్ హయత్‌ఖాన్ ఉండినారు. ముస్లింలీగుకు చెందని ముస్లింలు ప్రభుత్వంలో సభ్యులుగా ఉండడం జిన్నా ఆక్షేపించి వైస్రాయితో సహకరించడం మానుకొన్నాడు.

ఈ విషయంలో జిన్నా మొండిపట్టు పట్టుటకు కారణాలులేకపోలేదు. కాంగ్రెసు ప్రతినిధులతోకూడిన ప్రభుత్వం కేంద్రంలో ఏర్పడడం ఉన్నత ఉద్యోగివర్గానికి చెందిన వారెవ్వరికి ఇష్టంలేదు. వారిలో ఒక ప్రముఖుడు ఆనాడు ప్రభుత్వంలో సభ్యుడుగాఉండి, రహస్యంగా జిన్నాతో సంప్రతింపులు జరిపి, మొండిపట్టు పట్టవలసిందిగా అతనిని ప్రోత్సహించాడు. ఉద్యోగివర్గం తనపక్షాన ఉండడం జిన్నా గ్రహించి వైస్రాయికి లోబడరారనే నిర్ణయానికి వచ్చాడు. బ్రిటన్‌లోని అధికారులుకూడా వైస్రాయి ప్రతిపాదనపట్ల పూర్తి అంగీకారం కలవారుకారని అతడు గ్రహించాడు. ఇదికూడా అతని మొండిపట్టుకు ఇంకొక కారణమైంది.

తాను తయారుచేసిన ముస్లింసభ్యుల జాబితాను జిన్నా నిరాకరించిన విషయాన్ని వైస్రాయి బ్రిటన్‌లోని అధికారులకు తెలియపరచాడు. సిమ్లా సమావేశంలో పాల్గొనిన 21 సభ్యులలో జిన్నా ఒక్కడే వైస్రాయిని ప్రతిఘటించాడు. ఆలాటి పరిస్థితులలో జిన్నా ప్రతిఘటనతో నిమిత్తంలేకుండా వైస్రాయి సంకల్పించిన కేంద్రప్రభుత్వాన్ని నిర్మాణం చేయవలసిందిగా వారు వైస్రాయిని ఆదేశించడం న్యాయం. కాని వారు అలాగుచేయుటకు బదులు సమావేశం విఫలమైనట్లుగా ప్రకటించవలసినదని ఆదేశించారు. జూలై 14 న జరిగిన సమావేశంలో వైస్రాయి ఆలాటి ప్రకటననుచేసి, సమావేశ వైఫల్యానికి తానే బాధ్యుడని తెలియపరిచాడు. బ్రిటన్‌లోని అధికారులు సహకరించని కారణంగా పది నెలలనుండి వైస్రాయి రాజకీయ ప్రతిష్టంభనను తొలగించుటకు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థములైనవి. ఒక జిన్నా తప్ప తక్కిన వారందరు ఆశాభంగాన్ని పొందినారు.

మొదటినుండి బ్రిటన్‌ప్రధాని చర్చిల్ కాన్‌సర్వేటివ్ పక్షానికి చెందిన తదితరులు జిన్నా సహాయంతో కాంగ్రెసుపైన, అది సాగించిన స్వాతంత్ర్యోద్యమంపైన రాళ్ళు రువ్వడమే తమ కర్తవ్యంగా భావించినవారు. అలాటివారికి కాంగ్రెసు ప్రతినిధులతో కూడినట్టిన్నీ, జిన్నాకు ఆమోదయోగ్యం కానట్టిన్నీ ప్రభుత్వం ఏర్పడడం ఎంతమాత్రము అంగీకారయోగ్యం కాకపోవడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీ లేదు. వారు వేవెల్ ప్రతిపాదనను సమర్థించుటకు బదులు జిన్నావైఖరిని సమర్థించడం కాంగ్రెసుపై ఆఖరురాయిని రువ్వడమే. సిమ్లా సమావేశం భగ్నమైన తర్వాత పది రోజులకు బ్రిటన్‌లోని ఎన్నికలు జరిగి, వాటిలో కాన్‌సర్వేటివ్‌పక్షం ఓటమిగాంచింది. చర్చిల్ రాజీనామా చేశాడు. జూలై 26 న అట్లీ ప్రధానిగా లేబర్‌పక్షం అధికారంలోకి వచ్చింది. దీనితో భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఆఖరు అధ్యాయం ప్రారంభమైంది.

కేంద్రంలో కాంగ్రెసు లీగుల ప్రతినిధులతో కూడిన జాతీయప్రభుత్వాన్ని నిర్మాణం చేయుటకు సంకల్పించిన వేవెల్‌తో జిన్నా సహకరించకపోవుటను లీగులోని కొందరు ప్రముఖులు, లీగుకుచెందని ముస్లింనాయకు లనేకులు తీవ్రంగా విమర్శించారు. అతని అభిప్రాయంతో నిమిత్తంలేకుండా వైస్రాయి తాను తలపెట్టిన జాతీయప్రభుత్వాన్ని నిర్మాణంచేసి• పరిపాలనాధికారాన్ని దానికి ఒప్పగించినపక్షంలో జిన్నా తన అభిప్రాయాన్ని మార్చుకొని అందులో ప్రవేశించేవాడని వారు భావించారు. లీగు ప్రతినిధులులేని ప్రభుత్వం ఏర్పడడం కాంగ్రెసుకు పరిపాలనాధికారాన్ని ఒప్పగించడమే అని అతడు గ్రహించి అతడు ప్రభుత్వంలో చేరేవాడని, అది జరిగినపక్షంలో సాంఘికసమస్యకు పరిష్కారం కుదిరిఉండేదని వారు విశ్వసించారు. కాని జిన్నాను ఎదుర్కొనగల ధైర్యం వేవెల్‌కు లేనికారణంగాను, బ్రిటన్‌లోని అధికారులు, భారతదేశంలోని ఉన్నతఉద్యోగులు అతనిని సమర్థించిన కారణంగాను అతని అభిప్రామమే తుదకు చెల్లింది. దానిమూలంగా అతనిపేరు ప్రతిష్ఠలు మరింత బలబడి, ముస్లింలకు అతడు ఏకైకనాయకు డైనాడు. వైస్రాయినికూడా ప్రతిఘటించగల శక్తి అతనికి మాత్రమే ఉన్నట్లును, అతనిని కాదని అధికారంలోకి వచ్చే అవకాశం లేదని తక్కిన ముస్లిం నాయకులు భావించి అందరు అతనికి లోబడిపోయినారు. తాను మొండిపట్టు పట్టినపక్షంలో ప్రభుత్వంకూడా దేశ విభజనకు పాకిస్థాన్ నిర్మాణానికి తప్పక అంగీకరించగలదనే విశ్వాసం అతనికి కలిగింది. అది ఒకటే అతని జీవితలక్ష్యం కావడంచేత కాంగ్రెసుతో ఏలాటి రాజీకి రావలసిన అవసరం లేదనే నిర్ణయానికి వచ్చాడు. ఈ పరిస్థితులను కాంగ్రెసువారుకూడా గ్రహించి పాకిస్థాన్ నిర్మాణవిషయంలో అతనిని ఎదుర్కొనడం నిష్ప్రయోజనమని భావించసాగారు.

వీటి అన్నిటిదృష్ట్యా సిమ్లాసమావేశం ఫలప్రదం కాకపోయినా స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో గొప్ప ప్రాధాన్యాన్ని వహిస్తున్నది. 1947 (అనగా సిమ్లా సమావేశం తర్వాత రెండు సంవత్సరాలు పూర్తికాకముందే) దేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించినా అది దేశ విభజనతో కూడిన స్వాతంత్ర్యంగా రూపొందింది. దీనికి సిమ్లాసమావేశం ఒక ప్రధాన కారణం.

చదువదగిన గ్రంథాలు:

**Bhavan : Vol. xi**
**Tarachand : Vol. iv**
**V. P. Menon : Transfer of Power**
**Azad : India wins freedom**

# అధ్యాయము-17

## సంప్రతింపులకాండ—యుద్ధానంతర సంప్రతింపులు

1945 ఆగస్టు 6, 7 లలో రెండు జపాన్ నగరాలపై అమెరికావారు అణుబాంబులు ప్రయోగించి అపారనష్టాన్ని కలిగించడంతో జపాన్ లోబడిపోయింది. అంతటితో రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. అప్పటికి బ్రిటన్‌లో ఏర్పడిన పరిస్థితుల ఫలితంగా భారతదేశ పరిపాలన పట్ల బ్రిటిష్‌ప్రజల యొక్కయు, ప్రభుత్వంయొక్కయు వైఖరి పూర్తిగా మారింది. భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడమే బ్రిటన్ అనుసరించతగిన విధానమని భావించిన లేబర్‌పక్షానికి అనుకూలంగా జూలైలో జరిగిన ఎన్నికలలో ప్రజలు వోటుచేశారు. సామ్రాజ్య తత్వంపట్ల మొండిపట్టు పట్టిన కాన్సర్వేటివ్ పక్షం ఓడిపోయింది. అట్లీ నాయకత్వాన లేబరు పక్షానికి చెందిన మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది. 1946-47 లో ఈ మంత్రివర్గం కాంగ్రెసు లీగులతో సంప్రతింపులు జరిపి, పరిపాలనాధికారాన్ని వాటికి ఒప్పగించింది. దీనితో 200 సంవత్సరాల బ్రిటిష్ పరిపాలన అంతరించి దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించింది.

18 వ శతాబ్దంలోను 19 వ శతాబ్దపు ప్రథమ భాగంలో బ్రిటిష్‌వారు భారత దేశాన్ని జయించుటకు దేశంలోని పరిస్థితులేగాక యూరపు అమెరికా మొదలైన ఖండాంత రాలలో జరిగిన యుద్ధాలుకూడా కారణమని ఇదివరలో తెలుసుకొన్నాము. అదేవిధముగా 1947లో వారు వారి అధికారాన్ని వదులుకొని దేశానుండి వెళ్ళిపోవుటకు దేశంలో ఏర్పడినపరిస్థితులతో పాటు రెండవ ప్రపంచయుద్ధం మూలంగా బ్రిటన్‌లోను ప్రపంచంలోను ఏర్పడిన పరిస్థితులు కారణములైనవి.

రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటన్ విజయాన్ని సాధించినా అది నామమాత్రమైన విజయమే. యుద్ధంమూలంగా దాని నౌకాబలానికి సైనికబలానికి విమానబలానికి అపారనష్టం కలిగింది. యుద్ధానికిపూర్వం రక్షణబలాల దృష్ట్యా అది ప్రపంచంలో అగ్రస్థానం వహించిన దేశంగా ఉండేది. ఇప్పుడు అది ఆ స్థానాన్ని కోల్పోయి ద్వితీయస్థానానికో, తృతీయస్థానానికో వచ్చింది. సోవియట్ రష్యా, అమెరికాలు మాత్రమే అగ్రరాజ్యాలుగా పరిగణలోకి వచ్చినవి. అమెరికా సహాయం లభించబట్టే బ్రిటన్ విజయాన్ని సాధించగలిగింది. ఇది మొదలు అది అమెరికాకు ఒక ఉపగ్రహంగా మారిపోయింది. యుద్ధంమూలంగా దాని అంగబలాన్నే గాక అర్థ బలాన్నికూడా కోల్పోయింది. యుద్ధానికి ముందు అది ఇతరదేశాలకు రుణాలను ఇచ్చి గొప్ప లాభాలను సంపాదించగల స్థితిలో ఉండేది. యుద్ధకాలంలో అది ఈ రుణాలను వసూలుచేసి ఖర్చు పెట్టుకొనడమే గాక అమెరికానుండి ఇతరదేశాలనుండి రుణాలను తీసుకొనవలసిన స్థితి లోకి వచ్చింది. జర్మన్‌దాడులు ఫలితంగా దాని పరిశ్రమలు నాశనములైనవి. అది పూర్తిగా దివాలా తీసిన కోటీశ్వరుని స్థితిలోకి వచ్చింది. ఈ స్థితిలో తన రక్షణబలాలను పునరుద్ధరించు కొనగలశక్తి దానికి లేకపోయింది. రక్షణబలాలు లేక సామ్రాజ్యాన్ని తనవశంలో ఉంచుకొనడం

సాధ్యంకాదనే సత్యాన్ని ప్రజలు, ప్రభుత్వమూ గ్రహించారు. ఇతరదేశాలపై అధికారాన్ని చలా యించుటకంటే తమదేశాన్ని ఆర్థికంగా పునర్నిర్మాణం చేసి సోషలిస్టు సిద్ధాంతానుసారం ప్రజల స్థితిగతులను చక్కబెట్టడం అధికారులదృష్టిలో ఎక్కువ ప్రాధాన్యాన్ని వహించింది. భారత దేశాన్ని పాలించడం ఒక అనవసరమైన భారాన్ని భరించడమేనని, అది తమశక్తికి మించిన భారమని, దానిని వదలుకోవడమే ప్రాజ్ఞత అనే నిర్ణయానికి అధికారులు, ప్రజలు వచ్చారు. కాంగ్రెసు, లీగులతో వారు సంప్రతింపులు సాగించి, తమ అధికారాన్ని వాటిపరం చేయుటకు ఇది ఒక ప్రధాన కారణం.

దీనితోపాటు భారతదేశంలో 20 వ శతాబ్దంలో ఏర్పడిన పరిస్థితులుకూడా వారిని ఈ నిర్ణయానికి వచ్చేటట్లు చేసినవి. 20 వ శతాబ్దంలోని భారతీయులు 18 వ శతాబ్దంలోని భారతీయుల వంటివారు కారు. 18 వ శతాబ్దంలో వారిలో రాజకీయ చైతన్యం చాలా తక్కువస్థాయిలో ఉండేది. దేశాన్ని ఎవరు పాలించినా ఒకటే అనేది వారి మనోవైఖరిగా ఉండేది. ఇదిగాక వారిలో జాతీయభావం ఉండినట్టిది కాదు. అందుచేత వారిని జయించి పాలించడం బ్రిటిష్‌వారికి సులభసాధ్యమైంది. 20 వ శతాబ్దంలోని భారతీయులు ఈలాగు కాక జాతీయభావం కలవారై దేశం తమది అని, దానిని పాలించే హక్కు తమదని పరాయి పరిపాలనను తొలగించడం తమ కర్తవ్యమని భావించి 1905 తర్వాత అనేక స్వాతంత్ర్యోద్యమాలను సాగించారు. ఇవి ఫలప్రదం కాకపోయినా స్వాతంత్ర్యాన్ని సంపాదించేవరకు ఈలాటి ఉద్యమాలను సాగించ డంపట్ల ప్రజలు పట్టుదలగలవా రయ్యారు. ఈలాటి జాతీయభావం కలవారిని అణచడానికి కావలసినబలం తమకులేదని బ్రిటిష్‌వారు నిర్ణయించుకోనడం తప్పింది కాదు.

ఇంతేగాక దేశాన్ని జయించి వశపరచుకొని పాలించడంలో 18 వ శతాబ్దాన నుండి భారతీయ సిపాయీలతో కూడిన సైన్యాన్ని ప్రధాన సాధనంగాబ్రిటిష్‌వారు వినియోగించారు. భారతీయ సైనికులు పరాయి ప్రభుత్వంపట్ల భక్తి విశ్వాసాలు కలవారై దేశాన్ని జయించడంలోను, 1905 తర్వాత ప్రజలు లేవదీసిన స్వాతంత్ర్యోద్యమాలను అణచ డంలోను పరాయి పరిపాలకులకు గొప్ప సహాయం చేశారు. కాని సుభాష్ చంద్రబోసు నిర్మాణంచేసిన భారత జాతీయ సైన్యంయొక్క చర్యలమూలంగా బ్రిటిష్‌వారు ఒక గుణ పాఠాన్ని నేర్చుకొన్నారు. సిపాయీలలో కూడా దేశాభిమానం బలపడినదని, ఆలాటి వారితో కూడిన సైన్యాన్ని ఆధారం చేసుకొని ప్రజల స్వాతంత్ర్యోద్యమాలను అణచి దేశాన్ని పాలిం చడం సాధ్యంకాదని వారు గ్రహించారు. సిపాయీల స్థానంలో బ్రిటన్‌నుండి బ్రిటిష్ సైనిక దళాలను భారతదేశానికి తరలించి ప్రజల ఉద్యమాలను అణచుటతప్ప వారికి సాధనాంతరం లేక పోయింది. కాని ఆలాటి సైనికదళాలను తరలించడం వారిశక్తికి మించినట్టిదని వారు గ్రహిం చారు. ప్రజలలో జాతీయభావం బలపడడంతోపాటు సిపాయీలలో దేశాభిమానం కలగడం కూడా బ్రిటిష్‌వారు పరిపాలనాధికారాన్ని వదలుకొనుటకు ఒక ప్రధానకారణమని గ్రహించడం అవసరం.

ఈ సందర్భంలో ఇంకొక విషయంకూడా గుర్తించవలసి ఉన్నది. దేశంలో తమ అధి కారాన్ని స్థిరపరచుకొనుటకు బ్రిటిష్‌వారు మొదటినుండి "చీలించి పాలించు" అనే భేదో పాయాన్ని అనుసరించారు. 1870 నుండి వారు ముస్లింలను సర్వవిధాలా హిందువులనుండి

చీలదీశారు. తుదకు జిన్నానాయకత్వంలోని ముస్లింలీగువారు పాకిస్థాన్ నిర్మాణాన్ని తమ ఏకైక లక్ష్యంగా పెట్టుకొనేటట్లు చేశారు. కాని దేశంమొత్తం జనాభాలో 24 శాతం మాత్రమే అయిన ముస్లింల సహాయంతో తక్కిన 76 శాతం ప్రజలను అణచివేయడం సాధ్యం కాజాలదని వారు క్రమక్రమంగా నేర్చుకొనడం తప్పింది కాదు. ప్రజలు సాగించిన స్వాతంత్ర్యోద్యమాలలో ఒక 1920-22 ఉద్యమంలో మాత్రమే ఖిలాఫత్ సమస్య కారణంగా ముస్లింలు పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో గాని, 1931-34 శాసనోల్లంఘన ఉద్యమంలో గాని, క్విట్ ఇండియా ఉద్యమంలో గాని వారు ఎక్కువగా పాల్గొనలేదు. వారు పాల్గొనకపోయినా తక్కిన ప్రజలు ఉద్యమాలను సాగించి ప్రభుత్వానికి అపారనష్టాన్ని కలిగించారు. ముస్లింలు సహకరించినా సహకరించకపోయినా ప్రజలు తమ ఉద్యమాలను సాగించడం బ్రిటిష్‌వారికి కనువిప్పుగా పనిచేపింది. వారి భేదోపాయం స్వాతంత్ర్యోద్యమంపై గొప్ప ప్రభావాన్ని వహించజాలదని వారు గ్రహించారు. ఇంతేకాదు, ముస్లింలుకూడా పాకిస్థాన్ అనే స్వతంత్ర రాజ్యాన్ని కోరేవా రయ్యారు. బ్రిటిష్ పరిపాలన శాశ్వతంగా ఉండవలెననే సయ్యద్ మహమ్మద్ ఖాన్‌వంటి వారి వాదాన్ని వదలుకొన్నారు. అందుచేత 1945 నాటికి తమ భేదోపాయం తమ అధికారాన్ని సుస్థిరం చేయజాలదని బ్రిటిష్‌వారు గ్రహించారు.

ముస్లింలను తక్కినవారినుండి చీలదీసినట్లే సంస్థానాధీశులను కూడ ప్రజలనుండి జాతీయోద్యమాననుండి చీలదీయడం బ్రిటిష్‌వారి పరిపాలన విధానానికి ఒక ప్రధాన లక్షణంగా పరిణమించింది. కాని ఈ విధానంకూడా ఫలప్రదం కాజాలని పరిస్థితులు ఏర్పడసాగినవి. సంస్థానాలలోని ప్రజలలో జాతీయభావం, నిరంకుశాధికారంపట్ల ద్వేషం, ప్రజాస్వామికం పట్ల అభిమానం బలపడినవి. ఈ పరిస్థితులలో సంస్థానాధీశుల సహకారాన్ని ఆధారం చేసుకొని రాష్ట్రాలను పాలించడం కష్టసాధ్యమని బ్రిటిష్‌వారు గ్రహించారు.

పై వివరణ మూలంగా 1945 జూలై లో బ్రిటన్‌లో ఏర్పడిన లేబరు ప్రభుత్వం భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసిందిగా నిర్ణయించుటకు కారణం బ్రిటన్ దాని అంగబలాన్ని అర్థబలాన్ని కోల్పోవడమే గాక భారతదేశంలోని ప్రజలలో బలపడిన జాతీయభావం, వారు లేవదీసిన స్వాతంత్రోద్యమాలు, సిపాయిల భక్తివిశ్వాసాల పట్ల బ్రిటిష్ వారికి కలిగిన సందేహాలు, వారు అనుసరించిన భేదోపాయం స్వాతంత్ర్యోద్యమాన్ని అణచుటలో ఫలప్రదం కాజాలదనే భావం—ఇవి అన్నికూడా కారణాలని స్పష్టం అవుతున్నది. ఇన్ని కారణాల ప్రభావంచేత వారు 1946-47 లో కాంగ్రెసు లీగులతో సంప్రతింపులు జరిపి తమ అధికారాన్ని వదలుకొన్నారు. ఇప్పుడు మనం ఈ సంప్రతింపుల చరిత్రతెలుసుకొనవలసి ఉన్నది.

## 2

గతంలో బ్రిటిష్‌ప్రభుత్వం ఎన్నో వాగ్దానాలు చేసిందిగాని వాటిని చెల్లించడంలో ఏలాటి శ్రద్ధను వహించలేదు. అందుచేతనే కాంగ్రెసువారు 1942 లో క్రిప్సుద్వారా ప్రభుత్వం పంపిన ప్రతిపాదనలను తిరస్కరించారు. 1945 జూలై లో లేబరుపక్షానికి చెందిన మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది. అదిచేసే వాగ్దానాలుకూడా గతంలోని వాగ్దానాలవంటివిగానే ఉండగలవనే సందేహం నాయకులకు ప్రజలకు కలగడంలో ఆశ్చర్యపడవలసింది లేదు. కాని లేబరు

మంత్రివర్గానికి చెందినవారు అలాటి సందేహాలకు ఆధారం ఉండరాదని, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడం తమ లక్ష్యం కావడమేగాక దానిని ఆచరణ సాధ్యంచేయుటకు అనాలస్యంగా చర్యలు తీసుకొనడం జరుగుతుందని పదే పదే ప్రకటనలు చేశారు. ఆ ప్రకటనల ప్రకారం ప్రవర్తించారు. అందుచేతనే వారు అధికారంలోకి వచ్చిన తర్వాత రెండు సంవత్సరాలలో దేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాధించి వెళ్ళిపోవడం జరిగింది.

వారు 1945 జూలై 26 న అధికారంలోకి వచ్చారు. అటు తర్వాత సార్వభౌముడు పార్లమెంటు ఉభయసభల సంయుక్త సమావేశంలో ప్రసంగిస్తూ తన ప్రభుత్వం భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం అనతికాలంలో ప్రసాదించే ఉద్దేశంతో ఉన్నట్లు స్పష్టంచేశాడు. ఇది దేశంలోని నాయకులకు ఆశాజనకంగా రూపొందింది.

తాము వదలుకొనిన అధికారాన్ని దేశంలో ఎవరికి ఒప్పగించవలసింది వారు నిర్ణయించుకొనవలసిన అవసరంకూడా ఏర్పడింది. దానిని ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులకు ఒప్పగించడమే ఉచితమని అందరూ అభిప్రాయ పడినారు. అందుచేత నవంబరు-డిసంబరులలో ఎన్నికలు జరగవలసిందిగా ఆగస్టు 21 న అధికారులు ప్రకటన చేశారు.

ఎన్నికల తర్వాత జరగవలసిన కార్యక్రమాన్ని గురించి చర్చలలో పాల్గొనుటకు బ్రిటన్‌కు రావలసినదిగా అధికారులు వైస్రాయి వేవెల్‌ను ఆహ్వానించారు. అతడు ఆగస్టు 24 న అక్కడికి వెళ్ళి చర్చలు పూర్తి చేసుకొని సెప్టంబరు 16 న భారతదేశానికి వచ్చి (1) సాధ్యమైనంత త్వరలో రాజ్యాంగ పరిషత్తు సమావేశం కాగలదని, (2) ఎన్నికలు పూర్తికాగానే 1942 లో క్రిప్సు చేసిన ప్రతిపాదనలు రాష్ట్ర శాసనసభలకు ఎంతవరకు ఆమోదయోగ్యమో అవి ఆమోదయోగ్యం కానిపక్షంలో వాటిస్థానంలో ఏలాటి ప్రతిపాదనలు చేయడం ఉచితమో తెలుసుకొనడం జరుగుతుందని, (3) రాజ్యాంగ పరిషత్తులో సంస్థానాలకు ఉండదగిన ప్రాతినిధ్యాన్నిగురించి సంస్థానాధీశులతో చర్చలు సాగుననీ, (4) బ్రిటన్ భారతదేశంపై పరిపాలనాధికారాన్ని వదలుకొనిన తర్వాత రెండు దేశాలమధ్య ఉండదగిన సంబంధాల గురించి చేసుకొనవలసిన ఒడంబడికయొక్క స్వరూపాన్ని గురించి, ఆలోచించడం జరుగుతుందని ఒక ప్రకటన చేశాడు. భారతదేశ సమస్యను పరిష్కరించడంలో బ్రిటన్‌లోని అధికారులు తగినంత శ్రద్ధను వహిస్తున్నారని ఈ ప్రకటన స్పష్టంచేసింది.

ఎన్నికలలో పాల్గొనవలసిందిగా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం తీర్మానించి ఒక ఎన్నికల ప్రణాళికను కూడా ప్రకటించింది. ముస్లింలీగుకూడా అదేవిధంగా ప్రవర్తించింది.

ఎన్నికలు జరుగుటకు కొద్దిరోజులకు ముందు సుభాష్ చంద్రబోసు నిర్మాణంచేసిన సైన్యంలో అధికారాన్ని వహించిన ముగ్గురు సైన్యాధిపతులను ప్రభుత్వం సైనిక చట్టంక్రింద ఢిల్లీలో ఎర్రకోటలో విచారణచేసింది. ఆ సమయంలో దేశంలో జరిగిన ఆందోళనగురించి ఇదివరకే తెలుసుకొన్నాము. సైనికన్యాయస్థానం వారికి శిక్ష విధించినా ప్రభుత్వం ఆ శిక్షను రద్దుచేయడం తప్పిందికాదు. విచారణ కాలంలో ప్రభుత్వంపట్ల ప్రజలలో ద్వేషభావం పెరిగింది. అలాటిభావం ఉండవలసిన అవసరంలేదని, తమ లక్ష్యం దేశానికి స్వాతంత్ర్యాన్ని అనాలస్యంగా ప్రసాదించడమే అని, ఈ విషయాన్ని ప్రజలకు తెలియపరచుటకున్నూ, ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనుటకున్నూ వెంటనే ఒక పార్లమెంటరీ ప్రతినిధివర్గం భారతదేశానికి

రాగలదని బ్రిటన్‌లోని అధికారులు ప్రకటించారు. సైన్యాధిపతుల విచారణ దీనికి దారితీసింది. ప్రకటనప్రకారం ప్రతినిధివర్గం దేశానికివచ్చి, ప్రజలసందేహాలను తీర్చి, వారి అభిప్రాయాలను తెలియపరచే నివేదికను ప్రభుత్వానికి అందజేసింది.

1945 డిసంబరులో ఎన్నికలు జరిగాయి. కేంద్ర శాసనసభలకు జరిగిన ఎన్నికలలో సాధారణ నియోజకవర్గాలలోని వోటర్లలో 91.3 శాతం కాంగ్రెసు అభ్యర్థులకు వోటుచేశారు. 57 కాంగ్రెసు అభ్యర్థులు ఎన్నిక అయినారు. ముస్లింల ప్రత్యేక నియోజకవర్గాలలోని వోటర్లలో 86.6 శాతం ముస్లింలీగు అభ్యర్థులకు వోటుచేశారు. లీగుతరపున నిలబడిన 30 అభ్యర్థులు ఎన్నికైనారు. వీరుగాక, 5 స్వతంత్రులు, 2 అకాలీశిక్కులు, 8 యూరోపియనులు ఎన్నికైనారు. ఎన్నికైన 102 సభ్యులలో కాంగ్రెసుకు మెజారిటీ బలం లభించడం గుర్తించదగిన విషయం. సామాన్యప్రజల ఆదరణకు విశ్వాసానికి పాత్రమైనట్టి పార్టీ కాంగ్రెసు మాత్రమే అని ఎన్నికలు స్పష్టంచేశాయి. ఇదే విధంగా ముస్లింల ఆదరణకు, విశ్వాసానికి పాత్రమైనట్టి పార్టీ ముస్లింలీగు మాత్రమే అనికూడా ఎన్నికలు రుజువుచేశాయి.

రాష్ట్ర శాసనసభల ఎన్నికలలో సింధు, వాయవ్యసరిహద్దు రాష్ట్రాలలో తప్ప హిందువులు అధికసంఖ్యాకంగా ఉన్న రాష్ట్రాలలోని వారికి కాంగ్రెసు పార్టీపట్ల పూర్తివిశ్వాసం ఉన్నట్లున్నూ, ముస్లింలు అధికసంఖ్యలోఉన్న రాష్ట్రాల వారికి ముస్లింలీగుపట్ల ఎక్కువ విశ్వాసం ఉన్నట్లున్నూ స్పష్టమైంది. కాని ముస్లింలు అధికసంఖ్యలోఉన్న రాష్ట్రాలలో బెంగాలులో మాత్రమే లీగుకు మెజారిటీ బలం లభించింది. ఆ రాష్ట్రంలోమాత్రమే లీగు మంత్రివర్గం ఏర్పడింది. సింధు రాష్ట్రంలో లీగుకు అలాంటి బలం లేకపోయినా మంత్రివర్గ నిర్మాణంలో గవర్నరు జోక్యం కలిగించుకొన్న కారణంగా లీగు మంత్రివర్గం ఏర్పడింది. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది. పంజాబులో హయత్‌ఖాన్ నాయకత్వాన యూనియనిస్టు మంత్రివర్గం (ముస్లింలీగుకు చెందని ముస్లింలు, శిక్కులు, హిందువులు కలిసినది) ఏర్పడింది. తక్కిన రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడినవి.

దేశం మొత్తంమీద లెక్కలోకి తీసుకోదగిన పార్టీలు కాంగ్రెసు లీగులు మాత్రమే అని, బ్రిటిష్‌వారు వదులుకొనే పరిపాలనాధికారాన్ని ఈ రెండు పార్టీలవశం చేయడమే ఉచితమని ఎన్నికలు స్పష్టంచేశాయి.

## 3

ఎన్నికల ఫలితాలు తెలిసిన తర్వాత వేవెల్ కాంగ్రెసు లీగు నాయకులతో సంప్రతింపులు జరిపే ఉద్దేశంతో కొన్ని ప్రతిపాదనలను ఇండియా మంత్రికి పంపినాడు. గతంలో సిమ్లా సమావేశ కాలాన సంప్రతింపులను జరిపే విషయంలో వేవెల్ అవసరమైన నైపుణ్యాన్ని ధైర్యాన్ని ప్రదర్శించలేదనే కారణంగా బ్రిటన్‌లోని మంత్రివర్గం ఈ పర్యాయం అతనిద్వారా సంప్రతింపులు జరపడం ఫలప్రదం కాజాలదని భావించి, ముగ్గురు మంత్రులతో కూడిన ఒక రాయబార వర్గాన్ని (Cabinet Mission) సంప్రతింపుల నిమిత్తం భారతదేశానికి పంపవలసినట్లు తీర్మానించి, ఆ విషయాన్ని వేవెల్‌కు తెలియపరిచింది.

వైస్రాయి ఇండియామంత్రి మధ్య ఈలాటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుచుండగా 1946 ఫిబ్రవరి 18 న బొంబాయి నౌకాశ్రయంలోని నౌకాదళానికి చెందిన భారతీయులు

తమపట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న జాతి వివక్షణను నిరసిస్తూ తిరుగుబాటు చేశారు. విశాఖ పట్టం మొదలైన నౌకాశ్రయాలలోని నావికులుకూడా ఈలాగే చేశారు. వల్లభాయిపటేల్ ఇందులో జోక్యం కలిగించుకొని తిరుగుబాటును విరమించవలసిందిగా నావికులను ప్రోత్స హించాడు. వారు ఆయన సలహాలప్రకారం తిరుగుబాటును ఉపసంహరించుకొన్నారు. కాని ఈ తిరుగుబాటు బ్రిటన్‌లోని అధికారులపై గొప్పప్రభావాన్ని వహించింది. సిపాయీల ప్రభుభక్తి పట్ల ఇదివరకే ప్రభుత్వానికి భయసందేహాలు కలిగినవి. ఇప్పుడు నావికుల ప్రభుభక్తిపట్ల ఆలాటి భయసందేహాలే ఏర్పడినవి. ఇదిగాక ఈ తిరుగుబాటు జరుగుతున్న రోజులలో బొంబాయిలో కార్మికులు సమ్మెచేసి శాంతిభద్రతలకు భంగం కలిగించగా పోలీసులు కాల్పులు జరపవలసి వచ్చింది. అందులో 200 మంది ప్రాణాలు కోల్పోయ్యారు. ఈ పరిస్థితులన్నిటిని గుర్తించి భారతదేశ సమస్యను పరిష్కరించడంలో ఏలాటి జాప్యం జరగరాదని నిర్ణయించి, ఇండియామంత్రి పెతిక్‌లారెన్సు, వ్యాపారమంత్రి క్రిప్సు, నౌకామంత్రి అలెగ్జాండర్లతోకూడిన రాయబారవర్గాన్ని భారతదేశానికి పంపునట్లు ఫిబ్రవరి 19 న పార్లమెంటులో ప్రధాని అట్లీ ఒక ప్రకటనచేశాడు.

ఆ ప్రకటనప్రకారం రాయబారవర్గం మార్చి 24 న ఢిల్లీ చేరింది. అదిమొదలు మూడు వారాలపాటు ప్రధాన రాజకీయ పార్టీలతోను, ప్రముఖ నాయకులతోను సంప్రతింపులు జరిపింది. ముస్లింలీగుతప్ప తక్కిన పార్టీల నాయకులు దేశసమైక్యతను వాంఛించేవారని స్పష్టమైంది. కాంగ్రెసు లీగుల మధ్య రాజీ కుదురుటకు రాయబారవర్గం అనేక ప్రయత్నాలను చేసింది. కాని జిన్నా పాకిస్థాన్ నిర్మాణానికి తప్ప మరి ఏలాటి ప్రతిపాదనలకు ముస్లింలు అంగీకరించ జాలరని తెలియపరచాడు. తన వాదాన్ని బలపరచే ఉద్దేశంతో ఏప్రిలు 10 న శాసనసభలలోని 400 ముస్లింసభ్యుల సమావేశాన్ని ఢిల్లీలో జరిపి, అందులో పాకిస్థాన్ నిర్మాణాన్ని కోరుతూ ఒక ఏకగ్రీవ తీర్మానాన్ని చేయించాడు. అటు తర్వాత రాయబారవర్గం ఏప్రిలు 16 న అతనిని కలుసుకొని ఈక్రింది ప్రతిపాదనలు రెండింటిలో ఒకదానికి సమ్మతించవలసిందిగా కోరింది. వాటిలో మొదటిది ముస్లింలుకానివారు నివసించే జిల్లాలు మినహాగా స్వతంత్రపాకిస్థాన్ రాజ్య నిర్మాణం; రెండవది జిన్నా వాంఛించిన పాకిస్థాన్ ఒక ఉపసమాఖ్యగా (Sub Federation) అఖిలభారత సమాఖ్యలో దేశరక్షణ విదేశ వ్యవహారాల విషయంలో కలిసిఉండేటట్లుగా నిర్మాణం కావడం. జిన్నా రెండవ ప్రతిపాదనను తిరస్కరించాడు.

అటు తర్వాత కూడా రాయబారవర్గం జిన్నాతో సంప్రతింపులు సాగించింది. తుదకు అతడు ఒక ప్రతిపాదనను చేశాడు. అతడు కోరిన ఆరు రాష్ట్రాలు ఒక సమాఖ్యగా ఏర్పడుట కున్నూ, ఆ సమాఖ్యయొక్క రాజ్యాంగాన్ని ఆ రాష్ట్రాల ప్రతినిధులతో మాత్రమే కూడిన రాజ్యాంగపరిషత్తు రూపొందించుటకున్నూ కాంగ్రెసు అంగీకరించినపక్షంలో అలాటి పాకిస్థాన్ సమాఖ్య అఖిలభారత సమాఖ్యలో చేరగలదనేదే ఈ ప్రతిపాదన. కాని కాంగ్రెసు దీనికి అంగీక రించలేదు. అటుతర్వాత ఉభయ పార్టీలమధ్య రాజీ కుదిర్చే ఉద్దేశంతో రాయబారవర్గం సిమ్లాలో ఒక సమావేశాన్ని జరిపింది. కాని ఆ సమావేశం ఫలప్రదం కాలేదు.

ఈ పరిస్థితులలో సంప్రతింపులు ప్రయోజన రహితములని గ్రహించి రాయబారవర్గం అన్ని పార్టీల ఆమోదాన్ని పొందగలదనే విశ్వాసంతో ఒక పథకాన్ని తయారుచేసి మే 16న

దానిని ప్రకటించింది. స్వతంత్ర భారతదేశ స్వరూపాన్ని గురించి, దాని రాజ్యాంగ నిర్మాణ విధానాన్ని గురించి పథకంలోని ప్రతిపాదనలు ఈ క్రింది విధంగా ఉండినవి.

# 1

(1) జిన్నా కోరిన పాకిస్థాన్ నిర్మాణం వాంఛనీయం కాదు. ఆలాటి పాకిస్థాన్‌లో అధిక సంఖ్యాకులైన ముస్లింలతోపాటు అల్ప సంఖ్యాకులైన తదితరులు ఉండడం తప్పదు. ఉదాహరణకు—పంజాబు. సింధు రాష్ట్రము. వాయవ్య సరిహద్దు రాష్ట్రము, బెలూచిస్థానులతో కూడిన వాయువ్య పాకిస్థాన్‌లో 22,653,294 (62 శాతం) ముస్లింలతో పాటు 13, 840, 231 (38 శాతం) హిందువులు శిక్కులు ఉంటారు. అదే విధంగా బెంగాలు ఆసాంలతో కూడిన ఈశాన్య పాకిస్థాన్‌లో 36,447,913 (51.69 శాతం) ముస్లింలతోపాటు 34,063,345 (48 31 శాతం) ముస్లింలు కానివారు ఉంటారు. హిందువులు ముస్లింలు రెండు భిన్నజాతులకు చెందిన వారని, అందుచేత ఒకే భారత రాజ్యంలో వారు పౌరులుగా ఉండడం పొసగదనే కారణంగా జిన్నా పాకిస్థాన్‌ను కోరాడు. కాని ఈ పాకిస్థాన్‌లో ముస్లింలతో ముస్లింలు కానివారు పౌరులుగా ఉండవలసి వస్తుంది. ఇది అతని సిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధం. ఇదిగాక పాకిస్థాన్ నిర్మాణమైన తర్వాత కూడా హిందూస్థానంలో 1880 లక్షల హిందువులతో 200 లక్షల ముస్లింలు పౌరులుగా ఉండడం తప్పదు. ఈ పరిస్థితులలో పాకిస్థాన్ నిర్మాణం అల్పసంఖ్యాక సమస్య పరిష్కారానికి ఎంతమాత్రం సాధనం కాజాలదు.

ఇదిగాక దేశవిభజన జరిగి రెండు రాజ్యాలు ఏర్పడిన పక్షంలో దేశరక్షణ చాలా వరకు కుంటుపడుతుంది. రక్షణ బలాలు రెండుగా చీలిపోవడం తప్పదు. ఆలాటి బలాలు వాయవ్య సరిహద్దును గాని, ఈశాన్య సరిహద్దును గాని శత్రువుల దాడుల నుండి రక్షించడం కష్టసాధ్యం. దేశం ఒకే రాజ్యంగా ఉన్న పక్షంలో అంతర్జాతీయ రంగంలో దానికి ఎక్కువ పలుకుబడి, పేరు ప్రతిష్ఠలు ఉండగలవు. రెండు రాజ్యాలుగా చీలిపోయిన పక్షంలో ఈలాటి లాభం ఉండదు. దీనికి తోడు పశ్చిమ పాకిస్థాన్ తూర్పు పాకిస్థాన్‌ల మధ్య సుమారు 800 మైళ్ళ హిందూస్థాన్ ప్రాంతం ఉంటుంది. ఈ రెండు పాకిస్థాన్‌ల మధ్య రాకపోకలు కష్టసాధ్యం. అందుచేత ఏ విధంగా చూచినా పాకిస్థాన్ నిర్మాణం ప్రయోజనకారి కాజాలదనే నిర్ణయానికి రాయబారవర్గం వచ్చింది. ముస్లింలు కానివారు నివసించే ప్రాంతాలను విడదీసి పాకిస్థానును నిర్మాణం చేసినా పైన పేర్కొన్న లోపాలను అధిగమించడం సాధ్యం కాదు. అందుచేత దేశమంతా ఒకే ప్రభుత్వానికి లోబడిన ఒకే రాజ్యంగా ఉండడమే ముస్లింల దృష్ట్యాను, హిందువుల దృష్ట్యాను శ్రేయస్కరం.

# 2

కాని ఆలాటి రాజ్యంలో అధిక సంఖ్యాకులైన హిందువుల నిరంకుశ పరిపాలనకు ముస్లింలు లోబడవలసి వస్తుందనే ఆక్షేపణ ఒకటి ఉన్నది. కాని హిందువుల నిరంకుశత్వాన్ని చాలావరకు తగ్గించవచ్చు. దానికి ఈ క్రింది ప్రతిపాదనలు పటిష్ఠ సాధనాలు.

(1) దేశమంతా కలిసి ఒక సమాఖ్యగా ఏర్పడుతుంది. కాని ఆ సమాఖ్యలో కేంద్ర ప్రభుత్వానికి దేశరక్షణ, విదేశ వ్యవహారాలు, రవాణా సౌకర్యాలు, సమాచార సౌకర్యాలు— అనే శాఖలపైన మాత్రమే అధికారం ఉంటుంది.

(2) తక్కిన శాఖలకు సంబంధించిన అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలకు ఉండ గలవు. అయిను రాష్ట్రాలలో ముస్లింలు అధిక సంఖ్యలో ఉండడంచేత ఈ శాఖలద్వారా వారికి గరిష్ట ప్రమాణంలో అధికారం లభిస్తుంది.

(3) పంజాబు, సింధు రాష్ట్రము, వాయవ్య సరిహద్దు రాష్ట్రము, బెలూచిస్థాన్‌లు కలిసి ఒక ఉప సమాఖ్యగా (Sub Federation or B section) ఏర్పడుతవి. అందుచేత ఈ కలియిక చాలావరకు పాకిస్థాన్ మూలంగా ముస్లింలీగు కాంక్షించే లాభాలను చేకూరుస్తుంది. ఇదే విధంగా బెంగాలు ఆసాంలు కలిసి ఇంకొక ఉప సమాఖ్యగా—C section—ఏర్పడుతవి. ఈ కలియిక కూడా పాకిస్థాన్ మూలంగా కాంక్షించే లాభాలను చేకూరుస్తుంది.

పై ప్రతిపాదనలు దేశ సమైక్యత పూర్తిగా ఉండవలెనని వాదించే కాంగ్రెసువంటి పార్టీలు, పూర్తిగా దేశ విభజన జరిగి పాకిస్థాన్ ఏర్పడవలెనని వాదించే ముస్లింలీగు, రాజీకి వచ్చుటకు సాధనం. ఈ రెండు రకములైన వాంఛల మధ్య ఇది సమన్వయం కుదిరిస్తున్నది.

# 3

భవిష్యత్తులో రూపొందదగిన రాజ్యాంగాన్ని నిర్మాణం చేయుటకు రాజ్యాంగ పరిషత్తు ఏ విధంగా ఏర్పడవలసిందీ, ఏ విధంగా అది రాజ్యాంగాన్ని రూపొందించవలసిందీ రాయబార వర్గం ఈ క్రింది ప్రతిపాదనలద్వారా నిర్ణయించింది.

(1) దేశ జనాభాలో 10 లక్షలకు ఒక ప్రతినిధి చొప్పున రాష్ట్రాల నుండి 292 సభ్యులు, సంస్థానాల నుండి 93 సభ్యులు—మొత్తం 385 సభ్యులు రాజ్యాంగ పరిషత్తులో ఉండవలెను.

(2) రాష్ట్రాల ప్రతినిధులను ఆయా రాష్ట్రపు శాసన సభలు ఎన్నుకొనవలెను.

(3) ఈ ఎన్నికలలో ముస్లిం ప్రతినిధులను ముస్లిం శాసన సభ్యులు, శిక్కు ప్రతినిధులను శిక్కు శాసన సభ్యులు, తక్కిన ప్రతినిధులను తక్కిన శాసన సభ్యులు ఎన్నుకొనవలెను. దీని ఫలితంగా 78 ముస్లింలు, 4 శిక్కులు, 210 ఇతరులు పరిషత్తులో సభ్యులుగా ఉంటారు.

(4) సంస్థాన ప్రతినిధులను ఎన్నుకొనవలసిన విధానాన్ని గురించి సంస్థానాధీశులతో చర్చించి ఒక నిర్ణయానికి రావలెను.

(5) ఈ విధంగా ఏర్పడిన రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశంలో కార్యక్రమ విధానాన్ని నిర్ణయించి, అధ్యక్షుని తదితర అధికారులను ఎన్నుకొని, అల్ప సంఖ్యాకులు మొదలైన వారి ప్రాథమిక హక్కులను నిర్ణయించుటకు ఒక సలహా సంఘాన్ని ఎన్నుకొంటుంది.

(6) అటు తర్వాత సభ్యులలో ఆయా ఉప సమాఖ్యకు చెందినవారు చీలిపోయి, ఒక్కొక సమాఖ్యకూ చెందినవారు అందులోని రాష్ట్రాల రాజ్యాంగాన్ని, ఉప సమాఖ్య రాజ్యాంగాన్ని నిర్ణయిస్తారు. (ఈ రాజ్యాంగాలను నిర్ణయించే హక్కు మొత్తం రాజ్యాంగ పరిషత్తుకు లేకపోవడం గుర్తించదగిన విషయం.)

(7) ఇది జరిగిన తర్వాత మూడు ఉప సమాఖ్యలకు చెందిన సభ్యులు రాజ్యాంగ పరిషత్తులో కలిసి సమావేశమై అఖిలభారత సమాఖ్య రాజ్యాంగాన్ని రూపొందిస్తారు.

పై ప్రతిపాదనల ఫలితంగా ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉండే రాష్ట్రాల యొక్కయు ఉప సమాఖ్యల యొక్కయు రాజ్యాంగాలను వారి ఇష్టానుసారం రూపొందించుకొనే అవకాశం లభించింది. అధిక సంఖ్యాకులైన హిందువులకు ఇందులో ఏలాటి జోక్యం ఉండదు. ఈ విధానం ముస్లింగులీగు ఆశించిన పాకిస్థాన్‌కు చాలా సన్నిహితమైనట్టిది.

(8) రాజ్యాంగ పరిషత్తు అఖిలభారత రాజ్యాంగాన్ని రూపొందించడమే గాక స్వతంత్ర భారతరాజ్యం బ్రిటన్‌ల మధ్య ఉండదగిన సంబంధాల గురించి బ్రిటన్‌తో ఒక ఒడంబడికను చేసుకొంటుంది.

# 4

రాజ్యాంగ పరిషత్తు పై విధంగా రాజ్యాంగాన్ని నిర్మాణం చేయుటకు కొంతకాలం పట్టవచ్చు ఆ నిర్మాణం జరిగిన తర్వాతనే బ్రిటిష్ ప్రభుత్వం తన అధికారాన్ని వదలుకొనడమూ భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించడమూ జరుగుతుంది. ఈ మధ్యకాలంలో దేశ పరిపాలన జరుగుటకు ప్రధాన పార్టీల ప్రతినిధులతో కూడిన ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచడం చాలా అవసరం. అలాటి ప్రభుత్వం వెంటనే ఏర్పడవలెనని కూడా రాయబార వర్గం ప్రతిపాదించింది.

అందుచేత రాయబారవర్గం రూపొందించిన పథకం (మే 16 పథకం) భవిష్యత్తును గురించీ, తాత్కాలాన్ని గురించీ నిర్ణయాలను ప్రతిపాదించింది. ఈ రెండు రకములైన ప్రతి పాదనలు పరస్పరాశ్రయాలు. భవిష్యత్తును గురించిన ప్రతిపాదనలను ఆమోదించిన పార్టీలకే తాత్కాలిక ప్రభుత్వంలో ప్రాతినిధ్యం ఉండవలెనని రాయబారవర్గం అభిప్రాయ పడింది.

పై విధంగా రాయబారవర్గం రూపొందించిన పథకం మొత్తంమీద ఆమోదయోగ్యమై నట్టిదని చెప్పవచ్చు. ఇది పాకిస్థాన్ నిర్మాణాన్ని పూర్తిగా ఖండించి దేశైక్యతను సమ ర్థించింది. పథకంలోని సుగుణం ఇదే. అఖిలభారత సమాఖ్యలో ఏర్పడే కేంద్ర ప్రభుత్వానికి పరిమితాధికారాలు మాత్రమే ఉండవలెనని, తక్కిన అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలకు ఉండ వలెననే ప్రతిపాదన అధిక సంఖ్యాకులైన హిందువులకు అల్ప సంఖ్యాకులైన ముస్లింలు లోబడ వలసి వస్తుందనే భయాన్ని చాలావరకు తగ్గించుటకు సాధనమైంది. పథకంలోని సుగుణాలలో ఇది రెండవది. ముస్లింలు అధిక సంఖ్యలో ఉండే వాయవ్య ప్రాంతంలోని నాలుగు రాష్ట్రాలు కలిసి ఒక ఉప సమాఖ్యగా ఏర్పడవలసినట్లును ఈశాన్య ప్రాంతంలో ముస్లింలు అధికసంఖ్యలో ఉండే బెంగాలు ఆసాంతో కలిపి ఇంకొక ఉప సమాఖ్యగా ఏర్పడవలసినట్లును రాయబారవర్గం చేసిన ప్రతిపాదన పాకిస్థాన్ నిర్మాణం మూలంగా ముస్లింలు వాంఛించిన ఫలితాలను చాలావరకు వారికి అందజేయగల ప్రతిపాదన. ఉప సమాఖ్య యొక్కయు, అందులో చేరిన రాష్ట్రాల యొక్కయు రాజ్యాంగాన్ని ఆయా ఉప సమాఖ్యలకు చెందిన ప్రతిధులు మాత్రమే రూపొందించు కొనవలసినదని రాయబారవర్గం చేసిన ప్రతిపాదన హిందువుల జోక్యంలేక ముస్లింలు వారి ఇష్టానుసారం రాష్ట్రాల రాజ్యాంగాన్ని రూపొందించుకొన వచ్చుననే ప్రతిపాదన వారి అభీ ష్టాన్ని పూర్తిగా తీర్చగలిగినట్టిది. రాయబారవర్గ పథకంలోని సుగుణాలలో ఇది మూడవది. పథకంలో లోపాలు లేకపోలేదు. అది పూర్తిగా దేశైక్యతను వాంఛించే కాంగ్రెసు ఆశయాలు, పూర్తిగా దేశ విభజనను వాంఛించే ముస్లింలీగు ఆశయాల మధ్య ఒక సమన్వయం కుదుర్చుటకు

ఉద్దేశించిన రాజీ పథకం. ఏ రాజీ పథకం కూడా వివాదపడే ఉభయపార్టీలకు పూర్తి సంతృప్తిని కలిగించదు. అందుచేత ఉభయ పార్టీలు తమ మధ్య వివాదాలను పెంచుకొనుటకు బదులు రాజీ పథకాన్ని ఆమోదించడం వాంఛనీయం. అఖిలభారత సమైక్యతను కొంతవరకైనా నిలబెట్టుటకు ఈ పథకం సర్వవిధాలా తోడ్పడేటట్టిది. దీని మూలంగా ముస్లింలీగు పాకిస్థాన్ నిర్మాణం మూలంగా వాంచించిన ప్రయోజనాలు చాలావరకు లభించే అవకాశం ఏర్పడింది. ఈ కారణాల చేత కాంగ్రెసు ముస్లింలీగుల ఆమోదానికి ఇది పాత్రము కాతగ్గది.

కాని కాంగ్రెసు గాని ముస్లింలీగు కాని ఈ పథకానికి (దీనికి మే 16 పథకం అని పేరు) వెంటనే ఆమోదం తెలియపరచలేదు. ఉప సమాఖ్యలకు సంబంధించిన ప్రతిపాదనలు కాంగ్రెసుకు నచ్చలేదు. రాష్ట్రాలు నిర్బంధంగా పథకం సూచించిన ఉప సమాఖ్యలో చేరడం రాష్ట్రాల స్వాతంత్ర్యానికి భంగకరమని అది భావించింది. ప్రధానంగా ముస్లింలు కానివారు అధిక సంఖ్యలో ఉండే ఆసాం రాష్ట్రం ఈశాన్య ఉప సమాఖ్యలో చేరడం ఆసాం ప్రజలకు గాని, కాంగ్రెసుకు గాని ఆమోదయోగ్యం కాలేదు. రాష్ట్ర రాజ్యాంగం రూపొందిన తర్వాత ఏర్పడే రాష్ట్ర శాసనసభ ఉప సమాఖ్యనుండి విడిపోవలసిందిగా తీర్మానం చేసిన పక్షంలో అది విడిపోవచ్చుననే సూత్రాన్ని రాయబారవర్గం తన పథకంలో చేర్చింది. కాని ఇది కాంగ్రెసుకు తృప్తిని కలిగించలేదు. ఇదే విధంగా పాకిస్థాన్ నిర్మాణం ఒక్కటే తన లక్ష్యంగా పెట్టుకొన్న ముస్లింలీగుకు అలాటి నిర్మాణానికి అంగీకరించని పథకం ఆమోదయోగ్యం కాలేదు. అందుచేత కాంగ్రెసు లీగులు పథకాన్ని ఆమోదించడంలో కొంత జాప్యం జరిగింది. పథకాన్ని పూర్తిగా తిరస్కరించడం వాటి అభిమతం కాదు. జూన్ 6న ముస్లింలీగు కార్యనిర్వాహక కమిటీ సమావేశమై మే 16 పథకాన్ని ఆమోదించి, తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణ విషయమై వైస్రాయితో సంప్రతింపులు జరపవలసినట్లుగా జిన్నాను కోరింది. జూన్ 25న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ మే 16 పథకాన్ని ఆమోదించింది కాని తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొన నిరాకరించింది.

ఈ నిరాకరణ రాయబార వర్గానికి చాలా ఆశాభంగాన్ని కలిగించింది. తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణాన్ని గురించి మే 16 తర్వాత అనేక ప్రయత్నాలు జరిగినవి. కాని అందులో కాంగ్రెసు ప్రతినిధుల సంఖ్య, ముస్లింలీగు ప్రతినిధుల సంఖ్య ఇతర అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధుల సంఖ్యను గురించిన్నీ, ముస్లిం ప్రతినిధులను కాంగ్రెసు నియమించే హక్కును గురించిన్నీ ఉభయ పార్టీలకు అంగీకారం కుదురలేదు. జూన్ 16న రాయబార వర్గపు ఆమోదంతో వైస్రాయి ఆర్గురు కాంగ్రెసు ప్రతినిధులు (వీరిలో ఒక షెడ్యూల్డు కులాలకు చెందినవాడు), అయిదుగురు ముస్లింలీగు ప్రతినిధులు, ఒక శిక్కుల ప్రతినిధి, ఒక క్రైస్తవ ప్రతినిధి, ఒక పార్సీ ప్రతినిధి—మొత్తం 14 ప్రతినిధులతో కూడిన ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరుచుటకు సిద్ధంగా ఉన్నట్లు ప్రకటన చేశాడు. ఈ ప్రకటన ప్రకారం కాంగ్రెసు లీగులు తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు అంగీకరించని పక్షంలో మే 16 పథకాన్ని ఆమోదించిన పార్టీల సహకారంతో ఇంకొక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచడం తన ఉద్దేశమని తెలియపరచినాడు.

దీనిని గురించి కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ దాని అభిప్రాయాన్ని తెలియజేయుటకు ముందే జూన్ 19న జిన్నాకు వైస్రాయి ఒక ఉత్తరాన్ని వ్రాసి, అందులో ముస్లిం

ప్రతినిధుల అభిప్రాయాలకు భిన్నంగా తాత్కాలిక ప్రభుత్వం ఏలాటి చర్యలను తీసుకొనజాలదని, కాంగ్రెసు తరపున ముస్లిం ప్రతినిధిని నియమించడం జరగదని తెలియపరుస్తూ మరికొన్ని హామీలను కూడా అతనికి యిచ్చాడు. తపతో సంప్రతించక ఈలాటి హామీలను వైస్రాయి అతనికి యివ్వడాన్ని కాంగ్రెసు నాయకులు నిరసించి తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు నిరాకరించారు. జూన్ 19 నుండి వైస్రాయి ముస్లింలీగుల పట్ల యథాపూర్వకంగా పక్షపాత వైఖరిని అనుసరించ సాగాడు. ఈ విషయంలో రాయబార వర్గంలోని అలెగ్జాండరు, అతనితో ఏకీభవించాడు. క్రిప్సు కాంగ్రెసును సమర్థించాడు. రాయబార వర్గంలోకూడా చీలికలు ఏర్పడడం గుర్తించదగినది.

ఈ పరిస్థితులలో తాము భారతదేశంలో ఉండి సాధించగలిగినది ఏదీ లేదని రాయబార వర్గంవారు జూన్ 29న బ్రిటన్‌కు వెళ్ళిపోయ్యారు. వారి రాయబారం తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణ విషయంలో ఫలప్రదం కాలేదు. రాజ్యాంగ నిర్మాణ విషయంలో పాక్షికంగా మాత్రమే ఫలితాన్ని సాధించింది. మే 16 పథకాన్ని తాను అంగీకరించినా, తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు తాను సిద్ధంగా ఉండినా కాంగ్రెసు అందులో పాల్గొనుటకు నిరాకరించిన కారణంగా వైస్రాయి తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణాన్ని వాయిదా వేయడం జిన్నాకు ఆగ్రహం కలిగించింది. రాయబారవర్గం వెళ్ళిపోవడంతో సంప్రతింపుల అధ్యాయంలో ఒక ఘట్టం ముగిసింది. కాంగ్రెసు లీగులు పూర్తిగా రాయబార వర్గంతో సహకరించి ఉండిన పక్షంలో దేశ స్వాతంత్ర్యంతోపాటు దేశ సమైక్యతకూడా లభించేది. కాని రాయబార వర్గంతోటి సంప్రతింపుల మూలంగా దేశ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించడంలో లేబర్ మంత్రివర్గం సిద్ధంగా ఉన్నా దేశ విభజన పట్ల వారి వైఖరి సందేహాస్పదమైనట్లు స్పష్టమైంది.

# 4

జూలై 6న అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమై మే 16 పథకాన్ని ఆమోదిస్తూ కార్యనిర్వాహక కమిటీ జూన్ 25న చేసిన తీర్మానాన్ని ధ్రువపరచింది. అప్పటికి అజాద్ స్థానంలో నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. సమావేశంలో తన తుదిఉపన్యాసంలోను, అటు తర్వాత జరిగిన వార్తాపత్రికల ప్రతినిధుల సమావేశంలోను మే 16 పథకంలోని కొన్ని ప్రతిపాదనలను ఖండించాడు.ఇది అంతకుపూర్వం గాంధీ మొదలైన కాంగ్రెసు నాయకుల ఖండన వంటిదే అయినా జిన్నాకు మరింత ఆగ్రహాన్ని కలిగించింది. ఈ ఖండనలో నెహ్రూ ఉప సమాఖ్యలు ఏర్పడడం వాంఛనీయం కాదని, రాష్ట్రాలు నిర్బంధంగా వాటిలో చేరవలసిన అవసరం లేదని, రాజ్యాంగ పరిషత్తు సర్వస్వామ్యంగల పరిషత్తు అని, పరాయివారు విధించిన నియమాలతో నిమిత్తం లేకుండా తన ఇష్టానుసారం రాజ్యాంగాన్ని నిర్మించగల అధికారం దానికి ఉన్నదనీ తన అభిప్రాయాలను వ్యక్తం చేశాడు.

ఈ అభిప్రాయాలు మే 16 పథకానికి పరమ విరుద్ధములని, అందుచేత ఆ పథకానికి కాంగ్రెసు ఆమోదించినదని భావించడం పొరపాటు అని, ప్రభుత్వానికి ఆలాటి భావం కలగడం కాంగ్రెసు పట్ల అది వహించిన పక్షపాత వైఖరికి తార్కాణమని ఈలాటి పరిస్థితులలో ముస్లిం లీగు దానికి కట్టుబడి ఉండవలసిన అవసరం లేదనీ, అధిక సంఖ్యాకులైన హిందూ ప్రతినిధులతో కూడిన రాజ్యాంగ పరిషత్తు ముస్లింలు ప్రయోజనాలకు విరుద్ధంగా రాజ్యాంగాన్ని రూపొందించే

ప్రమాదం ఉన్నదని, బ్రిటిష్ పరిపాలన కాలంలోనే ఈలాగు ప్రవర్తించుటకు సిద్ధపడిన కాంగ్రెసు బ్రిటిష్ అధికారం తొలగి దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఇంతకంటె విసంకుళంగా ప్రవర్తించడం తథ్యమనే ప్రచారంలోకి జిన్నా దిగసాగాడు. ఏదో ఒక నెపాన్ని ఆధారం చేసుకొని రాయవర్గ పథకానికి ఇదివరలో లీగు తెలియపరచిన ఆమోదాన్ని రద్దుచేసి, స్వేచ్ఛగా పాకిస్థాన్ నిర్మాణమే ముస్లింల ఏకైక లక్ష్యమని వాదించుటకు జిన్నా సిద్ధపడ్డాడు. నెహ్రూ వ్యక్తం చేసిన అభిప్రాయాలు అతనికి ఒక నెపంగా ఉపయోగపడినవి.

ఈ మనోవైఖరితో జూలై 27 న జిన్నా ముస్లింలీగు కార్యనిర్వాహక కౌన్సిలును సమావేశపరచి పాకిస్థాన్ నిర్మాణం ఒక్కటే ముస్లింల లక్ష్యమని, కాంగ్రెసుయొక్కగాని బ్రిటిష్ ప్రభుత్వంయొక్కగాని సహకారంతో చట్టబద్ధమైన ఆందోళనద్వారా దానిని సాధించడం సాధ్యంకాదని, అందుచేత ముస్లింజాతి ప్రత్యక్షచర్యను సాగించవలసినదని కోరాడు. అతని కోరికమేరకు పాకిస్థాన్ నిర్మాణ లక్ష్యసాధనకు ముస్లింలు ప్రత్యక్షచర్య (Direct Action) సాగించవలసినదని జూలై 29 న కౌన్సిల్ ఏకగ్రీవంగా తీర్మానంచేసింది.

ఈ మధ్యకాలంలో—అనగా జూలై 24 న వైస్రాయి తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్మాణంలో సహకరించవలసినదిగా నెహ్రూను జిన్నాను కోరాడు. ప్రత్యక్షచర్య తీర్మానం చేసిన తర్వాత తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనడం అసంగతమనే భావంతో వైస్రాయి ఆహ్వానాన్ని జూలై 31 న జిన్నా నిరాకరించాడు.

ఇదివరలో కాంగ్రెసు లీగులలో ఏ పార్టీగాని ప్రభుత్వంలో పాల్గొనుటకు నిరాకరించినా ఆలాటి ప్రభుత్వాన్ని ఏర్పరచుటకు వైస్రాయి ఇష్టపడేవాడుకాదు. కాని ఈ పర్యాయం ఆలాగుచేయక, ముస్లింలీగు నిరాకరణతో నిమిత్తంలేకుండా ఒక కాంగ్రెసు సహకారంతో తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్మాణంచేయుటకు సిద్ధపడి ఆగస్టు 6 న నెహ్రూకు ఆహ్వానాన్ని పంపించాడు. ఆగస్టు 8 న కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం సమావేశమై నెహ్రూ ఇదివరలో (జూలై 6 న) వ్యక్తంచేసిన అభిప్రాయాలను పాటించక. మే 16 పథకాన్ని బేరషరత్తుగా ఆమోదిస్తూ ఒక తీర్మానాన్నిచేసి, తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్మాణం చేయవలసినదిగా నెహ్రూను కోరింది. ఈ కోరికమేరకు ఆగస్టు 8 న ప్రభుత్వాన్ని నిర్మాణంచేయుటకు సమ్మతిస్తూ వైస్రాయికి నెహ్రూ తెలియపరచాడు. ఈ విధంగా కాంగ్రెసు ఆధ్వర్యాన తాత్కాలికప్రభుత్వ నిర్మాణానికి సన్నాహాలు పూర్తి అయినవి. ఈ సన్నాహాలు రాయబారవర్గం దేశంలో ఉన్నప్పుడు జూన్ 12 న ప్రారంభమైనాయి. కాంగ్రెసు లీగు రెండూ సహకరించినగాని ప్రభుత్వనిర్మాణం జరగదనే భావం అధికారులకు ఉండడంచేత అప్పట్లో సన్నాహాలు ఫలప్రదంకాలేదు. ఇప్పుడు అధికారులు ఆ అభిప్రాయాన్ని మార్చుకొనడంచేత ఆలాటి నిర్మాణం ఆచరణ సాధ్యమైంది. ఇందులో సహకరించవలసిందిగా నెహ్రూ జిన్నాను కోరాడు. కాని కాంగ్రెసుతరఫున ముస్లింప్రతినిధి ప్రభుత్వంలో పాల్గొనరాదని పట్టుపట్టాడు. నెహ్రూ దానికి సమ్మతించనందున జిన్నా సహకారం లభించలేదు. అందుచేత ఆగస్టు 24 న తన నాయకత్వంలో వల్లభాయిపటేల్, రాజేంద్రప్రసాద్ అసఫ్ఆలీ, రాజగోపాలాచారి, సరత్ చంద్రబోసు, జాన్మత్తాయి, సర్దార్ బలదేవసింగు,షాపట్ అహమ్మద్ఖాన్, హోర్మస్జీబాబా (పార్సీ), జగ్జీవనరాం, ఆలీజహీరీలతో కూడిన మంత్రివర్గాన్ని నిర్మాణంచేశాడు. మరిఇద్దరు ముస్లింలు మంత్రివర్గంలో చేరగలరనికూడా ప్రకటించాడు. సెప్టెంబరు 2 న ఈ మంత్రివర్గం అధికారస్వీకారం చేసింది.

కాని ఈ మధ్యకాలంలో ప్రథమంలో బెంగాలు రాష్ట్రంలోను అటుతర్వాత బిహారు రాష్ట్రంలోను మరికొన్ని ప్రాంతాలలోను ఇటీవలి దేశచరిత్రలో కనీ వినీ ఎరుగని విషాద సంఘటనలు సంభవించినవి. జూలై 29 న ముస్లింకౌన్సిల్ తీర్మానంమేరకు ఆగస్టు 16 ను ప్రత్యక్షచర్య దినంగా పరిగణించవలసిందిగా జిన్నా ముస్లింలను ఆదేశించాడు. ఆ ఆదేశంమేరకు కలకత్తాలోను బెంగాలులోని ఇతరప్రాంతాలలోను నాలుగురోజులపాటు హిందువులపై అత్యాచారాలు జరిపి ప్రత్యక్ష దినాన్ని ముస్లింలు పాటించారు. తమకు కనుపించిన హిందువులను హత్యచేశారు; అనేకులను గాయపరచారు. ఇండ్లను దగ్ధంచేశారు; దుకాణాలను దోపిడిచేశారు. స్త్రీలను చెరచారు. హిందువులుకూడా ఈలాటి చర్యలకు దిగడం తప్పిందికాదు. ఈ రాక్షస కృత్యాల ఫలితంగా కలకత్తాలో 5000 హతులయ్యారు. 15000 గాయపడినారు. ఆస్తికి అపార నష్టం కలిగింది. ఆనాడు బెంగాలురాష్ట్రాన్ని ముస్లింలీగు మంత్రివర్గం పరిపాలిస్తూ అల్లరులను అణచుటకు చర్యలను తీసుకొనుటకు బదులు ఆగస్టు 16 ను సెలవుదినంగా ప్రకటించి రౌడీమూక విజృంభణంగా ప్రవర్తించుటకు అవకాశాన్ని కల్పించింది. ముఖ్యమంత్రి సురవర్దీ పోలీసు ప్రధానకేంద్రాలనుండి పోలీసు అధికారులు అల్లరులలో జోక్యం కలిగించుకొనరాదని ఆదేశించాడు, సైనికపటాలాలు కలకత్తాలో ఉండినా ప్రభుత్వం అల్లరులను అణచుటలో వాటి సహాయాన్ని కోరలేదు. ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉండే రాష్ట్రంలో హిందువులకు ప్రభుత్వాన నుండి ఏలాటి రక్షణ లభించదని ఆగస్టు 16-19 సంఘటనలు స్పష్టంచేసింది. వేలాదిహిందువులు రక్షణలేక పొరుగునందున్న బిహారురాష్ట్రానికి కాందిశీకులుగా పారిపొయ్యారు. గాంధీకూడా గతంలో 1920-22 న, 1930-31 న 1932-34 న ప్రత్యక్షచర్యను సాగించాడు. కాని అందులో పాల్గొనినవారు అహింసాసూత్రానికి కట్టుబడి చర్యను సాగించారు. ముస్లింలీగు నాయకులకు అహింసపట్ల విశ్వాసంలేదు. వారు ప్రత్యక్షచర్యను ఇంకొక విధంగా సాగించారు. 1945 లో నూన్ అనే ముస్లింలీగు ప్రముఖుడు "బ్రిటిష్‌వారు అఖండ భారతప్రభుత్వానికి ముస్లింలు లొంగిపోవలసినదిగా నిర్బంధించిన పక్షంలో గతంలో హలాకు, చెంగిస్ఖానుల చర్యలను విస్మరింప చేసే దారుణ చర్యలకు వారు దిగడం తప్పదు" అని బెదిరించాడు. కలకత్తాలోని సంఘటనలలో ఈ బెదిరింపు కార్యరూపం ధరించింది. పాకిస్థాన్ నిర్మాణాన్ని ప్రతిఘటించినది రాయబారవర్గం. బ్రిటిష్‌ప్రభుత్వం ఈ విషయంలో రాయబారవర్గంతో ఏకీభవించింది. కాని ముస్లింలీగువారు ప్రభుత్వంపై చర్యలను తీసుకొనుటకు బదులు దయాదాక్షిణ్యాలులేక హిందువులపై చర్యలను తీసుకొనడం విచారకరం.

దేశంలో హిందువులు ముస్లింలు మధ్యఅంతర్యుద్ధ పరిస్థితులు ఏర్పడడం గాంధీకి ఎంతో విచారాన్ని కలిగించింది. ఏలాగైనా ముస్లింలీగును సంతృప్తిపరచి, తాత్కాలిక ప్రభుత్వంలో లీగు ప్రతినిధులను పాల్గొనునట్లు చేసినపక్షంలో కాంగ్రెసుతోపాటు లీగుకూడా దేశంలో శాంతిభద్రతలను రక్షించే బాధ్యతను వహించగలదనే ఆశాభావంతో అయన ముస్లింలీగు మాత్రమే ముస్లింలపట్ల ప్రాతినిధ్యాన్ని వహించే ఏకపక్ష సంస్థ అని గుర్తించవలసిందిగా కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గాన్ని కోరాడు. ఇది ఒకవిధంగా కాంగ్రెసు అన్నివర్గాలపట్ల ప్రాతినిధ్యం వహించే జాతీయసంస్థ అనే సిద్ధాంతాన్ని వదులుకొనడమే అయినా కాంగ్రెసు కార్యవర్గం ఆ కోరికను మన్నించింది. వైస్రాయి, నెహ్రూలు దానిని ఆధారం చేసుకొని ముస్లింలీగు ప్రతినిధులు తాత్కాలిక ప్రభుత్వంలో కాంగ్రెసుతో కలిపి పాల్గొనవలసి

నదిగా జిన్నాను కోరారు. పరిపాలనాధికారమునంతా కాంగ్రెసు మాత్రమే వహించడాన్ని గురించి జిన్నా కూడా పునరాలోచన చేయసాగాడు. అది ముస్లింల ప్రయోజనాలకు హాని కలిగించ వచ్చునని భావించి నెహ్రూ కోరికప్రకారం ప్రభుత్వంలో పాల్గొనుటకు అంగీకరించాడు.

కాని రాయబారవర్గం మే 16 పథకానికి కట్టుబడి రాజ్యాంగ పరిషత్తులో చేరుటకు సిద్ధంగా ఉన్నవారే తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనవలసిందిగా నిర్ణయించింది. తాత్కాలిక ప్రభుత్వం ఎంత ప్రాధాన్యమో దీర్ఘకాలిక పథకం అంతకంటే ఎక్కువ ప్రాధాన్యమని అది భావించింది.రాజ్యాంగ పరిషత్తు ఏర్పడి,అది రాజ్యాంగాన్ని నిర్మాణం చేయడం జరిగితేనేగాని బ్రిటిష్ వారు వారి అధికారాన్ని వదులుకొని దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రసాదించరు. అందుచేత తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు అంగీకరించడంతో పాటు జూలై 29 న ముస్లిం కౌన్సిలు రాయబారవర్గ దీర్ఘకాలిక పథకానికి ఆమోదాన్ని నిరాకరిస్తూ చేసిన తీర్మానాన్ని రద్దుచేయడం అవసరం. ఈ అవసరం తీరుటకు ముందే ముస్లింలీగు ప్రతినిధులను తాత్కాలిక ప్రభుత్వంలో ప్రవేశపెట్టడం ప్రమాదకరమని నెహ్రూ వైస్రాయికి తెలియపరచాడు. జూలై 29 తీర్మానాన్ని రద్దుచేయుటకు జిన్నా వాగ్దానం చేశాడని, అందుకుగాను ముస్లింలీగు కౌన్సిలు కొద్దిరోజులలో సమావేశం కాగలదని వైస్రాయి నెహ్రూకు జవాబు పంపినాడు. జిన్నా తన వాగ్దానాన్ని చెల్లించ సిద్ధంగా ఉన్నాడనే విశ్వాసంతో ముస్లింలీగు ప్రతినిధులు తన మంత్రివర్గంలో చేరుటకు నెహ్రూ అంగీకరించాడు.

దీని ఫలితంగా (1) లియాకత్ ఆలీఖాన్ (2) చుంద్రీగర్ (3) అబ్దుర్‌రాబ్ నిష్టర్ (4) గజ్నిఫర్ ఆలీఖాన్ (5) జోగింద్రనాథ్ మండల్ (ఇతడు షెడ్యూల్డు కులానికి చెందినవాడు) ముస్లింలీగు ప్రతినిధులుగా అక్టోబరు 25 న తాత్కాలిక ప్రభుత్వంలో చేరారు. ప్రభుత్వంలోని మొత్తం ప్రతినిధుల సంఖ్య 14 కు మించరాదని ఇదివరకే నిర్ణయం జరిగిన కారణంగా ఈ అయిదుగురికి స్థానాలు కల్పించుటకు నెహ్రూ అంతకుపూర్వం మంత్రులుగా ఉండిన సరత్ చంద్రబోసు, షాఫట్ అహమ్మద్‌ఖాన్, అలీ జహీర్లను రాజీనామా చేయమన్నాడు. ఈ విధంగా అక్టోబరు 25 న కాంగ్రెసు లీగులతో కూడిన సంకీర్ణ మంత్రివర్గం ఏర్పడింది.

లీగు ప్రతినిధులు మంత్రివర్గంలో చేరడమే జిన్నా వాంఛించింది. మే 16 ప్రతిపాదనానుసారం రాజ్యాంగ పరిషత్తులో చేరి రాజ్యాంగ నిర్మాణంలో పాల్గొనుటకు అనుగుణంగా లీగు కౌన్సిలు జూలై 29 చేసిన తీర్మానాన్ని రద్దుచేయుటకు ఏలాటి చర్యలు తీసుకొనలేదు. అతడు ఈ విషయంలో చేసిన వాగ్దానాలను చెల్లించేటట్లు ప్రోత్సహించవలసిందిగా నెహ్రూ, పటేల్ మొదలైన కాంగ్రెసు నాయకులు వైస్రాయిని పదేపదే కోరారు. కాని వైస్రాయి వారు కోరిన చర్యలను తీసుకొనలేదు. మే 16 పథకాన్ని ఆమోదించక తాత్కాలిక ప్రభుత్వంలో ముస్లింలీగు ప్రతినిధులు పాల్గొనసాగారు. ఇది క్రమవిరుద్ధమైనా దీనిని మార్చుటకు వైస్రాయి గాని జిన్నాగాని సిద్ధపడలేదు.

ముస్లింలీగు ప్రతినిధులు ప్రభుత్వంలో చేరారేగాని నెహ్రూ నాయకత్వాన్ని గాని, కాంగ్రెసు సభ్యులతో కలిసి ఒకజట్టుగా సమష్టిబాధ్యతతో పరిపాలనను సాగించుటకుగాని అంగీకరించలేదు. ముస్లింలీగు సభ్యులు ఒకవర్గంగాను, తక్కిన తొమ్మండుగురు సభ్యులు ఇంకొకవర్గంగాను చీలిపొయ్యారు. పరిపాలన యంత్రాంగం దీనిఫలితంగా దాని సౌష్టవాన్ని కోల్పోయింది. దేశంలో పరిపాలన అనేది లేనిస్థితి ఏర్పడింది.

ప్రభుత్వ సభ్యులలోని చీలికలు ఉద్యోగవర్గంలో చీలికలకు దారితీశాయి. హిందూ ఉద్యోగులు ఒకవర్గంగాను ముస్లిం ఉద్యోగులు ప్రత్యర్థి వర్గంగాను ఏర్పడినారు. బ్రిటిష్ ఉద్యోగులలో అధికసంఖ్యాకులు ముస్లింలపక్షాన్ని వహించారు. పరిపాలన శాఖలలో ఏదీకూడా సక్రమంగాను, సౌష్ఠవంగాను పనిచేయలేకపోయింది. సైన్యంలోకూడా ఈలాటి విభేదాలు పొడసూపినవి.

మంత్రులలో లియాకత్ ఆలీఖాన్ ఆర్థికశాఖను పాలించేవాడైనాడు. అతడు కూడ పక్షపాతంతో ప్రవర్తించి హిందూమంత్రుల శాఖల పరిపాలనకు కావలసిన అర్థ సహాయాన్ని తగిన మొత్తంలో అందజేయుటకు నిరాకరించాడు. దేశంలోని వర్తకవ్యాపారం చాలా వరకు హిందువుల చేతులలో ఉండినవి. వారికి నష్టంకలిగించే ఉద్దేశంతో వర్తక వ్యాపారాలపై అధిక పన్నులను విధించుటకు సంకల్పించాడు.

కాంగ్రెసు లీగుల మధ్య ఏర్పడిన ఈ విభేదాలు హిందువులు ముస్లింల మధ్య మత కలహాలను మరింత ఉధృతం చేసినవి. ఆగస్టు 16న కలకత్తాలో ప్రారంభమైన దౌర్జన్యచర్యలు కాలక్రమాన ఇతర ప్రాంతాలకు వ్యాపించినవి. అక్టోబరు 15న తూర్పు బెంగాలులోని నవ కాలి టిప్పరా జిల్లాలలో ఆ చర్యలు ఆకాశపథాన్ని అందుకొన్నవి. అధికసంఖ్యాకులైన ముస్లింలు అల్పసంఖ్యాకులైన హిందువులను సర్వవిధములైన అత్యాచారాలకు గురిచేశారు. అనేకులను హత్యచేశారు. ఇండ్లను దేవాలయాలను దగ్ధంచేశారు. దుకాణాలను స్వేచ్ఛగా దోపిడిచేశారు. బలప్రయోగంచేసి అనేకులను ఇస్లాంమతంలో చేర్చుకొన్నారు. స్త్రీలను బలాత్కరించి వారిలో అనేకులను అపహరించి తీసుకొనివెళ్ళిపొయ్యారు. రాష్ట్రాన్ని పాలిస్తూ ఉండిన లీగుప్రభుత్వంగాని బ్రిటిష్ అధికారులుగాని అల్లరులను అణచుటకు ఏలాటి చర్యలను తీసుకొనలేదు. వేలాది హిందువులు బిహారుకు కాందిశీకులుగా పారిపోయినారు.

దీని ఫలితంగా బీహారులోని అధికసంఖ్యాకులైన హిందువులు అల్పసంఖ్యాకులైన ముస్లింలపై తమ పగను సాధించుకొనదలచి హత్యలకు దోపిడీలకు స్త్రీల మానభంగానికి పూనుకొన్నారు. ముస్లింలు నిరాశ్రయులై పాట్నావంటి నగరాలలో తలదాచుకొన్నారు, బిహారు ప్రభుత్వం అల్లరులను అణచి ముస్లింలను రక్షించుటకు సత్వరచర్యలను తీసుకొనుటచేత అల్లరులు అణగినవి. తాత్కాలిక ప్రభుత్వానికి నాయకుడైన నెహ్రూ, మరికొందరు కాంగ్రెసు నాయకులు బిహారుకువచ్చి ముస్లింల రక్షణార్థం తగిన చర్యలను తీసుకొనవలసినదిగా ప్రభుత్వాన్ని ఆదేశించారు. బెంగాలు బిహారులలోని ప్రభుత్వాలమధ్య శాంతిభద్రతలను రక్షించడంలో కనుపించిన ఈ భేదాన్ని గుర్తించడం అవసరం.

సోదరులుగా సహజీవనాన్ని సాగించవలసిన హిందువులు ముస్లింలమధ్య ఈలాటి దౌర్జన్యాలు సంభవించడం గాంధీకి ఎంతో మనోవేదనను కలిగించింది. ఆయనకు రాజకీయాల పట్ల విసుగు ఏర్పడింది. వెంటనే ఆయన నవకాలికి వెళ్ళి రెండు నెలలపాటు అన్ని కష్టాలను భరించి, గ్రామ గ్రామాలలో పర్యటనను సాగించి హిందువులు ముస్లింలు ద్వేషభావాన్ని మాని సోదరభావంతో ప్రవర్తించేటట్లు చేయగలిగాడు. గాఢాంధకారావృతమైన బెంగాలులో ఆయన సంచారం ఒక వెలుగుగా ప్రకాశించింది. ఆటుతర్వాత అదే ఉద్దేశంతో ఆయన కొంతకాలం బిహారులో పర్యటించినాడు.

దేశంలో ఈలాటి అల్లరులు జరుగుచుండిన కాలంలోకూడా తాత్కాలిక ప్రభుత్వం లోని కాంగ్రెసు ప్రతినిధులు ముస్లింలీగు ప్రతినిధులు పరస్పర సహకారంతో ప్రవర్తించలేక పోయినారు. ఈ విషయంలో ముస్లిం ప్రతినిధుల ప్రవర్తన కాంగ్రెసు నాయకులకు ఎంతమాత్రం నచ్చలేదు.

ఈలాగు నచ్చకపోవుటకు ఒక ప్రత్యేక కారణంకూడా ఉండినది. జూలై ఆఖరుకు రాయబారవర్గపథక ప్రకారం రాజ్యాంగపరిషత్తుకు ఏన్నికలు జరిగినవి. మొత్తం 292 సభ్యులలో (రాష్ట్రాల సభ్యులలో) శిక్కులు ఎన్నికలను బహిష్కరించిన కారణంగా 288 సభ్యులు మాత్రమే ఎన్నుకొనబడినారు. వీరిలో హిందువులు అధికసంఖ్యలో ఉండిన రాష్ట్రాలతో కూడిన A ఉపసమాఖ్యలో (A section లో) కాంగ్రెసు 2 ముస్లింలతో సహా 164 స్థానాలను ముస్లింలీగు 19 స్థానాలను, స్వతంత్ర ఒక స్థానాన్ని గెలచినవి. పంజాబు, సింధు, వాయవ్య సరిహద్దు రాష్ట్రము బెలూచిస్థాన్‌లతో కూడిన ముస్లిం లు అధికసంఖ్యలో ఉండిన B ఉప సమాఖ్యలో కాంగ్రెసుకు 9 స్థానాలు, ముస్లింలీగుకు 19, యూనియనిస్టు పార్టీకి 3, స్వతంత్రులకు ఒక స్థానం లభించినవి. బెంగాలు అసాంలతో కూడిన C ఉపసమాఖ్యలో కాంగ్రెసు 32, ముస్లిం లీగు 35, కమ్యూనిస్టుపార్టీ 1, షెడ్యూలుకులాల ఫెడరేషన్ 1, కృషక్‌ప్రజాపార్టీ 1 స్థానాన్ని గెలుచుకొన్నవి. పరిషత్తులో మొత్తం 8 సభ్యులలో కాంగ్రెసు సభ్యులు 201, ముస్లింలీగు సభ్యులు 73, స్వతంత్రులు 8, తక్కిన పార్టీలవారు 6 ఎన్నికైనారు.

కాంగ్రెసు లీగు ప్రతినిధులు కలిసి తాత్కాలిక ప్రభుత్వంలో చేరినతర్వాత రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచి రాజ్యాంగాన్ని నిర్మాణం చేయుటకు చర్యలు తీసుకొనవలసి వచ్చింది. కాని జూలై 29న ముస్లింలీగు మే 16 పథకాన్ని అంగీకరించరాదని చేసిన తీర్మానం రద్దయితేనేగాని లీగు సభ్యులు పరిషత్తులో పాల్గొనుటకు వీలులేదు. అందుచేత దానిని రద్దు చేయవలసిందిగా వైస్రాయి పదే పదే జిన్నాను కోరుతూ వచ్చాడు. కాని జిన్నా దానిని రద్దు చేయుటకు బదులు పరిషత్తు సమావేశాన్ని వాయిదా వేయవలసిందిగా పట్టుపట్టాడు. వాయిదా వేయుటకు నెహ్రూ అంగీకరించలేదు. అందుచేత పరిషత్తుసమావేశం డిసంబరు 9 జరుగునని వైస్రాయి సభ్యులందరికి నోటీసులు పంపినాడు. జిన్నా దీనికి జబాబుగా ముస్లింలీగు సభ్యులెవ్వరు పరిషత్తు సమావేశంలో పాల్గొనరాదని ఆదేశించాడు.

తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు అంగీరించిన లీగువారు రాజ్యాంగపరిషత్తులో పాల్గొనకపోవడం మే 16 పథకానికి విరుద్ధమని, వారిని వెంటనే ప్రభుత్వానుండి తొలగించ వలసినదని నెహ్రూ కోరాడు. దేశంలో అంతర్యుద్ధ పరిస్థితులు ఏర్పడుతూ ఉండడాన్ని గమనిస్తున్న ఇండియామంత్రికి ఈ కోరిక ఆందోళన కలిగించింది. కాంగ్రెసు లీగుమధ్య రాజీ కుదిర్చే ఉద్దేశంతో రెండు పార్టీల నాయకులను, శిక్కుప్రతినిధి బలదేవుసింగును, వైస్రాయి వేవెల్‌ను వెంటనే లండనుకు రావలసినదిగా ఆహ్వానించాడు. నెహ్రూకు లండన్ వెళ్ళడం ఇష్టం లేకపోయినా ఆట్లీ ప్రత్యేకంగా ఒక ఉత్తరం వ్రాయడంచేత డిసంబరు 2న లండన్ వెళ్ళినాడు. లీగు తరపున జిన్నా, లియాకత్‌ఖాన్, శిక్కుల తరపున బలదేవుసింగు లండన్ చేరారు. వేవెల్ సమక్షంలో ఇండియామంత్రి మొదలైన బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధులు వారితో చర్చలు జరిపి డిసంబరు 6న తమ నిర్ణయాన్ని వ్యక్తంచేశారు.

మే 16 పథకం ప్రకారం ఉపసమాఖ్యలు సమావేశం కావలసిందిగాను, రాష్ట్రాలు నిర్బంధంగా సమావేశాలలో పాల్గొనవలసిందిగాను వారు నిర్ణయించారు. ఇందులో ఏలాటి నిర్బంధం ఉండరాదనేదే కాంగ్రెసు అభిప్రాయం. కాని బ్రిటన్‌లోని అధికారులు ఈ అభిప్రాయానికి అన్యథాగా తీర్పు చెప్పినారు. ఈ వివాదాస్పద విషయాన్ని భారతదేశంలోని ఫెడరల్ న్యాయస్థానం తీర్చవలసిందిగా నెహ్రూ కోరాడు. ఆ తీర్పు ఏలాటిదైనా దానికి కట్టుబడి ఉండుటకు కాంగ్రెసు సిద్ధంగా ఉన్నట్లు స్పష్టపరచాడు. ఇది విన్న తర్వాత బ్రిటన్‌లోని అధికారులు ఫెడరల్ న్యాయస్థానం తీర్పు ముస్లింలీగుకు అంగీకారయోగ్యంకాక, పరిషత్తులో పాల్గొనుటకు అది నిరాకరించిన పక్షంలో తక్కిన సభ్యులతో మాత్రము కూడిన పరిషత్తు నిర్మాణంచేసే రాజ్యాంగాన్ని అమలుపరచడం సాధ్యంకాదని చెప్పినారు. న్యాయస్థానం తీర్పునకు లీగు కట్టుబడవలసిన అవసరంలేదని అధికారులు నిర్ణయించినట్లు ఈ మాటలు స్పష్టంచేశాయి. ఈ నిర్ణయం నెహ్రూకు ఇతర కాంగ్రెసువారికి పూర్తిగా ఆశాభంగాన్ని కలిగించింది. జిన్నా, తక్కిన ముస్లింలీగు నాయకులు పరమానందభరితులైనారు. తాము పరిషత్తులో పాల్గొనని పక్షంలో పరిషత్తు రూపొందించే రాజ్యాంగాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం అమలుపరచ జాలదని స్పష్టమైన తర్వాత పరిషత్తులో పాల్గొనవలసిన అవసరం లేదనే నిర్ణయానికి వచ్చారు.

1946 డిసెంబరు 9న రాజ్యాంగపరిషత్తు సమావేశమై రాజేంద్రప్రసాదును అధ్యక్షునిగా ఎన్నుకొన్నది. అటుతర్వాత పరిషత్తు ఆశయాలు ఉద్దేశాల గురించి నెహ్రూ ఒక ప్రతిపాదనను ప్రవేశపెట్టి గంభీరోపన్యాసం చేశాడు. లీగుసభ్యులు లేనప్పుడు దీనిని చర్చించడం ప్రాజ్ఞతకాదనే భావంతో పరిషత్తు సమావేశాన్ని జనవరి 20 కు వాయిదా వేశారు. జనవరి 20న పరిషత్తు రెండవ పర్యాయం సమావేశమైంది. కాని లీగు సభ్యులు దానికికూడా హాజరు కాలేదు. అయినా పరిషత్తు ఆశయాల గురించి మొదటి సమావేశంలో నెహ్రూ చేసిన ప్రతిపాదనను చర్చించి అంగీకరించి, అటుతర్వాత ఏలాటి కార్యక్రమాన్ని సాగించక నిరవధికంగా వాయిదా పడింది. పరిషత్తు సమావేశాలు చర్చలు తీర్మానాలు నిష్ఫలములయ్యే సూచనలు కనుపించినవి.

తాము హాజరు కాకపోయినను పరిషత్తు సమావేశమై కొంత కార్యక్రమాన్ని సాగించడం లీగు సభ్యులను ఆగ్రహపూరితులను చేసింది. లీగు జనవరి 31న జిన్నా అధ్యక్షతన సమావేశమై కాంగ్రెసు గాని, శిక్కులు గాని, షెడ్యూలు తరగతులకు చెందినవారు గాని మే 16 పథకంలోని ఉప సమాఖ్యలకు సంబంధించిన ప్రతిపాదనలను అంగీకరించలేదని, ఆలాటివారితో కూడిన పరిషత్తు సమావేశం చట్టవిరుద్ధమని, వెంటనే పరిషత్తును రద్దు చేయవలసిన అవసరం ఏర్పడినదని ఒక తీర్మానం చేసింది. పరిషత్తులో పాల్గొనుటకు లీగుకు ఎంతమాత్రం ఇష్టం లేదని ఈ తీర్మానం స్పష్టం చేసింది. ఈ పరిస్థితులలో లీగు ప్రతినిధులు తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనడం చట్ట విరుద్ధమని, వారు వెంటనే రాజీనామా చేయవలెనని ప్రభుత్వంలోని తక్కిన ప్రతినిధులూ, కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సభ్యులూ ఫిబ్రవరి 5న తీర్మానం చేసి, ఆ తీర్మానాన్ని వైస్రాయికి పంపినారు. వైస్రాయి దానిని లియాకత్ ఆలీఖాన్‌కు తెలియపరచగా మే 16 పథకాన్ని బేషరత్తుగా అంగీకరించని కాంగ్రెసు ప్రతినిధులకు తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనుటకు ఎంతటి హక్కు ఉన్నదో అంతటి హక్కు లీగు ప్రతినిధులకు కూడా ఉన్నదని అందుచేత లీగు సభ్యులు రాజీనామా చేయవలసిన అవసరం లేదని జవాబు చెప్పినాడు. దానిపై

కాంగ్రెసువారు తామే ప్రభుత్వాననుండి రాజీనామా చేయుటకు సిద్ధంగా ఉన్నట్లు వైస్రాయికి తెలియపరచారు. లీగు ప్రత్యక్ష చర్యలోకి దిగినప్పటినుండి దేశంలో అంతర్యుద్ధ పరిస్థితులు ఏర్పడినవి. అనేక రాష్ట్రాలలో మతవర్గాలు పరస్పర కలహాలలోకి దిగినారు. లీగు ప్రతినిధులు తాత్కాలిక ప్రభుత్వంలో చేరినపక్షంలో ఈ కలహాలను అణచడం సాధ్యం కాగలదనే ఉద్దేశంతో కాంగ్రెసు జాతీయసంస్థ అనే సిద్ధాంతాన్ని కూడా మార్చుకొని లీగు ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే ఏకైకసంస్థ అని అంగీకరించి, నెహ్రూ, లీగు ప్రతినిధులు ప్రభుత్వంలో చేరుటకు సమ్మతించాడు. కాని వారు కాంగ్రెసు ప్రతినిధులతో కలిసి పనిచేయక పోవడము, రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనక పోవడము కాంగ్రెసువారికి ఎంతో ఆశాభంగాన్ని కలిగించి ప్రభుత్వాననుండి వారు రాజీనామా చేసేస్థితికి దారి తీసింది. అధిక సంఖ్యాక ప్రజల ఆదరణకు, విశ్వాసానికి పాత్రమయిన కాంగ్రెసు ప్రభుత్వాననుండి రాజీనామా చేసిన పక్షంలో దేశంలో ఏర్పడిన అంతర్యుద్ధ పరిస్థితులు మరింత విషమించడం తప్పదు. లీగు ప్రతినిధులు రాజీనామా చేసినా ఇదే జరుగుతుంది. ఈ స్థితిలో ఏమి చేయుటకు తోచక వేవెల్ ఏదో ఒక నిర్ణయాన్ని చేయవలసిందిగా బ్రిటన్‌లోని అధికారులను కోరాడు.

తాము తీసుకొనదగిన నిర్ణయాన్ని గురించి వారు క్షుణ్ణంగా పరిశీలించారు. దేశ సమైక్యతను రక్షించే ఉద్దేశంతోను, పాకిస్థాన్ నిర్మాణ విషయంలో ముస్లింలీగు వారిని చాలావరకు తృప్తిపరచే ఉద్దేశంతోను తాము మే 16 పథకాన్ని రూపొందించారు. కాని దాని ప్రకారం బాధ్యతను వహించుటకు కావలసిన ఏకీభావం కాంగ్రెసు లీగుల మధ్య కుదరలేదు. తాము ఎంత ప్రయత్నం చేసినా ఇది కుదిరేటట్లు కనుపించలేదు. తాము పరిపాలనాధికారాన్ని వహించగల స్థితిలో లేరు. దానికి కావలసిన అంగబలం గాని, అర్థబలం గాని తమకు లేదు. కాంగ్రెసు లీగులు వహించవలసిన బాధ్యతను తాము వహించి మరికొంతకాలం భారతదేశాన్ని పాలించడం సాధ్యం కానిపని. వీటినన్నిటిని గమనించి కాంగ్రెసు లీగులు కలిసి పనిచేయుటకు అంగీకరించినా అంగీకరించక పోయినా, భారతదేశ పరిస్థితులు ఏలాగు పరిణమించినా తామొక తుది నిర్ణయానికి రావడమే ఉచితమని బ్రిటన్‌లోని అధికారులు భావించి ఆ నిర్ణయాన్ని 1947 ఫిబ్రవరి 20న ప్రధాని అట్లీ పార్లమెంటులో ప్రకటించాడు.

ఆ ప్రకటన (1) బ్రిటిష్‌వారు 1948 జూన్ ఆఖరులోపుగా భారతదేశంపై తమకుగల అధికారాన్ని పూర్తిగా వదలుకొనెరదని, (2) అప్పటికి అన్నివర్గాల సహకారంతో రాజ్యాంగ పరిషత్తు అందరికీ ఆమోదయోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందించిన పక్షంలో పార్లమెంటు దానిని ఆమోదించి, దానిప్రకారం ఏర్పడిన ప్రభుత్వానికి బ్రిటిష్‌వారు వదలుకొన్న అధికారాన్ని పరివర్తన చేయడం జరుగుతుందని, (3) ఆలాటి రాజ్యాంగం గాని, ప్రభుత్వం గాని ఏర్పడని పక్షంలో ఆనాటికి రాష్ట్రాలలో అధికారం వహించే ప్రభుత్వాలకు అధికార పరివర్తన చేయడం జరుగుతుందని, (4) ఇదికూడా సాధ్యం కానప్పుడు భారతదేశ ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ఏ మార్గాన్ని అనుసరించడం ఉచితమో ఆ మార్గాన్ని అనుసరించడం జరుగుతుందని స్పష్టం చేసింది. 1948 జూన్ ఆఖరులోగా అధికార పరివర్తన గురించి తీసుకొనవలసిన చర్యలను తీసుకొనుటకు వేవల్ స్థానే మౌంటుబాటన్ ప్రభువును వైస్రాయిగా నియమించడం జరుగుతుందని కూడా అట్లీ ప్రకటించాడు.

ఈ ప్రకటన ఉదారమైనట్టిదని చెప్పక తప్పదు. సామ్రాజ్యాధికారాన్ని వహించిన వారెవరూ ఈ విధంగా తమ అధికారాన్ని వదులుకొనుటకు నిర్ణయించడం సామాన్యంగా జరిగే నిర్ణయం కాదు. బ్రిటిష్ ప్రభుత్వం అలాటి నిర్ణయానికి రావడం ఒక అద్భుతమైన విషయం. దీనిమూలంగా 1948 తర్వాత భారతదేశంపై బ్రిటిష్‌వారి అధికారం ఉండదని, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తుందని స్పష్టమైంది. దీనితో 40 సంవత్సరాలుగా భారతీయులు సాగించిన స్వాతంత్ర్యోద్యమం ఫలప్రదమై తుది ఘట్టాన్ని చేరింది. అట్లే చేసిన ప్రకటన చరిత్రాత్మకమైనదని భావించుటకు ఇదే కారణం.

చదువదగిన గ్రంథాలు:

Bhavan: Vol. xi
Tarachand: Vol. iv
R. C. Majumdar : Vol. III
V. P. Menon : Transfer of Power
Tendulkar : Mahatma, Vol. vii
Sudir Ghosh. Emissary of Gandhi

# అధ్యాయము-18

## స్వాతంత్ర్యోద్యమ విజయము - దేశవిభజన

## 1

ఫిబ్రవరి 20న బ్రిటిష్ ప్రధాని ఆట్లీ చేసిన ప్రకటన దేశభవిష్యత్తును నిర్ణయించ వలసిన బాధ్యతను దేశంలోని ప్రధాన పార్టీలైన కాంగ్రెసు ముస్లింలీగులపై విధించింది. ఉభయ పార్టీలమధ్య ఏకాభిప్రాయం కుదిరి, లీగు ప్రతినిధులు రాజ్యాంగ పరిషత్తులో పాల్గొని, అందరికీ ఆమోదయోగ్యమైన రాజ్యాంగాన్ని నిర్మాణం చేయడంలో సహకరించిన పక్షాన దేశానికంతా ఒక కేంద్ర ప్రభుత్వం ఏర్పడడం, బ్రిటిష్‌వారు వదలుకొనే పరిపాలనాధికారం దానికి పరివర్తన చేయడం జరుగుతుంది. కాంగ్రెసు లీగులు ఈవిధంగా సహకరించని పక్షంలో దేశవిభజన తప్పదు. ఆట్లీ చేసిన ప్రకటన స్వాతంత్ర్య సమస్యను పరిష్కరించింది. దేశ సమైక్యతను గురించిన సమస్యయొక్క పరిష్కారాన్ని పార్టీలకు వదిలింది.

మార్చి 6న కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ సమావేశమై ఆట్లీ చేసిన ప్రకటనపట్ల హర్షాన్ని వెలిబుచ్చి, దేశ భవిష్యత్తును గురించి చర్చలు జరపవలసిందిగా జిన్నాను ఆహ్వానించింది. దేశవిభజన జరిగే పక్షంలో ముస్లింలు కానివారు అధిక సంఖ్యాకులుగా నివసించే పంజాబు బెంగాలు ప్రాంతాలను ఆ రాష్ట్రాలనుండి విడదీసి భారత సమాఖ్యలో చేర్చవలసిందిగా తీర్మానించింది.

ముస్లింలీగు కౌన్సిల్ దేశానికంతా ఒకే కేంద్ర ప్రభుత్వం ఏర్పడడం వాంఛితం కాదని కాంగ్రెసు ఆహ్వానాన్ని నిరాకరించింది.

1948 జూన్ నాటికి దేశానికంతా ఒకే కేంద్ర ప్రభుత్వం ఏర్పడని పక్షంలో ఆయా రాష్ట్రాలలోని ప్రభుత్వాలకు పరిపాలనాధికారం పరివర్తన చేయడం జరుగుతుందని ఆట్లీ ప్రకటన స్పష్టం చేసింది. దేశంలో మద్రాసు, ఒరిస్సా, ఆసాం, బిహారు, ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, బొంబాయి రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడి ఉండినవి. అందుచేత 1948 జూన్ నాటికి, బ్రిటిష్‌వారు వదలుకొనే పాలనాధికారం ఈ ప్రభుత్వాలకూ, వీటిద్వారా కాంగ్రెసుకూ లభిస్తుంది. ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉండిన రాష్ట్రాలలో బెంగాలు, సింధు రాష్ట్రాలలో మాత్రమే లీగు ప్రభుత్వాలు ఏర్పడి ఉండినవి. బెలూచిస్థాన్‌లోని ప్రభుత్వం కూడా చాలావరకు లీగుకు సన్నిహితమైనట్టిది. కాని పంజాబును యూనియనిష్టు పార్టీ నాయకుడైన ఖిజిరీహయత్‌ఖాన్ హిందువులు శిక్కుల సహకారంతోను, వాయవ్య సరిహద్దు రాష్ట్రాన్ని కాంగ్రెసు పార్టీకి చెందిన డాక్టరు ఖాన్‌సాహెబు పరిపాలిస్తూ ఉండినారు. వీరికి దేశవిభజన గాని పాకిస్థాన్ నిర్మాణం గాని ఆమోదయోగ్యం కాలేదు. అందుచేత వారి అధికారాన్ని ఏ విధంగానైనా తొలగించి, వారి స్థానే లీగు ప్రభుత్వాలను స్థాపించిన గాని తాను వాంఛించిన పాకిస్థాన్

నిర్మాణం జరుగదని జిన్నా భావించి అందుకుగాను ప్రత్యక్ష చర్యను సాగించుటకు తీర్మానించాడు.

ఈ తీర్మానానుసారం పంజాబులోని ముస్లింలీగుకు చెందినవారు భారీ ఎత్తున హిందువులు శిక్కులపై దౌర్జన్యాలలోకి దిగినారు. వాటిని అణచి, రాష్ట్రంలో శాంతి భద్రతలను స్థాపించుటకు హయత్‌ఖాన్ గొప్ప ప్రయత్నం చేశాడు. కాని రాష్ట్రంలోని బ్రిటిష్ అధికారులు, కేంద్రప్రభుత్వంలోని ముస్లింలీగు సభ్యులు అతనితో సహకరించని కారణంగా అతని ప్రయత్నం ఫలప్రదం కాలేదు. అందుచేత అతడు విసుగుదలతో మార్చి 3న రాజీనామా చేశాడు.

అతడు రాజీనామా చేసినా శాసనసభలో లీగుపార్టీకి మెజారిటీ బలం లేనందున లీగు మంత్రివర్గం అధికారంలోకి రావడం సాధ్యపడక 1935 చట్టం క్రింద గవర్నరు పరిపాలనాధికారాన్ని స్వీకరించాడు. ఇది ముస్లింలీగుకు చాలా ఆశాభంగాన్ని కలిగించింది. అది యథాపూర్వంగా, ప్రత్యక్ష చర్యను సాగించింది. రాష్ట్రమందంతటా ముస్లింలు ఒకే పక్షంలోను, హిందువులు శిక్కులు ఇంకొక పక్షంలోను చేరి అంతర్యుద్ధంలోకి దిగారు. ఇది క్రమ క్రమంగా లాహోరు, రావల్పిండి, అమృత్‌సర్, ముల్టాన్ మొదలైన నగరాలన్నిటికీ వ్యాపించి హత్యలకు, దోపిడీలకు, దహనాలకు దారి తీసింది. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో కూడా ఈలాటి పరిస్థితులే ఏర్పడినవి. చట్టానుసారం అధికారంలోకి రావడం సాధ్యం కానందున బలప్రయోగం ద్వారా అధికారాన్ని సంపాదించుటకు ముస్లింలీగు ప్రయత్నం చేయడం, ఆ ప్రయత్నంలో బ్రిటిష్ అధికారులు, కేంద్ర ప్రభుత్వంలోని లీగుసభ్యులు దానికి తోడ్పడడం గుర్తించదగిన విషయం.

ఈ పరిస్థితులలో మౌంటుబాటన్ మార్చి 24న వైస్రాయిగా పదవీ స్వీకారం చేశాడు. అది మొదలు ఏప్రిలు 15 వరకు గాంధీతోను, కాంగ్రెసు లీగుల నాయకులతోను ఇతర ప్రముఖులతోను సంప్రతింపులు జరిపాడు. ఏప్రిల్ 15న రాష్ట్ర గవర్నరులను సమావేశపరచి వారి అభిప్రాయాలను కూడా తెలుసుకొన్నాడు. వీటి అన్నిటి ఫలితంగా దేశంలోని పరిస్థితులు అతి క్లిష్టరూపం ధరించినట్లు గ్రహించాడు.

ప్రధానంగా కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసు ప్రతినిధులు ఒక వర్గంగాను, ముస్లిం ప్రతినిధులు ఇంకొక వర్గంగాను ఏర్పడడం చేతను, దీనిఫలితంగా అన్ని శాఖలలోని ఉద్యోగులు కూడా రెండు వర్గాలుగా చీలిపోవడం చేతను దేశంలో పరిపాలన అనేది లేక అరాచక పరిస్థితులు ఏర్పడినట్లు గుర్తించాడు. ఇదిగాక; ఢిల్లీ, పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో మతవర్గాల మధ్య యుద్ధం సంభవించి, అపారమైన ప్రాణ నష్టానికి ఆస్తినష్టానికిదారి తీయడం గమనించాడు. పటిష్టమైన ప్రభుత్వం లేనికారణంగా ఆర్థిక పరిస్థితులు దిగజారి ప్రజలు దారిద్ర్యానికి గురి కావడం గుర్తించాడు. పరిస్థితులు ఈలాగే కొన్ని నెలలపాటు సాగిన పక్షంలో శాంతిభద్రతలు పూర్తిగా లోపించి, ప్రజలు రక్షణ అనేది లేక ఎవరికి తోచినట్లు వారు ప్రవర్తించడం తప్పదని గ్రహించాడు. బ్రిటిష్ పరిపాలన ఈ విధంగా ముగియడం అతనికి ఎంతో విచారాన్ని కలిగించింది. ఈ పరిస్థితులను చక్కబెట్టుటకు బ్రిటన్‌నుండి అధికసంఖ్యలో సైన్యాలను తరలించడం అవసరమైనా బ్రిటిష్ ప్రజలు గాని బ్రిటన్‌లోని అధికారులు గాని దానికి అంగీకరించరని గ్రహించాడు. భారతదేశంలోని పోలీసులలోను సైనికులలోను వర్గ విభేదాలు బలపడడంచేత శాంతిభద్రతలను రక్షించడంలో వారిని వినియోగించడం ఫలప్రదం కాజాలదని కూడా గ్రహించాడు.

పరిస్థితులను పూర్తిగా అర్థంచేసుకొన్న తర్వాత అతడు కొన్నినిర్ణయాలకు వచ్చాడు. బ్రిటిష్‌వారి అధికారాన్ని ఎంత త్వరగా వదలుకొంటే అంతమంచిది అనేది ఈ నిర్ణయాలలో మొదటిది. సాధ్యమైతే దీనిని 1947 లోనే వదలుకోవలెను. పరిస్థితులను చక్కబెట్టుటకు కావలసిన సైనికబలం తమకు లేనప్పుడు శాంతిభద్రతలను రక్షించి దేశాన్ని పాలించే బాధ్యతను అనాలస్యంగా ప్రజా ప్రతినిధులకు ఒప్పగించడమే ప్రాజ్ఞత. ఇదిగాక కాంగ్రెసు, లీగుల మధ్యను, హిందువులు, ముస్లింల మధ్యను ఏర్పడిన ద్వేషభావం దేశ సమైక్యతను నిలబెట్టుటకు గొప్ప అవరోధంగా పరిణమించింది. అందుచేత దేశవిభజన అనివార్యం అనేది అతని నిర్ణయాలలో రెండవది. ఇంతేగాక దేశవిభజనతోపాటు పంజాబు, బెంగాలు రాష్ట్రాల విభజనకూడా జరగవలెననేది అతని నిర్ణయాలలో మూడవది. ఈ రాష్ట్రాలలో ముస్లింలుకానివారు అధికసంఖ్యలో నివసించే ప్రాంతాలను పాకిస్తాన్‌లో చేర్చరాదు. (ఇది 1944 లో రాజగోపాలాచారి ప్రతిపాదించిన సూత్రం. దీనిని ఆధారం చేసుకొనే గాంధీ జిన్నాతో సంప్రతింపులు జరిపాడు.)

తాను ఈ నిర్ణయాలకు వచ్చినతర్వాత కాంగ్రెసు నాయకులను దేశవిభజనకు అంగీకరించవలసిందిగా వైస్రాయి కోరాడు. వారి అంగీకారం లేక ఏకపక్షంగా దేశవిభజనకు పూనడం నిరర్థకమని గ్రహించాడు. ఆ నాడు దేశంలో ఏర్పడిన పరిస్థితులను గుర్తించి కాంగ్రెసు నాయకులు దేశవిభజనకు అంగీకరించారు. దీనికి వారు అంగీకరించుటకు ప్రధాన కారణాలు ఏవో తెలుసుకొనడం అవసరం.

(1) దేశసమైక్యతను రక్షించడం ఉన్నత ఆశయమైనా భారత సమాఖ్యలో చేరుటకు ఇష్టంలేని ప్రజలను నిర్బంధించి దేశసమైక్యతను రక్షించడం తనలక్ష్యం కాదని కాంగ్రెసు 1934 నుండి అనేక పర్యాయాలు తీర్మానించింది. 1940 తర్వాత రాజగోపాలాచారి హిందూ ముస్లిం సమస్యను పరిష్కరించుటకు ఇది పటిష్ఠ సాధనమని భావించి గాంధీని దీనికి ఒప్పించాడు. 1942 హరిజన పత్రికలో గాంధీ ముస్లింలు పట్టుబట్టిన పక్షంలో పాకిస్తాన్ నిర్మాణానికి అంగీకరించడం ఉచితమనే అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు. దీనిని ఆధారం చేసుకొనే ఆయన జిన్నాతో 1944 లో చర్చలు సాగించాడు. అందుచేత 1946 లో వైస్రాయి దేశ విభజనను గురించి చేసిన ప్రతిపాదనకు కాంగ్రెసు నాయకులు అంగీకరించడం గతంలో వారు వ్యక్తం చేసిన అభిప్రాయాలకు అనుగుణమైనట్టిదిగా వారు భావించారు.

(2) అఖిల భారత సమాఖ్యలో కాంగ్రెసు ప్రతినిధులు ముస్లింలీగు ప్రతినిధులు కలిసి సంకీర్ణ మంత్రివర్గంగా ఏర్పడి దేశాన్ని పాలించవలసివస్తుంది. కాని 1946 నాటికి ముస్లిం లీగుకు చెందినవారి మనోవైఖరి ఈ విధంగా పాలించడం సాధ్యంకాదని స్పష్టం చేసింది. వల్లభాయ్ పటేల్ ప్రధానంగా ఈ కారణంచేతనే వైస్రాయి ప్రతిపాదనను అంగీకరించాడు. హిందువులు ఒకజాతివారని, ముస్లింలు ఇంకొక జాతివారని జిన్నా మొదలైన ముస్లిం నాయకులు భావిస్తున్నంత కాలం సంకీర్ణ మంత్రివర్గాలద్వారా దేశాన్ని పాలించడం ఫలప్రదం కాజాలదు. ముస్లింలీగు వారు 1945 అక్టోబరులో కేంద్ర ప్రభుత్వంలో ప్రవేశించినప్పటినుండి తాను గడించిన అనుభవంమూలంగా ఈ నిర్ణయానికి వచ్చినట్లు పటేల్ ఉద్ఘాటించాడు.

(3) రాజేంద్రప్రసాదు కూడా ఇదే నిర్ణయానికి వచ్చాడు. ముస్లింలీగు ప్రతినిధులతో కలిసి దేశాన్ని పాలించడం ఒక బెడదగా ఏర్పడినదని, పాకిస్తాన్ నిర్మాణానికి అంగీకరించిన

పక్షంలో ఆ బెడద తొలగి, తక్కిన భారతదేశాన్ని తమ ఇష్టానుసారం సౌష్టవంగా పాలించడం సాధ్యంకాగలదని, ఏది సాధ్యమో దానికి కట్టుబడడమే ప్రాజ్ఞత అని ఆయన దేశ విభజనకు అంగీకరించాడు.

(4) నెహ్రూకూడా ఈలాటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. ముస్లింలు హిందువులు కలిసి పౌరులుగా ఉండే అఖిల భారత సమాఖ్యలో కేంద్ర ప్రభుత్వం 1946 మే 16పథకం ప్రతిపాదించినట్లు పరిమితమైన అధికారాలను మాత్రమే వహించవలసి ఉంటుంది. తక్కిన అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలకు సంక్రమిస్తవి. కాని ఈలాటి రాజ్యాంగం వాస్తవంగా దేశ సమైక్యతను నిలబెట్టలేదు. దానికి కావలసిన అధికారం బలం కేంద్రప్రభుత్వానికి ఉండజాలదు. పాకిస్తాన్ నిర్మాణానికి అంగీకరించిన పక్షంలో ముస్లింల అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా గరిష్ఠప్రమాణంలో అధికారం వహించిన కేంద్ర ప్రభుత్వాన్ని నిర్మాణం చేసుకొని దేశాన్ని సౌష్టవంగా పాలించడం సాధ్యమౌతుంది. అనాదిగా కేంద్రప్రభుత్వానికి తగిన అధికారబలం లేకపోవడంచేత నే ఏ సామ్రాజ్యంకూడా దేశంలో స్థిరత్వాన్ని సంపాదించ లేకపోయింది. చరిత్ర చేసే హెచ్చరిక ఇది. దేశ విచ్ఛిత్తికి దారితీసే శక్తులను నిరోధించుటకు అధికారబలం గల కేంద్రప్రభుత్వం అవసరం. భారత సమాఖ్యనుండి పాకిస్థాన్ ప్రాంతాలు విడిపోవడం మూలాన ఈ అవసరం తీరుతుంది. వైస్రాయికూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తంచేశాడు.

(5) కాని గాంధీ దేశవిభజనను ప్రతిఘటించిన పక్షంలో ఆయనను కాదని కాంగ్రెస్ నాయకులు దానికి అంగీకరించి ఉండేవారు కారు. 1947 నాటికి ఆయనకూడా దేశైక్యతను నిలబెట్టడం సాధ్యంకాదనే నిర్ణయానికి వచ్చాడు. ముస్లింలతో యుద్ధాన్ని సాగించితేగాని అది సాధ్యం కాజాలదు. కాని అహింసా సూత్రానికి కట్టుబడి ఆలాటియుద్ధాన్ని ప్రజలు సాగించే స్థితిలో లేరు. ఈ పరిస్థితులలో గుడ్డిలోమెల్ల అన్నట్లు దేశ విభజనకు అంగీకరించడమే ప్రాజ్ఞత అని ఆయనకూడా భావించాడు. కాంగ్రెసు కార్యనిర్వాహక కమిటీ దేశ విభజనకు అంగీకరిస్తూ చేసిన తీర్మానాన్ని ధ్రువపరచుటకు 1947 జూన్ 14 న అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశ మైనప్పుడు సభ్యులు కొందరు తీర్మానాన్ని తీవ్రంగా ఖండించారు. అప్పుడు చర్చలలో గాంధీ జోక్యం కలిగించుకొని తీర్మానాన్ని ధ్రువపరచవలసిందిగా సభ్యులను కోరుతూ గొప్ప ఉపన్యాసం చేశాడు. దానిని ధ్రువపరచని పక్షంలో పటేల్, నెహ్రూ, రాజేంద్రప్రసాద్ మొదలైనవారు ప్రభుత్వాననుండి రాజీనామా చేయడం తప్పదని, అనుభవంలేని కాంగ్రెసు నాయకులు పరిపాలనను సాగించవలసి వస్తుందని, అది వాంఛనీయం కాదని ఉద్ఘాటించాడు. దేశవిభజన అనేక అనర్థాలకు దారితీయగలది అయినా దేశంలో ఏర్పడిన ఉద్రిక్తపరిస్థితుల దృష్ట్యా దానికి అంగీకరించడం అందరి విధి అని నొక్కి చెప్పినాడు.

పై కారణాలన్నిటి ఫలితంగా కాంగ్రెసు దేశవిభజనకు అంగీకరించింది. ముస్లింలు కానివారు అధికసంఖ్యలో వుండే ప్రాంతాలను పంజాబు, బెంగాలు, ఆసాం రాష్ట్రాలనుండి వేరుపరచి భారత సమాఖ్యలో చేర్చవలసిందిగా అది కోరింది. వైస్రాయి దానిని మన్నించడం చేత దేశ విభజనకు కాంగ్రెసు ఆమోదించడం సులభసాధ్యమైంది.

ముస్లింలీగు దేశవిభజనకు అంగీకరించినా పంజాబు, బెంగాలు, ఆసాం రాష్ట్రాల నుండి కొన్ని ప్రాంతాలను పాకిస్థాన్‌నుండి మినహాయించడాన్ని ప్రతిఘటించింది. కాని

వైస్రాయి ఈలాటి ప్రతిఘటనను చేసిన పక్షంలో పాకిస్థాన్ నిర్మాణమే సాధ్యంకాదని గట్టిగా చెప్పాడు. అటుపైన వైస్రాయి చేసిన నిర్ణయాలన్నిటికి జిన్నా సమ్మతించాడు

ఒకదశలో బెంగాలు ముఖ్య మంత్రి సురవర్దీ బెంగాలు రాష్ట్రమంతా ఒక ప్రత్యేక స్వతంత్ర రాజ్యంగా ఏర్పడవలెనని సూచన చేశాడు. హిందువుల నాయకులు కొందరు దీనికి అంగీకరించారు. కాని లీగు నాయకుడు జిన్నాకు ఇది అమోదయోగ్యం కానందునను హిందూ మహా సభవారు దీనిని ప్రతిఘటించినందునను ఈ ప్రతిపాదన వీగిపోయింది.

పంజాబులోని శిక్కులకు దేశ విభజన ఎంతమాత్రం అమోదయోగ్యం కాలేదు. వారు తూర్పు పంజాబులోనే గాక పశ్చిమ పంజాబులో కూడా నివసిస్తూ వచ్చారు. వారి పుణ్య క్షేత్రాలలో అనేకం పశ్చిమ పంజాబులో ఉండినవి. అందుచేత వారి ప్రత్యేక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చీనాబు నది ఎల్లగా పంజాబును విభజన చేయవలసిందిగా కోరారు. వారిలో కొందరు ఖాల్సాస్థాన్ అనే పేరుతో ఒక స్వతంత్రరాజ్యాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కూడా కోరారు. కాని వారికోరికలను ఎవరూ మన్నించలేదు. పశ్చిమ పంజాబులో ముస్లింల మధ్య నివసించడం ప్రమాదకరమనే నిర్ణయానికి వారు వచ్చారు. అక్కడి ముస్లింలు వారి ఆస్తులను వశపరచుకొనే ఉద్దేశంతో పశ్చిమ పంజాబునుండి వారిని తొలగించుటకు సిద్ధపడ్డారు. ఈ పరిస్థితులలో రెండువర్గాల మధ్య దౌర్జన్యాలు చెలరేగాయి. దీనికి జవాబుగా తూర్పు పంజాబులోని ముస్లింలపై హిందువులు శిక్కులు అత్యాచారాలు జరిపి వారిని పశ్చిమ పంజాబుకు పారిపోయేటట్టు చేశారు. దేశ విభజనకు కాంగ్రెసు ముస్లింలీగులు అంగీకరించిన తర్వాత పంజాబు మతవర్గాల మధ్య యుద్ధానికి కేంద్రంగా రూపొందింది. ఇది 1947 ఆగస్టు 15 న దేశ విభజన జరిగి, దేశానికి స్వాతంత్ర్యం లభించినతర్వాత కూడా సాగింది. దీనిఫలితంగా 1947 సెప్టంబరు ఆఖరుకు 600.000 జనం హతులయ్యారు; 140 లక్షల జనం తరతరాలుగా వారు నివసిస్తూ వచ్చిన ప్రదేశాలను వదలి కాందిశీకులుగా కొంతరు భారతదేశానికి మరికొందరు పాకిస్థాన్‌కు పారిపోయినారు. శాంతియుతంగా సత్యాగ్రహ సమరంద్వారా దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించవలసిందిగా గాంధీ వాంఛించాడు. ఆయన లేవదీసిన ఉద్యమాలన్నీ అలాగే సాగినవి. కాని తుది దశలో స్వాతంత్ర్య సంపాదనతోపాటు దేశవిభజన జరిగిన కారణంగా ప్రపంచ చరిత్రలో కనీవినీ ఎరుగని హత్యలు జరగడం కాందిశీకుల సమస్య ఒకటి ఏర్పడడం తప్పింది కాదు. ఈలాటి పరిణామాలు సంభవించే సూచనలు జిన్నా ప్రత్యక్ష చర్యను తలపెట్టినప్పటినుండి కనుపించినా ఆ నాడు అధికారంలో ఉండిన వేవెల్ ప్రభుత్వంగాని, మౌంట్ బాటన్ ప్రభుత్వంగాని ఆలాటి పరిణామాలు సంభవించకుండా ఉండుటకు కావలసిన చర్యలను తీసుకొనకపోవడం బ్రిటిష్ పరిపాలన చరిత్రలో ఒక చెరగని నల్లనిమచ్చగా నిలిచిపోయింది.

## 2

తాను వచ్చిన నిర్ణయాలకు కాంగ్రెసు ముస్లింలీగుల ఆమోదాన్ని పొంది దేశవిభజనకు అధికార పరివర్తనకు సంబంధించిన పథకాన్ని ఒకదానిని తయారుచేసి వైస్రాయి బ్రిటన్‌లోని అధికారులకు మే 2 న పంపినాడు. వారు దానిలో కొన్ని సవరణలను చేసి, దానిని ఆమోదించి వెంటనే వైస్రాయికి పంపినారు. కాని ఈ పథకం నెహ్రూకు ఎంతమాత్రం అంగీకారయోగ్యం కాలేదు. అది ఒక పాకిస్థాన్‌గాక దేశంలో అనేక పాకిస్థాన్‌లు ఏర్పడుటకు వీలు కలిగించినట్లు

టట్లు ప్రోత్సహించారు. ఇందులో మౌంట్‌బాటన్ కూడా అతనితో పూర్తిగా సహకరించాడు. దీని ఫలితంగా ఆగస్టు 15 నాటికి హైదరాబాదు, జూనాగడ్, కాశ్మీరులు మినహా తక్కిన సంస్థానాలు అత్యధికం భారత సమాఖ్యలో విలీనం అయిపోయినవి. భౌగోళికంగా పాకిస్థాన్‌కు సన్నిహితంగా ఉండిన సంస్థానాలు దానిలో విలీనమైపోయినవి. ఈ విధంగా దేశానికి స్వతంత్రం లభించేనాటికి సంస్థానాల సమస్య కూడా చాలావరకు పరిష్కారమైనది.

ఆగస్టు 7న జిన్నా ఇండియాను వదలి పాకిస్థాన్‌కు ప్రధాన నగరంగా ఏర్పడిన కరాచీకి వెళ్ళిపోయి పాకిస్థాన్ నిర్మాతగా చరిత్రలో ప్రఖ్యాతిని సంపాదించినాడు. ఆగస్టు 11న పాకిస్థాన్ రాజ్యాంగ పరిషత్తు అతనిని అధ్యక్షునిగా ఎన్నుకొన్నది. స్వాతంత్ర్య చట్టం ఉద్దేశించినట్లు భారత మౌంటుబాటన్ ప్రభువును పాకిస్థాన్ రాజ్యాంగ పరిషత్తు గవర్నరు జనరల్‌గా నియమించగలదని, భారత సమాఖ్య అతనిని గవర్నరు జనరల్‌గా నియమించుటకు సిద్ధంగా ఉండడంచేత ఒకే వ్యక్తి రెండుడు మినియన్‌లకు గవర్నరు జనరలై, వాటిమధ్య ఉత్పన్నమయ్యే వివాదాలను సమరసభావంతో పరిష్కరించగలడని అనేకులు ఊహించారు. కాని పాకిస్థాన్ ఇండియాల మధ్య ఏలాటి రాజకీయ సంబంధాలు ఉండరాదనే భావంతో జిన్నా ఈ నియామకానికి సమ్మతించక తానే పాకిస్థాన్‌కు గవర్నరు జనరల్ అయ్యాడు.

దేశచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన ఆగస్టు 14న మధ్య రాత్రివేళలో ఢిల్లీ నగరంలోని శోభాయమానమైన శాసనసభ భవనంలో భారత రాజ్యాంగ పరిషత్తు రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన స్వాతంత్ర్యోదయ ఉత్సవాన్ని జరుపుటకు సమావేశమైనది. స్వతంత్ర భారతదేశానికి ప్రథమ ప్రధానిగా ఎన్నికైన నెహ్రూ, పటేల్ మొదలైన కాంగ్రెసు నాయకులు, గవర్నరు జనరల్‌గా నియమింపబడిన మౌంటుబాటన్ ప్రభువు, అతని సతీమణి సభావేదికపై ఆసీనులైనారు. ఆ శుభ సమయంలో ఆవేశపూరితులైన పరిషత్సభ్యులను దేశ ప్రజలను ఉద్దేశించి నెహ్రూ ఒక గంభీరమైనట్టిన్నీ ఉదాత్త భావాలతో కూడినట్టిన్నీ ఉపన్యాసం చేసి సభ్యులందరు దేశప్రజల సేవకూ, దేశానికి ఉజ్వల భవిష్యత్తు సృష్టించుటకూ, ప్రపంచ శాంతికీ మానవకోటి శ్రేయస్సుకూ తమ శక్తి సామర్థ్యాలను జీవితాలను అంకితం చేయవలసిందిగా కోరాడు. వారందరు అలాటి ప్రతిజ్ఞను చేసి స్వాతంత్ర్యోదయ ఉత్సవాన్ని జరిపారు. దేశ మందంతటా ప్రజలు ఉత్సాహపూరితులై ఈలాటి ఉత్సవాన్నే జరిపారు. ఆనాటితో రెండు వందల సంవత్సరాల రాజకీయ దాస్యం తొలగి తమకు సంపూర్ణ స్వాతంత్ర్యమూ, ప్రపంచంలో అన్ని స్వతంత్ర జాతులమధ్య తాముకూడా సగర్వంగా తల ఎత్తుకొని తిరుగగల మహదవకాశమూ లభించినందులకు ప్రజలు పరమానంద భరితులైనారు. దేశవిభజన జరిగినందుకు అందరూ విచారగ్రస్తులైనా అది విధి నిర్ణయమనే భావంతో తమ మనస్సులను సమాధానపరచుకొన్నారు. తమ దేశ చరిత్రలో అంధకారయుగం అంతరించి సర్వవిధాలా ప్రకాశవంతమైన నూతన యుగం ప్రారంభమైనట్లు అందరూ సంతోషించారు.

దేశ స్వాతంత్ర్య నిర్మాతగా ప్రజల ఆదరాభిమానాలకు పాత్రుడైన గాంధీ ఆనాడు ఢిల్లీకి వచ్చి ఉత్సవాలలో పాల్గొనలేదు. దేశ విభజన, తత్ఫలితంగా పంజాబులో సంభవించిన దురంతాలు, హత్యలు, కాందిశీకుల అరణ్యరోదనము ఆయనకు భరింపరాని మనోవేదనను కలిగించినవి. మత వర్గాలమధ్య సామరస్యాన్ని కుదుర్చుటకు తాను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనందుకు విషాదగ్రస్తుడై దేశానికి స్వాతంత్ర్యం లభించినా అది తనకు తృప్తి కలిగించ

గల స్వాతంత్ర్యం కాదని, దారిద్ర్య పీడితులను, అస్పృశ్యులను, నిరాశ్రయులను ఉద్ధరించడమే తన కర్తవ్యమని, ఢిల్లీ వంటి నగరాలలోగాక అలాటివారి మధ్యనే తన జీవితాన్ని సాగించడం ధర్మమనే భావం ఆయనలో మరింత బలపడింది. ఏలాటి అధికార వ్యామోహంలేక ఆయన తన మిగులు జీవితాన్ని వారి మధ్యనే గడిపినాడు.

ఆగస్టు 15న రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన రాజ్యాంగ పరిషత్తు తిరిగి సమావేశమైనది. మౌంటుబాటన్ ప్రభువు గవర్నరుజనరలుగా పదవీస్వీకారం చేసి, "ఈ రోజునుండి నేను మీకు రాజ్యాంగ బద్ధమైన గవర్నరుజనరల్‌ను. మీలో ఒకనిగాను, మీ ప్రయోజనాలకై సర్వవిధాలా పాటుపడే వానినిగాను, మీరు నా పట్ల అలాటి భావంతో ప్రవర్తించవలసిందిగాను కోరుతున్నాను" అని పలికినాడు. మౌంటుబాటన్‌కు వందనములు సమర్పిస్తూ రాజేంద్రప్రసాద్, "ఈ రోజుతో బ్రిటిష్‌వారు మనపై వహించిన అధికారం అంతమొందింది. ఇది మొదలు బ్రిటిష్‌వారితో మనకుగల సంబంధానికి సమానత్వము, పరస్పర సౌహార్ద్రము, పరస్పర ప్రయోజనాలు ఆధారం కాగలవు" అని ఉద్ఘాటించాడు. బ్రిటిష్ వారితో స్వాతంత్ర్య సంపాదనార్థం పోరాటం జరిగినా, ఆఖరు దశలో సంప్రతింపులద్వారా స్వాతంత్ర్యం లభించి, రెండు దేశాల మధ్య స్నేహభావం బలపడింది. ఇది ఒక అపూర్వమైన సంఘటనగా రెండు దేశాల వారికి గర్వ కారణమైంది.

ఈ విధంగా ఆగస్టు 15 మనదేశ చరిత్రలో ఒక విజయసూచకమైన ఉత్సవదినంగా పరిణమించింది. దీనితో మన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర శుభాంతంగా ముగిసింది.

## 4

స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు సంబంధించిన ప్రధానములైన వివరాలను మనం ఇప్పటివరకు తెలుసుకొన్నాము. చరిత్రను సింహావలోకనం చేసిన పక్షంలో మనం సాగించిన స్వాతంత్ర్యోద్యమంలోని విశిష్టత మనకు స్పష్టం కాగలదు.

(1) ఇది మనదేశ చరిత్రలోను, ప్రపంచ చరిత్రలోను అపూర్వమైనట్టి ఉద్యమం. మనదేశ చరిత్రలో ఇది రెండువిధాలుగా అపూర్వమైనట్టిదని చెప్పవచ్చు. ఇది ప్రజలు సాగించిన ఉద్యమం. దీనిని సాగించినవారు గొప్ప సైన్యాలకు అధిపతులైన చంద్రగుప్తుడు, చంద్రగుప్త విక్రమాదిత్యుడు, శివాజీల వంటివారు కారు. ఏలాటి సైన్యాలూ లేని మేధావుల నాయకత్వంలో ప్రజలే దీనిని సాగించారు. దీని ఫలితంగా స్వాతంత్ర్యం లభించినతర్వాత దేశంలో ప్రజాస్వామ్యం ఏర్పడింది.

ఇదిగాక మన ఈ ఉద్యమం దేశంలో ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితంగాక దేశవ్యాప్తంగా సాగింది. దీని ఉద్దేశం ఏదో ఒక ప్రాంతాన్ని—పంజాబు, రాజస్థాన్, మహారాష్ట్రము—పరాయి పరిపాలననుండి విముక్తి చేయడం కాదు. ఆసేతు హిమాచల పర్యంతం వ్యాపించిన దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించే ఉద్దేశంతో యావద్భారత దేశప్రజలు దీనిని సాగించారు. దీని ఫలితంగా దేశానికంతా స్వాతంత్ర్యం లభించింది.

ప్రపంచ చరిత్ర దృష్ట్యాకూడా మన స్వాతంత్ర్యోద్యమం రెండు విధాలుగా అపూర్వమైనట్టిది. ఆధునిక యుగంలో డచ్చివారు, అమెరికన్లు, ఇటలీ ప్రజలు, చైనావారు, ఇండో

పీషియన్లు, ఆఫ్రికాలోని ప్రజలు, తదితరులు స్వాతంత్ర్య సమరాలను సాగించారు. కాని ఇవి అన్నీ సాయుధ సమరాలు. ఎక్కువ రక్తపాతంతోను, దౌర్జన్యంతోను కూడినట్టివి. మనఉద్యమం ఈలాటిది గాక, మొత్తంమీద గాంధీ బోధించిన అహింసా సూత్రాన్ని ఆధారంచేసుకొని సాగినట్టిది. అందుచేతనే అది ప్రపంచ చరిత్రలో సత్యాగ్రహసమరంగా ప్రఖ్యాతి గాంచింది. సత్యాగ్రహింసలకు పూర్తిగా కట్టుబడిన గాంధీ మన ఉద్యమానికి నాయకుడు కావడమే దీనికి కారణం. ప్రజలు హింసతో కూడిన కార్యక్రమాలకు పూనినప్పుడు ఆయన ఉద్యమాన్ని ఉపసంహరించినాడు. ఈ కారణంచేత మనం సాగించిన ఉద్యమం ప్రపంచ చరిత్రలో అపూర్వమైనట్టిదని పరిగణించుటకు అర్హమైనట్టిది.

దీనికి కొన్ని మినహాయింపులు ఉండడం వాస్తవమే. క్విట్ ఇండియా ఉద్యమం దౌర్జన్యసహితంగా జరిగింది. 1905 తర్వాత అనేక సంవత్సరాల కాలం దేశంలో హత్యలు దోపిడీలు మొదలైన వాటితో కూడిన విప్లవ ఉద్యమం కూడా సాగింది. ఇందులో పాల్గొనిన వారు, దీనిని సమర్థించిన వారు గొప్ప దేశాభిమానులు. వారు ప్రదర్శించిన ధైర్య సాహసాలు, వారు చేసిన త్యాగాలు, వారు అనుభవించిన కష్టాలు అందరి ప్రశంసలకు పాత్రమైనట్టివి. వారు కూడా దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించిన వారే. కాని వారి ఉద్యమం స్వాతంత్ర్య సంపాదనలో సత్యాగ్రహ ఉద్యమాలు వహించినంతటి ప్రభావం వహించలేదు. సుభాష్‌చంద్రబోసు నిర్మాణం చేసిన భారత జాతీయ సైన్యంకూడా కొన్ని నెలలపాటు సాయుధ సమరాన్ని సాగించింది. కాని దీని ప్రభావంకూడా చాలా తక్కువ. అందుచేత మొత్తంమీద మన స్వాతంత్ర్యోద్యమం అహింస సూత్రాన్ని ఆధారం చేసుకొని సాగిందని చెప్పడంలో అతిశయోక్తి ఏలాటిదీ లేదు.

ఇతర దేశాలలోని స్వాతంత్ర్యోద్యమాలను సాగించినవారు బూర్జ్వా వర్గానికి చెందిన వర్తకులు, వ్యాపారస్థులు, పారిశ్రామికులు, సంపన్నులైన భూస్వాములు. మన స్వాతంత్ర్యోద్యమాన్ని బూర్జ్వాలు గాక మేధావి వర్గానికి చెందినవారు సాగించారు. దీనిపై నాయకత్వం వహించినవారు తిలక్, అరవిందఘోష్, పాల్, లజపతిరాయి, రాజగోపాలాచారి, ప్రకాశం, గాంధీ, నెహ్రూ, పటేల్ వంటి మేధావులు. బ్రిటిష్ పరిపాలన కాలంలో బూర్జ్వా వర్గం ఒకటి ఏర్పడినా దాని ప్రాధాన్యం చాలా తక్కువగా ఉండేది. వర్తక వ్యాపారాలు, భారీ పరిశ్రమలు, బ్యాంకులు మొదలైనవి ఎక్కువగా బ్రిటిష్‌వారి వశంలో ఉండేవి. వారే ప్రధానమైన బూర్జ్వా వర్గంవారు. కాని వారు స్వాతంత్ర్యోద్యమానికి విరోధులు. బూర్జ్వా వర్గంలోని భారతీయులు గాంధీ నాయకత్వంలో సాగిన సత్యాగ్రహోద్యమాలకు ఆర్థిక సహాయం చేసిన మాట వాస్తవమే. కాని బ్రిటిష్ పరిపాలకుల మూలంగా వారికి కొన్ని సదుపాయాలు లభించుచుండడం చేత వారు స్వాతంత్ర్యోద్యమంలో నాయకత్వం వహించలేక పోయ్యారు. అందుచేత మేధావి వర్గంవారు వహించ వలసి వచ్చింది.

(2) మేధావులూ ప్రజలూ పరాయి పరిపాలనపట్ల ద్వేషం వహించి స్వాతంత్ర్యోద్యమ ఉద్యమాలను సాగించినందుకు కారణాలు ఏలాటివో మనం ఇదివరకే తెలుసుకొన్నాము. బ్రిటిష్ పరిపాలన మూలంగా ప్రజల ఆర్థిక పరిస్థితులు పూర్తిగా దిగజారి పోయినవి. రైతులు, వ్యవసాయ కూలీలు శుష్క దారిద్ర్యానికి గురి అయినారు. గ్రామీణ పరిశ్రమలు, బ్రిటిష్ పరిశ్రమల

పోటీకి నిలబడలేక నశించాయి. అందరికి వ్యవసాయం ఒక్కటే ప్రధాన వృత్తిగా పరిణమించింది. వ్యవసాయాభివృద్ధి విషయంలో గాని, జలాధారాల నిర్మాణ విషయంలో గాని, రైతులకు కావలసిన ఇతర సౌకర్యాలను అందజేయడంలో గాని ప్రభుత్వం తగిన శ్రద్ధను వహించనందున ప్రజల దారిద్ర్యబాధ పెరిగింది. లక్షలాది జనం నిరుద్యోగులయ్యారు. వర్తక వ్యాపారాలు చేసేవారికి గాని, భారీ పరిశ్రమలను స్థాపించదలచిన వారికి గాని అన్నిదేశాల ప్రభుత్వాలు కల్పించే రక్షణను బ్రిటిష్ ప్రభుత్వం కల్పించలేదు. ఉన్నతోద్యోగాలన్నీ బ్రిటిష్‌వారికే లభించుచుండడం చేత మేధావి వర్గంవారుకూడా ఆర్థికంగా ముందుకు రాలేక పోయినారు. ఈ పరిస్థితుల దృష్ట్యా స్వాతంత్ర్యోద్యమానికి దిగజారి పోయిన ఆర్థిక పరిస్థితులు ఒక ప్రధాన కారణం.

దీనితోపాటు ఇంగ్లీషు విద్య వ్యాప్తి గాంచడం చేతను, పాశ్చాత్య సంస్కృతితో సంబంధం కలగడం చేతను ప్రథమంలో విద్యార్థికులలోను, ఆటు తర్వాత సామాన్య ప్రజలలోను వ్యాపించిన జాతీయభావంకూడా స్వాతంత్ర్యోద్యమానికి ఒక ప్రధాన కారణమని చెప్పదగియున్నది. జాతీయభావం అంకురించి బలపడిన కారణంగా ప్రజలు దేశం తమది అని, పరాయివారిది కాదని, పరాయివారికి దానిని పాలించే హక్కు లేదని, వారి అధికారాన్ని తొలగించి, తమ దేశాన్ని తామే పరిపాలించుకొనుటకు చేయదగిన ప్రయత్నాన్ని చేయడం తమ కర్తవ్యమని విశ్వసించ సాగారు. ఆర్థిక పరిస్థితులు దిగజారక పోయినా ఈలాటి భావం ఏర్పడడం మూలాన వారు స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించి ఉండేవారు. బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిన కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణ ఆఫ్రికా మొదలైనవి సంపన్న దేశాలు. కాని వాటిలోని ప్రజలు కూడా జాతీయభావం బలపడడంచేత డుమినియన్ ప్రతిపత్తిని కోరినవారయ్యారు. అందుచేత స్వాతంత్ర్యోద్యమానికి భారతదేశ ప్రజలలో జాతీయభావం ఏర్పడడం ఒక ప్రధాన కారణంగా గుర్తించడం అవసరం. 18వ శతాబ్దంలో ప్రజలలో రాజకీయ చైతన్యం గాని, జాతీయ భావం గాని లేనికారణంగా బ్రిటిష్‌వారు దేశాన్ని జయించి వశపరచుకొనడం సాధ్యమైంది. 20వ శతాబ్దంలో ప్రజలలో రాజకీయ చైతన్యమూ జాతీయ భావమూ వ్యాపించడంచేత వారు దేశ పరిపాలనను వదలుకొని వెళ్ళిపోవలసి వచ్చింది. జాతీయ భావం బలపడడంలో దయానంద సరస్వతి, వివేకానందుడు, దివ్యజ్ఞాన సమాజ కార్యకర్తలు, బ్రహ్మ సమాజానికి చెందినవారు, ఇతర మత సంస్కర్తలు, ప్రాచీనకాల దేశ చరిత్రలో పరిశోధన గావించినవారు బంకించంద్రుని వంటి రచయితలు, వార్తాపత్రికల ప్రచురణను సాగించినవారు ఘనమైన కృషిని గావించినారు.

కాని కొన్ని చారిత్రక కారణాలు మూలంగాను, బ్రిటిష్‌వారు అనుసరించిన భేదోపాయం మూలంగాను ఈ జాతీయ భావం రెండు పాయలలో ప్రవహించింది. ఒకటి హిందువులు మొదలైన వారిలో ఏర్పడినట్టిది. రెండవది ముస్లింలలో ఏర్పడినట్టిది. ఈ రెండు పాయలు కలియలేక పోయినవి. కాని జాతీయభావం గల ముస్లింలు కూడా బ్రిటిష్ అధికారం తొలగవలెనని, తమకు ప్రత్యేక స్వతంత్ర రాజ్యం లభించవలెనని కోరడం గుర్తించదగిన విషయం. ఎవరుకూడా బ్రిటిష్ పరిపాలన శాశ్వతంగాను, సుస్థిరంగాను ఉండవలెనని వాంఛించిన వారు కారు. ఈ విధంగా ప్రజలలో ఏర్పడిన జాతీయభావం స్వాతంత్ర్యోద్యమానికి కారణంగా పరిణమించింది.

బ్రిటిష్‌వారు దేశాన్ని వదలి వెళ్ళిపోవుటకు మనం సాగించిన స్వాతంత్ర్యోద్యమాలు మాత్రమే కారణమా లేక దీనికి ఇతర కారణాలు కూడా ఉన్నవా అనే ప్రశ్న ఒకటి ఉంది. చరిత్రలోని పరిణామాలకు అన్ని కాలాలలోను అన్ని దేశాలలోను అనేక కారణాలు ఉంటున్నవి. ఏదో ఒక కారణంచేత మాత్రమే పరిణామం జరిగిందని అనుకొనరాదు. ఉదాహరణకు—అమెరికన్‌లు బ్రిటిష్‌వారితో సాగించిన స్వాతంత్ర్య సమరంలో యూరపు ఖండంలోని పరిస్థితులు వారి విజయానికి తోడ్పడినవి. ఇటలీవారి స్వాతంత్ర్యసమరంలోను బాల్కన్ ప్రజల స్వాతంత్ర్య సమరాలలోను బాహ్య పరిస్థితుల ప్రభావం ఎంతగానో కనుపిస్తవి. అంతమాత్రంచేత బాహ్య పరిస్థితులు మాత్రమే స్వాతంత్ర్య సమర విజయాలకు కారణమని భావించరాదు. ప్రజలు సమరాన్ని ఉత్సాహంతోను పట్టుదలతోను సాగించుటకు సిద్ధపడి, దానిని స్వయంశక్తితో సాగించిన తర్వాతనే ఈ బాహ్య పరిస్థితులు వారికి సహాయ పడినవి. అందుచేత వారిదే ప్రధానపాత్ర అని చెప్పదగినది. అదే విధంగా భారత ప్రజలు దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు కృతనిశ్చయులై ఒక ఉద్యమం ఫలప్రదం కాకపోయినా, నిరాశ చెందక ఇంకొక ఉద్యమానికి పూనుకొన్నారు. ఈవిధంగా వారు అనేక ఉద్యమాలను సాగించారు. ఒక దశలో—క్విట్ ఇండియా ఉద్యమంలో వారు బలప్రయోగానికి కూడా సిద్ధపడ్డారు. ఒక్కొక ఉద్యమం మూలంగా ప్రజల శక్తి మరింత బలపడింది. మొదటి ఉద్యమాలలో పాల్గొనిన వారి సంఖ్యకంటె తర్వాతి ఉద్యమాలలో పాల్గొన్న వారి సంఖ్య అధికమైంది. ప్రజాశక్తిని ఎదుర్కొనడం తమకు సాధ్యం కాదని బ్రిటిష్‌వారు గ్రహించారు. దీని ఫలితంగా వారు వెంటనే కాకపోయినా క్రమ క్రమంగా దేశాన్ని వదలుకొని వెళ్ళిపొయ్యేవారు. ఈ పరిస్థితులలో రెండవ సంగ్రామ ఫలితంగా వారు వారి బలాన్ని పూర్తిగా కోల్పోయి అమెరికాకు ఒక ఉపగ్రహ స్థానంలోకి వచ్చారు. ఇది వారిపై ఎక్కువ ప్రభావాన్ని వహించి, వారు దేశానికి స్వాంతత్ర్యాన్ని ప్రసాదించి వెళ్ళి పొయ్యేటట్లు చేసింది. ఈ పరిణామానికి మౌలిక కారణం ప్రజలు సాగించిన ఉద్యమాలని, ప్రపంచ పరిస్థితులు వాటికి సహాయ పడిన కారణాలని గ్రహించడంలోనే సత్యం ఉన్నది. మనలో ఏర్పడిన జాతీయభావం, మన దేశాభిమానం, త్యాగ శీలము, గాంధీ వంటి మహా పురుషుల నాయకత్వము—వీటి మూలంగా మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించగలిగినాము. ఆగస్టు 14న నెహ్రూ చెప్పినట్లు దీనితో మనచరిత్రలో అంధకారయుగం అంతరించి ఉజ్వలయుగం ప్రారంభమైంది. స్వాతంత్ర్యసంపాదనకాలంలో గత తరంవారు ప్రదర్శించిన జాతీయభావాన్ని, దేశాభిమానాన్ని, త్యాగ సంసిద్ధతను ఇప్పటి తరంవారు, భావి తరాలవారు ప్రదర్శించడం ఎంతైనా అవసరం. గతంలో ఈ సుగుణాలు మనలో లోపించిన కారణంగా మనం స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొన్నాము. అనేక శక్తుల ప్రభావంచేత 20వ శతాబ్దంలో మనం వీటిని సంపాదించి వృద్ధిచేసుకొని పోగొట్టుకొన్న స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించుకొన గలిగాము. ఈ సత్యాన్ని గ్రహించి గత తరంవారు సంపాదించిన స్వాతంత్ర్యాన్ని చెక్కుచెదరక స్థిరపరచుకొనడము, దాని మూలంగా ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయడమూ మన బాధ్యత.

చదువదగిన గ్రంథాలు :

**Bhavan: Vol xi**
**Tarachand: Vol. iv**
**R. C. Majumdar: Vol. iii**
**Menon: Transfer of Power**